# రాబందు వాలిన నేల

ఇరవైఏళ్ల ప్రపంచీకరణ

1991 - 2011


ఎన్. వేణుగోపాల్





హైదరాబాద్

జూలై 2011

స్వేచ్ఛా సాహితి ప్రచురణ - 26
జూలై 2011

**రాబందు వాలిన నేల**
ఇరవైఏళ్ల ప్రపంచీకరణ - 1991 - 2011
ఎన్. వేణుగోపాల్

**RAABANDU VAALINA NELA**
Articles on Globalisation - 1991-2011
by N. Venugopal

A Publication of Swechcha Sahiti, Hyderabad
July 2011

**వెల : రు. 180**

సోల్ డిస్ట్రిబ్యూషన్, వివరాలకు :
**వీక్షణం**
మైత్రి రెసిడెన్సీ, 3-6-394
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029
ఫోన్ : 040 66843495
email : veekshanam2003@gmail.com

అన్ని ప్రముఖ పుస్తక షాపులు

కంపోజింగ్, లేఅవుట్ : సి. రాజశేఖర్
కవర్ డిజైన్ : రమణజీవి

ముద్రణ : చరిత ఇంప్రెషన్స్, ఆజామాబాద్, హైదరాబాద్.



ఈ దుర్మార్గమైన ప్రపంచీకరణను ధ్వంసించి
నిజమైన ప్రజాప్రత్యామ్నాయాన్ని నిర్మించే
అద్భుత మానవశక్తిని సంఘటితం చేసి
ప్రజల అణగారిన గళానికి మాటను ఇవ్వడంలో
బంధిత మేధకు ఆలోచన ఇచ్చి విముక్తి చేయడంలో
చేతికి ఆయుధాలను అందించి భారత విప్లవాన్ని రచించడంలో
అసాధారణ కృషి చేసిన
**ఆజాద్** కు

కన్నీటితో
అపారమైన ప్రేమతో
తన కల నిజమవుతుందనే విశ్వాసంతో

# ఇరవై ఏళ్ల ప్రపంచీకరణ

# నేపథ్యం - కృతజ్ఞతలు

ఇరవై సంవత్సరాలుగా భారత పాలకవర్గాలు అమలు చేస్తున్న ప్రపంచీకరణ విధానాల మీద ప్రతిస్పందనగా ఎప్పటికప్పుడు నేను రాస్తూ వచ్చిన వ్యాసాలలోంచి ఎంపిక చేసిన కొన్ని వ్యాసాల సంపుటం ఇది. ఈ వ్యాసాలను ఒక్కచోటికి తెస్తున్న సందర్భంగా ఈ వ్యాసాల రచనకు నన్ను పురికొల్పిన పరిణామాల నేపథ్యం చెప్పడానికి, ఈ రెండు దశాబ్దాలలో ఈ అవగాహనలలో, రచనలో, ప్రచురణలో, చర్చలో నాకు సహకరించిన వందలాది జ్ఞాత, అజ్ఞాత మిత్రులకు కృతజ్ఞతలు చెప్పుకోవడానికి, ముఖ్యంగా ఇవాళ మన మధ్య లేని మిత్రులను తలచుకోవడానికి ఈ నాలుగు మాటలు.

సరిగ్గా ఇరవై సంవత్సరాల కింద 1991 జూలై 1న భారత ప్రభుత్వం నూతన ఆర్థిక విధానాల ప్రకటన ప్రారంభించి అతివేగంగా అనేక చర్యలు తీసుకుంది. సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ (లిబరలైజేషన్ – ప్రైవేటైజేషన్ – గ్లోబలైజేషన్) పేరుతో ప్రఖ్యాతమైన ఈ రాజకీయార్థిక విధానాలను పివి నరసింహారావు ప్రధాన మంత్రిగా, డా. మన్మోహన్ సింగ్ ఆర్థిక మంత్రిగా, పి చిదంబరం వాణిజ్యమంత్రిగా ఉండిన ప్రభుత్వం అధికారం చేపట్టిన వారంలోపే ప్రకటించడం మొదలుపెట్టింది. నిజానికి ఆ ప్రభుత్వానికి లోక్ సభలో కనీస ఆధిక్యత లేకుండింది. ప్రభుత్వం ఏర్పరచడానికి లోక్ సభలో 272 స్థానాలు రావలసి ఉండగా, ఆ ఎన్నికలలో కాంగ్రెస్ కు 244 స్థానాలు మాత్రమే వచ్చాయి. కాని ఆ మైనారిటీ ప్రభుత్వం నిండా ఐదు సంవత్సరాలు అధికారంలో కొనసాగడం మాత్రమే కాదు, దేశ రాజకీయార్థిక వ్యవస్థలో పెనుమార్పుల ప్రక్రియను ప్రారంభించి, నిరాటంకంగా కొనసాగించింది. ఈ పరిణామాలను అమలులోకి తెచ్చిన మైనారిటీ ప్రభుత్వానికి భారత కమ్యూనిస్టు పార్టీతో సహా చిన్నా చితకా ప్రతిపక్ష పార్టీలెన్నో మద్దతు ఇచ్చాయి.

ఆ తర్వాత గడిచిన ఇరవై సంవత్సరాలలో కేంద్రంలో వేరువేరు పార్టీల కప్పల తక్కెడ కూటముల కింద ఆరు ప్రభుత్వాలు (1996 భారతీయ జనతా పార్టీ ప్రభుత్వం, 1996 జనతాదళ్ నాయకత్వంలోని యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం, 1998, 1999 – భాజపా నాయకత్వంలోని ఎన్ డి ఎ ప్రభుత్వం, 2004, 2009 – కాంగ్రెస్ నాయకత్వంలోని యుపిఎ ప్రభుత్వం) నడిచాయి. యునైటెడ్ ఫ్రంట్, నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్, యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్ కూటములలో వేరు వేరు పార్టీలు అటూఇటూ మారినప్పటికీ దాదాపు పార్లమెంటరీ రాజకీయాలలో ఉన్న అన్ని పార్టీలూ ఈ ఇరవై ఏళ్లలో కేంద్ర ప్రభుత్వ అధికారాన్ని చేపట్టాయి,

లేదా అధికారంలో ఉన్న ప్రభుత్వానికి మద్దతు ఇచ్చాయి. ఇక రాష్ట్ర ప్రభుత్వాలలోనైతే భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) తో సహా అన్నిరకాల పార్టీలూ అధికారాన్ని చేపట్టాయి. ఈ రాజకీయ పక్షాలలో కొన్ని ప్రపంచీకరణను వ్యతిరేకిస్తూ మాటల్లో ఏమి చెప్పినప్పటికీ, అధికారంలో ఉండగా మాత్రం ఏ ఒక్క పార్టీ కూడ ప్రపంచీకరణ విధానాలను అమలు చేయకుండా ఉండలేదు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో, కేంద్రజాబితా, రాష్ట్ర జాబితా, ఉమ్మడి జాబితా అమలయ్యే రాజ్యాంగం పరిధిలో ప్రపంచీకరణ విధానాల అమలును అడ్డుకోదగినంత మేరకైనా, రాష్ట్ర ప్రభుత్వ స్థాయిలోనైనా అడ్డుకున్న పార్టీ ఒక్కటి కూడ లేదు. అంటే ఈ ఇరవై ఏళ్లలో అధికారంలోకి వచ్చిన, కాషాయం నుంచి ముదురు ఎరుపు వరకు వేరువేరు జండాలు ఉన్న దాదాపు నలభై పార్లమెంటరీ రాజకీయ పార్టీలు అన్నీ కూడ దేశ వ్యతిరేక, ప్రజావ్యతిరేక, సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాల అమలు విషయంలో తామందరమూ ఒకే తానులో ముక్కలమని చూపుకున్నాయి.

ఆంధ్రప్రదేశ్ లోనైతే 1995లో ముఖ్యమంత్రిగా అధికారానికి వచ్చిన చంద్రబాబు నాయుడు ఈ ప్రపంచీకరణ విధానాలను అమలు చేయడంలో అగ్రభాగాన నిలిచారు. ఆ తర్వాత 2004లో అధికారం కాంగ్రెస్ కు మారినప్పటికీ, ఈ విధానాలను మారుస్తామని ఎన్నికల సమయంలో కాంగ్రెస్ వాగ్దానాలు చేసినప్పటికీ, రాజశేఖర రెడ్డి పాలనలో ఈ విధానాలు మరింత విచ్చలవిడిగా, దుర్మార్గంగా కొనసాగాయి. ఆ తర్వాత వచ్చిన ఇద్దరు ముఖ్యమంత్రులు కూడ ప్రపంచీకరణను ముందుకు తీసుకుపోతున్నవాళ్లే.

ఈ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విధాన ప్రకటనల మీద, అమలు మీద, పర్యవసానాల మీద, ప్రజాజీవితంపై అవి చూపగల ప్రభావం మీద, ఆ విధానాలకు ప్రజల ప్రతిఘటన మీద ఎప్పటికప్పుడు నాకు వీలయిన పద్ధతిలో స్పందిస్తూ వచ్చాను.

నిజానికి 1991 నుంచీ సాగుతున్న మార్పులు వాటి విస్తృతివల్ల, వేగం వల్ల, పెరిగిన మీడియా ప్రాధాన్యత వల్ల ఎక్కువమంది దృష్టిని ఆకర్షించి, చర్చకు దారి తీశాయి గాని, 1947 అధికార మార్పిడి నాటి నుంచీ ఈ మార్పుల దిశ అలాగే ఉంది. రెండు శతాబ్దాలకు పైగా ఒక్క బ్రిటన్‌కు వలసగా ఉండిన దేశం, 1947 తర్వాత అర్ధవలసగా మారి అన్ని సామ్రాజ్యవాద రాబందుల పొక్కిలినేల అయిపోయింది. మరీ ముఖ్యంగా 1981 లో అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఇంటర్నేషనల్ మానెటరీ ఫండ్ – ఐఎంఎఫ్) అప్పుకోసం వ్యవస్థాత్మక సంస్కరణలు అమలు చేయడానికి ఇందిరాగాంధీ ప్రభుత్వం అంగీకరించిన నాటినుంచీ, ఆతర్వాత 1985లో రాజీవ్ గాంధీ ప్రభుత్వం దిగుమతుల సరళీకరణ విధానం ప్రకటించిన నాటినుంచీ సాగుతూ వచ్చిన ప్రయాణమే 1991 జూలైలో మరొక మలుపు తిరిగి వేగం సంతరించుకుంది.

భారత ఆర్థిక వ్యవస్థలో జరుగుతూవచ్చిన ఈ మార్పులను రాజకీయార్థశాస్త్ర విద్యార్థిగా, చరిత్ర విద్యార్థిగా, విప్లవోద్యమ సమర్థకుడిగా విమర్శనాత్మకంగా, వివరంగా చూడవలసిన అవసరమూ అవకాశమూ నాచేత ఈ వ్యాసాలు రాయించాయి. నిజానికి 1981 నాటి ఐఎంఎఫ్



అప్పు మొట్టమొదటిసారి నన్ను ఈ విషయాలు ఆలోచించేలా రెచ్చగొట్టింది. అప్పటికి రాడికల్ విద్యార్థి సంఘం కార్యకర్తగా సామాజిక, రాజకీయార్థిక విషయాల మీద మా కాలేజిలో వారంవారం 'రాడికల్ వాయిస్' రాయడం నుంచి ఉపన్యాసాలు ఇవ్వడం దాకా నాకు ఉండిన పనుల రీత్యా ప్రత్యేకంగా ఈ అంశం, మొత్తంగా రాజకీయార్థిక శాస్త్రం చదవడం, ఆలోచించడం, రాయడం తప్పనిసరి అయ్యాయి. అప్పటి ఒరిస్సా సంబల్ పూర్ విశ్వవిద్యాలయ అర్థశాస్త్ర శాఖ ప్రొఫెసర్ ఆర్ ఎస్ రావు, ఢిల్లీ విశ్వవిద్యాలయ ఖాల్సా కాలెజిలో అర్థశాస్త్ర అధ్యాపకుడు సి వి సుబ్బారావు, కాకతీయ విశ్వవిద్యాలయ అర్థశాస్త్ర శాఖ ప్రొఫెసర్ సి శివరామకృష్ణా రావుల ప్రభావం, 'సృజన' 'సాహితీ మిత్రుల' వాతావరణం లేకపోతే నాకు ఈ చూపు వచ్చి ఉండేది కాదు. అలా రాజకీయార్థిక అంశాల మీద నా మొదటి స్పందనగా సృజన 1981 డిసెంబర్ సంచికలో ఐఎంఎఫ్ అప్పు మీద వ్యాసం రాశాను. అప్పటినుంచి పది సంవత్సరాల రాజకీయార్థిక శాస్త్ర అధ్యయనం, రచన, అనువాదం, చర్చ 1991 నూతన ఆర్థిక విధానాల నాటికి నాకు అందివచ్చిన అవగాహనలు.

ఆ పది సంవత్సరాలలో రాజకీయార్థిక అంశాల మీద నా అధ్యయన, రచనా కృషిలో ముఖ్యంగా చెప్పుకోవలసినది అప్పటి భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు – లెనినిస్టు) (పీపుల్స్ వార్) కేంద్రకమిటీ అధికార పత్రిక 'వాయిస్ ఆఫ్ ది వాన్ గార్డ్' లో అచ్చయిన రెండు కీలకమైన వ్యాసాలను అనువాదం చేయడం. ఆ రెండు అనువాద వ్యాసాలూ కలిసి 'భారత ఆర్థిక వ్యవస్థ – అర్ధవలస, అర్ధభూస్వామ్య విధానం' పేరుతో క్రాంతి ప్రచురణలుగా 1985 ఏప్రిల్ లో వెలువడింది.

ఇక నూతన ఆర్థిక విధానాల ప్రకటనలు వివరంగా చదవడానికి నాకు అవకాశం దొరికినది రాని 'సమయం' ఆఫీసులో. కె ఎన్ వై పతంజలి సంపాదకులుగా ఏర్పడబోయిన 'సమయం' దినపత్రికలో సబ్ ఎడిటర్/రిపోర్టర్ ట్రెయినీలకు పాఠాలు చెప్పే, వాళ్ల అనువాదాలు దిద్దే కొలువులో 1990 నవంబర్ నుంచి 1991 అక్టోబర్ దాకా ఉన్నాను. అప్పటికింకా పత్రికలలో టెలిప్రింటర్లు ఉండేవి. పిటిఐ, యు ఎన్ ఐ టెలిప్రింటర్ల మీద వచ్చే వార్తలను తెలుగు చేయించి దిద్దడం నా పనుల్లో ఒకటి. ఆడుతూ పాడుతూ సాగే పని అది. అంటే పనిలోకన్న ఎక్కువ తీరికగానే ఉన్నానని చెప్పాలి. ఆ సమయంలోనే 1991 జూన్ చివరినుంచీ ప్రధానమంత్రి, ఆర్థికమంత్రి, వాణిజ్యమంత్రి, బహుళజాతి సంస్థలు, దేశంలోని బడా పారిశ్రామిక, వ్యాపార గృహాలు చేస్తున్న ప్రకటనలు, ఉపన్యాసాలు, జూలై 1న మొదలైన విధాన ప్రకటనలు ఆ టెలిప్రింటర్లమీద రీములకొద్దీ వస్తుండేవి. ఆ దుర్మార్గ ప్రకటనలను అలా వేడివేడిగా చదువుతూ రగిలిపోయి, ఇంత దురన్యాయమా అని ఉద్రేకపడి వెంటనే వ్యాసాలు బరికి ఫర్లాంగు దూరంలో ఉన్న 'ఉదయం' ఆఫీసుకు వెళ్లి ఇవ్వడం మొదలుపెట్టాను.

అలా ప్రపంచీకరణతో నా సంవాదం 1991 జూలై 12 నుంచి ఆగస్ట్ 9 దాకా 'ఉదయం'లో అచ్చయిన వ్యాసపరంపరతో ప్రారంభమైంది. ఇప్పుడు వెనక్కి తిరిగి చూసుకుంటే

ఈ ఇరవై ఏళ్లలో అమలయిన ప్రతి ప్రపంచీకరణ విధానం మీదా, పరిణామం మీదా చిన్నదో పెద్దదో, వ్యాఖ్యో వ్యాసమో రెండు వందల నలభై దాకా అచ్చయి ఉన్నాయి. ఉపన్యాసాలు కూడ అన్నో, కాస్త ఎక్కువగానో ఉండవచ్చు. నిజానికి ఉపన్యాసాలలో వచ్చిన అన్ని అంశాలూ రాయలేకపోయాను. విజన్ 2020, సెజ్ ల వంటి కొన్ని విషయాల మీదనైతే ఒక్కోదాని మీద పది పన్నెండు వ్యాసాలు ఉండగా మరికొన్నిటి మీద కనీసం ఒకటి రెండయినా ఉన్నాయి. వాటిలోంచి చర్చనీయాంశాన్ని బట్టి ఈ ఎనభై వ్యాసాలు ఎంపిక చేసి, అవి అచ్చయిన కాలక్రమంలోనే, ఇక్కడ ఒక్కచోటికి తెస్తున్నాను. వాటిలో ప్రస్తావించిన అంకెలు కాలక్రమంలో మారిపోయి ఉండవచ్చుగాని, ఆ అంకెల ఆధారంగా చేసిన విశ్లేషణ మారే పరిస్థితి రాలేదు. అందువల్ల వాటిని యథాతథంగా ఉంచాను. వీలయినంతవరకు పునరుక్తి రాకుండా చూశాను గాని కొన్ని వ్యాసాలు వేరువేరు సమయాల్లో, వేరువేరు పత్రికల కోసం రాసినవయినందువల్ల కొంత పునరుక్తి తప్పలేదు. కొన్ని వ్యాసాలలో స్పష్టత కోసం చిన్నచిన్న భాషాపరమైన, శైలీ పరమైన మార్పులు చేయవలసి వచ్చింది. ఒకటి రెండు వ్యాసాలు అచ్చయిన తర్వాత జరిగిన చర్చ వల్ల వాటిలో అవసరమైన సవరణలు చేశాను.

ఈ వ్యాసాల రచన నేను వ్యక్తిగతంగా సాధించిన ఘనత ఏమీ కాదు. మిత్రులూ సహచరులూ ఆయా రంగాల నిపుణులూ సాధారణ ప్రజలూ ఉద్యమాలూ సహకరించకపోతే ఇవి వెలువడేవి కావు. అంతేగాక ఈ వ్యక్తీకరణలు ఒక నైతిక బాధ్యతా నిర్వహణ. మన సమాజంలో ఇటువంటి విషయాలు చదవడానికి, ఆలోచించడానికి, రాయడానికి అవకాశం కొద్దిమందికి మాత్రమే లభిస్తోంది. ఆ అవకాశం దొరకని కోట్లాది మంది ప్రజల కోసం ఆ విషయాలను సరళంగా వివరించడం ఆ కొద్దిమంది బాధ్యత.

నూతన ఆర్థిక విధానాల ప్రకటన జరిగిన నెలలోపే ఆల్ ఇండియా రెవల్యూషనరీ స్టూడెంట్స్ ఫెడరేషన్ (ఎఐఆర్ఎస్ఎఫ్) ప్రచురించిన "ఐఎంఎఫ్ లోన్ – యాన్ ఎక్సర్‌సైజ్ ఇన్ మార్ట్‌గేజ్" అనే 28 పేజీల అద్భుతమైన పుస్తకానికి తెలుగు అనువాదం చేశాను. "ఐఎంఎఫ్ అప్పు పాలకవర్గాల కుట్ర" అనే ఆ పుస్తకం రాడికల్ ప్రచురణగా 1991 జూలై లోనే వెలువడింది. ఇప్పుడు వెనక్కి తిరిగిచూస్తే ఆ ఇంగ్లిషు పుస్తక రచయిత చెరుకూరి రాజకుమార్ అయి ఉండవచ్చునని అనేక వాక్యాల శైలి స్పష్టంగా చూపుతోంది. ఆయన అప్పటికి ఎఐఆర్ ఎస్ ఎఫ్ బాధ్యతలలో ఉన్నాడు గనుక అది ఆయన రచన అయి ఉండడానికే ఎక్కువ అవకాశం ఉంది. చెరుకూరి రాజకుమార్ ఆ తర్వాత ఇరవై ఏళ్లలో భారత కమ్యూనిస్టు పార్టీ – మావోయిస్టు కేంద్ర కమిటీ, పొలిట్‌బ్యూరో సభ్యుడిగా, అధికార ప్రతినిధిగా, ఆజాద్‌గా సుప్రసిద్ధుడై, 2010 జూలై 2న బూటకపు ఎన్‌కౌంటర్‌లో అమరుడయ్యాడు. ఆ పుస్తకం ప్రతులకు "నవీన్, 247, కావేరీ హాస్టల్, జెఎన్‌యు, న్యూఢిల్లీ" అని చిరునామా ఉంది. ఆ యలవర్తి నవీన్‌బాబు ఆ తర్వాత జెఎన్‌యు లోనే సామాజిక శాస్త్ర శాఖలో "ఫ్రం వర్ణ టు జాతి – పొలిటికల్ ఎకానమీ ఆఫ్ కాస్ట్ ఇన్ ఇండియన్ సోషల్ ఫార్మేషన్" అనే ప్రామాణికమైన సిద్ధాంతవ్యాసం సమర్పించే



ఎంఫిల్ చేసి, 1997లో ఢిల్లీలో జాతుల సమస్య మీద అద్భుతమైన అంతర్జాతీయ సదస్సు నిర్వహించి, అజ్ఞాత విప్లవజీవితంలోకి వెళ్లి 2000 ఫిబ్రవరి 18న దారకొండ పోలీస్ స్టేషన్‌పై దాడిలో ప్రమాదవశాత్తూ మరణించాడు. ఈ ప్రపంచీకరణ వ్యాసాల సంకలనం సందర్భంగా ఆ ఇద్దరు మిత్రుల అరుణారుణ స్మృతిని తలచుకోవాలి.

ప్రపంచీకరణ విధానాలు మొదలయిన తర్వాత మూడు నెలలకే 'సమయం'లో సమ్మెచేసి ఉద్యోగం పోగొట్టుకుని, తెలుగు జర్నలిజంలో ఉద్యోగం రాక, బెంగళూరు వెళ్లి అక్కడ ఇన్‌స్టిట్యూట్ ఫర్ సోషల్ అండ్ ఎకనమిక్ చేంజ్ (ఐసెక్) లో రిసర్చ్ అసిస్టెంట్‌గా చేరాను. ఆ ఇన్‌స్టిట్యూట్ లైబ్రరీ, అక్కడి ఉద్యమ మిత్రులు, అప్పుడు మేం ప్రారంభించిన పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్ మిత్రులు నా ఈ రాజకీయార్థిక అవగాహనలు విస్తరించడానికి ఎంతగానో తోడ్పడ్డారు.

ఐసెక్ లో నేను చేరిన ప్రాజెక్టు ముగింపుకు రాబోతుండగా మళ్లీ ఉద్యోగం వెతుకులాటలో ఇంగ్లిషు జర్నలిజంలో ప్రవేశించాను. దేశంలో ప్రపంచీకరణను సామ్రాజ్యవాద శక్తుల కంటె, బహుళ జాతి సంస్థల కంటె ఎక్కువగా ఆహ్వానించే, సమర్థించే 'ఎకనమిక్ టైమ్స్' పత్రికలో బెంగళూరులోనే 1994లో సబ్ ఎడిటర్‌గా చేరాను. 1995లో హైదరాబాదుకు బదిలీ అయి మరొక ఐదు సంవత్సరాలు విలేఖరిగా పనిచేశాను. అదీ సరిగ్గా ఆంధ్రప్రదేశ్‌లో చంద్రబాబు నాయుడు నాయకత్వంలో ప్రపంచీకరణ అతివేగంగా ముందుకు సాగుతుండగా ఆ పరిణామాలను రిపోర్ట్ చేయవలసిన ఉద్యోగం చేశాను. అది ఒక రకంగా అవతలి వైపు నుంచి ప్రపంచీకరణ గురించి తెలుసుకోవడానికి పనికి వచ్చింది. ప్రపంచీకరణ ఎంత ప్రజావ్యతిరేకమో, ఆ విధానాల అమలు కోసం ఎన్ని కుట్రలు జరుగుతున్నాయో ఆ అనుభవాలు నాకు స్పష్టంగా చూపాయి. నా ప్రపంచీకరణ వ్యతిరేక అవగాహనలు సరైనవేనని నాకు ప్రతిరోజూ తెలిసివచ్చింది.

బెంగళూరులో ఉన్న రోజులనుంచే 'ఆంధ్రప్రభ' దినపత్రికకు ఆర్థిక విధానాల మీద అడపా దడపా రాస్తూ ఉండేవాణ్ని. హైదరాబాదు వచ్చాక ప్రపంచీకరణ విధానాల మీద వారం వారం శీర్షిక రాయమని అప్పటి సంపాదకులు జి. శ్రీరామమూర్తి కోరారు. 'ఎకనమిక్ టైమ్స్' ఉద్యోగిగా మరొక పత్రికలో రాయడానికి వీల్లేదు గాని 'ఎకనమిక్ టైమ్స్' ఉద్యోగి కావడం వల్లనే నాకు అందుతుండిన సమాచారపు మరొక కోణాన్ని, ప్రజల కోణాన్ని మరెక్కడైనా రాయడం, ఆ కుట్రలను ప్రజలకు విప్పి చెప్పడం నా బాధ్యత అనిపించేది. అప్పటికే ఉపన్యాసకుడిగా ఆ విషయాలు ప్రజలకు చెపుతూనే ఉన్నాను గనుక, మారుపేరుతో 'ఆంధ్రప్రభ'లో శీర్షిక ప్రారంభించాను. ఆ శీర్షిక చంద్రబాబు నాయుడు దృష్టిలో పడి, ఆ మారుపేరు నాదని బయటపడి, ఆయన కార్యాలయం నుంచి 'ఎకనమిక్ టైమ్స్' యాజమాన్యానికి ఫోన్ వచ్చి, ఉద్యోగం పోయే పరిస్థితి వచ్చింది. ఏడాదికి పైగా నడిచిన ఆ కాలమ్ లోంచి కొన్ని వ్యాసాలు 1999లో వెలువడిన 'అమ్మకానికి ఆంధ్రప్రదేశ్' సంపుటంలో వచ్చాయి. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ మీద, ప్రత్యేకించి అమెరికా యుద్ధోన్మాదం మీద వ్యాసాలు 'రాబందు నీడ' పేరుతో 2007లో సంపుటంగా వచ్చాయి.

ఆ తర్వాత 'ప్రజాతంత్ర' వారపత్రికలోనూ, 'ఆంధ్రజ్యోతి' దినపత్రికలోనూ వారం వారం శీర్షికలలో, 'అరుణతార', 'శ్రమజీవి', 'ఉద్యమం' వంటి ఇతర పత్రికలలోనూ, వెబ్ సైట్ల మీదా, ప్రత్యేక సంచికలలోనూ సందర్భం వచ్చినప్పుడల్లా రాజకీయార్థిక విధానాల మీద రాశాను. 'సూర్య' దినపత్రికలో పూర్తిగా రాజకీయార్థిక విషయాల మీదనే ఒక వారం వారం కాలమ్ రాశాను. 2003 నుంచీ 'సమీక్ష' లోనూ, 'వీక్షణం' లోనూ, 'ఈభూమి' లోనూ ఈ విషయాల మీద రాస్తున్నాను.

ఆ పత్రికలకు ఆయాకాలాలలో సంపాదకులుగా, సంపాదక పేజీ బాధ్యులుగా ఉండి ఈ రచనల ప్రచురణకు సహకరించిన వారికీ, ప్రత్యేక సంచికలకూ, పుస్తకాలకూ సంపాదకులుగా ఉన్నవారికీ ఈ సందర్భంలో ధన్యవాదాలు చెప్పడం నా బాధ్యత. నేనీ వ్యాసాలు రాస్తున్నప్పుడు ఆలోచనలు పంచుకున్న, సమాచారం అందించిన, చర్చించిన, నా అవగాహనలను సవరించిన మిత్రులు ఎందరో ఉన్నారు. వారందరికీ పేరుపేరునా కృతజ్ఞతలు.

అలాగే ఈ ఇరవై సంవత్సరాలలో ప్రపంచీకరణ విధానాల మీద మాట్లాడడానికి నన్ను పిలిచి ప్రశ్నలతో, చర్చతో నా అవగాహనలు మెరుగుపడడానికి దోహదం చేసిన ప్రజాసంఘాలు, అధ్యయన బృందాలు ఎన్నో ఉన్నాయి. వాటిలో విప్లవ రచయితల సంఘం, అభ్యుదయ రచయితల సంఘం, మంజీర రచయితల సంఘం, కథాసాహితి, ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్, డెమొక్రటిక్ టీచర్స్ ఫెడరేషన్, చైతన్య మహిళా సమాఖ్య, కుల నిర్మూలన పోరాట సమితి, ఆల్ ఇండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరం, ఫోరం అగెనెస్ట్ గ్లోబలైజేషన్, ఫోరం అగెనెస్ట్ ఇంపీరియలిస్ట్ గ్లోబలైజేషన్, ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్, దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం, రైతుసేవాసమితి, ప్రజాకళామండలి, తెలంగాణ స్టూడెంట్స్ ఫ్రంట్, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, ఉద్యోగక్రాంతి, ఆల్ ఇండియా యూత్ ఫెడరేషన్, సుందరయ్య విజ్ఞాన కేంద్రంలతో పాటు మరెన్నో స్థానిక సంస్థలు, సింగరేణి, ఆర్టీసీ, బ్యాంక్, ఎల్ ఐ సి, పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ ఉద్యోగ, కార్మిక సంఘాలు ఉన్నాయి. ఆయా సంస్థల బాధ్యులందరికీ కృతజ్ఞతలు.

నేను బెంగళూరుకు వెళ్లిన తొలిరోజుల్లోనే, 1992 చివరలో కలిసి ఈ విషయాలు నేను చదవాలనీ, రాయాలనీ సూచించిన అప్పటి ఉదయ్ (ఇప్పుడు అందరికీ తెలిసిన ఆజాద్, చెరుకూరి రాజకుమార్), ఈ విషయాల మీద రాస్తూ, మాట్లాడుతూ ఉన్నప్పుడు నన్ను ప్రోత్సహించి, 'అమ్మకానికి ఆంధ్రప్రదేశ్' వ్యాసాలు పుస్తకంగా వెలువడడానికి కొద్ది ముందు నా అవగాహనలోని కొన్ని పొరపాట్లను సవరించడానికి ప్రయత్నించిన మహేశ్ (ఎర్రంరెడ్డి సంతోష్ రెడ్డి), అవకాశం దొరికినప్పుడు ఈ వ్యాస విషయాలు చర్చించిన సూర్యం (పటేల్ సుధాకర్ రెడ్డి), రవి (శాఖమూరి అప్పారావు), ఈ విషయాలు మాట్లాడడానికి ఎన్నోసార్లు నన్ను మహబూబ్‌నగర్ సభలకు పిలిచిన టి. పురుషోత్తం, కనకాచారి, నల్లగొండ సభలకు పిలిచిన శేషు సార్, ఆజం అలీ వంటి మిత్రుల స్మృతి నా మనసులో సదా వెలిగే అరుణకాంతి. వారి అమరత్వాన్ని సాశ్రునయనాలతో తలచుకుంటున్నాను.

ఈ ఇరవై ఏళ్లలో ప్రపంచీకరణ వ్యతిరేక ఆలోచనాపరుడిగా ఎంత స్థిరంగా ఉన్నా,



మనిషిగా పొరపాట్లు చేశాను. ఒక పెద్ద రాజకీయ తప్పిదం చేసి, శిక్షకు సిద్ధపడి క్షమాపణ కోరుతూ ప్రజల ముందు, ఉద్యమం ముందు తలవంచుకుని నిలబడ్డాను. సంస్థా నిర్మాణాలనుంచి బహిష్కృతుడినీ, తిరస్కృతుడినీ అయ్యాను. నేను జీవితమంతా ప్రాణాధికంగా, ప్రాణసమానంగా ప్రేమించిన, గౌరవించిన ఉద్యమ మిత్రులకూ, సహచరులకూ కొందరికయినా అస్పృశ్యుడి నయ్యాను. అసలు ఈ విషయాలు ఆలోచించడానికీ, రాయడానికీ, మాట్లాడడానికీ నాకు అర్హత లేదని కూడ కొందరు మిత్రులు అన్నారు, అంటున్నారు. అర్హతానర్హతల కన్న ముఖ్యంగా బాధ్యత ఉందని మాత్రం అనుకుంటున్నాను.

ఆ వేదనామయ అనుభవం నుంచి మానసికంగా తేరుకోవడానికి నాకు మార్క్సిస్టు తాత్విక దృక్పథమే, ఈ సామ్రాజ్యవాద వ్యతిరేక దృక్పథమే, ప్రజా ఉద్యమాల పట్ల గౌరవమే తోడ్పడింది. "శాస్త్రీయ విమర్శ మీద ఆధారపడిన ప్రతి అభిప్రాయాన్నీ నేను స్వాగతిస్తాను. కాని ప్రజాభిప్రాయం పేరుతో చలామణీ అయ్యే, దురభిప్రాయాలను నేనెప్పుడూ ఆమోదించను. ఆ దురభిప్రాయాల గురించి నా మాట ఒకటే, 'ఎవరేమన్నా అనుకోనీ, నీ దారిన నువు నడువు' అని ఫ్లారెన్స్‌కు చెందిన మహనీయుడు (డాంటే) అన్నమాటే గతంలోలాగే ఇప్పుడు కూడ నా జీవన సూత్రం" అని మహోపాధ్యాయుడు కార్ల్ మార్క్స్ మరొక సందర్భంలో (కాపిటల్ మొదటి జర్మన్ కూర్పుకు 1867లో) రాసిన మాట నన్ను నన్నుగా నిలిపింది.

ఎవరు ఏమన్నా ఏమనుకున్నా ఏం చేసినా నా రాజకీయార్థిక తాత్విక విశ్వాసాలు మారలేదు. మారబోవు. ఈ దేశ ప్రజల భూమి భుక్తి విముక్తి ఆకాంక్షలను తీర్చగలిగినది నక్సల్బరీ పంథా విప్లవోద్యమం మాత్రమేననే నమ్మకం నాలో చెదరలేదు. చెదరబోదు. ఎందరెందరో ఆత్మీయ ఉద్యమ మిత్రుల ఉజ్వల స్ఫూర్తి నా మనసులోంచి ఎంతమాత్రం చెరిగిపోలేదు, చెరిగిపోదు. వారు నిర్మించిన, నిర్మిస్తున్న ప్రజా ప్రత్యామ్నాయ నిర్మాణానికీ, ఆలోచనకూ, మొత్తంగా భారత పీడిత ప్రజా ఉద్యమాలకూ నేను చేయగలిగిన సాయం ఎప్పటికీ చేస్తూనే ఉంటాను. ఈ వ్యాసాలు అందులో భాగమే. ప్రపంచీకరణ విధానాల కింద నలిగిపోతూ, ధ్వంసమవుతూ, ప్రతిఘటిస్తూ, పోరాడుతూ, ప్రపంచీకరణను, సామ్రాజ్యవాదాన్ని కూలదోసే దిశగా ప్రయాణిస్తున్న పీడిత ప్రజలకు ఈ పుస్తక ప్రచురణ ఏ కాస్తయినా ఉపయోగపడవచ్చుననే ఆశతో...

**- ఎన్ వేణుగోపాల్**

హైదరాబాద్,

ఆజాద్ మొదటి వర్ధంతి, జూలై 2, 2011

ఈ రచనలను ప్రోత్సహించినవాళ్లూ, అవసరమైన సమాచారం ఇచ్చినవాళ్లూ, అచ్చుకుముందూ అచ్చు తర్వాతా చదివినవాళ్లూ, ప్రతిస్పందించినవాళ్లూ, చర్చించినవాళ్లూ, ఖండించినవాళ్లూ, విమర్శించినవాళ్లూ, మెరుగు పెట్టినవాళ్లూ, అచ్చువేసినవాళ్లూ, ప్రచారం చేసినవాళ్లూ, ఉపయోగించుకున్నవాళ్లూ ఎందరెందరో... అందరికీ పేరుపేరునా కృతజ్ఞతలు.

ప్రత్యేకంగా

ఈ ఇరవై సంవత్సరాలలో పద్దెనిమిది సంవత్సరాలు నేను సభ్యుడిగా ఉండిన విప్లవ రచయితల సంఘం సహసభ్యులు, అనేక ప్రజాసంఘాల కార్యకర్తలు, బాధ్యులు, సమావేశాల నిర్వాహకులు, ప్రపంచీకరణమీద వార్తలూ వ్యాఖ్యలూ విశ్లేషణలూ చేసిన మేధావులు, పాత్రికేయులు, పత్రికా సంపాదకులు, ప్రచురణకర్తలు లేకపోతే ఈ వ్యాసాలు ఇప్పుడున్నట్టుగా ఉండేవి కావు.

నా ఆలోచనలలోనూ రచనలలోనూ దైనందిన వ్యక్తిగత ఆనంద విషాదాలలోనూ సామూహిక విజయ వైఫల్యాలలోనూ ప్రత్యక్షంగా పరోక్షంగా పాలుపంచుకున్న సహచరి వనజ, వెలుగుల వెల్లువ వివి, మిగిలిన కుటుంబ సభ్యులందరూ

ఈ అవగాహనలు మెరుగుపడడానికి సహకరించిన మిత్రులు ఆర్ ఎస్ రావు, వి హనుమంతరావు, కె ఆర్ చౌదరి, బి ఎస్ రాజు, పాణి, చలసాని ప్రసాద్, కృష్ణాబాయి, సి ఎస్ ఆర్ ప్రసాద్, వి చెంచయ్య, ఎస్ రవికుమార్, అరవింద, అనురాధ, ఉదయ, అన్నపూర్ణ, దిలీప్,...

ఆరు సంవత్సరాలుగా నేను నేనుగా ఉండడానికి అన్నిరకాలా సహాయపడుతున్న రాము, రాంకి, రాజశేఖర్

ఈ పుస్తక ప్రచురణకు సహకరించిన బాల్‌రెడ్డి, సుబ్బయ్య, చరిత ఇంప్రెషన్స్ కార్మికులు...

అందరికీ

**కృతజ్ఞతలు**



# 1

# అసత్య 'అర్థ' సత్యాలతో ఆత్మగౌరవం అమ్మకం

గత పది రోజులుగా పత్రికలన్నిటిలోనూ భారత ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వార్తలు హోరెత్తిపోతున్నాయి. ప్రజా జీవనం మీద అతి ముఖ్యమైన ప్రభావం వెయ్యగల ఆర్థిక వార్తలకు ఈ మధ్యకాలంలో ఇంత ప్రాధాన్యత ఎప్పుడూ రాలేదు. ఆర్థిక వార్తలు అలవాటు లేకపోవడం వల్ల, ఆర్థిక శాస్త్ర పదజాలంతో తగినంత పరిచయం లేకపోవడం వల్ల ఈ ఆకస్మిక ఆర్థిక వార్తల సంచలనం చాలా మందిని అయోమయంలో పడేస్తున్నది. ఇంగ్లిష్ పత్రికల్లో వార్తలూ, వ్యాఖ్యలూ కూడా విరివిగా వచ్చి పాఠకులకు ఎంతో కొంత స్వొంత అభిప్రాయాలు ఏర్పరచుకునే అవకాశం ఇస్తున్నాయి గాని తెలుగు పత్రికల్లో మాత్రం అధికారిక సమాచారమూ, అనుకూల వ్యాఖ్యలూ తప్ప ఇతరాలు చాలా తక్కువగా వస్తున్నాయి. ఈ గందరగోళం నుండి బైటపడడానికి ఆర్థిక శాస్త్ర పదజాలం వెనుక కప్పడిపోయిన వాస్తవాలను, గత రెండు వారాలుగా సాగుతున్న పరిణామాల వెనుక సంవత్సరాలుగా పేరుకుపోయిన ఆర్థిక కార్యకలాపాలను అర్థం చేసుకోవాలి. ఈసారి వివాదమంతా భారత కరెన్సీ విలువ తగ్గింపు (డివాల్యుయేషన్)తో ప్రారంభమయింది గనుక, ఈ వివాదాన్ని అక్కడి నుంచే అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాం.

## డివాల్యుయేషన్ అంటే ఏమిటి?

ఒక దేశపు కరెన్సీ విలువను బంగారంతో పోల్చినప్పుడుగానీ, విదేశీ కరెన్సీతో పోల్చినప్పుడు గానీ ప్రభుత్వం ఉద్దేశ్యపూర్వకంగా తగ్గించడాన్ని డివాల్యుయేషన్ అంటారు. అంటే ఒక జాతీయ కరెన్సీకి అంతర్జాతీయ స్థాయిలో విలువ తగ్గడమే డివాల్యుయేషన్. ఈ చర్య ఫలితంగా ఆ కరెన్సీకి అంతర్జాతీయ మార్కెట్‌లో కొనుగోలు శక్తి పడిపోతుంది.

అర్థశాస్త్ర సూత్రాల ప్రకారం డివాల్యుయేషన్‌కు రెండు ఫలితాలుంటాయి. ఒకటి కరెన్సీ విలువ తగ్గినందువల్ల ఆ దేశపు ఎగుమతులు విదేశాలలో చౌకవయిపోతాయి. ఇట్లా హఠాత్తుగా ఒక దేశపు వస్తువుల చౌకవయిపోయినందువల్ల ఆ వస్తువుల ఎగుమతులు పెరుగుతాయి. రెండో ఫలితంగా కరెన్సీ విలువ పడిపోయినందువల్ల విదేశీ వస్తువులకు ఆ దేశంలో ధరలు పెరుగుతాయి. ఇట్లా విదేశీ వస్తువులు హఠాత్తుగా ప్రియమైపోయినందువల్ల వాటి దిగుమతులు తగ్గిపోతాయి. అంటే డివాల్యుయేషన్ ఎగుమతుల్ని ప్రోత్సహిస్తుందనీ, దిగుమతుల్ని నిరుత్సాహపరుస్తుందనీ సాంప్రదాయిక అర్థశాస్త్రం చెబుతుంది. దీని ఫలితంగా దేశానికి ఎగుమతుల వల్ల వచ్చే ఆదాయానికీ, దిగుమతుల వల్ల అయ్యే వ్యయానికీ మధ్య తేడాలో అనుకూల పరిణామాలు కలుగుతాయి. ఈ తేడాను చెల్లింపుల మిగులు (బ్యాలెన్స్ ఆఫ్ పేమెంట్స్) అంటారు. ఏ ఆర్థిక వ్యవస్థకైనా చెల్లింపుల మిగులు అనుకూలంగా ఉండడం లాభసాటిగాను, ప్రతికూలంగా ఉండడం నష్టదాయకంగాను ఉంటుంది.

## ఈ అర్థశాస్త్రం సత్యమేనా?

సాంప్రదాయిక అర్థశాస్త్రం ఈ విధంగా డివాల్యుయేషన్‌ను కీర్తిస్తున్నప్పటికీ, డివాల్యుయేషన్‌కు కొన్ని సహజమైన ఇబ్బందులున్నాయి. ఒక దేశపు ఎగుమతులను, దిగుమతులను నిర్ణయించేది కేవలం డివాల్యుయేషన్ మాత్రమే కాదు. ఒక వస్తువు ధర తగ్గించినంత మాత్రాన దాని ఎగుమతి పెరుగుతుందనీ, మరో వస్తువు ధర పెంచినంత మాత్రాన దాని దిగుమతి తగ్గిపోతుందనీ అంత గణిత శాస్త్ర సూత్రంలాగా చెప్పడం కుదరదు.

సాంప్రదాయిక అర్థశాస్త్రం ప్రకారమే కొన్ని వస్తువులకు డిమాండ్ ధరల మార్పుతో సంబంధం లేకుండా ఉంటుందని, కొన్ని వస్తువుల డిమాండ్ స్వల్పమైన ధరల మార్పుకే విపరీతంగా చలిస్తుందనీ చెపుతారు. ఎగుమతి దిగుమతుల విషయంలో కూడా ఈ సూత్రం వర్తిస్తుంది. విదేశీయుల డిమాండ్ నిశ్చలమైనదయితే డివాల్యుయేషన్‌కు ఎటువంటి ప్రభావమూ ఉండదు. విదేశీయుల డిమాండ్ సంకోచ వ్యాకోచాలకు అనువైనదయితే డివాల్యుయేషన్‌కు ఎంతో కొంత ప్రభావం ఉంటుంది. ఆ ప్రభావం నిష్పత్తిలో కూడా తేడా ఉండవచ్చును. ఎంత శాతం డివాల్యుయేషన్ జరిగిందో అంతకన్నా తక్కువ శాతంలో ఎగుమతులు పెరిగితే దాన్ని ప్రతికూల ప్రభావంగానూ, అంతకన్నా ఎక్కువ శాతంలో ఎగుమతులు పెరిగితే దాన్ని అనుకూల ప్రభావంగానూ అర్థశాస్త్రం చెపుతుంది.



సర్వసాధారణంగా చెల్లింపుల తేడా విపరీతంగా పెరిగిపోతూ ఉన్నప్పుడు, తరిగిపోతున్న విదేశీ మారక ద్రవ్య నిధులను పెంచుకునేందుకు ప్రభుత్వాలు డివాల్యుయేషన్‌కు సిద్ధపడతాయి. అదే సమయంలో ఇతర ఏ దేశమూ డివాల్యుయేషన్ చెయ్యకపోతేనే ఒక దేశపు డివాల్యుయేషన్‌కు ఫలితం ఉంటుంది. ఎగుమతి సరుకుల ధరలు డివాల్యుయేషన్ ధరల కన్నా హెచ్చుగా పెరగకుండా ఉన్నప్పుడే డివాల్యుయేషన్‌కు సార్థకత ఉంటుంది. ఒక దేశపు ఎగుమతిదారులు డివాల్యుయేషన్ జరిగిన వెంటనే తమ సరుకుల ధరలు పెంచేస్తే డివాల్యుయేషన్ వల్ల పెరగగలిగిన ఎగుమతుల పరిమాణం తగ్గిపోతుంది. ఏదైనా ఒక దేశం తన కరెన్సీకి ఎప్పటికప్పుడు విలువ తగ్గిస్తూ పోతే ఆ దేశపు కరెన్సీకి అంతర్జాతీయంగా నమ్మకం లేని స్థితి ఏర్పడుతుంది.

చెల్లింపుల లోటును తగ్గించుకోవడానికి ఒక తాత్కాలిక అవకాశంగానే డివాల్యుయేషన్ పనికొస్తుంది గాని కొంత కాలం తర్వాత డివాల్యుయేషన్ ప్రభావాలు ముగిసిపోయి దేశ ఆర్థిక వ్యవస్థ మరొకసారి చెల్లింపుల లోటు సమస్యను ఎదుర్కొంటుంది. అంటే డివాల్యుయేషన్ ఒక తాత్కాలిక పరిష్కారంగానే తప్ప శాశ్వత పరిష్కారంగా ఎప్పుడూ ఉపయోగపడదు.

## మొదటి డివాల్యుయేషన్

భారత ప్రభుత్వం మొట్టమొదటిసారిగా 1949 సెప్టెంబర్ 19న తన కరెన్సీ విలువను తగ్గించింది. అయితే అంతకు ముందు రోజునే బ్రిటన్, ఇతర కామన్‌వెల్త్ దేశాలు తమ తమ కరెన్సీల విలువలను తగ్గించి ఉండడం వల్ల మన డివాల్యుయేషన్ తర్వాత పౌండ్ – స్టెర్లింగ్‌తో ఏమీ తేడా రాలేదు. కాని గోల్డ్ స్టాండర్డ్‌తోనూ, అమెరికన్ డాలర్‌తోనూ పోల్చినప్పుడు మాత్రం భారత కరెన్సీ డివాల్యుయేషన్ పెద్ద ఎత్తునే జరిగింది. భారత రూపాయి విలువ 0.268601 గ్రాముల బంగారం నుంచి 0.186621 గ్రాముల బంగారానికి పడిపోయింది. ఈ తరుగుదల 69.4 శాతం. అంతకుముందు అమెరికన్ డాలర్ ఖరీదు రు. 3.31 కాగా డివాల్యుయేషన్ తర్వాత రు. 4.75 అయింది.

భారతదేశం పౌండ్ – స్టెర్లింగ్ చలామణిలో ఉండే దేశంగా చాలాకాలం ఉన్నందువల్ల, ఆయా దేశాలు డివాల్యుయేషన్‌కు పాల్పడగానే మనం కూడా అదే చర్యలు చేపట్టవలసి వచ్చింది. అంతేకాక 1949 నాటికి మన విదేశీ వాణిజ్యంలో 75 శాతం ఆ దేశాలతోనే ఉన్నందువల్ల కూడా ఈ చర్య తప్పలేదు. మరోపక్క ఆనాటికి బ్రిటన్ దగ్గర ఉన్న 1733 కోట్ల రూపాయల భారత నిలువల విలువ తగ్గిపోకుండా ఉండేందుకు కూడా ఈ చర్య చేపట్టవలసి వచ్చింది.

ఈ డివాల్యుయేషన్ వల్ల వెంటనే మన చెల్లింపుల లోటుకి మేలు జరిగింది. చెల్లింపుల లోటు పూడడానికి ఆ కాలంలో ఇతర కారణాలు కూడా ఉన్నప్పటికీ వెంటనే మెరుగుపడిన మన విదేశీ వాణిజ్య స్థితికి మాత్రం డివాల్యుయేషన్‌నే కారణంగా చూపారు. అయితే ఈ మేలును మించిన కీడు దేశంలో ద్రవ్యోల్బణం రూపంలో జరిగింది. డివాల్యుయేషన్ ఫలితంగా దేశంలో ధరల పెరుగుదల 44 శాతం ఉండింది. దేశపు ఎగుమతులు పెరిగిన ఫలితంగా

దేశంలో అత్యవసర సరుకుల కొరత ఏర్పడింది. భారత దేశం నూలు, జౌళి ముడి సరుకులకు పాకిస్తాన్‌పై ఆధారపడవలసినందువల్ల, పాకిస్తాన్ డివాల్యుయేషన్ చేయకపోవడం వల్ల భారత పారిశ్రామికాభివృద్ధికి ఇబ్బందులు కలిగాయి. దిగుమతులు తగ్గిపోవడంతో యంత్ర పరికరాల వంటి భారీ సరుకుల కొరత ఏర్పడి ఆర్థికాభివృద్ధి మొత్తంగానే కుంటుపడే పరిస్థితి వచ్చింది. ఈ అన్ని కారణాల వల్ల భారతీయ జీవన ప్రమాణం మీద ప్రతికూల ఫలితాలు నానాటికీ ప్రస్ఫుటమయ్యాయి. అనుకూల ఫలితాలేవైనా ఉంటే అవి మూన్నాళ్ల ముచ్చటే అయిపోయాయి.

ఆ తర్వాత ప్రణాళికాభివృద్ధి, బహుళార్థసాధక ప్రాజెక్టులు, వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో ఇతోధిక ఉత్పత్తులు ఎన్ని సాగినప్పటికీ 1960ల మధ్యకాలం నాటికి మన ఆర్థిక వ్యవస్థ మరొకసారి అధఃపాతాళానికి చేరే క్రమం మొదలైంది. అప్పుడు ప్రపంచ బ్యాంకు ఆదేశంతో మరొకసారి డివాల్యుయేషన్‌కు భారత ప్రభుత్వం సిద్ధపడింది.

## రెండో డివాల్యుయేషన్

1966 జూన్ 6న భారత ప్రభుత్వం అమలు చేసిన రెండో డివాల్యుయేషన్ ఫలితంగా రూపాయి విలువ బంగారంతో పోలిస్తే 36.5 శాతం, ఇతర దేశాల కరెన్సీలతో పోలిస్తే 57 శాతం పడిపోయింది. అంతకుముందు రు. 13.33 ఉన్న పౌండ్ స్టెర్లింగ్ రు. 21 గాను, రూ. 4.76 ఉన్న అమెరికన్ డాలర్ రు. 7.50 గాను, రు. 5.21 గా ఉన్న రూబుల్ రు. 8.33 గాను మారిపోయాయి.

ఇలా రూపాయి విలువ తగ్గిపోవడంతో పాటు భారత ప్రభుత్వం అంతవరకూ ఎగుమతి ఉత్పత్తులకు ఉన్న ప్రోత్సాహక పథకాలన్నిటినీ కూడా రద్దు చేసింది. డివాల్యుయేషన్ వల్ల ఎగుమతులు వాటంతటవే పెరుగుతాయి గనుక ఇక ప్రత్యేక ప్రోత్సహాకుల అక్కర్లేదని ప్రభుత్వం వాదించింది.

అయితే ఈ డివాల్యుయేషన్ అనుకున్న ఫలితాలేమీ సాధించలేదు. డివాల్యుయేషన్ ఫలితంగా భారత ఎగుమతులు ఏమంత చెప్పుకోదగిన పెరుగుదలను కనబరచలేదు. ఎగుమతులను పెంపొందించే మౌలిక లక్ష్యమే విఫలమయిన తర్వాత డివాల్యుయేషన్‌ను చెల్లింపుల లోటును పూడ్చే సాధనంగా చూడడం అర్థరహితమే అవుతుంది. నిజానికి భారతదేశపు సాంప్రదాయిక ఎగుమతులు అప్పటికే గరిష్టస్థాయిని చేరి ఉన్నాయి గనుక ఇక కొత్తగా మనం సాధించదగిన ఎగుమతులేవీ లేకపోయాయి. కొత్త సరుకులను ఎగుమతి రంగంలో ప్రవేశపెట్టే ప్రయోగాలు చేయవచ్చును గాని తత్ఫలితంగా పెరిగే డిమాండ్‌ను తట్టుకునే శక్తి ఆర్థిక వ్యవస్థకు లేకపోయింది. మనం అప్పటికి ఎగుమతి చేస్తుండిన కొన్ని సరుకుల ఉత్పత్తికి తప్పనిసరిగా కొన్ని ముడి పదార్థాలు, విడి భాగాలు దిగుమతి చేసుకోవలసి వచ్చింది. డివాల్యుయేషన్ ఫలితంగా ఈ దిగుమతుల ధరలు పెరిగిపోయాయి గనుక ఎగుమతుల ధరలు పెంచవలసి వచ్చింది. అంటే డివాల్యుయేషన్ నిరర్థకమైపోయింది.



అప్పటికి భారతదేశం దిగుమతి చేసుకుంటూ ఉండిన ముడి పదార్థాలు, యంత్ర సామగ్రి, పరికరాలు, ఇతర విడి భాగాల ధరలు డివాల్యుయేషన్ వల్ల 34 నుండి 38 శాతం పెరిగిపోయాయి. ఆర్థిక వ్యవస్థ ఈ అనివార్యమైన పెరుగుదలను భరించవలసి వచ్చింది.

దేశంలో ధరల స్థాయి డివాల్యుయేషన్ ఫలితంగా 15 నుంచి 20 శాతం పెరిగిపోయింది. దేశీయ సరుకులకు గాని, దిగుమతి సరుకులకు గాని, దిగుమతి చేసుకున్న ముడి పదార్థాలతో తయారయిన సరుకులకు గాని ధరలు విపరీతంగా పెరిగిపోయాయి.

డివాల్యుయేషన్ ఫలితంగా అంతకుముందు భారత ప్రభుత్వం పొంది ఉన్న విదేశీ రుణాలకు ఎంతో ఎక్కువ చెల్లించవలసి వచ్చింది. 1966 మార్చ్ 31 నాటి 2629 కోట్ల రూపాయలుగా ఉన్న విదేశీ రుణం డివాల్యుయేషన్ వల్ల 4000 కోట్ల రూపాయలుగా మారిపోయింది. డివాల్యుయేషన్ ఫలితంగా ఏర్పడే ప్రతికూల ఫలితాలను ఎదుర్కోవడానికి మూడు నిర్దిష్ట చర్యలు చేపడతానని ప్రభుత్వం ప్రకటించింది గాని ఆ మూడు చర్యలు కూడా విఫలమైపోయాయి. ధరల పెరుగుదలను అరికడతాననీ, వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తిని పెంచుతాననీ, ఎగుమతులను పెంచుతాననీ ప్రభుత్వం ప్రకటించింది గానీ ఆ తర్వాత సంవత్సరాల్లో ఈ లక్ష్యాలలో ఏ ఒక్కటీ నెరవేరలేదు.

కనుక రెండో డివాల్యుయేషన్ కూడా దీర్ఘకాలిక ఫలితాలను అలా ఉంచి తాత్కాలిక ఫలితాలను కూడా సాధించలేకపోయింది. అనుకూల ఫలితాలను సాధించలేకపోవడం మాత్రమే కాక ధరల పెరుగుదల, ప్రణాళికాభివృద్ధికి ఆటంకాలు వంటి ప్రతికూల ఫలితాలకు కారణమైంది.

ఆ తర్వాత కాలంలో క్రమక్రమంగా ఆర్థిక వ్యవస్థ తలుపులు బార్లా తెరవడం, ఆర్థిక వ్యవస్థ ఆంక్షల సడలింపు పేరుతో అగ్ర రాజ్యాలకు దేశ ఆర్థిక వ్యవస్థను తాకట్టు పెట్టడం, అంతర్జాతీయ ఆర్థిక సంస్థల ఆదేశాల ప్రకారం మన విధాన నిర్ణయాలు జరగడం మొదలయింది. 1970ల చివరి రోజుల్లో ఏర్పడిన సంక్షోభాన్ని ఎదుర్కొనేందుకు ఐఎంఎఫ్ అప్పు కోసం వెళ్లడం, ఫలితంగా విధాన నిర్ణయాల్లో ఎన్నో మార్పులు జరగడం కూడా సమీప గతంలోని చరిత్రే.

1980ల మధ్య భాగం నుంచి భారత ఆర్థిక వ్యవస్థలో ఒక చిత్రమైన స్థితి తలెత్తింది. మన ఆర్థిక వ్యవస్థ స్థిరంగా అభివృద్ధి చెందుతూనే ఉంది. వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో అభివృద్ధి కనబడుతూనే ఉంది. కాని విదేశీ వాణిజ్య విధానం వల్ల, సాంకేతికాభివృద్ధి పేరిట, ఆధునికీకరణ పేరిట విదేశాల మీద ఆధారపడడం పెరగడం వల్ల ఆర్థిక వ్యవస్థలో, ముఖ్యంగా విదేశీ మారక ద్రవ్య నిలువల్లో తరుగుదల మొదలైంది. చెల్లింపుల సంక్షోభం తీవ్రతరమైంది. ఈ సంక్షోభం పెరిగి పెరిగి ఈలోగా అస్థిర ప్రభుత్వాల గందరగోళం కూడా కలగలిసి 1991లో భారత ప్రభుత్వం ఒకవైపు ఐఎంఎఫ్ అప్పుకు, మరోవైపు బంగారం అమ్మడానికి నిర్ణయించింది. ఈ చర్యల క్రమంలోనే తాజా డివాల్యుయేషన్.

జూలై మొదటివారంలో ప్రారంభమైన డివాల్యుయేషన్ వరుసగా మూడుసార్లు జరిగి భారత కరెన్సీ విలువ పౌండ్ స్టెర్లింగ్, డాలర్, మార్క్, యెన్‌లతో పోలిస్తే ఘోరంగా పడిపోయింది.

పైన వివరించిన రెండు ఉదాహరణల నేపథ్యంలో పరిశీలిస్తే ఈసారి కూడా డివాల్యుయేషన్ వల్ల ఎగుమతులు పెద్దగా పెరగకపోవచ్చుననీ, దిగుమతులు పెద్దగా తగ్గక పోవచ్చుననీ ఊహించవచ్చు. అయితే డివాల్యుయేషన్‌తోపాటే ప్రకటించిన పారిశ్రామిక విధాన సంస్కరణల వల్ల ఏమయినా మేలు చేకూరగలిగే అవకాశం ఉన్నప్పటికీ డివాల్యుయేషన్ ఏ మేరకు జరిగిందో ఆ మేరకు డివాల్యుయేషన్ వల్ల అనివార్యంగా దేశంలో ధరలు పెరుగుతాయి. అంటే చెల్లింపుల సంక్షోభం రావడానికి పాలకుల విధానాలు కారణం కాగా, ఆ సంక్షోభం తీర్చే పేరు మీద చేపట్టిన విధానాల దుష్ఫలితాలను మాత్రం సాధారణ ప్రజానీకం భరించవలసి వస్తుంది.

ఇంతకన్నా దారుణమైన విషయం, ఈ డివాల్యుయేషన్ మన పాలకులు, మన ప్రజల అవసరాల మీద ఆధారపడి స్వంతంగా తీసుకున్న నిర్ణయం కాదు. అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ దగ్గరికి భారత ప్రభుత్వం అప్పుకోసం వెళ్లినప్పుడు ఆ సంస్థ పెట్టిన అవమానకరమైన షరతులలో ఇది ఒకటి. ఈ డివాల్యుయేషన్ మనకు మేలు చేస్తుందా, కీడు చేస్తుందా అన్నది ఎంతగా ఆలోచించవలసిన విషయమో, అది మన ఆత్మగౌరవాన్ని తాకట్టుపెట్టి విదేశీయుల ఆదేశాలకు లొంగిపోయేలా తయారు చేస్తుందన్నది అంత ఆందోళనకరమైన అంశం.

***ఉదయం, జూలై 12, 1991***



# 2

# విదేశీయులకు గులామ్ - స్వావలంబనకు సలామ్

భారత జాతీయోద్యమం తొలిరోజుల్లో, మరీ ముఖ్యంగా చెప్పాలంటే 1880 నుంచి 1910 దాకా భారత ఆర్థిక వ్యవస్థలో విదేశీ జోక్యం గురించి పెద్ద ఎత్తున చర్చ జరిగింది. విదేశీ పెట్టుబడులు భారత ఆర్థిక వ్యవస్థను, ప్రజా జీవనాన్ని అభివృద్ధిపరుస్తాయని మొదట్లో వాదించిన దాదాభాయి నౌరోజీ లాంటి మేధావులు క్రమక్రమంగా వాస్తవాల్ని గుర్తిస్తూ బ్రిటిష్ పెట్టుబడులకు వ్యతిరేకంగా ప్రచారాన్ని ఉధృతం చేశారు. దేశంలో బ్రిటిష్ పెట్టుబడులకు రాజకీయ ప్రయోజనాలు, ఫలితాలు ఉన్నాయని, కనుక ఆ పెట్టుబడులను సమగ్రంగా అర్థం చేసుకుని ప్రతిఘటించాలని 1920 నాటికి జాతీయోద్యమం ఒక స్థూల అవగాహనకు వచ్చింది. జవహర్‌లాల్ నెహ్రూ తన 'డిస్కవరీ ఆఫ్ ఇండియా'లో అనేకచోట్ల ఈ అవగాహనను ప్రకటించారు.

తొలిరోజుల్లో జరిగిన చర్చలో పాల్గొంటూ డి.ఇ. వాచా ఒక మాట అన్నాడు. 'విదేశీ దోపిడీదార్లు ఈ దేశం నిండా మిడతల దండులాగా వ్యాపిస్తారు. ఈ దేశపు రక్తమాంసాలనూ, మూలుగునూ పీల్చివేస్తారు. కాని అందువల్ల ప్రజలకేం ఒరుగుతుంది? లాభాలన్నీ మరెక్కడికో తరలిపోతాయి. తీరా సమయం వచ్చేసరికి ఆ పెట్టుబడిని కూడా వాళ్లు వెనక్కి తీసేసుకుంటారు' ఈ మాట అన్నది 1899లో!

దాదాపు వంద సంవత్సరాల తర్వాత మళ్లీ విదేశీ పెట్టుబడుల గురించి చర్చ జరగడం ఒక విషాదకర పరిణామం. అంతకన్నా విషాదకరమైనదేమంటే, రెండు శతాబ్దాలకు పైగా వలసపాలన దుర్భరత్వాన్ని అనుభవించిన దేశంలో నోరున్న వాళ్లందరూ ఆ వలస పెట్టుబడులను ఆహ్వానించడం. వలసపాలనకు వ్యతిరేకంగా పోరాటం నడిపి స్వతంత్ర పాలనను సాధించానని చెప్పుకునే రాజకీయ పక్షమే బహిరంగంగా విదేశీ పెట్టుబడులకు సాదర ఆహ్వానాలు పలకడం.

నూతన పారిశ్రామిక విధాన ప్రకటన చదువుతున్నప్పుడు అదంతా భారత ఆర్థిక వ్యవస్థలో పందొమ్మిదో శతాబ్దం తొలి రోజుల నుంచి 1947 దాకా సాగిన చరిత్రను గుర్తుకు తెచ్చింది. 'స్వావలంబన' గురించి, 'సంక్షేమ రాజ్యపు బాధ్యతల' గురించి, 'ప్రభుత్వరంగం ద్వారా సోషలిస్టు తరహా అభివృద్ధి' గురించి, 'ప్రణాళికాబద్ధ ప్రగతి' గురించి నాలుగు దశాబ్దాలుగా చెపుతూ వస్తున్న నాయకులే ఆ మాటల ముసుగులన్నీ వదిలేసి స్పష్టంగా, బహిరంగంగా తమ విధానాల్ని ఈ ప్రకటనలో బైట పెట్టుకున్నారు.

ఇక ఇక్కడ 'స్వావలంబన' కోసం ప్రయత్నం జరగదు. విదేశీ పెట్టుబడుల మీద ఆధారపడే పరాన్నభుక్కుల ఆర్థిక వ్యవస్థను ఇక్కడ అభివృద్ధి చెయ్యబోతున్నారు. ఇక్కడ సంక్షేమ రాజ్యం అనబడేది లేదు, దానికి బాధ్యతలూ లేవు. చిన్న చేపను పెద్ద చేప మింగే మత్స్యన్యాయపు గుత్తాధిపత్య వ్యవస్థే కొనసాగి ప్రజలు బడా పారిశ్రామికవేత్తల ప్రయోగశాలల్లో గినీ పిగ్స్ అయిపోతారు. నాలుగు దశాబ్దాలపాటు ప్రభుత్వరంగాన్ని బలహీనం చేసి, అది ఎందుకూ పనికిరాదని అనిపించి, విసుగెత్తింపజేసి, ఇక ప్రైవేటురంగమే మేలనిపింపజేసి ఇప్పుడు ప్రభుత్వ రంగాన్ని ఉపసంహరిస్తున్నారు. అంటే 'సోషలిస్టు తరహా అభివృద్ధి'ని మాటల్లో కూడా ఉపసంహరిస్తున్నారు. ప్రణాళికలను అటు పీకి, ఇటు పీకి తొమ్మిదో ప్రణాళిక ప్రారంభమై ఉండవలసిన సమయానికి ఎనిమిదో ప్రణాళిక కూడా అమలు కాని స్థితి కల్పించారు. ఒక్కో ప్రణాళికలో ఒక్కో అతివాదం ప్రదర్శించి ఆర్థిక వ్యవస్థ ఏరంగంలోనూ ముందంజ సాధించలేని స్థితిని కల్పించారు. ఇప్పుడు ప్రణాళికల 'అసమర్థత'ను చూపి, ప్రణాళికా విధానాన్నే రద్దుచేసి, దేశాన్ని 'మార్కెట్' అనే ఒక 'సర్వజ్ఞ శక్తి'కి అప్పగించబోతున్నారు.

నూతన పారిశ్రామిక విధానం పేరు మీద ఈ బుధవారంనాడు పార్లమెంటులో ప్రవేశపెట్టిన విధానపు సారాంశం ఇది. భారతదేశం అంతర్జాతీయ ద్రవ్యనిధి దగ్గర, ప్రపంచబ్యాంకు దగ్గర అప్పు తీసుకోవడానికి వెళ్లడం మొదలైనప్పటి నుంచి ఇటువంటి మార్పులేవో జరగనున్నాయని ఊహిస్తూనే ఉన్నా, అవి ఇంత పెద్ద ఎత్తున, ఇంత నిర్లజ్జగా వస్తాయని మాత్రం ఊహించలేదు. ఈ సంవత్సరం ఏప్రిల్, మేలలో ప్రపంచబ్యాంకు 'భారత వాణిజ్య సంస్కరణల వ్యూహం' పేరిట ఒక సూచనల పత్రాన్ని విడుదల చేసినప్పటి నుంచీ భారత వాణిజ్య, పారిశ్రామిక, ఆర్థిక విధానాలలో ఇటువంటి మార్పులకు రంగం సిద్ధం అవుతూనే ఉంది. ప్రపంచబ్యాంకుకు మన మేధను తాకట్టు పెట్టామనే విషయం కాసేపటికి పక్కన పెట్టి, అసలీ మార్పులేమిటి, భారత ఆర్థిక, సామాజిక వ్యవస్థలపై వాటి ప్రభావమేమిటి, పరిశీలించాల్సి ఉంది.



## అంతర్జాతీయ విపణిలో...

విదేశీ పెట్టుబడులకు, విదేశీ వాణిజ్యానికి, విదేశీ సాంకేతిక సహకారానికి సంబంధించి నూతన పారిశ్రామిక విధానంలో పన్నెండు అంశాలున్నాయి. మొత్తం 27 అంశాల విధానంలో విదేశీ వ్యవహారం దాదాపు సగభాగాన్ని ఆక్రమించిందంటే పాలకుల ప్రాధాన్యతలు ఏమిటో అర్థమవుతుంది.

నూతన పారిశ్రామిక విధానం ప్రకారం ఉత్పాదక యంత్ర పరికరాల దిగుమతి సులభసాధ్యమవుతుంది. ఉత్పాదక యంత్ర పరికరాల దిగుమతికి అవసరమైన విదేశీ మారక ద్రవ్యం విదేశీ వాటాల ద్వారా లభిస్తే చాలు. 1992 ఏప్రిల్ తర్వాత 50 లక్షల రూపాయల కన్నా తక్కువ ఖరీదుగల ఉత్పాదక యంత్రపరికరాల దిగుమతికి విదేశీ మారక ద్రవ్య షరతు కూడా ఉండదు.

సాధారణంగా వస్తువులన్నిటినీ ఉత్పాదక వస్తువులు, వినియోగ వస్తువులు అని విభజిస్తారు. ఉత్పాదక వస్తువులంటే, వినియోగ వస్తువులను తయారు చేయగల యంత్రపరికరాలు. వలస విధానం పెరుగుతూ వచ్చినదే ఉత్పాదక యంత్ర పరికరాలను కనిపెట్టి, పెద్ద ఎత్తున అభివృద్ధి చెయ్యడం ద్వారా. రెండు మూడు శతాబ్దాల పాటు యూరోపియన్ దేశాలలో, యాభై సంవత్సరాలుగా అమెరికాలో పరిశోధన, అన్వేషణల ద్వారా అనేక కొత్త కొత్త ఉత్పాదకయంత్రాల్ని, యంత్ర సామగ్రిని తయారు చేసి, వాటిని తమ వలసలకు పంపి, వలసలలో కేవలం వినియోగ వస్తువులు మాత్రమే తయారు చేసే స్థితిని సృష్టించారు. మొత్తం మీద పెట్టుబడిదారీ దేశాలకూ, మూడో ప్రపంచ దేశాలకూ మధ్య ఇటువంటి కృత్రిమ 'శ్రమవిభజన' ఒకటి అమలవుతూ వస్తోంది.

ఈ 'శ్రమవిభజన'కు రెండు ప్రధాన దుష్ఫలితాలున్నాయి. ఒకటి, సాధారణంగా ఉత్పాదక యంత్రాలు ఎక్కువ విలువైనవనీ, ముఖ్యమైనవీ అయి ఉంటాయి గనుక, అభివృద్ధి చెందుతున్న దేశాల నుంచి కుప్పలు తెప్పలుగా సంపద, పెట్టుబడిదారీ దేశాలకు వెళ్లవలసి వస్తుంది. ఇవాళ 'సంపన్న దేశాలు'గా పేరుపడ్డ దేశాలు సంపన్నమైన క్రమం ఇదే.

రెండు, వినియోగ వస్తువుల తయారీకి ఉత్పాదక యంత్రాల మీద ఆధారపడవలసి వస్తుంది గనుక, ఎప్పుడూ అభివృద్ధి చెందుతున్న దేశాలు నిస్సహాయ స్థితిలోనే ఉండవలసి వస్తుంది. సంపన్నదేశాల చెప్పుచేతుల్లో ఉండకపోతే ఆ దేశాల ఆర్థిక వ్యవస్థలు కుప్పకూలిపోయే పరిస్థితి వస్తుంది.

ఈ పరిస్థితిని మార్చాలనీ, అభివృద్ధి చెందుతున్న దేశాలు కూడా తమకు అవసరమైన వినియోగవస్తువులను తయారు చేయగల ఉత్పాదక యంత్రాలను కూడా తయారు చేసుకోవాలనే అవగాహన 1950ల నుంచీ విస్తృతమవుతూ వస్తోంది. ఈ అవగాహనతోనే ఉత్పాదక యంత్రాల దిగుమతుల మీద ఆంక్షలు విధించడం జరిగింది. ఆ ఆంక్షలను అరకొరగా అమలు చేసినప్పటికీ 1985 నాటికి భారత దేశం తనకు అవసరమైన ఉత్పాదక పరికరాలలో 80 శాతం పైగా తయారు చేసుకోగల స్థితికి ఎదిగింది.

కాని 1985 నుంచి మొదలయిన 'సడలింపు' విధానాలు క్రమక్రమంగా మన ఉత్పాదకయంత్రాల అవకాశాలను తగ్గిస్తూ వచ్చాయి. చివరికిప్పుడు కొత్త పారిశ్రామిక విధానం ఒకే దెబ్బతో రెండు పిట్టల్ని కొడుతోంది. మీరు ఉత్పాదక యంత్రాల్ని దిగుమతి చేసుకోదలచుకుంటే ఆ ఖరీదుకు సమానమైన విదేశీ మారక ద్రవ్యాన్ని కూడా విదేశీ పెట్టుబడుల ద్వారానే సంపాదించుకోండి అని. ఈ విధానం అమలు కావడం మొదలైతే కొన్ని సంవత్సరాల తర్వాత మన పరిశ్రమలన్నిటిలోనూ విదేశీ ఉత్పాదక పరికరాలు, అంతకు అంత విదేశీ పెట్టుబడులు ఉంటాయన్న మాట. అంటే మళ్లీ ఒకసారి మన సామాజిక, ఆర్థిక, రాజకీయ విధానాలను విదేశీ పెట్టుబడులు, పెట్టుబడిదారీ దేశాల అధినేతలు నిర్ణయించే పరిస్థితి వస్తుందన్నమాట. అంటే 'స్వావలంబన' మాత్రమే గాక, 'స్వాతంత్ర్యం' కూడా రద్దయిపోతుందన్నమాట.

## నామమాత్రంగా మారిపోయే 'ఫెరా'

జాతీయోద్యమ విలువల్లో భాగంగా 1948 పారిశ్రామిక విధాన తీర్మానం నుంచీ కూడా విదేశీ పెట్టుబడుల మీద అనేక పరిమితులు, ఆంక్షలు విధిస్తూ వచ్చారు. చివరికి విదేశీ పెట్టుబడులపై ఆంక్షలను ప్రత్యేక చట్టంగా కూడా మార్చి 1973లో విదేశీ మారక ద్రవ్య నియంత్రణ చట్టం (ఫెరా) ప్రవేశపెట్టారు.

విదేశీ కంపెనీల భారతీయ శాఖల గురించి, భారతీయ కంపెనీలలో విదేశీ పెట్టుబడుల గురించి ఫెరా ఎన్నో కఠినమైన నిబంధనలను ప్రకటించింది. 1977లో ఈ నిబంధనలను అమలు చేయడానికి చేసిన ప్రయత్నంలోనే జనతా ప్రభుత్వం కోకాకోలాను, ఐ.బి.ఎం.ను దేశం నుంచి పంపించేసింది. అయితే ఫెరాకు ఆయా ప్రభుత్వాలు ఎన్నోసార్లు తూట్లుపొడిచాయి. ఐ.బి.ఎం, హిందూస్తాన్ లివర్ ఒకే రకమైన కంపెనీలే అయినప్పటికీ, హిందూస్తాన్ లివర్‌కు మినహాయింపు దొరికింది. ప్రత్యక్ష విదేశీ పెట్టుబడి వాటా 40 శాతానికి మించి ఉండగూడదని ఫెరా నిర్దేశించినప్పటికీ అనేక కంపెనీలు ఏవేవో మినహాయింపులతో అంతకన్నా ఎక్కువ వాటా విదేశీ పెట్టుబడులతో నడుస్తున్నాయి.

ఈ సంవత్సరం మే, జూన్‌లలో ఎకనమిక్ టైమ్స్ రిసెర్చ్ బ్యూరో తరఫున విలియం ఎ.డి కోస్టా విదేశీ పెట్టుబడుల గురించి చేసిన పరిశీలనలో ఎన్నో ఆసక్తికరమైన విషయాలు బైటపడ్డాయి. దేశంలోని 251 పెద్ద కంపెనీలలో 47.8 శాతం కంపెనీల్లో విదేశీ పెట్టుబడులున్నాయి. అదే సమయంలో జరిగిన మరొక సర్వే ప్రకారం దేశంలో విదేశీ పెట్టుబడిలేని పారిశ్రామిక రంగమేదీ లేదని తేలింది.

నిజంగా విదేశీ పెట్టుబడులు ఏయే రంగాలలో ప్రవేశిస్తున్నాయో చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. అతిపెద్ద బహుళజాతి కంపెనీలు కూడా మన దేశంలో తయారు చేయలేని అత్యున్నత సాంకేతిక పరిజ్ఞానం అవసరమయ్యే ఉత్పత్తులేమీ చెయ్యడం లేదు. గుండుసూదులు, పిన్నీసులు, పెన్సిళ్లు, పెన్నులు వంటి మామూలు వస్తువుల తయారు చేయడానికి కూడా బహుళజాతి కంపెనీల, విదేశీ పెట్టుబడి దేశంలోకి తరలివస్తోంది.



ఇటువంటి పరిస్థితిలో నూతన పారిశ్రామిక విధానం ఫెరా నిబంధనలో విధించిన 40 శాతం పరిమితిని మించి 51 శాతం వరకూ విదేశీ పెట్టుబడులకు అవకాశం కల్పిస్తోంది. విదేశీ పెట్టుబడుల ప్రతిపాదనలకు అనుమతి విషయాలలో అవరోధాలన్నిటినీ తొలగిస్తోంది. విదేశీ పెట్టుబడుల లాభాలకూ ఎగుమతులకూ ప్రత్యక్ష సంబంధం ఏర్పరుస్తోంది. విదేశీ పెట్టుబడుల ప్రతిపాదనలతో పాటు విదేశీ సాంకేతిక పరిజ్ఞాన ఒప్పందాలు అవసరంలేదని ప్రకటిస్తోంది. ప్రత్యక్ష విదేశీ పెట్టుబడులను ఆహ్వానించేందుకు ఒక ప్రత్యేక యంత్రాంగాన్ని తయారు చేస్తోంది. విదేశీ సాంకేతిక నిపుణులను ఆహ్వానించడానికి గాని, విదేశీ పరిశీలనలకు గానీ ప్రభుత్వ అనుమతి అవసరం లేదని అంటోంది.

ఈ నిబంధనలన్నీ మామూలు మాటల్లో చెప్పాలంటే విదేశీ పెట్టుబడులకు తలుపులు బార్లా తెరుస్తున్నాయి. ఎటువంటి ఆంక్షలూ లేకుండా విదేశీ పెట్టుబడులు ఈ దేశ సంపదను దోచుకుపోవడానికి వీలు కల్పిస్తున్నాయి.

నిజానికి ఈ విధానం అమలులోకి రాకముందే విదేశీ పెట్టుబడుల విషయంలో చాలా ఉదారవైఖరి ప్రదర్శితమవుతోంది. మరీ ముఖ్యంగా 1985 నుంచి, 1985-86 బడ్జెట్‌లో ప్రవేశపెట్టిన 'సంస్కరణ'ల తర్వాత విదేశీ పెట్టుబడులకు ఈ దేశం సొంతరాజ్యంగా మారిపోయింది. ఒకే ఒక్క ఉదాహరణ చెప్పాలంటే, బహుళజాతి యూనియన్ కార్బైడ్ కార్పొరేషన్ భోపాల్‌లో ఐదువేల మంది ప్రజలను హత్యచేసి, వేలాది మందిని అనారోగ్యం పాలు చేసి, ఏ శిక్షా లేకుండా తప్పించుకు పోగలిగింది. 'విదేశీ పెట్టుబడి' అతి పవిత్రమైనదై పోయి దాన్ని మనం ముట్టుకోవడానికీ, శిక్షించడానికీ, ప్రశ్నించడానికీ వీల్లేకుండా పోయింది. భోపాల్ కర్మాగారంలో తయారయినది, బైటికి వెలువడినది మిథైల్ ఐసో సైనేట్ (మిక్) అవునా కాదా అనే చిన్న సమాచారం కూడా మనం తెలుసుకోవడానికి వీలులేని స్థితిని కల్పించింది విదేశీ పెట్టుబడి 'పవిత్రస్థానం'! యు.సి.సి. అధికారి ఆండర్సన్‌ను అరెస్టు చేయడానికి ప్రభుత్వం భయపడే స్థితి ఏర్పడింది. నష్టపరిహారం ఎంత, ఎట్లా ఇవ్వాలనే విషయం ఏడు సంవత్సరాల తర్వాత కూడా వివాదంలోనే ఉండిపోయే స్థితి ఏర్పడింది.

నూతన పారిశ్రామిక విధానం గుత్తాధిపత్య సంస్థల గురించి, ప్రైవేటు రంగం గురించి చేసిన ప్రతిపాదనలు ఇంకా వివరంగా చర్చించవలసినవి. ఇప్పటికైతే, ఈ విధానం ప్రకారం పాలకులు ప్రకటిస్తూ దొరుకుతున్న ఆహ్వానం ఇంత కాలంగా పాలకులు ప్రకటిస్తూ వచ్చిన ఆదర్శాలకు, ముఖ్యంగా స్వావలంబన, వలస వాదానికి వ్యతిరేకత, వంటి ఆదర్శాలకు ఆత్మహత్యా సదృశమైనది. నాలుగు దశాబ్దాల పాలక విధానాలు ఇవాళ ఎందుకింత నిస్సహాయంగా ఆత్మహత్యకు పాల్పడుతున్నాయనే దానికి చాలా అంతర్గత, బాహ్య కారణాలున్నాయి. ఇవాల్టికివాళ ప్రధానమైన బాహ్యకారణం మాత్రం ఐ.ఎం.ఎఫ్. - ప్రపంచ బ్యాంకు ఆదేశం. ఎవరయినా ఆదేశిస్తే మాత్రం ఆత్మహత్య చేసుకునేంత బలహీనంగా మన ఆర్థిక వ్యవస్థ ఉన్నదా? ఉంటే 'ఆ పాపం ఎవ్వరిది?'

***ఉదయం, 30 జూలై 1991***

# 3

# మన రెక్కల కష్టం, మన నెత్తుటి సేద్యం టాటా బిర్లాలు తన్నుకుపోతున్నారు!

‘ప్రభుత్వ రంగ పరిశ్రమలూ, సంస్థలూ ఏవీ సక్రమంగా పని చెయ్యవు. విపరీతమైన ఆలస్యం జరుగుతుంది. అధికారిక తతంగాల మధ్యనే కాలం గడిచిపోతుంది. ప్రభుత్వ రంగ సంస్థల్లో ఉద్యోగులు నిర్లక్ష్యంగా ఉంటారు. సోమరిగా ఉంటారు. అందువల్ల ప్రభుత్వరంగ సంస్థలన్నీ నష్టాలతో నడుస్తుంటాయి’ – ప్రభుత్వ రంగ సంస్థల సేవలను వినియోగించుకునే వాళ్లూ, ప్రభుత్వరంగ పరిశ్రమలు తయారు చేసిన వస్తువులను వాడే వాళ్లూ చాల తరచుగా చేసే వ్యాఖ్యలు ఇవి.

విచిత్రమైన విషయమేమంటే, ఏయే సేవలూ, పరిశ్రమలూ ప్రభుత్వరంగంలో అస్తవ్యస్తంగా, నష్టాలతో నడుస్తున్నాయో అవే సేవలూ, పరిశ్రమలూ ప్రైవేటురంగంలో విపరీతమైన లాభాలను ఆర్జిస్తున్నాయి. సమర్థంగా పనిచేస్తున్నాయి. ప్రభుత్వరంగంలో అసమర్థంగా రుజువైన సంస్థలే ప్రైవేటురంగానికి బదలాయిస్తే సక్రమంగా నడుస్తున్నాయి.

ఈ సాధారణ అనుభవం నుంచి చాలా మంది ఒక నిర్ధారణకు వస్తున్నారు. ‘ప్రభుత్వరంగం విఫలమైపోయింది. ప్రభుత్వం పని చేసినంత అస్తవ్యస్తంగానే ప్రభుత్వ రంగ పరిశ్రమలూ, సంస్థలూ పనిచేస్తున్నాయి. కనుక



దేశంలోని పరిశ్రమలనూ, సేవలనూ ప్రైవేటు పరం చేయడం మంచిది’ అని! ఈ నిర్ధారణకు సాధారణ ప్రజానీకమో, ప్రైవేటు రంగ యజమానులో వస్తే అర్థం చేసుకోవచ్చు. కాని ఆశ్చర్యకరంగా ప్రభుత్వమే స్వయంగా ఈ నిర్ధారణకు వచ్చి, తగిన చర్యలు చేపడుతోంది. జూలై 24న పార్లమెంటులో ప్రభుత్వం ప్రవేశపెట్టిన నూతన పారిశ్రామిక విధానం సరిగ్గా ఈ నిర్ధారణనే వ్యక్తం చేసింది. ఇతోధికంగా పరిశ్రమలను ప్రైవేటు పరం చేసేందుకు సంకల్పించింది. రైల్వే కాటరింగ్ వ్యవస్థను ప్రైవేటు పరం చేసే ప్రయత్నాలతో ఈ సంకల్పాన్ని ఆచరణలో చూపింది. చంద్రశేఖర్ ప్రభుత్వ హయాంలో తాత్కాలిక బడ్జెట్‌లో కొన్ని ప్రభుత్వరంగ సంస్థలలో ప్రభుత్వ పెట్టుబడిని తగ్గించడం ద్వారా మొదలైన ఈ క్రమం నూతన పారిశ్రామిక విధానంతో స్థిరపడింది.

కొత్త పారిశ్రామిక విధాన ప్రకటనలో జవహర్‌లాల్ నెహ్రూకూ, 1948 పారిశ్రామిక విధాన తీర్మానానికీ, 1956 పారిశ్రామిక విధానానికీ, 1973, 1977, 1980 పారిశ్రామిక విధాన ప్రకటనలకూ నమస్కారబాణం వదిలి కొత్త ‘సంస్కరణలు’ ప్రకటించారు. నిజానికి ఈ ఐదు విధాన ప్రకటనలలో సాధారణ అంశాలతోపాటు విభేదించే అంశాలూ ఎన్నో ఉన్నాయి. ఆ విభేదించే అంశాలన్నిటికీ కలిపి నమస్కారం పెట్టి, ‘కొనసాగింపు – మార్పు’ తమ విధానమని ప్రకటించుకుని, కొత్త విధానాన్ని ప్రవేశపెట్టడం భారతీయ ‘భిన్నత్వంలో ఏకత్వాని’కి నిదర్శనం కావచ్చు!

నూతన పారిశ్రామిక విధానం ఐదు రంగాలలో మార్పులను ప్రతిపాదించింది. పారిశ్రామిక లైసెన్సింగ్ విధానంలో, విదేశీ పెట్టుబడులలో, విదేశీ సాంకేతిక పరిజ్ఞాన ఒప్పందాలలో, ప్రభుత్వరంగానికి సంబంధించిన విధానంలో, ఎంఆర్‌టిపి చట్టం విషయంలో ఈ మార్పులను ప్రతిపాదించారు. ఈ మార్పులలో విదేశీ పెట్టుబడులకు, సాంకేతిక పరిజ్ఞాన ఒప్పందాలకు సంబంధించినవి ఒక ఎత్తుకాగా, ప్రభుత్వ రంగానికీ, పారిశ్రామిక లైసెన్సింగ్ విధానానికీ, ఎంఆర్‌టిపి చట్టానికీ సంబంధించినవి మరొక ఎత్తు. మొదటి రకం మార్పులు భారత ఆర్థిక వ్యవస్థను మరింతగా వలసవాద పద్మవ్యూహంలోకి నెట్టేవి కాగా, రెండో రకం మార్పులు భారత ఆర్థిక వ్యవస్థను ప్రైవేటు పెట్టుబడిదారుల లాభాపేక్షకు, గుత్తాధిపత్యపు దుర్మార్గానికి బలి చేసేవి.

ఇప్పటివరకూ కొనసాగుతున్న లైసెన్సింగ్ విధానం, ప్రభుత్వరంగ విధానం, ఎంఆర్‌టిపి చట్టం అస్తవ్యస్తంగా ఉన్నాయని, లొసుగులతో ఉన్నాయని అందరికీ తెలిసిందే. అవి ప్రవేశపెట్టినప్పుడు ప్రకటించిన ఆదర్శాలు భగ్నమైపోయాయన్న విషయం నిజమే. కాని ఆ కారణంగా వాటిని రద్దు చెయ్యడమంటే, నీరుకార్చడమంటే ప్రకటించిన ఆదర్శాలను ఉద్దేశ్యపూర్వకంగా దెబ్బతీయడమే. ఇప్పుడు కావలసింది ఆయా విధానాల లోపాలను సవరించి, కఠినంగా అమలు చేయడం ద్వారా లక్ష్యాలను సాధించడం. కాని ఏలినవారు తాము రూపొందించుకున్న లక్ష్యాలను కూడా తాము సాధించలేక అసలు విధానాలనే మార్చుకునే

దిశలో ఉన్నారు. నూతన పారిశ్రామిక విధాన ప్రకటనలో వాక్యాలకు వాక్యాలు ఈ దివాళాకోరుతనానికి అద్దం పడతాయి.

'పారిశ్రామిక, సాంకేతిక సామర్థ్యానికి చెందిన నూతన క్షేత్రాలలోకి ప్రభుత్వరంగం ప్రవేశించిన తొలి రోజుల ఉత్సాహం తర్వాత, ఎన్నో ప్రభుత్వరంగ సంస్థల్లో చాలా సమస్యలు తలెత్తడం మొదలైంది.'

'ఉత్పాదకత తగినంతగా పెరగపోవడం, అసమర్థమైన నిర్వహణ, కావలసిన ఉద్యోగుల కంటే ఎక్కువ మందిని నియమించడం, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఎప్పటికప్పుడు సమకాలికం చెయ్యకపోవడం, పరిశోధన – అభివృద్ధి విభాగానికీ, మానవ వనరుల అభివృద్ధికీ తగినంత శ్రద్ధ వహించకపోవడం వంటి తీవ్రమైన సమస్యలెన్నో కనబడ్డాయి' అంటూ 'ప్రభుత్వరంగ సంస్థల పట్ల కొత్త దృక్పథాన్ని అలవరచుకోవలసిన సమయమిదే' అని పారిశ్రామిక విధానం ప్రకటించింది.

ప్రభుత్వరంగ పరిశ్రమలలోకి ప్రైవేటురంగాన్ని కూడా రానిచ్చి పోటీని పెంపొందిస్తానని కూడా పారిశ్రామిక విధానం చెప్పుకుంది. 'ప్రభుత్వరంగ సంస్థల పనితీరుకు మార్కెట్ క్రమశిక్షణను నేర్పేందుకు ఆయా సంస్థల వాటాలలో ప్రభుత్వ మదుపును తగ్గించి ప్రైవేటురంగానికి అప్పగిస్తాము' అని కూడా ఈ ప్రకటన చెప్పుకుంది.

ఇంగ్లిష్‌లో పబ్లిక్ సెక్టర్ అనే మాటను తెలుగులోకి ప్రభుత్వరంగంగా అనువదించిన వాళ్లెవరో గాని వాళ్ల దూరదృష్టి చాలా గొప్పది. 1956 పారిశ్రామిక విధానం నాటి నుంచీ భారత ఆర్థిక వ్యవస్థలో, ప్రణాళికా విధానంలో పబ్లిక్ సెక్టర్ చాలా ప్రాధాన్యం వహిస్తోంది. ఇది నిజానికి ప్రజారంగం. జాతీయోద్యమ ఆదర్శాలలో భాగంగా ఆర్థిక వ్యవస్థను, పూర్తిగా ప్రైవేటురంగం చేతికి అందించగూడదనే అవగాహన ఉండేది. ప్రైవేటు రంగం లాభార్జన పునాదిగా పనిచేస్తుందని, సామాజిక సంక్షేమానికీ, లాభార్జనకూ పోటీ వచ్చినపుడు కూడా ప్రైవేటురంగం లాభార్జనవైపే మొగ్గుతుందని, కనుక ప్రైవేటురంగం ఇష్టాయిష్టాలకు ప్రజాజీవితాన్ని బలి చేయగూడదని అభిప్రాయం ఉండేది.

ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధకాలంలో ప్రైవేటు వ్యాపారస్తులు లాభం వేటలో సాగించిన దోపిడీలు, దుర్మార్గంగా అమలయిన బ్లాక్ మార్కెట్ జవహర్‌లాల్ నెహ్రూ అంతటి వాడిచేత 'నల్లబజారు వ్యాపారులను కరెంటు స్తంభాలకు ఉరితీయండి' అనిపింపజేశాయి. ఈ అవగాహనలతోనే పారిశ్రామిక విధానానికి రూపకల్పన చేసేటప్పుడు ప్రభుత్వం స్వయంగా కొన్ని పరిశ్రమలను నిర్వహించడం అవసరమనే అభిప్రాయం ఉండింది. పేదరికం నిర్మూలన కోసం, స్వావలంబన సాధించడం కోసం, ఆదాయ అసమానతలను తగ్గించడం కోసం, ఉద్యోగ కల్పనావకాశాలను విస్తృతపరచడం కోసం, ప్రాంతీయ అసమానతలను తొలగించడం కోసం, వ్యవసాయ, పారిశ్రామిక అభివృద్ధి క్రమాన్ని త్వరితం చేయడం కోసం, ప్రైవేటు రంగం మీద శక్తివంతమైన అవరోధంగా పనిచేస్తూ యాజమాన్య కేంద్రీకరణనూ, గుత్తాధిపత్య ధోరణులనూ



తగ్గించడం కోసం, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంలో స్వావలంబన సాధించడం కోసం పబ్లిక్‌రంగం అవసరం అని 1956 విధానంలోనూ ఆ తర్వాతా అంటూ వచ్చారు.

అయితే 1956 నుంచి కూడా ఈ విధానానికి ఏదో ఒక స్థాయిలో తూట్లు పడుతూనే ఉన్నాయి గనుక పబ్లిక్ రంగం ప్రజారంగం కాకుండా ప్రభుత్వరంగమే అయిపోయింది. ప్రభుత్వమే ప్రజా ప్రభుత్వం అవునా కాదా అని అనుమానించవలసి స్థితి పెరిగిపోయింది.

ప్రభుత్వరంగ పరిశ్రమలు, సంస్థలు కొన్ని నష్టాలతో, అస్తవ్యస్తంగా నడుస్తున్న మాట నిజమే. కాని ప్రభుత్వరంగంలోనూ లాభాలతో, సక్రమంగా నడుస్తున్న సంస్థలు ఎన్నో ఉన్నాయి. నిజానికి కొత్త విధానం ద్వారా ప్రభుత్వం కొన్ని సంస్థలను ప్రైవేటుపరం చెయ్యదలచుకున్నప్పుడు, నష్టాల సంస్థలను ప్రైవేటు పారిశ్రామికవేత్తలు ఎందుకు కొంటారు? అంటే లాభాలతో నడుస్తున్న ప్రభుత్వరంగ సంస్థలను కూడా ప్రైవేటు రంగానికి అప్పగించి, ప్రభుత్వం కేవలం నష్టాల సంస్థలనే తన చేతుల్లో ఉంచుకుంటుందన్న మాట!

ఉద్యోగ కల్పనలో, జాతీయోత్పత్తి పాత్రలో, పెట్టుబడి సంచయంలో, అమ్మకాలలో, సాధన సంపత్తిలో, చివరికి లాభాల రేటులో కూడా ప్రభుత్వరంగంలో చాలా సంస్థలు ప్రైవేటు రంగ సంస్థల కన్నా మెరుగ్గా పనిచేస్తున్నాయని ఎన్నో పరిశోధనలు తెలియజేశాయి.

అట్లాగే ప్రభుత్వరంగ సంస్థలు ఎగుమతి వస్తువులను తయారు చేయడంలోనూ, దిగుమతులను తగ్గించే వస్తువులను తయారు చేయడంలోనూ అగ్రభాగాన ఉన్నాయి. ఎన్నో అనుబంధ పరిశ్రమలకు అవకాశం కల్పిస్తూ, పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ ప్రైవేటు రంగం పెరుగుదలకు ఉపయోగపడుతున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రభుత్వరంగం ప్రైవేట్ పారిశ్రామిక వేత్తల ఉమ్మడి రంగంగా ఉన్నది. ఆ ఉమ్మడి రంగానికి నిధులు ప్రజలు సమకూరుస్తారు. నష్టాలు ప్రజలు భరిస్తారు. లాభాలు మాత్రం ప్రైవేటు పారిశ్రామిక వేత్తలకే అందుతాయి.

ఇటువంటి స్థితిలో ప్రభుత్వరంగాన్ని రూపుమాపదలచుకోవడం ఒక చిత్రమైన స్థితిని కలగజేస్తుంది. ప్రభుత్వరంగం ప్రజారంగంగా లేదని గుర్తించిన వాళ్లు కూడా ప్రభుత్వ రంగాన్ని నిలిపి ఉంచాలని వాదించే స్థితి వస్తుంది. ఇప్పటికి ఆచరణలో జరిగిపోతున్నదే అక్షరాలకు కూడా ఎక్కితే ఇంక ప్రభుత్వరంగం అనే ఆదర్శమే భగ్నమైపోతుంది.

ప్రభుత్వరంగం లేదా ప్రజారంగం ఉండాలని వాదించేటప్పుడు లాభనష్టాలూ, అంకెలూ ముఖ్యం కావు. లాభనష్టాల లెక్కలు చూసుకోకుండా ఏ సంస్థా మనుగడ సాగించలేదనే మాట నిజమే కానీ, ప్రజా జీవన సంక్షేమం విషయంలో లాభనష్టాలు అంకెల్లో ఉండవు. కొన్ని రంగాలను ప్రైవేటు రంగపు లాభాకాంక్షకు వదిలేస్తే ప్రజాజీవనం చెప్పరాని కడగండ్ల పాలవుతుంది గనుక అటువంటి రంగాల్లో ప్రభుత్వమే అంకెల్లో నష్టానికైనా ఓర్చి ముందుకు రావాలనేది ఒక అవగాహన. ఒక్క ఉదాహరణ తీసుకుంటే, ఆహార ధాన్యాల ప్రైవేట్ మార్కెట్‌కూ, ప్రజా పంపిణీ వ్యవస్థకూ మధ్య ఉన్న తేడా చూడవచ్చు. రెండు రంగాల మధ్య ధరల్లో అంత తేడా ఎందువల్ల ఉంటోంది? ప్రభుత్వ సబ్సిడీని వదిలేసి చూసినా, ప్రభుత్వం అమ్మే ధరకు మూడు నాలుగు

రెట్ల ధరతో ప్రైవేటు వ్యాపారులు అమ్ముతున్నారంటే, ఒకే వస్తువు, ఒకే రకమైన దశలు దాటి వేర్వేరు రంగాల్లో ఎట్లా వేర్వేరు ధరలు పలుకుతుందో తెలుస్తుంది. నిజానికి ప్రభుత్వరంగంలోనే స్టోరేజికీ, పంపిణీకీ వ్యవస్థలు, ఖర్చు ఎక్కువ. ఉత్పత్తిదారు నుంచి వినియోగదారుకు చేరేలోపు ప్రభుత్వ రంగంలోనైతే ఎన్నో దశలు దాటవలసి ఉంటుంది. ప్రైవేట్ రంగంలో ఒకటి రెండు దశలను మించి దాటనవసరం లేదు. అయినా ప్రైవేట్ రంగం ధర ఎందుకు చుక్కలనంటుతోంది? ప్రభుత్వం సబ్సిడీ ఇస్తోంది గదా అంటే అది కూడా ప్రజాధనమే గనుక తప్పకుండా ఆ వాటా పొందే హక్కు ప్రజలకు ఉండనే ఉంటుంది.

ప్రభుత్వరంగం ఉండాలని వాదించినప్పుడు దేశ ఆర్థిక వ్యవస్థను పటిష్టం చేసే కీలకరంగాల్లో విపరీతమైన పెట్టుబడి అవసరమవుతుందని, అందువల్ల అక్కడికి ప్రైవేట్ రంగం రాజాలదని, ప్రభుత్వరంగమే పూనుకుని ప్రజాధనాన్ని వెచ్చించి ఆ కీలక పరిశ్రమలను నిర్మించాలని అన్నారు. ఆ కీలక పరిశ్రమల మీద ఆధారపడి ప్రైవేట్‌రంగం, అసలు మొత్తం ఆర్థిక వ్యవస్థే అభివృద్ధి చెందుతాయన్నారు. రవాణా, సమాచార సంబంధాలు, విద్యుచ్ఛక్తి, నీటిపారుదల, బొగ్గు, ఇనుము, ఉక్కు, విమానాల తయారీ, నౌకల తయారీ, రక్షణ సామగ్రి తయారీ వంటివి ఈ కీలక పరిశ్రమల జాబితాల్లో చేర్చారు. బొకారో ఉక్కు కర్మాగారం నిర్మించే రోజుల్లో అమెరికన్లు ఆ కర్మాగారాన్ని ప్రైవేట్ రంగానికి ఇవ్వాలని వాదిస్తే, స్వయంగా జంషెడ్జీ తాతాగారు ఆ కర్మాగారానికి అవసరమయ్యే ఏడు వందల కోట్ల రూపాయల మదుపును ప్రైవేట్ రంగం భరించలేదని, అందువల్ల ప్రభుత్వరంగంలోనే ఏర్పాటు చేయాలని సూచించారు.

అట్లా 1982-83 నాటికి దేశంలో 30,039 కోట్ల రూపాయల మదుపుతో ప్రభుత్వరంగ సంస్థలు ఏర్పడ్డాయి. ఈ మదుపు ఇప్పుడు యాభై వేల కోట్ల రూపాయలకు చేరి ఉండవచ్చు. అంటే ఈ నాలుగు దశాబ్దాల్లో ఇంత పెద్ద ఎత్తున ప్రజాధనంతో పబ్లిక్‌రంగ సంస్థలను ఏర్పరచి ఇప్పుడు వాటిని, ప్రైవేట్ పారిశ్రామికవేత్తల చేతికి అందజేయ బోతున్నారన్నమాట! ఈ దేశ ప్రజానీకం, రైతులు, కార్మికులు, సంఘటిత, అసంఘటిత రంగాల ఉద్యోగులు కోట్లాది మంది ఆరుగాలం కష్టపడి సృష్టించిన సంపదల్ని హక్కుభుక్తం చేసుకున్న ప్రైవేట్ పారిశ్రామిక వేత్తలకే, ఇన్నాళ్లూ సంక్షేమ రాజ్యంగా తనను తాను అభివర్ణించుకుని తన బొక్కసంలో దాచిన ప్రజాధనాన్ని కూడా ఈ ప్రభుత్వం అందజేస్తున్నది. తన అసమర్థతవల్లనో, తన ఆశ్రిత పక్షపాతం వల్లనో, తన అస్తవ్యస్త విధానాల వల్లనో వచ్చిన నష్టాల ఫలితాలను ప్రభుత్వం ప్రజల మీద రుద్దుతున్నది!

సామాజిక సంక్షేమానికి అడ్డంకిగా ఆర్థికాధికారం కొందరి చేతుల్లోనే పోగుపడి పోవద్దని, గుత్తాధిపత్య, అక్రమ వ్యాపార పద్ధతులు కొనసాగనివ్వగూడదని ఎంఆర్‌టిపి ఆక్ట్ సూచిస్తుంది. అప్పటికి రెండు దశాబ్దాలకు పైగా మోసపోతూ వచ్చి, నిజాలు తెలుసుకుని తిరగబడుతున్న ప్రజలను మళ్లీ ఒకసారి భ్రమల్లో ముంచడానికి పాలకులు 1970ల్లో అనేక 'వినూత్న పథకాలు' ప్రకటించారు. భూసంస్కరణలు, గరీబీ హఠావో, బ్యాంకుల జాతీయకరణ, రాజభరణాల రద్దు వంటి ఈ పథకాల కోవలోదే 1970 జూన్‌లో వెలువడిన మోనోపలీస్ అండ్ రిస్ట్రిక్టివ్ ట్రేడ్ ప్రాక్టీసెస్ ఆక్ట్ (ఎంఆర్‌టిపి).



ఒక సంస్థగానీ, మూడుకు మించని సంస్థలు గాని మార్కెట్ మీద గుత్తాధిపత్యం చలాయిస్తూ ధరలను నియంత్రిస్తూ, ఉత్పత్తిని ఇష్టారాజ్యంగా నడుపుతూ పోటీని తొలగించే స్థితిని అరికట్టాలని ఎంఆర్‌టిసి చట్టం ఆశించింది. గుత్తాధిపత్యం లేని సంస్థలయినా కూడబలుక్కుని మార్కెట్‌లో పోటీని తగ్గించి ధరలు పెంచడానికి ప్రయత్నించే స్థితిని అరికట్టాలని ఈ చట్టం ఆశించింది.

1970లో ఏ భ్రమలను కల్పించడానికి ఈ చట్టం ఉద్దేశించిందో ఆ భ్రమలతో అవసరం తీరగానే 1981 నవంబర్‌లో, 1982 ఆగస్ట్‌లో, ప్రభుత్వం ఎంఆర్‌టిపి చట్టానికి సవరణలు ప్రకటించింది. 1984లో మరిన్ని సవరణలు ప్రకటించింది. 1985లో గుత్తాధిపత్య పరిమితిని పెంచింది. ఈ సవరణల ద్వారా ప్రభుత్వం 1970లో ప్రకటించిన లక్ష్యాలకు తానే ద్రోహం చేసుకుంది.

ఇప్పుడు మరిన్ని 'మౌలికమైన మార్పులు' సాధించాలని కొత్త పారిశ్రామిక విధానం తలపెడుతోంది. అంతర్జాతీయ మార్కెట్‌లో పోటీ అవకాశాలకు ఎంఆర్‌టిపి చట్టం ఆటంకంగా నిలుస్తోందట! ప్రభుత్వ జోక్యం వల్ల భారత పారిశ్రామిక ప్రగతి కుంటు పడుతోందట! అందువల్ల ప్రభుత్వం తనను తాను రద్దుచేసుకొని అంతర్జాతీయ మార్కెట్ పోటీ అవకాశాలకూ, పారిశ్రామిక ప్రగతికీ వీలు కల్పిస్తోంది! నూతన పారిశ్రామిక విధానం తయారవుతున్నదన్నప్పుడు గుత్తాధిపత్య పరిమితి 500 కోట్ల రూపాయలకు పెంచుతారా, వెయ్యి కోట్ల రూపాయలకు పెంచుతారా అని ప్రైవేటు పారిశ్రామికవేత్తల ఆర్థిక రచయితలు అనేక ఊహాగానాలు చేశారు. వాళ్ల ఊహగానాలన్నిటినీ తలదన్నుతూ ప్రభుత్వం అసలు పరిమితినే రద్దు చేసింది. వాటాల బదిలీ వంటి చర్యల మీద ఆంక్షలన్నిటినీ రద్దు చేసింది. అంటే మత్స్యన్యాయం భారత ప్రభుత్వ చట్టబద్ధ అధికారం కింద పదహారణాలా సజావుగా సాగిపోవడానికి రంగం సిద్ధమయిందన్నమాట.

నూతన పారిశ్రామిక విధానం తెచ్చిన ఈ మార్పులు హఠాత్తుగా ఆకాశం నుంచి ఊడిపడ్డవి కావు. నాలుగు దశాబ్దాలుగా ఏలినవారు పాటిస్తున్న ఆర్థిక వ్యూహానికి తార్కిక ఫలితాలే ఇవి. ఇన్నాళ్లూ ముసుగులతో అందమైన పదజాలం వెనుక దాగివచ్చిన ఎత్తుగడలు ఇప్పుడు స్పష్టంగా, ఏ ఆచ్ఛాదనలూ లేకుండా బైటపడుతున్నాయి. ఇప్పటికైనా మేల్కొని, ఈ విధానాల దుష్ఫలితాల్ని గుర్తించకపోతే దేశం మళ్లీ వలసగా, ఈసారి చప్పన్నారు దేశాల వలసగా మారిపోతుంది. దేశం ఒక కుక్కలు చింపిన విస్తరయి, ఆ కుక్కలకు కాపలాగా ఈ కొత్త పారిశ్రామిక విధానం నిలబడుతుంది. విదేశీ పెట్టుబడులకు, వాళ్లకు దళారీలుగా ఇక్కడ రాజ్యం చేసే ప్రైవేటు పెట్టుబడులకు మన జీవితాలన్నీ అప్పనంగా అందబోతున్నాయి. ఇన్ని సంపదలు సృష్టించిన మనం, ఇంత అద్భుతమైన దేశాన్ని పెంచి పోషించిన మనం, మాట్లాడగల మనం, రాయగల మనం, ఆచరణకు సిద్ధపడగల మనం ఈ చరిత్రాత్మక సమయంలో ఏం చెయ్యనున్నామనేదే అసలు ప్రశ్న.

***ఉదయం, ఆగస్ట్ 9, 1991***

# 4

# విదేశీ మారకద్రవ్యం నేపథ్యంలో విషాద శైశవ గీతాలు

మీరు వాడే అగ్గి పుల్లలకంటిన చిన్నారి పిల్లల నెత్తురు ఎప్పుడైనా మీకంట పడిందా? దీపావళి వేళ భూనభోంతరాళాలు దద్దరిల్లే సందోహంలో ఆ బాణసంచా తయారీలో శివకాశిలో అణిగిపోయిన చిన్న కూనల ఆటపాటలెన్నడయినా వినిపించాయా? మీ పిల్లలు పలకల మీద అక్షరాలు దిద్దుతున్నప్పుడు ఆ పలకల తయారీలో ఛిద్రమైపోయిన బాలల ఊపిరితిత్తుల ముక్కలు కనిపించాయా? నేల మీద మీ పాదం కందిపోకుండా సుతిమెత్తని తివాచీ పరుచుకున్నప్పుడు అది పసిపిల్లల నునులేత వేళ్ల కలనేత అని ఎప్పుడైనా గుర్తించారా? చేతినిండా గలగలలాడే గాజులు వేసుకున్నప్పుడు ఎందరు చిన్నారి పొన్నారి బిడ్డల కిలకిలలు ఫర్నేసుల్లో మాడిపోయాయో లీలగానైనా విన్నారా? ఉదయం లేచీ లేవగానే పేపర్ బాయ్ నుంచి పని మనిషి దాకా, బైటికి వెళితే హోటల్లో క్లీనర్ నుంచి మెకానిక్ షాప్‌లో హెల్పర్ నుంచి ఇళ్ల నిర్మాణంలో తలమీద మోయలేని బరువులతో తిరుగాడే పిల్లల దాకా ఎందరెందరు బాల కార్మికులు ఈ భూగోళాన్ని తిప్పుతున్నారో ఎప్పుడైనా గుర్తించారా?

ఒక స్థలమనో, ఒక రంగమనో, ఒకవేళ అనో కాదు, దేశవ్యాప్తంగా ఇవాళ ఎన్నెన్ని చోట్ల, ఎన్నెన్ని శ్రామిక రంగాలలో, రేయింబవళ్లు బాల కార్మికులు పనిచేస్తున్నారో లెక్కలేదు. ఆటపాటలతో, కేరింతలతో, గంతులతో బదులకూ, ఉద్యాన వనాలకూ వెళ్లవలసిన లక్షలాది మంది బాల బాలికలివాళ రెక్కలు ముక్కలు చేసుకునేందుకు పొలాలకు, కార్ఖానాలకు, పని స్థలాలకు వెళుతున్నారు.

చిన్నారి పిల్లల పట్ల ఎటువంటి వైఖరి తీసుకుంటామనేదే నాగరికతకు చిహ్నమని ఎన్ని పెద్దమాటలు చెప్పుకున్నా పదకొండు దశాబ్దాలుగా బాల కార్మికుల పద్ధతిని నియంత్రించే చట్టాలు చేస్తూ వచ్చినా, భారత రాజ్యాంగం బాలల శ్రమను వాడుకోగూడదని ఆదేశిక సూత్రం ప్రకటించుకున్నా, వాస్తవంలో జరిగింది మాత్రం ఏడాదికేడాది బాల కార్మికుల సంఖ్య పెరుగుతూ రావడం.

బాల కార్మికుల గురించి ప్రభుత్వ వైఖరి సందేహాస్పదంగా ఉంటుంది. ప్రభుత్వం ప్రకటించే గణాంకాలలో చాల రంగాలలో బాల కార్మికులు ఉన్నారని గుర్తించడమే జరగదు. గుర్తించిన రంగాలలో కూడా సంఖ్యను చాల తగ్గించి చెప్పడం జరుగుతుంది. (బాల కార్మికులు ఎంతమంది ఉన్నారో ఉన్నది ఉన్నట్టుగా చెప్పడమంటే రాజ్యాంగ నిబంధనలను, చట్టాలను తానే అమలు చేయడం లేదని ఒప్పుకోవడమే అవుతుంది గదా.) అందువల్ల అసంఘటిత రంగాలలో ముఖ్యంగా వ్యవసాయ, సేవా రంగాలలో పనిచేస్తున్న బాల కార్మికులు ఎందరు ఉంటారో ఎవరి దగ్గరా కచ్చితమైన అంచనాలు లేవు. 1981 జనాభా లెక్కల ప్రకారం ఒక కోటీ ముప్పై ఆరు లక్షల బాల కార్మికులు ఉన్నారని తేలింది. 1982లో ప్రణాళికా సంఘం ఈ సంఖ్య ఒక కోటీ డెబ్బై లక్షలు ఉండవచ్చునని ప్రకటించింది. 1980–81లో ఒక దేశవ్యాప్త సాంపిల్ సర్వే జరిపిన ఆపరేషన్స్ రీసెర్చ్ గ్రూప్ ఈ సంఖ్యను నాలుగు కోట్ల నలభై లక్షలుగా ప్రకటించింది. 1981 జనాభా లెక్కల ప్రకారం పధ్నాలుగేళ్ల లోపు వయసు గల బాలల జనాభా ఇరవై ఆరు కోట్ల ముప్పై లక్షలు. ఇందులో కనీసం నాలుగో వంతు కార్మికులుగా పనిచేయవలసి వస్తున్నదనే అంచనా ప్రకారం దేశంలో బాల కార్మికులు ఆరున్నర కోట్ల మందికి పైగా ఉంటారు.

బాల కార్మికుల కనీస వేతనం గురించి, పని గంటల గురించి, రాత్రి వేళల్లో పని గురించి, వయసు నిర్ధారణ గురించి, పని పద్ధతి గురించి 1981 నుంచి కూడా ఎన్నో శాసనాలు వచ్చాయి. 1938 బాలల ఉద్యోగ చట్టం ఈ అంశాలనే ఇంకా స్పష్టంగా ప్రకటించింది. అయితే ఈ చట్టాలన్నీ కూడా కేవలం అలంకార ప్రాయమయిపోయాయి. ఆ చట్టాలలోనే ఉన్న లొసుగులను వాడుకుని పారిశ్రామికవేత్తలు, గనుల యజమానులు బాలల శ్రమను విపరీతంగా దోపిడీ చేశారు.

ఆ తర్వాత వచ్చిన భారత రాజ్యాంగం ప్రాథమిక హక్కుల భాగంలోను, ఆదేశిక సూత్రాల భాగంలోను బాల కార్మికుల గురించి ప్రస్తావించింది. 24వ అధికరణం 'పధ్నాలుగేళ్లలోపు బాలలను ఏ కార్ఖానాలో గాని, గనిలోగాని, ఏ ప్రమాదకరమైన పనిలోగాని ఉద్యోగంలోకి తీసుకోగూడదు' అని రాసింది. చిన్న పిల్లల ఆరోగ్యానికీ, లేత వయసుకూ హాని కలిగించకూడదని,

ఎవరయినా తమ ఆర్థిక పరిస్థితుల వల్ల తమ వయసుకూ, శక్తికీ తగిన పనుల్లోకి తోయబడగూడదని 39వ అధికరణం రాసింది. పిల్లలకు ఆరోగ్యకరమైన పద్ధతిలో పెరిగే అవకాశాలనూ, సౌకర్యాలనూ కల్పిస్తామని, స్వేచ్ఛాయుతమైన, గౌరవమైన పరిస్థితులు కల్పిస్తామని, దోపిడీకి వ్యతిరేకంగా బాల్యాన్నీ, యవ్వనాన్నీ రక్షిస్తామని, నైతిక, భౌతిక నైరాశ్యానికి వ్యతిరేకంగా రక్షిస్తామని 39వ అధికరణం హామీ ఇచ్చింది. 14 ఏళ్లలోపు బాలలందరికీ నిర్బంధ ఉచిత విద్యను పది సంవత్సరాలలోపు కల్పిస్తామని 45వ అధికరణం 1950లోనే వాగ్దానం చేసింది.

నిర్బంధ ఉచిత విద్య వాగ్దానం నీరుకారిపోయి ప్రతి పదేళ్లకు ఒకసారి మళ్లీ మరో పదేళ్లు, ఐదేళ్లు గడువులు తీసుకుంటూ ఇప్పుడు 1995 అవధి దగ్గర ఆగిపోయింది. 1978లో స్వయంగా ప్రభుత్వ ఆధ్వర్యంలోని చేనేత, చేతి వృత్తుల ఎగుమతుల కార్పొరేషన్ ఏడు నుంచి పధ్నాలుగు సంవత్సరాల పిల్లల్ని తివాచీల అల్లకానికి వినియోగించిందంటే చట్టాలు ఎంత పకడ్బందీగా అమలయ్యాయో అర్థమవుతుంది. (నిజానికి 1938 చట్టంలోనే తివాచీ అల్లకం, ఊలు శుభ్రం చేయడం పనులు ప్రమాదకరమైనవని, ఈ పనుల్లో బాల కార్మికులను వాడగూడదని నిర్దేశించడం జరిగింది.) ఈ పరిస్థితి ఇట్లాగే కొనసాగి చివరికి ఆరో ప్రణాళికా పత్రంలో 'బాల కార్మికుల సంపూర్ణ నిషేధం అనేది దాని సాంఘిక ఆర్థిక పరిణామాల దృష్ట్యా సమీప భవిష్యత్తులో సాధ్యమయ్యే ప్రతిపాదన అనిపించడం లేదు' అని స్పష్టంగానే ఒప్పుకున్నారు.

ఒకవైపు బాల కార్మికుల పట్ల ప్రభుత్వం ఇటువంటి వైఖరి అవలంబిస్తుండగానే 1979ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా ప్రకటించారు. అప్పుడు ఏదో చేశామని చెప్పుకోవడానికి కేంద్ర ప్రభుత్వ కార్మిక మంత్రిత్వ శాఖ గురుపాదస్వామి నాయకత్వంలో పదహారు మంది సభ్యులతో ఒక కమిటీని నియమించి బాల కార్మికుల సమస్యపై నివేదిక సమర్పించమని కోరింది. ఈ కమిటీ సమర్పించిన సమగ్రమైన నివేదిక ఎన్నో అవసరమైన సిఫార్సులు చేసింది. ఏ ఉద్యోగానికైనా, శ్రమకైనా కనీస పరిమితిగా 15 సంవత్సరాల వయసును నిర్ధారించింది. కాని కొన్నేళ్లకే ప్రభుత్వం మారిపోవడంతో ఆ కమిటీ సిఫార్సులను పట్టించుకున్న వాళ్లే లేకపోయారు.

ఆ తర్వాత 1983లో శివకాశి అగ్గిపెట్టెల పరిశ్రమను అధ్యయనం చేసి స్మితు కొఠారి 'ఆ అగ్గిపుల్ల కంటిన నెత్తురు చూడండి' అనే నివేదిక ప్రచురించాక మళ్లీ ఒకసారి బాల కార్మికుల సమస్య చర్చలో కొచ్చింది. చట్ట ప్రకారం ప్రమాదకరమైనదిగా గుర్తించబడిన అగ్గిపెట్టెల పరిశ్రమలో చిన్నారి పిల్లలు రోజుకు 15 గంటలకు పైగా పని చేస్తున్నారని బైటపడింది. ఏడాది తిరగకుండానే మీర్జాపూర్‌లో తివాచీ పరిశ్రమలో పనిచేసేందుకు పసిపిల్లలను కొనుక్కుపోతున్న ఉదంతం బైటపడింది. తివాచీ పరిశ్రమలో బాలకార్మికుల గురించి జరిగిన చర్చలో తివాచీ తయారీదార్లు స్పష్టంగానే 'బాల కార్మికులను వాడగూడదంటే తివాచీ పరిశ్రమకు ఆత్మహత్యా సదృశమే. 1500 మంది తివాచీ ఎగుమతిదార్లు సాలీనా 150 కోట్ల రూపాయల



విదేశీ మారక ద్రవ్యం సంపాదిస్తున్నారు. ఇంత విదేశీ మారక ద్రవ్యాన్ని ఆర్జించే పరిశ్రమకు హాని కలిగించే విధానమిది' అన్నారు.

ఈ ఉదంతాలతో బాల కార్మికుల దయనీయ పరిస్థితులను చక్కదిద్దాలని ప్రజాభిప్రాయం బలపడడం మొదలయింతర్వాత 1985లో బాల కార్మికుల (నిషేధ నియంత్రణ) చట్టం తీసుకు వచ్చింది. ఈ చట్టం పధ్నాలుగేళ్ల లోపు బాలల శ్రమను వినియోగించుకోవడాన్ని నిషేధించింది. ఏయే రంగాలలో బల కార్మికులను ఎంత మాత్రం వాడడానికి వీల్లేదో నిర్దేశించింది. ప్రమాదకరం కాని వృత్తుల్లో కూడా పిల్లలకు రాత్రుళ్లు పని చెప్పగూడదని, రోజుకు ఆరు గంటల కంటె ఎక్కువ పని చెప్పగూడదని, ఆ ఆరు గంటల్లో గంట విరామం ఇవ్వాలని ఈ చట్టం నిర్దేశించింది. ఈ నిబంధనలను ఉల్లంఘిస్తే మూడు నెలల నుంచి ఏడాది వరకు జైలు శిక్ష, పదివేల నుంచి ఇరవై వేల వరకు జరిమానా విధించవచ్చునని నిర్దేశించింది.

ఇంత ప్రగతిశీలంగా ఉన్నట్టు కనిపించే ఈ చట్టం కూడా ఆచరణలో విఫలమే అయింది. ఈ చట్టాన్ని ఉల్లంఘించిన వాళ్లు ఏ శిక్షకూ గురికాలేదు. అసలు చట్టంలోనే గాజుల పరిశ్రమ వంటి ముఖ్య ప్రమాదకర పరిశ్రమలను వదిలేయడం జరిగింది.

ఆ తర్వాత 1987లో జాతీయ బాలల కార్మిక విధానం అనేదాన్ని ప్రకటించి దేశం మొత్తం మీద పది ప్రాంతాలను ఎంపిక చేసి ఆ ప్రాంతాలలో బాల కార్మిక చట్టాలను కచ్చితంగా పాటించాలని నిర్ణయించారు. బాల కార్మికుల కుటుంబాలను ఇతర అభివృద్ధి కార్యక్రమాలలో భాగం చేసి ఆయా బాలలు శ్రమించవలసిన స్థితిని తప్పించడానికి ప్రభుత్వం పూనుకుంది. పరిశ్రమల నుంచి విడుదల చేసిన బాలల కోసం పాఠశాలలు ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. ఈ పది ప్రాంతాలలోను కలిసి కనీసం 30 వేల మంది కార్మికులను పని కోరల నుంచి తప్పించాలని నిర్ణయించారు.

ఈ పది ప్రాంతాలు, పరిశ్రమలు : శివకాశి, తమిళనాడు – అగ్గిపెట్టెలు (బాల కార్మికుల సంఖ్య సుమారు యాభై వేలు); సూరత్, గుజరాత్ – వజ్రాల పాలిషింగ్; జైపూర్, రాజస్థాన్ – విలువైన రాళ్ల పాలిషింగ్ (13 వేలు); ఫిరోజాబాద్, ఉత్తరప్రదేశ్ – గాజు (50 వేలు); మీర్జాపూర్ – బాదోహి, ఉత్తరప్రదేశ్ – చేనేత తివాచీ (50 వేలు); జమ్ము కాశ్మీర్ – చేనేత తివాచీ (50 వేల నుంచి లక్షన్నర); ఆలీఘడ్, ఉత్తరప్రదేశ్ – తాళాలు (10 వేలు); మార్కాపురం, ఆంధ్రప్రదేశ్ – పలకలు; మాండ్‌సార్, మధ్యప్రదేశ్ – పలకలు.

ఆరు సంవత్సరాలు గడిచిన తర్వాత కూడా ఈ జాతీయ బాల కార్మిక విధానం అమలులోకి రాలేదని, ఈ అన్ని ప్రాంతాలలోను బాల కార్మికుల సమస్య యథాతథంగానే ఉన్నదని ప్రస్తుతం చేనేత తివాచీల విషయమై రేగుతున్న వివాదం తెలియజేస్తున్నది. 1992 ఆగస్ట్‌లో అమెరికన్ సెనేట్‌లో టామ్ హర్కిన్స్ చైల్డ్ లేబర్ డిటరెన్స్ బిల్ అనే బిల్లు ప్రవేశపెట్టాడు. ఆయన డెమొక్రటిక్ పార్టీ సభ్యుడు. ఆయన ప్రవేశపెట్టిన బిల్లును ఒక రిపబ్లికన్‌తో సహా ఏడుగురు సెనెటర్లు సమర్థించారు. అప్పుడైతే ఏవో సాంకేతిక కారణాల వల్ల ఆ బిల్లు వెనక్కి పోయిందిగాని ఫిబ్రవరి ఆఖరి వారంలో ఆయన దాన్ని మళ్లీ ప్రవేశపెట్టనున్నాడని వార్తలు

వస్తున్నాయి. 15 సంవత్సరాలలోపు పిల్లల శ్రమతో తయారయిన వస్తువులకు అమెరికాలో మార్కెట్ కల్పించగూడదని ఈ బిల్లు ప్రతిపాదిస్తోంది. ఈ బిల్లు చట్టమైన వెంటనే బాలకార్మికుల శ్రమతో తయారవుతున్న వస్తువుల జాబితా తయారు చేస్తుంది. ఆ వస్తువులన్నిటినీ దిగుమతి చేసుకోవడాన్ని అమెరికా ఆపేస్తుంది. దిగుమతులు ఆపివేయడంతో పాటు ఈ చట్టాన్ని ఉల్లంఘించిన వాళ్ల మీద సివిల్, క్రిమినల్ చర్యలు తీసుకునేందుకు కూడా ఈ చట్టం వీలు కల్పిస్తుంది. (ఈ చట్టం బాల కార్మికుల మీద అమెరికన్ల ప్రేమ చిహ్నమేమీ కాదు. అది వాళ్ల ప్రొటెక్షనిస్టు రాజకీయం!)

ఒకవైపు అమెరికాలో ఈ ప్రయత్నాలు జరుగుతుండగానే జర్మనీ, బ్రిటన్ ప్రభుత్వాలు కూడా తమ దిగుమతుల్లో బాల కార్మికుల శ్రమతో తయారయిన వస్తువులు ఉండగూడదని భారత ప్రభుత్వానికి తాఖీదులిచ్చాయి. భారతదేశం ఎగుమతి చేసే 250 మిలియన్ డాలర్ల ఖరీదైన చేనేత తివాచీలలో 40 శాతం అమెరికాకు ఎగుమతి అవుతాయి. 1992 ఏప్రిల్ నుంచి సెప్టెంబర్ వరకు ఆరు నెలల కాలంలో మొత్తం 554 కోట్ల రూపాయల తివాచీలు ఎగుమతి కాగా అందులో 180 కోట్ల రూపాయల ఎగుమతిలో అమెరికా 30 కోట్లు, జర్మనీ 34 కోట్లు దిగుమతి చేసుకున్నాయి. తివాచీలు కాక మిగతా ఎగుమతుల్లోను, దేశంలో అనేక రంగాల్లోనూ బాల కార్మికుల శ్రమ ఉండనే ఉంది.

ఇప్పుడు ఆయా ప్రభుత్వాలు బాల కార్మికుల గురించి చర్చ లేవనెత్తడంతో అందునా ఇంత పెద్ద ఎత్తున విదేశీ మారక ద్రవ్యం సమస్య ఉండడంతో భారత ప్రభుత్వానికీ కదలిక మొదలయింది. హనోవర్‌లో జరిగిన ఒక వస్త్ర ప్రదర్శనలో 'బాలల శ్రమ వాడని తివాచీలు' అని ముద్ర కొట్టిన తివాచీల్ని ప్రదర్శించారు. ఇప్పటికైనా మన ఏలినవారు కళ్లు తెరిచింది లక్షలాది బాల కార్మికులు అనుభవిస్తున్న దయనీయ స్థితిని చూసికాదు. భవిష్యత్ తరాలు గనుల్లో, కార్ఖానాల్లో, నికృష్టమైన పని పరిస్థితుల్లో దుర్భ జీవితాలు గడుపుతున్నందుకు కాదు. వికసించవలసిన పసి మొగ్గలు చీకటిలో ఆకలితో శక్తికి మించిన శ్రమతో వాడిపోతున్నందుకు కాదు. కనీస మానవ నైతిక దృష్టితో కాదు. కేవలం విదేశీమారక ద్రవ్యపు వ్యాపార దృష్టితోనే.

విదేశీ మారక ద్రవ్యం తప్ప మనకిప్పుడింకేమీ కనబడుతున్నట్టు లేదు. అమెరికన్ డాలర్లు, జర్మన్ మార్కులు, బ్రిటిష్ పౌండ్లు రెపరెపలాడే చప్పుడు తప్ప ఇప్పుడు మనకింకేమీ వినిపిస్తున్నట్టు లేదు. ఈ బధిరాంధ పాలకులకు కాకపోయినా ఇంకా సజీవంగా ఉన్న ఈ దేశపు అసంఖ్యాక మానవ హృదయాలకయినా ఈ దగ్ధ జీవితాలు కనిపిస్తాయా? విషాద శైశవ గీతాలు వినిపిస్తాయా?

***ఆంధ్రజ్యోతి, మార్చ్ 7, 1993***



# 5

# పరాధీన భారతం

ఏ. బి.కె. ప్రసాద్ 'పరాధీన భారతం' పై డా. అబ్దుల్ నూర్ భాషా పరిశీలన (పాలకవర్గాల పసిడి పంట 'పరాధీన భారతం', అరుణతార, ఫిబ్రవరి 1993) చదివిన తర్వాత పుస్తకం గురించీ, పరిశీలన గురించీ చర్చించవలసిన అంశాలు కొన్ని ఉన్నాయనిపించింది.

'పరాధీన భారతం' పుస్తకం అవసరమైన సమయంలో వచ్చిన అసరమైన పుస్తకం అనడంలో ఎవరికీ సందేహం ఉండనవసరం లేదు. కాని నూతన ఆర్థిక పారిశ్రామిక విధానాలను వివరించడంలో, ఆ విధానాలను నిర్దిష్ట చారిత్రక, సామాజిక నేపథ్యంలో అర్థం చేసుకోవడంలో, ఆ విధానాలకు ప్రతిఘటనను ప్రతిపాదించడంలో అసమగ్రత వల్ల పుస్తకం విలువ చాలా తగ్గిపోయింది. పుస్తకానికీ, పాఠకులకూ సహాయపడవలసిన పరిశీలన కూడా ఈ అంశాలను లేవనెత్తకపోవడం విచారకరం.

దాదాపు మూడు సంవత్సరాలుగా ఐ.ఎం.ఎఫ్. అప్పు గురించి చర్చ ఇంగ్లిష్ పత్రికల్లో సాగుతోంది. చంద్రశేఖర్ ప్రభుత్వ హయాంలో బంగారు నిల్వలు బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండ్‌కు తరలిపోయినప్పటి నుంచీ ఈ చర్చ విస్తృతమై, పి.వి. నరసింహారావు – మన్మోహన్ సింగ్‌ల నేతృత్వంలో నూతన ఆర్థిక, పారిశ్రామిక, వాణిజ్య ప్రకటనలు, బడ్జెట్‌లు వెలువడిన తర్వాత ఇంకా

పెరిగింది. ఈ మొత్తం చర్చలో ఎక్కువగా నూతన ఆర్థిక విధానాలను వ్యతిరేకిస్తున్న సి.పి.ఐ., సి.పి.ఐ. (ఎం) అభిమానులైన ఆర్థిక శాస్త్రవేత్తలు 'నెహ్రూవియన్ సోషలిస్టు విధానం' అనేది ఇంతకాలమూ కొనసాగిందని, నూతన ఆర్థిక విధానాలు ఆ 'సోషలిజాన్ని' భగ్నం చేస్తున్నాయనీ ఒక వాదన చేస్తున్నారు. నూతన ఆర్థిక విధానాలను అర్థం చేసుకోవడంలో ఇది ఒక పద్ధతి. 'పరాధీన భారతం' ఎక్కువ చోట్ల ఈ పద్ధతిని అనుసరించింది.

'పరాధీన భారతం'లో మొట్టమొదటి అధ్యాయమే 'నెహ్రూ ప్లాన్ తారు మారు' అంటూ సాగింది. నూతన ఆర్థిక విధానాలు నెహ్రూ పథానికి మంగళం పాడి టాటా–బిర్లా ప్లాన్‌ను అందలం ఎక్కించాయని ఎ.బి.కె. అంటారు. 'ప్లానింగ్ భావనకే పరిమితం గాని పూర్తి సోషలిజాన్ని నెహ్రూ ఆచరణలో వ్యతిరేకించిన వాడేనని మరువరాదు' (పే.3) అంటూనే, ఎన్నోచోట్ల నెహ్రూ ప్రతిపాదించిన ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యూహం, మిశ్రమ ఆర్థిక వ్యవస్థలకూ టాటా బిర్లాలు ప్రతిపాదించిన బొంబాయి ప్లాన్‌కూ మధ్య వ్యతిరేకత ఉన్నట్టు రాశారు.

'సోషలిస్టు తరహా' ఆర్థిక విధానాన్నీ, ప్రణాళికా విధానాన్నీ, సెక్యులరిజాన్నీ, సైంటిఫిక్ టెంపర్‌నూ నెహ్రూ భారత పాలనా, సామాజిక వ్యవస్థలలోకి ప్రవేశపెట్టడానికి ప్రయత్నించాడనే ఒక పుక్కిటి పురాణం గత నాలుగైదు దశాబ్దాలుగా దేశంలో వ్యాపిస్తోంది. వాస్తవాలకూ ఈ పురాణానికీ ఏమీ సంబంధం లేదు. నెహ్రూ విషయంలో గుర్తించవలసిన విషయాలు రెండున్నాయి. ఒకటి, ఆయన మాటలకూ చేతలకూ ఎక్కడా పొంతనలేదు. చివరికి తనకు మాత్రమే సంబంధించిన విషయంలో కూడా ఆయన తన మాటలకు తగినట్టు నడుచుకోలేకపోయాడు. ఇందుకు కారణమూ, నెహ్రూలో గుర్తించవలసిన రెండో అంశమూ ఏమంటే ఆయనకు ఎప్పుడూ తన విశ్వాసాలపట్ల నిబద్ధత లేదు. విరివిగా అనుభవమూ, అధ్యయనమూ ఆయనను అన్ని విశ్వాసాల పట్ల నమ్మకం ఉండేట్టుగా మార్చాయి. ఏకకాలంలో ఆయనకు సోషలిజం, కాపిటలిజం; మతాచారాలు, సైంటిఫిక్ టెంపర్; దిన్ ఇ ఇలాహి, సెక్యులరిజం నచ్చాయి. అన్నిటినీ సమర్థించగలిగాడు. దైవం విషయంలో తాను ఏదీ చెప్పలేని ఎగ్నోస్టిక్ (సంశయవాది) నని చెప్పుకున్నాడు గాని అసలు అన్ని విశ్వాసాల విషయంలోనూ ఆయన అంతే అయిపోయాడు. అయితే కొత్త పాతల మధ్య తటస్థత సాధారణంగా పాతవైపు మొగ్గుగానే పరిణమిస్తుంది. అందువల్ల నెహ్రూ మాటల్లో ఊగిసలాట అంతా అంతిమంగా ఉదారవాదపు ముసుగులో సాంప్రదాయికతే అయింది.

ఇది సాధారణంగా నెహ్రూ స్వభావం అనుకుంటే, అసలు నెహ్రూ పథకం, బొంబాయి ప్రణాళికల వాస్తవాలేమిటి? 1947 తర్వాత రూపొందుతూ వచ్చిన పారిశ్రామిక విధానాలకు మూలాలు బొంబాయి ప్రణాళికలోనూ, బ్రిటిష్ ప్రభుత్వ పారిశ్రామిక విధానాల్లోనూ ఉన్నాయనేది వాస్తవం. 1948, 1956 పారిశ్రామిక విధాన ప్రకటనలలో గాని, 1949 ప్రధానమంత్రి ప్రకటనలో గాని ఉన్న అంశాలు, ఇప్పుడు సోషలిజంగా, మిశ్రమ ఆర్థిక వ్యవస్థగా చెప్పబడుతున్న విషయాలు పూర్తిగా బొంబాయి ప్రణాళికలోను, 1945 ఏప్రిల్‌లో వైస్‌రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ తీసుకున్న నిర్ణయంలోను ఉన్నవే.

ప్రణాళికా విధానం అనేది నిజానికి అప్పుడు ఆలోచనాపరులందరినీ ప్రభావితం



చేస్తుండింది. సోవియట్ ప్రణాళికలు విజయం సాధించడం చూసి, గుత్త పెట్టుబడి కూడ మాటల్లో ప్రణాళికలను సమర్థించడం మొదలుపెట్టింది. 1932 జూన్‌లోనే వైస్‌రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ సభ్యుడైన సర్ జార్జ్ షుస్టర్ భారత ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలను అనుసరించడం మంచిదని సలహా ఇచ్చాడు. ఆ తర్వాత ఆరు సంవత్సరాలకు కాంగ్రెస్ జాతీయ ప్రణాళికా సమితిని ఏర్పాటు చేసింది. నెహ్రూ అధ్యక్షుడుగా ఉన్న ఈ సమితిలో రాష్ట్ర ప్రభుత్వాల ఉన్నతాధికారులు, బడా పెట్టుబడిదారులు ఉన్నారు. ఈ సమితికి హైదరాబాద్, మైసూరు పాలకులు కూడా సహకారం ప్రకటించారు. ఆ తర్వాత ఆరు సంవత్సరాలకు బొంబాయి ప్రణాళిక సిద్ధమైంది. ఆ వెంటనే ఆ ప్రణాళిక రచయితలలో ఒకరైన సర్ అర్దశిర్ దలాల్ వైస్‌రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో ప్రణాళికా, అభివృద్ధి శాఖల బాధ్యుడుగా నియమించబడ్డాడు. ఆయన మాటల్లో చెప్పాలంటే 'ప్రభుత్వ ప్రణాళిక ఆదర్శాలూ, బొంబాయి ప్రణాళిక ఆదర్శాలూ ఒకటే.'

పరిశ్రమల్లో కొన్నింటిని మౌలిక పరిశ్రమలుగా, కీలక పరిశ్రమలుగా గుర్తించి, వాటిని ప్రభుత్వ ఆధీనంలో నడపాలనే ఆలోచన 1945 ఏప్రిల్‌లో వైస్‌రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ తీసుకున్న నిర్ణయంలో ఉంది. బొంబాయి ప్రణాళిక ఇంకొక అడుగు ముందుకు వేసి, 'ఆర్థిక జీవనంలోని ప్రతి అంశం పైనా ప్రభుత్వ అదుపు ఎంత కఠినంగా ఉండాలంటే, వ్యక్తిగత స్వేచ్ఛ, సంస్థా స్వాతంత్ర్యం తాత్కాలిక గ్రహణానికి లోను కావచ్చు' అని రాసింది.

కనుక భారత ఆర్థిక వ్యవస్థలోకి ప్రణాళికా బద్ధ వ్యూహం, మిశ్రమ ఆర్థిక విధానం, కీలక పరిశ్రమల మీద ప్రభుత్వ ఆధిపత్యం అనేవి నెహ్రూ తీసుకొచ్చినవీ కావు, వాటికీ టాటా బిర్లాల పథకానికీ పోటీ కూడలేదు. మైకేల్ కిద్రాన్ అన్నట్టు, 1947 అధికారమార్పిడి తర్వాత అనుసరించిన చాల విధానాలూ, చర్యలూ 1940లలోనే సూచించబడ్డాయి.

అధికార మార్పిడి తర్వాత వెలువడిన మొట్టమొదటి పారిశ్రామిక విధాన తీర్మానం (1948)లో భారత పరిశ్రమలలో విదేశీ పెట్టుబడికీ, విదేశీ సంస్థలకూ 'పూర్తి స్వాతంత్ర్యం' ఇస్తామని ప్రకటించారు. ఆ తర్వాత 1949 ఏప్రిల్ 6న నెహ్రూ రాజ్యాంగ నిర్ణయ సభలో చేసిన ప్రసంగంలో భారత ప్రభుత్వం బ్రిటిష్ ప్రయోజనాలను గానీ, ఏ భారతీయేతర ప్రయోజనాలను గానీ దెబ్బతీయదని స్పష్టం గానే ప్రకటించాడు. ఆ తర్వాత అమెరికాలో నెహ్రూ చేసిన ప్రసంగం, బిర్లా చేసిన ప్రసంగం ఒకే భాషలో, ఒకే స్ఫూర్తితో ఉన్నాయి.

మొత్తం మీద తేలేదేమంటే ఆర్థిక వ్యవస్థ నిర్వహణ గురించీ, ఆర్థిక వ్యవస్థలోకి విదేశీ పెట్టుబడుల ప్రవేశం గురించీ బడా పెట్టుబడిదారులకూ, నెహ్రూ నాటి నుంచి ప్రభుత్వాలకూ మధ్య ఎటువంటి వైరుధ్యమూ లేదు. నెహ్రూనూ, ఇందిరా గాంధీనీ ప్రగతి కాముకులుగా అభివర్ణించిన సోవియట్ పండితులు ఇటువంటి లేని తేడాను లేనిది ఉన్నట్టుగా భ్రమింపచేశారు. ఇందిర 'ప్రగతిశీల' హయాంకు కారణం, ఎ.బి.కె. చెప్పినట్టు, కేవలం సిండికేట్ ముఠా బెడద తొలగించుకోవడం మాత్రమే కాదు (పై. 174), ఏడు రాష్ట్రాల్లో కాంగ్రెసేతర ప్రభుత్వాలు రావడం, ఆర్థిక వ్యవస్థ సంక్షోభంలో పడడం, నక్సల్బరీ ఉద్యమంతో పాటుగా దేశంలో అనేక చోట్ల ప్రజా ఆందోళనలు తలెత్తడం వంటి పరిణామాలు కూడా. ఈ స్థితిలో పార్లమెంటరీ

వామపక్షాల మద్దతు సంపాదించడానికీ, ప్రజల్లో భ్రమలు కల్పించడానికీ ఆమె అనేక 'ప్రగతిశీల' విధానాలు ప్రకటించింది. అప్పటికే నెహ్రూ అభ్యుదయ కాముకతను స్థిరపరిచి ఉన్న సోవియట్ పండితులు ఈ విధానాలనూ సమర్థించారు. వాస్తవంలో నెహ్రూ, ఇందిర ఇద్దరూ కూడ సాధికారతను సంపాదించుకోవడం కోసం ఆదర్శాలు ప్రకటించడం, ఆచరణలో బడా భూస్వాములకూ, బడా పెట్టుబడిదారులకూ అనుకూలమైన విధానాలు అమలు చేయడం సాగించారు. మూడు దశాబ్దాలకు పైగా కొనసాగిన ఈ విధానాలు రాజీవ్ కాలంలో ఆదర్శాలు ప్రకటించనవసరం లేని స్థితికి చేరాయి. అప్పుడిక కేవలం ఆచరణే కనబడి, అదీ నగ్నంగా కనబడి, హఠాత్తుగా ఏదో మార్పు వచ్చినట్టనిపించింది. పి.వి. నరసింహారావు కాలానికి ఆ ఆదర్శాలను బహిరంగంగా విమర్శించే స్థితికూడా వచ్చి, ప్రభుత్వం తనకు తానే నెహ్రూ విధానాలకు భిన్నంగా మాట్లాడసాగింది.

1947 నుంచి ఆర్థిక వ్యవస్థా నిర్వహణ చరిత్ర ఇది. ఈ కొనసాగింపును అర్థం చేసుకోకపోతే పాలకవర్గాలలో అభ్యుదయాంశ వెతుకుతూ దారి తప్పిన ఉమ్మడి కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర నుంచి మనం సరి అయిన పాఠాలు నేర్చుకోలేం.

ఎ.బి.కె. పుస్తకంలో మరొక ప్రధానమైన అంశం దేశంలో స్వతంత్ర, దేశీయ పెట్టుబడిదారుల గురించీ, పెట్టుబడిదారీ విస్తరణ గురించీ అసమగ్రమైన వివరణ. పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద దశకు చేరిన తర్వాత వలసలలో గాని, అర్ధవలసలలో గాని స్వతంత్ర పెట్టుబడిదారీ అభివృద్ధి పుట్టి పెరగడానికి అవకాశమే లేదు. సామ్రాజ్యవాదం వలసలలోను, అర్ధవలసలలోను దేశీయ పెట్టుబడిదారుల చొరవను అణచివేసి, బలహీనం చేసి, వాళ్లందరినీ కేవలం దళారులుగా మారుస్తుంది. జాతీయ ప్రయోజనాల పట్ల ఆసక్తి ఉంటే ఈ ప్రయత్నాలను ఎదుర్కొని స్వతంత్ర పెట్టుబడిదారీ విధానం ఎంతో కొంత ఎదగవచ్చు. కాని తాము ఏ శ్రమా చేయకుండా, పరిశోధనా వ్యయం ఏ మాత్రం లేకుండా సామ్రాజ్యవాదానికి దళారీలుగా డబ్బు చేసుకోవడంలో రుచి మరిగిన పెట్టుబడిదారులు దళారీలుగానే కొనసాగుతున్నారు. భారతదేశంలో జరిగింది అదే. కనుక భారత పాలకవర్గాలలో సామ్రాజ్యవాదంతో పోటీపడే కనీస జాతీయ బూర్జువా వర్గ లక్షణాన్ని వెతకడం ఎండమావే అవుతుంది.

పెట్టుబడిదారీ విస్తరణలో ఇప్పటిదశ 'అరాచకపు సరిహద్దులకు చేరుకున్న కాపిటలిజం' అని 'న్యూస్ వీక్' చేసిన వ్యాఖ్యను ఎ.బి.కె. అంగీకరించడం (పే. 183, 187) ఆశ్చర్యకరం. ఈ మాట చెప్పడానికి పెట్టుబడిదారీ పత్రిక 'న్యూస్ వీక్' అవసరం లేదు. పెట్టుబడిదారీ విధానంలో మౌలికంగానే అరాచకత్వం ఉంటుందని, ఈ అరాచకత్వం సామాజిక శ్రమకూ వ్యక్తిగత లాభార్జనకూ మధ్య తేడాగా, అసమానాభివృద్ధిగా, ప్రణాళిక మీద, సమన్వయం మీద ఆధారపడని ఉత్పత్తిగా వ్యక్తమవుతుందని మార్క్స్ అన్నాడు. పెట్టుబడిదారీ విధానపు అత్యున్నత దశగా సామ్రాజ్యవాదంలో ఈ అరాచకత్వం ఇంకా పెరగడం సహజమే.

'పరాధీన భారతం'లో మరొక ముఖ్యమైన అంశం భారత ఆర్థిక వ్యవస్థను నయావలసగా భావించడం. దాదాపు నూతన ఆర్థిక విధానాల ప్రకటన జరిగినప్పటి నుంచీ తెలుగులోనూ, ఇంగ్లిష్‌లోనూ ఈ వాదన వినబడుతోంది. అంతకు ముందే భారతదేశాన్ని నయావలసగా



భావించినవాళ్లు లేకపోలేదు గాని 1991 జూలై తర్వాత ఈ వాదన విస్తృతమవుతోంది. పరాధీన భారతం కనీసం ఏడుచోట్ల ఈ వాదనకు దగ్గరగా వచ్చింది. నూర్‌బాషా కూడా ఈ వాదనను బలపరిచారు.

భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు – లెనినిస్టు) ఏర్పడి తన కార్యక్రమం ప్రకటించిన నాటి నుంచీ ఆ రాజకీయాలతో ప్రభావితమైన వాళ్లందరూ భారత దేశాన్ని అర్ధభూస్వామ్య, అర్ధవలసగా వ్యవహరిస్తున్నారు. నయావలస భావనకూ, అర్ధ వలస భావనకూ మధ్య రాజకీయార్థిక శాస్త్ర పరిభాషలో స్పష్టమైన తేడా ఉంది. ఈ తేడాను గుర్తించక పోవడంగాని, ఎందువల్ల తాము అర్ధవలస భావన నుంచి నయావలస భావనకు మళ్లారో వివరించకపోవడం గాని ఉచితం కాదు. అర్ధవలస భావన నుంచి హఠాత్తుగా నయా వలస భావనకు మళ్లడం వెనుక నూతన ఆర్థిక విధానాలు గుణాత్మకంగా భిన్నమైనవనే అవగాహన కూడ ఉంది.

అర్ధవలస, నయావలస భావనలకు రాజకీయార్థిక శాస్త్రంలో చాల చరిత్ర ఉంది. అర్ధవలస భావనను లెనిన్ మొదటిసారి సూత్రీకరించాడు. పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద దశలో ఉన్నప్పుడు వలసవాద విధానాలు కొన్ని పరిణామ రూపాలు పొందుతాయని ఆయన అన్నాడు. అంతకు ముందులాగ వలసలు – సామ్రాజ్యాలు అనే రెండు రకాల విభజన మాత్రమే కాక, అర్ధవలసలు కూడా ఏర్పడతాయని అన్నాడు. ఇవి నామమాత్రపు స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తున్నప్పటికీ ఆర్థిక, దౌత్య రంగాలలో పరాధీన స్థితిలో ఉంటాయని ఆయన అన్నాడు.

ఈ భావన మావో ఇంకా విస్తరించాడు. వలసలో ఒకే సామ్రాజ్యవాద దేశపు ప్రభుత్వం ఉండగా, అర్ధవలసలో చాల సామ్రాజ్యవాద దేశాల ప్రయోజనాలు పోటీ పడుతుంటాయని మావో అన్నాడు.

ఈ నేపథ్యంలో, అర్ధవలస అంటే పేరుకు స్వతంత్ర రాజ్యంగా ఉన్నప్పటికీ, వాస్తవంలో ఆర్థిక, రాజకీయ, సైనిక రంగాలలో సామ్రాజ్యవాద శక్తుల మీద ఆధారపడే రాజ్యం. ఇటువంటి రాజ్యంలో దేశీయ పాలకవర్గాలు రాజకీయాధికారాన్ని అనుభవించగలుగుతాయి. కాని ఈ రాజకీయాధికారం సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడి ప్రయోజనాలకు లోబడి సాగుతుంది. ఇక్కడ దేశీయ పాలకవర్గాలు అన్నప్పుడే వాటికి దేశంలో ఎంతోకొంత పునాది, సాధికారత ఉన్నదని అర్థం. అర్ధవలస ఒకే సామ్రాజ్యవాద శక్తికి వలసకాదు పునాది, గనుక, అనేక సామ్రాజ్యవాద శక్తుల ఘర్షణ వేదిక గనుక, దేశీయ పాలక వర్గాలకు ఆ సామ్రాజ్యవాద శక్తులతో బేరసారాలు జరిపే అవకాశం ఉంటుంది. ఈ బేరసారాలు పాలకవర్గాలకు స్వాతంత్ర్యం ఉన్నదేమోననే భ్రమ కలిగిస్తాయి. ఈ బేరసారాలవల్ల, అంతర్జాతీయంగా ఆయా సామ్రాజ్యవాద శక్తుల బలాబలాలవల్ల, అర్ధవలస మీద ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క సామ్రాజ్యవాద శక్తికి ఎక్కువ ఆధిపత్యం ఉన్నట్టు కనబడుతుంది.

ఇక నయావలస భావనను మొదట 1950లలో ఫ్రెంచి మార్క్సిస్టులు ప్రచారంలోకి తెచ్చారు. ఇది ఒకవైపు ఎన్‌క్రూమావంటి 'అలీన' దేశాల నాయకుల ద్వారా, మరోవైపు ఎర్నెస్ట్ మాండెల్ వంటి నియో–మార్క్సిస్టుల ద్వారా, మరోవైపు అర్థశాస్త్ర పాఠ్య పుస్తకాల ద్వారా విస్తృతిలోకి వచ్చింది. నయావలసలో పాత సామ్రాజ్యవాద శక్తి ఆధిపత్యం కొనసాగుతూ

నామమాత్రపు స్వాతంత్ర్యం ఉంటుంది. స్థానికులే పాలకులుగా ఉంటారు గాని వాళ్లకు స్థానికంగా ఉండే పునాది తక్కువ. నయావలస, సామ్రాజ్యవాద శక్తి ఆధిపత్యంలో ఏదో ఒక సైనిక ఆర్థిక కూటమిలో భాగం పంచుకుంటుంది.

మార్క్సిజం – లెనినిజం – మావో ఆలోచనా విధానాన్ని ఆమోదించే వాళ్లందరూ అర్ధవలస భావనను ఆమోదిస్తుండగా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో ప్రజా ఉద్యమాలు నయావలస భావనను స్వీకరించాయి. అయితే రాజకీయ అర్థంలో ఈ రెండు భావనలకు ఒక కచ్చితమైన తేడా ఉంది. ప్రజా ఉద్యమాన్ని నిర్మించదలచినప్పుడు ప్రధాన వైరుధ్యం ఏదో, ఆ వైరుధ్య పరిష్కారానికి ఏయే వర్గాలతో ఐక్య సంఘటన నిర్మించాలో తేల్చుకోవడం ముఖ్యం. నయావలసలో ప్రధాన వైరుధ్యం సామ్రాజ్యవాదానికీ ప్రజానీకానికీ మధ్య ఉంటుంది. స్థానిక పాలకులు ఒక శక్తిగా కాక కేవలం సామ్రాజ్యవాద బంట్లుగానే ఉంటారు. అర్ధవలసలో సామ్రాజ్యవాదానికీ ప్రజానీకానికీ ఉన్న వైరుధ్యంతోపాటే, స్థానిక పాలకులకూ ప్రజానీకానికీ మధ్యన వైరుధ్యం కూడ మౌలికంగానే ఉంటుంది అంటే మరో మాటల్లో చెప్పాలంటే నయావలసలో ప్రజా ఉద్యమ స్వభావం సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేకంగా కూడా ఉంటుంది. ఈ స్వభావాన్ని అనుసరించే ఐక్య సంఘటన నిర్మాణం ఉంటుంది.

ఈ చర్చ నేపథ్యంలో భారతదేశం అర్ధవలస, అర్ధభూస్వామ్య వ్యవస్థ అని మార్క్సిస్టు లెనినిస్టు ఉద్యమం చేసిన సూత్రీకరణను మార్చుకోవలసిన అవసరం ఏదీ కనిపించదు. కాని మార్క్సిస్టు మౌలిక అవగాహనలను వదిలేసి, మార్క్సిస్టేతర విశ్లేషణలను, సిద్ధాంత వ్యతిరేక సిద్ధాంతాలను అనుసరించడమే ఫాషన్‌గా ఉన్న ఈ రోజుల్లో అర్ధవలస సూత్రీకరణను వదిలి నయావలస సూత్రీకరణను ఆమోదించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఎబికె నయావలస భావన మీద కూడా స్థిరంగా లేరు. రీ కాలనైజేషన్ (మరో సారి వలసగా మార్చే ప్రయత్నం) భావనను (పే. 133), 'పూర్తి పెట్టుబడిదారీ వ్యవస్థ అమలులోకి రాబోతోంది' (పే. 2) అనీ, 'పూర్తి కాపిటలిస్టు దోపిడీకి దేశాన్ని ఎరపెడుతున్నారు' (పే. 3) అనీ, 'నేటి ప్రభుత్వాలు దేశాన్ని కాపిటలిస్టు మార్గానికి మళ్లిస్తున్నాయని స్పష్టమవుతోంది' (పే. 68) అనీ దేశం పెట్టుబడిదారీ విధానానికి మళ్లబోతున్నదనే వాదనను కూడా చేశారు. ఈ రెండు పరిస్థితులు కూడా అచారిత్రకం అని చెప్పనక్కరలేదు.

ఇక ఐదారు చోట్ల ముఖ్యమైన పొరపాట్లు దొర్లడం, చాల చోట్ల వాక్య నిర్మాణాలు సరిగా లేకపోవడం పుస్తకం సరిగా ఎడిట్ కాలేదని చూపుతున్నాయి.

కన్వర్టబిలిటీ (పే. 109, 111, 127–8) గురించి ఇచ్చిన వివరణలో పొరపాటు దొర్లింది. "1960లో డాలర్‌కు మనం రు. 4.75 లు చెల్లిస్తే, ఇప్పుడు చెల్లిస్తున్నది రు. 30.30లు. అదే కరెన్సీ కన్వర్టబిలిటీ అంటే" అని వివరణ ఇచ్చారు. ఇది సరికాదు. ఒక దేశపు కరెన్సీ ఇతర దేశాల కరెన్సీలతో సులభంగా మారకం కావడమే కన్వర్టబిలిటీ అని పాఠ్యపుస్తకాలు చెపుతాయి. ఎగుమతిదార్లు సంపాదించే విదేశీ కరెన్సీ మీద ప్రభుత్వం ఏ ఆంక్షలు విధించకపోవడం, ఆ కరెన్సీని స్థానిక మార్కెట్లో ఇష్టారాజ్యంగా మార్చుకోగలగడం కన్వర్టబిలిటీ అని ప్రస్తుత బహుముఖ వాణిజ్యం చెపుతోంది. నిజానికి ఇది ఒక ప్రభుత్వపు సర్వసత్తాక లక్షణానికి తీరని అపచారం. మామూలుగా సార్వభౌమత్వానికి చిహ్నాలలో ఒకే కరెన్సీ చలామణీని కూడా చెపుతారు. కాని కన్వర్టబిలిటీ వల్ల ఒక దేశపు మార్కెట్లలో అన్ని కరెన్సీలూ చలామణీ అయ్యే అవకాశం వస్తుందన్న మాట.



అట్లాగే 'స్పెషల్ డ్రాయింగ్ రైట్స్ అంటే అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు దేశాల అభివృద్ధి రేటును గణించేందుకు ఉపయోగించే ద్రవ్యమానం' (పే. 128) కాదు. ఎస్.డి.ఆర్.కూ, దేశాల అభివృద్ధి రేటుకూ ఏమీ సంబంధం లేదు. అది ఐ.ఎం.ఎఫ్. ద్రవ్యమానం. ఐ.ఎం.ఎఫ్. అన్ని దేశాలకూ ఇచ్చే కోటాలు ఈ ద్రవ్యమానంలోనే ఉంటాయి.

అంతర్జాతీయ రాజకీయాలూ, రాజకీయార్థిక శాస్త్రాన్నీ అధ్యయనం చేసిన ఎబికె అమెరికా యూనిపోలార్ శక్తి కాబోతోందని (పే. 185, 187) అనడం, సార్క్‌ను 'సంపన్న దేశాలపై పరాధారస్థితిని వదిలించుకునే ప్రయత్నంలో తొలిమెట్టు' (పే. 186)గా భావించడం ఆశ్చర్యకరం.

ద్రవ్య వ్యవస్థలో, పాలనా రంగంలో శిక్షణా రాహిత్యాన్ని ప్రభుత్వాలు, రాజకీయవేత్తలు గమనించలేదని, గమనించినా 'నిమ్మకు నీరెత్తినట్టు' కూచున్నారని అనడం (పే.40), అమెరికన్ సామ్రాజ్యవాదం చేస్తున్న మోసాన్ని భారత పాలకులు గమనించలేక పోబట్టే నూతన ఆర్థిక విధానాలు వచ్చాయనడం (పే. 165), రవి బాత్రానూ, 'న్యూస్ వీక్'నూ నిరభ్యంతరంగా ఉటంకించడం (పే. 182–3), గ్లోబలైజేషన్, స్వేచ్ఛా మార్కెట్ విస్తరణ పరస్పర విరుద్ధ ప్రయత్నాలని అనడం (పే. 185), ఎబికె అమాయకత్వానికి అద్దం పడతాయి. అట్లాగే రాజా రామన్నను, అరుణాచలాన్ని దేశీయ సాంకేతిక పరిజ్ఞాన అభివృద్ధి సమర్థకులుగా చూడడం (పే. 59) ఇంకా అమాయకత్వం. రాజా రామన్న అన్ని సామ్రాజ్యవాద దేశాల సహాయంతోను 2000 నాటికి పదివేల మెగావాట్ల అణు విద్యుత్ కర్మాగారాన్ని ప్రతిపాదించిన మహానుభావుడు. పూర్తిగా సామ్రాజ్యవాద సైనిక అన్వేషణలనే దిగుమతి చేసుకునే రక్షణశాఖలో కీలక స్థానాల్ని నిర్వహించిన వ్యక్తి అరుణాచలం. వాళ్లు ఎక్కడో ఒక చోట ఏ మాత్రం నిబద్ధత లేకుండా అన్న మాటల్ని వాటి ముఖ విలువకు తీసుకోవడమేనా?

అయితే ఈ విమర్శంతా కూడా పుస్తకం ప్రాధాన్యతను తగ్గించడానికి కాదు. ఒక అవసరాన్ని తక్షణం తీర్చాలనే ప్రయత్నంలో లోపాలు జరగడం సహజమే. ఈ లోపాలు సవరించుకుంటే ఈ పుస్తకం ఇంకా ఎక్కువ ఉపయోగకరమయినదవుతుంది. కాళీపట్నం రామారావు 'కుట్ర' కథ తర్వాత రెండు దశాబ్దాలకు ఆ కుట్రను విప్పి చెప్పగల అవకాశాన్ని సరిగా వినియోగించుకోవలసే ఉంది.

**సంప్రదించిన పుస్తకాలు :**

సునీతి కుమార్ ఘోష్ – ది ఇండియన్ బిగ్ బూర్జువాజీ, కలకత్తా,1985
మైకేల్ బారాట్ బ్రౌన్ – ది ఎకనమిక్స్ ఆఫ్ ఇంపీరియలిజం, హామండ్స్ వర్త్, 1974

***అరుణతార, మే 1993***

# 6

# రెండేళ్లనాటి 'అర్ధ' సత్యాలు

నూతన ఆర్థిక విధానాల పేరుతో ప్రచారంలోకి వచ్చిన ప్రభుత్వ చర్యల్లో ముఖ్యమైనది రూపాయి మారకపు విలువను తగ్గించడం. సరిగ్గా రెండు సంవత్సరాల కింద 1991 జూలై మొదటి వారంలో భారత ప్రభుత్వం రూపాయి మారకపు విలువను తగ్గిస్తూ ప్రకటించింది. పి.వి. నరసింహారావు ప్రధానిగా, మన్మోహన్‌సింగ్ ఆర్థిక మంత్రిగా కొత్త ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత తీసుకున్న తొలి నిర్ణయాల్లో ఇది ఒకటి. ఈ చర్య ఫలితంగా బ్రిటిష్ పౌండ్, అమెరికన్ డాలర్, జర్మన్ మార్క్, జపనీస్ యెన్‌లతో పోల్చినప్పుడు మన రూపాయి విలు 22 శాతం పడిపోయింది.

ఆ తర్వాత రెండు సంవత్సరాల కాలంలో కేంద్ర ప్రభుత్వం పారిశ్రామిక, ఎగుమతి – దిగుమతి విధానాలలో, ప్రభుత్వ రంగం, విదేశీ పెట్టుబడులు, విదేశీ సాంకేతిక పరిజ్ఞానం, దేశీయ గుత్తపెట్టుబడి సంస్థల విషయంలో, సబ్సిడీలు, వ్యవసాయ ద్రవ్య విధానాలలో, కార్మిక సంక్షేమ వ్యవహారాలలో అనేక చర్యలు ప్రవేశపెట్టింది. ఇప్పుడు, అధికారం చేపట్టి రెండు సంవత్సరాలు నిండిన సందర్భంగా ఈ అన్ని రంగాలలోనూ బహుముఖాభివృద్ధి సాధించానని కేంద్ర ప్రభుత్వం ప్రచారం చేసుకుంటున్నది. ఈ ప్రచారం ఆడంబరమైన



నినాదాలతోనూ, అర్ధసత్యాలతోనూ ఉన్నందువల్ల వాస్తవాలను ఒక్కొక్క రంగం లోనూ విడివిడిగా నిశితంగా పరిశీలించవలసి ఉంది. ప్రస్తుతానికి రూపాయి మారకపు విలువ తగ్గింపు గురించి పరిశీలిద్దాం.

## ప్రభుత్వం ఏం చెప్పింది?

రూపాయి మారకపు విలువ తగ్గింపు నిర్ణయం ప్రకటించినప్పుడు సహజంగానే దేశంలో పెద్ద ఎత్తున చర్చ జరిగింది. ఈ చర్చలో పాల్గొంటూ మన ఆర్థిక వ్యవస్థా నిర్వాహకులు, విధాన నిర్ణేతలు తమ నిర్ణయాన్ని సమర్థించుకుంటూ ఆ నిర్ణయం వల్ల ఏయే సత్ఫలితాలు రానున్నాయో ప్రకటించారు. 'ఇంకా పెద్ద ఆపదను తప్పించుకునేందుకే' మారకపు విలువ తగ్గించవలసి వచ్చిందని, అది అనివార్యమైన నిర్ణయమని ప్రధాని అన్నారు. 'వాస్తవిక మారకపు రేట్లు అమలులో పెడతామని తాము ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్దానానికి అనుగుణంగానే ఈ పని చేశామని' ఆర్థిక మంత్రి అన్నారు.

చెల్లింపుల మిగులు స్థితిలోనూ, విదేశీ మారక ద్రవ్య నిలువల స్థితిలోనూ తలెత్తిన పరిణామాల మూలంగానే మారకపు విలువ తగ్గించవలసి వచ్చిందని అంటూ అప్పటి రిజర్వ్ బ్యాంక్ డిప్యూటీ గవర్నర్ సి. రంగరాజన్ 1991 ఆగస్ట్‌లో బొంబాయిలో ఒక సవివరమైన ప్రసంగం చేశారు. అందులో ఆయన 'మారకపు విలువ తగ్గింపు సర్దుబాటు వల్ల దేశ ఆర్థిక వ్యవస్థలో అంతర్జాతీయ పోటీ శక్తి పెంపొందుతుంది. వ్యాపారంలో అసమతౌల్యాన్ని సరి చేస్తుంది. కరెంట్ అకౌంట్ లోటుని భర్తీ చేస్తుంది' అని అన్నారు. (రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బులెటిన్, సెప్టెంబర్ 1991).

నిజానికి మారకపు విలువ తగ్గింపు గురించి ఈ సమర్థన కొత్తదేమీ కాదు. ఇది సంప్రదాయక అర్థశాస్త్రం చేసే సమర్థనే. ఒక దేశపు కరెన్సీ మారకపు విలువ తగ్గితే ఆ దేశపు ఎగుమతులకు విదేశాలలో ధరలు పడిపోతాయి. ఇలా ధర తగ్గినందువల్ల ఆ వస్తువులు ఎక్కువగా కొంటారనీ, అంటే డిమాండ్ పెరిగి ఎగుమతులు పెరుగుతాయనీ, ఎగుమతుల వల్ల వచ్చే ఆదాయం పెరుగుతుందనీ అర్థశాస్త్రం చెపుతుంది. దాన్నే దిగుమతుల విషయంలో అన్వయించినప్పుడు, దిగుమతి చేసుకునే వస్తువుల ధరలు పెరిగి, అందువల్ల డిమాండ్ తగ్గి, మొత్తం మీద దిగుమతులు తగ్గి, దిగుమతి వ్యయం తగ్గిపోతుందని అర్థశాస్త్రం చెపుతుంది.

## అర్థశాస్త్రం – పాక్షిక సత్యాలు

కాని ఈ అర్థశాస్త్ర సూత్రీకరణలు పూర్తి నిజాలు కావు. మనం ఎగుమతి చేసే వస్తువు స్థిరమైన డిమాండ్ కలదయితే దాని మీద ధరల మార్పు ఏ ప్రభావాన్నీ చూపదు. ఉదాహరణకు మనం ఎగుమతి చేసే టీపొడి చౌకయిపోయినందువల్ల ఎవరూ ఎక్కువ సార్లు టీ తాగి, ఎక్కువ టీ పొడి కొనుక్కుని, మనం ఎక్కువ టీ ఎగుమతి చేయవలసిన అవసరం రాదు. పైగా

విదేశీయులకు పాత ధరకే ఇప్పుడు ఎక్కువ టీ పొడి అందుతుంది గనుక డిమాండ్ తగ్గగల అవకాశమూ ఉంది.

అలాగే ఒక వస్తువును ఎగుమతి చేసే దేశాలు చాలా ఉన్నప్పుడు ఒక దేశం మారకపు విలువను తగ్గించిన వెంటనే, మిగతా దేశాలు కూడా మారకపు విలువను తగ్గిస్తే మొదటి దేశపు తగ్గింపు నిష్ప్రయోజనమవుతుంది.

ఈ అభ్యంతరాలు కూడా దాటి మారకపు తగ్గింపు మేలు చేసే అవకాశం ఉంటుందనుకున్నా, ఏ నిష్పత్తిలో మారకపు విలువ తగ్గిందో అంతకన్న ఎక్కువ నిష్పత్తిలో ఎగుమతులు పెరిగినప్పుడు, దిగుమతులు తగ్గినప్పుడు మాత్రమే దేశ ఆర్థిక వ్యవస్థకు ఆ మారకపు విలువ తగ్గింపు వల్ల ప్రయోజనం ఉంటుంది.

మన ఆర్థిక వ్యవస్థలో ఇప్పటికి జరిగిన ఏ మారకపు విలువ తగ్గింపు కూడా ప్రయోజనాన్ని సాధించలేదు. నిజానికి బహిరంగ ప్రకటనతో జరిగిన తగ్గింపులు మూడుసార్లే అయినప్పటికీ, ఎప్పటికప్పుడు రిజర్వ్ బ్యాంక్ ఆ తగ్గింపు నిర్ణయాలు చేస్తూనే వస్తున్నది. 1966లో మారకపు విలువ తగ్గింపు ద్వారా రు. 7.50 గా నిర్ణయమైన డాలర్ 1991 జూన్ నాటికి రు. 20.54కు చేరిందంటే ఇటువంటి అప్రకటిత తగ్గింపుల వల్లనే. మరి ఈ తగ్గింపులేవీ మన ఎగుమతులను పెంచనూలేదు, దిగుమతులు తగ్గించనూలేదు.

**ఈ రెండేళ్ల పరిణామాలు**

మారకపు విలువ తగ్గింపు ఫలితంగా మన విదేశీ వాణిజ్యంలో అసమతౌల్యం తగ్గిపోతుందని రంగరాజన్ ప్రకటించిన తర్వాత రెండు సంవత్సరాలలో జరిగినదేమిటి? ఇప్పటికి లభ్యమవుతున్న గణాంకాల ప్రకారం మన విదేశీ వాణిజ్యంలో లోటు పెరుగుతూ వచ్చిందే గాని కనీసం పెరుగుదల రేటు తగ్గనైనా తగ్గలేదు. మన ఎగుమతుల ఆదాయం కన్నా దిగుమతుల వ్యయం 1991 లో రు. 3969 కోట్లు ఎక్కువగా ఉండగా, ఈ తేడా 1992-93 తాత్కాలిక అంచనాలకే రు. 9572 కోట్లకు చేరింది. (ఒక దశాబ్దంగా పెరుగుతూ వస్తున్న ఈ వ్యత్యాసం వివరాలు పట్టికలో). వేరే మాటల్లో చెప్పాలంటే ఈ సంవత్సర కాలంలో ఎగుమతుల విలువ రు. 9523 కోట్లు పెరగగా, దిగుమతుల విలువ రు. 15,126 కోట్లు పెరిగింది.

నిజానికి ప్రభుత్వ గణాంకాలను పూర్తిగా నమ్మడానికి వీలులేదు. మన దిగుమతులలో అతి ఎక్కువ భాగం ఆక్రమించే రక్షణ, ఆయుధ దిగుమతుల వ్యయం చాలా వరకు ప్రభుత్వ గణాంకాలలో చూపడం జరగదు.

ఈ రెండు సంవత్సరాలలో విదేశీ వాణిజ్య లోటు పూడకపోయినా, కనీసం మారకపు విలువ తగ్గింపు ముందు సంవత్సరాలతో పోల్చి చూసినా తగ్గింపు వల్ల మనం ఏ ప్రయోజనాన్నీ సాధించలేదని అర్థమవుతుంది. 1990-91 గణాంకాలనూ, 1992-93 గణాంకాలనూ (వీటిలో మొదటివి వాస్తవ గణాంకాలు కాగా, రెండోవి అంచనాలు. అంచనాల కన్న సవరించిన అంచనాలు, వాస్తవ గణాంకాలూ పెరుగుతూ పోతుంటాయి) పోల్చి చూస్తే ఈ రెండు సమయాల



| **విదేశీ వాణిజ్య గణాంకాలు** (కోట్ల రూపాయలలో) | | | |
|---|---|---|---|
| **సంవత్సరం** | **దిగుమతులు** | **ఎగుమతులు** | **లోటు** |
| 1983-84 | 15,381 | 9,771 | 6,060 |
| 1984-85 | 17,134 | 11,744 | 5,390 |
| 1985-86 | 19,658 | 10,895 | 8,763 |
| 1986-87 | 20,096 | 12,452 | 7,644 |
| 1987-88 | 22,244 | 15,674 | 6,570 |
| 1988-89 | 28,235 | 20,232 | 8,003 |
| 1989-1990 | 35,416 | 27,681 | 7,735 |
| 1990-91 | 43,173 | 32,553 | 19,640 |
| 1991-92* | 47,797 | 43,828 | 4,969 |
| 1992-93* | 62,923 | 53,351 | 9,572 |

* తాత్కాలిక అంచనాలు

మధ్య ఎగుమతులు 20,798 కోట్ల రూపాయలు పెరగగా, దిగుమతులు 19,730 కోట్ల రూపాయలు పెరిగాయి. ఈ రెండో అంకె తాత్కాలిక అంచనా అనే విషయాన్ని, ఈ రెండు అంకెల మధ్య పెద్ద వ్యత్యాసం లేదనే అంశాన్ని దృష్టిలో ఉంచుకుంటే హళ్లికి హళ్లి, సున్నకు సున్న పోగా మన 20 శాతం తగ్గింపు మనకే ఉండిపోయిందన్నమాట! మేలు చేస్తుందని మింగించిన గరళం గొంతులో అలాగే ఉండి పోయిందన్నమాట!

విదేశీ వాణిజ్య లోటు సంగతి అలా ఉండగా, రంగరాజన్ చెప్పిన మరో అంశం మన అంతర్జాతీయ పోటీ శక్తి ఇనుమడిస్తుందనేది. 1991-92కూ 1992-93కూ మన ఎగుమతులలో పెరుగుదల పెట్రోలియం ఉత్పత్తులలో (61.53 శాతం), చేతి పనుల ఉత్పత్తులలో (59.91 శాతం), ఇంజనీరింగ్ పరికరాలలో (49.45 శాతం) కనబడింది. ఈ మూడింటిలో మొదటి దానిలోనూ, మూడవ దానిలోనూ విదేశీ పెట్టుబడులో, విదేశీ సాంకేతిక పరిజ్ఞానమో, విదేశీ ముడిసరుకులో ఉన్నందువల్ల ఈ రంగాలలో మన పోటీ శక్తి పెరిగిందని చెప్పడానికి వీలు లేదు. మిగిలిన ఎగుమతులు వేటిలోనూ మనం చెప్పుకోదగిన అభివృద్ధి సాధించలేదు గనుక అంతర్జాతీయ మార్కెట్లో మన పరపతి పెరిగిందని అనుకోవడానికి వీలులేదు.

ఇక రంగరాజన్ చెప్పిన మూడవ అంశం, కరెంట్ అకౌంట్ లోటు భర్తీ కావడం. ఈ విషయం అలా చెప్పే అవకాశం లేదు. ఎందుకంటే ఇందుకు సంబంధించిన గణాంకాల తాత్కాలిక అంచనాలు కూడా మూడు సంవత్సరాల తర్వాత కాని వెలుగు చూడవు. రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బులెటిన్ తాజా సంచిక (1993 ఏప్రిల్) 1990 ఏప్రిల్ – జూన్‌లకు

సంబంధించిన కరెంట్ అకౌంట్ గణాంకాలను ప్రకటించింది.

మొత్తం మీద తేలేదేమంటే ప్రభుత్వ నూతన ఆర్థిక విధాన చర్యల వరుసలో మొట్టమొదటి చర్య అది ప్రకటించిన ఏ ప్రయోజనాన్నీ సాధించలేదు. రుణం కోసం తలొగ్గి ఒకవైపు రూపాయి మారకపు విలువ తగ్గింపునూ, మరోవైపు దిగుమతి నిబంధనల సడలింపునూ ఏకకాలంలో ప్రకటించినందువల్ల మన దిగుమతులు పెరుగుతూపోయాయి. ఎగుమతులు ద్రవ్య రూపంలో పెరిగినట్టు కనిపించినా, నిజానికి యథాతథంగా ఉండిపోయాయి.

నిజంగా ఏలిన వారికి ఎగుమతులను పెంచాలని, దిగుమతులను తగ్గించాలనీ, విదేశీ వాణిజ్య లోటు పూడ్చాలనీ, చెల్లింపుల మిగులు సంక్షోభం నుంచి బయటపడాలనీ కోరిక ఉంటే అందుకు మార్గాలు లేకపోలేదు.

చెల్లింపుల మిగులు సంక్షోభం ఎందుకు వచ్చిందో తెలియాలంటే చరిత్ర తవ్వాలి. ఇన్ని సంవత్సరాల పారిశ్రామిక అభివృద్ధి తర్వాత మనం మనదైన సాంకేతిక పరిజ్ఞానాన్ని, ప్రపంచమంతా ఎదురు చూడగల వస్తువును ఎందుకు ఉత్పత్తి చేయలేకపోయామో ఆలోచించాలి. (ఒకప్పుడు, పారిశ్రామిక విప్లవానికి ముందు, బ్రిటిష్ వలసవాద ప్రవేశానికి ముందు ఆ ఘనత భారత ఆర్థిక వ్యవస్థకు ఉండేది). దిగుమతులలో మనం అవసరంగా దిగుమతి చేసుకుంటున్నవేమిటో బేరీజు వేసుకోవాలి. మనం దిగుమతుల వ్యయంలో అధిక భాగం ఆక్రమిస్తున్న రక్షణ వ్యయాన్ని తగ్గించుకోగలమా అని ఆలోచించుకోవాలి. ఈ దిశలో ఆలోచనా, ఆచరణా సాగితే కొంతలో కొంతయినా మన విదేశీ, వాణిజ్య లోటు పూడే అవకాశం కలుగుతుంది.

కాని పది, పదిహేను శాతం సంపన్న వర్గపు విలాసాల కోసం, ధనిక దేశాల సంపన్నులతో తులతూగే జీవన విధానాన్ని ఆకాంక్షించే ఒక అల్పసంఖ్యాక వర్గ ప్రయోజనాల కోసం దిగుమతులు సాగుతున్నంత కాలం, బోఫోర్స్ శతఘ్నుల నుంచి బాల్‌పెన్నుల దాకా, చివరికి ఆలూ చిప్స్ దాకా విదేశీ సాంకేతిక నైపుణ్యం మీద ఆధారపడుతూ, ఆ సాంకేతిక నైపుణ్యానికి వందల కోట్ల రూపాయలు రాయల్టీలు చెల్లిస్తున్నంత కాలం, ఆయా విదేశీ పారిశ్రామిక గృహాలకు, దేశీయ దళారులకు మేలు చేసేందుకే మన ఆర్థిక సామాజిక విధానాలు తయారవుతున్నంత కాలం ప్రత్యామ్నాయం గురించి ఆలోచించడం అత్యాశే కాదా?

***ఆంధ్రప్రభ, జూలై 9, 1993***



# 7

# 'అభివృద్ధి' కి మరోపేరు... అంకెల గారడీ?!

ఆ మధ్య ఒక బస్సు మీద రాష్ట్ర ప్రభుత్వ సమాచార శాఖ వారు రాయించిన చిత్రమైన బోర్డు కనబడింది. 'రాష్ట్రంలో గ్రామీణాభివృద్ధికి ముప్పై వేల కోట్ల రూపాయల ప్రణాళిక' అని ఆ ప్రకటన చెబుతున్నది. ఎనిమిదో ప్రణాళికలో రాష్ట్రానికి కేటాయించిన మొత్తం నిధులే పదకొండు వేల కోట్ల రూపాయలకు మించక పోతే, మూడు రెట్ల అంకెను ప్రచారం చేసుకోవడం ఎవరిని మోసం చేయడానికి?

అయితే ఈ ముప్పై వేల కోట్ల రూపాయలు అనే అంకె రాష్ట్రానికి వర్తించకపోయినా, జాతీయ స్థాయిలో ఎనిమిదవ పంచవర్ష ప్రణాళికలో అంత మొత్తాన్ని గ్రామీణాభివృద్ధి కోసం కేటాయిస్తున్నామని కేంద్ర ప్రభుత్వం ఒక సంవత్సరానికి పైగా ప్రచారం చేస్తూ వస్తోంది. చివరికి, అవిశ్వాస తీర్మానం పై చర్చలో ప్రధానమంత్రి పి.వి. నరసింహారావు ప్రతిపక్షాలు లేవనెత్తిన విమర్శలకు వేటికీ సూటిగా జవాబు చెప్పకుండా ఈ ముప్పై వేల కోట్ల రూపాయల కేటాయింపునే ప్రధానంగా చూపారు. 'నూతన ఆర్థిక విధానాల దుష్ఫలితాలను ఎదుర్కొనేందుకే, గ్రామీణాభివృద్ధి రంగానికే ముప్పై వేల కోట్ల రూపాయలు కేటాయించడం జరిగింద'ని ఆయన అన్నారు. (అంటే నూతన

పారిశ్రామిక, ఆర్థిక విధానాలు దుష్ఫలితాలిస్తాయనే విమర్శను ప్రభుత్వం అంగీకరిస్తూనే ఉన్నదన్నమాట!) ఈ కేటాయింపుతో సాలీనా 110 కోట్ల పనిదినాలు ఏర్పడతాయని కూడా ఏలినవారి అంచనాలు చెబుతున్నాయి.

**అంకెల గారడీ**

ఈ కేటాయింపులో మొట్టమొదట గుర్తించవలసిన అంశం అంకెల గారడీ. గత ప్రణాళికలలో వేరు వేరు కేటాయింపుల కింద ఉన్న నిధులను, ఈ ప్రణాళికలోనే వేరు వేరు కేటాయింపుల కింద గ్రామీణ వ్యయంతో సంబంధం ఉన్న నిధును అన్నిటికీ కలిపి ఈ ముప్పై వేల కోట్ల రూపాయలు అనే అంకె తయారు చేశారు. నిజానికి ప్రణాళికా గణాంకాలలో గ్రామీణాభివృద్ధి అనే పద్దు లేదు. ప్రధాన పద్దులలో వ్యవసాయం వగైరాలు, నీటి పారుదల, ఇంధన వనరులు, పరిశ్రమలు, ఖనిజాలు, గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలు, రవాణా, కమ్యూనికేషన్స్, సాంఘిక సేవలు వగైరా అనేవే ఉంటాయి. ఈ పద్దులలో వ్యవసాయం వగైరాలు అనే పద్దులో గ్రామీణాభివృద్ధి వ్యయం, ప్రత్యేక ప్రాంతాల కార్యక్రమాల వ్యయం కలిసి ఉంటాయి. ఎనిమిదవ పంచవర్ష ప్రణాళికలో ఈ ఇతర పద్దుల కేటాయింపులో ఉన్న 'వ్యయాలన్నిటినీ' కలిపి ప్రభుత్వం గ్రామీణాభివృద్ధి కేటాయింపుగా ప్రచారం చేసుకుంటోంది.

ఈ గారడీని కూడా పక్కనపెట్టి, ఇంకా కాస్త ముందుకు వెళ్లి పరిశీలిస్తే ఈ కేటాయింపు అసలు రహస్యం బయటపడుతుంది. పంచవర్ష ప్రణాళిక మొత్తానికి కేటాయించిన ఈ ముప్పై వేల కోట్ల రూపాయలు, సాలీనా ఆరు వేల కోట్ల రూపాయలవుతాయి. ఈ నిధిని ఆరు లక్షల గ్రామాలకు పంపిణీ చేస్తే సగటున ఒక్కొక్క గ్రామానికి ఒక్కొక్క సంవత్సరానికి లక్ష రూపాయలు అందుతాయి. ఈ నిధులతో గ్రామీణ ఉపాధి కల్పించడమే ప్రధాన లక్ష్యమని ప్రభుత్వం చెప్పుకుంటున్నది కనుక ఈ లక్ష రూపాయలతో గ్రామీణ ఉపాధి కార్యక్రమాలు నిర్వహిస్తే, గ్రామీణ సగటు శ్రామిక జనాభా 1035 గనుక తలసరి కేటాయింపు వంద రూపాయలలోపే అవుతుంది. అంటే సగటున వంద రూపాయల లోపు తలసరి కేటాయింపుతో ప్రభుత్వం ఏదో అత్యద్భుత గ్రామీణాభివృద్ధి వ్యూహం రచించిందన్నమాట!

**మరొక కోణం**

ఈ ప్రణాళికా వ్యయానికి మరొక ముఖం కూడా ఉంది. ఆడంబరమైన ప్రచారం పొందుతున్న ముప్పై వేల కోట్ల రూపాయల కేటాయింపులో 18,400 కోట్ల రూపాయల జవహర్ రోజ్‌గార్ యోజన కోసం నిర్దేశించబడ్డాయి. మొత్తం గ్రామీణాభివృద్ధి వ్యయంలో సగం కన్న ఎక్కువ ఆక్రమిస్తున్న జవహర్ రోజ్‌గార్ యోజన ఇంతవరకూ అనుకున్న ఫలితాలను సాధించలేదు. జవహర్‌లాల్ నెహ్రూ శతజయంతి సందర్భంగా 1989లో అప్పటి వరకూ సాగుతున్న జాతీయ గ్రామీణ ఉపాధి పథకం (ఎన్ఆర్ఇపి), గ్రామీణ జవహర్ రోజ్‌గార్ యోజన తయారు చేశారు.



ప్రణాళికా సంఘం పరిశోధనల ప్రకారం చూసినా జవహర్ రోజ్‌గార్ యోజన లక్ష్యం 1991-92లో 92 కోట్ల 91 లక్షల పనిదినాలను కల్పించడం కాగా 87 కోట్ల 45 లక్షల పనిదినాలను మాత్రమే కల్పించడం జరిగింది. ఈ ఉపాధి కల్పనకు కూడా ఆర్థిక, భౌతిక పరిమితులను ప్రభుత్వమే నిర్ణయించినందువల్ల, పది లక్షల బావుల పథకం, ఇందిరా ఆవాస్ యోజన వంటి కార్యక్రమాలు ఎక్కడ నిర్వహించాలో కేంద్ర స్థాయిలో, రాష్ట్ర స్థాయిలో నిర్ణయాలు జరుగుతుండడం వల్ల నిజంగా గ్రామీణ ప్రాంతాలకు అవసరమైన వనరులు సమకూరడం లేదు. గ్రామీణ నిరుద్యోగులకు ఉద్యోగ కల్పన జరగడం లేదు. లాభపడుతున్నదల్లా అధికారులు, కాంట్రాక్టర్లు, గ్రామీణ పెత్తందార్లు మాత్రమే! జవహర్‌రోజ్‌గార్ యోజన నిధుల్లో సగానికన్న ఎక్కువ కేవలం పంచాయత్ భవనాల, కమ్యూనిటీ హాళ్ల నిర్మాణానికి, లింక్ రోడ్లకు మాత్రమే ఖర్చయ్యాయని, వీటి వల్ల నిజంగా గ్రామీణ ప్రాంతాలలోని బడుగు వర్గాలకు ప్రయోజనమేమీ ఒనగూడలేదని ప్రణాళికా సంఘం చేసిన సమీక్షే ప్రకటించింది.

అంతేగాక, ఈ నిధుల వ్యయంలో 60 శాతం శ్రామికుల వేతనాల మీద ఖర్చు చేయాలని, 40 శాతం ముడిసరుకులు, పరికరాల మీద ఖర్చు చేయాలని ఇచ్చిన ఆదేశాన్ని ఎక్కడా పాటించలేదని ప్రణాళికా సంఘం గుర్తించింది.

గ్రామీణ ఉపాధి కల్పనలో మహిళలకు ప్రాధాన్యం ఇవ్వాలని ఎన్ని ఆదేశాలు ఇచ్చినప్పటికీ, గ్రామీణ మహిళా నిరుద్యోగులలో కేవలం ఏడు శాతం మందికి 1989-90లోనూ, నాలుగు శాతం మందికి 1990-91లో ఉపాధి లభించింది.

**అసలు సమస్య**

జవహర్ రోజ్‌గార్ యోజన అనుభవం తెలిపేది ఏమిటంటే గ్రామీణ ప్రాంతాల సామాజిక సంబంధాలు మార్చకుండా ఎన్ని కోట్ల రూపాయల నిధులు కేటాయించినా అవి ఆశించిన ఫలితాలను సాధించలేవని! అధికారవర్గపు ప్రయోజనాలు, ఇష్టాయిష్టాలు, అవినీతి, గ్రామీణ పెత్తందార్ల ఆధిపత్యం, గ్రామీణ అవసరాలతో సంబంధం లేని పథకాలు, దీర్ఘకాలిక దృష్టి లేని తక్షణ జనాకర్షక కార్యక్రమాలు, నిరుపేదల అభ్యున్నతి గురించి సమగ్ర ఆలోచన లేని కేవల 'ఉపాధి' కల్పనలు, శ్రామికుల పట్ల చిన్నచూపు, కుల అణచివేత, స్త్రీ పురుష అసమానత వంటి అనేకానేక సమస్యల్లో ఏ ఒక్క సమస్యనూ మౌలికంగా పరిష్కరించే ప్రయత్నం చేయకుండా ఎన్ని వందల, వేల కోట్ల నిధులను గుప్పించినా నిజమైన ప్రయోజనం ఉండదు. నిజానికి ఇటువంటి పథకాల ద్వారా సంపన్నులవుతున్న గ్రామీణ పెత్తందార్లు తమ అధికారాన్ని, ప్రాపకాన్ని పెంచుకుంటున్నందువల్ల గ్రామీణ సమస్యలు మరింత జటిలమవుతున్నాయి. గ్రామీణ సామాజిక సంబంధాలలో ఘర్షణ విస్తృతమవుతోంది.

సాధారణంగానే పరిస్థితి ఇలా ఉండగా, భారత ఆర్థిక, సామాజిక రంగాలలోకి నూతన ఆర్థిక విధానాలు ప్రవేశించాయి. ప్రజా పంపిణీ వ్యవస్థ సబ్సిడీలు తగ్గిపోవడం, గ్రామీణ,

వ్యవసాయ రుణ సౌకర్యాలు తగ్గిపోవడం, పేదరిక నిర్మూలనా కార్యక్రమాలు కాగితాలకే పరిమితమైపోవడం, భూ సంస్కరణల వంటి మౌలిక పరిష్కారాల గురించి చర్చ కూడా సమసిపోవడం, వ్యవసాయ ఉత్పత్తులు మార్కెట్‌కు, అంతర్జాతీయకరణ 'ఉచ్చులకు' లోబడి గ్రామీణ ప్రాంతాలలో వైరుధ్యాలు తీవ్రతరం కావడం నూతన ఆర్థిక విధానాల ఫలితాలలో కొన్ని!

ఈ ఫలితాల వల్ల క్రమక్రమంగా గ్రామీణ నిరుద్యోగం పెరిగిపోతుంది. సన్నకారు, చిన్నకారు, వ్యవసాయంతో మనుగడ అసాధ్యమైన చిన్న కమతాలు బీడు పడిపోవడమో, పెద్ద కమతాల గుప్పిట్లోకి వెళ్లిపోవడమో జరుగుతుంది. డంకెల్ ముసాయిదా అమలులోకి వస్తే జీవనాధార వ్యవసాయం అనే మాటే కాలం చెల్లినదయిపోతుంది. జీవనాధార పంటల్ని తోసేసి, బలవంతాన నీలిమందు పెంపకాన్ని ప్రోత్సహించి బ్రిటిష్ వాళ్లు తెచ్చిన క్షామాల్ని మించిన క్షామాలు మన పంట సీమల మీద వ్యాపిస్తాయి.

ఈ భయంకర చిత్రపటానికి ముప్ఫై వేల కోట్ల రూపాయల మాయ ముసుగు కప్పితే ప్రయోజనం ఏమీ లేదు.

***ఆంధ్రప్రభ, ఆగస్ట్ 5, 1993***



# 8

# ఎవరు చేసిన అప్పు ఇది...?

భారత దేశం విదేశాలకు రెండు లక్షల ఎనభై వేల కోట్ల రూపాయల బాకీ పడిందని, అయినా దేశ ఆర్థిక వ్యవస్థ అప్పుల ఊబిలో పడబోవడం లేదని ఆర్థిక మంత్రి డాక్టర్ మన్మోహన్ సింగ్ వాషింగ్టన్‌లో ప్రకటించారు.

భారతదేశపు విదేశీ రుణం గురించి వివరాలు, గణాంకాలు చాలా చిత్రంగా ఉంటాయి. సాధారణంగా భారత ప్రభుత్వం కచ్చితంగా విదేశీ రుణం ఎంతో ప్రకటించదు. వేరు వేరు పద్దుల కింద ఉండే విదేశీ రుణంలో ఏ కొన్ని పద్దులనో మాత్రం విడదీసి ప్రకటిస్తుంది. ఈ నేపథ్యంలో వాషింగ్టన్ లోనయినా ఆర్థిక మంత్రి ఇంచుమించుగా వాస్తవానికి దగ్గరగా ఉన్న అంకెను ప్రకటించడం ఆశ్చర్యకరం.

ఇంతవరకూ భారత విదేశీ రుణం గురించి దేశంలో ప్రధానంగా రెండు అంకెలు వెలువడుతుండేవి. ఒకటి భారత ప్రభుత్వ ఆర్థిక మంత్రిత్వ శాఖ వారిది, మరొకటి రిజర్వ్ బ్యాంక్ విడుదల చేసేది. అంతర్జాతీయంగా ప్రపంచ బ్యాంక్, ఐ.ఎం.ఎఫ్., ఒ.ఇ.సి.డి., బ్యాంక్ ఫర్ ఇంటర్నేషనల్ సెటిల్‌మెంట్స్ వంటి సంస్థలు వెలువరించే విదేశీ రుణ గణాంకాలు వేరు వేరుగా ఉండేవి.

ఇటువంటి వేరు వేరు గణాంకాల నుంచి వాస్తవిక గణాంకాలను కనిపెట్టేందుకు 1991 డిసెంబర్‌లో ఒక పాలసీ గ్రూప్‌ను రూపొందించారు. ఈ అధ్యయన బృందం 1992 మార్చ్‌లో ఒక నివేదికను సమర్పించిన తర్వాత విదేశీ రుణం విషయంలో కొంత గందరగోళం తగ్గింది. ఈ నివేదిక ప్రకారం భారతదేశపు విదేశీ రుణం 1991 మార్చ్ 31 నాటికి 99,753 కోట్ల రూపాయలు గాను, 1991 డిసెంబర్ 31 నాటికి 1,37,693 కోట్ల రూపాయలు గాను తేలింది. అయినప్పటికీ ఈ అంకెలు వాస్తవికమయినవి కావని, నిజానికి 1991 మార్చ్ నాటికి భారత విదేశీ రుణం 1,22,950 కోట్ల రూపాయలని, 1992 మార్చ్ నాటికి ఇది 1,98,967 కోట్లకు, 1992 సెప్టెంబర్ నాటికి 2,02,972 కోట్లకు పెరిగిందని స్వతంత్ర శాస్త్రవేత్తల అంచనాలు తెలుపుతున్నాయి. దీన్ని బట్టి సులభంగానే అర్థమయ్యేదేమంటే ఆర్థిక మంత్రి ప్రకటించిన అంకె పూర్తి వాస్తవం కాకపోయినా కనీసం కొన్ని వేల కోట్ల రూపాయలు అటూ ఇటూగా వాస్తవానికి దగ్గరగా ఉన్నదన్నమాట. ఆ అంకెనే ప్రాతిపదికగా తీసుకున్నా ఈ దేశ జనాభాలో ప్రతి ఒక్కరూ పిల్లా పాపా ముసలీ ముతకాతో సహా విదేశాలకు మూడున్నర వేల రూపాయల బాకీ తేలుతారు. కనుక ప్రతి ఒక్కరికి తాము ఎందుకీ అప్పు ఊబిలో పడవలసి వచ్చిందో ప్రశ్నించే అధికారం ఉంది.

## ఎక్కడిదీ అప్పు?

అందువల్ల ఈ అంకెల గందరగోళాన్ని, మాయాజాలాన్ని దాటి అసలీ అప్పు ఎక్కడి నుంచి, ఏ అవసరాల కోసం వచ్చిందో తెలుసుకోవాలి. ప్రైవేటు రుణదాతలు (ప్రధానంగా వాణిజ్య బ్యాంకులు), ధనిక దేశాల ప్రభుత్వాల అధీనంలోని ద్వైపాక్షిక ఆర్థిక సంస్థలు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ, ప్రపంచబ్యాంకు వంటి బహుళజాతి సంస్థలు ఈ అప్పులిచ్చాయి. ఇస్తున్నాయి. అందరు రుణదాతల్లాగనే ఈ మూడు రకాల రుణదాత సంస్థలు కూడా తమ అప్పుల మీద వడ్డీలు రాబట్టుకోవడానికి, లేదా రుణాల ద్వారా ఆయా దేశాల ప్రభుత్వాలను తమ గుప్పిట్లో పెట్టుకొని, ఆయా దేశాల మార్కెట్ల మీద ఆధిపత్యం సంపాదించడానికి ప్రయత్నిస్తాయి. అంటే నిజానికి ఈ అప్పుల విధానం కొనసాగడం అప్పు తీసుకునే వాళ్లకన్నా ఇచ్చే వాళ్లకే ఎక్కువ ప్రయోజనకరంగా ఉందన్నమాట. కనుక ఈ అప్పుల వ్యవస్థ ఇట్లాగే కొనసాగడం ఈ రుణదాతలందరికీ చాలా అవసరం.

అప్పు ఇచ్చేవాడు ఒకందుకు ఇస్తే తీసుకునే వాడు మరొకందుకు తీసుకోవడం సహజమే. భారతదేశం ఈ అప్పులు ఎందుకు తీసుకోవలసి వస్తున్నదో తెలుసుకోవలసిన అవసరం ఉంది.

భారతదేశం పైకి చెపుతున్న కారణాలు రెండున్నాయి. ఒకటి, అభివృద్ధి అవసరాలు, రెండు విదేశీ మారక నిలువలు పెంచుకోవడం, చెల్లింపుల లోటును పూడ్చుకోవడం.

నిజంగా భారత ప్రభుత్వం చేపడుతున్న అభివృద్ధి కార్యక్రమాలకు తగిన వనరులు



భారత ఆర్థిక వ్యవస్థలో లేవా అనేది మౌలికమైన ప్రశ్న. స్వీయ వనరులను దుబారా లేకుండా ఖర్చు పెట్టుకునే చిత్తశుద్ధి ఉంటే విదేశీ అప్పుల కోసం చూడవలసి వస్తుందా?

ఇంకా కొంచెం ముందుకు వెళ్లి పరిశీలిస్తే అసలు విదేశీ రుణాలుగా మనం తెచ్చుకుంటున్న నిధులలో మన చేతికి అందుతున్నది చాలా తక్కువ. విదేశీ ఖాతాలో మొత్తం రాబడికీ, నికర రాబడికీ చాలా తేడా ఉంటోంది. సిఎజి లెక్కల ప్రకారం 1985–86లో నికర రాబడి 43 శాతం ఉండగా, 1990–91 నాటికి అది 36 శాతానికి పడిపోయింది. ఇది ఇంకా పడి పోవచ్చునని సిఎజి అంచనా. అంటే ఇప్పుడు మనం వెయ్యి కోట్ల విదేశీ రుణం తెచ్చుకుంటే మన చేతికి అందేవి మూడు వందల అరవై కోట్ల రూపాయలు మాత్రమే. కాని మన ఖాతాలో వెయ్యి కోట్ల రుణమూ ఉంటుంది. ఏటేటా ఆ అసలులో కొంతా, వడ్డీ కట్టవలసి ఉంటుంది. కొన్నాళ్లకల్లా నికర రాబడి సున్నాకు పడిపోతుంది. లాటిన్ అమెరికా దేశాల్లో జరిగినట్టు నికర రాబడి ప్రతికూల దిశలో కూడా ఉండవచ్చు. అంటే అప్పు తేవడం అంటే అప్పిచ్చిన వాళ్లకే ఎదురు ఇచ్చినట్టు, వడ్డీలు చెల్లించడానికే అప్పు తెచ్చినట్టు అవుతుంది. దీన్ని బట్టి చూస్తే 'విదేశీ రుణం అభివృద్ధి కోసం' అనే వాదన అబద్ధమని తేలుతుంది.

## చెల్లింపుల లోటు

ఇక ప్రభుత్వం చెప్పే రెండో కారణం చూస్తే అది మన సామాజిక, ఆర్థిక వ్యవస్థలలోని అనేక అవలక్షణాలకు అద్దం పడుతుంది. చెల్లింపుల లోటు పెరిగిపోవడం వల్ల, విదేశీ మారకద్రవ్య నిలువలు తరిగిపోవడం వల్ల విదేశీ రుణాల కోసం పోక తప్పడం లేదని ప్రభుత్వం అంటోంది. కాని చెల్లింపుల లోటు ఎందుకు వచ్చింది? 1980–81 నుంచి 1984–85 వరకు ఏటేటా ఐదు శాతం మాత్రం పెరుగుతూ వచ్చిన వాణిజ్యలోటు (ఎగుమతి దిగుమతుల మధ్య వ్యత్యాసం) 1985–86లో ఒక్కసారిగా 30 శాతం పెరిగింది. అది 1988–89 నాటికి 100 శాతం పెరిగింది. 1990–91 నాటికి 125 శాతం పెరిగింది. అంటే ఈ లెక్కన దిగుమతులు పెరుగుతూ వచ్చాయన్న మాట.

రాజీవ్‌గాంధీ అధికారంలోకి వచ్చిన తర్వాత ప్రారంభమైన సరళీకృత విధానాల ఫలితమిది. స్వీయ సాంకేతిక పరిజ్ఞానంతో స్వావలంబన సాధించిన రంగాలలో కూడా దిగుమతులను ప్రోత్సహించడం, విదేశీ పెట్టుబడులను, సాంకేతిక పరిజ్ఞానాన్ని విచ్చల విడిగా ఆహ్వానించడం, అనవసరమైన వస్తువుల దిగుమతిని కూడా అనుమతించడం వంటి ఎన్నో చర్యలు ఈ చెల్లింపుల లోటు పెరిగిపోవడానికి దారితీశాయి.

కేవలం ముడుపుల కోసం, విదేశీ ఖాతాల కోసం, ఆకర్షణీయమైన దళారీ వృత్తి కోసం అలవాటు పడిన రాజకీయ నాయకులు – ఉన్నతాధికారుల ముఠా ఒకటి దేశ ఆర్థిక వ్యవస్థను హైజాక్ చేసింది. డాలర్ల అన్వేషణే ఏకైక జీవిత ధ్యేయం అయిపోయింది. ఈ దేశపు సగటు మానవుల జీవన ప్రమాణంతో ఏమాత్రం సంబంధం లేకుండా వాషింగ్టన్, న్యూయార్క్, లండన్,

పారిస్, టోక్యోల సంపన్న వర్గాల విలాసాలతో తులతూగే విలాసాలను ఢిల్లీలోనూ, బొంబాయిలోనూ సాధించుకోవాలనే తపన మొదలయింది. దేశ ఆర్థిక వ్యవస్థలో చెల్లింపుల సంక్షోభం తీవ్రతరం కావడానికి అసలు కారణం ఇది. గల్ఫ్ యుద్ధం కారణంగా చమురు ధరలు పెరగడమో, గల్ఫ్ నుంచి చెల్లింపులు తగ్గడమో, ప్రభుత్వాల మార్పు వల్ల ఆర్థిక వ్యవస్థలో అస్థిరత ఏర్పడడమో ఈ అసలు కారణానికి జతపడి ఉండవచ్చును కాని అవి ప్రధాన కారణాలు కావు.

### ప్రత్యామ్నాయం ఏమిటి?

ఇప్పుడు మనకు ఏటేటా అందుతున్న విదేశీ రుణం ఐదారు వేల కోట్ల రూపాయలనుకుంటే దాంట్లో నిజానికి మనకు చేరే నికర రుణం పదిహేను వందల కోట్ల రూపాయలకు మించడం లేదు. మన జాతీయాదాయంలో అన్నిటికన్నా చిన్న పద్దు అయిన చేపల పెంపకపు ఆదాయానికి ఇది సమానం. అటువంటప్పుడు కేవలం వడ్డీలు తీర్చేందుకే కొత్త అప్పులు చేసే బదులు పాత అప్పుల అసలు వాయిదాలు, వడ్డీలు ఇప్పటివరకు తీర్చినవే ఎక్కువని, ఇక తీర్చే అవసరం లేదని చేతులు ఎత్తడం ఉత్తమమైన పని.

నిజానికి 1982లో అర్జెంటీనా, మెక్సికో, బ్రెజిల్‌లు ఈ పనిచేసిన తర్వాత కాబూలీవాలా దేశాలన్నీ బెంబేలెత్తిపోయాయి. ఇవ్వగలిగినంత ఇమ్మని కాళ్ల బేరానికి వచ్చాయి. బ్రాడీప్లాన్‌లాంటి అనేక పథకాలు తయారు చేశాయి. అట్లా అప్పు ఎగ్గొడితే సంపన్న దేశాలు మూడోకన్ను తెరచి మసి చేస్తాయేమోనన్న భయం నిరాధారమని తేలిపోయింది. ఇక మళ్లీ అప్పు పుట్టదేమోనన్న వాదనలో కూడా పసలేదని, ఇప్పుడు పుడుతున్న అప్పు కూడా వడ్డీ తీర్చడం కోసం కాగితం మీద పుడుతున్నది మాత్రమేనని తేటతెల్లమైపోయింది.

ఇక పేద దేశాలు అప్పు ఎగ్గొట్టి కష్టాలు ఎదుర్కోలేదు కాని, అవి అట్లా దూరం తొలగిపోతే తమకు మార్కెట్లు కరవైపోతాయని పెద్ద దేశాలే తలకిందులయిపోయాయి. భారతదేశం లాంటి పెద్ద మార్కెట్ అటువంటి మాట కనీసం బెదిరింపుగానైనా అంటే, కాళీపట్నం రామారావు గారి 'యజ్ఞం'లో శ్రీరాములునాయుడు పడినంత ఇబ్బంది పెద్ద దేశాలు, ఆయా దేశాల బహుళజాతి సంస్థలు, వాటి ముసుగు సంస్థలయిన అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు పడతాయి. కాని 'ఈ అప్పు ఎట్లా వచ్చిందో చెప్పు' అని నిలదీయగలిగిన అప్పుల్రాముడేడీ?

***ఆంధ్రప్రభ, అక్టోబర్ 15, 1993***



# 9

# నూతన ఆర్థిక విధానాలు - విద్యారంగం

నూతన ఆర్థిక విధానాల ఫలితంగా విద్యా విధానం ఏయే మార్పులకు లోను కాబోతోందనే ప్రశ్న సహజంగానే ఆలోచనా పరులందరినీ కలవరపరుస్తోంది. పాలకులు తాము తేదలచిన మార్పులను విద్యా విధానంలో ముందుగా విస్తృతంగా ప్రవేశపెడతారు. తద్వారా ప్రజల ఆలోచనా సరళిలో తమకు అనుకూలమైన మార్పులు తేవడానికి ప్రయత్నిస్తారు. అంటే ఒక తరం గడిచే సరికి ఆ ప్రత్యేక విధానాలకు ఉండగల ప్రతిఘటన క్షీణిస్తుంది. ఇది పాలకుల దీర్ఘకాలిక ప్రయోజనం కాగా, తక్షణమే అమల్లోకి వచ్చే ఫలితాలు కూడా తీవ్రంగా చర్చించవలసినవే.

రాజీవ్‌గాంధీ కాలంలో ప్రారంభమైన 'ఆర్థిక సడలింపు' విధానాలతో పాటుగానే నూతన విద్యా విధానం కూడా ప్రకటించబడింది. ఆ విద్యా విధానం ఫలితంగా విద్యా వ్యవస్థలో వచ్చిన మార్పుల గురించి ఇదివరకు చాలా పరిశీలనలు వచ్చాయి. రాజీవ్‌గాంధీ ప్రారంభించిన 'ఆర్థిక సంస్కరణల'నే పి.వి. నరసింహారావు – మన్మోహన్‌సింగ్ ఇంకా పెద్ద ఎత్తున 1991లో కొనసాగించారు.

ఐ.ఎం.ఎఫ్., ప్రపంచబ్యాంక్ వంటి అంతర్జాతీయ ఆర్థిక సంస్థల

ఒత్తిడి, గాట్ ఉరుగ్వే చర్చలను ముగించాలని సామ్రాజ్యవాద ప్రభుత్వాలు, బహుళజాతి సంస్థలు చేసిన ప్రయత్నాలు, సోవియట్ శిబిరం కూలిపోయి, ప్రచ్ఛన్న యుద్ధం అనబడేది ముగిసి, సామ్రాజ్యవాదం మరిన్ని మార్కెట్లను స్వాధీనం చేసుకోవడానికి ముందుకు రావడం, భారత పాలకవర్గాలు తమ ఎజెండా నుంచి నామమాత్రపు సంక్షేమ పథకాలను కూడా తొలగించడం వంటి అనేక అంతర్జాతీయ, జాతీయ పరిణామాలు ఈ 'నూతన ఆర్థిక విధానాల' పేరుతో అమలువుతున్న విధానాలకు పునాది.

ఈ మూడున్నర సంవత్సరాలలో భారత ఆర్థిక వ్యవస్థలో చాల మార్పులు జరిగిపోయాయి. ఆర్థిక వ్యవస్థ మౌలిక స్వభావం మారక పోయినా, దాని స్వరూపం మాత్రం చాలా మారింది. ఈ నేపథ్యంలో, విద్యావ్యవస్థలో జరిగిన, జరుగుతున్న మార్పులను పరిశీలించాలి. నూతన ఆర్థిక విధానాల ఫలితంగా విద్యావ్యవస్థలో వచ్చిన మార్పులలో ప్రధానమైనది ప్రైవేటీకరణ. విద్యావ్యవస్థలో ప్రైవేటు పెట్టుబడి గతంలో కూడా ఉన్నప్పటికీ ఒక దశాబ్దంగా సాగుతున్న ప్రైవేటీకరణకు కొన్ని స్పష్టమైన, ప్రమాదకరమైన ఫలితాలున్నాయి.

నూతన ఆర్థిక విధానాలలో, అవి అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు నిర్దేశించినవయినా, స్వయంగా మన పాలకులే నిర్ణయించుకున్నవయినా, ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించడం ప్రధానమైనది. వనరులను సక్రమంగా వినియోగించడం పేరుతో ప్రభుత్వ వ్యయంలోని సంక్షేమ పథకాల పద్దులన్నిటి పైనా కోత విధించడం ఈ క్రమంలో భాగం. ఒకవైపు రక్షణ వ్యయాన్ని పెంచుతూ మొత్తం మీద ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించాలంటే తప్పనిసరిగా ఏవో కొన్ని పద్దులను కత్తిరించక తప్పదు. పాలకుల కత్తెరకు సులభంగా దొరికే పద్దులు విద్య, వైద్య, ఆరోగ్యాలు, సబ్సిడీలు వంటి సంక్షేమ పథకాలకు సంబంధించినవే.

అందువల్ల మొట్టమొదట, విద్యారంగానికి ప్రభుత్వ కేటాయింపులు తగ్గిపోయాయి. ఉన్నత విద్యకు అందే నిధులే తగ్గిపోయాయంటే, ప్రాథమిక విద్య సంగతి చెప్పనక్కరలేదు. విశ్వవిద్యాలయ నిధుల సంఘం ప్రత్యక్ష పర్యవేక్షణలో ఉండే ఢిల్లీ విశ్వవిద్యాలయానికి కేటాయింపులు తగ్గిపోయినందువల్ల, విశ్వవిద్యాలయాన్ని నిర్వహించలేకపోతున్నామని వైస్ ఛాన్సలర్ ఉపేంద్ర బక్షీ రాజీనామా చేశారంటే పరిస్థితి ఎంత తీవ్రంగా ఉందో అర్థం చేసుకోవచ్చు.

నిజానికి సాధారణంగా విద్యారంగానికి ప్రభుత్వం ఇచ్చే నిధులలో ఎక్కువ భాగాన్ని ఉన్నత విద్యకే ఇస్తుంది. చాల ఎక్కువ నిధులు అవసరమైన ప్రాథమిక విద్యారంగానికి మాత్రం అతి తక్కువ కేటాయింపులుంటాయి. ఇక ఉన్నత విద్య పరిస్థితే వైస్ ఛాన్సలర్ రాజీనామా చేయవలసినట్టుగా ఉంటే, ఇప్పటికి కనీస సౌకర్యాలు కరువైన ప్రాథమిక విద్యా సంస్థలు మూతపడక తప్పదు.

అయితే ఇందుకు కారణం నిధుల కొరతో, బడ్జెట్ లోటును తగ్గించవలసి రావడమో మాత్రమే కాదు. రక్షణ శాఖ కేటాయింపులు ఏడాదికేడాది పెరుగుతున్నాయంటే అసలు సమస్య నిధుల కొరత గాని, బడ్జెట్ లోటు గాని కాదని అర్థం చేసుకోవచ్చు.



అసలు విషయం ప్రపంచ బ్యాంకు దాదాపు ఒక దశాబ్దంగా ప్రకటిస్తూ వస్తున్న అనేక నివేదికలలో మూడు రకాల సూచనలు చేస్తూ వస్తోంది. ఒకటి, విద్యారంగం కూడా మిగిలిన అన్ని రంగాల లాంటిదే. కనుక విద్యారంగంలో కూడా ఆదాయ వ్యయాలను సక్రమంగా అంచనా వేసి వ్యయాన్ని వినియోగదారుల నుంచి రాబట్టాలి. రెండు, విద్యారంగంలో పెద్ద ఎత్తున పెట్టుబడులు పెట్టి ప్రభుత్వం సాధన సౌకర్యాలు ఏర్పాటు చేసే బదులు, అనియత, దూర విద్యా పద్ధతులకు ప్రాధాన్యం ఇవ్వాలి. మూడు, మామూలు, సాంప్రదాయిక విద్యా శిక్షణకు భిన్నంగా, పారిశ్రామిక అవసరాలను తీర్చే విద్యా శిక్షణకు ప్రాధాన్యం ఇవ్వాలి.

ఈ మూడు సూచనలనూ వివరంగా విశ్లేషిస్తేగాని, వాటి ఫలితాలేమిటో అర్థం చేసుకోలేం.

మొట్టమొదటి సూచన విద్యారంగాన్ని వ్యాపార రంగంగా మార్చడానికి, ప్రైవేటు పెట్టుబడుల ప్రవేశానికి దారితీసింది. విద్యారంగం మిగిలిన అన్ని రంగాల లాంటిదేనని అనడం, అందువల్ల అందులో వ్యాపారీకరణకు వీలు కల్పించాలనడం సామాజిక శ్రేయస్సుతో ఏ మాత్రం సంబంధంలేని పెట్టుబడిదారీ లాభాపేక్ష నుంచి పుట్టిన ఆలోచన. విద్యా రంగం భవిష్యత్ తరాలకు శిక్షణ ఇచ్చే ఒక సామాజికీకరణ సాధనం. ప్రస్తుతం కొనసాగుతున్న విద్యావ్యవస్థ ఎంత వరకు సామాజిక శ్రేయస్సు ఆలోచనలను విద్యార్థులకు అందజేస్తున్నదనేది వేరే చర్చ. కాని కనీసం అది విద్యావ్యవస్థకు ఆదర్శంగా ఉండవలసి ఉంటుంది. సామాజిక శ్రేయస్సును కొలవడం అసాధ్యం గనుక ఇక్కడ ఖర్చు – రాబడి లెక్క తేల్చడం కష్టం. సాధన సౌకర్యాల మీద పెట్టే ఖర్చు కనబడుతుంది గాని విద్యార్థుల శిక్షణ వల్ల సమాజం పొందుతున్న ప్రయోజనం అంకెల్లో కనపడదు.

ఇటువంటి వ్యవస్థను వ్యాపారీకరించడం అంటే ఖర్చును తేల్చినట్టుగానే, రాబడిని తేల్చాలని, ఖర్చుతో సమానంగానో ఎక్కువగానో రాబడిని రాబట్టాలని అర్థం. అంటే ప్రతి విద్యార్థి తన చదువుకు తానే (తన కుటుంబం ఆదాయంలోంచి) పెట్టుబడి పెట్టుకోవాలి. విద్య ఒక సామాజిక సంస్థ స్థానం నుంచి తప్పుకుని వ్యక్తిగత ఆస్తి అయిపోతుంది.

ఈ పరిణామం ఇప్పటికే మన సమాజంలో అమల్లోకి వచ్చి కొనసాగుతూనే ఉంది. దీన్ని ఇంకా విస్తృతం చేయాలనీ, ప్రపంచ బ్యాంకు సూచిస్తోంది.

దానితో ఉన్నత విద్య వ్యయం ఎన్నో రెట్లు పెరిగిపోతుంది. ఆ వ్యయమంతా పూర్తిగా విద్యార్థే భరించాల్సి వస్తుంది. విద్య పెట్టుబడిదారుల లాభార్జన సాధనంగా మారిపోతుంది. ఇట్లా ఫీజు పెరిగిపోవడం వల్ల కేవలం ఉన్నత వర్గాల, అగ్రవర్ణాల విద్యార్థులకు మాత్రమే ఉన్నత విద్యావకాశాలు దొరుకుతాయి. అట్లాగే స్త్రీలు ఉన్నత విద్యకు వెళ్లే అవకాశాలు తగ్గిపోతాయి.

మొత్తం మీద విద్యావ్యవస్థలోని ఒక ముఖ్యమైన భాగం కేవలం కొన్ని వర్గాల గుత్తాధిపత్యం కిందికి వెళ్లిపోతుంది. ఈ విద్యారంగం వైద్యులను, ఇంజనీర్లను, వ్యవస్థా నిర్వాహకులను తయారు చేసేది గనుక ఆయా వృత్తులలోకి కింది వర్గాల నుంచి ప్రాతినిధ్యం లేకుండా పోతుంది.

ఆయా వృత్తులు సేవారంగానికి చెందినవయితే వాటి వెల విపరీతంగా పెరిగిపోతుంది.

మరోవైపు పెట్టుబడిదారీ వర్గానికి పూర్తి నిరక్షరాస్యత కూడ ఇబ్బందికరమైన వ్యవహారమే. కనుక పెట్టుబడి అవసరాలను తీర్చడానికైనా ప్రజలకు కనీసం చదవగల, రాయగల విద్య రావాలి. ప్రధానంగా పరిశ్రమలలో కింది వృత్తులు చేయడానికి అవసరమైన నైపుణ్యం రావాలి. ఈ అవసరాల నుంచి ప్రపంచ బ్యాంక్ చేసిన ఇతర సూచనలు వచ్చాయి.

ఒకవైపు ఉన్నత విద్యకు నిధులు తగ్గించమంటున్నప్పుడు, ఆ నిష్పత్తిలోనే ప్రాథమిక విద్యకు కూడా నిధులు తగ్గిపోతాయని ప్రపంచబ్యాంకుకు తెలుసు. అందువల్ల ప్రాథమిక విద్యకు ప్రాధాన్యత ఇవ్వాలని, 'అందరికీ విద్య' పథకం అమలు చేయాలనీ, అక్షరాస్యత పెంచాలనీ, ప్రభుత్వం మీద ప్రపంచ బ్యాంకు ఒత్తిడి తెస్తోంది. అంటే ప్రాథమిక స్థాయిలో పాఠశాలలు పెంచమనీ, ఉపాధ్యాయుల సంఖ్య పెంచమనీ, పాఠశాలల్లో సౌకర్యాలు కల్పించమనీ అర్థం కాదు; విద్యా వ్యవస్థ నిర్మాణానికి బైట, అనియత విద్యారంగంలో ఎక్కువ కృషి చేయమని.

అనియత విద్యారంగం అభివృద్ధి వల్ల సాధన సౌకర్యాలు కల్పించనవసరం లేదు. ఉపాధ్యాయుల ఉద్యోగాలను పెంచవలసిన అవసరం లేదు. విద్యార్థుల ప్రగతి గురించి ఆలోచించనవసరం లేదు. 'కర్మణ్యే వాధికారస్తే' అన్నట్టు అక్షరాలు, సంతకం నేర్పితే చాలు. మనిషిలో సహజంగా ఉండే కుతూహలం వల్ల స్వయంగా నేర్చుకున్న వాళ్లు పెట్టుబడిదారీ పరిశ్రమలకు ముడిసరుకులవుతారు. అట్లా వాళ్లు ఏ ఏడో తరగతో, పదో తరగతో పూర్తి చేస్తే అప్పుడు మళ్లీ ప్రపంచ బ్యాంకుకు మరొక సూచన సిద్ధంగా ఉంది.

ఐటిఐలు, పాలిటెక్నిక్‌లు వంటి వృత్తి విద్యలకు ప్రాతినిధ్యం ఇవ్వాలనేది ప్రపంచ బ్యాంకు చేసిన మూడో సూచన. పారిశ్రామిక రంగంలో, టెలికమ్యూనికేషన్స్, కంప్యూటర్స్ వంటి రంగాలలో కింది స్థాయి ఉద్యోగాలకు అవసరమైన కనీస శిక్షణ ఇచ్చే విద్య గరపాలని ఈ సూచన అర్థం.

అనియత, దూర విద్యా వ్యవస్థలను అభివృద్ధి చేయడం, వృత్తి విద్యల ప్రాధాన్యం వాటికవిగా వ్యతిరేకించాల్సిన అంశాలేమీ కావు. కాని వాటి వెనుక ఉన్న లక్ష్యాలను, వాటి ఫలితాలను విశ్లేషించినప్పుడు అవి ఎట్లా ఈ దేశంలో సామ్రాజ్యవాద అవసరాలు తీర్చడానికి వస్తున్నాయో అర్థం అవుతుంది.

ఈ ప్రధాన సూచనలతో పాటు ప్రపంచ బ్యాంకు – ఐ.ఎం.ఎఫ్. మూడో ప్రపంచ దేశాల విద్యా వ్యవస్థలలో చేసుకుంటున్న జోక్యంలో పాఠ్య పుస్తకాల రచన, పాఠ్యాంశాల నిర్ణయం దగ్గరి నుంచి మార్చడం దాకా అనేక పరిణామాలున్నాయి.

ఈ నేపథ్యంలో విద్యా వ్యవస్థను సామాజిక శ్రేయోరంగంగా, స్వావలంబనకు సాధనంగా, ప్రజల సృజనాత్మక శక్తులను విడుదల చేసే మార్గంగా గుర్తించే ప్రజాతంత్ర శక్తులు ఈ పరిణామాలను వ్యతిరేకించవలసి ఉంది. ఈ పరిణామాలు విద్యను సామాజిక శ్రేయోరంగంగా కాక వ్యాపార రంగంగా పరిగణిస్తాయి. విద్యార్థులలో స్వావలంబన ఆదర్శాలకు భిన్నంగా



సామ్రాజ్యవాద అనుకూల, బహుళజాతి సంస్థల అనుకూల విషాన్ని ప్రవేశపెడతాయి. ప్రజలకు సృజనాత్మక శక్తి ఉండదని, ఉన్నత వర్గాల మేధ నుంచి, కంప్యూటర్ల నుంచి పుట్టే సృజన శక్తిని ప్రజలు కేవలం అనుకరించవలసిందేనని ఈ పరిణామాలు భావిస్తాయి. అందువల్ల ఈ పరిణామాలను భావజాల స్థాయిలోనూ, ఆచరణ స్థాయిలోనూ కూడ తీవ్రంగా ప్రతిఘటించవలసి ఉంది.

***ఉపాధ్యాయ, మార్చ్ 1995***

# 10

# కార్మికోద్యమంలో కొత్త అలలు

భారత కార్మికోద్యమంలో మొత్తంగా ఎక్కడ చూసినా కొత్త గాలులు వీస్తూ ఉండడం ఈ దశాబ్దపు ప్రధాన లక్షణంగా కనబడుతుంది. ఈ కొత్త సంచలనాలు నూతన ఆర్థిక విధానాల ఫలితాలయినా కావచ్చు. లేదా పెరుగుతున్న సామాజిక సంక్షోభంలో కార్మికవర్గం అన్వేషిస్తున్న కొత్త మార్గాలయినా కావచ్చు. ఈ నూతన ధోరణులను అర్థం చేసుకుని, విశ్లేషించుకుని తగిన పాఠాలు తీసుకోవడం ఇవాళ కార్మిక వర్గం ముందు ఉన్న కర్తవ్యం.

ఒక విడి ఫ్యాక్టరీ దగ్గరి నుంచి ప్రారంభించి దేశ వ్యాప్తంగా విస్తరించిన విశాల కార్మికవర్గం దాకా ఇప్పుడు ఆందోళనా రూపాలలో ఒక కొత్త ధోరణి కనబడుతున్నది. ఏ ఒక్క కేంద్ర కార్మిక సంఘం ఆధిపత్యంలోనో కాక తామే స్వయంగా సంయుక్త కార్యాచరణ కమిటీలుగా ఏర్పడి ఆందోళనలు చేపట్టడానికి కార్మికులు అంతకంతకూ ఎక్కువగా ముందుకు వస్తున్నారు. ఫ్యాక్టరీ కమిటీ, పోరాట కమిటీ, సమ్మె కమిటీ, కార్యాచరణ కమిటీలుగా వేరు వేరు పేర్లతో ముందుకు వస్తున్న ఈ కొత్త నిర్మాణ రూపాలు ఇప్పటికే బలపడి ఉన్న అన్ని కేంద్ర కార్మిక సంఘాల నాయకత్వాన్ని తిరస్కరిస్తున్నాయి. అన్ని సంఘాలలోని సమరశీల శక్తులు, ఏ సంఘాలతో సంబంధం లేని శక్తులు ఈ నిర్మాణ



రూపాలకు నాయకత్వం వహిస్తున్నాయి. ఈ కొత్త నిర్మాణ రూపాలు కచ్చితంగా పాత కేంద్ర కార్మిక సంఘాల కన్న ఎక్కువ ప్రజాస్వామిక నిర్ణయాల ప్రకారం ఆందోళనలు చేపడుతున్నాయి. ఎక్కువ మిలిటెంట్‌గా పోరాటాలు నిర్వహిస్తున్నాయి. గుర్తింపు పొందిన యూనియన్ల నుంచి వ్యతిరేకత ఉన్నప్పటికీ, యాజమాన్యాలు, పోలీసులు, కార్మిక శాఖలు అడుగడుగునా అడ్డంకులు కల్పిస్తున్నప్పటికీ ఈ పోరాటాలు నానాటికీ బలం పుంజుకుంటున్నాయి.

ఈ పరిణామంలో అన్నిటికన్న ముఖ్యంగా గుర్తించవలసినది కార్మికుల చొరవ. కార్మికులు తమ నిత్యజీవిత సమస్యలపైన నానాటికీ ఎక్కువగా పోరాటాలు చేపట్టడానికి ముందుకొస్తున్నారు. గతంలో లాగా కేంద్ర కార్మిక సంఘ నాయకులపై నమ్మకం ఉంచి వారు ఇచ్చిన ఆదేశాన్నల్లా విశ్వాసపాత్రంగా పాటించడం కాకుండా, తమంతట తామే నిర్ణయాలు తీసుకుంటున్నారు. ఆ నిర్ణయాలు అమలు చేయడానికి స్థిరంగా, దృఢంగా నిలుస్తున్నారు. ఆ విధంగా కార్మికులలో ఇంతకాలం అణగి ఉన్న సృజనాత్మక, సమరశీల స్వభావం ఈ పోరాటాలలో బైటపడుతున్నాయి.

ఈ పరిణామాలలో గుర్తించదగిన మరొక అంశం కేంద్ర కార్మిక సంఘాల దివాళా కోరు విధానాల పట్ల కార్మికులలో వ్యక్తమవుతున్న వ్యతిరేకత. ఇంత కాలం ఆయా రాజకీయ పార్టీలకు అనుబంధంగా అన్ని కేంద్ర కార్మిక సంఘాలు, తమ పార్టీల ప్రయోజనాలకు అనుగుణంగానే విధానాలను నిర్ణయించుకున్నాయి. ఎప్పుడైనా ఆందోళనా రూపాలు చేపట్టినా, వాటిని పార్టీలకు అనుకూలంగా మలుపులు తిప్పాయి. ఈ కారణాల వల్ల కార్మిక సంఘాల పని తీరుపట్ల కార్మికులలో నిరాసక్తత ప్రబలింది. అత్యధిక సంఖ్యాక కార్మికులు నామమాత్రంగా ఏదో ఒక సంఘంలో సభ్యులయినా, సంఘ కార్యకలాపాలలో క్రియాశీలంగా పాలుపంచుకోకుండా ఉండి పోయారు. మొత్తం కార్మిక వర్గాన్ని ప్రభావితం చేసే నిర్ణయాలు ఎవరో కొందరు కార్మిక సంఘ పెత్తందార్లు తీసుకునే స్థితి వచ్చింది.

మొత్తం మీద కార్మిక సంఘం కార్యకలాపాలు కార్మికులతో సంబంధం లేని, కార్మికుల పని పరిస్థితులతో గాని, నిత్య జీవిత సమస్యలతో గాని ప్రమేయం లేని వ్యవహారాలయిపోయాయి. సంఘ కార్యకలాపాలను ప్రజాస్వామికంగా నడపకపోవడంలోనే తమ ప్రయోజనాలు ఇమిడి ఉన్న నాయకులు ఈ స్థితిని ఇంకా పెంచి పోషించారు. అయితే ఇటువంటి కార్మిక వ్యతిరేక విధానాలు చాలా కాలం కొనసాగడం సాధ్యం కాదు. కార్మికులలో రోజువారీ సమస్యలే తిరుగుబాటు చైతన్యాన్ని ప్రవేశపెడతాయి. తీవ్రతరమవుతున్న రాజకీయార్థిక సంక్షోభం తప్పనిసరిగా కార్మికులను విప్లవీకరించి తీరుతుంది.

నూతన ఆర్థిక విధానాల వల్ల అస్తవ్యస్తమయిన ఆర్థిక పరిస్థితి నిజంగానే కార్మికులలో విప్లవ చైతన్యం కలిగించింది. ఇన్నాళ్లుగా తమను అణచి ఉంచిన, ప్రేక్షకులుగా మార్చిన కేంద్ర కార్మిక సంఘాల కుట్రలను, యాజమాన్య అనుకూలతను కార్మికులు గుర్తించడం ప్రారంభించారు. క్రమక్రమంగా కార్మికుల సమరశీలత కొత్త కొత్త నిర్మాణ, పోరాట రూపాలు సంతరించుకోవడం ప్రారంభించింది.

కొత్త నిర్మాణ, పోరాట రూపాలలో ముఖ్యమైనది, దివాళా తీసిన ప్రభుత్వరంగ సంస్థలను తాము నడుపుతామని కార్మికులు ముందుకు రావడం. ఇది కార్మికులే స్వయంగా ముందుకు తీసుకుని వచ్చిన ప్రత్యామ్నాయం. నిజంగా యంత్రాల మీద పనిచేసేదీ, ఉత్పత్తి క్రమాన్ని నిర్వహించేదీ, మొత్తంగా పరిశ్రమలో ఎక్కడ ఎట్లా సమర్థవంతంగా నడపవలసింది తెలిసేదీ కార్మికులకే గనుక పరిశ్రమలు కార్మికుల నిర్వహణలో మాత్రమే సరిగా నడిచే అవకాశం ఉంది. ఈ ప్రత్యామ్నాయాన్ని సూచించి, తామే అందుకు పూనుకుని, మూసివేతల నుంచి పరిశ్రమలను కాపాడవలసిన కార్మిక సంఘాలు నిర్లిప్తంగా ఉండిపోయినప్పుడు కార్మికులే ఈ పనికి పూనుకున్నారు. తద్వారా కేవలం తమ ఉద్యోగాలను రక్షించుకోవడం మాత్రమే కాదు, పరిశ్రమనూ రక్షించారు. కార్మికోద్యమంలో ఒక ఉజ్వల సహకార ఘట్టానికి నాంది పలికారు.

నూతన ఆర్థిక విధానాల ఫలితంగా డిజిన్వెస్ట్‌మెంట్, రిట్రెంచ్‌మెంట్, వాలంటరీ రిటైర్‌మెంట్ స్కీమ్, గోల్డెన్ షేక్ హాండ్, యాంత్రీకరణ వంటి అనేక కార్మిక వ్యతిరేక చర్యలు ప్రారంభమయ్యాయి. ఈ చర్యలను కేంద్ర కార్మిక సంఘాలు కేవలం నామమాత్రంగా, తూతూ మంత్రంగా నిరసిస్తున్నాయే గాని ఒక దృఢమైన దేశవ్యాప్త ఉద్యమాన్ని నిర్మించడానికి పూనుకోవడం లేదు. ఈ నేపథ్యంలో, కార్మికులు తమ తమ సభ్యత్వాలకు అతీతంగా సంయుక్త కార్యాచరణ కమిటీలు ఏర్పాటు చేస్తున్నారు. ఈ కమిటీలు గతంలో కన్న భిన్నమైన పోరాట రూపాలు చేపడుతున్నాయి. స్థిరమైన పోరాటాలు చేస్తున్నాయి.

అయితే, ఈ ఆహ్వానించదగిన పరిణామాలతో పాటే, కార్మికులలో ఒక అవాంఛనీయమైన ధోరణి తలెత్తుతోంది. కేంద్ర కార్మిక సంఘాల పట్ల వ్యతిరేకత అసలు రాజకీయాల పట్ల వ్యతిరేకతగా మారుతోంది. నిజానికి కేంద్ర కార్మిక సంఘాలు, ముఖ్యంగా వామపక్ష కార్మిక సంఘాలు, ఎన్నడూ నిజమైన కార్మిక వర్గ రాజకీయాలను అమలు చేయలేదు. కనుక ఆ సంఘాల పట్ల వ్యతిరేకత నిజమైన కార్మిక వర్గ రాజకీయాల పట్ల వ్యతిరేకతగా మారనవసరం లేదు. ఈ అంశాన్ని కార్మిక బాహుళ్యం చేత గుర్తింపజేయడం కొత్త పోరాటాల నాయకత్వపు బాధ్యత.

***శ్రమజీవి, జనవరి - మార్చ్ 1997***



# 11

## అదనపు వనరుల కోసం అప్పు తప్ప గత్యంతరం లేదా?

రాష్ట్ర ప్రభుత్వం వేరు వేరు పథకాల కింద ప్రపంచ బ్యాంకు నుంచి పదివేల కోట్ల రూపాయలు అప్పు తెచ్చింది. ఇతర అంతర్జాతీయ సంస్థల నుంచి మరొక నాలుగైదు వేల కోట్ల రూపాయలు తెచ్చింది. దాదాపు ప్రతిరోజూ ఏదో ఒక బహుళజాతి సంస్థ పెట్టుబడులను ఆహ్వానిస్తూ ప్రభుత్వం ప్రకటన చేస్తోంది. ఈ మొత్తం అప్పుల సేకరణ వ్యవహారంలో రాష్ట్ర ప్రభుత్వానికి ప్రపంచ బ్యాంకు మార్గదర్శకత్వం వహిస్తోంది.

రాష్ట్ర ప్రభుత్వం అప్పుకోసం, సలహాల కోసం ప్రపంచ బ్యాంకు దగ్గరికి ఎందుకు వెళ్లిందనేది మొదటి ప్రశ్న. రాష్ట్ర ప్రభుత్వ ఆదాయం కన్నా వ్యయం ఎక్కువగా ఉందని, కొత్త ఆదాయ వనరులను సమకూర్చుకోవడంలో రాష్ట్ర ప్రభుత్వం విఫలమవుతోందని, అందువల్ల అప్పు కోసం వెళ్లక తప్పలేదని రాష్ట్ర ప్రభుత్వం భావిస్తోంది. ఈ వాదనలను సమర్థించే మధ్యతరగతి మేధావి వర్గం తయారవుతూ ఉండడం వల్ల ప్రభుత్వానికి ఎదురు లేకుండా పోతోంది. ఈ రెండు సంవత్సరాలలో సాధారణ ప్రజానీకం మీద ఎడాపెడా కొత్త పన్నులు విధించిన ప్రభుత్వం ఆ పని కూడా కొత్త వనరుల సమీకరణలో భాగమేనంటోంది.

ఇక్కడ ఆలోచించవలసిన అంశాలు నాలుగున్నాయి: ఒకటి, రాష్ట్ర ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించడం నిజంగా సాధ్యం కాదా? రెండు, వ్యయం పద్దు కింద ఉన్న అన్ని ఖర్చులూ అవసరమైనవేనా? మూడు, ప్రభుత్వ ఆదాయ సమీకరణ హేతుబద్ధంగా, న్యాయ సమ్మతంగా ఉందా? నాలుగు, హేతుబద్ధంగా, న్యాయ సమ్మతంగా ఉంటూనే మరింత ఆదాయాన్ని సమకూర్చుకునే వీలు లేదా?

ఈ ప్రశ్నలకు స్పష్టమైన, సహేతుకమైన సమాధానాలు చెప్పుకున్న తర్వాతనే ప్రభుత్వం విదేశీ, బహుళజాతి, అంతర్జాతీయ రుణదాతల దగ్గరికి అప్పుకోసం పోవచ్చునా లేదా అనే సమస్య పరిష్కారమవుతుంది. ప్రభుత్వం మాత్రం ఈ ప్రశ్నలకు అరకొరగా సమాధానాలు చెప్పి, చెప్పించి, దాటవేసి ప్రపంచ బ్యాంకు రుణాలు, బహుళజాతి సంస్థల పెట్టుబడులు, విదేశీ నిధులు తప్ప మరొక గత్యంతరం లేదని ప్రకటిస్తోంది.

ప్రభుత్వ వ్యయం మొత్తాన్ని మూలధన వ్యయం, రెవెన్యూ వ్యయం అని రెండు పద్దుల కింద విభజించడం ఆనవాయితీ. ఈ మధ్యకాలంలో ఈ పద్దుల మధ్య విభజనను కచ్చితంగా పాటించడం లేదు గాని, మౌలికంగా రెండు పద్దులకూ తేడా ఉంది. మూల ధన వ్యయం అంటే నీటి పారుదల పథకాలు, విద్యుచ్ఛక్తి, మౌలిక సౌకర్యాల కల్పన వంటి దీర్ఘకాలిక ఆదాయ వనరులను రూపొందించడానికి చేసే వ్యయం. ఈ వ్యయం దీర్ఘకాలికంగా సామాజిక సంక్షేమ అవసరాలు తీరుస్తుందని ఒక సాధారణ అభిప్రాయం.

రెవెన్యూ వ్యయం అంటే ఏయేటికాయేడు ప్రభుత్వం చేసే వ్యయం. ఈ పద్దు కింద ప్రభుత్వోద్యోగుల జీతభత్యాలు, రుణాల వాయిదా చెల్లింపులు, వడ్డీలు, సంక్షేమ పథకాలు, విద్య, వైద్య, ఆరోగ్య సౌకర్యాలు, పోలీసు, ప్రభుత్వ పాలన వంటి శాఖల వ్యయాలను చేరుస్తున్నారు.

మొత్తంగా చూస్తే ప్రభుత్వ వ్యయం 1984-85లో 2681 కోట్ల రూపాయల నుంచి 1996-97 నాటికి 12393 కోట్లకు పెరిగింది. కాని దీన్ని ఇంకా వివరంగా చూడాలంటే రెవెన్యూ వ్యయం 2321 కోట్ల నుంచి 11452 కోట్లకు, 4.6 రెట్లు పెరగగా, మూలధన వ్యయం మాత్రం 359 కోట్ల నుంచి 940 కోట్లకు అంటే 2.6 రెట్లు పెరిగింది. అంటే ప్రభుత్వ వ్యయంలో రెవెన్యూ వ్యయమే అంతకంతకూ ఎక్కువ భాగాన్ని ఆక్రమిస్తూ వస్తోందన్న మాట.

ఈ రెవెన్యూ వ్యయం పద్దు కింద ఉన్న ఖర్చుల్ని వివరంగా చూస్తే వడ్డీల చెల్లింపులు 153 కోట్ల రూపాయల నుంచి 1890 కోట్ల రూపాయలకు (12.3 రెట్లు), అప్పుల అసలు వాయిదాల చెల్లింపు 161 కోట్ల రూపాయల నుంచి 365 కోట్ల రూపాయలకు (2.2 రెట్లు), పోలీసు శాఖపై ఖర్చు 104 కోట్ల రూపాయల నుంచి 534 కోట్ల రూపాయలకు (5.1 రెట్లు) పెరిగాయి.

గత రెండు సంవత్సరాలుగా ప్రభుత్వం సాగిస్తున్న అబద్ధ ప్రచారాలలో పెరిగిన రెవెన్యూ వ్యయాన్ని పూర్తిగా ఉద్యోగుల మీదికి, సంక్షేమ పథకాల మీదికి నెట్టివేయడం జరిగింది.



నిజానికి 1983 తర్వాత రాష్ట్ర ప్రభుత్వంలో కేవలం పోలీసు శాఖలో తప్ప కొత్త ఉద్యోగాల కల్పన జరగలేదు. కేంద్ర ప్రభుత్వ నిధులు అందే వైద్య, ఆరోగ్య శాఖల్లో మాత్రమే కొందరు కొత్త ఉద్యోగుల్ని నియమించడం జరిగింది. దాదాపు రెండు లక్షల మంది ఉద్యోగులు పదవీ విరమణ చేస్తే ఆరోవంతు ఖాళీల్ని కూడా పూరించడం జరగలేదు. కేవలం అంకెల్లో చూస్తే ఉద్యోగుల జీతభత్యాలు పెరిగినట్లే కనబడినప్పటికీ పెరిగిన ప్రభుత్వ సేవలను, ప్రజా అవసరాలను, ధరల పెరుగుదలను దృష్టిలో పెట్టుకుంటే ఉద్యోగుల జీతభత్యాల ఖర్చు పెరుగుదలలో తప్పు పట్టవలసినది పెద్దగా కనబడదు.

ప్రభుత్వం ప్రకటించే 'ఉద్యోగుల జీతభత్యాల ఖర్చు' అనే పద్దును కూడా వివరంగా పరిశీలించవలసి ఉంది. ఈ పద్దు కింద అధికారులు, నాన్ గెజిటెడ్ సిబ్బంది, నాలుగో తరగతి ఉద్యోగులు అందరూ కలిసిపోతారు. నిజానికి రాష్ట్రంలో ఒకవైపు నాన్ గెజిటెడ్, నాలుగో తరగతి సిబ్బంది ఉద్యోగాల సంఖ్యలో పెరుగుదల లేకపోగా, అధికారుల సంఖ్యలో, ముఖ్యంగా ఐఎఎస్, ఐపిఎస్ అధికారుల సంఖ్యలో విపరీతమైన పెరుగుదల ఉంది. రాష్ట్ర సచివాలయంలో మొత్తం 25-30 మంది ఐఎఎస్ అధికారులే ఒకప్పుడు ఉండేవారు. 1997 జూలై నాటికి సచివాలయంలో 60 మంది ఐఎఎస్ అధికారులున్నారు. మొత్తం మీద కమీషనర్, ఆపైన హోదా గల ఉద్యోగాలు 60 ఉండగా, ఆ స్థాయికి ప్రమోషన్ పొందిన అధికారులు 160 మంది అయ్యారు. అందువల్ల కనీసం 15 మందికి ఏ స్పష్టమైన బాధ్యత లేకుండా పోస్టింగు ఇచ్చిన పరిస్థితి వచ్చింది. ఒక ఎన్‌జిఒ జీతభత్యాలు, సౌకర్యాలతో పోలిస్తే, ఒక్కో ఐఎఎస్ అధికారి మీద కనీసం ఏడెనిమిది రెట్లు ఎక్కువ ఖర్చవుతుంది. ఇక పోలీసు శాఖలోనైతే, ఎంఎల్ఎ రక్షణ సిబ్బంది నుంచి ప్రారంభించి అత్యున్నత స్థాయి దాకా విపరీతమైన పెరుగుదల ఉంది. ఒకప్పుడు రాష్ట్రానికే అత్యున్నత పదవిగా ఉన్న ఐజిపి, ఇవాళ అధికార నిచ్చెనలో నాలుగో స్థానంలోనో, ఐదో స్థానంలోనో ఉన్నాడు. అత్యున్నత పదవి అయిన డిజిపిలు ఒకరికి నలుగురయ్యారు. ప్రభుత్వ నిర్వహణ వ్యయం అన్నప్పుడు దాన్ని ఒక ముద్దలాగ కాకుండా ఇట్లా విడదీసి అవసరమైనదేదో, అనవసరమైనదేదో పరిశీలించాలి.

ఇక సంక్షేమ పథకాలకు – ముఖ్యంగా రెండు రూపాయలకు కిలో బియ్యం పథకానికి ఆర్థిక కోణం మాత్రమే కాక రాజకీయ, సామాజిక కోణాలున్నాయి. ఈ పథకాలను ప్రభుత్వ వ్యయం వైపు నుంచి చూసే బదులు, పాలక, ప్రతిపక్ష రాజకీయ వ్యూహాలలో భాగంగా, సామాజికంగా అటువంటి పథకాలు రూపొందించక తప్పని వ్యవస్థ ప్రతిఫలంగా గుర్తించాలి. నిజానికి ఈ సంక్షేమ పథకాలనబడేవి ప్రభుత్వాలు ప్రజల ఆగ్రహం నుంచి తప్పించుకునేందుకు తయారు చేసిన రక్షణ కవచాలు.

మొత్తంగా చూస్తే ప్రభుత్వ వ్యయంలో అనవసరమైనవి – రుణాల అసలు వాయిదాలు, వడ్డీలు, ప్రభుత్వం అంతకంతకూ పోలీసు రాజ్యంగా మారిపోతూ చేసుకుంటున్న రక్షణ వ్యయం మాత్రమే. రుణాల అసలు వాయిదాలను, వడ్డీలను చెల్లించడం ప్రభుత్వం బాధ్యత అని,

ప్రభుత్వాలు మారినా అది తప్పదని సాధారణంగా వాదిస్తుంటారు. ఈ వాదనలలో పడి అసలు అప్పు ఎందుకు చేశారు, తెచ్చిన అప్పును ఎందుకోసం ఖర్చు పెట్టారు అనే అసలు ప్రశ్నలను దాటవేయడం జరుగుతుంది. ఆర్థిక వ్యవస్థ నిర్వాహకుల అక్రమాల వల్ల, అవినీతి వల్ల చేసిన అప్పులను తిరిగి చెల్లించవలసిన బాధ్యత ప్రజలకేమీ లేదు. నిజానికి అప్పులలో ప్రజా ప్రయోజనాల కోసం వెచ్చించినది పదో వంతు కూడా ఉండదు. రాజకీయ నాయకులు కూడబెట్టిన ఆస్తులను లెక్కవేస్తే అప్పు తెచ్చిన సొమ్మంతా ఎక్కడ చేరిందో తేలుతుంది. కనుక అప్పుల అసలు వాయిదాల చెల్లింపు, వడ్డీల చెల్లింపు గురించి పునరాలోచించడం, హేతుబద్ధ వైఖరి తీసుకోవడం అవసరం.

రాష్ట్ర ప్రభుత్వం నిజంగానే తన వ్యయాన్ని తగ్గించదలచుకుంటే అందుకు చేయవలసిన పని ఒక విదేశీ సలహాదారు సూచనలను పాటించడం కాదు. హడావుడిగా ఏవో అతుకులు, మాట్లు వేయడం కాదు. వ్యయంలోని వేరు వేరు అంశాలను, వాటి సంబద్ధతను సమీక్షించి అనవసరమైన పద్దులన్నిటినీ నిర్దాక్షిణ్యంగా తగ్గించి వేయడం. అయితే, అటువంటి సమీక్షేమీ లేకుండా, ప్రజోపయోగ, సంక్షేమ కార్యక్రమాలన్నిటినీ ప్రభుత్వం అనవసరమైనవిగా ప్రకటించి రద్దు చేసేస్తోంది. విదేశీ రుణాలు గతంలో ఎందుకు చేయవలసి వచ్చింది, ఆ నిధులను ఎందుకోసం ఖర్చు పెట్టారు, ఆ ఖర్చుల వల్ల ప్రజలు లాభపడినదెంత అని స్పష్టంగా తేలకుండా ప్రజలు ఆ అప్పులు తీర్చనవసరం లేదు. ఆ అప్పులు, వడ్డీలు తీర్చడం కోసం ప్రజాధనాన్ని అంతకంతకూ ఎక్కువగా ఖర్చు పెడుతూ వ్యయం ఆదాయాన్ని మించిపోతున్నదనడం ప్రజల అమాయకత్వం మీద పాలకులు చేస్తున్న క్రూర పరిహాసం. ప్రజలు తమ అమాయకత్వం నుంచి బైటపడుతూ ప్రభుత్వ విధానాల్ని ప్రశ్నించడం పెరుగుతున్న కొద్దీ ప్రభుత్వానికి రక్షణ వ్యయం పెరిగిపోతోంది. అందువల్లనే రాష్ట్ర పోలీసు బడ్జెటు ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోతోంది. ప్రజా చైతన్య అభివృద్ధికి పూచీ పడవలసిన ప్రభుత్వాలు, ప్రజా చైతన్యాన్ని అణచివేసే సాధనాల్ని అంతకంతకూ పెంచుకుంటున్నాయి. అందువల్లనే, ప్రపంచ బ్యాంకు చర్చల సందర్భంగా తయారయిన శ్వేతపత్రాల్లో గాని, ప్రపంచ బ్యాంకు ప్రతిపాదనలలో గాని అనవసరమైన వ్యయాల్లో పోలీసు శాఖ వ్యయం ప్రస్తావనైనా రాలేదు. చివరికి ఇప్పుడు తయారవుతున్న విజన్ 2020 ప్రణాళిక ప్రభుత్వం శాంతి భద్రతల పరిరక్షణ మినహా మిగతా కార్యక్రమాలన్నీ వదులుకోవాలని సూచిస్తోంది. అంటే, రాజ్యం మళ్లీ ఒకసారి పోలీసు రాజ్యం కాదలచుకున్నదన్న మాట. సంక్షేమ రాజ్య భావనకు పూర్తిగా నీళ్లొదల దలచుకున్నదన్న మాట.

విజన్ 2020 ప్రభుత్వ సంక్షేమ బాధ్యతలను తొలగించజూడడం మాత్రమే గాక సాధారణంగా ప్రజా వ్యతిరేక ప్రభుత్వాలన్నీ చేసినట్టుగానే బాధ్యతలను ప్రజల మీదికి నెడుతోంది. ఇందులో ప్రజలను తప్పుపట్టడమూ ఉంది. ప్రభుత్వం ఇక నుంచి అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టదని, ప్రజలే అందుకు పూనుకోవాలనడమూ ఉంది. అభివృద్ధి జరగకపోవడానికి జనాభా పెరుగుదల కారణమని, కనుక జనాభా నియంత్రణే ప్రధాన లక్ష్యమని ఒక సుదీర్ఘ కాలపు



అబద్ధ ప్రచారాన్ని విజన్ 2020 కొనసాగిస్తోంది. కనీస వైద్య, ఆరోగ్య, శిశు, మహిళా సంక్షేమ కార్యక్రమాలపై శ్రద్ధ చూపని ప్రభుత్వం, జనాభా నియంత్రణపైన కేంద్రీకరించడం అసహజమేమీ కాదు. అదే విధంగా విజన్ 2020 సంక్షేమ పథకాల రద్దుకు, ప్రభుత్వ రంగంలో పారిశ్రామికీకరణ రద్దుకు, నీటిపారుదల సౌకర్యాలలో ప్రైవేటు పెట్టుబడులకు మార్గం సుగమం చేస్తోంది. శ్వేతపత్రాలతో ప్రారంభమైన ఆలోచనా సరళి విజన్ 2020తో తారస్థాయికి చేరుతుంది. *(విజన్ 2020కి మొదట ప్రాతిపదికలను ప్రభుత్వమే తయారు చేసి వాటిని అభివృద్ధి చేసే పని రాష్ట్రంలోని అధికారులకు, మేధావులకు అప్పగించాలని తలపెట్టింది. కాని ఇప్పుడు హఠాత్తుగా మెకన్సీ అనే సామ్రాజ్యవాద సలహా సంస్థకు విజన్ 2020ను తయారు చేసే బాధ్యత ఇవ్వబడింది.)*

ప్రపంచ బ్యాంకు దగ్గరికి, ఇతర ఆర్థిక సంస్థల దగ్గరికి అప్పుకోసం వెళ్లడానికి ప్రభుత్వం చూపుతున్న కారణం ఆదాయం వనరుల పెంపుదలకు అవకాశం లేదని. పన్నుల వసూలు విషయంలో, ముఖ్యంగా పరోక్ష పన్నుల విషయంలో, ప్రభుత్వం చివరి అంచుదాకా వచ్చిందన్న మాట నిజమే. ఉద్యోగ, కార్మిక, మధ్యతరగతి వర్గాల మీద ప్రత్యక్ష పన్నులు కూడ గరిష్ట స్థాయిలో ఉన్నాయన్న మాట నిజమే.

కాని, ప్రభుత్వాలు ఆదాయ సమీకరణకు, ఆదాయాలను పెంచుకోవడానికి చేయవలసిన ప్రయత్నాలు చేస్తున్నాయా? ఉన్న ఆదాయ సమీకరణ పద్ధతులు హేతుబద్ధంగా ఉన్నాయా? పన్నుల విధింపులో అనుసరించవలసిన మార్గదర్శక సూత్రాలను సక్రమంగా అమలు చేయడం జరుగుతోందా?

రాష్ట్ర ప్రభుత్వ పన్నుల ఆదాయం 1985-86లో 1438 కోట్ల రూపాయల నుంచి 1996-97 లో 5607 కోట్లకు పెరిగింది. దీనిలో ఆస్తులపై పన్నులు పదిశాతం కూడా మించలేదు. సరుకులపై పన్నులు దాదాపు 90 శాతం ఆక్రమించాయి. కేంద్రం వసూలు చేసే పన్నుల్లో రాష్ట్రం వాటా ఇదే సమయంలో 581 కోట్ల రూపాయల నుంచి 2847 కోట్ల రూపాయలకు పెరిగింది. పన్నుల రూపంలో లేని ఆదాయం 753 కోట్ల రూపాయల నుంచి 3508 కోట్ల రూపాయలకు పెరిగింది.

పన్నుల రాబడిలో ప్రత్యక్ష పన్నుల వాటా పెరగాలని, ఆదాయం పెరుగుతున్న కొద్దీ, సంపద పెరుగుతున్న కొద్దీ ఎక్కువ పన్ను విధింపు జరగాలని పన్నుల విధానపు మార్గదర్శక సూత్రాలు నిర్దేశిస్తున్నాయి. ఇటువంటి పన్నుల విధానం వల్ల సంపన్నులకు, పేదలకు మధ్య అఖాతం తగ్గుతుందని, పన్నుల విధింపు సులభంగా ఉంటుందని, సమాజంలో సంపద కొందరి చేతిలో పోగుపడకుండా హామీ ఉంటుందని అర్థశాస్త్రం చెపుతుంది.

కాని మన పన్నుల విధానం సంపన్నులకు మేలు చేసేదిగా తయారయి ఉంది. సంపద పెరిగే కొద్దీ పన్ను విధింపు పెరగడం అనే సూత్రం నామమాత్రంగా అమలవుతున్నప్పటికీ, సంపన్నుల పన్ను ఎగవేతకు అంతులేకుండా ఉంది. కనుక ప్రత్యక్ష పన్నులలో కచ్చితమైన వసూలు కేవలం ఉద్యోగుల దగ్గర మాత్రమే సాధ్యమవుతోంది. అందువల్ల ప్రభుత్వం అంతకంతకూ ఎక్కువగా పరోక్ష పన్నుల మీద ఆధారపడుతోంది. మొత్తం రాష్ట్ర పన్నులు

5607 కోట్ల రూపాయలలో అమ్మకపు పన్ను 4187 కోట్లుగా ఉంది. ఈ రకంగా సరుకుల మీద విధించబడే అమ్మకపు పన్ను పూర్తిగా వినియోగదారుల మీదికే నెట్టబడుతుందని చెప్పనక్కరలేదు.

ఈ పన్ను విధానంలో ప్రత్యేకించి అమ్మకం పన్ను, ఎక్సైజ్, స్టాంపు డ్యూటీలు, వృత్తి పన్నుల విధింపులో, ఏయే స్వల్పకాలిక, మధ్యంతర మార్పులు చేయాలో ప్రపంచ బ్యాంకు నివేదిక స్పష్టమైన ఆదేశాలు ఇచ్చింది. ఈ రెండు సంవత్సరాలలో రాష్ట్ర ప్రభుత్వం ఆ ఆదేశాలలో కొన్నిటిని అమలులో కూడ పెట్టింది. ఈ ఆదేశాలలో ఎక్కువ భాగం సాధారణ ప్రజానీకం మీద దుష్పరిణామాలకు, పారిశ్రామిక, వ్యాపార వర్గాలకు ఎక్కువ లాభాలు రావడానికి దారితీసేవే. కొత్తగా ప్రకటిస్తున్న వి.ఎ.టి. (వాల్యూ ఆడెడ్ టాక్స్) విధానం గతంలోని టర్నోవర్ టాక్స్ స్థానంలో వ్యాపార మిగులు (ట్రేడ్ మార్జిన్)ను ఆధారంగా చేసుకోదలచింది. ఈ మాటల గారడీ ఎలా ఉన్నా, కొత్త విధానం ఆశించిన ఫలితాన్ని, ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయం సమకూర్చి పెట్టడాన్ని సాధించడం అసాధ్యం.

మరి, ప్రభుత్వం అదనపు ఆదాయాన్నే సమకూర్చుకోదలచుకుంటే ఉన్న వనరుల్లో చేయదగిన మార్పులు లేవా? కొత్త ఆదాయ వనరులను కనిపెట్టడం అసాధ్యమా? ప్రభుత్వానికి చిత్తశుద్ధి ఉంటే ఉన్న పన్నుల విధానంలో అవసరమైన మార్పులు తీసుకురావడం ద్వారాను, కొత్త ఆదాయ మార్గాలను సృష్టించుకోవడం ద్వారాను సాధారణ ప్రజానీకం మీద భారం లేకుండానే ఆదాయం పెంచుకోవచ్చు. పన్ను ఎగవేతలను అరికట్టడం ద్వారా, పన్ను ఎగవేతపై కఠిన శిక్షలు విధించడం ద్వారా ప్రభుత్వం వందలాది కోట్ల రూపాయల బకాయిలు వసూలు చేయడం వీలవుతుంది.

స్టాంపు డ్యూటీ, రిజిస్ట్రేషన్‌ల మీద ఇవాళ అమల్లో ఉన్న పన్నుల విధానం పరమ లోపభూయిష్టంగా ఉంది. రియల్ ఎస్టేట్, కంట్రాక్టర్ల, రాజకీయ నాయకుల ప్రయోజనాల కోసం తయారయిన ఈ విధానం ఎక్కడా క్రయవిక్రయాలను ఉన్నది ఉన్నట్టుగా చూపడం లేదు. కోట్లాది రూపాయల లావాదేవీలు వాటి విలువలో అతి తక్కువ భాగం నమోదు చేయబడి, ప్రభుత్వ బొక్కసానికి లక్షలాది రూపాయల ఆదాయాన్ని నష్టపరుస్తున్నాయి. కేవలం స్థల, భవన క్రయవిక్రయాలు మినహా రియల్ ఎస్టేట్ వ్యాపారంలో ఉన్న ఇతర లావాదేవీలేవీ పన్నుల చట్రంలోకి రావడం లేదు. ఈ విధానాన్ని హేతుబద్ధంగా, న్యాయ సమ్మతంగా మార్చడం ద్వారా ప్రభుత్వాదాయం విపరీతంగా పెంచుకోవచ్చు.

మోటారు వాహనాలపై పన్నులలో వాహనం విలువను బట్టి ఎక్కువ విలువైన వాహనానికి ఎక్కువ పన్ను అనే విధానం అమలులో లేకపోవడంతో అతి విలువైన, విలాసవంతమైన వాహనాల కొనుగోలుదార్లు చెల్లించవలసిన లక్షలాది రూపాయల పన్నులు ప్రభుత్వానికి అందడం లేదు. చిన్న వాహనదార్ల మీద ప్రభుత్వం చూపుతున్న కాఠిన్యం విలాసవంతమైన వాహనాల దగ్గరికొచ్చేసరికి కరిగిపోతోంది.



అట్లాగే రాష్ట్రంలో సినిమా పరిశ్రమ విపరీతంగా పెరిగిపోతుండగా, ఆ పరిశ్రమ మీద పన్నులు విధించకపోగా, ప్రభుత్వం కోట్లాది రూపాయల రాయితీలు ప్రకటిస్తోంది. కేబుల్ టివి, వ్యవసాయేతర భూవినియోగం, కొత్త పరిశ్రమలు వంటి ఎన్నో ఆదాయ వనరులను ప్రభుత్వం విస్మరిస్తోంది. పైగా చాలా రంగాలలో పన్ను మినహాయింపులు, రాయితీలు ప్రకటించడం ద్వారా ప్రభుత్వమే తన ఆదాయానికి గండి కొట్టుకుంటోంది. రాష్ట్రంలో విద్యా వ్యాపారం, ఫైనాన్స్ వ్యాపారం విపరీతంగా పెరిగిపోయాయి. వీటిపైన దాదాపుగా పన్నులు లేవు. మరోవైపు ప్రభుత్వ విధానాల వల్లనే ప్రజలు ఎక్కువగా ప్రైవేటు విద్యవైపు, ప్రైవేటు ఫైనాన్స్ కంపెనీల వైపు నెట్టబడుతున్నారు. ఈ వ్యాపారాల మీద పన్నులు వేయడం అవసరం.

రాష్ట్రంలో విస్తారమైన ఖనిజ నిలువలుండగా, రాష్ట్రానికి ఒక ప్రభుత్వరంగ గనుల సంస్థ ఉండగా, ఖనిజ నిలువల భూములను రాజకీయ నాయకులకు, కాంట్రాక్టర్లకు అప్పగించడం ద్వారా ప్రభుత్వం కోట్ల రూపాయల ఆదాయాన్ని పోగొట్టుకుంటోంది. వందల, వేల కోట్ల రూపాయల విలువైన ఖనిజాలున్న భూములను కేవలం వేల, లక్షల రూపాయలకు దశాబ్దాల పాటు లీజుకిస్తోంది. అటవీ వనరులపైన, వ్యవసాయాదాయం పైన కూడ ప్రభుత్వ వైఖరి ఈ రకంగానే ఉంది.

ఇక రాష్ట్ర ప్రభుత్వమే చర్చలోకి తెచ్చి, ప్రస్తుతం వదిలేసిన మరొక ముఖ్యమైన ఆదాయ వనరు, కేంద్ర ప్రభుత్వ పన్నులలో రాష్ట్రం వాటా. నిజానికి ఆర్థిక, రాజకీయ రంగాలలో పెద్ద చర్చకు దారి తీయవలసిన ఈ పన్నుల పంపిణీ, కేంద్ర, రాష్ట్ర పాలకవర్గాల మిలాఖత్తు వల్ల విస్మరణకు గురవుతోంది. ఆ చర్చను కొనసాగించి రాష్ట్రానికి ఎక్కువ వాటాను డిమాండ్ చేయడం ద్వారా ప్రభుత్వం కొత్త ఆదాయ వనరులను సమకూర్చుకోవచ్చు.

కొనసాగుతున్న రాజకీయార్థిక వ్యవస్థ పరిధి లోపల సాధ్యమయ్యే పనులతో కూడ రాష్ట్ర ప్రభుత్వం తన ఆదాయాన్ని పెంచుకోవడం, వ్యయాన్ని తగ్గించుకోవడం సాధించవచ్చు. అటువంటి దిశగా ఆలోచించకుండా నేరుగా బహుళజాతి, అంతర్జాతీయ ఆర్థిక, పారిశ్రామిక, ద్రవ్యసంస్థల పాదాల దగ్గర ప్రదక్షిణాలు చేయడం అజ్ఞానమైనా కావాలి, స్వార్థ ప్రయోజనాలయినా ఇమిడి ఉండాలి.

***పర్‌స్పెక్టివ్స్ ప్రచురణ, 'ఆంధ్రప్రదేశ్ ఆర్థిక సంస్కరణలు - ప్రపంచ బ్యాంక్ ఎజెండా', మార్చ్ 1998***

# 12

# రేపటి 'విజన్' బహుళజాతి ప్రభుత్వం!

స్వర్ణాంధ్రప్రదేశ్‌లో రాజ్యాధికారం ఎవరిది? ఈ ప్రశ్నకు జవాబు వెతకడం ఆసక్తికరంగా ఉంటుంది. ఆ జవాబు మన పాలకవర్గాల మనఃస్థితి గురించి, ధోరణుల గురించి ఆశ్చర్యకరమైన వివరాలు తెలియజేస్తుంది. నిజంగానే విజన్ 2020 అమలయితే, 2020 నాటికి ప్రభుత్వం అనేది నామమాత్రమవుతుంది. అది పేరుకు ఎన్నికల్లో గెలుస్తుందేమో గాని ప్రజలకు ప్రాతినిధ్యం వహించేదిగా ఉండదు. బహుళజాతి గుత్త సంస్థలకు, ప్రైవేటు పెట్టుబడికి, విదేశీ పెట్టుబడికి ఊడిగం చేసేదిగా ఉంటుంది. ప్రజా జీవన సమస్యలకు పరిష్కారాలు చూపవలసిన ప్రభుత్వం, ఆ పని చేయకపోగా ప్రజలను పెట్టుబడిదారుల లాభార్జనాయంత్రాలకు ఇంధనంగా అర్పిస్తుంది.

ఒక అర్థంలో అది ఆశ్చర్యకరమైన పరిణామంగా కనిపించవచ్చు. ప్రభుత్వం, పాలకవర్గాలు తమను తాము నిర్వీర్యం చేసుకునే, బలహీనం చేసుకునే ఈ ప్రయత్నానికి ఎందుకు ఒడిగడుతున్నాయనే ప్రశ్న రావచ్చు. ఇప్పుడు రాజ్యం చేస్తున్న ప్రభుత్వం నడుపుతున్న పాలకవర్గాల స్వార్థ ప్రయోజనాలేవో ఇందులో ఇమిడి ఉంటే తప్ప ఇటువంటి 'కూచున్న కొమ్మను నరుక్కునే' ప్రయత్నాలు జరగవు.



అంటే ఈ మార్పుల తర్వాత కూడా పాలకవర్గాల ఆస్తులు, ప్రయోజనాలు చెక్కు చెదరకుండా ఉండి ప్రభుత్వం మాత్రం శక్తిహీనమై పోతుందన్నమాట. అంటే ప్రభుత్వం తన జవాబుదారీతనాన్ని కోల్పోతుందన్న మాట. ఒకసారి ప్రభుత్వం అదీ ప్రజల వోట్లతో ప్రాతినిధ్యంతో గద్దెనెక్కిన ప్రభుత్వం, తన జవాబుదారీతనాన్ని కోల్పోయిందంటే ఇక ప్రజలకు తమ సమస్యలను తీర్చమని అడగడానికే ఎవరూ మిగలరన్నమాట. ప్రజలను ఇట్లా నిస్సహాయుల్నిచేసి అంతర్జాతీయ వ్యాపారులకు ముడిసరుకులుగా, మార్కెట్లుగా తయారు చేసి పెట్టే గ్లోబల్ కుట్ర ఇది.

ఈ కుట్ర అన్ని కుట్రలలాగానే చాలా ఆకర్షణీయమయిన మాటల్లో మన ముందుకు వస్తుంది. ఆ మాటల గారడీలో పడి మనం అది ఒక కుట్ర అని కూడా గుర్తించలేకపోతాం. ఆ మాటల గారడీ రాష్ట్రాన్ని స్వర్ణాంధ్రప్రదేశ్ చేస్తానంటుంది. ప్రభుత్వాన్ని సరళతరం, నీతివంతం, బాధ్యతాయుతం, స్పందనాయుతం, పారదర్శకం చేస్తానని అంటుంది. ఈ పదజాలం వెనుకదాగి ఉన్న అసలు అర్థాల్ని ఉద్దేశాల్ని అర్థం చేసుకోగలిగినప్పుడు మాత్రమే ఈ కుట్రను అర్థం చేసుకోగలం.

నిజానికి ఈ కుట్రలో మన స్థానిక, పాలకవర్గాల బాధ్యత తక్కువే. వాళ్లు స్వార్థ ప్రయోజనాల కోసం తమను తాము, తమ అధికారాన్ని తాము రద్దు చేసుకోవడానికి, తగ్గించుకోవడానికి కూడా సిద్ధపడుతున్నారు. ఈ పరిణామాల వల్ల అత్యధికంగా లాభపడేది బహుళజాతి గుత్త సంస్థలు, అంతర్జాతీయ వ్యాపారులు, దేశ దేశాల సంపన్న వర్గాలు. వాళ్లకు ఈ రాష్ట్రం నుంచీ ఈ దేశం నుంచీ కారు చౌకగా ముడి సరుకులు కావాలి. ఆ ముడిసరుకులతో తాము తయారు చేసిన సరుకుల్ని ఇక్కడ అమ్ముకోవడానికి మార్కెట్లు కావాలి. మార్కెట్లు పెరగడానికి కావలసిన అన్ని ఏర్పాట్లూ – విశాలమైన రోడ్లు, విమానాశ్రయాలు, నౌకాశ్రయాలు, కోల్డ్ స్టోరేజ్ గిడ్డంగులు, విద్యుత్, టెలికమ్యూనికేషన్లు కావాలి. ఈ పనులకు అడ్డు వచ్చే చట్టాలన్నిటినీ రద్దు చేయాలి. సవరించాలి. ఈ పనులను అడ్డుకునే ప్రజా ఉద్యమాలేవయినా ఉంటే వాటిని రక్తపుటేర్లలో ముంచి వేయాలి. ఈ పనులు మాత్రమే తన బాధ్యతగా తీసుకుని ఈ రంగంలో ఇంకా కోరలు పెంచుకోవాలి. మిగిలిన అన్ని బాధ్యతలనూ ప్రైవేటు పెట్టుబడికి అప్పగించాలి.

ఇదీ బహుళజాతి సంస్థల ఎజెండా. దీనికే ప్రపంచీకరణ అనీ, విశ్వీకరణ అనీ, సరళీకరణ అనీ, నూతన ఆర్థిక విధానాలనీ, ఆర్థిక సంస్కరణలనీ, వ్యవస్థాత్మక సంస్కరణలనీ ఎన్నో ముద్దు పేర్లున్నాయి. ఈ ముద్దుపేర్ల జాబితాలోకి కొత్తగా వచ్చి చేరింది విజన్ 2020 అనే మాట.

విజన్ 2020లో 'ప్రజా కేంద్రక' అభివృద్ధి దృక్పథ ప్రభుత్వ పాలన అనే అధ్యాయం 28 పదమూడు పేజీల్లో చాలా స్పష్టంగానూ ఎటువంటి శషభిషలు లేకుండానూ ఈ ఎజెండాను ప్రకటిస్తుంది. 'అభివృద్ధి ఎజెండాను అమలు చేయడంలో ప్రభుత్వం కీలకపాత్ర నిర్వహించవలసి ఉంది. అయితే ఈ పాత్ర తక్కువ పనులు మెరుగ్గా చేయడంగా ఉండాలిగాని ఎక్కువ పనులు చేయడంగా కాదు' అనే స్వవచోవ్యాఘాతంతో ఈ అధ్యాయం మొదలవుతుంది. పనులు ఎక్కువా

తక్కువా మెరుగయినవా కావా అనేది నిజమైన చర్చనీయాంశం కాదు. ప్రభుత్వం ప్రజల చేత ఎన్నికయింది గనుక ప్రజలకొరకు పనిచేస్తుందా లేదా అనేది అసలు చర్చనీయాంశం. ఐదు దశాబ్దాలుగా ఈ దేశంలో ప్రభుత్వాలు తాము ప్రజల చేత ఎన్నికయ్యామనీ, ప్రజల కొరకు పనిచెయ్యాలనీ మరచిపోయాయి. నాయకుల స్విస్ ఖాతాల కోసం, ఆశ్రితుల కంట్రాక్టుల కోసం, కుటుంబ సభ్యుల, బంధుమిత్రుల విలాసాల కోసం పని చేశాయి. ప్రజల నిత్యజీవిత సమస్యల నుంచి దృష్టి మళ్లించడానికి ఎన్నో విధానాలూ వివాదాలూ ముందుకు తెచ్చాయి.

ఇప్పుడు విజన్ 2020 మరొక కొత్త నాటకంతో అదే పని నిర్వర్తించదలచింది. ఇప్పుడు కొత్తగా ప్రభుత్వ ప్రయోజనాలు అందే లబ్ధిదార్ల జాబితాలో స్వదేశీ, విదేశీ ప్రైవేట్ మార్కెట్ చేరుతోంది.

"2020 సంవత్సరం నాటికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అభివృద్ధికి అనుకూలమైన, నియంత్రణలు లేని విధాన వాతావరణాన్ని కల్పించి మార్కెట్ పునాదిగా గల అభివృద్ధికి దోహదకారి అవుతుంది" అని విజన్ 2020 రాసింది.

అభివృద్ధికి అనుకూలమైన అనే మాటను నిజానికి లాభాపేక్ష గల మార్కెట్ పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధికి అనుకూలమైన అనే అర్థంలో ఇక్కడ వాడుతున్నారు. పెట్టుబడిదారీ మార్కెట్ లాభనష్టాల లెక్కల పునాది మీద మాత్రమే పనిచేస్తుంది. లాభం కోసం ఎంత నీచానికైనా దిగజారుతుంది. ఆహార పదార్థాలలో కల్తీ దగ్గరి నుంచి వాతావరణ కాలుష్యం వరకు ఇవాళ సమాజంలో జరుగుతున్న ఎన్నో అక్రమాలకు కారణం పెట్టుబడిదారీ మార్కెట్ విలువలే. ఈ అక్రమాలను అరికట్టే సదుద్దేశంతోనే పెట్టుబడిదారీ మార్కెట్ సంస్థల పనితీరు మీద నియంత్రణా చట్టాలను ప్రభుత్వాలు తీసుకొచ్చాయి. కాలక్రమంలో ఆ ప్రభుత్వ సంస్థలు అవినీతిమయమైపోయి నియంత్రణలను నీరుగార్చడం వేరే కథ. ఇప్పుడా నియంత్రణలు లేని "అభివృద్ధి అనుకూల" వాతావరణం కావాలని అంతర్జాతీయ పెట్టుబడిదారీ సంస్థలు కోరుకుంటున్నాయి. ఈ స్థితిలో 'ప్రభుత్వం కొన్ని ఆర్థిక రంగాల మీద మాత్రమే కేంద్రీకరించి మిగిలిన అన్ని రంగాలలో మార్కెట్ శక్తుల స్వేచ్ఛా వర్తనకు అనుమతించాల'ని విజన్ 2020 అంటోంది.

ఈ లక్ష్యం కోసం ప్రభుత్వం ఇప్పుడున్న ఆర్థిక వ్యవస్థలోని ఎన్నో రంగాల నిర్వాహకురాలి స్థానం నుంచి ప్రైవేట్ రంగం ఆచరణకు మార్గం సుగమం చేసే శక్తిగా మారిపోవాలట. ఎన్నో రంగాలలోని ఆర్థిక నిర్ణయాలను, ముఖ్యంగా ధరల నిర్ణయాలను నియంత్రించే, అదుపు చేసే శక్తిగా ఉన్న ప్రభుత్వం ఆ బాధ్యతను వదుల్చుకుని మార్కెట్ పునాదిగా గల అభివృద్ధికి దోహదం చేయాలట.

మౌలిక సౌకర్యాల కల్పన, వృత్తి విద్య, ఉన్నత విద్య, ప్రత్యేక ఆరోగ్య రక్షణ వంటి కొన్ని అభివృద్ధి లక్ష్యాలను కూడా ప్రైవేట్ రంగం మెరుగుగా నిర్వహించగలదట. అందువల్ల ఆ రంగాలలోకి ప్రైవేట్ పెట్టుబడిదారులను ఆహ్వానిస్తే ప్రభుత్వరంగంలో ఉన్న ఈ సంస్థలు కూడా పోటీలో మెరుగుపడి 'ఎక్కువ ఆర్థిక స్వావలంబన'ను సాధిస్తాయట.



పాలనాపరమైన ఇతర అభివృద్ధేతర వ్యయాన్ని (అంటే ప్రభుత్వ రంగ సంస్థలకు ఇచ్చే సహాయాన్ని) ప్రస్తుతం ఉన్న 40 శాతం నుంచి 2010 సంవత్సరం కల్లా 20-25 శాతానికి తగ్గిస్తారట.

నిజానికి ఈ భాషంతా ఒక మాయాజాలం. ఈ అర్థశాస్త్ర పరిభాషలో చెబుతున్న విషయాల అంతిమ పర్యవసానం ప్రజాజీవనం మీద ఎంత దుర్మార్గంగా ఉండబోతుందో దాచి పెట్టడానికి ఈ మాయాజాలం అవసరం.

ఒక్కమాటలో చెప్పాలంటే ప్రభుత్వం తన సంక్షేమ బాధ్యతల నుంచి తప్పించుకుని ప్రజలను ప్రైవేట్‌రంగ లాభాపేక్షకు బలిచేయడమే ఈ ఆకర్షణీయమైన మాటల అర్థం. మౌలిక సౌకర్యాల కల్పనను, వృత్తి విద్యారంగాన్ని, ఉన్నత విద్యారంగాన్ని, ఆరోగ్య రంగాన్ని పూర్తిగా ప్రైవేటు సంస్థలకు అప్పగించడం, ఆయా రంగాలలో ప్రజలనుంచి వచ్చే ప్రశ్నల్ని తప్పించుకోవడం, ప్రభుత్వ రంగ సంస్థలన్నిటినీ ప్రైవేటీకరించి, అమ్మివేసి, మూసివేసి వేలాదిమంది కార్మికులను వీథులపాలు చెయ్యడం ఈ మాటల అసలు అర్థాలు.

ఆ పనుల అంతిమ సారాంశం ఇంత దుర్మార్గమైనదని విజన్ 2020 రచయితలకు కూడా తెలుసు.

అందుకే 'ఇవన్నీ చాలా నాటకీయమైన, గుణాత్మకమైన మార్పులు. అందువల్ల వీటిని ప్రజలకు జాగ్రత్తగా తెలియజేయాలి. ఇవన్నీ తమ ప్రయోజనాల కోసమే అని వాళ్లు భావించేటట్టుగా తెలియజేయాలి' అని కూడా విజన్ 2020 రాసింది.

'సాహసికమైన సంస్కరణ కార్యక్రమాలేవయినా ప్రతిఘటనను ఎదుర్కొంటాయి. ముఖ్యంగా యథాస్థితిని కొనసాగించడంలో ప్రయోజనాలున్న పార్టీలు ఈ సంస్కరణలను ప్రతిఘటిస్తాయి. వైద్య, విద్యారంగాలలో ప్రభుత్వం తేదలచిన పరిమిత సంస్కరణల పట్ల కూడా ఇప్పటికే పెద్ద ఎత్తున వ్యతిరేకత వచ్చింది' అని కూడా విజన్ 2020 రాసింది.

అంటే పాలకులు తెలిసి తెలిసీ, ఉద్దేశపూర్వకంగానే ఆంధ్రప్రదేశ్ ప్రజల చేత ఈ విషగుళికలను మింగించదలచుకున్నారన్నమాట. ఈ విషగుళికలకు ఏ పంచదార పూతలు పూయాలో, ప్రజలు దాన్ని ఎలా ప్రతిఘటిస్తారో కూడా వాళ్లకు స్పష్టంగానే తెలుసునన్నమాట.

***ఆంధ్రప్రభ, 25 మే 1999***

# 13

# గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్ - మరో దృష్టి

అరుణతార ఆగస్ట్ 1998 సంచికలో అచ్చయిన 'గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్' పుస్తక పరిచయం ('ఒక చిలిపి సవాలు') ఆశ్చర్యం కలిగించింది. అన్వయం కుదరని, ఏ అర్థమూ ఇవ్వని వాక్యాలను, వ్యాఖ్యలను పక్కన పెట్టి చూసినా, వ్యాస శీర్షికా, వ్యాసంలో పుస్తకమయిన కొన్ని అభిప్రాయాలూ ఈ ఆశ్చర్యానికి కారణం.

గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్ ఒక ముఖ్యమైన సీరియస్ పుస్తకం. నక్సల్బరీ పంథా, విరసం విశ్వసించే రాజకీయార్థిక అభిప్రాయాలకు భిన్నమైన అభిప్రాయాలను ప్రకటించిన పుస్తకం కనుక విరసం అధికార పత్రికలో ఆ పుస్తకం మీద విమర్శనాత్మకమైన సమీక్షో, ఆ పుస్తకంలోని అభిప్రాలతో ఎక్కడ ఎందుకు విభేదిస్తున్నామో చెప్పే వివరణో ఆశించే వాళ్లకు ఈ 'చిలిపి సవాలు' నిరాశను కలిగిస్తుంది. సీరియస్‌గా చర్చించవలసిన పుస్తకం పైన ఇంత అలవోకగా, పైపైన తడుముతూ, అనవసరంగా తప్పుడు భావాల్ని ప్రకటిస్తూ ఈ పరిచయం రావడం అటు పుస్తకానికీ ఇటు పాఠకులకూ కూడా అన్యాయం.

మొట్టమొదటి విషయం : భారత సమాజం అర్ధవలస, అర్ధ భూస్వామ్య సమాజం అవునా కాదా అని చర్చించమని సవాలు చేయడం 'చిలిపి సవాలు'



కాదు. ఆ చర్చ భారత విప్లవోద్యమం ముందున్న ఒక కీలక చర్చ. నిజానికి అది చిలిపి సవాలు అని గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్ ప్రచురణకర్తలు కూడా అనుకోరనుకుంటాను.

'అర్ధవలస, అర్ధ భూస్వామ్యం అంటూ విశ్లేషిస్తున్న 'సంప్రదాయం' మార్క్సిస్టులు కొందరు చర్చకు ఇష్టపడడం లేదనీ, వాళ్లు వారి సంప్రదాయ ఆలోచనల్నుంచి బయటికొచ్చి ప్రపంచ పరిస్థితిని కొత్తగా దర్శించి విశ్లేషించే ప్రయత్నం చేయాలనీ, ఇలాంటి సందర్భాలు వచ్చినప్పుడు చర్చలలో పాల్గొనాలనీ ఓ చిలిపి సవాలు విసిరారు' అని సి.ఎస్.ఆర్. రాశారు.

భారత సమాజంలో అక్కడక్కడ మినహాయింపులూ, చరిత్ర గతిలో ఎగుడుదిగుళ్లూ కనిపిస్తున్నప్పటికీ, 1947 నుంచీ ఇది ప్రధానంగా అర్ధవలస, అర్ధ భూస్వామ్య సమాజంగానే ఉన్నదని నేను దృఢంగా విశ్వసిస్తున్నాను. ఇట్లా విశ్వసించడం 'సంప్రదాయ' మార్క్సిజమైనా సరే! 1960ల చివరి నుంచీ ఇప్పటివరకూ ఎంతోమంది ఆర్థిక శాస్త్రవేత్తలు, ఉద్యమకారులు తాము ఎందుకు అర్ధవలస, అర్ధ భూస్వామ్య అని విశ్లేషిస్తున్నారో వివరించే ఉన్నారు. 'ప్రపంచ పరిస్థితిని కొత్తగా దర్శించ' వలసిన అవసరం వచ్చిన తర్వాత కూడా, 1990ల తర్వాత కూడా ఈ సమాజం నయా వలసగా మారిందా, అర్ధవలసగానే ఉందా అని తీవ్రమైన చర్చలు జరిగాయి. (చివరికి అరుణతారలో కూడా అర్ధవలస, నయావలస భావనల్ని వివరిస్తూ ఎందుకు నయా వలస కాదో వివరించడానికి నేను ప్రయత్నించాను – మే 1993).

చివరికి ఈ పుస్తకం ఆవిష్కరణ సభలో పాల్గొని కూడా నేను పుస్తకం మీద నా విమర్శ ప్రకటించాను. మరి 'ఇటువంటి సందర్భాలు వచ్చినప్పుడు చర్చలలో పాల్గొనాలని కొత్త ఉచిత సలహా ఇవ్వాల్సిన అవసరమూ, దాని వెంట దానికి 'చిలిపితనం' జోడించవలసిన అవసరమూ ఎందుకొచ్చాయి?

అసలు పుస్తకం గురించి చర్చించే ముందు పరిచయకర్త ప్రకటించిన మరొక అభిప్రాయాన్ని చర్చించాలి. 'కొందరు మేధావులు అనుకుంటున్నట్టు ప్రపంచీకరణ వైవిధ్యానికి ప్రమాదం కాదు. ఈ వైవిధ్యాలు కొనసాగినప్పుడే పెట్టుబడికి లాభమూ మనుగడా' అని ఆయన అంటున్నారు. ప్రపంచీకరణ అంటే ఆయన ఏమని నిర్వచించుకుంటున్నారో తెలియదు గాని, ప్రపంచీకరణ అంటే మార్కెట్ ఏకీకరణ, విశ్వవ్యాప్త మార్కెట్ సమన్వయం, విశ్వమా??వ సౌభ్రాతృత్వం కోసమో, ఏదైనా ఒక ప్రత్యేక సంస్కృతి కోసమో పెట్టుబడి ప్రపంచీకరణ నినాదాన్ని తలకెత్తుకోలేదు. తన సరుకులు ప్రపంచవ్యాప్తంగా అమ్మడానికి వీలయిన ఒకే కొనుగోలుదారు సంస్కృతిని వ్యాపింపజెయ్యడం దాని లక్ష్యం. ఆయా సమాజాలలో ఇప్పటికి కొనసాగుతున్న ఆచార వ్యవహారాలు, విధి నిషేధాలు, సంస్కృతి, ఇష్టాయిష్టాలు ఈ సరుకుల మాయను ఎంతోకొంత నష్టపరుస్తాయి కాబట్టి ఈ ఆటంకాలేమీ లేని మార్కెట్ సంస్కృతి విస్తరించాలని సామ్రాజ్యవాదం కోరుకుంటోంది. వందల వేల విశిష్ట సంస్కృతులలో మిగిలి ఉన్న సమాజ మానవ విలువలెన్నిటినో ధ్వంసం చేసి స్వార్థాన్ని, వినియోగ సంస్కృతిని, ధనాశను పెంచి పోషించడం ద్వారా మార్కెట్ సంస్కృతిని నెలకొల్పవచ్చునని సామ్రాజ్యవాదం అనుకుంటోంది.

కాని, చారిత్రక, సాంస్కృతిక కారణాల వల్ల ఈ వైవిధ్యాన్ని రద్దు చేయడం అసాధ్యం. వైవిధ్యం రద్దు కాకపోతే ఏ పెట్టుబడిదారీ సరుకైనా విశ్వవ్యాపిత మార్కెట్ సాధ్యం కాదు. అందుకే ప్రపంచ వ్యాపితంగా ఒకే తిండి తినే, ఒకే దుస్తులు ధరించే, ఒకే సంగీతం వినే, ఒకే జీవితం గడిపే మరమనుషుల్ని సృష్టించాలని సామ్రాజ్యవాదం ప్రయత్నిస్తోంది. దీన్నే కొందరు మేధావులు మెక్‌డొనాల్డైజేషన్ అని వ్యవహరిస్తున్నారు. పెట్టుబడికీ, మార్కెట్‌కూ సహజ స్వభావాలైన విస్తరణను, దురాక్రమణను అడ్డుకోవాలంటే ఇవాళ వైవిధ్యమే ఒక ముఖ్యమైన సాధనం.

ఇక, గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్ పుస్తకం విషయానికొస్తే, ప్రధానంగా మార్క్సిస్టు – లెనినిస్టులు చర్చించవలసిన అంశాలు కనీసం నాలుగున్నాయి. (నిజానికి ఈ పుస్తకం మీద వివరమైన, నిశితమైన విశ్లేషణే జరపవలసి ఉంది. అటువంటి విశ్లేషణ మార్క్సిస్టు – లెనినిసుట శిబిరంలోరీ తలెత్తుతున్న రివిజనిజాన్ని అర్థం చేసుకోవడానికి చాలా ఉపయోగపడుతుంది. ఇక్కడ రివజనిజం అనే మాటను దాని తొలి అర్థంలో – ప్రామాణిక సూత్రీకరణలను ఏవో కుంటిసాకులతో రివైజ్ చేయడం అనే అర్థంలో – వాడుతున్నాను. కాని, ఇక్కడ అటువంటి వివరమైన పరిశీలనకు కాక, ప్రధానమైన సూత్రీకరణలకే పరిమితమవుతున్నాను.) మొదటిది, ప్రపంచీకరణ ఎందుకోసం? రెండు, భారత దేశానికి స్వాతంత్ర్యం రాలేదని అనడం సరైందేనా? మూడు, ఇది అర్ధవలస, అర్ధ భూస్వామ్య సమాజమా? నాలుగు, మూడో ప్రపంచ దేశాలలోకి ప్రవహిస్తున్న విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి (ఎఫ్.డి.ఐ.) లక్ష్యం ఏమిటి?

ఈ నాలుగు ప్రశ్నలూ, వాటిపై చర్చా కేవలం రాజకీయార్థ శాస్త్రపు పండిత చర్చ కాదు. ఈ ప్రశ్నలకు జవాబులలోనే భారత విప్లవోద్యమ ఆచరణ ఇమిడి ఉంది. గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్ రచయితలు పైకి ఎంతగా అది తమ లక్ష్యం కాదని ప్రకటించినప్పటికీ, వాళ్ల విశ్లేషణ నుంచి కొన్ని తార్కిక అంచనాలను, విప్లవోద్యమ ఆచరణ ఎట్లా ఉండాలనే విషయంలో వాళ్ల అభిప్రాయాలను గ్రహించవచ్చు.

మొదటిగా, ఇవాళ ప్రపంచీకరణ ఎందుకు జరుగుతున్నదనే విషయంలో పుస్తకర రచయితలకు మొత్తంగా మార్క్సిస్టు – లెనినిస్టులందరికన్న భిన్నమైన అభిప్రాయాలున్నాయి. సాధారణంగా, మార్క్సిస్టు – లెనినిస్టులంతరూ ప్రపంచీకరణ నినాదాన్ని సామ్రాజ్యవాద దోపిడీకి కొత్త సాధనంగా చూస్తారు. యుద్ధాన్ని వాయిదా వేసే వ్యూహంలో, తమ సంక్షోభం నుంచి బైటపడే ఎత్తుగడలో భాగంగా సామ్రాజ్యవాదం, బహుళజాతి సంస్థల నాయకత్వంలోని ద్రవ్య పెట్టుబడి ఎంచుకున్న కొత్త నినాదం ప్రపంచీకరణ. ఈ నినాదాన్ని, దాని పరిణామాలను అర్థం చేసుకోవడానికి 'మారని దోపిడీ వ్యవస్థ – మారుతున్న దోపిడీ రూపాలు' అనేది విశ్లేషణా సాధనంగా ఉండాలి. మారుతున్న దోపిడీ రూపాలను మరింత ఎక్కువ నిశితంగా, వివరంగా విశ్లేషించాలనే మాట నిజమే. కాని, ఆ విశ్లేషణ దోపిడీని తక్కువ చేసి, రూపాల అధ్యయనంలో తనను తాను మరిచిపోగూడదు.

గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్ అట్లా తన ప్రారంభాన్ని మరిచిపోయింది. పెట్టుబడి మార్చుకుంటున్న రూపాల మిరుమిట్లకు గురయి, అసలు ప్రపంచీకరణ మూడో ప్రపంచ



దేశాలను పెట్టుబడిదారీ దేశాలుగా మార్చడానికే జరుగుతున్నదనే నిర్ధారణకు వచ్చింది. మూడో ప్రపంచ పెట్టుబడిదారీ అభివృద్ధి మార్గంలో ఆటంకాలు కల్పించడం గాని, స్థానిక భూస్వామ్య వర్గాలను తమ సాంఘిక ఆధారంగా వాడుకోవడం గాని ఇంకెంత మాత్రమూ సామ్రాజ్యవాదుల వ్యూహంలో భాగం కావని ఈ రచయితలు అంటారు.

ప్రపంచవ్యాప్తంగా ప్రపంచీకరణ ప్రయత్నాలు ఈ రచయితల నిర్ధారణలను నిజం చేయడం లేదు. కనీసం భారత సామాజిక వాస్తవికతనే తీసుకున్నా, 1990ల తర్వాతనైనా దేశంలో పెట్టుబడిదారీ ఉత్పత్తి శక్తులను గాని, సంబంధాలను గాని అభివృద్ధి చేసే ప్రయత్నం ఏమయినా జరిగిందా? నిజంగా స్వతంత్ర పెట్టుబడిదారీ విధానాన్ని ఇక్కడ అభివృద్ధి చేయడమే జరిగితే కొనసాగుతున్న అర్ధభూస్వామ్య ఉత్పత్తి సంబంధాల కన్న అది ప్రగతిశీలమైందే. కాని అరకొరగా జరుగుతున్న పెట్టుబడిదారీ అభివృద్ధి కూడా పూర్తిగా బహుళజాతి సంస్థల పైన ఆధారపడేలా చేసేందుకే జరుగుతోంది తప్ప మరొకందుకు కాదు. దళారీ వర్గాన్ని (అది ఉత్పాదక పెట్టుబడిదారీ వర్గం కూడా కాదు. కేవలం వడ్డీ వ్యాపార, చట్టా వ్యాపార, మధ్యవర్తిత్వ దోపిడీ వర్గం మాత్రమే) తయారు చేయడం, పెంపొందించడం మినహా ప్రస్తుతం ప్రపంచీకరణ దేశంలో స్వతంత్ర పెట్టుబడిదారీ వర్గ పెరుగుదలను అవకాశం కల్పించిందెక్కడ? ఆటంకాలు కల్పించనిదెక్కడ? ఇంతకూ ఇక్కడ స్వతంత్ర పెట్టుబడిదారీ వర్గాన్ని అభివృద్ధి చేయడమంటూ జరిగినా దానికి తొలిరోజుల పెట్టుబడిదారీ ప్రగతిశీల లక్షణాలు ఉండే అవకాశం ఉందా? అసలు, సామ్రాజ్యవాదమే ఎంత దిగజారిపోయిన దశలో మనం ఉన్నామంటే, తన దోపిడీ నిరాటంకంగా సాగడం కోసం ఒకప్పుడు తనను ఎదిరించిన భూస్వామ్యంతోనే అది మిలాఖత్తవుతోంది. శివసేనతో ఎన్రాన్ పొత్తు నుంచి వందలాది సంఘటనల్లో మొత్తం క్రమంలోనే ప్రపంచీకరణ భూస్వామ్యంతో ఎంత బాగా సహజీనం చేస్తున్నదో కనబడుతూనే ఉంది.

ఈ వాదన నుంచి విస్తరించేదే గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్ లోని రెండో నిర్ధారణ మూడో ప్రపంచ దేశాల్లోని వలసానంతర ప్రభుత్వాల రాజకీయ స్వాతంత్ర్యాన్ని అంగీకరించడంలో వామపక్షవాదులు తమ తిరస్కారాన్ని వదులుకోవాలని ఈ పుస్తకం పదే పదే చెపుతుంది. ప్రస్తుత ప్రపంచీకరణలో మూడో ప్రపంచ దేశాలు స్వతంత్రంగా పాల్గొంటున్నాయని అంటుంది. పాత భావాల్లో చాలా వాటిని వదుల్చుకోవాలనీ, మార్చుకోవాలనీ అంటుంది. పాత భావాలు పిడివాదంగా మారిపోయాయి గనుక వాటిని వదుల్చుకోవాలనే ఒక సరికొత్త ధోరణి ఈ మధ్య పదే పదే వినబడుతోంది. ఈ ధోరణికి వాస్తవ, అవాస్తవాలతో సంబంధం లేదు. ఏదైనా చాలాకాలంగా చెపుతున్నామంటే తప్పు, మార్పు కావాలి గనుక కొత్త మాటలు మాట్లాడాలి! సూర్యుడు తూర్పున ఉదయిస్తాడని చాలా కాలంగా అంటున్నాం గనుక అది పిడివాదం! ఇకనైనా దాన్ని వదుల్చుకోవాలి!

భారత దేశానికి 'స్వాతంత్ర్యం' వచ్చిందా లేదా అనే పండిత చర్చ చాలా కాలంగానే జరుగుతోంది. భారత కమ్యూనిస్టు పార్టీ కలకత్తా కాంగ్రెస్ (1948) సామ్రాజ్యవాదం ఏ ఒత్తిళ్ల

వల్ల దళారీ వర్గాన్ని చేరదీసి స్వాతంత్ర్య ప్రకటనల నాటకమాడిందో సరిగా, స్పష్టంగా ప్రకటించిన నాటి నుంచి భారత పాలకవర్గాలకు, పాలకవర్గాలలోని ఏదో ఒక సెక్షన్‌కు సత్ప్రవర్తన సర్టిఫికెట్ ఇవ్వదలచిన వాళ్లందరూ ఏదో ఒక స్థాయిలో స్వాతంత్ర్యం వచ్చిందని సన్నాయి నొక్కులు నొక్కుతూనే ఉన్నారు. కాకపోతే ఆ పండిత చర్చను మరింత క్లిష్టం చేస్తూ ఆర్థిక స్వాతంత్ర్యానికి, రాజకీయ స్వాతంత్ర్యానికి మధ్య విభజన రేఖలు కూడా గీస్తున్నారు. గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్ ఆ ఆలోచనాధారలో మరొక కెరటం. అంతే.

దేశంలో 1947 ఆగస్ట్ 15న జరిగింది అధికార మార్పిడి మాత్రమేనని, పాలకవర్గాలలో పెద్ద మార్పు రాలేదని గుర్తించడానికి నిజానికి మార్క్సిస్టు – లెనినిస్టులే కానక్కరలేదు. నిజాయితీ గల స్వాతంత్ర్య సమరయోధుల నుంచి ఉదార ప్రజాస్వామిక వాదుల దాకా ఎందరెందరో ఈ స్వాతంత్ర్యం ఎంత బూటకమో ప్రకటించే ఉన్నారు. ప్రజలను దోపిడీ చేయడానికి స్వాతంత్ర్యం వచ్చిన మళ్లీ స్వాతంత్ర్యం అనే భావజాలపు మాయలో పడిపోయిన వాళ్లూ స్వాతంత్ర్యాన్ని కీర్తిస్తున్నారు. ఆ స్వాతంత్ర్య కీర్తన బృందగానంలో కొత్తగా చేరుతున్నారు ఈ పుస్తక రచయితలు. ఆ క్రమంలో, స్వాతంత్ర్యం బూటకత్వాన్ని విప్పి చెపుతున్న మార్క్సిస్టు – లెనినిస్టు మీద విసుర్లు విసురుతున్నారు.

స్వాతంత్ర్యం వచ్చిందా లేదా అనే ప్రశ్న నుంచి భారత సమాజ స్వభావం ఏమిటనే ప్రశ్న తలెత్తుతుంది. భారతదేశాన్ని అర్ధవలస, అర్ధ భూస్వామ్య సమాజంగా అర్థం చేసుకునేవాళ్లను ఈ పుస్తకం కారికేచర్ చేసింది. కార్మికవర్గ నాయకత్వాన మాత్రమే నిజమైన స్వాతంత్ర్యం, నూతన ప్రజాస్వామిక విప్లవం సాధ్యమవుతాయనడం, ఒక మూర్ఖపు వాదన అన్నట్టుగానూ, అట్లా అనే వాళ్లు సామ్రాజ్యవాద విధానాలలో వస్తున్న మార్పులను చూడలేని గుడ్డివాళ్లు గానూ భావించే ఈ పుస్తకం, యుద్ధానంతరం దశాబ్దాలలో వచ్చిన మార్పులు మన సాంప్రదాయిక భావాలలో చాలా సమూలమైన మార్పులు చేసుకోవాలసిన స్థితిని కల్పించాయంటుంది. యధావిధిగా పాత భావాలను నమ్ముకుంటే గమ్యం నిష్ఫలమైపోతుందని వీళ్లంటారు. అర్ధవలస, నయా వలస, అర్ధ భూస్వామ్య అనే వాళ్లందరినీ కట్టగట్టి ఈ అవహేళనలన్నీ చేసిన తర్వాత, పుస్తకం హఠాత్తుగా తీర్పరి స్థానంలోకి వెళ్లి అసలు మొత్తం కమ్యూనిస్టు కార్యకర్తల ఆలోచనా పద్ధతులు మార్చుకోవాలని ఉచిత సలహాలిస్తుంది.

పెట్టుబడిదారీ అభివృద్ధి సహజంగానే అసమానంగా ఉంటుందని ఒక వైపు తామే ఒప్పుకున్నారు గనుక దేశం పెట్టుబడిదారీ దేశమయిందనీ అనలేకపోయారీ రచయితలు. పోనీ, తాము అర్ధభూస్వామ్య, అర్ధవలస, నయా వలస వాదనలను ఎందుకు ఖండిస్తున్నారో, ఆ వాదనలలోని తప్పేమిటో వివరించలేకపోయారు. ఆ వాదనలను 'సాంప్రదాయికం' అని కొట్టి వేస్తే సరిపోదని గ్రహించినట్టున్నారు గనుక హఠాత్తుగా సర్వసాపేక్షిక, నిర్లిప్త వాదంలోకి, వెళ్లి 'ఇటువంటి విషయాలు సాఫీగా పరిష్కారం కావు. వివాదాలూ, సందేహాలూ తప్పవు..' అని జ్ఞానోదయం తెచ్చుకున్నారు. తామే సృష్టించుకుని ఇరుక్కుపోయిన ఈ గందరగోళంలోంచి



బైటపడడానికి, కొన్ని ప్రశ్నలకు జవాబులు ఉండకపోవచ్చుననీ, ప్రతి విషయం మీద ఒక వైఖరి ఉంటుందనే భ్రమ నుంచి కమ్యూనిస్టు కార్యకర్తలు బైటపడాలనీ సలహా ఇచ్చారు.

కొన్ని ప్రశ్నలకు జవాబులు ఉండకపోవచ్చుననీ, ప్రతి ప్రశ్నకూ తుది జవాబు తమ దగ్గర ఉంటుందని కొందరు అమాయకులు అనుకుంటారనీ అనడం సరే. కాని, దేశంలో కొనసాగుతున్న ఉత్పత్తి విధానం ఏమిటనేది అటువంటి ప్రశ్నేనా? ఆడలేక మద్దెల ఓడన్న సామెత లాగ, ఉత్పత్తి విధానం ఏమిటో నిర్ధారిస్తే విప్లవ మార్గాన్ని నిర్ణయించాల్సి వస్తుంది గనుక, అసలు ఉత్పత్తి విధానం మీద ఏ నిర్ధారణకూ రాగూడదనడం జరిగిందా?

దేశంలో కొన్ని ప్రాంతాల్లో, పెట్టుబడిదారీ ఉత్పత్తి సాధనాలు ఏదో ఒక మేరకు ప్రవేశించినప్పటికీ, దేశవ్యాప్తంగా, అర్ధ భూస్వామ్య ఉత్పత్తి సంబంధాలే కొనసాగుతున్నాయి. వ్యవసాయ మిగులును పంపిణీ చేసుకుంటున్న పద్ధతులు, వడ్డీ వ్యాపారం, పెద్ద ఎత్తున శ్రమశక్తిని వ్యవసాయ రంగానికి కట్టివేయడం, కుల సంబంధాల ప్రాబల్యం, భూస్వామ్య, సంస్కృతి వంటి ఎన్నో కారణాలతో పాటు చట్టప్రకారం రద్దయిన భూస్వామ్యం ఆచరణలో కొనసాగడం మన సమాజాన్ని అర్ధభూస్వామ్య సమాజంగా చూపుతున్నాయి. అట్లాగే, దేశీయ పాలకవర్గాలు రాజకీయాధికారాన్ని అనుభవించగలుగుతున్నప్పటికీ, ఆ రాజకీయాధికారం కూడా సామ్రాజ్యవాద గుత్త పెట్టుబడి ప్రయోజనాలకు లోబడి ఉంది గనుక, వాస్తవంలో ఆర్థిక, రాజకీయ, సైనిక రంగాలలో సామ్రాజ్యవాద శక్తుల మీద ఆధారపడుతున్న రాజ్యం కొనసాగుతున్నది గనుక దీన్ని అర్ధ వలస అని పిలుస్తున్నాం.

ఈ సమాజం అర్ధ భూస్వామ్య, అర్ధ వలసగా ఉన్నదని గుర్తించడం కేవలం అకడామి విశ్లేషణ కాదు. అట్లా గుర్తించడమంటే ఈ సమాజంలో ప్రధాన వైరుధ్యం అశేష ప్రజానీకానకీ, భూస్వామ్యనికీ మధ్యన ఉందని గుర్తించడం. కార్మిక, కర్షక, మధ్యతరగతి, జాతీయ బూర్జువా వర్గాలు ఒకవైపునా, భూస్వామ్య, దళారీ పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద శక్తులు మరోవైపునా మోహరించిన యుద్ధం జరుగుతున్నదని గుర్తించడం. ఇట్లా గుర్తించడం ఒక నిర్దిష్ట కార్యాచరణకు దారితీస్తుంది గనుక, కార్యాచరణను వ్యతిరేకించడానికే అసలీ ప్రశ్ననే బ్రహ్మపదార్థం చేసే ప్రయత్నం జరిగింది.

గ్లోబలైజేషన్ ఆఫ్ కాపిటల్ చదువుతుంటే 'సమాచారపు కుప్పలో కోల్పోయిన జ్ఞానం' అనే టి.ఎస్. ఇలియట్ వాక్యం చాలాసార్లు గుర్తుకొచ్చింది. పెట్టుబడిదారీ దేశాల నుంచి మూడో ప్రపంచంలోకి ప్రవహిస్తున్న విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి (ఫారిన్ డైరెక్ట్ ఇన్వెస్ట్‌మెంట్) గురించి పేజీల కొద్దీ గణాంకాలు ప్రకటించిన ఈ పుస్తకం, ఆ సమాచారపు కుప్పలో పడి అసలు ఎఫ్.డి.ఐ. ఎందుకొస్తున్నదో విశ్లేషించడం మరిచిపోయింది. ఎఫ్.డి.ఐ. వల్ల పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందబోతున్నదని తాను అమాయకంగా నమ్మి పాఠకులను నమ్మించబోయింది

అసలు ఈ పుస్తక రచనకు తమను పురికొల్పిందని రచయితలు చెప్పుకున్న కారణమే తమ నిరాశను, సందేహాలను, అపనమ్మకాన్ని లోకానికి బదిలీ ప్రయత్నాన్ని తెలియజేస్తుంది.

సామ్రాజ్యవాదాన్ని మరణశయ్య మీద ఉన్న పెట్టుబడిదారీ విధానమని లెనిన్ నిర్వచించాడని పాఠం చెపతున్నప్పుడు యాభై ఏళ్లయినా ఇది నిజం కాలేదు గదా, పెట్టుబడిదారీ విధానం ఇఇంకా సజీవంగా, శక్తిమంతంగా ఉన్నది గదా అని ప్రశ్న వచ్చిందట. నిజానికి ఈ ప్రశ్నకు జవాబు చెప్పడం కష్టమేమీ కాదు. చారిత్రక గమనంలో ఒక శతాబ్దం ఎక్కువ కాలం కాదని చెప్పవచ్చు. పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం సజీవంగా, ఎక్కువ శక్తిమంతంగా కనబడుతున్న ఈ రూపం వెనుక దాగిన బలహీనతల సారాన్ని విప్పి చెప్పవచ్చు. కాని పుస్తక రచయితలు ఈ ప్రశ్నకు బెంబేలు పడిపోయి, జవాబు చెప్పలేకపోయామని, చెప్పిన జవాబులు చెపుతున్న వాళ్లను కూడా సంతృప్తి పరచలేకపోయాయని అన్నారు. అందువల్ల, మళ్లీ కొత్త విశ్లేషణకు పూనుకున్న ఫలితంగా ఈ పుస్తకం తయారయింది.

విలువైన సమాచారం, గణాంకాలు ఉండి కూడా దృక్పథంలో లోపాలుంటే ఎంత అసమగ్ర, అపసవ్య విశ్లేషణ వస్తుందో గురింతడానికి ఈ పుస్తకం ఒక తాజా ఉదాహరణ. సామ్రాజ్యవాదం తన చివరి యుద్ధంలో అన్ని అస్త్రాలనూ ప్రయోగిస్తున్న దశలో దాన్ని ఎదుర్కోవాలంటే మొట్టమొదట సరైన దృక్పథం ఉండడం అవసరం.

***అరుణతార, జనవరి - ఫిబ్రవరి 1999***



# 14

# నూతన వ్యవసాయ విధానం భూసంస్కరణలకిక చెల్లుచీటీ?

రాష్ట్ర ప్రభుత్వం తయారు చేస్తున్న నూతన వ్యవసాయ విధానానికి ప్రాతిపదికగా రాష్ట్ర ప్రభుత్వ వ్యవసాయ శాఖ ఒక అధ్యయ పత్రాన్ని ప్రకటించింది. ఆ పత్రంలోని అనేక సూచనల మీద అనుకూలంగాను, ప్రతికూలంగాను పెద్ద ఎత్తున చర్చ జరుగుతోంది. కానీ ఎంత చర్చ జరిగినా, అధ్యయన పత్రం ప్రకటించిన సూచనల వల్ల రానున్న భయంకరమైన దుష్పరిణామాల గురించి పూర్తిగా అవగాహన ఇంకా బైటపడడం లేదు.

అధ్యయనపత్రంలో ఏడో కీలకాంశంగా ప్రకటించిన 'కమతాల ఏకీకరణ, మెరుగైన వ్యవసాయ – పారిశ్రామిక ఐక్యత కోసం కార్పొరేట్, కాంట్రాక్టు వ్యవసాయానికి ప్రోత్సాహం' అనే అంశం మొత్తంగా భయంకరమైన సూచనలు చేసింది. ఆ సూచనలు జాతీయోద్యమ క్రమంలో వెలువడి, ఆ తర్వాత మన రాజకీయార్థిక విధానంలో భాగమైన అవగాహనలకు, ఆదర్శాలకు పూర్తిగా భిన్నమైనవి. ఆ సూచనలు చిన్న, సన్నకారు, మధ్యతరగతి రైతులను వ్యవసాయరంగం నుంచి బైటికి నెట్టేవి. ఆ సూచనలు భూమి లేని నిరుపేద రైతుకూలీల ఆశలను శాశ్వతంగా భగ్నం చేసేవి. ఆ సూచనలు గ్రామీణ వ్యవసాయరంగంలో సమానత్వాన్ని సాధించాలన్న ఆకాంక్షను నిస్సందేహంగా భూస్థాపితం చేసేవి.

ఆ సూచనలు ఉత్పత్తిని, ఉత్పాదకతను పెంచడం పేరు మీద పెద్ద కమతాలను ప్రోత్సహిస్తాయి. ఎగుమతి ప్రధాన, మార్కెట్ ప్రధాన పంటలను ప్రోత్సహించే పేరు మీద విశాల భూక్షేత్రాలను రూపొందించాలని నిర్దేశిస్తాయి. అంటే భూ గరిష్ట పరిమితి చట్టాలన్నిటినీ తుంగలో తొక్కి, వందల, వేల ఎకరాల భూస్వాములనూ, వ్యవసాయ వ్యాపారులనూ సృష్టిస్తాయి. వ్యవసాయరంగాన్ని పూర్తిగా మార్కెట్‌కు కట్టిపడేసి, అంతర్జాతీయ మార్కెట్ బలివేదిక మీద మన వ్యవసాయరంగాన్ని బలి ఇస్తాయి. మన గ్రామీణ, వ్యవసాయ రంగంలో ఇప్పటికే విపరీతంగా ఉన్న అసమానతలను, అంతరాలను ఇంకా పెంచి తద్వారా గ్రామీణ హింసా పునాదిని పెంచుతాయి.

ఇంత దుర్మార్గమైన సూచనలను చాలా యథాలాపంగా, సరళంగా, తడిగుడ్డలతో గొంతు కోస్తున్నట్లుగా ప్రకటించడంలోనే ఈ అధ్యయనపత్రపు అతి తెలివి కనబడుతుంది.

'సైద్ధాంతికంగా చూస్తే, చిన్న కమతాలలోనే జ్ఞాన ప్రధాన సాంకేతిక విధానాలను అమలు చేయడం ఆదర్శవంతంగా ఉంటుంది. కాని చిన్న రైతుకు చాలా ఇబ్బందులున్నాయి. భూమి మీద సురక్షితమైన యాజమాన్యం లేకపోవడం, తగిన ఉత్పత్తి కారకాలన్నీ పొందలేకపోవడం, పరపతి సౌకర్యం అందకపోవడం, గిట్టుబాటు ధరలు అందించే మార్కెటింగ్ అవకాశాలు లేకపోవడం వంటివి ఆ ఇబ్బందులు' అని చిన్న రైతు మీద, కమతాల మీద ఎంతో ప్రేమ ఉన్నట్టు నటించే ఈ అధ్యయన పత్రం ఈ ఇబ్బందులను పరిష్కరించే మార్గాలేమిటో, ఆ ఇబ్బందుల్ని తొలగించి చిన్న రైతులను ఎట్లా ఆదుకోవచ్చునో మాత్రం మాట్లాడదు.

పరిశ్రమలకు, బహుళజాతి సంస్థలకు కోట్ల కోట్ల రూపాయల రాయితీలు, మినహాయింపులు ఇచ్చే ప్రభుత్వాలు చిన్న రైతులకు తగిన ఉత్పత్తికారకాల్ని, పరపతి సౌకర్యాల్ని అందజేయకుండా ఆ లోపాల్ని ఎవరిమీదికో నెట్టడం క్రూరమైన పరిహాసం. వ్యవసాయానికి అవసరమైన, ముఖ్యంగా చిన్న కమతాలకు అవసరమైన ఉత్పత్తి కారకాల్ని చౌకగా అందించకుండా ప్రభుత్వాన్ని అడ్డుకున్న దెవరు? ప్రకటించిన పరపతి సౌకర్యాల్ని కూడా చిన్నరైతులకు అందించకుండా అవినీతికీ అక్రమాలకూ పాల్పడిందెవరు? ముఖ్యంగా పత్తిరైతుల ఆత్మహత్యల సందర్భంగా బైటపడిన వాస్తవం – ఒక జిల్లాలో రు. 120 కోట్ల పరపతి అవసరమని గుర్తించి, ఇస్తానని ప్రకటించి రు. 8 కోట్లు కూడా ఇవ్వలేదనే వాస్తవం – ఎవరి నిర్లక్ష్యానికి, దుర్మార్గానికి అద్దం పడుతోంది?

రైతులకు, ముఖ్యంగా చిన్న రైతులకు గిట్టుబాటు ధరలు అందకపోవడానికి కారణమెవరు? రాష్ట్రవ్యాప్తంగా ఎన్నో చోట్ల గిట్టుబాటు ధరలు అడిగిన రైతులపై లాఠీఛార్జీలు, కాల్పులు కూడా జరిపించిన ప్రభుత్వం ఎప్పుడైనా తానే ప్రకటించే కనీస ధరలను అమలు చేయడానికి కానీ, మార్కెట్ వ్యాపారుల అక్రమాలపై అడ్డుకట్ట వేసి, మార్కెట్‌లను నియంత్రించడానికి కానీ ప్రయత్నించిందా?

చిన్న రైతులు ఎదుర్కొంటున్న ఇబ్బందులను ఏకరువు పెట్టిన అధ్యయనపత్రం తర్వాత వాక్యంలోనే, ఆ ఇబ్బందులను ఎట్లా తొలగించాలో రాయకుండా, ఉపన్యాస శైలిలో మార్కెట్ అనుకూల ప్రవచనంలోకి వెళ్లిపోయింది. "విలువ పెంచడం, ఎగుమతి ప్రధాన వ్యవసాయం అనే రెండు లక్ష్యాల ద్వారా రాష్ట్ర స్థూల వ్యవసాయోత్పత్తిని పెంచడానికి మన దృక్పథం మారవలసి



ఉంటుంది" అని చిన్న రైతులను వదిలేసి ఉత్పత్తి, మార్కెటింగ్, ప్రాసెసింగ్ అనే భారీ వ్యవసాయ వ్యాపార పరిభాషలోకి వెళ్లిపోయింది. అక్కడ పాత దృక్పథమేమిటో నిర్వచించి, రావలసిన కొత్త దృక్పథమేమిటో ప్రకటించింది.

పాత దృక్పథం నాలుగు అంశాల పునాదిపై ఉందని అధ్యయనపత్రం సరిగానే గుర్తించింది. "వ్యవసాయ కార్మికులకు భూపంపకం ద్వారా సమానత్వ సాధన, తన భూమిని తానే సాగు చేసుకునే చిన్నరైతు ద్వారా ఎక్కువ ఉత్పాదకత, కనీస మద్దతు ధర, సబ్సిడీలు వంటి ఉత్పత్తి ప్రోత్సాహకాలు, మిగిలిన ఉత్పత్తినే ఎగుమతి చేయడం" అనే నాలుగు అంశాలు పాత దృక్పథంలో ఉన్నాయని, ఆ దృక్పథం పునాదిపై సాగే ఉత్పత్తి విధానం వ్యవసాయ పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడదని అధ్యయన పత్రం అంది.

రాష్ట్ర ప్రభుత్వ మహా మేధావులు తయారు చేసిన ఈ పత్రం వాదనా పద్ధతిలో విచిత్రమైన పోకడలు పోయింది. కొనసాగుతున్న దృక్పథం మౌలికాంశాలను సరిగానే ప్రకటించి, అక్కడ్నించి హఠాత్తుగా సంబంధం లేని మరో విషయంలోకి వెళ్లి, అది సాధించాలంటే ప్రస్తుత దృక్పథాన్ని వదిలేయాలని అంది. ఎవరయినా నేరుగా వాదించదలచుకున్న వాళ్లు ప్రస్తుత దృక్పథంలోని లోపాలేమిటో వివరించి, విశ్లేషించి, అందువల్ల ఆ దృక్పథాన్ని వదులుకొని కొత్త దృక్పథం అలవరుచుకోవాలని వాదిస్తారు.

మన రాష్ట్ర ప్రభుత్వ మేధావులకు, వారి వెనుక ఉన్న మెకన్సీ అండ్ కంపెనీ, ప్రపంచ బ్యాంకు మేధావులకు ఈ వాదన పద్ధతి నచ్చదు. ఇటువంటి సరైన, సహేతుకమైన వాద పద్ధతి పాటిస్తే వాళ్లు కావాలనుకున్న ప్రయోజనాలు నెరవేరవు. పాత దృక్పథం సమానత్వాన్ని, ఉత్పాదకత పెరుగుదలను, చిన్న రైతులకు సహకారాన్ని, మిగులు ఉత్పత్తిని మాత్రమే ఎగుమతి చేయడాన్ని నిర్దేశిస్తుంది గనుక, దృక్పథం మారాలంటే ఈ నాలుగు పునాదులూ మారాలన్న మాట.

నిజానికి ఈ దృక్పథం ఎన్ని ప్రగతిశీలమైన మాటలు చెప్పినా, ఎప్పుడూ వాటిని అమల్లో పెట్టిన పాపాన పోలేదు. అలా జరిగి ఉంటే ఎంతో కొంత సమానత్వం సాధ్యమై ఉండేది. ఉత్పాదకత పెరిగి మిగులు పెరిగి ఉండేది. చిన్న రైతుల జీవితాలు బాగుపడి ఉండేవి. ఆ దృక్పథాన్ని మరింత విస్తృతంగా, పకడ్బందీగా అమలు చేయవలసిన స్థితిలో రాష్ట్ర వ్యవసాయరంగం ఉండగా, అధ్యయన పత్రం ఆ దృక్పథంలోని లోపాలేమిటో చర్చించకుండానే దాన్ని వదుల్చుకోవడానికి ప్రయత్నిస్తోంది.

అట్లాగే పాత దృక్పథం వ్యవసాయ పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడదనే మాట అబద్ధం. గ్రామీణ వ్యవసాయరంగంలో సమానత్వం, వ్యవసాయోత్పత్తిలో పెరుగుదల, మిగులు వ్యవసాయాధార పరిశ్రమలను ప్రోత్సహిస్తాయని ప్రపంచంలోని ఎన్నో వ్యవసాయ సమాజాల అనుభవం తెలియజేస్తుంది.

అంటే పాలకవర్గాలకు ఇన్నాళ్లుగా ప్రకటిస్తూ వస్తున్న పాత దృక్పథాన్ని అమలు చేసే చిత్తశుద్ధి లేకపోవడం మాత్రమే కాదు, ఇకనుంచి ఆ దృక్పథాన్ని ప్రకటించి పేద ప్రజలను భ్రమల్లో ముంచవలసిన అవసరం కూడా కనిపించడం లేదన్న మాట. ఏవో కల్లబొల్లి మాటలతో ఆ దృక్పథాన్ని వదులుకుని, ప్రపంచబ్యాంకు, అంతర్జాతీయ వాణిజ్య పంటల వ్యాపార ముఠాలు

చెప్పినట్టుగా కొత్త దృక్పథాన్ని ప్రకటించదలచారన్న మాట. విజన్ 2020తో ప్రారంభమైన ఈ కొత్త దృక్పథమే ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వ కొత్త వ్యవసాయ విధానం కాబోతున్నదన్నమాట.

కొత్త దృక్పథం ప్రకారం మార్కెట్ ఏ పంటలు కోరుకుంటే ఆ పంటలనే పండించాలట. వ్యవసాయాన్ని మార్కెటింగ్, ప్రాసెసింగ్ వంటి వ్యాపార, పారిశ్రామిక ప్రయోజనాలతో సంబంధంలో మాత్రమే చూడాలట. ఎగుమతి – ప్రధాన వ్యవసాయం సాగాలంటే భారీగా పెట్టుబడులు కావాలట. అటువంటి పెట్టుబడులు కేవలం 'వ్యవస్థీకృత వ్యవసాయోత్పత్తి విధానం' నుంచే వస్తాయట. విడివిడిగా ఉన్న చిన్న కమతాలు అటువంటి పెట్టుబడులు పెట్టలేవట. 'రిజిస్ట్రేషన్, స్టాంప్ డ్యూటీ మినహాయింపులు ఇచ్చి చిన్న కమతాలు ఏకం కావడానికి' తోడ్పడాలట! 'కాంట్రాక్ట్ వ్యవసాయాన్ని ప్రోత్సహించడానికి, వేర్వేరు పంట భూములను వేర్వేరు కంపెనీలకు అప్పగించడానికి' తగిన చట్టాలు తేవాలట!

ఇదీ కొత్త దృక్పథం! చావుకబురు ఇప్పటికి చల్లగా బైటపడింది.

ఈ దృక్పథంలో సమానత్వం అనే మాట లేదు. చివరికి ఉత్పాదకత పెరగడం అనే మాట కూడా లేదు. మార్కెట్ పంటలు, ఎగుమతి పంటలు, భారీ కమతాలు – ఇవీ ఈ దృక్పథంలోని మౌలికాంశాలు. మార్కెట్ పంటల్లో, ఎగుమతి పంటల్లో అంతర్జాతీయ వ్యాపారులదీ, మారు బేరగాళ్లదీ పై చేయి కనుక మనం మన తిండిగింజల వ్యవసాయాన్ని వదిలేసి, మార్కెట్ పంటలను పండించాలి. ఆ పంటలకు చిన్న కమతాలు సరిపోవు కనుక, చిన్న పెట్టుబడులు సరిపోవు కనుక మనం ఎకరం, రెండెకరాల కమతాలన్నిటినీ 'స్వచ్ఛందంగా' వేల, లక్షల ఎకరాల బహుళజాతి సంస్థల, వాళ్ల దళారీల కమతాల్లోకి 'ఏకం' చెయ్యాలి!

మరి ఇప్పుడున్న భూగరిష్ట పరిమితి, భూసంస్కరణ చట్టాలు ఈ కొత్త దృక్పథానికి అడ్డం వస్తాయి కదా, అందుకని ఆ చట్టాలను రద్దు చెయ్యాలి. కొత్త దృక్పథానికి అనువైన కొత్త చట్టాల్ని తీసుకురావాలి.

ఈ దేశంలో అన్ని పాలకవర్గాలకూ భూస్వామ్యంలో, వ్యవసాయ మిగులులోనే సామాజిక పునాది ఉంది కనుక, ఈ యాభై సంవత్సరాలుగా ఏ ఒక్క పాలకవర్గ పార్టీ కూడా భూసంస్కరణలను చిత్తశుద్ధితో అమలు చేయలేదు. అదే సమయంలో, భూసంస్కరణ గురించి మాట్లాడకపోతే ప్రజా ఆకాంక్షలకు వ్యతిరేకం అవుతుంది కాబట్టి, భూ సంస్కరణల గురించి మాట్లాడని పార్టీ ఒక్కటి కూడా లేదు. కానీ తమ ప్రణాళికలకు, ప్రకటనలకు, వాగ్దానాలకు భిన్నంగా ఆయా పార్టీలన్నీ మిగులు సేకరణ, మిగులు భూముల పంపిణీ జరపకుండా తాత్సారం చేస్తూ వచ్చాయి. అందువల్ల రాష్ట్రంలో ప్రభుత్వ లెక్కల ప్రకారమే 60 శాతం కమతాల చేతిలో 20 శాతం భూమి ఉండగా, 0.7 శాతం కమతాల చేతిలో 8.8 శాతం భూమి ఉంది.

ఇప్పుడు కొత్త వ్యవసాయ విధానం ఈ భూ యాజమాన్యంలో అసమానతను ఇంకా పెంచదలచుకున్నదన్న మాట. భూసంస్కరణలు ఇప్పటికి అమలు చేయకపోవడం మాత్రమే కాదు, ఇక ముందు కూడా అమలు జరపబోమని చెబుతున్నదన్న మాట.

***ఆంధ్రప్రభ, మార్చ్ 3, 2000***



# 15

# సంస్కరణల హింసలో ద్వితీయ ఘట్టం

గత నాలుగు వారాలుగా అటు కేంద్ర ప్రభుత్వం, ఇటు రాష్ట్ర ప్రభుత్వం ప్రకటిస్తున్న రెండో దశ ఆర్థిక సంస్కరణల చర్యలు గుక్క తిప్పుకోనివ్వడం లేదు. ఒక చర్యమీద వ్యాఖ్యానించాలని అనుకుంటుండగానే మరోచర్య, దాని మీద వ్యాఖ్యానించబోతుండగానే ఇంకో చర్య వెల్లువలా వస్తున్నాయి. ఆ చర్యల మీద వ్యాఖ్యానించదలచిన విశ్లేషకులకే ఇంత ఇబ్బందికరంగా ఉంటే మలితరం ఆర్థిక సంస్కరణలు సామాన్య ప్రజానీకం మీద, పేద, మధ్య తరగతి వర్గాల మీద మరెన్ని దుష్ప్రభావాలు వేస్తాయో పూర్తిగా ఊహించడం కూడా అసాధ్యం.

మొత్తం మీద ఈ మలితరం ఆర్థిక సంస్కరణలు కనీసం ఒక్క విషయం రుజువు చేస్తున్నాయి. అటు కేంద్రంలోనయినా, ఇటు రాష్ట్రంలోనయినా అధికారం నడుపుతున్న పాలకవర్గాలకు ఈ దేశంలోని, రాష్ట్రంలోని పేదప్రజల కష్టాలపట్ల ఇసుమంతయినా పట్టింపులేదని, ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ, ప్రపంచ వాణిజ్య సంస్థ, బహుళజాతి సంస్థలు ఏమి చెపితే అది చేయడానికి సిద్ధంగా ఉన్నాయని ఈ చర్యలు రుజువు చేస్తున్నాయి.

ప్రపంచ వాణిజ్య సంస్థ ఆదేశాల మేరకు తయారవుతున్న ఎగుమతి – దిగుమతి విధానం తాజా ప్రకటన కేంద్రంలో 'స్వదేశీ' ప్రభుత్వ బండారాన్ని

బైటపెట్టింది. ఇంతవరకూ దిగుమతులపై ఆంక్షలు ఉండిన 1429 సరుకులలో నుంచి 714 సరుకులపై ఆంక్షలు తొలగించడం ద్వారా బిజెపి ప్రభుత్వం ఎగుమతి – దిగుమతుల విధానంలో తాను బహుళజాతి సంస్థల అడుగులకు మడుగులొత్తుతానని మరొకసారి చూపుకుంది.

బడ్జెట్ ప్రవేశపెట్టిన నాటి నుంచే మొదలయిన మలితరం సంస్కరణల గానంలో ఆరు వారాల లోపల జరిగిన చర్యలు చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. పెట్రోలియం ఉత్పత్తుల ధరల పెంపు, కొత్త ఎగుమతి – దిగుమతుల విధానం కింద ఆంక్షల తొలగింపుతో పాటు ప్రత్యేక ఎగుమతి ప్రాంతాల ఏర్పాటు, కొత్త అంతర్జాతీయ విమానాశ్రయాల ఏర్పాటు వంటి ఎన్నో చర్యలు ఎంతో త్వరితగతిన ప్రకటించబడ్డాయి. అమలు చేయబడుతున్నాయి.

వీటిలో ప్రతి ఒక్క చర్యా దేశ ఆర్థిక వ్యవస్థను ఎట్లా దెబ్బ తీస్తుందో, పేద, మధ్యతరగతి వర్గాలకు ఎట్లా ప్రాణాంతకంగా పరిణమిస్తుందో, బహుళజాతి సంస్థల లాభాలను ఎట్లా ఇంకా ఇంకా పెంచుతుందో చూపించవచ్చు. ఎగుమతులు పెంచుతామనే వాగ్దానం అంతిమంగా ప్రజలకు అవసరమైన ప్రాథమిక సరుకుల ఎగుమతిగా మారిపోయి ఆహార భద్రతను ఎట్లా దెబ్బతీస్తుందో చూపించవచ్చు. దిగుమతి సరుకులు పెంచడం, ఒకవైపు విదేశీ మారక నిల్వలు తరిగిపోవడానికి, మరోవైపు ఆయా వస్తువుల స్వదేశీ, చిన్న ఉత్పత్తిదారులు దెబ్బతినడానికి దారి తీస్తుందో చూపించవచ్చు. మొత్తం మీద 'స్వదేశీ' ప్రభుత్వ విధానాలు స్వదేశాభిమానులయిన ప్రజల జీవితాలను అతలాకుతలం చేసి, విదేశీ బహుళజాతి సంస్థలకు, ఓ పిడికెడు మంది స్వదేశీ దళారులకు ఎట్లా లాభాలు సమకూర్చి పెడతాయో చూపించవచ్చు.

ఈ మొత్తం తొలి, మలి ఆర్థిక సంస్కరణల కార్యక్రమాన్ని ఒక్క మాటలో చెప్పాలంటే 'ప్రపంచీకరణ' అని చెప్పాలి. ఈ ప్రపంచీకరణ వల్ల నిరుద్యోగం పెరుగుతోంది. ఆర్థిక అసమానతలు పెరుగుతున్నాయి. సామాజిక భద్రత కొరవడుతోంది. ప్రపంచీకరణ వల్ల స్థిరత్వం, సామాజిక, ఆర్థిక మార్పులు, ఉపాధి కల్పన వంటి అంశాల్లో ప్రత్యేకించి సవాళ్లు ఎదురవుతున్నాయి... ప్రపంచీకరణ గురించి ఈ విమర్శలు చేసింది ప్రభుత్వ వ్యతిరేకులెవరో కాదు. స్వయానా ప్రపంచీకరణ క్రమాన్ని అమలు చేస్తున్న భారతీయ జనతా పార్టీ ప్రభుత్వంలో మానవ వనరుల శాఖ మంత్రి మురళీ మనోహర్ జోషి గురువారం నాడు జి–77 దేశాల సమావేశంలో హవానాలో ఈ విమర్శలు చేశారు.

నిజానికి ప్రపంచీకరణ, ఆర్థిక సంస్కరణల క్రమంలో భాగంగా ఇటువంటి కపటత్వం, రెండు నాల్కల ధోరణి కూడా విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఒకవైపేమో ఆ విధానాలను తు.చ. తప్పకుండా అమలు చేస్తూ ఉండడం, మరోవైపు ఆ విధానాలను విమర్శకుల కంటే ఘాటుగా విమర్శిస్తూ ఉండడం. అంటే నూతన ఆర్థిక విధానాలు దేశ ఆర్థిక వ్యవస్థను దివాళా ఎత్తించడం మాత్రమే కాదు. మన పాలకుల మాట తీరులో కూడా దివాళా కోరుతనాన్ని ప్రవేశపెట్టాయన్న మాట.

ఈ దివాళాకోరుతనానికి మన సమీపంలోని నిదర్శనం రాష్ట్ర ప్రభుత్వ, పాలక పక్ష ప్రకటనలు. కేంద్రం నిత్యావసర వస్తువుల సరుకుల ధరలు పెంచినప్పుడు, కేంద్ర బడ్జెట్లో



ఎరువుల సబ్సిడీలు తగ్గించినప్పుడు అందరికంటే ఎక్కువగా విమర్శించింది తెలుగుదేశం పార్టీ. బడ్జెట్‌లోని ప్రజా వ్యతిరేక నిర్ణయాలు ఒకటి రెండు ఉపసంహరించడానికి కారణమైన ఒత్తిడిని తీసుకొచ్చింది తెలుగుదేశం పార్టీ.

సరిగ్గా రెండు వారాలు తిరగకుండానే, అదే తెలుగుదేశం పార్టీ ప్రభుత్వం అటువంటి చర్యలనే ప్రకటిస్తే ఎట్లా అర్థం చేసుకోవాలి? 'తాను చేస్తే లౌక్యం, ఇతర్లు చేస్తే మోసం' అని మధురవాణి రామప్పంతుల్ని ఎగతాళి చేసినట్టు, రాష్ట్ర పాలక వర్గాలు ఆర్థిక సంస్కరణల క్రమంలో బహుళ జాతి సంస్థలు, అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు చెప్పిన పనులు యథాతథంగా అమలు చేస్తూ అవే మరొకరు చేస్తే మాత్రం ఒంటికాలి మీద లేస్తున్నాయన్న మాట.

మలితరం సంస్కరణల్లో భాగంగా రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో జరిగిన రెండు మూడు ముఖ్యమయిన పరిణామాలను పరిశీలిస్తే, వాటి అంతరార్థాన్ని విశ్లేషిస్తే ఈ రెండు నాల్కల ధోరణి బైటపడుతుంది. సబ్సిడీ బియ్యం ధరల పెంపు, విద్యుత్ చార్జీల పెంపు, విద్యుత్ పంపిణీ కంపెనీల ఏర్పాటు, ప్రపంచ బ్యాంక్ రుణంతో పేదరికం నిర్మూలనా కార్యక్రమం అనే నాలుగు ఇటీవలి చర్యలనే చూద్దాం.

'అధికారంలోకి వస్తే మనం చాలా చేస్తామని ప్రజలు ఆశించారు. కానీ ఒకదాని వెంట ఒకటి ధరలు పెరగడం వారిలో అసంతృప్తి కలిగిస్తోంది. మీ ఎన్నికలు అయిపోయాయి. కాబట్టి మీరిలా నిర్ణయాలు తీసుకుంటున్నారని, వచ్చే పంచాయితీ మండలాల ఎన్నికల్లో ప్రజల దగ్గరకు ఎలా వెళ్లాలని కిందిస్థాయి నాయకులు మమ్మల్ని అడుగుతున్నారు. ఇది కొద్దిగా ఇబ్బందిగానే ఉంది' అని ఒక సీనియర్ మంత్రి కాబినెట్ సమావేశంలో అన్నారని పత్రికలు రాశాయి.

ఆ అభిప్రాయంతో మరి కొందరు మంత్రివర్గ సహచరులు ఏకీభవించినా ధరల పెంపు నిర్ణయాన్ని కాబినెట్ ఆమోదించింది. విద్యుత్ సబ్సిడీ కింద రాష్ట్ర ప్రభుత్వం రెండు వేల కోట్ల రూపాయలు భరిస్తోందని, బియ్యం సబ్సిడీ కేంద్ర ప్రభుత్వం ధరలు పెంచినందువల్ల మరి నాలుగు వందల కోట్ల రూపాయలు పెరిగిందని ముఖ్యమంత్రి అన్నారట. కేంద్రం సబ్సిడీ తగ్గించగానే కర్ణాటక ప్రభుత్వం కూడా ధరలు పెంచిందని, అందువల్ల మనం కూడా పెంచవచ్చునని ఆయన అన్నారట. ఈ పరిస్థితులు ప్రజలకు వివరించి చెపితే ప్రజలు ధరల పెంపును అంగీకరిస్తారని కూడా ఆయన అన్నారట.

'ధరలు పెంచండి మహాప్రభో, మాకేమీ ఇబ్బంది లేదు' అని వేడుకుంటున్న ఆ ప్రజలు ఎక్కడ ఉన్నారో తెలియదు కానీ ఈ మొత్తం తర్కమే తలకిందుల తర్కం. పెసరు చేన్లో పోగొట్టుకున్న కడియాన్ని పప్పుదాకలో వెతికినట్టు సబ్సిడీల వల్ల భారం పెరిగిందని, ఆ భారాన్ని ప్రజలు భరించాలని అనడం కుతర్కం.

మొట్టమొదట సబ్సిడీలుగా ప్రభుత్వం ప్రజలకు ఇస్తున్నది ప్రజా ధనమే తప్ప ఏలిన వారి జేబుల్లోనుంచో, స్విస్ ఖాతాల్లో నుంచో ఇస్తున్నది కాదు. అసలు తప్పు పట్టవలసి ఉంటే

ప్రజలు ఇంకా సబ్సిడీలు అవసరమైన స్థితిలో ఉండేలా చేసిన ఆర్థిక వ్యవస్థా నిర్వాహకులను తప్పుపట్టాలి. ఇప్పుడు మొత్తం పేద, మధ్యతరగతి వర్గాలకు ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీలు ప్రజల నుంచి వసూలు చేస్తున్న పన్నుల ఆదాయంలో అయిదు శాతం కన్నా తక్కువే. కానీ ప్రతిలోటుకూ, కొరతకూ ఈ అయిదు శాతం దిష్టిబొమ్మ వేపు చూపించడం పాలకులకు అలవాటయి పోయింది.

మరోవైపు సంపన్నులకు, పారిశ్రామికవేత్తలకు, భూస్వాములకు, పాలకవర్గాల ఆశ్రితులకు అందుతున్న సబ్సిడీలు ఇంతకన్నా ఎన్నో రెట్లు ఎక్కువ. కాకపోతే వాటిని 'సబ్సిడీ'లు అనే నిందా వాచకంతో గాక 'ప్రోత్సాహకాలు, రాయితీలు, మినహాయింపులు' వంటి ముద్దు పేర్లతో పిలుస్తారు. ఈ ముద్దు పేర్ల వల్ల ప్రజల దృష్టి, చివరికి మేధావుల దృష్టి కూడా ఇటువంటి సబ్సిడీల వైపు మళ్లదు.

మొత్తంగా ప్రజాభిప్రాయాన్ని సబ్సిడీలకు వ్యతిరేకంగా రెచ్చగొట్టడానికి కారణం ఏమిటి? ప్రపంచ బ్యాంకు తదితర అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు ప్రభుత్వ వ్యయం తగ్గిస్తేనే అప్పులిస్తామని షరతు పెడుతుంటాయి. ప్రభుత్వ వ్యయం తగ్గించడమంటే మంత్రులకు, ఎం.ఎల్.ఎ.లకు, ఎం.పి.లకు అలవెన్సులు తగ్గడం కాదు. వారి రక్షణ వ్యయం తగ్గడం కాదు. ముడుపులకు అవకాశం ఉండే ఆయుధాలు, భారీ యంత్ర సామాగ్రి కొనుగోళ్లు తగ్గడం కాదు.

ప్రభుత్వ వ్యయం తగ్గడమంటే కేవలం ప్రభుత్వరంగ సంస్థల నుంచి ప్రభుత్వం బైటికి వచ్చి ఆయా పరిశ్రమలను ప్రైవేటు పెట్టుబడులకు అప్పగించడం, పేదలకు, మధ్యతరగతి వర్గాలకు అందించే సహాయాన్ని, సబ్సిడీలను, సంక్షేమ పథకాలను రద్దు చేసి ఆయా వర్గాలను ప్రైవేటు పెట్టుబడుల లాభాపేక్షకు బలిచేయడం.

సరిగ్గా కేంద్ర – రాష్ట్ర ప్రభుత్వాలు ఈ రెండు పనులూ చేస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థలలో పెట్టుబడి ఉపసంహరించడాన్ని, రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డును ముక్కలు ముక్కలు చేసి ప్రైవేటీకరించడాన్ని, సబ్సిడీల కోత విధించి నిత్యావసర వస్తువుల ధరలను, విద్యుత్ చార్జీలను పెంచడాన్ని ఈ నేపథ్యంలోనే అర్థం చేసుకోవాలి.

అందుకే కేంద్రాన్ని, ప్రత్యేకించి రాష్ట్రాన్ని ప్రపంచ బ్యాంక్ తెగ ప్రశంసిస్తోంది. రాష్ట్ర ప్రభుత్వం ప్రజా సంక్షేమం కోసం 'సాహసోపేత నిర్ణయాలు' తీసుకుంటోందట! సాహసం సంక్షోభానికి అవసరంగానీ, సంక్షేమానికి అవసరమా?

***ఆంధ్రప్రభ, ఏప్రిల్ 15, 2000***



# 16

# సంఖ్యావాహిని ఎవరి ప్రయోజనాల 'వాహిని'?

ప్రజా ప్రయోజనాలను, దేశ ప్రయోజనాలను విదేశాలకు, సంపన్నులకు, బహుళజాతి సంస్థలకు తాకట్టుపెడుతూ ప్రజలకు అర్థంకాని భాషలో మాయ మాటలు మాట్లాడడం మన పాలకులకు బాగా అలవాటయింది. మరీముఖ్యంగా ఏ విషయాన్నయినా హైటెక్ పరిభాషలో మాట్లాడడం, హైటెక్ పదజాలపు మాయాజాలంలో ప్రజల్ని మోసం చేయడం ఏలినవారు ఒక కళగా అభివృద్ధి చేస్తున్నారు. ఈ విచిత్ర నాటకంలో కొత్త సన్నివేశం సంఖ్యావాహిని వివాదం.

సంఖ్యావాహిని అనగానే అదేదో మనకు అర్థం కాని విషయం అని సాధారణ పాఠకులు, ప్రజలు పక్కకు తప్పుకోవడం సహజం. కానీ సంఖ్యా వాహిని అనేదేమీ అంత అర్థంకాని బ్రహ్మ పదార్థంకాదు. ఒకవేళ నిజంగా బ్రహ్మ పదార్థమైనా, అది ప్రజా ప్రయోజనాలకు వ్యతిరేకమయినది గనుక, దేశ సంపదను విదేశీయులకు దోచిపెట్టేది గనుక, రహస్యంగా ఉంచవలసిన దేశ వ్యవహారాలను విదేశీ ప్రభుత్వాలకు, గూఢచార సంస్థలకు అప్పనంగా అప్పగించేది గనుక, దానితో వ్యవహరిస్తున్న పద్ధతి, మనుషులు అనుమానా స్పదంగా ఉన్నారు గనుక ప్రతి ఒక్కరూ సంఖ్యావాహిని గురించి తెలుసుకోవలసి ఉంది. సంఖ్యావాహిని అసలు గుట్టువిప్పవలసి ఉంది.

సంఖ్యావాహిని అనేది దేశవ్యాప్తంగా ఇంటర్నెట్ కోసం నెలకొల్పదలచిన, అత్యున్నత వేగవంతమైన సమాచార సంబంధాల కోసం ఉద్దేశించిన వ్యవస్థా నిర్మాణం. ఈ పథకం మొత్తం వ్యయం పదమూడు వందల కోట్ల రూపాయలవుతుందని ఒక అంచనా. ప్రభుత్వం ఈ అంకె విషయంలో స్పష్టమైన ప్రకటన చేయకపోవడం వల్ల ఈ ఖర్చు వందకోట్ల వరకు ఎంతయినా కావచ్చునని ఊహాగానాలున్నాయి.

సంఖ్యావాహిని ఇండియా లిమిటెడ్ అని ఈ పథకం కోసం ఏర్పడుతున్న సంస్థను భారత ప్రభుత్వ టెలికమ్యూనికేషన్స్ శాఖ, ఐయు నెట్ అనే అమెరికన్ కంపెనీ కలిసి స్థాపిస్తాయి. టెలికమ్యూనికేషన్స్ శాఖకు ఈ సంయుక్త సంస్థలో 51 శాతం వాటా ఉన్నప్పటికీ, కంపెనీ వ్యవహారాలను నిర్ణయించే అధికారం ఐయు నెట్‌కే ఉంటుంది. టెలికమ్యూనికేషన్స్ శాఖ ఇప్పటికి నెలకొల్పిన, నెలకొల్పబోయే 10,000 కిలోమీటర్ల ఆప్టికల్ ఫైబర్ వ్యవస్థను, ఇంకా కావలసిన సౌకర్యాలను సంఖ్యావాహినికి అందజేస్తుంది.

ఇప్పుడు భారతదేశంలో లక్షలాది మంది ఇంటర్నెట్ వాడకందార్లకు విద్యా సంబంధమైన, సమాచార సంబంధమైన వివరాలను అందించడం కోసం రూపొందిస్తున్నామని చెపుతున్న సంఖ్యావాహిని ఆ ఉద్దేశిత లక్ష్యాలకన్నా ఎక్కువ ఆశిస్తోంది. సమాచార రంగంలో పనిచేస్తున్న ప్రభుత్వరంగ సంస్థ విదేశీ సంచార్ నిగమ్ లిమిటెడ్ (వి.ఎస్.ఎన్.ఎల్.) ప్రస్తుతం ఏ పని నిర్వహిస్తున్నదో, అంటే దేశ వ్యాపిత ఇంటర్నెట్ పునాది నిర్మాణాన్ని సమకూరుస్తున్నదో, ఆ పని చేయడం సంఖ్యావాహిని ఉద్దేశం. అందులోనూ అది ఒక ప్రభుత్వ రంగ సంస్థను విచ్ఛిన్నం చేయడానికి రైల్వేలు, గ్యాస్ అథారిటీ ఆఫ్ ఇండియా, ఆయిల్ అండ్ నేచురల్ గ్యాస్ కమిషన్ వంటి ఇతర ప్రభుత్వ రంగ సంస్థల పునాది నిర్మాణాలను వాడుకుంటుంది.

ఇంత విశాలమైన పరిధిగల సంఖ్యావాహినిని కేంద్ర ప్రభుత్వం గుట్టు చప్పుడు కాకుండా ప్రకటించింది. పని ప్రారంభించింది. ఏవో అంతర్గత కారణాల వల్ల రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆర్ఎస్ఎస్) ఈ పథకాన్ని ఖండిస్తూ ఒక కరపత్రం వేసింది. ప్రచారం ప్రారంభించింది. మరోవైపు కేంద్ర మాజీ మంత్రి, భారతీయ జనతాపార్టీ ఉపాధ్యక్షుడు మదన్‌లాల్ ఖురానా ఈ పథకాన్ని ఖండిస్తూ పార్లమెంట్‌లో గొంతెత్తుతానని బెదిరించి ఆ తర్వాత వెనక్కి తగ్గారు. సంఘ్ పరివార్‌లోని ముఖ్యులు ఈ పథకాన్ని వ్యతిరేకించడం మాత్రమే కాక, ఈ పథకం రావడానికి కారకులయిన చంద్రబాబు నాయుడు మీద కూడా ఆరోపణలు చేశారు.

ఈ కారణాల వల్ల సంఖ్యావాహిని బహిరంగ వివాదం కాక తప్పలేదు. సంఘ్ పరివార్ చేస్తున్న ఆరోపణలు వాస్తవమే అయినా, వారికి ఆ ఆరోపణలు చేసే అర్హత ఉందా అనీ ప్రశ్నలు వస్తున్నాయి. మొత్తం మీద ఈ గందరగోళం వల్ల ప్రభుత్వం గానీ, ఇతర సంబంధిత వ్యక్తులు గానీ జవాబు చెప్పవలసిన ప్రశ్నలేవో బహిర్గతమయ్యాయి. దాదాపు రెండు మూడు నెలలుగా ఈ రచ్చ జరుగుతున్నప్పటికీ అటు ఎన్‌డిఎ ప్రభుత్వం, ఇటు సంబంధిత వ్యక్తులందరూ బుకాయింపులకూ, బెదిరింపులకూ, వక్రీకరణలకూ తప్ప వాస్తవాలు చెప్పడానికి సిద్ధపడడం లేదు. మరోవైపు నిశ్శబ్దాన్ని పాటిస్తున్నారు.



అసలు ఇంటర్నెట్ పునాది వ్యవస్థ కోసం ఒక కొత్త సంస్థ, ఒక కొత్త పథకం అవసరం ఏమొచ్చిందన్నది మొదటి ప్రశ్న.

దేశవ్యాప్తంగా ఇప్పటికే టెలికమ్యూనికేషన్ శాఖ నేతృత్వంలో మాత్రమే కాక ఎన్నో ప్రభుత్వరంగ సంస్థల చేతుల్లో దేశ వ్యాపిత సమాచార సంబంధాల వ్యవస్థలున్నాయి. ఆ వ్యవస్థలన్నిటినీ సమీకరించడం, అన్ని సంస్థల అవకాశాలనూ అన్ని సంస్థలూ వాడుకునేలా సౌకర్యాలు కలగజేయడం చేయవచ్చు. ఆప్టికల్ ఫైబర్ వ్యవస్థను ఏర్పాటు చేయదలిస్తే, అది కూడా ప్రజాధనంతోనే ఏర్పాటు చేస్తున్నారు గనుక, ప్రజలకు జవాబుదారీగా ఉండే ఏ మంత్రిత్వశాఖ కిందనో దాన్ని రూపొందించవచ్చు.

నిజానికి ఇటువంటి దేశవ్యాపిత వ్యవస్థ అవసరమవుతుందని, ఈ రంగంలో అనుభవం ఉన్న బ్రిటిష్ టెలికాంతో కలిసి అది ఏర్పాటు చేస్తానని విఎస్ఎన్ఎల్ నాలుగైదు సంవత్సరాల కిందనే ఒక ప్రతిపాదన చేసింది. కానీ అప్పుడు టెలికాం కమిషన్ ఆ ప్రతిపాదనను కొట్టివేసి, భాగస్వామిగా ఎవరుంటారని విఎస్ఎన్ఎల్ ముందే తేల్చగూడదని, అంతర్జాతీయ స్థాయి టెండర్లు పిలిచి, అర్హతను బట్టే భాగస్వామ్యం ఇవ్వాలని సలహా ఇచ్చింది.

ఇప్పుడు మరి ఐయునెట్ అనే కంపెనీకి భాగస్వామ్యం ఎలా ఇచ్చారు, ఎవరు ఇచ్చారు అనే ప్రశ్నలు సహజంగా వస్తాయి. నిజానికి సంఖ్యావాహిని ఒప్పందంపై సంతకాలు జరిగిన 1998 అక్టోబర్ 16 నాటికి ఐయు నెట్ అనే కంపెనీ పుట్టనేలేదు. 1999 జనవరి 8న కంపెనీ అమెరికాలో నమోదయింది. అంటే భారత ప్రభుత్వం ఇంకా పుట్టని ఒక అమెరికా కంపెనీతో పదమూడు వందల కోట్ల రూపాయల పథకంపై ఒప్పందం చేసుకుందన్న మాట.

ఇక్కడ గ్లోబల్ టెండర్లు లేవు. ఆ టెండర్లకు ప్రతిపాదనలు ఇవ్వడానికి ముందస్తు సాంకేతిక, ఆర్థిక షరతులు లేవు. ఆ షరతులన్నీ నెరవేర్చిన కంపెనీలలో ఎవరు తక్కువ కొటేషన్ ఇస్తే వారికే ప్రాజెక్టు ఇవ్వాలనే నిబంధనలు లేవు.

ఇంత హడావుడిగా, ఇంత గందరగోళంగా, ఇంతగా నిబంధనలను తుంగలో తొక్కుతూ సంఖ్యావాహిని ఎందుకు సృష్టించవలసి వచ్చింది?

అంతేకాదు, ఐయునెట్ అనే కంపెనీయే లేదు కాబట్టి దానికి ఇటువంటి పనిలో అనుభవం ఉండడం అనే సమస్యే తలెత్తదు. ఒకవేళ ఆ కంపెనీ ఉన్నా, టెలి కమ్యూనికేషన్స్‌లో విదేశీ సంస్థలు చొరబడితే రక్షణ రహస్యాల లీకేజీకి అవకాశం ఉంటుంది గనుక ఏ దేశం కూడా ఇటువంటి కాంట్రాక్టును ఇంత హడావుడిగా, ఇంత రహస్యంగా ప్రకటించదు. సంయుక్త రంగపు కంపెనీలో టెలికమ్యూనికేషన్స్ శాఖ ఎంత పప్పు తేవాలో స్పష్టంగా రాసుకున్నారు గానీ, ఐయునెట్ తెచ్చే పొట్టు సంగతి ఎక్కడా రాయలేదు. ఊదుకుని పప్పుతినేది మాత్రం ఐయునెట్.

ఇంతకూ ఈ ఐయునెట్ అనే కంపెనీకి డాక్టర్ రాజ్‌రెడ్డి ఛైర్మన్. ఆయన కార్నెజీమెల్లాన్ యూనివర్సిటీలో ప్రొఫెసర్. హైదరాబాద్‌లోని ఐఐఐటి కి కూడా ఛైర్మన్‌గా ప్రకటించినప్పటికీ ఆయన అమెరికన్ పౌరసత్వం వదులుకోలేదు. ఈ ఐయునెట్ కంపెనీకి మరొక డైరెక్టర్ వి.ఎస్.

అరుణాచలం. గతంలో ఆయన భారత ప్రభుత్వంలో రక్షణ శాఖలో ముఖ్యమైన పదవుల్లో పనిచేసి, శతఘ్నులు కొనడంతో సహా అనేక వ్యవహారాల్లో కోట్లాది రూపాయలు కైంకర్యం చేశాడనే ఆరోపణలు వచ్చాక దేశం వదిలి వెళ్లిపోయి కార్నెజీమెల్లాన్ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా చేరాడు. సంఖ్యావాహిని పథకం అమలు కావడంలో ఈ ఇద్దరితో పాటు చంద్రబాబునాయుడు వ్యూహం పన్నారని ఆర్‌ఎస్‌ఎస్ ఆరోపిస్తోంది.

నిజంగానే జస్వంత్‌సింగ్ అధ్యక్షుడుగా, ప్రొఫెసర్ ఎం.జి.కె. మీనన్, చంద్రబాబు నాయుడు ఉపాధ్యక్షులుగా ఉన్న ఐటి టాస్క్‌ఫోర్స్ 1998 సెప్టెంబర్ 5న జరిగిన సమావేశంలో దేశ వ్యాపిత ఇంటర్నెట్ పునాది నిర్మాణానికి ఒక సంస్థను రూపొందించాలని సూచించింది. ఇటువంటి సూచన చెయ్యవలసిన బాధ్యత ఐటి టాస్క్‌ఫోర్స్ పరిధిలో ఏమీ లేదు. అయినా వాళ్లు ఆ సూచన చెయ్యడం, ఆ తర్వాత పనులన్నీ చకచకా క్షణాల మీద జరిగిపోవడం జరిగింది. నెలన్నర తిరగకుండానే ఐయునెట్‌తో కలిసి సంఖ్యావాహిని ఏర్పడింది.

స్వదేశీ పేరుతో విదేశీ కంపెనీలకు (లేదా నల్లతోలు గలవాళ్లే అధిపతులుగా ఉన్న విదేశీ సంస్థలకు) దేశాన్ని తెగనమ్మే పనిలో తలమునకలుగా ఉన్న ఎన్.డి.ఎ. ప్రభుత్వం టెలికాం కంపెనీలలో విదేశీ వాటా 49 శాతం దాటకూడదన్న ఆంక్షను తొలగించి దాన్ని 74 శాతం చేసింది. అప్పుడు అభ్యంతరపెట్టని ఆర్‌ఎస్‌ఎస్‌కు ఇప్పుడు అభ్యంతరపెట్టడానికి వేరే కారణాలుండవచ్చు.

కానీ అప్పుడయినా, ఇప్పుడయినా, ఎప్పుడయినా మనను విదేశీ బేహారులకు ఖండఖండాలుగా అమ్ముతున్న ఈ కసాయిల కత్తికి మనం ఇట్లా తలవంచుతూ ఉండవలసిందేనా?

***ఆంధ్రప్రభ, మే 20, 2000***



# 17

# అంకెల గారడీ వెనుక అసలు నిజాలు

అంకెలు మనిషి కనిపెట్టిన చిత్రమైన మాయలన్నిటిలోకీ అతి చిత్రమైన మాయ. అంకెలను ఉపయోగించి ఒక విషయాన్ని బాగా వివరించనూ వచ్చు, ఏదైనా విషయాన్ని వివరించకుండా ఉండాలంటే, సగం సగం వివరించాలంటే, దాచాలంటే అంకెలను వాడుకోవచ్చు. గారడీ చేయవచ్చు.

అంకెలు కనబడగానే అవి వివరణా సాధనాలు కదా అని సగం మంది ఆ గారడీని నమ్మేస్తారు. మిగతా సగం మంది అంకెలను చూడగానే భయపడి, ఇది మనకు తెలిసిన వ్యవహారం కాదులే అని పక్కకు తప్పుకుంటారు. వెరసి, అంకెలు వాడదలచిన వాళ్ల ప్రయోజనం సజావుగా నెరవేరిపోతుంది.

ఇవాళ మన రాష్ట్రంలో విద్యుత్ చార్జీల పెరుగుదల గురించిన వ్యవహారం చూస్తుంటే ఏలినవారు అంకెల గారడీలో ఎంత సిద్ధహస్తులయ్యారో చూసి ముచ్చటేస్తుంది. ఒకటి రెండు మూడు లెక్కపెట్టి, లేదా లాప్‌టాప్‌లో మీటలు నొక్కి, విషగుళికలను కూడా ప్రజల చేత సునాయాసంగా మింగించగల నేర్పరులయిపోయారు మన పాలకులు!

ఉదాహరణకు విద్యుత్ చార్జీల పెంపుదలకు సమర్థనగా విస్తారంగా ప్రకటించ బడుతున్న అంకెలలోంచి మూడు అంకెలను మాత్రం తీసుకుని

విశ్లేషిద్దాం. విద్యుత్ వినియోగం, విద్యుత్ రంగ నష్టాలు, నష్టాలు పూడ్చుకోవడం కోసం 'పెంచక తప్పని' విద్యుత్ చార్జీలు అనే మూడు విషయాలకు సంబంధించి ఏలినవారు ప్రకటిస్తున్న అంకెల బాగోగులను నిశితంగా పరిశీలించవలసి ఉంది. అట్లాగే ఆ అంకెల వెనుక దాగి ఉన్న నిజాలను, ఏలినవారు దాచిపెడుతున్న నిజాలను కూడా పరిశీలించవలసి ఉంది.

విద్యుత్ వినియోగానికి సంబంధించి రెండు రకాల అంకెలను పరిగణనలోకి తీసుకోవాలి. మొదటిది, మొత్తం ఉత్పత్తి అవుతున్న విద్యుత్తు, అందులో వివిధ వర్గాలు, వివిధ రకాల వినియోగదారులు వాడుకుంటున్న విద్యుత్తు. రెండవది, గృహ వినియోగదారులు వాడుకుంటున్న విద్యుత్తులో వేరు వేరు స్లాబులలో జరుగుతున్న వినియోగం.

ఈ రెండు రకాల అంకెలలోను ప్రభుత్వం ప్రజల కోసం చెపుతున్న వాటికి, ఎ.పి. ట్రాన్స్‌కో చెపుతున్న వాటికి, ఎ.పి. ఎలక్ట్రిసిటీ రెగ్యులేటరీ కమిషన్ చెబుతున్న వాటికి పొంతన లేదు. ఎనర్జీ ఆడిట్ జరిగి, హైటెక్ యంత్ర సామగ్రి ఉండి, ముఖ్యమంత్రి స్వయంగా రోజు రోజూ పర్యవేక్షిస్తున్నానని చెప్పుకునే రంగంలోనే ఇంత గందరగోళపు అంకెలు ఉన్నాయంటే, ఈ అంకెల గారడీ ఇట్లా కొనసాగడం వల్ల ప్రయోజనం పొందుతున్న వాళ్లు ఎవరో ఉండి ఉండాలి.

విద్యుత్ ఉత్పత్తి, వినియోగాలకు సంబంధించి ఎంత అంకెల గారడీ జరుగుతుంతో గ్రహించాలంటే మూడు, నాలుగేళ్ల కింద రాష్ట్రంలో జరిగిన ప్రహసనాన్ని ఒకసారి గుర్తు చేసుకోవాల్సి ఉంది. అప్పుడు, వ్యవసాయరంగ వినియోగానికి మీటర్లు లేవు. కనుక వ్యవసాయరంగం ఎంత విద్యుత్తు వాడుకుంటున్నదో తేల్చి చెప్పగలిగే అవకాశం లేదు. (ఆ పరిస్థితి ఇప్పటికీ అంతే!) ఎట్లాగూ వ్యవసాయరంగం నుంచి ఎవరూ తమను ప్రశ్నించరనే ధైర్యంతో విద్యుత్ అధికారులు మొత్తం ఉత్పత్తిలో నుంచి గృహ, పారిశ్రామిక, వాణిజ్య వినియోగాన్ని తీసివేసి మిగిలినదంతా వ్యవసాయరంగమే వాడుకుంటున్నదని కాకిలెక్కలు చెప్పారు.

ప్రపంచ వ్యాప్తంగానే ఉత్పత్తి అయిన విద్యుత్తంతా వినియోగంలోకి రాదు. ట్రాన్స్‌మిషన్ అండ్ డిస్ట్రిబ్యూషన్ నష్టాలు (సరఫరా, పంపిణీ నష్టాలు) సర్వ సాధారణం, నాణ్యమైన సేవలు అందించే విద్యుత్ పంపిణీ సంస్థలున్న దేశాలలో ఈ టి అండ్ డి నష్టాలు తక్కువలో తక్కువ ఆరు శాతంగా ఉన్నాయి. మూడు సంవత్సరాల కింద రైతుల మీద నెపం పెడుతున్నప్పుడు రాష్ట్రంలో ఈ నష్టాలు 22-23 శాతం ఉన్నాయని ఒక అంచనా. ఈ నష్టాన్నంతా రైతుల జోలెలో వేయడం మాత్రమే కాదు, ప్రభుత్వం అంతకన్నా ఘోరమైన పని మరొకటి చేసింది.

రాష్ట్రంలో రాజకీయ ప్రముఖులు, వారి ఆశ్రితులు, పారిశ్రామికవేత్తలు, చివరికి పలుకుబడి గల గృహ, వాణిజ్య వినియోగదారులు లెక్కకురాని విద్యుత్తు ఎంతో వాడుతున్నారు. ఆ విషయాన్ని ఇంత మర్యాదగా చెప్పదలచుకోకపోతే దాన్ని 'చోరీ' అనాల్సి ఉంటుంది. మూడు సంవత్సరాల కింద ప్రభుత్వం ఈ చోరీని కూడా రైతుల నెత్తి మీదనే పెట్టింది.



ఇప్పుడు కూడా 40,803 మిలియన్ యూనిట్ల విద్యుత్ ఉత్పత్తి అయితే 25,747 మిలియన్ యూనిట్ల విద్యుత్తు మాత్రమే వినియోగానికి అందుతోందని ప్రభుత్వ లెక్కలే చెపుతున్నాయి. ఈ నష్టపోతున్న పదిహేను వేల మిలియన్ యూనిట్ల పై చిలుకులో సాంకేతిక, పాలనాపరమైన సమర్థమైన చర్యలు తీసుకుంటే కనీసం సగమైనా లెక్కలోకి వస్తే విద్యుత్ చార్జీలు ఒక్క పైసా కూడా పెంచకుండానే ప్రభుత్వానికి వందల కోట్ల రూపాయల అదనపు ఆదాయం వస్తుంది.

ఈ అంకెల వెనుక దాగిన అసలు నిజం ఏమంటే, ఈ అంకెలను సవరించడానికి తగిన రాజకీయ చిత్తశుద్ధి ప్రభుత్వానికి లేదనేది.

ప్రస్తుత అంకెల గారడీలో ఇంకా రసవత్తరమైన సన్నివేశం గృహ వినియోగదారుల స్లాబులకు సంబంధించినది. ట్రాన్స్‌కో, ప్రభుత్వం ఆరు స్లాబులు అడిగితే, ఇ.ఆర్.సి. నాలుగు స్లాబులే అంగీకరించిందనే విషయం కూడా చర్చించనక్కరలేదు.

కొత్త స్లాబులలో ఎంతెంత మంది వినియోగదారులుంటారనే విషయమై ఏలినవారు ప్రకటిస్తున్న అంకెలు ఎంత మాత్రం నమ్మశక్యంగా లేవు. వారి లెక్కల ప్రకారం నెలకు 50 యూనిట్ల లోపు వాడే గృహ వినియోగదారులు మొత్తం వినియోగదారులలో 62.2 శాతం ఉన్నారట. ఆ స్లాబులో ఇప్పుడున్న యూనిట్‌కు 80 పైసల చార్జీని 145 పైసలకు పెంచి, 135 పైసలకు తగ్గించారు. కనుక అత్యధిక శాతం గృహ వినియోగదారులకు తాము మేలు కలుగజేశామని ప్రభుత్వం అంటోంది. ఇది నిజమేనా?

అసలు మొట్టమొదట నెలకు 50 యూనిట్ల లోపు విద్యుత్తు వాడే గృహ వినియోగదారుల సంఖ్య అబద్ధమని, కాకిలెక్క అని పైపైన చూసినా అర్థమవుతుంది. ఇది నిజం కావాలంటే రోజువారీ విద్యుత్తు వాడకం ఒకటిన్నర యూనిట్‌కు మించకూడదు. అంటే, రెండు గదుల ఇంట్లో బల్బులు, టి.వి./ఫ్యాన్లు మినహా మరే ఇతర గృహోపకరణాలు ఉన్నా ఈ లెక్క సరిపోదు. అటువంటి ఇళ్లు ఎన్ని ఉన్నాయో, ఇవాళ టి.వి.ల సంఖ్య పెరిగిపోయి, దాదాపు రోజుకు పది గంటల పైన టి.వి.లు మోగుతున్న ఇళ్లలో ఈ ఒకటిన్నర యూనిట్ల వినియోగం ఏ కాస్త ఆలోచించినా అర్థమవుతుంది.

నిజానికి అతి ఎక్కువ మంది గృహ వినియోగదారులు 50 యూనిట్ల నుంచి 200 యూనిట్ల స్లాబులో ఉంటారు. వారు 32 శాతం కన్నా లోపే అని ప్రభుత్వం అంటోంది. కానీ వారి మీదనే ఇవాళ అత్యధిక భారం పడబోతోంది. ఇన్నాళ్లూ యూనిట్‌కు 120 పైసలు, 165 పైసలు చెల్లిస్తున్న ఈ వర్గం ఇక నుంచి 295 పైసలు చెల్లించాల్సి ఉంటుంది. ఈ చార్జీని 390 పైసలకు పెంచి, 'చూడండి ఎంత ఉదారంగా తగ్గించామో' అని ఏలినవారు నాటకం ఆడుతున్నారు.

ఇంతకూ విద్యుత్ చార్జీల పెంపుదలకు ఏలినవారు చూపుతున్న ఏకైక కారణం విద్యుత్‌రంగ నష్టాల్ని తగ్గించడం. ఏదయినా ఒక రంగం నష్టాలతోనే నడుస్తూ ఉండాలని

ఎవరూ అనరు. కానీ ఏ రంగం గురించి అయినా చర్చించేటప్పుడు, అసలు ఆ రంగం ఎందుకోసం ఉంది, అంటే దాని సామాజిక ప్రయోజనం ఏమిటి, ఏ లక్ష్యాల కోసం అది పనిచేయాలి అనే ప్రశ్నలు వేసుకోకుండా లాభ నష్టాల అంకెల్లో చూడడం చాలా దుర్మార్గమైన పద్ధతి. అంకెల గారడీ వెనుక కప్పబడిపోతున్న ???? సత్యాలు ఇవి.

అయితే అటువంటి తాత్విక చర్చ కూడా చేయకుండానే, నష్టాల గురించి మాట్లాడే వాళ్లు ఆ నష్టాలు ఎందువల్ల వస్తున్నాయో, ఏ అసమర్థతలను అరికట్టవలసి ఉందో, ఏ ఆదాయాలను పెంచుకోవలసి ఉందో, ఏ వ్యయాలను తగ్గించవలసి ఉందో వివరమైన పరిశీలన జరిపారా అనేది ముఖ్యమైన ప్రశ్న.

విద్యుత్‌రంగానికి వార్షిక ఖర్చు 9234 కోట్ల రూపాయలు కాగా, పాత చార్జీల ప్రకారం 5448 కోట్ల రూపాయల ఆదాయం వస్తోందని, ఈ మిగులును పూడ్చుకోవడంలో భాగంగానే చార్జీలు పెంచామని ఏలినవారు అంటున్నారు. నిజానికి ఈ ఖాళీని పూడ్చుకోవడం చోరీని అరికడితే, సరఫరా, పంపిణీ నష్టాలను తగ్గించుకుంటే, ప్రైవేటీకరణ కోసం విద్యుత్ రంగాన్ని విచ్ఛిన్నం చేసే చర్యలు ఆపితే సాధ్యమవుతుంది. ఈ చర్యల గురించి, ఈ చర్యల వల్ల రానున్న ఆదాయం గురించి మాట్లాడకుండా నష్టాల అంకెలు చూపడం చేయదలుచుకున్న పనికి సమర్థన కోసమే తప్ప వాస్తవాలు చెప్పే పారదర్శకత కాజాలదు.

నిజానికి విద్యుత్ రంగ నష్టాలు అనబడే వాటినే పునరాలోచించవలసిన అవసరం ఉన్నప్పుడు, ఆ నష్టాలను పూడ్చుకోవడానికి చార్జీల పెంపు అనే దానికి అర్థం ఉండదు. వీటిలో మొదటి పని సక్రమంగా జరిగితే, ఆ తర్వాత రెండో పని గురించి ఆలోచించవచ్చు.

అది కూడా, మళ్లీ మొత్తని ఆదాయంపై 15 శాతమో, 20 శాతమో పెంచుతున్నామనే అంకెల గారడీగా మన ముందుకొస్తోంది. నిజానికి పెరిగిన చార్జీలను ఇట్లా ఏకమొత్తంగా కాక విడదీసి చూస్తే విడివిడిగా కొన్ని వర్గాల మీద 100 నుంచి 130 శాతం పెరుగుదల ఉంది. ఇది మరొక మాయ. సాధారణంగా వాడకం పెరిగిన కొద్దీ, ఆ వాడకం వల్ల ఆదాయం పొందుతుంటే చార్జీలు పెంచాలనే పన్నుల విధానాన్ని తలకిందులు చేసి ఎక్కువ వాడకందార్లకు తక్కువ పెంపుదల, తక్కువ వాడకందార్లకు ఎక్కువ పెంపుదలను ఇప్పుడు ఇ.ఆర్.సి., ట్రాన్స్‌కో, ప్రభుత్వం కలిసి వడ్డిస్తున్నాయి. అంకెల గారడీ వెనుక దాగిన కనబడని ఉన్నతవర్గ అనుకూల, ప్రజా వ్యతిరేక కుట్ర ఇది.

***ఆంధ్రప్రభ, జూన్ 10, 2000***



# 18

# ప్రైవేటీకరణ ఎవరి ప్రయోజనాల కోసం?

ఉన్నత విద్యను ప్రైవేటీకరించే దిశలో రాష్ట్రంలో ఎన్నో కార్యక్రమాలు సాగుతున్నాయి. విశ్వవిద్యాలయాలలో విపరీతంగా ఫీజుల పెంపు, సెల్ఫ్ ఫైనాన్సింగ్ కోర్సుల ఏర్పాటు, ప్రైవేట్ రంగంలో ఇబ్బడిముబ్బడిగా కళాశాలల స్థాపన వంటి చర్యలతో పాటు లెక్చరర్ల నియామకంలో కాంట్రాక్టు పద్ధతిని అమలు చేయడానికి పూనుకుంటున్నానని రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది.

ఇదేమీ కొత్త విషయం కాదు. గత పది సంవత్సరాల నూతన ఆర్థిక విధానాల క్రమంలో దేశంలోని కీలక రంగాలెన్నింటినో ప్రభుత్వాలు అటు దేశంలోనూ, ఇటు రాష్ట్రంలోనూ ప్రైవేట్‌పరం చేశాయి. వేల కోట్ల రూపాయల విలువైన ప్రజా ఆస్తుల్ని కారుచౌకగా, కొన్ని కోట్ల రూపాయలకే ప్రైవేట్ వ్యక్తులకు, బహుళజాతి సంస్థలకు, దేశ విదేశీ సంపన్నులకు వెండి పళ్లెరంలో పెట్టి అందజేశాయి.

రాష్ట్రంలో ఆల్విన్ కర్మాగారం గాని, రిపబ్లిక్ ఫోర్జ్‌గాని, ఇతర ప్రభుత్వరంగ సంస్థలు కాని ఈ పద్ధతిలోనే అటు మూసివేతకో, ఇటు ప్రైవేటీకరణకో బలయిపోయాయి. ఇప్పుడు విద్యుత్ రంగంలో జరుగుతున్న పరిణామాలకు మూలం ప్రైవేటీకరణే. ఇక రేపో మాపో సింగరేణి బొగ్గు

గనులను, ఎపిఎస్ఆర్టిసిని కూడా ప్రైవేటీకరించాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని ప్రపంచ బ్యాంకు ఎప్పుడో ఆదేశించింది.

ప్రపంచీకరణ క్రమంలో ఒక ముఖ్యభాగమైన ప్రైవేటీకరణ కేంద్రంలో ఇంకా పెద్ద ఎత్తున సాగుతోంది. నూతన ఆర్థిక విధానాల ప్రవేశంతో పాటే కేంద్ర ప్రభుత్వ పరిభాషలోకి 'పెట్టుబడుల ఉపసంహరణ' అనే మాట వచ్చి చేరింది. డిజిన్వెస్ట్మెంట్ అనే ఈ అర్థంలేని మాటకు మార్జాలం అంటే పిల్లి అన్నట్టుగా అసలు అర్థం ప్రైవేటీకరణ అనే.

కేంద్ర ప్రభుత్వంలో ఈ పది సంవత్సరాలుగా కాబినెట్ కమిటీ ఆన్ డిజిన్వెస్ట్మెంట్ (సిసిడి) కొనసాగుతోంది. మన కేంద్ర మంత్రివర్గానికి పేదరికం గురించి ఆలోచించడానికీ, అక్షరాస్యత గురించి ఆలోచించడానికీ ఒక మంత్రివర్గ ఉపసంఘం వేయాలనే ఆలోచన ఎప్పుడూ రాలేదు గాని ప్రజల శ్రమతో, నెత్తుటితో, చెమటతో నిర్మాణమైన లక్షల కోట్ల రూపాయల ప్రభుత్వరంగ సంస్థల ఆస్తులను కారుచౌకగా ప్రైవేట్ వ్యక్తులకు అమ్మడం ఎట్లా అని ఆలోచించడానికి మాత్రం ఒక ఉపసంఘం అవసరమైంది. ఆ అమ్మకం లావాదేవీల్లో ఎంత ముడుపులు సంపాదించవచ్చునో లెక్కలు తేల్చుకోవడానికి ఒక ఉపసంఘం అవసరమయింది.

ప్రైవేటీకరణ గురించి దేశంలో జరుగుతున్న చర్చ అంతా కూడా అవసరమైన విషయాలపై కాకుండా అనవసరమైన విషయాల మీద జరుగుతున్నట్టనిపిస్తుంది. ఉద్యోగ భద్రత, దేశ సంపద పరాయీకరించబడడం అనే ఒకటి రెండు అవసరమైన విషయాలు వచ్చినప్పటికీ చర్చ జరగవలసిన పద్ధతిలో మాత్రం జరగడం లేదు.

ప్రైవేటీకరణ క్రమాన్ని కేవలం తమ ఉద్యోగ భద్రత కోసం ఉద్యోగవర్గాలే అడ్డుకుంటున్నట్టు, ట్రేడ్ యూనియన్లు వాళ్లను రెచ్చగొడుతున్నట్టు ప్రభుత్వాలు ఒక అబద్ధ ప్రచారాన్ని సాగించి, మధ్యతరగతిని ఆకర్షించాయి. అలాగే ప్రైవేట్ సేవలు ప్రభుత్వ సేవలకన్నా నాణ్యమైనవనే ఒక భ్రమను కూడా మధ్యతరగతిలో పెద్ద ఎత్తున సృష్టించగలిగాయి. నిజానికి ప్రైవేటీకరణను ఇంకా విశాల అర్థంలో గ్రహించవలసి ఉంది. ఏదో ఒక సంస్థలో పనిచేసే ఉద్యోగుల ఉద్యోగాలు ఉంటాయా, పోతాయా, ఒక ప్రత్యేక వినియోగదారీ వర్గానికి నాణ్యమైన వస్తువులు అందుతాయా లేదా అనే దానికన్నా మించినది ప్రైవేటీకరణ చర్చ.

ప్రైవేటీకరణకు ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో చర్యలు, ఫలితాలు ఉన్నాయి. వీటిలో ఏ ఒక్క దాన్ని విస్మరించినా ప్రైవేటీకరణ గురించి చర్చ పూర్తికాదు. కాని ప్రైవేటీకరణ కేవలం ఆర్థిక రంగానికి సంబంధించినది మాత్రమే అయినట్టు ప్రవర్తించడం ద్వారా ప్రభుత్వాలు, పాలకవర్గాలు మొత్తం చర్చను పక్కదారి పట్టిస్తున్నాయి.

ప్రైవేటీకరణ దుష్ఫలితాలు ఆర్థిక రంగంలోనే కొట్టవచ్చినట్టుగా కనిపించే మాట నిజమే. అసలు ఆర్థిక రంగంలో మాత్రమే చూసినా ప్రైవేటీకరణ ఎలా సంపన్నులకు మేలు చేయడానికి ప్రవేశించిందో, దానివల్ల దేశానికి, ప్రజలకు ఎన్ని దుష్పరిణామాలు సంభవిస్తాయో వివరించవచ్చు.



నూతన ఆర్థిక విధానాల తర్వాత ఈ ప్రైవేటీకరణ, పెట్టుబడుల ఉపసంహరణ క్రమాన్ని ప్రారంభించినప్పుడు మొత్తం కేంద్ర ప్రభుత్వరంగ సంస్థల దగ్గర ఉన్న ఆస్తుల విలువ లక్షా పదమూడు వేల రెండు వందల ముప్పై నాలుగు కోట్ల రూపాయలని అంచనా వేశారు. ఇంత విలువయిన ఆస్తుల్ని పావలాకో, పరకకో అమ్మేసి, దాంట్లోంచి కమీషన్లు కొట్టడం పాలకుల ప్రయత్నం. లేదా ఈ సంస్థలను తమ ఆశ్రితులకో, బినామీ పేర్ల మీద తమ కుటుంబ సభ్యులకో అప్పగించడం అసలు లక్ష్యం.

నూతన ఆర్థిక విధానాలు మొదలయిన సంవత్సరం జరిగిన ఈ ప్రైవేటీకరణ చర్యల మెతుకు పట్టి చూస్తే మొత్తం పెట్టుబడుల ఉపసంహరణ ఎలా జరిగిందో అర్థమవుతుంది. ఆ సంవత్సరం కేంద్ర ప్రభుత్వం 31 ప్రభుత్వరంగ సంస్థలలో తన పెట్టుబడులు ఉపసంహరించి రు. 3038 కోట్ల రూపాయలు సంపాదించింది. ఈ రకంగా ఉపసంహరించిన వాటాలను ఎంత తక్కువలో తక్కువ లెక్కవేసినా రు. 24,000 కోట్ల రూపాయలకు అమ్మి ఉండవచ్చు. అంటే గుర్రాల దొంగలు గుర్రాల్ని ఎంతకయితే అంతకు అమ్మినట్టుగా ప్రజల శ్రమతో తయారయిన ఆస్తుల్ని వాటి విలువలో ఎనిమిదో వంతుకు ఏలినవారు అమ్మేశారు.

ఇంకా విచిత్రమైన విషయమేమంటే ఈ 31 సంస్థలు ఆ సంవత్సరం ఆర్జించిన లాభాలు రు. 1730 కోట్లు. అంటే ఆస్తులన్నీ ప్రభుత్వం దగ్గర, ప్రజల ఆస్తులుగా ఉండగానే కేవలం లాభాలే మరొక సంవత్సరం కూడా కలుపుకుంటే ఇప్పుడు సంపాదించినన్ని నిధుల్ని సంపాదించి ఉండేవన్న మాట.

ఇక ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం దల్లా సిమెంట్ కర్మాగారాల్ని దాల్మియాకు అమ్మజూపి కార్మిక ఆందోళనతో వెనక్కి తగ్గిన సంఘటన అందరికీ తెలిసిందే. కార్మికులు రు. 700 కోట్లుగా లెక్కవేసిన ఆ ఆస్తులు, ప్రభుత్వం కొంతకాలం కింద రు. 300 కోట్లుగా లెక్కవేసిన ఆ ఆస్తులు, దాల్మియాకు అమ్మజూపేసరికల్లా రు. 52 కోట్లకు తగ్గిపోయాయి. దాంట్లో ప్రభుత్వం 50 శాతం వాటా ఉపసంహరించదలచింది గనుక దాల్మియాలు 26 కోట్ల రూపాయలు ఇస్తే చాలు కర్మాగారం వాళ్ల చేతిలోకి వస్తుంది. మళ్లీ అక్కడకూడా ఆ 26 కోట్ల రూపాయల్లో వెంటనే కోటి, ఏడాది తర్వాత మరో రెండు కోట్లు, మరో ఏడాది తర్వాత మరో రెండు కోట్లు ఇస్తే చాలునని, మిగతా సొమ్ము ఆ తర్వాత వాయిదాల్లో ఇవ్వవచ్చునని కూడా ప్రభుత్వం అంది. అంటే ఈ 'పెట్టుబడుల ఉపసంహరణ' జరిగి ఉంటే ఐదుకోట్ల రూపాయలతో దాల్మియాలు 700 కోట్ల రూపాయల ఆస్తులు సంపాదించగలిగే వారన్నమాట.

ఇవాళ మన రాష్ట్ర విద్యుత్ రంగంలో జరుగుతున్న ప్రయత్నం కూడా ఇదే.

ఈ ఆర్థిక వ్యవహారాన్ని పక్కనపెట్టి ఇటువంటి ప్రైవేటీకరణను బహుళజాతి సంస్థలు ఎందుకు ప్రోత్సహిస్తున్నాయో అర్థం చేసుకోవాలి. ఆ బహుళజాతి సంస్థలకు, వాటి తరఫున ప్రభుత్వాలకు ఆదేశాలిచ్చే ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్ వంటి సంస్థలకు ఇందుకు సమగ్రమయిన పథకం ఉంది.

స్థానిక, దేశీయ పెట్టుబడిదారులు, పారిశ్రామికవేత్తలు తమకు ఎప్పుడయినా ఎదురు తిరుగుతారేమోనని బహుళజాతి సంస్థలు ఎప్పుడూ భయపడుతుంటాయి. కనుక ఒక వ్యూహంగా, వాళ్లకు ఎంగిలి మెతుకులు విదిల్చి తమ దళారీలుగా మార్చుకోవడం, వాళ్లలో తమను సమర్థించే 'ప్రజా పునాది'ని విస్తరించుకోవడం, దేశ ప్రజలను దోపిడీ చేయడంలో వాళ్ల సాయం తీసుకోవడం బహుళజాతి సంస్థల లక్ష్యం.

మూడో ప్రపంచ దేశాల్లో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారులు, పారిశ్రామికవేత్తలు ఎంత పిరికివాళ్లు, ఎంత పరాన్నభుక్కులు అంటే, ఈ కుట్రలో తమ ఆత్మగౌరవాన్ని పణంగా పెట్టవలసి వచ్చినా వాళ్లకు సంకోచం లేదు. తమ ప్రజలనే తమ చేత దోపిడీ చేయించి ప్రధానభాగం బహుళజాతి సంస్థలు దోచుకుపోతున్నా వాళ్లకేమీ అభ్యంతరం లేదు.

ఈ పిరికితనం కేవలం అంతర్జాతీయ ద్రవ్య వ్యాపారుల దగ్గర మాత్రమే కాదు, దేశీయ పెట్టుబడిదార్లకు అన్ని చోట్లా భయమే. తమంత తాము ఒక సాంకేతిక విధానాన్ని కనిపెట్టాలంటే భయమే. స్వతంత్ర పరిశ్రమ పెట్టాలంటే భయమే.

అందువల్ల యాభై ఏళ్లుగా ప్రజల శ్రమ సంపదతో నడుస్తున్న పరిశ్రమల్ని, ఇప్పటికే శ్రమశక్తి నిరూపితమై ఉన్న కార్మికుల్ని, ఇప్పటికే స్థిరపడిన మార్కెట్ ఉన్న వస్తూత్పత్తిని, మొత్తం వ్యవస్థను తమ చేతికి అప్పనంగా ఎవరయినా ఇస్తే బాగుండునని వాళ్ల కోరిక.

ఆ పరిశ్రల్ని తమ సరుకుల అసెంబ్లింగ్ కేంద్రాలుగా, ఆ పారిశ్రామికవేత్తలను తమ కమిషన్ ఏజెంట్లుగా మార్చుకోదలచిన బహుళజాతి సంస్థల ప్రయోజనాలు, అందిన కాడికి అమ్మేసి, ఉన్న ఐదేళ్లలోనో, మూడేళ్లలోనో కోట్లకు పడగెత్తాలని ఆశించే రాజకీయవర్గపు ప్రయోజనాలు, ఏ ఇబ్బందీ లేకుండా పరిశ్రమలు తమ చేతికందాలనుకునే దేశీయ పెట్టుబడిదార్ల ప్రయోజనాలు కలగలిసిన ఒక కుట్రపూరిత పన్నాగం ప్రస్తుత ప్రైవేటీకరణను ప్రోత్సహిస్తోంది.

***ఆంధ్రప్రభ, జూలై 15, 2000***



# 19

# ప్రైవేటీకరణ రాజకీయాలు

ప్రైవేటీకరణ కార్యక్రమం దేశంలో ఇంత పెద్ద ఎత్తున సాగడానికి గత వారం (జూలై 15) చర్చించిన ఆర్థిక, సామాజిక కారణాలతో పాటే బహుశా అంతకన్నా మౌలికమైన రాజకీయ కారణాలున్నాయి. నిజానికి ఆర్థిక కారణాలు అందరికీ కనబడేటంత స్పష్టంగా ఉన్నందువల్ల వాటిపై చర్చ ఏదో ఒక స్థాయిలో జరుగుతోంది గాని రాజకీయ కారణాలు చాలా సంక్లిష్టమైనవీ, అస్పష్టమైనవీ గనుక వాటిపై చర్చే లేదు.

అసలు ప్రైవేటీకరణ జరగాలంటే ఒక ప్రభుత్వం, జాతీయ, ప్రజా రంగం ఉండాలి. కనుక ప్రైవేటీకరణ చర్చ ఏదయినా అసలు ఒక సమాజంలో ప్రభుత్వ రంగం ఎందుకు వచ్చిందో, ఎట్లా పెరిగిందో, దానికి హేతుబద్ధత ఉందో లేదో విశ్లేషించాలి. అటువంటి చర్చ తప్పనిసరిగా ప్రభుత్వ, ప్రైవేట్ రంగాలపట్ల రాజకీయ అవగాహనకు, రాజకీయార్థిక కారణాల పరిశీలనకు దారితీస్తుంది.

ప్రభుత్వరంగం అనేది ఏర్పడడం వెనుకగల చారిత్రక కారణాలను, ఇప్పుడు ప్రభుత్వ రంగాన్ని ఉపసంహరించాలని, ప్రైవేటు రంగాన్ని ప్రోత్సహించాలని జరుగుతున్న వాదనలకు నేపథ్యంలో ఉన్న రాజకీయాలను, ఆ రాజకీయాల పరిణామాలను ఇక్కడ పరిశీలిద్దాం.

పెట్టుబడిదారీ విధానం స్వలాభం అనే పునాది మీద, వ్యక్తిగత ప్రయోజనాలను విస్తరించడం అనే ప్రాతిపదికపై ఆధారపడుతుంది గనుక పెట్టుబడిదారీ విధానంలో ప్రజా సంక్షేమం అనేదానికి, ప్రభుత్వ రంగం అనే దానికి అవకాశమే లేదు. కాని 1929 మహా సంక్షోభం తర్వాత సమాజపు ఆర్థిక కార్యకలాపాలను పూర్తిగా ప్రైవేటు వ్యక్తుల, సంస్థల లాభాకాంక్షకు అప్పగిస్తే తీవ్రమైన దుష్పరిణామాలుంటాయని గుర్తింపు వచ్చింది. ప్రభుత్వ జోక్యం అవసరమని, కనీసం ప్రజోపయోగ, ప్రజా సంక్షేమ రంగాలలో లాభనష్టాల లెక్కలపై కాక సామాజిక శ్రేయస్సుపై ఆధారపడే రంగాలలో ప్రభుత్వం ప్రవేశించి వాటిని జాతీయ రంగాలుగా గుర్తించాలనే అవగాహన పెరిగింది.

మరీ ముఖ్యంగా ఈ అవగాహన రెండో ప్రపంచ యుద్ధానంతర రాజకీయ చర్చలలో ప్రధాన ఇతివృత్తమైంది. అప్పటి సామ్రాజ్యవాద, సంపన్న దేశాలు కుట్రపూరితంగానే బహిరంగంగానో, నర్మగర్భంగానో ప్రభుత్వ రంగాన్ని వలసానంతర దేశాల ప్రభుత్వాల మీద రుద్దాయి.

యుద్ధానంతరం డజన్లకొద్దీ లాటిన్ అమెరికా, ఆఫ్రికా, తూర్పు యూరప్, ఆసియా దేశాలు వలస పాలనల నుంచి, అధీనత నుంచి బైటపడి 'స్వాతంత్ర్యం' పొందినప్పుడు ఆయా దేశాల ముందు రెండు అభివృద్ధి నమూనాలు స్పష్టంగా ఉన్నాయి. అటు పంచవర్ష ప్రణాళికలతో, ప్రజా భాగస్వామ్యంతో, పూర్తిగా జాతీయమైన ఆర్థిక కార్యకలాపాలతో ప్రజానుకూల రాజకీయార్థిక విధానంతో ఉన్న సోషలిస్టు సోవియట్ యూనియన్ ఒక నమూనా. పెట్టుబడిదారీ విధానం మూడు వందల ఏళ్లలో సాధించిన అభివృద్ధిని ముప్పై ఏళ్లలోపే సాధించి, అధిగమించి, నాజీ యుద్ధాన్ని కూడా ఓడించిన సోషలిస్టు నమూనా అది.

మరోవైపు ప్రైవేటు లాభాపేక్షతో, ఎక్కడో ఒకటీ అరా ప్రభుత్వ రంగ సంస్థలతో, స్వార్థమే పునాదిగా నడిచే పెట్టుబడిదారీ నమూనా. ఆ పెట్టుబడిదారీ నమూనా వలసవాదంతో, సామ్రాజ్యవాదంతో కలిసి ఉంది గనుక పాతవలస దేశాల ప్రజానీకమూ, రాజకీయ నాయకత్వమూ కూడా దాన్ని అనుమానంతో చూశారు. 'మూడు శతాబ్దాల పాటు మనపై దోపిడీ పీడనలు అమలు చేసిన నమూనా ఇది' అని ప్రజలు ఆ నమూనాను అసహ్యించుకున్నారు.

ఆయా 'స్వతంత్ర' దేశాల పాలకులు, రాజకీయ నాయకత్వం ఎంతగా తమ దళారులయినా వాళ్లలో సోషలిస్టు నమూనా పట్ల ఆకర్షణ, పెట్టుబడిదారీ నమూనా పట్ల వ్యతిరేకత ఉండడం సామ్రాజ్యవాదులు గుర్తించారు. ఈ మానసిక స్థితి నుంచి వాళ్లను పక్కకు మరల్చడం, వాళ్లకు తెలియకుండానో, తెలిసో పెట్టుబడిదారీ నమూనా చేదు మాత్రను వాళ్ల చేత మింగించడం సామ్రాజ్యవాదుల ప్రధాన ధ్యేయాలయ్యాయి. బ్రెటన్ ఉడ్స్ సమావేశంగాని, ఆ తర్వాత ఒక దశాబ్దం పాటు కొత్త 'స్వతంత్ర' దేశాల రాజకీయ నాయకత్వానికీ, ముఖ్యంగా ప్రధాన మంత్రులకూ, ఆర్థిక మంత్రులకూ, ఆర్థిక వ్యవస్థా నిర్వాహకులకూ నేర్పిన పాఠాలు గానీ, ఈ ధ్యేయాలతో సాగినవే. అంటే ప్రధానంగా ఆర్థిక వ్యవహారాలుగా కనబడిన చాలా పనులు నిజానికి రాజకీయ లక్ష్యాలతో సాగాయి.



అందువల్ల రెండు నమూనాలకూ మధ్య సామరస్యం కుదిర్చే ప్రయత్నంలో భాగంగా 'మిశ్రమ ఆర్థిక వ్యవస్థ' అనే అసాధ్య పదార్థాన్ని ఈ దేశాలన్నిటికీ అందజేశారు. అది అసాధ్యమని, అది అమలు చేస్తే అంతిమంగా లాభపడేది ప్రైవేటు రంగమేననీ, ప్రభుత్వ రంగం అనబడేది కూడా ప్రైవేటు రంగానికి లాభాలు ఆర్జించి పెట్టే వనరు అవుతుందని ఈ 'మిశ్రమ ఆర్థిక వ్యవస్థ' ప్రతిపాదకులకు ఆరోజే తెలుసు. నిజానికి వాళ్లకు ప్రభుత్వ రంగమంటే చెప్పలేని మంట. అది సోషలిజానికి మరో రూపమని, దాన్ని విజయం సాధించనిస్తే తమ పప్పులు ఉడకవని వాళ్ల భయం.

అందుకే ప్రభుత్వరంగాన్ని ప్రారంభించినప్పటి నుంచే దాన్ని ధ్వంసం చేసే ప్రయత్నాలు లోలోపలే యాజమాన్యం వైపు నుంచే ప్రారంభమయ్యాయి. ప్రభుత్వ రంగం అసమర్థమయినదని, నాణ్యతలేనిదని ప్రచారం చెయ్యడం ద్వారా సోషలిజాన్ని ఓడించాలని పాలకులు ప్రయత్నించారు. మనుషులు స్వార్థంతో, స్వలాభంతో మాత్రమే పని చేస్తారని, సామాజిక శ్రేయస్సు కోసం, భవిష్యత్తు కోసం ఎవరూ పనిచేయరని, స్వార్థ త్యాగం అనేది ఉదాత్త విలువ కాదని చెప్పడానికి ప్రభుత్వరంగాన్ని లోలోపలి నుంచి చీడలా తొలవడం ప్రారంభించారు.

మూడు నాలుగు దశాబ్దాల పాటు ప్రభుత్వరంగాన్ని ఇట్లా నిర్వీర్యం చేసే కార్యక్రమం సాగేసరికి ఇటు మధ్యతరగతి బుద్ధిజీవుల్లో ప్రభుత్వరంగం పట్ల వ్యతిరేకత, చిన్నచూపు పెరిగిపోయాయి. ప్రభుత్వరంగం ఎన్నడూ నిజంగా ప్రజారంగంగా పనిచేయలేదు గనుక ప్రజలలోనూ ప్రభుత్వరంగాన్ని రక్షించుకోవాలనే తపన లోపించింది. చివరికి ప్రభుత్వ రంగ పరిరక్షణ అనేది దాని వెనుక ఉన్న ఉదాత్త లక్ష్యాల కోసం కాక కేవలం ఉద్యోగుల భద్రత కోసం అన్నట్టుగా దిగజారిపోయింది.

ప్రభుత్వరంగం ఇట్లా బలహీనపడి ఉన్న సమయంలో ప్రపంచ పెట్టుబడిదారీ విధానం, బహుళజాతి సంస్థలు, వాటి ప్రయోజనాల కోసమే ఉన్న ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థ, ప్రపంచ వాణిజ్య సంస్థ రంగం మీదికి వచ్చి వ్యవస్థాత్మక సంస్కరణలు, అప్పులు వంటి అనేక మార్గాల ద్వారా పేద దేశాల మెడలు వంచడం ప్రారంభించాయి. సరిగ్గా ఇదే సమయంలో సోవియట్ యూనియన్ పతనం, తూర్పు యూరప్ దేశాలలో ప్రభుత్వాల పతనం జరగడంతో 'అదిగో, సోషలిజం, ప్రభుత్వ రంగం, జాతీయకరణ విఫలమయ్యాయి' అని ఇల్లెక్కి అరవడానికి సామ్రాజ్యవాదులకు అవకాశం దొరికింది.

ఇక 1980ల చివరి నుంచీ అన్ని ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా, తూర్పు యూరప్ దేశాలలోనూ ప్రభుత్వ రంగ సంస్థల నుంచి పెట్టుబడులను ఉపసంహరింప జేయడం, ప్రభుత్వ రంగాన్ని మూసివేయడం, ప్రైవేటు పెట్టుబడిదారులకు, బహుళజాతి సంస్థలకు ఇతోధిక అవకాశాలు కల్పించడం సామ్రాజ్యవాదుల లక్ష్యాలయిపోయాయి.

ప్రభుత్వ రంగం అనేదాన్ని సోషలిజపు అవశేషంగా భయంతో, అనుమానంతో చూస్తూ దానికి అంత్యక్రియలు జరపడానికి సామ్రాజ్యవాద సంస్థలు, సలహా సంస్థలు గత పది

సంవత్సరాలుగా తీవ్రమైన ప్రయత్నాలు చేస్తున్నాయి. ఇది నిజానికి ప్రైవేటీకరణను ఆర్థిక ప్రయోజనాల వైపు నుంచి కన్న రాజకీయ ప్రయోజనాల వైపు నుంచి గుర్తించవలసిన అంశం.

ప్రైవేటీకరణకూ, బహుళజాతి సంస్థల రాజకీయ ప్రయోజనాలకూ, రాజకీయ ఎత్తుగడలకూ మధ్య సంబంధాన్ని చిలీ ఉదాహరణ నగ్నంగా బయటపెట్టింది. లాటిన్ అమెరికన్ దేశమయిన చిలీలో 1970లో ఎన్నికల ద్వారా అధికారానికి వచ్చిన సాల్వడార్ అయెండే ఐక్య సంఘటన ప్రభుత్వాన్ని అమెరికా గూఢచారి సంస్థ సిఐఎ, బహుళజాతి సంస్థలు సైనిక కుట్ర ద్వారా కూల్చివేయడానికి కారణం ఆ ప్రభుత్వం అనుసరించిన జాతీయకరణ విధానమే, ప్రైవేటీకరణ పట్ల వ్యతిరేకతే.

చిలీ ఎగుమతులలో ఎనభై శాతాన్ని ఆక్రమించేది అక్కడ విరివిగా దొరికే రాగి ఖనిజమే. కాని ఆ రాగి గనుల పరిశ్రమ అంతా బహుళజాతి సంస్థల చేతుల్లో, అమెరికా సంస్థల చేతుల్లో ఉండేది. పారిశ్రామిక ఆస్తుల్లో 80 శాతం కేవలం 27 శాతం సంస్థల చేతుల్లో ఉండేవి. ఒకశాతం కన్న తక్కువ కమతాల చేతుల్లో దేశంలోని సాగుభూమిలో 55 శాతం ఉండేది.

సాల్వడార్ అయెండే అధికారంలోకి రాగానే చేసిన మొట్టమొదటి పనులు రాగి గనులను జాతీయం చేయడం, భూసంస్కరణలను ప్రకటించడం, కనీస వేతనాల చట్టాన్ని పటిష్టం చేయడం, ప్రభుత్వరంగ సంస్థల యాజమాన్యంలో, నిర్వహణలో కార్మిక భాగస్వామ్యాన్ని పెంచడం. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రైవేటీకరణకు వ్యతిరేకమయిన చిలియన్ జాతీయకరణ విధానాన్ని ప్రకటించడం.

ఈ పనులు చేసినందుకు గాను 1971-73 మధ్య సిఐఎ 8 మిలియన్ డాలర్లు ఖర్చు పెట్టి అయెండే పట్ల వ్యతిరేకతను రెచ్చగొట్టి, 1973 సెప్టెంబర్‌లో సైనిక కుట్ర జరిపించి, అయెండేతో సహా ఎనిమిది వేల మందిని ఊచకోత కోయించింది. తర్వాత గద్దెనెక్కిన సైనిక నియంత పినోషె చేసిన మొదటి పని మళ్లీ రాగి గనులు ప్రైవేటీకరించడం. అదీ రాజకీయ ప్రయోజనం!

***ఆంధ్రప్రభ, జూలై 29, 2000***



# 20

# ఎందుకీ ఫ్లై ఓవర్లు?

పాతకాలం తెలుగు సినిమాల్లో ఒక ఫార్ములా ఉండేది. సద్గుణ సంపన్నుడూ అన్నీ సదుద్దేశ్యాలే గలవాడూ అయిన జమీందారు, ఆయన కన్నుగప్పి అన్ని దుర్మార్గాలూ సాగించే ఎస్టేట్ దివాను, సూపర్‌వైజర్, వగైరా వగైరా. జమీందారేమో విశాల హృదయంతో ప్రజలకు మేలు చేయదలచుకుంటాడు. మధ్యవర్తేమో ఆ సత్ఫలితాలేవీ ప్రజలకు అందకుండా కైంకర్యం చేస్తుంటాడు.

కేవలం సినిమాలో నాయక - ప్రతి నాయక సమీకరణం కోసమే తప్ప నిజ జీవితంలో ఏ మాత్రం వాస్తవం కాని ఈ వ్యవహారం తెలుగు దేశాధీశుడి ప్రవచనాలు వింటుంటే మళ్లీ గుర్తొస్తోంది.

హైదరాబాద్‌లో ఫ్లైఓవర్లు సరిగ్గా నిర్మించలేదని, నిర్మాణానికి ముందే విదేశాలు తిరిగి సరిగ్గా ప్రణాళికలు రూపొందించమంటే అధికారులు ఆ పని చేయలేదని, విదేశాలు తిరిగి వచ్చారు గాని ఫ్లైఓవర్లను సరిగ్గా రూపొందించలేదని, అసలివి పనికొచ్చే ఫ్లైఓవర్ల లాగే లేవని ఏలినవారన్నారు. తాను ప్రజోపయోగం కోసం తలపెట్టిన ఒక మహత్కార్యాన్ని మధ్యలో అధికారగణం తప్పుదారి పట్టించిందని ఆయన అన్నారు.

నాలుగైదు సంవత్సరాలుగా నగరంలో ఎడతెగకుండా సాగుతున్న,

స్వయంగా ఏలిక మాటల్లోనే చెప్పాలంటే అవకతవకలుగా సాగుతున్న ఈ బృహత్ విధ్వంస నిర్మాణ కార్యక్రమం గురించి ఇప్పుడయినా వివరంగా మాట్లాడుకోవడం అవసరం.

అసలు హైదరాబాద్ నగరానికి ఫ్లైఓవర్లు అవసరమేనా? ఏయే చౌరస్తాలో ఎంతెంత ట్రాఫిక్ ఏయే సమయాల్లో ఉంటున్నదో ఏదయినా శాస్త్రీయ పరిశోధన జరిపి ఫ్లైఓవర్లు ఎక్కడ నిర్మించాలో ప్రణాళికలు వేశారా? ప్రజల ట్రాఫిక్ అవసరాలను బట్టి ఫ్లైఓవర్లు నిర్మాణమయ్యాయా, కంట్రాక్టర్ల జేబులు నింపడానికి ఫ్లైఓవర్లు రూపొందించ బడ్డాయా? నిజంగా ఫ్లైఓవర్లు అవసరమయిన చోట్ల కూడా నేల దృఢత్వం, ఎత్తు ఒంపులు, ఫ్లైఓవర్‌కు అవసరమైన వైశాల్యం వంటి నిర్మాణ సంబంధమైన సమస్యల విషయంలో కూలంకషమైన అధ్యయనం జరిగిందా?

ఇటువంటి మామూలు ప్రశ్నలూ, ఇంకా క్లిష్టమైన సాంకేతిక సమస్యలూ ఏవీ ఫ్లైఓవర్ల నిర్మాణానికి ముందు మన రాజకీయార్థిక వ్యవస్థా నిర్వాహకులకు తట్టినట్టే లేవు.

ఇవాళ హైదరాబాద్ నగరంలో తలపెట్టిన దాదాపు డజను ఫ్లైఓవర్లలో నిజంగా అవసరమైనవి రెండు మూడు కన్న ఎక్కువ ఉండవు. ట్రాఫిక్‌ను వేరు వేరు మార్గాల్లో మళ్లించగలిగితే, రియల్ ఎస్టేట్ వ్యాపారానికీ రాజకీయాలకూ మధ్య ఏ విభజన రేఖా లేని స్థితి నుంచి నగరాన్ని బైట పడెయ్యగలిగితే, నగరంలో ఉన్నత మధ్య తరగతి వికృత పెరుగుదల మీద ఆంక్షలు విధించగలిగితే, ఇతరేతర ప్రయాణ సౌకర్యాల కల్పన మీద దృష్టి సారిస్తే బహుశా ఒక్క ఫ్లైఓవర్ కూడా అవసరం లేకుండానే హైదరాబాద్ మనగలుగుతుంది.

నిజానికి హైదరాబాద్ లాంటి వృత్తాకార నగరాలలో ప్రతి రహదారికీ ప్రత్యామ్నాయ మార్గాల్ని సూచించి ట్రాఫిక్‌ను మళ్లించడానికి, ట్రాఫిక్ జామ్ తలెత్తకుండా నిరోధించడానికి వీలుంటుంది. ఏ ఒక్క రహదారి విషయంలోను హైదరాబాద్‌లో ఇటువంటి నిర్మాణాత్మక, అన్వేషణా కృషి జరగలేదు.

హైదరాబాద్ నగరంలోపలా, శివార్ల లోనూ రియల్ ఎస్టేట్ వ్యాపారులెవరో, రాజకీయ నాయకులెవరో విడదీసి చూపడం అసాధ్యం. ఆ రెండు వేరు వేరు వృత్తులూ ఒకే వృత్తిగా కలిసిపోయి అన్ని బహిరంగ స్థలాలూ, రహదారులూ, పాత నిజాం ప్రభుత్వ, కుటుంబ ఆస్తులూ ఆక్రమించబడిన గందరగోళ స్థితి ఇవాళ్టి హైదరాబాదుది. పోలీసు చర్య జరిగి హైదరాబాద్ రాష్ట్ర విలీనం జరిగిన 1948 నాటికి హైదరాబాద్‌లో ఎన్ని వందల, వేల ఎకరాలు నిజాం సొంత ఆస్తిగా, ఆయన బంధువుల, ఆశ్రితుల, ఇతర భూస్వామ్య వర్గాల ఆస్తిగా ఉండేదో ఎవరన్నా లెక్కతేల్చి అదంతా 1956 తర్వాత, మరీ ముఖ్యంగా 1973 తర్వాత, 1980ల తర్వాత ఎవరి కబ్జాలోకి చేరిందో చెప్పగలిగితే హైదరాబాద్ ఎందుకు ఎట్లా జన సమ్మర్దమై పోయిందో అర్థమవుతుంది. ఈ పెరిగిన జనసందోహం పొట్టచేత పట్టుకుని రాజధానీ నగరానికి వచ్చారా, ఈ నగరపు నేలను వ్యాపార సరుకుగా మార్చి అంగుళం అంగుళం అమ్మి జయభేరి వాయించడానికి వచ్చారా లెక్కలు తేలిస్తే గాని మన ట్రాఫిక్ చిరాకులకు బాధ్యులెవరో తేలదు.

ఇక నూతన ఆర్థిక విధానాలతో లాభపడుతూ ప్రపంచీకరణకు పక్క వాయిద్యగాళ్లుగా



మారిపోతున్న ఉన్నత మధ్యతరగతి హైదరాబాదుకు తెచ్చిపెట్టిన వికృత పెరుగుదలను గుర్తించకపోతే మనం ట్రాఫిక్ సమస్యలను అర్థం చేసుకోలేం. ఈ రోడ్ల మీద అవసరం ఉన్నా లేకపోయినా ఆడంబరం చూపుకోలడానికి దిగిన కార్లు, మరే నగరం కన్న ఎక్కువ నిష్పత్తిలో ఉన్న ద్విచక్ర వాహనాలు, జనాభా పెరుగుదలకు తగినట్టుగా పెరగని ప్రజా రవాణా సాధనాలు, నిర్వీర్యం చేయబడి విఫలమైపోయిన లోకల్ రైల్వే వ్యవస్థ – ఇవన్నీ హైదరాబాద్ రోడ్ల మీద మనం చికాకుపడడానికి కారణాలు.

మధ్యతరగతి సగటు పౌరుల దృష్టి ఇటుసారించకుండా ఉండడానికి ఏలిన వారికి దొరికిన సాధనం ఫ్లైఓవర్లు. ఏడ్చే శిశువు అసలు సమస్య కనుక్కోకుండా చేతిలో గిలక్కాయ పెట్టినట్లు ట్రాఫిక్ జామ్‌లను తిట్టుకునే హైదరాబాద్ నగరవాసుల కళ్ల ముందర ఫ్లైఓవర్ల తోరణాలు కట్టదలిచారు పాలకులు.

ఫ్లైఓవర్లు కేవలం దృష్టి మళ్లించే గిలక్కాయలుగా వచ్చాయి గనుకనే వాటి అసలు అవసరం చర్చిండం గాని, వాటిని సరిగ్గా నిర్మించడంగాని జరగలేదు.

అసలు మొట్టమొదట ఫ్లైఓవర్లనేవి అభివృద్ధి చెందిన దేశాల్లోగాని, చివరికి మన మహా నగరాల్లో గాని ఐదారు దిక్కుల నుంచి వచ్చే ట్రాఫిక్‌ను ఎటువంటి రద్దీ లేకుండా మళ్లీ ఐదారు దిక్కులకు మళ్లించే సాధనాలు. బహుదిశల ఫ్లైఓవర్ అనేది ఎక్కడయినా సర్వ సాధారణం. కాని హైదరాబాద్‌లో ఇప్పటి వరకు నిర్మించిన నాలుగైదు ఫ్లైఓవర్లు గాని, నిర్మాణంలో ఉన్న మిగిలిన ఫ్లైఓవర్లు గాని కేవలం అటు నుంచి ఇటు వెళ్లే ఓవర్ బ్రిడ్జిలు మాత్రమే.

ఆ ఓవర్ బ్రిడ్జిలు కూడా తగినంత వైశాల్యంతో లేవు. ఎక్కేటప్పుడు, దిగేటప్పుడు వాహనాలకు అవసరమైన ఏటవాలు ఎంతో, ఎంత ఏటవాలుంటే వాహనం సాఫీగా సాగుతుందో తెలిసిన వాళ్లు ఈ నిర్మాణాలలో ఉన్నారనిపించదు. రెండు చోట్ల ఈ ఫ్లైఓవర్లను పాత చెరువు కట్టల మీద నిర్మించాలని ప్రణాళిక వేశారు. మానవ నిర్మిత చెరువుకట్ట ఈ భారీ నిర్మాణాన్ని తట్టుకోగలిగినంత దృఢంగా ఉంటుందా అనే ఆలోచన కూడా ఈ నిపుణులకు వచ్చినట్టులేదు. బేగంపేట విమానాశ్రయం దగ్గర గాని, తార్నాకలో గాని ఫ్లైఓవర్ అవసరమైనంత ట్రాఫిక్ రద్దీ ఎప్పుడో ఒకసారి గాని ఉండదు. నారాయణగూడ ఫ్లైఓవర్ చాల అవసరమైనదే అయినా, ఇప్పటికే ఆలోచనల్లో ఉన్న లైట్‌రైల్ వంటి ప్రత్యామ్నాయ ప్రయాణ సౌకర్యాలకు అది అడ్డంకి అవుతుంది.

అంటే నగరంలో నిర్మాణమయినవీ, నిర్మాణంలో ఉన్నవీ అన్ని ఫ్లైఓవర్లూ ఏదో ఒక సమస్యతో అవకతవకలు గానే ఉన్నాయన్న మాట. మరి ఇంత అనాలోచితమైన గందరగోళానికి వందల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని ఎందుకు వెచ్చించాలి? అట్లా ప్రజాధనాన్ని వృథా చేసే అధికారాన్ని ఎవరికి ఎవరిచ్చారు? నిర్మాణం ప్రారంభ దశలో నూట ఇరవై కోట్ల రూపాయల వ్యయంగా అంచనా వేసింది ఈ ఐదేళ్లలో కనీసం రెట్టింపయినా అయి ఉంటుంది. ఆర్థిక స్థితి సంక్షోభంలో ఉన్నదని రోజు రోజూ ఇల్లెక్కి అరిచే వాళ్లు తమ మోజుల కోసం ఇంత ప్రజాధనాన్ని

ఇట్లా బూడిదలో పోయవచ్చునా? లేక శవాన్ని తగులబెట్టాక బూడిదలో వెతుక్కుంటే చెవిపోగు దొరికినట్టు, ముడుపుల కోసం, కమీషన్ల కోసం ఈ బూడిద వ్యవహారం మొత్తం రచించబడిందా?

ఫ్లైఓవర్ నిర్మాణం వైఫల్యానికి ఇంక మరే సమర్థనా దొరకనప్పుడు నగరాన్ని సౌందర్యమయం చేయడానికి ఫ్లైఓవర్లనే వాదన వినిపిస్తోంది. ఈ నగరాన్ని సుందరం చేయడానికి ఇన్ని వందల కోట్ల రూపాయలు బూడిదలో పోయాలా అని కూడా ప్రశ్నించనక్కరలేదు. కాని అసలు పాలకుల దృష్టిలో అందమంటే ఏమిటో మాత్రం ప్రశ్నించాలి. మురికి కంపు కొట్టే హుసేన్‌సాగర్ వైశాల్యాన్ని ఇంకా ఇంకా తగ్గించి, ఆ మురికి నీళ్ల తీరంలో సరుకులు అమ్ముకోవడమే నగరాన్ని సుందరం చేయడమా? వందలాది చెరువులను రియల్ ఎస్టేట్ వ్యాపారంగా మార్చడానికి అనుమతించడం అందమా? రోడ్ల విస్తరణ పేరిట ఎన్నో చెట్లను, ఉద్యానవనాలను రూపుమాపడం, నాలుగు వందల ఏళ్ల చరిత్ర సాక్షిగా నిలిచిన వారసత్వ సంపద భవనాలను విధ్వంసం చేయడం, నగరంలో ముక్కుపుటాలు బద్దలు కొట్టే కంపు వాసన రాకుండా కనీసం రెండు కిలోమీటర్లయినా ప్రయాణం చేయలేకపోవడం – అందమంటే ఇవేనా?

***ప్రజాతంత్ర, నవంబర్ 11, 2000***



# 21

# పత్రికల 'ధరల యుద్ధం'లో గెలిచేదెవరు?

గతంలో ఢిల్లీ, బెంగళూరు దినపత్రికల మార్కెట్లలో భూకంపం సృష్టించిన ధరల యుద్ధం ఇప్పుడు హైదరాబాద్‌ను రణస్థలంగా మార్చుకుంటోంది. ధరల ఘర్షణలు ఇతర ప్రాంతాలలో, కొత్త ఎడిషన్లు ఏర్పాటయిన సందర్భంగా జరగలేదని కాదు గాని ప్రస్తుతం మొదలయిన ధరల యుద్ధానికి విస్తృతీ లోతూ ఎక్కువ. ఈ ధరల యుద్ధం కేవలం పత్రికల సర్క్యులేషన్ అంకెలకు మాత్రమే సంబంధించినది కాదు, దానికి మొత్తంగా పత్రికా వ్యవస్థను, ప్రజల సమాచార హక్కుపైన, సంస్కృతిపైన దుష్ఫలితాలు చూపే శక్తి ఉంది. అందువల్ల ఈ ధోరణిని నిశితంగా పరిశీలించాల్సి ఉంది.

దినపత్రికలు ధరలు తగ్గించి మార్కెట్‌ను ఆకర్షించడానికి ప్రయత్నించడం ఆంధ్రప్రదేశ్‌కు సంబందించినంత వరకు 1995లో ప్రారంభమైంది. దేశంలోని అగ్రశ్రేణి వాణిజ్య పత్రిక ది ఎకనమిక్ టైమ్స్ హైదరాబాద్ ఎడిషన్‌ను ప్రారంభించి ఇన్విటేషన్ ప్రైస్ పేరుతో రెండు రూపాయలకే పత్రికను అమ్మడం మొదలుపెట్టింది. ఇది ఆ పత్రిక ప్రచురణ వ్యయంలో అప్పటికి నాలుగోవంతు కన్నా తక్కువ.

ఆ తర్వాత డక్కన్ క్రానికల్, ఆంధ్రభూమి పత్రికలు అనంతపురం

ఎడిషన్లు ప్రారంభించినప్పుడు కూడా ఈ వ్యూహాన్ని అమలు చేసి మార్కెట్‌లో చెప్పుకోదగిన విజయం సాధించాయి.

ఇప్పుడు ది టైమ్స్ ఆఫ్ ఇండియా హైదరాబాద్ ఎడిషన్ ప్రారంభంతో పత్రికకు ఒక్కొక్క రోజు ఒక్కొక ధర నిర్ణయించి వారానికి పన్నెండు రూపాయల కన్నా తక్కువకు పత్రికను అందిస్తామనే వాగ్దానంతో ముందుకు వచ్చారు. వెంటనే అన్ని ప్రధాన ఇంగ్లిష్ పత్రికల హైదరాబాద్ ఎడిషన్లు కూడా ధరలు తగ్గించాయి. ఒకప్పటి ధరలలో సగానికే ఇప్పుడు అన్ని ఇంగ్లిష్ పత్రికలు దొరుకుతున్నాయి.

పాఠకులక వైపు నుంచి చూస్తే ఈ పరిణామానికి తక్షణ, తాత్కాలిక ప్రయోజనం ఉంది. పాఠకులు గతంలో ఇంగ్లిష్ పత్రికలపై పెట్టిన ఖర్చుతో ఇప్పుడు రెట్టింపు పత్రికలు కొనుక్కోవచ్చు. లేదా పత్రికలపై వ్యయాన్ని సగానికి తగ్గించుకోవచ్చు.

కానీ ఈ తక్షణ ప్రయోజనం వెనుక ప్రమాదకరమైన, ఆలోచించవలసిన దీర్ఘకాలిక ప్రమాదాలున్నాయి. విడివిడిగా పత్రికల కొనుగోలుదార్లకు మేలు చేస్తున్నట్టు కనిపించే ఈ పరిణామం మొత్తంగా కొనుగోలుదార్లకూ, సమాజానికీ, పత్రికా స్వేచ్ఛకూ, పత్రికలలో అచ్చయ్యే విషయాలకూ హానికరంగా మారుతుంది.

మొట్టమొదట, పత్రికారంగం రాబడిని ఇంతగా తగ్గించుకోగలదా, తగ్గించుకుంటే ఖర్చులను ఎట్లా రాబట్టగలుగుతుంది అనే ప్రశ్నలు వేసుకోవాలి. ధర తగ్గడం వల్ల ఉత్పత్తి పెరిగి సగటు ఉత్పత్తి వ్యయం తగ్గుతుందనీ, అందువల్ల చౌకగా ఇవ్వడం సాధ్యమవుతుందనీ చెప్పే ఆర్థిక శాస్త్ర సూత్రం పత్రికల విషయంలో అంతగా పని చేయదు. పత్రికను తయారు చేయడానికి అవసరమైన ముడిసరుకుల్లో ముఖ్యమైనది కాగితం. ఇతర పరిశ్రమలలో లాగ అదనపు ఉత్పత్తితో ఉపాంత వ్యయం తగ్గుతుందనే సూత్రం కాగితం విషయంలో నిజం కాదు. కనుక సర్క్యులేషన్ ఎంత పెరిగితే కాగితం ఖర్చు అంత పెరుగుతుంది. ఒక దశ దాటిన తర్వాత పత్రికలకు సర్క్యులేషన్ పెరగడం కన్న పెరగకపోవడమే ప్రయోజనకరం. అందువల్ల పెరిగిన సర్క్యులేషన్‌తో ఖర్చులు రాబట్టుకోవడం సాధ్యం కాదు.

నిజానికి పత్రికారంగంలో ఖర్చుకు, ఒక పత్రిక ముఖ విలువకు ఎప్పుడూ సంబంధం అంత పెద్దగా ఉండదు. 1995లో ది ఎకనమిక్ టైమ్స్ సగటు ప్రతి ఉత్పత్తి వ్యయం రు. 8.30 ఉండగా, దాని ముఖ విలువ రు. 2గా నిర్ణయించారు. ఆ రెండు రూపాయలలోను చిల్లర వ్యాపారికీ, టోకు వ్యాపారికీ, ఏజెంట్‌కూ కమిషన్ల, రవాణా ఖర్చులు తీసేస్తే యాజమాన్యానికి అందేది రూపాయి కన్నా తక్కువే. అంటే ఆ పత్రిక ఐదు సంవత్సరాల కిందనే ఒక్కొక్క ప్రతి మీద ఏడు రూపాయలకు పైగా ఇతర వనరుల నుంచి సమకూర్చుకుంటే గాని ఖర్చులు వెళ్లదీసే స్థితిలో ఉండేది కాదన్న మాట. ఇక ఇప్పుడు పెరిగిన కాగితం, ప్రింటింగ్, రవాణా వ్యయాలను బట్టి చూస్తే ఉత్పత్తి వ్యయమూ, లోటూ ఎంత పెరిగి ఉంటాయో చెప్పనక్కరలేదు.



దాదాపు అన్ని పత్రికల స్థితీ అటూ ఇటూగా ఇదే. అందువల్లనే పత్రికలు అమ్మకాల మీద కన్న ఎక్కువగా వ్యాపార ప్రకటనల మీద ఆధారపడతాయి. అటు ప్రభుత్వం, ఇటు వ్యాపార సంస్థలు కూడా రోజురోజూ కోట్లాది రూపాయల ప్రకటనలు విడుదల చేస్తూ పత్రికల స్థలంలో సగమో, నలభై శాతమో ఆక్రమించి అటు యాజమాన్యాలను ఆదుకుంటాయి. ఇటు తమ ఉత్పత్తుల గురించి, సేవల గురించి ప్రచారమూ చేసుకుంటాయి.

ప్రభుత్వానికీ, వ్యాపార సంస్థలకూ పత్రికలతో ఉండే సంబంధం ఇంతవరకే అయితే అర్థం చేసుకోవచ్చు, ఆమోదించవచ్చు. కాని వ్యాపార ప్రకటన ద్వారా కొనుకున్న స్థలాన్ని మాత్రమే కాక అంతకన్న ఎక్కువ స్థలాన్ని, ముఖ్యంగా వార్తా స్థలాన్ని ఆక్రమించాలని, దురాక్రమించాలని ప్రభుత్వంలోని పెద్దలూ, వ్యాపార సంస్థలలోని పెద్దలూ ప్రయత్నిస్తుంటారు. ఆ కోరిక ఇంకా బలపడితే వార్తా స్థలంలో కూడా తమకు అనుకూలమైన వార్తలే ఉండాలని, తమకు ప్రతికూలమైన వార్తలు ఉండగూడదని అనుకోవడం, శాసించడం దాకా వస్తుంది. ఇందుకు పత్రికలు ఒప్పుకోకపోతే ప్రకటనలు ఆపేసి, ఆర్థిక వనరులు తగ్గించడం కూడా జరుగుతుంది. తెలుగు పత్రికారంగ చరిత్రలో ఇందుకు ఉదాహరణలు కోకొల్లలు.

పత్రికా రంగంలో సాధారణ పరిస్థితే ఇలా ఉన్నప్పుడు పత్రికల అమ్మకాల ద్వారా వచ్చే రాబడి తగ్గడం పరిస్థితిని ఇంకా దిగజారుస్తుంది. అమ్మకాల రాబడి తగ్గడం వల్ల వ్యాపార ప్రకటనల మీద ఇంకా ఇంకా ఎక్కువగా ఆధారడవలసి వస్తుంది. అంటే ప్రకటనలు ఇచ్చే వాళ్లకు పత్రికా వ్యవస్థలో పరపతి, ప్రాధాన్యత పెరుగుతాయి. వాళ్లు ప్రత్యక్షంగా, నేరుగా పత్రికా రచనలో జోక్యం చేసుకున్నట్టు కనబడకపోవచ్చుగాని, పరోక్షంగా, కృతజ్ఞత రూపంలో, మొహమాటం రూపంలో, ఎన్నో కనబడని రూపాల్లో వ్యాపార ప్రయోజనాలు, పాలక ప్రయోజనాలు పత్రికలో వార్తా స్థలాన్ని ఆక్రమిస్తాయి.

ఈ పరిణామాన్నంతా ఒక్క మాటలో చెప్పాలంటే పత్రికా పాఠకులకు సహజంగా ఉండే సమాచార హక్కు కుంచించుకు పోతుంది. రద్దయిపోతుంది.

ఈ సమాచార హక్కు రద్దుపోవడానికే మరో ముఖం పత్రికల సాంఘిక సేవా సాధనాలు గానో, వార్తా ప్రచార సాధనాలు గానో కాక వ్యాపార సాధనాలుగా, రాజకీయ సాధనాలుగా, ఉత్పత్తుల అమ్మకందార్లుగా, చివరికి ఉత్పత్తులుగా మారడం. ఇప్పటికే చాల పత్రికలు కొత్తతరం యాజమాన్యాల కింద తమను తాము వార్తా పత్రికలుగా పిలుచుకోవడం మానేసి, 'ఉత్పత్తులు'గా అభివర్ణించుకుంటున్నాయి.

నిజానికి వ్యాపారవేత్తలు ఎంత భావదారిద్ర్యంలో ఉన్నారంటే వాళ్లు నమ్మే విలువలకు, ఈ ధరల యుద్ధానికీ చుక్కెదురే అయినా రెంటి చేత సహజీవనం చేయిస్తున్నారు. ఒకవైపు 'ఉచిత భోజనాలుండవు', 'ఉత్పత్తి వ్యయమైనా రాబట్టవలసిందే' అనే పెట్టుబడిదారీ, నూతన ఆర్థిక విధానాల నినాదాలను ప్రచారం చేస్తూ మరోవైపు ఉత్పత్తి వ్యయానికన్న తక్కువకు తమ ఉత్పత్తులను అమ్ముతున్నారు.

ఈ ఉత్పత్తి వ్యయం కన్న తక్కువకు అమ్మే పని ఎక్కువకాలం ఎవరూ కొనసాగించలేరు. ఈ పనివల్ల చిన్న ఉత్పత్తిదార్లు, చిన్న పత్రికలు మార్కెట్లో నిలదొక్కుకోలేని స్థితి వస్తుంది. కేవలం బలప్రయోగం చెయ్యగల వాళ్లు, అంగబలం, అర్థబలం ఉన్నవాళ్లు మాత్రమే ఇటువంటి పనులు చేసి మార్కెట్లో నిలదొక్కుకోగలుగుతారు. ఈ యుద్ధమంతా ముగిసినాక విజేతలుగా మిగిలిన వాళ్లు తమ ఇష్టం వచ్చిన గుత్తాధిపత్య ధరలు అమలు చేస్తారు. ఈ యుద్ధపు అంతిమ ఫలితం అది.

అంటే ధరల యుద్ధం అంతిమంగా మార్కెట్ల కేంద్రీకరణకు, గుత్తాధిపత్యానికి దారితీస్తుంది. ప్రజాస్వామ్యం, వికేంద్రీకరణ, చిన్న చిన్న వ్యాపారాలు, అన్ని చోట్లా క్రియాశీలంగా సృజనాత్మక శక్తులు వెల్లుబికడం అనే ఆదర్శవంతమైన విలువల స్థానంలో నిరంకుశాధికారం, గుత్తాధిపత్యం, కేంద్రీకరణ, ఒకే ఒక్క ఆధిపత్యం, మార్కెట్ అంతటికీ ఉమ్మడి వస్తువు తయారీ అనే అమానవీయ విలువలు నిలబడతాయి.

అంతిమంగా ఈ ధరల యుద్ధంలో గెలిచేది పత్రికలూ కాదు, ప్రజలూ కాదు. పాఠకులు కాదు. గుత్త యజమానులూ వాళ్లు. దోపిడీ సాధనాలూ మాత్రమే.

***విజేత / వార్త ? 2000 ?***



# 22

# సాలభంజికల సంస్కృతికి ఏలిన వారి ప్రోత్సాహం!

ప్రజాతంత్ర వర్తమాన సాహిత్య సంచిక 2001లో కుప్పిలి పద్మ కథ 'సాలభంజిక' చదవడం ఒక కల్లోల పరిచే అనుభవం. రాష్ట్రంలో కొన్ని సంవత్సరాలుగా సాగుతున్న రాజకీయార్థిక మార్పులు మన సాంస్కృతిక జీవనంలో ఏ పరిణామాలకు దారి తీస్తున్నాయో ఒక శకలాన్ని పట్టి చూపిన కథ ఇది. రెండు సంవత్సరాల కింద విజన్ 2020లో నైట్ బజార్ ఏర్పాటు గురించి చదివి, వణికిపోయి, ఈ మానవ మాంస వ్యాపారం గురించి రాసినప్పటి నుంచీ (అమ్మకానికి ఆంధ్రప్రదేశ్, పే. 30) కల్లోల పరుస్తున్న ఆలోచనలకు ఈ కథలో కళారూపం దొరికినట్టనిపించింది.

ప్రపంచీకరణ క్రమం, ప్రపంచ బ్యాంకు సంస్కరణలు మన పాలకులను కీలుబొమ్మలుగా, సాలభంజికలుగా మార్చిన సంగతి మనకు తెలుసు. తత్ఫలితంగా బహుళజాతి సంస్థలూ, దేశ దేశాల సంపన్నులూ మన నేల మీది వనరులన్నిటినీ కొల్లగొట్టడానికి అన్ని ఏర్పాట్లూ చేసుకుంటున్నారు. మన సంపదలను దోచుకుపోవడానికి ముందే వాళ్లు మన ఆత్మాభిమానాన్ని తాకట్టు పెట్టించుకున్నారు. మన తరఫున మన ఆత్మాభిమానాన్నీ, వనరులనూ తాకట్టు పెట్టిన మన ఏలికలు, ఈ సువిశాల మార్కెట్ మీద వాలమని బహుళజాతి

రాబందులను సాదరంగా ఆహ్వానించారు. అట్లా మన రాష్ట్రం, అందులోని సకల సంపదలూ, జల, ఖనిజ, సహజ, వ్యవసాయ, పారిశ్రామిక, మానవ వనరులన్నీ చప్పన్నారు దేశాల సంపన్నుల చేతిలో సాలభంజికలయిపోయాయి. తాము సాలభంజికలం కామని, రక్త మాంసాల, వ్యక్తిత్వాల మనుషులమని లేచి నిలబడి ప్రకటిస్తున్న మనుషుల మీద హింసా దౌర్జన్యాలూ హంతక దాడులూ క్రూర చట్టాలూ ప్రయోగిస్తున్నది రాజ్యం.

జాతి సమస్తాన్నీ ఇట్లా సాలభంజికలుగా మార్చే కుట్ర సాగుతున్నప్పుడు, జాతిలో సగభాగమయిన స్త్రీల జీవితాలు ఎటువంటి మార్పులకు లోనవుతాయి? లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఆసియాలలోని ఎన్నో దేశాలు, ముఖ్యంగా తూర్పు ఆసియా దేశాలు, చరిత్రలో ఎన్నోసార్లు జవాబు చెప్పిన ప్రశ్న ఇది. ఇవాళ మళ్లీ ఒకసారి ఆంధ్రదేశం విషాదంగా గుర్తించవలసి వస్తున్న జవాబు ఇది.

సంపన్న దేశాల రాజకీయార్థిక వ్యవస్థ నిర్వాహకులు మన వంటి పేద దేశాలలోకి తమ సరుకులు అమ్ముకోవడం కోసం మాత్రమే, మన ముడి సరుకులు దోచుకుపోవడం కోసం మాత్రమే రారు. మన వల్ల తమ రాజకీయ, ఆర్థిక, సామాజిక ప్రయోజనాలు తీర్చుకోవడం కోసం మాత్రమే రారు. ఈ పనులన్నీ చాలా ముఖ్యమైనవే గాని వీటితో పాటు ఆ సంపన్నులు తమ కండకావరం తీర్చుకోవడం కోసం కూడా మన దేశాల మీద పడతారు. తమ వికృత కామాన్ని ప్రదర్శించడం కోసం కూడా ముక్కు పచ్చలారని మన చిన్న పిల్లల మీద దాడి చేస్తారు. అది దాడిగా, క్రౌర్యంగా, వికృత చర్యగా కనపించనంత సుతారంగా, మృదువుగా, మర్యాదగా, కానుకలతో, పుష్పగుచ్ఛాలతో, పరిమళాలతో పేద దేశాల యువతుల శరీరాలను సరుకులుగా మారుస్తారు. వ్యాపార సాధనాలుగా మారుస్తారు. తమ ఇంటి నుంచి వ్యాపారం మీద ఈ పేద దేశానికి వచ్చినందుకు నష్టపరిహారంగా, ఇక్కడ ఉన్నన్ని రోజులూ తాము ఆడుకోవడానికి 'సాలభంజికలు'గా ఇక్కడి యువతులు కావాలనుకుంటారు.

విమానాశ్రయాలలో, ఐదు నక్షత్రాల హోటళ్లలో, విలాసవంతమైన అతిథి గృహాలలో, కార్పొరేట్ ప్రపంచంలో, ఇంగ్లిష్ పలకరింపుల మధ్య, చెరగని చిరునవ్వుల మధ్య, పుష్పగుచ్ఛాల సాక్షిగా నలిపివేయబడుతున్న పుష్పాల కథ ఇది. 'ఇటువంటి జీవితం ఎక్కడో నవలల్లోనో సినిమాల్లోనో ఒకటుంటుందనేది చూచాయగా తెలుసు. కానీ ఆ పాత్ర తనే వేయాల్సిన పరిస్థితి తన ముందుకు రావటం' తెలుగు సమాజంలో ఉన్నత మధ్యతరగతిలోకి ఎదగదలచుకున్న సగటు యువతి జీవితంలోకి వచ్చేసింది. తన ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా, బహుశా తనకు పూర్తిగా అవగాహన కూడా కాక మునుపే ఆ జీవితం ఆ యువతి జీవనాన్ని మొద్దుబార్చి సాలభంజికగా మార్చేస్తోంది. ఇవాళ హైదరాబాద్ నగరంలోకి రోజు రోజూ తరలివస్తున్న విదేశీ పెట్టుబడులు, తెల్లతోలు పెద్ద మనుషులు, దేశీయ దళారీలు, వాళ్ల చుట్టూ విస్తరిస్తున్న 'పరిశ్రమ' మన నేలమీద ఉత్పాదక పారిశ్రామిక వ్యవస్థగా మారగలదో, లేదో, ఉద్యోగ, ఉపాధి కల్పనకు దారి తీయగలదో లేదో గాని 'సాలభంజిక'ల ఉత్పత్తి మాత్రం విపరీతంగా పెరిగిపోతోంది.



ఇది నీతి – అవినీతుల సమస్య కాదు, తప్పు – ఒప్పుల సమస్య కాదు. శీలం సమస్య కాదు. అట్లా నైతిక దృష్టితో చూసి దీన్ని ఖండించనక్కరలేదు. అంతకు మించిన రాజకీయార్థిక కోణాలు, సామాజిక సాంస్కృతిక పరిణామాలు ఇందులో ఇమిడి ఉన్నాయి. స్త్రీల వ్యక్తిత్వాన్ని, సృజనాత్మకతను, ఇతరేతర రంగాల కృషిని, విజయావకాశాలను అన్నిటినీ తోసి రాజని, వాళ్లను కేవలం శరీరాలుగా, ఆ శరీరాలను వ్యాపార లావాదేవీల్లో సాధనాలుగా, ముడుపులుగా చూసే నీచ సంస్కృతి ఇది. అతిథి మర్యాద పేరిట అన్ని సౌకర్యాలూ, మంచి భోజనం, పానీయాలూ, వినోదం కలిగించినట్టుగా ఒక మానవ ప్రాణిని కూడా వస్తువుగా మార్చి ఆ భోగాలలో, వినోదాలలో భాగం చేసే దుర్మార్గమైన సంస్కృతి ఇది.

ఇటువంటి సంస్కృతి ఒకటి అత్యాశాపరులైన, స్వార్థపరులైన అన్నలో, భర్తలో, తండ్రులో, కిరాయికి తెచ్చుకున్న వాళ్లో ఏవో ప్రయోజనాల కోసం నడిపిస్తున్నారని చాలా కాలంగానే కథలలో, నవలల్లో, సినిమాల్లో చిత్రణ పొందింది. సమాజంలో ఎంతో కొంత సాగుతూనే ఉంది. కాని ఇప్పుడా సంస్కృతి కార్పొరేట్ ప్రపంచంలో ఒక తప్పనిసరి విలువ అయిపోయింది. ప్రపంచీకరణ క్రమంలో సమాజం మొత్తాన్ని కార్పొరేట్ లాభనష్టాల పునాది మీద నిలబెట్టదలచిన ప్రభుత్వాలు ఈ సంస్కృతిని ఔదల దాలుస్తున్నాయి. నష్టం వస్తుందంటే ఎంత ఉదాత్తమైన పనినయినా మానేయడం, లాభం వస్తుందంటే ఎంత నీచమైన పనినయినా తలకెత్తుకోవడం తమ విధానంగా స్పష్టంగానే ప్రకటించుకున్న ప్రభుత్వాలు, వాటి మద్దతుతో అక్రమమే వ్యాపారంగా మునుసాగుతున్న వ్యాపార సంస్థలు, సమాజాన్నంతటినీ సాలభంజికలుగా మార్చే ప్రయత్నంలో యువతులను సాలభంజికలుగా మార్చడం కూడా సాగిస్తున్నారు.

సమాజంలో మొత్తంగా 'పైకి పోవడం', డబ్బు సంపాదించడం, విలాసాలలో తులతూగడం మాత్రమే జీవిత సార్థకత అనే విలువలు ప్రచారమవుతున్నప్పుడు 'సాలభంజికలు'గా మారడానికి స్వచ్ఛందంగా ముందుకు వచ్చే వాళ్లూ ఉంటారు. గతి లేక సాలభంజికలయ్యే వాళ్లూ ఉంటారు. పద్మ కథలో ఒక పాత్ర అన్నట్టు 'అంతా మిస్ వరల్డ్, మిస్ యూనివర్స్ కాలేరు. అంతా సినిమా యాక్టర్లు కాలేరు. ఐటి – మేనేజ్‌మెంట్ – మార్కెటింగ్‌లోకి రాలేరు. నీకు టీచర్ ఉద్యోగం రాదు. డాక్టర్‌వి కాలేవు. నువ్వు అందమైన దానివి. వో డిగ్రీ ఉంది. నువ్వు పెద్ద పెద్ద ఉద్యోగాలకి అప్లై చేయలేవు. పోనీ ఎక్కడో దగ్గర వో చిన్ని ఉద్యోగంలో ఉండాలన్నా ఉండనివ్వరు. నీ అందం అటువంటిది. వాడిచ్చే బోడి జీతానికి వాడిని మొయ్యాలి...' ఇటువంటి 'అనివార్య పరిస్థితుల'లోనే సాలభంజికలవుతున్న వాళ్లూ ఉండవచ్చు.

'మొదట్లో కాస్త బెరుగ్గా ఉంటుంది, మనం వచ్చిన విలువల వలన. కానీ ఇది పార్ట్ ఆఫ్ ది జాబ్. మగ పిల్లలమై ఉంటే ఏ రాజకీయ నాయకుడి దగ్గరో గుండా దగ్గరో బ్రోకర్లం అయ్యే వాళ్లం. లేదా మాఫియా. తప్పొప్పులు ఆలోచించకు. బయట ఎవ్వరికీ తెలియదు...' లాంటి సమర్థనలూ దొరకవచ్చు.

దీన్ని సంస్కృతీ పతనం అనో, విలువల దిగజారుడు అనో, ఆయా వ్యక్తుల బలహీనత

ఫలితంగానో అర్థం చేసుకుంటే నైతిక తీర్పులు ఇవ్వవచ్చుగాని విషయం అర్థం కాదు. సాలభంజికలుగా మారుతున్న అమ్మాయిల కోణం నుంచి కన్నా ఎక్కువగా ఈ పరిస్థితికి కారణమవుతున్న ప్రపంచీకరణ వైపు నుంచీ, దాన్ని సమర్థిస్తున్న పాలకుల వైపు నుంచీ, సంపన్నుల విలాస కేంద్రాలుగా మారుతున్న పేద దేశాల రాజకీయార్థిక కోణం నుంచీ అర్థం చేసుకోవాలి.

విజన్ – 2020లో భాగంగా పర్యాటక రంగాన్ని అభివృద్ధి చేస్తామంటూ దాన్ని నైట్ బజార్‌లుగా, లీజర్ ఇండస్ట్రీగా కుదించిన నేపథ్యంలో ఈ సాలభంజికల సంస్కృతి పెరుగుతోంది. రెండు నెలల కింద హైదరాబాద్‌లో జరిగిన దేశ దేశాల పారిశ్రామిక, వ్యాపారవేత్తల సదస్సులో స్వయంగా తెలుగు దేశాధీశుడు ‘రండి, ఈ రాజ్యం మీదేనండి’ అని పిలుస్తూ పలికిన స్వాగత వచనాలలో, రాష్ట్రంలోకి వచ్చే పెట్టుబడిదారులకు రాష్ట్ర ప్రభుత్వం ఎస్కార్ట్ ఆఫీసర్లను ఏర్పాటు చేస్తుందని ప్రకటించాడు. ఎస్కార్ట్ ఆఫీసర్ అనేది శరీరాన్ని సాధనంగా పెట్టి పైరవీలు, వ్యాపార లావాదేవీలు నడిపే మహిళా మధ్యవర్తికి అందమైన పేరు. బహుశా ఇప్పుడు పద్మ కథ తర్వాత ఆ మాటను సాలభంజిక అని అనువదించవచ్చు.

అప్పటి నుంచీ, అంతకు ముందు నుంచీ కూడా ‘విదేశీ పెట్టుబడులను ఆహ్వానిస్తే వాళ్లకిక్కడ ‘ఈవినింగ్ లైఫ్’ ఏముందండీ’ అని అధికార పార్టీ నాయకులు, పారిశ్రామిక వేత్తలు, సంపన్నులు ప్రశ్నిస్తూనే ఉన్నారు. ఆ ప్రశ్నకు ఒక జవాబుగానే ఊళ్లో ఒక ఐదు నక్షత్రాల హోటల్ పునర్నవీకరించిన తర్వాత, మన ఏలిక దాన్ని ప్రారంభించగా, ఆ తర్వాత కొందరు సాలభంజికలు నగ్న నృత్యాలు చేశారని పత్రికలు రాశాయి. సరే మహిళా దినోత్సవం నాడు మహిళలు నడిపిన సారా వ్యతిరేక ఉద్యమానికి కానుకగా రాష్ట్ర ప్రభుత్వం బార్ల తలుపులు బార్లా తెరిచింది.

మన జానపద గాథల్లో సాలభంజికలకు ప్రాణం రావడం ఉంది. ఇవాళ మన ప్రభుత్వాలు ప్రాణమున్న మనుషులను సాలభంజికలుగా మారుస్తున్నాయి! ఎంత అభివృద్ధి సాధించాం!

***ప్రజాతంత్ర, ఏప్రిల్ 21, 2001***



# 23

# రోడ్ల విస్తరణలో కూలిన జీవితాలు

రహదారి నాగరికతా వాహిక అని నమ్మిన అమాయకపు రోజులు గడిచిపోయి, రహదారి ఎంతగా సాంస్కృతిక విధ్వంసానికి హేతువవుతుందో స్పృహ కలిగి చాల రోజులే అయింది. అయినా రహదారి వల్ల సాంస్కృతిక విధ్వంసం మాత్రమే కాదు, జీవిక ధ్వంసమైపోవడం, జీవితమే ధ్వంసమైపోవడం ఇటీవలే అనుభవంలోకి వచ్చాయి. రహదారుల పక్కన కలకలలాడే ఊళ్లు బెగ్గంపాడై పోయాయి. భూకంప దృశ్యాలను మరిపించే బీభత్స, భయానక దృశ్యాలు రాష్ట్ర వ్యాప్తంగా అన్ని రహదారుల పక్కనా, పట్టణాల నడిబొడ్డులోనూ దర్శనమిచ్చాయి.

రహదారులను వెడల్పు చేయడం పేరిట జరిగిన ఈ ఇళ్ల, చిన్న వ్యాపారాల, జీవితాల విధ్వంసం ఆలోచనాపరులలో కూడా అవసరమైనంత ప్రతిస్పందనను రేకెత్తించలేదు. రహదారులను ఉపయోగించే చాలామంది ఈ విస్తరణలు తమ సౌకర్యం కోసమేనని భ్రమపడి ఆమోదించారు. మన రహదారులను ఎందుకు, ఎట్లా, ఎంత వెడల్పు చేయాలో అటు ‘ఆంధ్రప్రదేశ్ – ఎజెండా ఫర్ ఎకనమిక్ రిఫార్మ్స్’లో ప్రపంచ బ్యాంకు, ఇటు ‘విజన్ 2020’లో మెకన్సీ అండ్ కంపెనీ ఆదేశించడం, ఆ ఆదేశాలను మన ఏలినవారు అక్షరాలా

ఔదల దాల్చడం చూసి, అందుకు అసలు కారణాలేమిటని అన్వేషిస్తే వన వనరులను దోచుకుపోవడానికీ, తమ సరుకులను మనకు అమ్ముకోవడానికీ తప్ప మరి ఇంకెందుకూ రోడ్డు అవసరం లేదని బహుళజాతి సంస్థలు అనుకుంటున్నాయని తెలిసింది.

మన నాలుగు లైన్ల, ఆరులైన్ల రహదారుల వెనుక రహస్యం ఈ సరుకుల రవాణాయేనని నాలుగు సంవత్సరాలుగా చెపుతూ, రాస్తూ ఉన్నాను. దాదాపు ప్రతి ఉపన్యాసంలోనూ ఊళ్లను బెగ్గంపాడు చేసిన చేస్తున్న రోడ్లు ఎవరి సరుకులు మన మారుమూల పల్లెటూళ్లకు రావడానికి ఉపయోగపడతాయో, 'పంట పొలాల నుంచి నౌకాశ్రయాలకు, విమానాశ్రయాలకు' అనే ప్రపంచ బ్యాంకు నినాదం మన వనరులను ఎట్లా కొల్లగొట్టబోతోందో చెప్పి శ్రోతలలో ఆలోచనలు రేపడానికి ప్రయత్నించాను.

ఆ శ్రోతలైనా ఎంతో కొంత కదిలారు గాని, కళ్లముందర సాగిన ఇంత బీభత్సానికి తెలుగు సీమలోని సృజనాత్మక రచయితలెవరూ కదిలినట్టు కనిపించలేదు. 'అభివృద్ధి అనగా ఇళ్లు కూల్చి రోడ్డు వేయుట' అని వరవరరావు రాసిన కవిత మినహా, ఇళ్లు కూల్చి రోడ్లు వేసే కార్యక్రమం మీద మరొక రచన నా దృష్టికి రాలేదు. 'మరి ఇళ్లు కూల్చిన మనుషులేం కావాలి/ బుల్‌డోజర్ల కింద నేలమట్టం కావాలి/ నెత్తుటి తారురోడ్లు కావాలి/ ఎముకలు నుగ్గయి సిమెంటు కావాలి' అని ఆయన కవిత ఈ రోడ్ల విస్తరణలో కూలిపోతున్న మనుషుల గురించి మాట్లాడింది.

కాని కూలిపోతున్న మనుషుల గురించి, మానవ సంబంధాల గురించి ప్రధానంగా చిత్రించవలసిన కథ, నవల, నాటకం వంటి ప్రక్రియలు ఇంత విస్తృతమైన వస్తువును పట్టుకోలేదెందుకా అని మూడు సంవత్సరాలుగా మనసులో మెరమెర ఉంటూ వచ్చింది. ఆ అసంతృప్తిని తీర్చేలా, చాల ప్రతిభావంతంగా, ప్రభావశీలంగా వెలువడింది మహమ్మద్ ఖదీర్‌బాబు కథ 'ఖదీర్ లేడు' (పర్‌స్పెక్టివ్స్ ప్రచురణ, మే 2001).

'ఖదీర్‌లేడు' కథా వస్తువు రోడ్లు వేయడానికి ఇళ్లు కూల్చిన రాష్ట్ర వ్యాప్త బీభత్సాన్ని కావలి అనే ఒక ఊరి నుంచి చూసిన, చూపిన దృశ్యం. ఆ ఇళ్లు, ఇళ్లు కూడా కాదు, మార్జిన్లలో తడకల అంగళ్లు – కాకపోతే జీవితాలే కూలిపోయిన మనుషులు, ఆ మనుషుల్లో ఒకానొక ఖాదర్ కథ ఇది. అంత మాత్రమే అయితే కూడా ఇది మామూలు కథే అయి ఉండేదేమో.

కాని, 'ఖాదర్ లేడు' ఇళ్లు కూల్చి రోడ్లు వేసే వ్యవహారానికి ఉన్న చాలా కోణాలను, వేర్వేరు స్థాయిల ప్రతిస్పందనలను కూడ పట్టుకుంది. మతాలకు అతీతమైన మానవీయ స్నేహాన్ని, ఆ స్నేహాన్ని క్షీణింపజేసే ఆర్థిక ప్రయోజనాల్ని చిత్రించింది. మన సమాజంలో చిన్న చిన్న వృత్తులలో, సమాజపు మార్జిన్‌లో ఉన్న అనేకమంది శ్రమజీవులను, ముఖ్యంగా ముస్లింలను, వాళ్ల ఆత్మాభిమానంతో సహా చిత్రించింది.

చిన్న వ్యాపారం నుంచి సుమారైన వ్యాపారం దాకా ఎదిగి, మార్జినోళ్లపట్ల, కనీసం ఖాదర్ పట్ల కొంత సానుభూతి కనబరచిన బైసాని వెంకట సుబ్బయ్య ప్రధాన పాత్రధారిగా, ఎక్కడా దృశ్యమానం కాకుండా కథకు ప్రాణంగా నడిచిన ఖాదర్ కథను చెప్పడంలో, ఆయా



పాత్రల స్వభావాల తారతమ్య పరిశీలనను, స్వభావాలలో మార్పులను చెప్పడంలో కథ గొప్ప శిల్పపరమైన విజయం సాధించింది.

అయితే ఇక్కడ శిల్పం గురించి కన్న, వస్తువు గురించి ఎక్కువ చెప్పుకోవడం మంచిది.

కథ ప్రారంభం నుంచీ ముగింపు దాకా కూడ ఈ 'కూలగొట్టే పని'కి పైన ప్రపంచ బ్యాంకు నుంచి ఒత్తిడి ఉందని, స్థానిక ప్రభుత్వాధికారులు 'కూలగొట్టే దాకా ఒంటి కాలిమీద నిలబడ్డారని' పాఠకులకు తెలిసేలా చేయడం వస్తువు పట్ల అవగాహన కలిగించడంలో కథ సాధించిన విజయం. అయితే ఈ అవగాహనలో కూడ వేర్వేరు వర్గాలకు వేర్వేరు స్థాయిలో స్పష్టత ఉంది.

'ఈ పని ఇంత త్వరగా, ఇంత అర్జెంటుగా, ఇంత దయలేకుండా చేయమని ఎవరు చెప్పారో, ఎందుకు చెప్పారో, ఎవరి మేలు కోరి చెప్పారో ఆ యాపారస్తుడి బుర్రకు తోచలేదు' అంటూ మొదలయిన కథే, 'అయ్యా, నువ్వు అల్లూరుపో, రాజుపాలెంపో, హైదరాబాదు పో, అండమానుపో, అంతాయిదే పరిస్థితి. రోడ్లు వెడల్పు చేయాలనీ వరల్డు బ్యాంకు అప్పిచ్చిందనీ యాడికాడ లేపవతల పారేస్తున్నారు' అని సుబ్బారెడ్డి చేతా చెప్పించింది.

మధ్యతరగతి వ్యాపారస్తుడు తన దాకా రాదులే అనుకోవడమూ, వస్తుందని తేలిపోయాక అన్ని రకాల పైరవీలు చేయడం, చెప్పించడం, డబ్బులు పెడితే ఆగిపోతుందనుకోవడం, అంతా అయిపోయాక మళ్లీ మామూలుగా కట్టడం చేయించి వ్యాపారం కొనసాగించడం, మార్జినోళ్లయితే ఎదురు తిరగడం, తడికలో బొంగులాగి పోలీసుల మీద పడడం, 'మా ఊర్లోపోయే రోడ్డు మాది గాకుండా ఇంకెవరిదవుతుందిరా బోసిడీకేల్లారా. మర్యాదగా మా మార్జిను మాకిస్తారా లేకుంటే రోడ్డు తవ్వి పాతరెయ్యమంటారా' అని అడుగుదామనుకోవడం. ఈ వ్యత్యాసాన్ని కథ బాగా పట్టుకుంది.

'మీ వీపుల మీద బాదడానికి మా కడుపుల మీద గుద్దితిరి. మీవి కూలుస్తామంటే కూల్చనీయొచ్చుగా.. 'ఆట్... మేమేనా ఆక్రమించింది. మార్జినోళ్లు ఆక్రమించుకోలేదా' అని లా పాయింట్లు తీస్తిరి. సరే, మేకపోతుల్ని ఎయ్యన్దే దున్నపోతులు మాటినేట్లు లేవని మమ్మల్ని ఏసేశారు.. మీ అందరికీ కోటి రూపాయలంటే వెంటిక ముక్క, కాని మాకు వెయ్యి రూపాయలన్నా గనమే' అని ఒకే విధ్వంసం రెండు వేరు వేరు ఆర్థిక వర్గాలను ఎట్లా తాకిందో, ఏ ప్రభావం వేసిందో కథ అద్భుతంగా చెప్పింది.

ఈ కథను కేవలం ఒక విధ్వంస దృశ్యాన్ని అద్భుతంగా చిత్రించినందువల్ల, జీవిత శకలాలను రోడ్ల మార్జిన్లలోంచి సున్నితంగా ఎత్తిపట్టుకున్నందువల్ల మాత్రమే కాదు, మధ్యతరగతి నిర్లిప్తతను, దుర్మార్గమైన సౌకర్యలాలసను చిత్రించినందువల్ల కూడా ఆహ్వానించవలసి ఉంది.

'మొన్నటి దాకా కళకళలాడుతూ కనిపించిన ట్రంకు రోడ్డు ఇవాళ గబ్బుగియ్యింగా' మారిపోతే 'బాగయ్యిందిలే, మంచిగయ్యిందిలే. లేకుంటే రోడ్లూ, సందులూ, గొందులూ వీళ్లమ్మా మొగుళ్లవిలా ఆక్రమించేసుకున్నారు' అనే మధ్యతరగతి అది.

నిజానికి చరిత్రలో మధ్యతరగతి చాల సంక్షోభ సందర్భాలలో ఆదర్శవంతమైన పాత్ర వహించింది. నిర్లక్ష్యానికి, నిరాదరణకు, దుర్మార్గానికి, అన్యాయానికి గురయిన వాళ్ల పక్షం వహించింది. వాళ్లకు తన గళాన్ని ఎరువిచ్చింది. మాట్లాడలేని వాళ్లకోసం తాను మాట్లాడింది.

నూతన ఆర్థిక విధానాల ప్రత్యక్ష, పరోక్ష ప్రభావాల వల్ల జరిగిన పెద్ద ప్రమాదం మధ్యతరగతిలో ఈ విలువల చట్రం లుప్తమైపోవడం. నూతన ఆర్థిక విధానాలు మధ్యతరగతి హృదయాన్ని హరించి వేశాయి. ఆ హృదయం స్థానంలో భోగ కాంక్షను, వ్యక్తిగత సౌకర్యాన్ని, ప్రలోభాన్ని నింపి పెట్టాయి.

హైదరాబాద్ వీథుల్లో విపరీతంగా పెరిగిపోయిన వాహనాల మీది మధ్యతరగతి (ద్విచక్ర వాహనాల సంఖ్యలో హైదరాబాద్‌ది అగ్రస్థానం. అరవై లక్షల జనాభాకు పన్నెండు లక్షల ద్విచక్ర వాహనాలు) తమ వాహనాల వల్ల రద్దీ పెరిగిందని కాక, రోడ్ల ఇరుకు వల్ల రద్దీ పెరిగిందనుకునే అపోహకు లోనయినప్పుడే, రోడ్ల విస్తరణకు, పక్కన ఇళ్లు కూలగొట్టడానికి 'సమ్మతి తయారీ' మొదలయింది.

ఇట్లా అటు నూతన ఆర్థిక విధానాలు, ఇటు పెరిగిపోతున్న మధ్యతరగతి, పెద్ద ఎత్తున సాగిన 'సమ్మతి తయారీ' అన్నీ ఒక స్థితిని తయారు చేసి పెట్టాక ప్రపంచ బ్యాంకు, మెకన్సీ వచ్చి నాలుగు రోడ్లు, ఆరు లైన్ల రహదారుల సిఫారసులు చేశాయి. ఇదంతా ఒక అంతర్జాతీయ షడ్యంత్రంలోని విడదీయరాని భాగంగా చూసినప్పుడే 'ఖాదర్ లేదు'కి కారణాలు దొరుకుతాయి.

ఇంతకీ, ఎక్కడో ఒక ఎం.ఆర్.ఒ. కార్యాలయాన్ని విప్లవకారులు కూలగొడితే గగ్గోలు పెట్టే పత్రికలూ, మధ్యతరగతీ రాష్ట్రం మొత్తం మీద కొన్ని లక్షల ఇళ్లు అధికారికంగా కూలగొట్టబడితే మాట్లాడకపోవడం వెనుక ఉన్న భావజాల కారణాలేమిటి?

***ప్రజాతంత్ర, జూన్ 2, 2001***



# 24

# అమ్మేవాడి అంగడి గ్రేట్ గోల్‌మాల్

హైదరాబాద్‌లో మహా అంగడి జరుగుతున్నది. పర్యాటక రంగాన్ని అభివృద్ధి చేసి, ప్రపంచంలో ముఖ్యమైన పర్యాటక గమ్యాల్లో ఒకటిగా ఈ మహా అంగడి హైదరాబాద్‌ను తీర్చిదిద్దబోతున్నదట. దుబాయినీ, సింగపూర్‌నూ, మలేషియానూ ఈ మహా అంగడి మరిపించబోతున్నదట. అసలు ఆ నగరాలను హైదరాబాద్ నగర వాసుల లోగిట్లోకి తేబోతున్నదట.

ఆరు సంవత్సరాలుగా మన ఏలిక మాటల్లోను, మెకన్సీ అండ్ కంపెనీ విరచిత విజన్ 2020 భవిష్య పురాణంలోను పదే పదే వ్యక్తమైన బంగారు కలలకు దృశ్య రూపం ఇస్తూ అటు ఎన్ఎసి గ్రౌండ్స్‌లోనూ, శిల్పారామంలోనూ ఇటు హుసేన్‌సాగర్ మురికికూపం తీరాన నెక్లెస్ రోడ్డు పక్కనా మహా అంగడి సాగుతోంది.

ది గ్రేట్ మాల్ ఆఫ్ హైదరాబాద్ అని పేరు పెట్టుకున్న ఈ మహా అంగడి తనను తాను ది రాయల్ ఇండియన్ షాపింగ్ అడ్వెంచర్ అని అభి వర్ణించుకుంటోంది. రెండో మాట బ్రిటిష్ రాచరికపు రోజులకు సంబంధించిన రాయల్ ఇండియన్ హంటింగ్ అడ్వెంచర్‌లనూ, తెల్లతోలు ప్రభువుల మృగయా వినోదాలనూ గుర్తు తెస్తోంది గాని నిజానికి ఈ మహా అంగడికి సంబంధించి ఇంకా తీవ్రంగా ఆలోచించవలసిన విషయాలెన్నో ఉన్నాయి.

ఊళ్లోకి ఒక కొత్త అంగడి రావడం మంచిదే. కొనుక్కోగలిగిన వాళ్లకు కొత్త వస్తువులను చౌకగా అమ్మజూపే అంగడి వస్తే మరీ మంచిది. అంతకన్నా ముఖ్యంగా ఈ హైదరాబాద్ మహా నగరంలో సాయంకాలాలు గడపడానికి, ఆహ్లాదకరమైన చోట్లూ, పీల్చడానికి పరిశుభ్రమైన గాలీ, మనుసును తేలికచేసే మహా సంరంభమూ కరవైపోతున్నప్పుడు ఊరి బయట ఆరు బయలు అంగడి అందుకేమన్నా పనికి వస్తే ఇంక కావలసిందేముంది?

కాని చూడబోతే ఈ అంగడి కొనేవాళ్ల అంగడిలా కనిపించడం లేదు. అమ్మే వాళ్ల అంగడి లాగానే అన్పిస్తోంది. లేదా అమ్మేవాళ్లకు సహకరించదల్చిన ప్రభుత్వపు అంగడిలా అన్పిస్తోంది. మామూలుగా ఒక అంగడిలో అమ్మేవాళ్ల అవసరాలూ కొనేవాళ్ల అవసరాలూ ఏకమై ఒక సమన్వయం కుదరవలసి ఉంటుంది. కాని ఈ హైదరాబాద్ మహా అంగడిలో మాత్రం అన్ని దారులూ అమ్మే వాళ్ల ప్రయోజనాల కోసమే తెరుచుకుంటున్నట్టున్నాయి. కొనేవాళ్ల అవసరాలు తీరుస్తున్నామనే భ్రమలు కల్పించి, వాళ్ల జేబులు కొల్లగొట్టి, అమ్మే వాళ్ల బొక్కసాలు నింపడమెట్లా అనే వ్యూహం అమలవుతున్నట్టుంది. కొనేవాళ్ల అవసరాలు తీర్చడం కోసమే అమ్మే వాళ్లకు సౌకర్యాలు సమకూరుస్తున్నామని ప్రగల్భాలు పలుకుతూ కోట్లాది రూపాయల ప్రజాధనాన్ని అమ్మే వాళ్లకు అప్పనంగా అందిస్తున్నట్టుంది.

ఈ మహా అంగడి ప్రకటిత ఉద్దేశ్యాలలోనే ఎన్నో లొసుగులున్నాయి. ఆ ఉద్దేశ్యాల అమలులో ఏలినవారు స్వయంగా తాము ఎంతగా సంపన్నుల, బహుళజాతి సంస్థల సేవలో మునిగి ఉన్నారో చూపుకుంటున్నారు. ఈ మహా అంగడి వల్ల, అది ముగిసిపోయిన తర్వాత కూడా హైదరాబాద్‌కు అంటనున్న అంటు రోగాల అపసంస్కృతి విలువలున్నాయి. ఇంతచేసీ ప్రకటిత లక్ష్యాలు కూడా నెరవేరని ప్రభుత్వ అసమర్థత ఉంది. అందువల్ల మహా అంగడి ఆర్భాటంగా, పటాటోపంగా, పైన పటారం లోన లోటారంగా సాగుతోంది.

మహా అంగడి ప్రకటిత ఉద్దేశ్యాలలో ఒకటి 30 లక్షల మందికి పైగా కొనుగోలుదార్లను ఆకర్షించి, వ్యాపారం అభివృద్ధి చేసి, హైదరాబాద్‌ను ఒక అమ్మకం కేంద్రంగా మార్చడం. ఇటువంటి అమ్మకం కేంద్రంగా మార్చే ఆశయం నెరవేరాలంటే దేశ దేశాల అమ్మకందార్లు ఇక్కడికి వచ్చి దుకాణాలు తెరిచేలా ఆకర్షించాలి. అట్లా ఆకర్షించాలంటే ఆ అమ్మకందార్లకి ప్రత్యేకమైన రాయితీలు కల్పించాలి, లాభాలు చూపాలి. అంటే కొనుగోలుదార్లకి కొత్త వస్తువులు చౌకగా దొరుకుతాయో లేదో గాని ముందు అమ్మకందార్లకి మాత్రం రాయితీల, లాభాల ఎరలు చూపాలి, చూపటం మాత్రమే కాదు అందజేయాలి.

అందుకే ప్రభుత్వం మహా అంగడిలో జరిగే అమ్మకాల మీద పన్ను మినహాయింపులు, రాయితీలు ఎన్నో ప్రకటించింది. ఆ మినహాయింపులు, రాయితీల వల్ల సరుకుల ధరలు తగ్గి, అమ్మకాలు పెరుగుతాయని, ఆ రకంగా అమ్మకందార్ల రాబడి పెరుగుతుందని ఒక సైద్ధాంతిక ఊహ. ఈ ఊహ ఎంత వరకు నిజమవుతుందో తెలియదు గాని దీని నుంచి వెలువడిన ప్రమాదాలు మాత్రం రెండున్నాయి.



ఇటువంటి రాయితీలు ఇవ్వగల అవకాశం, సామర్థ్యం ప్రభుత్వానికి ఉంటే, ఆ అవకాశాన్నీ సామర్థ్యాన్నీ ఇప్పుడే బహుళజాతి సంస్థల విషయంలోనే వాడుకోవడం ఎందుకనీ, తమకు కూడా ఇవ్వవచ్చుగదా అనీ స్థానిక, చిన్న అమ్మకందార్లు కొంచెం హడావుడి చేశారు. ప్రభుత్వం ఏదో రకంగా ఆ హడావుడి నుంచి బయటపడింది గానీ, ఇంకొక ప్రమాదం మరింత పెద్దది, మనందరికీ వర్తించేది.

ఈ అమ్మకం రాయితీల వల్ల, పన్ను మినహాయింపుల వల్ల రవాణా శాఖకు, వాణిజ్య పన్నుల శాఖకు, తదితర ప్రభుత్వ శాఖలకు నష్టం వాటిల్లుతుంది. వాటికి రాదగిన రాబడి రాకుండా పోతుంది. అందుకని ప్రభుత్వం ఆ పన్ను మినహాయింపుల, రాయితీల మొత్తాన్ని లెక్కకట్టి పర్యాటక శాఖ ద్వారా ఆయా శాఖలకు అందించాలని నిర్ణయం తీసుకుంది.

అంటే ఈ మహా అంగడి పన్ను మినహాయింపు వల్ల లాభపడేది అమ్మకందార్లు, వాణిజ్య పన్ను శాఖకు గానీ, ప్రభుత్వ పన్ను రాబడికి గానీ కూడా ఏ నష్టం ఉండదు. ఆ నష్టాన్ని భరించవలసింది మాత్రం పర్యాటక శాఖ. అంటే మనందరం కట్టిన పన్నుల్లోంచి పర్యాటక శాఖకు కేటాయించే నిధులు ఇట్లా చేతులు మారతాయన్న మాట. కొందరు వ్యక్తులకు మోటారు వాహనాలో, రంగుల టెలివిజన్ సెట్లో కొనుక్కుంటే దొరుకుతున్న రాయితీని మనందరం భరించాలన్న మాట. ఇది మహా అంగడి గోల్‌మాల్.

మహా అంగడి పేరు మీద ప్రజాధనం వ్యర్థమవుతున్నది ఈ ఒక్క రూపంలో మాత్రమే కాదు. అసలు ఈ అంగడి ఏర్పాటుకే ప్రపంచ వ్యాప్త టెండర్లు పిలిచి, కోట్లాది రూపాయలు ఖర్చు పెట్టి ఒక అడ్వర్టయిజింగ్, ఇవెంట్ మేనేజ్‌మెంట్ (వ్యాపార ప్రకటన, ఉత్సవ నిర్వహణ – కాని ఈ మాటలను తెలుగులో చెప్పుకుంటే బావుండదు. ఈ పనులు మన సంస్కృతిలో లేవు. అమెరికన్ వాణిజ్యంలోంచి దిగుమతి అయ్యాయి) కంపెనీకి ఆ పని అప్పగించారు.

ఆ కంపెనీకి ఈ ఉత్సవ నిర్వహణ కోసం ఎంత ముడుతుందో మన ఘనత వహించిన పారదర్శక ప్రభుత్వం ఎక్కడా ప్రకటించలేదు. కొనుగోలుదార్లకు మేలు చేస్తున్నామనే పేరుతో సాగుతున్న ఈ అంగడి లోపలికి ప్రవేశించాలంటే ఇరవై అయిదు రూపాయలు. మరి నిర్వాహకులు చెబుతున్న 30 లక్షల మందే వస్తే, టిక్కెట్ల రాబడి అంతా ఎవరికి అందుతుందో తెలియదు.

మూడు చోట్ల ఏర్పాట్లకు, దుకాణాలు నిర్మించడానికి, యాభై ఆర్టీసి బస్సులను ప్రత్యేకంగా మహా అంగడి కోసం కేటాయించి పసుపు రంగు వేయించడానికి (మహా అంగడికి పసుపు రంగు ఎందుకు?), విద్యుత్ అలంకరణకు, ప్రత్యేకంగా వేసిన రోడ్లకు, ఇతర ఏర్పాట్లకు ప్రజాధనం ఎంత వ్యయమైందో లెక్కలు, అంచనాలు లేవు. అమ్మకం పన్ను మినహాయింపులు కూడా ఉన్నాయి. కాబట్టి ప్రభుత్వానికి ఈ వ్యయానికి ఎదురుగా రాబడి ఏమీ లేదు. ప్రతిదాన్నీ లాభనష్టాల లెక్కల్లో మాత్రమే చూసే ప్రభుత్వం ఈ మహా అంగడి కోసం రాబడే లేని ఖర్చు ఎందుకు పెడుతుందో ఆలోచించాలి. నిజానిక ఇటువంటి ఆర్భాటాలూ, మినహాయింపులూ ఏమీ లేకుండానే హైదరాబాద్ ఎగ్జిబిషన్ ఎన్నో దశాబ్దాలుగా ఏటేటా ఎంతో వ్యాపారం చేస్తోంది.

లక్షలాది మందిని ఆకర్షిస్తోంది. ఇంత చేసీ గ్రేట్ మాల్ ఆఫ్ హైదరాబాద్ మన నుమాయిష్ కన్నా ఎక్కువగా ఊడబొడిచిందేమీ లేదు.

కాని గ్రేట్ మాల్ ద్వారా పాలక వర్గాలకు ఇతరేతర ప్రయోజనాలున్నాయి. మహా అంగడిలో భాగంగా ప్రభుత్వం విచ్చలవిడి మద్యం అమ్మకాలు అనుమతిస్తోంది. డిస్కోథెక్ అనే పేరుతో హైదరాబాద్‌ను విలాస కేంద్రంగా మార్చి, తూర్పు ఆసియా పర్యాటక వ్యభిచార కేంద్రాలలా 'అభివృద్ధి' చేయడానికి ఇది నాందిగా పనికొస్తోంది.

మహా అంగడిలోని విచ్చలవిడి మద్యం అమ్మకాలు మొదలైన తర్వాత అవి క్రమంగా నగరమంతా వ్యాపిస్తాయి. నామమాత్రపు పాక్షిక మద్య నిషేధం కూడా తొలగిపోయే పరిస్థితి వస్తుంది. యువతరంలో పెరిగిపోతున్న అసంతృప్తిని పక్కదారి పట్టించి, వ్యవస్థకు వ్యతిరేకంగా మారకుండా చూడాలంటే మద్యపానాన్ని ప్రోత్సహించడం లాంటి పనులు ఈ వ్యవస్థకు కావాలి. ఆ పనుల్లో భాగమే డిస్కోథెక్‌లు. నాట్యం మానవ సహజమే. ఆనందమూ, విషాదమూ నాట్యంలో వ్యక్తీకరణ పొందుతాయి. కాని డిస్కోథెక్‌లలో లక్షల వాట్ల విద్యుద్దీపాలు (ఇందుకు మాత్రం విద్యుత్ కొరత కనబడదు) వెలుగుతూ ఆరుతూ, లక్షల డెసిబుల్ల ధ్వనులు ఉన్మత్తత వ్యాపింపజేస్తూ ఉండగా శరీరాన్నంతా వికృత కేళిలో కదల్చడం డిస్కోథెక్. అటువంటి మత్తు మందును యువత నరనరాన నింపడమే ఇవాళ పాలకులకు అత్యవసరం.

రాయల్ ఇండియన్ హంటింగ్ అడ్వెంచర్లలో బ్రిటిష్ సంపన్నులు భారతదేశపు అడవుల్లోకొచ్చి పులుల్ని చంపి, లేదా సేవకులు చంపిన పులుల పక్కన నిలబడి ఫోటోలు తీయించుకుని విజేతల్లా వెళ్లిపోయేవారు. ఇవాల్టి అడ్వెంచర్‌లో ఈ నగరారణ్యంలో కొనుగోలు దార్లనూ, ప్రజాధనాన్నీ గెలుపొందుతున్న విజేతలు పసుపు నేపథ్యంలో ముత్యాల దండలు వేసుకుంటున్నారు.

***ప్రజాతంత్ర, అక్టోబర్ 28, 2001***



# 25

# మరోసారి ప్రైవేటీకరణ గురించి...

వారం వారం నడిచే శీర్షికలో ఒకే విషయంపై ఒకవారం తర్వాత మరోవారం వరుసగా రాయడం అంత మంచి పద్ధతి కాదు. కాని ఇవాళ ప్రపంచ బ్యాంకు సామంత రాజ్యంగా నడుస్తున్న ఆంధ్రదేశంలో పాలనలో ఏ మంచి పద్ధతి మిగిలిందని – పాలన మీద ప్రతిస్పందించే శీర్షిక మంచి పద్ధతికి కట్టుబడి ఉండడానికి?

తప్పనిసరిగా మళ్లీ ఈ వారం కూడా ప్రైవేటీకరణ మీదనే రాయాల్సి వస్తున్నది. గతవారం ఈ రాష్ట్రంలో ప్రభుత్వ రంగ సంస్థల్ని ప్రైవేటీకరించడానికి ఎటువంటి కుట్ర ఎన్నాళ్లుగా జరుగుతున్నదో రాసిన తర్వాత మరిన్ని వివరాలు బయటపడి ఆ కుట్ర మరెంత పెద్ద ఎత్తున సాగుతున్నదో తెలిసి వచ్చింది. అసలు ప్రభుత్వరంగ సంస్థలన్నిటినీ మూసివేయడానికి, ప్రైవేటీకరించడానికి, 'పునర్నిర్మించడానికి' ఈ రాష్ట్ర ప్రభుత్వం ఎట్లా కంకణం కట్టుకున్నదో, విదేశీ సంస్థలకు అందుకు తగిన వాగ్దానాలెట్లా చేసిందో, ఒక కార్యాచరణ ప్రణాళిక తయారు చేసి, ఏయే సంస్థను ఎప్పుడు చంపాలి, ఎప్పుడు పాడెకట్టాలి, ఎప్పుడు దహనం చేయాలి అనే పథకం తయారు చేసిందో, ఏలినవారి హత్యాలోచనలు ఎంత పకడ్బందీగా తయారవుతున్నాయో తెలిసి వచ్చింది.

రాష్ట్రంలోని ప్రభుత్వ రంగ సంస్థలంటే ఈ రాష్ట్ర ప్రజలు తమ నెత్తురూ చెమటా ఒడ్డి సమీకరించిన ఆస్తులు. కొన్ని తరాలుగా ఈ నేల మీద ప్రజలు చేసిన శ్రమకు మూర్తీభవ రూపాలు. ఆ ప్రజా సంపదనంతా కొల్లగొట్టే, ఇతరులకు అమ్మజూపే, ఆ సంపదలో నిక్షిప్తమైన మన వారసత్వ సంపదనంతా చంపివేసే మాఫియా ముఠా ఇవాళ ఈ రాష్ట్రాన్ని పాలిస్తున్నది. ఆ హంతక ముఠా తన కోసం తాను రాసుకున్న హిట్‌లిస్ట్ ఒకటి పొరపాటున బయటపడి ప్రజల చేతుల్లో పడింది.

ఆ హిట్‌లిస్ట్ పేరు 'ఫేజ్ –2 ఆక్షన్ ప్లాన్ ఆఫ్ పబ్లిక్ ఎంటర్‌ప్రైజెస్ రిఫార్మ్ అండర్ ఎపి ఇఆర్‌పి' (ఆంధ్రప్రదేశ్ ఆర్థిక పునర్నిర్మాణ పథకం కింద ప్రభుత్వరంగ సంస్థల సంస్కరణల రెండో దశ కార్యాచరణ ప్రణాళిక). ఈ చేయదలచిన 'హత్యల జాబితా' రచయిత ప్రభుత్వరంగ సంస్థల శాఖ అని ఉంది గానీ లోపలి విషయాలు చూస్తే దీన్ని అటు ప్రపంచ బ్యాంకు, డిఎఫ్ఐడి వంటి సంస్థలు, ఇటు రాష్ట్ర ప్రభుత్వం కలిసికట్టుగా తయారు చేసినట్టు కనబడుతోంది.

ఈ జాబితా రాష్ట్రంలోని 126 ప్రభుత్వరంగ సంస్థల భవితవ్యాన్ని – వాటిలో ఇప్పటికే మూతబడడమో, ఆ దారిలో పెట్టడమో జరిగిన 19 సంస్థలతో సహా – నిర్ణయించే పథకాన్ని రచించింది. అంటే రాష్ట్ర జనాభా అంతటినీ ప్రభావితం చేయగల బృహత్ ప్రణాళిక ఇది. ఆయా సంస్థలలో పనిచేసే లక్షలాది మంది జీవనోపాధికి సంబంధించిన సమస్య ఇది. ఇందులో ఉత్పత్తి సంస్థలూ ఉన్నాయి. నిర్వహణ సంస్థలూ ఉన్నాయి, సేవా సంస్థలూ ఉన్నాయి. వాటిని మూసివేసే ఆలోచన చేయడమంటే ప్రజలకు ఇవాళ ప్రభుత్వరంగం ద్వారా అందుతున్న ఉత్పత్తులను, సేవలను, నిర్వహణ సామర్థ్యాన్ని రద్దు చేయడమే అవుతుంది. ఆ అవసరాన్ని తీర్చుకోవడం కోసం ప్రజలను ప్రైవేటు వ్యక్తుల, సంస్థల దగ్గరికి, లాభార్జనా, అత్యాశాపరుల దగ్గరికి తోసివేయడమే అవుతుంది.

ఇంత ముఖ్యమైన రాజకీయార్థిక నిర్ణయాలను ఈ రాష్ట్ర ప్రజల మీద రుద్దుతున్న ఈ 'కార్యాచరణ ప్రణాళిక' బహిరంగ పత్రం కాదు. దీన్ని ప్రజల ముందరో, పత్రికల ముందరో, కనీసం శాసనాసభా వేదిక మీదనో చర్చకు పెట్టడం జరగలేదు. ఇంతటి కీలక నిర్ణయాలను విదేశీ సంస్థల ప్రతినిధులు, రాష్ట్ర ప్రభుత్వ అధికారులు, రాష్ట్రానికి సర్వం సహా చక్రవర్తి అయి వాషింగ్టన్ దొరలకు సామంతుడిగా చక్రం తిప్పుతున్న మన ఏలిక మాత్రమే తీసుకోవడమే రోజురోజూ ఊదరగొడుతున్న సత్పరిపాలన, పారదర్శకతలకు అర్థం కాబోలు.

మొత్తానికి ఈ రహస్యపు హిట్‌లిస్ట్ సిపిఐ (ఎం) రాష్ట్ర శాఖ పుణ్యమా అని ప్రజలందరికీ అందుబాటులోకి వచ్చింది. పత్రికలకు తెలిసి వచ్చింది. దాదాపు పత్రికలన్నీ సిపిఐ (ఎం) పత్రికా సమావేశంలో చెప్పినదాన్ని మాత్రం రాసి ఆ పత్రం గురించి సమాచారం అందించవలసిన బాధ్యత నుంచి తప్పించుకోవడం ఈ మహా హరికథలో ఒక పిట్టకథ.

ఈ కార్యాచరణ ప్రణాళికలో ప్రధాన భాగం 36 పేజీలు, ఎనిమిది అనుబంధాలు 51, ఈ మొత్తం ప్రణాళికను తెలుగులోకి అనువదించి, రాష్ట్ర ప్రజలందరికీ అన్ని ప్రచార, ప్రసార సాధనాల ద్వారా అందిస్తే గాని మన రాష్ట్ర ప్రభుత్వ పొట్టలో ఎన్ని దురాలోచనలున్నాయో అర్థం కాదు. ఇంకో ఆరు సంవత్సరాల పాటు ఏయే సంవత్సరం ఎంతెంత మందిని నిరుద్యోగులను చెయ్యడానికి, ఎన్నెన్ని కుటుంబాల్ని వీథుల పాలు చెయ్యడానికి, ప్రజలందరికీ ప్రభుత్వం అందజేస్తున్న సేవలను ఉపసంహరించి వాళ్లను ప్రైవేటు వ్యక్తుల, సంస్థల లాభాపేక్షకు బలి చెయ్యడానికి ప్రభుత్వం కుట్రలను రచించిందో ఈ పత్రం చదివితే గాని అర్థం కాదు.



'ప్రభుత్వ రంగ సంస్థల సంస్కరణ' అనే మేలిముసుగు కింద దాక్కున్న అసలు కార్యక్రమం ప్రభుత్వరంగ సంస్థల ప్రైవేటీకరణ లేదా పునర్నిర్మాణం అని ఈ పత్రం స్పష్టంగానే చెబుతుంది. మళ్లీ పునర్నిర్మాణం అనే మాటను కూడా వివరిస్తూ అది మూసివేత గానీ, పెట్టుబడుల ఉపసంహరణ గానీ కావచ్చునని అంటుంది. ప్రభుత్వ రంగంలో ఆ సంస్థలను కొనసాగించే అవకాశం గురించి కూడా ప్రస్తావిస్తుంది గాని అది నేతిబీరకాయలోని నెయ్యి కన్న ఎక్కువ కాదు.

ఈ సంస్కరణల మొదటి దశ ఎట్లాగూ అయిపోవచ్చింది గనుక రెండో దశ గురించే మాట్లాడుకుందాం. ఈ రెండో దశ మొత్తం 97 కంపెనీలకు, కార్పొరేషన్లకు, సహకార సంస్థలకు వర్తిస్తుందని ఈ పత్రం చెపుతుంది. ఆ 97 సంస్థలను ఆరు తరగతులుగా విభజించి, ఆ ఆరు తరగతుల నిర్వచనంలోనూ ప్రైవేటీకరణకు అనుకూల దశలోనే వివరణలు సాగాయి. 'సరళీకరణ అనంతర దశలో అసంబద్ధమైన సంస్థలు, ప్రైవేట్ సంస్థల ఉనికి గణనీయంగా ఉన్న రంగాలలో పనిచేస్తున్న సంస్థలు, ఏ నిర్దిష్ట కారణాల రీత్యానైనా ప్రైవేటీకరించడం, పునర్నిర్మించడం అవసరమని ప్రభుత్వం భావించే సంస్థలు, వాణిజ్య, సాంఘిక బాధ్యతలు రెండూ ఉన్న సంస్థలు, ప్రైవేటు రంగంలో దొరకని వస్తువులను అందించే సంస్థలు, తొలగిస్తే భారీ సాంఘిక, రాజకీయ మూల్యం చెల్లించవలసిన భారీ శ్రమ–ప్రాధాన్య సంస్థలు' అని ఈ ఆరు తరగతులను నిర్వచించారు.

ఆ విభజన కార్యాచరణ ప్రణాళిక రచయితల మాయావాద నైపుణ్యానికి అద్దం పడుతుంది. గతంలో చంపదలచిన కుక్కకు పిచ్చి కుక్క అని మాత్రమే పేరు పెట్టేవారు. చంపదలచిన ప్రభుత్వ రంగ సంస్థకు నష్టాలు వస్తున్నాయి అని మాత్రమే ముద్రవేసే వారు. ఇవాళ మాత్రం రంగు రంగుల ముద్రలుకొట్టి, బుక్కా గులాల్ చల్లి చాల ఆకర్షణీయమైన మాటలతో అలంకరిస్తున్నారన్నమాట. ఈ అలంకరణల్లో మైమరిచి ఉండగానే వధ్యశిల మీదికి తీసుకుపోవడమో, తల తెగగొట్టడమో జరిగిపోతుంది.

ఈ తరగతుల నిర్వచనాలలో కూడ ఎపిఎస్ ఆర్‌టిసి, సింగరేణి నాలుగో తరగతిలోకేరావాల్సి ఉండగా, ఎందుకో ఆ రెండింటిని మాత్రం ఆరో తరగతిలోకి తోశారు. మొత్తం మీద ఏ సంస్థను ఏ తరగతిలో పెట్టినా, ఆ 97 సంస్థల గురించి విడివిడిగా ఇచ్చిన సమాచారలోనూ, అన్నిటికీ కలిపి తయారు చేసిన పట్టికలలోనూ ప్రభుత్వపు అసలు ఉద్దేశ్యం ఆ సంస్థలను తెగనమ్మడమేనని అక్షరాలా బైటపడుతుంది.

"ప్రతి సంవత్సరం దాదాపు (15 సంస్థల ప్రైవేటీకరణ, ప్రైవేటు రంగానికి బదలాయింపు గాని, మూసివేత గాని) జరపడం ఇంప్లిమెంటేషన్ సెక్రటేరియట్ బాధ్యత' అని ఈ పత్రం స్పష్టంగా రాయడం మాత్రమే కాదు, ప్రైవేటీకరించవలసిన / పునర్నిర్మించవలసిన ప్రభుత్వ రంగ సంస్థల జాబితాను కూడా ఆదేశించింది. ఆ జాబితా కింద చాలా ముఖ్యమైన వాక్యం ఒకటుంది: 'సంవత్సరానికి కనీసం 15 ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేటీకరించే / మూసివేసే షరతుకు కట్టుబడి' అని.

ఎవరిదీ షరతు? ఎవరు అంగీకరించారు? ప్రపంచ బ్యాంకు తన రుణంతోపాటు సూచించిన ఎపిఇఆర్‌పిలో భాగంగా షరతులున్నాయని, ఈ రాష్ట్ర ప్రభుత్వం ప్రజల కళ్లుగప్పి ఆ షరతులను అంగీకరించిందని, రాష్ట్ర భవిష్యత్‌ను తాకట్టు పెట్టిందని, రాష్ట్ర రాజకీయార్థిక నిర్ణయాలు వాషింగ్టన్‌లో తీసుకుంటున్నారని ఐదు సంవత్సరాలుగా మాబోటి వాళ్లం చేస్తున్న వాదనను ఇప్పుడీ రహస్య పత్రం బలపరుస్తున్నదన్నమాట.

అంతేకాదు, ఇన్ని సంవత్సరాలుగా అసలు షరతులే లేవని, చివరికి మొన్నటికి మొన్న ఆర్‌టిసి సమ్మె సందర్భంలో కూడా ఆర్‌టిసి సంస్థను ప్రైవేటీకరించే ఆలోచనే లేదని. ఈ రాష్ట్ర ముఖ్యమంత్రి నుంచి కింది స్థాయి అధికారుల దాకా ఎందరెందరో ప్రభుత్వ అధికార ప్రతినిధులు చేసిన ప్రకటనలు అబద్ధాలని ఈ రహస్య పత్రం రుజువు చేస్తున్నది.

ఈ రహస్య పత్రంలోని అనుబంధం-1 ప్రకారం ఎపిఎస్ ఆర్‌టిసి సంస్కరణలో భాగంగా జరగనున్న పరిశీలనాంశాలను 25 సెప్టెంబర్ 2001 నాటికే తయారు చేయడం జరిగింది. అనుబంధం 8 ప్రకారం 2005, 2006, 2007 సంవత్సరాలలో ఆర్‌టిసి నుంచీ, సింగరేణి నుంచీ మూడో వంతు కార్మికులకు ఉద్యోగాలు ఊడగొట్టి ఇళ్లకు పంపించే పథకాలు తయారు చేయడం జరిగింది.

మరోవైపు ఈ కుట్ర పూరిత పథకం రచించినందుకు విదేశీ, స్వదేశీ సలహాదార్లకు ఇప్పటికే రు. 14.15 కోట్లు ఇచ్చారనీ, ఇంకా రు. 11.01 కోట్లు కావాలనీ ఈ పత్రమే రాసింది. అందులో బ్రిటిష్ కన్సల్టెంట్ల జీతాలు (ఐదు కోట్లు) విమాన ప్రయాణాలు (కోటి), దినభత్యం (అరకోటి) ప్రధాన భాగం తీసుకున్నాయి.

'ఎవడబ్బ సొమ్మని చింతాకు పతకము' అని రాముని మీదనే గోపన్నకైనా సందేహం వచ్చింది గాని అటువంటి సిగ్గు ఎగ్గులేమీ మన పాలకులకు ఉన్నట్లు లేవు.

***ప్రజాతంత్ర, నవంబర్ 11, 2001***



# 26

## సహకారపు సంహరణ ఎందుకు?

రాష్ట్రంలోని 3610 ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘాల లోంచి 1200 సంఘాలను, 575 జిల్లా కేంద్ర సహకార బ్యాంకు శాఖలలోంచి 200 శాఖలను మూసివేయాలని మంత్రివర్గ ఉపసంఘం ప్రతిపాదించడం, దాని సూచనలను రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించడం ఆంధ్రప్రదేశ్ రాజకీయార్థిక విధానాలను పరిశీలిస్తున్న వారికి ఆశ్చర్యం కలిగించే విషయాలేమీ కావు. కాని రైతులకు అవసరమైన పరపతి సౌకర్యాల గురించీ, గ్రామీణ వ్యవసాయ రంగాల సంక్షోభం గురించీ ఆలోచించే వారికి ఈ నిర్ణయాలు మరింత ఆందోళన కలిగిస్తాయి. మంత్రివర్గ ఉపసంఘం చేసిన సూచనలు మన వ్యవసాయ రంగ దుస్థితికి వ్యవస్థాగత పరపతి సౌకర్యం కొరత ఎంత వరకు కారణమయిందో ఎంత మాత్రం పరిగణనలోకి తీసుకోలేదు సరిగదా, వ్యవసాయ రంగాన్ని మరింత దుస్థితిలోకి నెట్టే పరిణామాలకు దారి తీస్తున్నాయి.

సహకార రంగం మీద మన రాష్ట్ర ప్రభుత్వానికి ఇంత ఆగ్రహం ఎందుకు కలిగింది? అసలే సక్రమంగా నడవని సహకార రంగం మీద, రైతాంగానికి రుణ, పరపతి సహాయాలు అందించడంలో ఇప్పటికే విఫలమవుతున్న సహకార రంగం మీద ఈ గొడ్డలి వేటు వేయాలని ఏలినవారు ఎందుకు నిర్ణయించారు?

ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాలలో ఇప్పుడు రద్దు చేయదల్చిన 1200 సంఘాలు నష్టాల ఊబిలో కూరుకుపోయాయని, మూసి వేయదల్చుకున్న జిల్లా కేంద్ర సహకార బ్యాంకు శాఖల్లో తగినంత వ్యాపార లావాదేవీలు జరగడం లేదని మంత్రివర్గ ఉపసంఘం చెబుతున్నది.

రాష్ట్రంలో ప్రపంచ బ్యాంక్ పాలన మొదలయినప్పటి నుంచీ ప్రభుత్వరంగంలోని, సహకార రంగంలోని ఎన్నో సంస్థల మూసివేతకు ఇవే కారణాలు చెపుతున్నారు. ప్రపంచ బ్యాంక్ ఆదేశం ప్రకారం ప్రభుత్వ వ్యయం తగ్గవలసి ఉండగా, ఆ వ్యయంలో నిజమైన దుబారా ఖర్చులను తగ్గించే బదులు, ప్రభుత్వం ప్రజా సంక్షేమ రంగాల నుంచి, ప్రజలకు అవసరమైన సేవల నుంచి ఉపసంహరించుకుంటూ ఖర్చు తగ్గించడానికి ప్రయత్నిస్తోంది. నిజంగా నష్టాలు వస్తున్న సంస్థలేవో గుర్తించి, వాటిలో నష్టాలకు కారణాలేమిటో అన్వేషించి, సవరించడం, ఆ సంస్థలను నష్టాలు రాకుండా నడపడం అసాధ్యమేమీ కాదు. కాని ప్రపంచ బ్యాంకు ఆదేశాలలో అణా పైసలలో లాభనష్టాల లెక్కలు మాత్రమే కాక ప్రభుత్వరంగం, సహకార రంగం వంటి సోషలిజం చిహ్నాలన్నిటినీ రద్దు చేసేయాలనే భావజాల పరమైన లక్ష్యం కూడా ఉంది. అందుకే క్రమక్రమంగా లాభసాటిగా నడిచే సంస్థలను కూడా మూసివేయాలనే తాఖీదులు అందుతున్నాయి.

ఈ నేపథ్యంలో ఇవాళ్టి నిర్ణయం పూర్వాపరాలను, ఈ నిర్ణయం వల్ల జరగబోయే మార్పులను ఆలోచించాలి. ఇప్పుడు మూసివేతకు గురవుతున్న సంస్థల ఉద్యోగుల గతి ఏమవుతున్నదన్నది మొదటి ప్రశ్న. ప్రభుత్వ ప్రకటనలో ఈ సిబ్బంది కడగండ్ల పట్ల ఎంత నిర్లిప్తత వ్యక్తమయిందంటే, ఈ సూచనను ప్రకటించిన సహకార మంత్రి కనీసం ఎంత మంది సిబ్బంది ఉద్యోగాలు కోల్పోనున్నారో కూడా ప్రస్తావించలేదు. ప్రాథమిక సహకార సంఘాలు, సహకార బ్యాంకు శాఖల మూసివేతతో పాటు, సహకార వ్యవస్థకు సంబంధించిన ఐదు జోనల్ కార్యాలయాలను కూడా ఎత్తి వేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. కనుక ఈ మొత్తం వ్యవహారంలో కనీసం రెండు వేల మంది సిబ్బంది ఉద్యోగాలు కోల్పోతారని ఊహించవచ్చు. అంటే రెండు వేల కుటుంబాలు ఇప్పుడు తాజాగా రోడ్డున పడనున్నాయన్న మాట. ఆల్విన్, రిపబ్లిక్ ఫోర్జ్, ఎ.పి. స్కూటర్స్, సహకార చక్కెర మిల్లులు, ఎన్నో ప్రభుత్వ రంగ సంస్థల ఉద్యోగుల కుటుంబాలకు ఏ గతి వచ్చిందో ఇప్పుడు ఈ సహకార శాఖ సిబ్బంది కుటుంబాలకు ఆ గతే పట్టనున్నదన్న మాట. ఈ ఆత్మహత్యల ప్రదేశ్‌లో ఆత్మహత్యల అంచుమీదికి మరో రెండు వేల కుటుంబాలు చేరనున్నాయన్నమాట.

సహకార సంస్థల మూసివేతకు సంబంధించి ఆలోచించవలసిన మరొక ముఖ్య అంశం వాటి పనితీరు ఎలా ఉన్నదనేది. నిజం చెప్పాలంటే కింది నుంచి పై దాకా సహకార రంగం పనితీరు సక్రమంగా ఉండడం లేదు. సహకార రంగంలో అమలవుతున్న అవకతవకల గురించి ఎంతో కాలంగా ఎందరో నిపుణులు, పరిశీలకులు, మేధావులు ఆందోళన చెందుతున్నప్పటికీ అటు కేంద్ర ప్రభుత్వం తరఫునా, ఇటు రాష్ట్ర ప్రభుత్వం తరఫునా ఎన్నోసార్లు అధ్యయనాలు జరిగినప్పటికీ, సహకార రంగాన్ని మెరుగుపర్చే ఆచరణాత్మక చర్యలేవీ అమలులోకి రాలేదు.



సహకార సంస్థలలో సభ్యత్వంలో అవకతవకలు, రుణాల మంజూరీలో అక్రమాలు, రుణాలను చిన్న, సన్నకారు రైతులకు అందజేయాల్సి ఉండగా భూస్వాములు, ధనిక రైతులు, పెత్తందారులు వాటిని కొల్లగొట్టుకుపోవడం, రుణాల వసూళ్లు, తిరిగి చెల్లింపులు సక్రమంగా ఉండకపోవడం, పెద్దల దగ్గర మొండి బాకీలు పేరుకు పోవడం, సహకార సంఘాల పనితీరులో రాజకీయ జోక్యం, సహకార సంఘాలను, వాటి రుణాలను పాలక పార్టీ రాజకీయ ప్రయోజనాలకే వినియోగించుకోవడం వంటి అనేకానేక కారణాలతో సహకార రంగాన్ని ప్రభుత్వమూ, పాలక వర్గాలూ చిన్నాభిన్నం చేసేశాయి.

అంతకు ముందే సహకార రంగం స్థితి ఇలా ఉండగా నూతన ఆర్థిక విధానాల ప్రభావం వల్ల మొత్తం ద్రవ్య రంగంలో వచ్చిన మార్పులు సహకార సంస్థలను మరింత దెబ్బతీశాయి. రాష్ట్రంలోని 4610 సహకార సంఘాల్లో నాలుగో వంతు నిర్ణయం తీసుకుంది. వాణిజ్య బ్యాంకు రుణాలకు కూడా లేని స్థాయిలో డ్యూటీని నిర్ణయించి, రుణ గ్రహీతలను వాణిజ్య బ్యాంకులవైపు నెట్టే ప్రయత్నం చేసింది. రాష్ట్ర కేంద్ర సహకార బ్యాంకుకు నాబార్డు నుంచి అందే రుణంపై 6.5 శాతం నుంచి 8 శాతం వరకు వడ్డీ ఉండగా, సహకార సంఘాల దగ్గరికి వచ్చేసరికి ఆ వడ్డీ 12.5 శాతం నుంచి 15 శాతానికి పెరిగిపోయింది. అందువల్ల రైతులు సహకార సంఘాల పరపతిపై 14–15 శాతం వడ్డీ చెల్లించవలసిన స్థితి వచ్చింది.

ఈ అక్రమమైన పని పద్ధతుల వల్ల ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాలు ఏ ఆదర్శంతో ప్రారంభమయ్యాయో ఆ ఆదర్శాన్ని పాటించలేకపోయాయి. రాష్ట్ర వ్యాప్తంగా ఈ సంఘాలన్నిటిలో కలిపి ఒక కోటి నలభై లక్షల మంది సభ్యులుండగా రుణ, పరపతి సౌకర్యం పొందిన వారి సంఖ్య 39 లక్షలకు మించలేదంటే ఈ సహకార సంఘాలు ఎంత అపసవ్యంగా పనిచేశాయో అర్థమవుతుంది.

ఈ సహకార వ్యవస్థను సృష్టించడంలో మరొక ముఖ్యమైన లక్ష్యం రైతాంగాన్ని వడ్డీ వ్యాపారులు, పెత్తందార్లు వంటి వారి లాభాపేక్షకు బలి అయిపోకుండా కాపాడి వారికి వ్యవస్థాగత పరపతి సౌకర్యాలు అందించడం. నిజానికి ఈ ఆదర్శాలలో రెండు భాగాలున్నాయి. ఒకటి తక్కువ వడ్డీ రేట్లకు రుణ, పరపతి సౌకర్యాలు అందజేయడం. రెండు – అవసరమైన వర్గాలకు, తగిన ధరావత్తు చూపించలేని వర్గాలకు రుణ, పరపతి సౌకర్యాలు అందజేయడం.

ఇన్ని సంవత్సరాలుగా నడుస్తున్న సహకార సంస్థలను ఈ రెండు ఆదర్శాలను అరకొరగానే నిర్వహించాయి. వడ్డీ రేట్ల అవకతవకల గురించి పైననే చూశాం. అయినా సాధారణంగా గ్రామీణ ప్రాంతాలలో వడ్డీ వ్యాపారులు, భూస్వాములు వసూలు చేసే వడ్డీ రేట్లు 24 శాతం నుంచి 120 శాతం దాకా ఉంటున్నాయి. కనుక సహకార సంఘాలు 15 శాతం గరిష్టంగా వసూలు చేసినా ఫర్వాలేదని రైతాంగం భావిస్తోంది. కాని ఏ ఒక్క ప్రాంతంలోనైనా రైతాంగానికి ఎంత పరపతి సౌకర్యం అవసరమో అందులో పదో వంతు కూడా ఈ సహకార సంఘాలు తీర్చడం లేదు. వరంగల్ జిల్లాలో పత్తి రైతుల ఆత్మహత్య సందర్భంగా ఈ పరపతి సౌకర్యం గురించి ఒక అంచనా బైటపడింది. రాష్ట్ర స్థాయి బ్యాంకు రుణాల నిర్ణాయక మండలి ఆ

సంవత్సరం జిల్లా రైతాంగానికి రు. 120 కోట్ల పరపతి అవసరం అవుతుందని అంచనా వేయగా అన్ని పరపతి సంస్థలూ కలిసి అందించిన సంస్థాగత పరపతి రు. 15 కోట్లు మించలేదు. రైతుల ఆత్మహత్యలపై నిపుణుల కమిషన్ నివేదిక ప్రకారం సాలీనా రైతుల పరపతి అవసరాలలో 15 నుంచి 20 శాతం మాత్రమే సంస్థాగతంగా అందుతుండగా, మిగిలిన 80 నుంచి 85 శాతం రుణం కోసం రైతులు వడ్డీ వ్యాపారుల మీద ఆధారపడవలసి వస్తోంది.

ఇక పరపతి అవసరమైన వర్గాలేవో, వారికి ధరావత్తు చూపగల శక్తి ఉందో లేదో మొదలయిన విషయాలలో సహకార సంస్థలు తమ ప్రాథమిక సంక్షేమ లక్ష్యాల నుంచి ఎప్పుడో దూరమైపోయాయి. వాణిజ్య బ్యాంకుల లాగ లాభం, తిరిగి రాబట్టుకోగల అవకాశం వంటి ప్రమాణాలే ప్రధానమైపోయి రుణ సౌకర్యం చేరవలసిన వర్గాలకు చేరకుండా పోయింది.

నిజానికి సహకారం అనేది మన గ్రామీణ, వ్యవసాయ రంగంలో తరతరాలుగా కొనసాగుతూ వస్తున్న విలువ. జాతీయోద్యమ విలువల్లో భాగంగా సహకారానికి సముచిత ప్రాధాన్యం దొరికింది. ఎప్పుడో 1904 నుంచి వ్యవస్థీకృతంగా సాగుతున్న సహకార రంగం 1950ల్లో ప్రభుత్వం మద్దతు కూడ పొంది బలపడింది. సోషలిజం అభివృద్ధికి సహకార రంగం ఉపయోగపడుతుందనే ఆలోచన ప్రజలలో దాని ప్రభావాన్ని పెంచింది. ఆనంద్ పాల ఉత్పత్తిదారుల సహకార సమాఖ్య గాని, మహారాష్ట్రలో చెరకు ఉత్పత్తిదార్ల సహకార సంస్థలు గాని, దేశ వ్యాప్తంగా చేనేత సహకార సంస్థలు గాని సహకారం కేవలం సమానత్వ ఆదర్శం మాత్రమే కాదని, అది ఫలితాలు అందించగల సమర్థమైన వ్యవస్థ కూడానని రుజువు చేశాయి.

మనుషులలో సహకార భావన సహజంగా ఉంటుందనే విషయం గాని, ఆ సహకారంతో మనుషులు అద్భుతాలు సాధించగలరనే విషయం గాని ప్రపంచ బ్యాంకుకు, పెట్టుబడిదారీ విధానానికి రుచించవు. మనుషులు ఒకరి గొంతు ఒకరు కోసుకునే పోటీలో లాభాల వేటలో, మునిగిపోయి ఉంటేనే సమర్థులవుతారని ప్రపంచ బ్యాంకు ఇవాళ మనుషుల మెదళ్ల నిండా నింపదల్చుకున్న పాఠం. ఆ పాఠం సక్రమంగా మన మెదళ్లలోకి దిగాలంటే సహకారాన్ని మనం చిన్న చూపు చూడాలి. సహకారం అసమర్థమైనదనుకోవాలి. సహకారానికి కాలం చెల్లిందనుకోవాలి. మనుషులు అమ్మకందార్లు, కొనుగోలుదార్లు మాత్రమేనని, ఒంటరి ద్వీపాలు మాత్రమేనని, సహకారానికీ మనిషికీ చుక్కెదురని మనం అనుకోవాలి. ఇవాళ మూసేస్తున్న సహకార సంఘాల ద్వారా నేర్పుతున్నది లాభనష్టాల పాఠం కాదు, సహకారం అసహజమనే పాఠం.

***ప్రజాతంత్ర, మే 5, 2002***



# 27

# ఎందుకీ విదేశీ పెట్టుబడి?

కొన్ని పనులు చాలా సంకేతాత్మకంగా జరుగుతాయి. అవి ఉద్దేశ్యపూర్వకమో, యాదృచ్ఛికమో గాని కొన్ని సంఘటనలు, కొన్ని సందర్భాలు ఎంత సరిగ్గా సరిపోతాయంటే వాటి కర్తల ఉద్దేశ్యాలను శంకించకుండా ఉండలేం.

భారత రాజకీయ చరిత్రలో జూన్ 25 ఒక చరిత్రాత్మకమైన రోజు. సరిగ్గా ఆ రోజునే ఇందిరా గాంధీ అత్యవసర పరిస్థితి విధించి దేశం మొత్తం మీద చీకటి తెర పరిచింది. అత్యవసర పరిస్థితిలో జరిగిన ఘోరాలూ, నేరాలూ, దుర్మార్గాలూ అన్నీ ఎట్లా ఉన్నా, అన్నిటికన్నా ముఖ్యమైనది రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులను తాత్కాలికంగా రద్దుచేయడం. ప్రాథమిక హక్కులలో, రాజ్యాంగంలోని పందొమ్మిదో అధికరణంలో, ప్రధానమైనది భావ ప్రకటనా స్వేచ్ఛ. అత్యవసర పరిస్థితి అధికారాలను వాడుకుని ఇందిరాగాంధీ ప్రభుత్వం భావ ప్రకటనా స్వేచ్ఛను అరికట్టింది. పత్రికా స్వాతంత్ర్యాన్ని హరించి వేసింది. పత్రికల మీద ప్రిసెన్సార్‌షిప్ విధించి పత్రికలు ఏం రాయవచ్చునో, ఏం రాయగూడదో శాసించింది. వందలాది పత్రికల మూసివేతకూ, వేలాది పత్రికల లొంగుబాటుకూ కారణమైంది.

సరిగ్గా అదే జూన్ 25న భారతీయ జనతా పార్టీ నాయకత్వంలోని

ఎన్‌డిఎ ప్రభుత్వం పత్రికా స్వేచ్ఛ మీద ప్రభావం చూపగల మరొక నిర్ణయం ప్రకటించింది. ఈసారి ఇది 1975 జూన్ 25 నాటిలాగ ప్రత్యక్షంగా పత్రికా స్వాతంత్ర్యాన్ని హరించే గొడ్డలిపెట్టు కాకపోవచ్చు. రెండున్నర దశాబ్దాల ప్రయాణంలో భారత పాలకవర్గాలు కొత్త ముసుగులు వేసుకుని ఉండవచ్చు. కొత్త భాష నేర్చుకుని ఉండవచ్చు. తమ ఆయుధాలకు దేశదేశాల పెట్టుబడుల తేనె పూసుకుని వస్తూ ఉండవచ్చు.

కాని 1975 ఎమర్జెన్సీ పత్రికా స్వాతంత్ర్యం రద్దుకూ, 2002 పత్రికలలో విదేశీ పెట్టుబడుల ఆమోద ప్రకటనకూ అంతిమ ఫలితాలు ఒకటే. ఈ రెండు చర్యల ద్వారా కూడా పాలక వర్గాలకు ఒనగూరే ప్రయోజనాలు ఒకటే. ప్రజలకు కలిగే నష్టం ఒకటే. ప్రజలకు అవసరమైనది పత్రికలలో అచ్చుకాగూడదని, ప్రభువులకు అంగీకారం కానిది పత్రికలలో అచ్చు కాగూడదని ఏలిన వారికి ఉండే కోరిక అప్పుడు ఆ రూపంలో వెలువడింది. ఇప్పుడు ఈ ముసుగు వేసుకుని వస్తోంది.

అయితే కాలం రెండున్నర దశాబ్దాలు గడిచింది కనుక కనబడుతున్న దృశ్యం స్పష్టంగా, నలుపు తెలుపుల్లో లేదు. చాలా సంక్లిష్టంగా, అస్పష్టంగా, గందరగోళంగా ఉన్నది. అటువైపు ఉంటాయనుకున్న పాత్రలు కొన్ని ఇటువైపు ఉన్నాయి. ఇటువైపు ఉండవలసిన పాత్రలు కొన్ని అటువైపు ఉన్నాయి. పది సంవత్సరాలుగా ఈ విషయంలో జరుగుతున్న వివాదం, గత జనవరిలో పార్లమెంటరీ కమిటీ నివేదిక 'పత్రికా రంగంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను ఆమోదించగూడద'ని సిఫార్సు చేసినప్పటి నుంచి జరుగుతున్న చర్చోపచర్చలు, పైరవీలు, ఒత్తిళ్లు గమనిస్తుంటే భారత రాజకీయ రంగస్థలం మీద ఎంత విచిత్రమైన ప్రహసనం జరుగుతున్నదో అర్థమవుతున్నది.

మొట్టమొదట తనను మించిన దేశభక్త, స్వదేశీ రాజకీయవర్గం మరేదీ లేదని, ఇందిరా గాంధీ అత్యవసర పరిస్థితిని తామే అందరికన్న ఎక్కువ వ్యతిరేకిస్తామని ప్రగల్భాలు పలికే భారతీయ జనతా పార్టీ అన్ని బహుళజాతి సంస్థల అనుకూల విధానాలతో పాటు, చివరికి పత్రికా రంగాన్ని కూడా విదేశీ పెట్టుబడికి అప్పగించే పనికి పూనుకున్నది. ఆ పనికి, అత్యవసర పరిస్థితితి విధింపు రోజునే ఎన్నుకోవడం బహుశా భాజపా గురుదక్షిణ అయి ఉంటుంది. ఎందుకంటే అత్యవసర పరిస్థితిలో రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌ను నిషేధించి, భారతీయ జనసంఘ్ నాయకులను జైళ్లలోకి తోసి ఉండకపోతే ఇవాళ్టి భారతీయ జనతా పార్టీ ప్రాభవమే ఉండేది కాదు. అత్యవసర పరిస్థితి బాధితులలో ఒకరిగా ఎమర్జెన్సీ అనంతర ప్రజాస్వామిక వెల్లువలో పాల్గొనడం, మొట్టమొదటిసారి కేంద్ర ప్రభుత్వంలో భాగస్వామి కావడం, ఆ తర్వాత గాంధేయ సోషలిజం అని పేరు పెట్టుకుని కొత్త అవతారం ఎత్తడం.. భారతీయ జనతా పార్టీ చరిత్ర అధ్యయనం చేస్తే సంఘ పరివారానికి అత్యవసర పరిస్థితి చేసిన మేలేమిటో అర్థమవుతుంది. ఆ మేలుకు ప్రతిఫలంగానే పత్రికా స్వాతంత్ర్యాన్ని బలి ఇచ్చి ఈసారి తద్దినం పెట్టదల్చింది భాజపా.

పత్రికా రంగంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని వామపక్షాలు, ప్రపంచీకరణ వ్యతిరేక



శక్తులు మాత్రమే వ్యతిరేకించడం లేదు. ఈ దేశంలోకి ప్రపంచీకరణ విధానాలను, అన్ని రంగాలలోకి విదేశీ పెట్టుబడులను విపరీతంగా ఆహ్వానించిన వాళ్లు కూడా ఈ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తున్నారు. మొత్తంగా పత్రికా రంగమే రెండు చీలిపోయి ఆశ్చర్యకరమైన సమ్మేళనాలతో సమర్థనలూ వ్యతిరేకతలూ సాగుతున్నాయి. దేశంలోకి నూతన ఆర్థిక విధానాలు ప్రవేశించినప్పటి నుంచీ ఇంకా, ఇంకా ఆ విధానాలను అమలు చేయమని ప్రభుత్వాలను కోరుతున్న 'టైమ్స్ ఆఫ్ ఇండియా' యాజమాన్యం, రాష్ట్రంలో ప్రపంచ బ్యాంక్ నిర్దేశిత ఆర్థిక సంస్కరణలను ఆహ్వానిస్తున్న 'ఈనాడు' యాజమాన్యం వంటి వర్గాలు కూడా పత్రికా రంగంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశాన్ని వ్యతిరేకిస్తున్నాయి. దేశంలో చాలా కాలంగా ప్రగతిశీల మేధావులుగానో, ప్రజాస్వామిక వాదులుగానో పేరుపడిన సీనియర్ పాత్రికేయులు కొందరు, కొన్ని వాణిజ్య పత్రికలు విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని ఆహ్వానిస్తున్నారు.

ఈ సంక్లిష్ట చిత్రం వల్ల ఈ నిర్ణయాన్ని వ్యతిరేకించాలో, సమర్థించాలో, వ్యతిరేకించ డానికో, సమర్థించడానికో సరైన కారణాలున్నాయో లేవో అర్థం కాని గందరగోళం నెలకొని ఉంది.

ఇన్నాళ్లూ అన్ని రంగాలలోనూ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశాన్ని ఆహ్వానించిన వాళ్లు ఇవాళ పత్రికా రంగంలో ప్రవేశానికి ఎందుకు అడ్డు చెప్పాలనీ, అది కపటమైన వ్యతిరేకత కాదా అని చాలా మంది ప్రశ్నిస్తున్నారు. నిజమే. ఇవాళ పత్రికా రంగంలోకి విదేశీ పెట్టుబడుల ప్రవేశాన్ని వ్యతిరేకిస్తున్న వాళ్లలో కొందరికైనా ఆ నైతిక అర్హత లేదు. కాని ఏదైనా ఒక అభిప్రాయంలోని సమంజసత్వం, ఆ అభిప్రాయం చెప్పే వాళ్ల అనర్హత వల్ల రద్దయిపోదు.

ఏ రంగంలోకీ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని అనుమతించగూడదనేది వలసవాదం అనుభవం వల్ల మన రాజకీయార్థిక విధానాలలోకి వచ్చిన ఒక విలువ. ఆ విలువల చట్రం వల్లనే 1955లో కేంద్ర మంత్రివర్గం పత్రికా రంగంలోకి విదేశీ పెట్టుబడులను ఆమోదించగూడదని నిర్ణయించింది. ఒకవేళ ఆ తర్వాత రాజకీయార్థిక పరిస్థితుల వల్ల ఇతర రంగాలలోకి విదేశీ పెట్టుబడులను అనుమతించినప్పటికీ, ఆ ఇతర రంగాలకూ, పత్రికా రంగానికీ కూడా తేడాలున్నాయి.

ఇతర సరుకులలోకీ, సేవలలోకీ విదేశీ పెట్టుబడిని అనుమతించినప్పుడు, పత్రికల్లోకీ ఎందుకు అనుమతించగూడదని చాలా తెలివైన మేధావులు కొందరు వాదిస్తున్నారు. వాళ్లు ఈ వాదన తెలిసి చేస్తున్నారో, తెలియక చేస్తున్నారో గాని, పత్రికలు మిగతా సరుకుల లాంటివీ సేవల లాంటివీ కావు. ఒక విదేశీ సరుకు కొనడానికీ, ఒక విదేశీ పత్రిక కొనడానికీ చాలా తేడా ఉంది.

సరుకుకు కూడా మన ప్రవర్తనను నియంత్రించే, ప్రభావితం చేసే శక్తి ఉండవచ్చు. కాని, పత్రికకు మన అభిప్రాయాలనూ, ప్రవర్తననూ, భావజాలాన్నీ, సంస్కృతినీ ప్రభావితం చేయగల శక్తి చాలా ఎక్కువ. ఇప్పటికే నూతన ఆర్థిక విధానాల వల్ల సామ్రాజ్యవాద, బహుళజాతి

సంస్థల అనుకూల అలవాట్లు, ఆచార వ్యవహారాలు అమలవుతున్న చోట, మన సంస్కృతిని మార్చగల పత్రికలు కూడా వాళ్లవే వస్తే, మనం రోజూ వాళ్ల కళ్లలోంచి వార్తలు చదువుతాం. వాళ్లు చదవమన్న వార్తలు చదువుతాం. వాళ్లు కలిగించుకోమన్న అభిప్రాయాలు కలిగించుకుంటాం. వాళ్లు ప్రేమించమన్న వాళ్లను ప్రేమిస్తాం. వాళ్లు ద్వేషించమన్న వాళ్లను ద్వేషిస్తాం. సరిగ్గా నూటయాభై ఏళ్ల కింద ఈ దేశంలో విద్యా విధానం ప్రవేశపెట్టేటప్పుడు మెకాలే ఏ కోరిక కోరుకున్నాడో ఇవాళ విదేశీ పత్రికలు అది సాధిస్తాయి. ఆ రోజు మెకాలే యూరపియన్ భావాలు ప్రవేశపెట్టాలనుకున్నాడు. ఇవాళ ప్రధానంగా అమెరికా, స్థూలంగా సామ్రాజ్యవాద అనుకూల భావాలు వస్తాయి.

ఇప్పుడున్న గుత్త పత్రికలేవో భారత ప్రజల ప్రయోజనాలను పరిరక్షిస్తున్నాయని కాదు. 'పెట్టుబడికి, కట్టుకథకు పుట్టిన విషపుత్రిక' అని మహాకవి చేసిన వర్ణన ఇవాళ ఇంకా ఎక్కువ నిజంగా ఉంది. గత పది సంవత్సరాలుగా మరీ ఎక్కువగా పత్రికలన్నీ నూతన ఆర్థిక విధానాల సమర్థనకు, అంటే ప్రజా ప్రయోజనాలకు భంగకరంగానే పని చేస్తున్నాయి. అయినా ఎక్కడో ఒక పత్రిక, ఏదో ఒక పత్రికలో పాత్రికేయులు తమ ప్రజాస్వామిక స్ఫూర్తిని, ప్రజా నిబద్ధతను బైటపెడుతూనే ఉన్నారు.

విదేశీ పెట్టుబడులు ప్రవేశిస్తే – ప్రభుత్వం ఇవాళ విధించిన నిబంధనలన్నింటికీ లోబడి ప్రవేశించినా – పత్రికల మీద నల్ల యజమానులది కూడా కాదు, తెల్ల యజమానుల అధినాయకత్వం మొదలవుతుంది. ఇవాళ అమెరికన్, యూరపియన్ పత్రికలు అమలు చేస్తున్నట్లుగా 'సమ్మతి తయారీ' మొదలవుతుంది.

దేశంలో పెద్ద పత్రికలన్నీ అట్లా తెల్ల యజమానుల కడుపులో వాతాపి జీర్ణం అయిపోగా, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి వల్ల ప్రధానంగా నష్టపోయేది చిన్న పత్రికలు. ఇవాళ దేశంలో ప్రజాస్వామ్యం బతికి బట్టకట్టడానికి, స్థానిక ప్రజల సమస్యలూ జీవితాలూ బహిర్గతం కావడానికి, అట్టడుగు ప్రజల సృజనాత్మక వికాసానికి ప్రధాన వేదికలుగా ఉన్న చిన్న పత్రికలు విదేశీ పెట్టుబడుల బుల్డోజర్ల ధాటికి, పొక్లెయిన్ల దాడికి విధ్వంసమైపోతాయి. రోడ్ల వెడల్పు కార్యక్రమంలో సంభవించిన విధ్వంస బీభత్సం లాగ పెద్ద పత్రికలు ఒకరకంగా, చిన్న పత్రికలు మరొక రకంగా చిన్నాభిన్నమైపోయి భారతీయ పత్రికా రంగం అటు భారతీయమూ కాకుండా పోతుంది. ఇటు పత్రికా ధర్మమైన ప్రజాసేవ, ప్రజాస్వామిక స్ఫూర్తి నిలబెట్టడం, ప్రజలను చైతన్యపరచడం వంటి లక్షణాలన్నీ వదులుకుని బహుళజాతి సంస్థల సరుకులు అమ్మిపెట్టే, ప్రచారం చేసే తాబేదారుగా మారిపోతుంది.

విదేశీ పెట్టుబడులు వస్తే జీతాలు పెరుగుతాయని పాత్రికేయులు సంబరపడిపోతున్నారు గానీ, జీతాలు పెరిగేది పిడికెడు మందికి. జీవితాలు భగ్నమయ్యేది కోట్లాది మందికి. జాతి జీవితమే అల్లకల్లోలమైపోతుంది.

***ప్రజాతంత్ర, జూన్ 30, 2002***



# 28

# సేవారంగం - సామ్రాజ్యవాద ప్రపంచీకరణ

ఇటీవలి కాలంలో మానవ జీవితంలో, ఆర్థిక వ్యవస్థలలో సేవా రంగ ప్రాధాన్యత చాలా పెరిగిపోతోంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విస్తరణకూ, సేవా రంగం పాత్ర పెరుగుదలకూ ప్రత్యక్ష సంబంధం ఉంది. సేవారంగం అంటే ఏమిటో, దానికి సాంఘిక, ఆర్థిక రంగాలలో గల పాత్ర ఏమిటో, సామ్రాజ్యవాద ప్రపంచీకరణ శక్తులు సేవారంగం మీద ఎందుకు కేంద్రీకరిస్తున్నాయో, ఈ సేవారంగ విస్తృతివల్ల సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల మీద ఎటువంటి ప్రభావం ఉండబోతోందో విశ్లేషించడం ఈ పత్రం లక్ష్యం.

## సేవారంగం అంటే ఏమిటి?

సాంప్రదాయికంగా ఆర్థిక వ్యవస్థను మూడు రంగాలుగా విభజిస్తారు. వ్యవసాయం, గనుల తవ్వకం వంటి ప్రకృతి ఆధారిత ఆర్థిక కార్యకలాపాలను ప్రాథమిక రంగంగానూ, వస్తూత్పత్తి, నిర్మాణం వంటి పారిశ్రామిక కార్యకలాపాలను ద్వితీయ రంగంగానూ, పాలన, సైనిక, రక్షణ వ్యవస్థలు, అధ్యాపకత్వం, గుమస్తాల పని, వైద్య, న్యాయసంబంధ సేవలు, బట్టలు

ఉతకడం, కుట్టడం, క్షౌరం చేయడం వంటి వ్యక్తిగత సేవలు మొదలయిన ఆర్థిక కార్యకలాపాలన్నిటినీ తృతీయరంగంగా, సేవారంగంగా పిలవడం అలవాటు.

పెట్టుబడిదారీ అభివృద్ధి పెరిగిన కొద్దీ సేవారంగం విస్తరిస్తూ ఉంటుంది. కొత్త కొత్త సేవలు పుట్టుకొస్తుంటాయి. భూస్వామ్య ఉత్పత్తి సంబంధాలలో ప్రధానంగా వ్యక్తిగత సేవలుగా ఉండినవి కూడా పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలలో కొత్త అర్థాలు సంతరించుకుని మార్కెట్ పరిధిలోకి వస్తాయి. ఈ యుగంలో సేవలను మానవ శరీరానికి సంబంధించిన సేవలు, మానవుల మనసుకు సంబంధించిన సేవలు, వస్తువులకు సంబంధించిన సేవలు, అమూర్తమైన ఆస్తులకు సంబంధించిన సేవలు అని నాలుగు రకాలుగా విభజిస్తున్నారు.

మన నిత్యజీవితంలో మనం అనుక్షణం ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని వినియోగిస్తున్న సేవలు ఎన్నో ఉన్నాయి. వాటిలో కొన్ని అసలు 'సేవ' లేనా, వాటిని మనం అవసరం కొద్దీనే వాడుకుంటున్నామా అనేవి తీవ్రంగా ఆలోచించవలసిన ప్రశ్నలు. సాధారణంగా పెట్టుబడిదారీ సరుకులు వినియోగదారులలో ఉపయోగపు కోరికలు పెంచి మార్కెట్లను సృష్టించుకున్నట్టుగానే, ఈ సేవలు కూడా ప్రజల అవసరంతో సంబంధం లేకుండానే మార్కెట్లను సృష్టించుకుంటున్నాయి.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ తర్వాత అన్ని సరుకులలోనూ అమ్మేవాడి అంగళ్లు పెరిగిపోయినట్టుగానే, సేవారంగంలో కూడా సేవల ఉత్పత్తిదార్ల, సేవల అమ్మకందార్ల, సేవల మారుబేరగాళ్ల వ్యాపారం ఇబ్బడిముబ్బడిగా పెరిగిపోయింది. అంతవరకూ మనం గుర్తించని సేవలు, వినియోగించని సేవలు మన అనుభవంలోకి రావడం మొదలయింది. అంతవరకూ మార్కెటేతర సంబంధాలలో, సంక్షేమ రంగాలలో, ప్రభుత్వరంగంలో ఉండిన సేవలు కూడా మార్కెట్ చట్రంలోకి, లాభనష్టాల లెక్కలలోకి, ప్రైవేటు రంగంలోకి రావడం మొదలయింది.

ఈ నేపథ్యంలో ఇవాళ సామ్రాజ్యవాద దేశాల గుత్తాధిపత్యంలో ఉండి, ఏదో ఒక మేరకు భారతదేశం వంటి దేశాలలోకి ప్రవేశిస్తున్న సేవలను చూడవలసి ఉంటుంది. ఇవాళ్టి సేవారంగంలో బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, న్యాయసేవలు, విమానయానం, సముద్రయానం, రోడ్డు రవాణా వంటి ప్రయాణ సౌకర్యాలు, సరుకుల రవాణా, పర్యాటక రంగం, హోటళ్లు, విద్య, వైద్యం, ఆరోగ్యం, ప్రజాపాలన వంటి ప్రభుత్వ సేవలు, సినిమాలు, టెలివిజన్ సాఫ్ట్‌వేర్ వంటి వినోద సేవలు, టెలికమ్యూనికేషన్స్, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, అందాన్ని, శరీర సౌష్టవాన్ని తీర్చిదిద్దడం వంటి శారీరక, వ్యాయామ సేవలు, యంత్రాల మరమ్మత్తు, నిర్వహణ వంటి సేవలు, రక్షణ, పారిశ్రామిక కాపలా వంటి సేవలు ఎన్నో ఉన్నాయి. ఇంకా ఎన్ని కొత్త సేవలను కనిపెట్టి వాటి మార్కెట్‌ను ఎట్లా సృష్టించాలా, ఎట్లా విస్తరించాలా అని బహుళజాతి సంస్థలు ఆలోచిస్తున్నాయి. సేవారంగం మీద బహుళజాతి సంస్థల ఈ అతిశ్రద్ధకు వెనుక చారిత్రక, భౌతిక కారణాలున్నాయి.

## సామ్రాజ్యవాద ఆర్థిక వ్యవస్థలో మార్పులు – సేవారంగం

గత కొన్ని దశాబ్దాలుగా సామ్రాజ్యవాద దేశాల ఆర్థిక వ్యవస్థలలో వస్తున్న మార్పులు సేవారంగ ప్రాధాన్యాన్ని పెంచుతున్నాయి. అమెరికా ఆర్థిక వ్యవస్థలోను, యూరప్ దేశాల



ఆర్థిక వ్యవస్థలలోనూ జాతీయోత్పత్తిలో ఉత్పాదక రంగపు వాటా తగ్గిపోతూ, అనుత్పాదక, సేవారంగపు వాటా పెరిగిపోతున్న పరిణామం ఇటీవలి దశాబ్దాలలో ప్రస్ఫుటంగా ఉంది.

ఈ పరిణామానికి గల కారణాలను పరిశీలిస్తే, ఆ దేశాలన్నిటిలోనూ, ముఖ్యంగా అమెరికాలో, ఇటీవలి వరకూ ప్రధాన పరిశ్రమగా ఉండిన యుద్ధ పరికరాల పరిశ్రమ వాటా ప్రచ్ఛన్న యుద్ధానంతరం తగ్గిపోతూ వస్తోంది. నూతనంగా పారిశ్రామికీకరణ చెందిన దేశాలుగా గుర్తించబడుతున్న దక్షిణకొరియా, తైవాన్, సింగపూర్ వంటి దేశాలలో పారిశ్రామిక వస్తూత్పత్తి పెరిగిపోతూ సామ్రాజ్యవాద దేశాల ఎగుమతులను సవాల్ చేస్తోంది. పారిశ్రామిక సరుకుల అంతర్జాతీయ వాణిజ్యంలో ఇవాళ ఈ నూతన పారిశ్రామిక దేశాలు అర్ధభాగాన్ని తమ చేతుల్లో పెట్టుకున్నాయని, 2025 నాటికి ఈ వాటా 60 శాతానికి పెరిగిపోవచ్చునని ఒక అంచనా. ఈ పరిణామాలతో పాటు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ ప్రాబల్యం పెరిగిపోవడంతో సామ్రాజ్యవాద దేశాల ఆర్థిక వ్యవస్థల జాతీయోత్పత్తిలో వ్యవసాయ రంగం వాటా, పారిశ్రామిక రంగం వాటా అంతకంతకూ తగ్గిపోతూ సేవారంగం వాటా పెరిగిపోతోంది.

సామ్రాజ్యవాద దేశాలలో సేవారంగం ఈ విధంగా విపరీతంగా పెరిగిపోతుంటే, సరుకుల ఉత్పత్తిలో వచ్చినట్టే అధికోత్పత్తి సంక్షోభాలు రావడం మొదలయింది. సేవారంగ బహుళజాతి సంస్థల మధ్య కుత్తుకలుత్తరించుకునే పోటీ మొదలయింది. ఈ సంక్షోభాల నుంచి బయట పడడానికి బహుళజాతి సంస్థలు పన్నిన వ్యూహం ఈ సేవలను ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాలకు అలవాటు చేసి కొత్త మార్కెట్లను సృష్టించుకుని సేవలను ఎగుమతి చేయడం. ఈ సేవలలో చాలా సేవలు అందించడానికి అవసరమైన మౌలిక సాధన సంపత్తిని సమకూర్చడం కూడా పారిశ్రామిక రంగంలోని బహుళజాతి సంస్థలు చేసే పనే కాబట్టి ఆ రకంగా సేవారంగ ఎగుమతి, పారిశ్రామిక పరికరాల ఎగుమతికి కూడా దారితీస్తుంది. అంతేగాక, సేవారంగం అంతటిలోనూ అనేక చారిత్రక, రాజకీయార్థిక, సాంకేతిక కారణాల వల్ల సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలకే హెచ్చు అవకాశాలున్నాయి. కనుక కొత్త పారిశ్రామిక దేశాల వాణిజ్య అవకాశాలను దెబ్బతీయడానికి ఒక మార్గంగా కూడా సామ్రాజ్యవాద దేశాలు సేవారంగం వైపు దృష్టి సారిస్తున్నాయి.

సామ్రాజ్యవాద దేశాల ఆర్థిక వ్యవస్థలలో జాతీయోత్పత్తిలో సేవారంగం 60 నుంచి 75 శాతం వరకు వాటా కలిగి ఉండడంతో ఈ సేవల ఎగుమతిలో, అంతర్జాతీయ వాణిజ్యంలో కూడా ఆ దేశాలదే పై చేయిగా ఉంది. మొత్తం ప్రపంచ వాణిజ్యంలోని సేవారంగం ఎగుమతులలో 50 శాతాన్ని కేవలం ఐదు దేశాలు – అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్ – శాసిస్తున్నాయి. దీన్ని మరో వైపు నుంచి చూస్తే వాణిజ్యంలో 94 శాతం కేవలం 73 బహుళజాతి సంస్థల గుప్పెట్లో ఉంది. సేవారంగ ఎగుమతులలో వాణిజ్యంలో అగ్రభాగాన ఉన్న 82 బడా బహుళజాతి సంస్థలలో మొదటి 51 అమెరికా, జపాన్‌లకు చెందినవే.

ఈ కారణాల వల్ల సేవారంగానికి సంబంధించిన అంతర్జాతీయ వాణిజ్యంలో తమకు

అనుకూలమైన ఒడంబడికలు, సూత్రాలు అమలులో ఉండాలని బహుళజాతి సంస్థలు భావించాయి. అంతర్జాతీయ వాణిజ్య సూత్రాలను తమ మార్కెట్ విస్తరణకు, లాభార్జనకు అనుకూలంగా మార్చవలసిందిగా, రూపొందించవలసిందిగా ప్రభుత్వాల మీద ఒత్తిడి తేవడం ప్రారంభించాయి. అందువల్లనే జనరల్ అగ్రిమెంట్ ఆన్ టారిఫ్స్ అండ్ ట్రేడ్ (గాట్) చర్చల్లో ఎప్పుడూ లేని సేవారంగం 1980ల్లో ఉరుగ్వే చర్చలతో ప్రవేశించింది.

## గాట్ చర్చల్లోకి సేవారంగం ప్రవేశం

గాట్ 1947లో ఏర్పడి 1986 వరకు ఏడుసార్లు చర్చలు జరిగి, తొలి ఒప్పందానికి సవరణలు, చేర్పులు, మార్పులు జరిగినప్పటికీ, అప్పటి వరకూ కేవలం పారిశ్రామికోత్పత్తుల వాణిజ్యానికే ఆ ఒప్పందం వర్తించేది. ఉరుగ్వేలో ప్రారంభమైన ఎనిమిదవ దఫా చర్చలలో 1986 నుంచి గాట్ పరిధిలోకి కొన్ని కొత్త రంగాలను ప్రవేశపెట్టాలని బహుళజాతి సంస్థలు ప్రయత్నాలు ప్రారంభించాయి. అట్లా గాట్ చర్చలలోకి కొత్తగా ప్రవేశించిన రంగాలలో ఒకటి సేవారంగం. అప్పటికే సేవారంగంలో స్థిరపడి ఉన్న బహుళజాతి సంస్థలు సేవారంగ వాణిజ్యంపై ఆంక్షలు తొలగించేందుకు మూడో ప్రపంచ దేశాలపై ఒత్తిడి తేవాలని, ఈ శాఖలను ఏ దేశంలోనైనా తెరుచుకునేందుకు హక్కు కల్పించాలని తమ దేశాల ప్రభుత్వాలను ఒప్పించాయి.

ఉరుగ్వే చర్చలలో భాగంగా ప్రతిష్టంభన తొలగించడానికంటూ తయారయిన డంకెల్ డ్రాఫ్ట్ సేవారంగ వాణిజ్య ఒడంబడిక అవసరం గురించి తొలిసారిగా మాట్లాడింది. అయితే డంకెల్ డ్రాఫ్ట్‌లోగాని, సామ్రాజ్యవాద దేశాల ప్రభుత్వాల వాదనలలోగాని వ్యక్తమైన అభిప్రాయాలు నిజానికి సేవారంగంలో పని చేస్తున్న బహుళజాతి సంస్థలు రూపొందించి ఇచ్చినవే.

రెండు వందలకు పైగా బహుళజాతి సంస్థల భాగస్వామ్యంతో ఏర్పడిన మల్టిలేటరల్ ట్రేడ్ నెగోషియేషన్స్ కోయలిషన్ అనే సంస్థ కొత్త గాట్ ఒప్పందంలో ఏయే అంశాలు ఉండాలనే విషయంలో తమ ప్రభుత్వాలపై ఒత్తిడి తేవడానికి డంకెల్ డ్రాఫ్ట్ కన్నా ముందు నుంచే ప్రయత్నాలు ప్రారంభించింది. ఈ కోయలిషన్‌లో అమెరికన్ ఎక్స్‌ప్రెస్, సిటీ బ్యాంక్, ఐబిఎం వంటి సేవారంగ బహుళజాతి సంస్థలు ఉన్నాయి. వీటితోపాటు 1982 నుంచీ అమెరికా సేవారంగ వాణిజ్యంలో బేరసారాలు నడుపుతున్న కూటమి యు.ఎస్. కోయలిషన్ ఆఫ్ సర్వీస్ ఇండస్ట్రీస్ కూడా గాట్ చర్చలను ప్రభావితం చేయడానికి ప్రయత్నించింది.

ఈ అన్ని ప్రభావాల, ఒత్తిళ్ల ఫలితంగా ఉరుగ్వే చర్చల చివర గాట్‌కు సమాంతరంగా జనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ ఇన్ సర్వీసెస్ (జి.ఎ.టి.ఎస్.) రూపొందింది. ఈ గాట్స్ మీద సంతకాలు 1995లో ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఒ) తో పాటే జరిగాయి. 'అమెరికన్ ద్రవ్య సేవారంగం, ముఖ్యంగా అమెరికన్ ఎక్స్‌ప్రెస్, సిటీ కార్ప్ వంటి సంస్థలు తెచ్చిన ఒత్తిడే లేకపోతే సేవారంగ ఒప్పందమే జరిగి ఉండేది కాదు' అని డబ్ల్యుటిఒ సేవారంగ విభాగం డైరెక్టర్ డేవిడ్ హార్ట్రిడ్జ్ అన్నాడంటే, గాట్స్ కోసం తెర వెనుక ఎంత బలమైన ప్రయత్నాలు జరిగాయో అర్థమవుతుంది.



గాట్స్‌లో భాగంగా బహుళజాతి సంస్థలు సేవారంగ వాణిజ్యానికి సంబంధించి అనేక అవకాశాలు కోరుకున్నాయి. వాటిలో ముఖ్యంగా అన్నిరకాల సేవల వాణిజ్యానికి అన్ని దేశాలూ అంగీకరించాలని, సేవారంగ వాణిజ్యంలో కూడా ఎగుమతులు చేసే దేశాన్ని 'అతి ప్రాధాన్య దేశం'గా గుర్తించి ఎక్కువ అవకాశాలు ఇవ్వాలని, సేవారంగ వాణిజ్యంలో ఏయే చర్యలు తీసుకోబోతున్నామో పారదర్శకంగా, బహిరంగంగా ప్రకటించాలని, సేవారంగంలో ప్రభుత్వ రంగంలో ఉన్న గుత్తాధిపత్య సంస్థలను రద్దు చేయాలని, విదేశీ సేవారంగ సంస్థలకు స్వదేశీ సేవారంగ సంస్థలతో సమాన ప్రతిపత్తి ఇవ్వాలని, అటువంటి మరెన్నో డిమాండ్లను ఈ బహుళజాతి సంస్థలు ముందుకు తెచ్చాయి. సేవారంగ బహుళజాతి సంస్థలలోనే అమెరికన్, యూరోపియన్, జపనీస్ సంస్థల మధ్య ఉన్న విభేదాల వల్ల, వ్యాపార పోటీల వల్ల ఈ డిమాండ్లన్నీ పూర్తిగా నెరవేరలేదు. గాట్స్ మీద సంతకాలు జరిగే నాటికి అది విమానయాన, సముద్రయాన సేవలు, బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, పర్యాటక రంగం, రవాణా రంగం వంటి కొన్ని రంగాలకే పరిమితమైపోయింది. టెలికమ్యూనికేషన్స్ రంగంలో వాణిజ్యం కోసం మరొక ఒప్పందం చేసుకోవలసి వచ్చింది.

అమెరికాలోని సియాటిల్‌లో 1999లో జరిగిన డబ్ల్యుటిఒ మంత్రివర్గ సమావేశంలో గాట్స్ పరిధిని విస్తరించాలని, విద్య, ఆరోగ్య, సాంకేతిక సేవలను కూడా ఆ పరిధిలోకి తీసుకు రావాలని అమెరికన్ బహుళజాతి సంస్థలు ప్రయత్నాలు ప్రారంభించాయి. సియాటిల్‌లో జరిగిన డబ్ల్యుటిఒ వ్యతిరేక ప్రదర్శనల వల్ల కొంత, అమెరికన్, యూరోపియన్ ప్రయోజనాల మధ్య ఘర్షణవల్ల కొంత ఆ ప్రయత్నం ఫలించలేదు. ఐదు సంవత్సరాలకు ఒకసారి గాట్స్‌ను పునః సమీక్షించాలనే నిబంధన ఒకటి దానిలో ఉండడం వల్ల ఫిబ్రవరి 2000 నుంచి ఆ దిశగా చర్చలు సాగుతున్నాయి.

## భారతదేశం – సేవారంగం

భారత ఆర్థిక వ్యవస్థలో, ముఖ్యంగా జాతీయాదాయ గణాంకాలలో, సేవారంగం ప్రాధాన్యత, సేవారంగం వాటా విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఈ పెరుగుదల చాలా ఆరోగ్యకరమైనదని, దేశాభివృద్ధికి, జీవన ప్రమాణాల మెరుగుదలకు అది ఒక సూచన అని పాలక వర్గాలు, పాలక వర్గ అనుకూల ఆర్థికవేత్తలు ప్రచారం చేస్తున్నారు. జాతీయాదాయంలో సేవారంగ భాగస్వామ్యం 1950–51లో 26.6 శాతం ఉన్నదల్లా 1996–97 నాటికి 51.8 శాతానికి పెరిగింది.

ఈ పరిణామాన్ని 1970ల్లోనే గుర్తించిన అశోక్ మిత్రా 'భారతదేశంతో పోల్చదగిన అభివృద్ధి దశలో ఉన్న మరే ఇతర దేశం కన్నా భిన్నంగా మొత్తం జాతీయోత్పత్తిలో తృతీయ రంగపు వాటా ప్రస్తుతం చాలా ఎక్కువగా ఉంది. తృతీయ రంగపు విస్తరణ రేటు కూడా ద్వితీయరంగం విస్తరణ రేటు కన్నా గణనీయంగా ఎక్కువగా ఉన్నది. ఇటువంటి పరిణామం

తలెత్తడం ఒక సూచన, ఒక కారణం కూడా. అది ఆర్థిక వ్యవస్థలో ఆదాయ పంపిణీ వక్రీకరణకు గురయిందనే పరిణామానికి ఒక సూచన. జాతీయాదాయంలో అసాధారణమైనంత ఎక్కువ భాగం సాపేక్షికంగా చాలా తక్కువ మంది జనాభా చేతిలో కేంద్రీకృతమై ఉన్నదన్నమాట. ఇది మొత్తంగా అభివృద్ధి వక్రీకరించబడడానికి కారణమవుతుంది' అన్నారు.

తర్వాత గడిచిన రెండు దశాబ్దాలు ఈ విశ్లేషణను ఇంకా అర్థవంతం చేశాయి. అశోక్‌మిత్రా విశ్లేషణపై ఆధారపడి, 'ఒక సమాజం కూడు, గూడు, గుడ్డ వంటి మౌలిక సమస్యలు పరిష్కరించుకున్న తర్వాత, వస్తూత్పత్తి కన్నా వేగంగా సేవారంగాన్ని అభివృద్ధి చేయడం ఆశించదగిందే కావచ్చు. కాని అసంఖ్యాక ప్రజలు ఆకలి బారిన పడే మన దేశం వంటి వెనుకబడిన ఆర్థిక వ్యవస్థలలో సేవారంగం పెరుగుదల నిజంగా ఒక అనారోగ్య సూచికే' అని 1980ల్లో నిర్మల్‌కుమార్ చంద్ర విశ్లేషించారు.

సేవారంగ పెరుగుదలకూ, ఆర్థిక వ్యవస్థలో నల్లబజారుకూ, అక్రమార్జనకూ ఎంత సన్నిహిత సంబంధం ఉన్నదో విశ్లేషించిన అరుణ్‌కుమార్, 1990 దశకం గణాంకాలను వినియోగించుకుని, దేశంలో మొత్తం నల్లధనంలో సగానికన్నా ఎక్కువ సేవారంగంలోనే ఉన్నదని విశ్లేషించారు.

ఈ వాదనలకు అర్థం సేవలు అనవసరమనో, సేవారంగం అనవసరమనో కాదు. తప్పనిసరిగా మానవ జీవితంలో, ఆర్థిక వ్యవస్థలో సేవారంగపు ప్రాధాన్యత ఉంది. కాని ప్రాథమిక, ద్వితీయ రంగాలతో సంబంధం లేకుండా, సమన్వయం లేకుండా ఆర్థిక వ్యవస్థలో ఒకే ఒక్క రంగం ఉన్నట్టుగా తృతీయ రంగానికి పెద్దపీట వేయడం సమంజసం కాదు. తృతీయ రంగానికి ఇవాళ దొరుకుతున్న ఈ ప్రాధాన్యత ఇక్కడి ప్రజల అవసరాల మీద ఆధారపడినది కాదు. మన ఆర్థిక వ్యవస్థ మంచి చెడుల మీద ఆధారపడినది కాదు. కేవలం ఏ సేవలలో బహుళజాతి సంస్థలకు ప్రాబల్యం ఉన్నదో ఆ సేవలు మాత్రమే పెరుగుతున్నాయి.

నిజంగా ప్రజలకు అవసరమైన సేవలు – విద్య, వైద్యం, ఆరోగ్యం, ప్రజా రవాణా వ్యవస్థ – ఇవాళ పెరగడం లేదు. బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, టెలికమ్యూనికేషన్స్, విమానయానం, సరుకుల రవాణా వంటి విదేశీ, స్వదేశీ ప్రైవేటు గుత్తాధిపత్యం ఉన్న సేవల రంగం, లేదా ఏ సేవలకు అవసరమైన యంత్ర పరికరాల పరిశ్రమలు బహుళజాతి సంస్థల చేతుల్లో ఉన్నాయో ఆ సేవలు విస్తరిస్తున్నాయి. గత పది సంవత్సరాలలో మరీ ముఖ్యంగా భారత ఆర్థిక వ్యవస్థలోని సేవారంగాలలో జరిగిన మార్పులు చూస్తే, ఆయా రంగాలను ప్రైవేటీకరించడం, బహుళజాతి సంస్థల ప్రవేశానికి వీలు కల్పించడం చూస్తే, ఆ సేవల వినియోగదారుల ప్రయోజనాల కన్నా ఎక్కువగా అమ్మకందార్ల ప్రయోజనాల పరిరక్షణ జరుగుతోందని అర్థమవుతుంది.

## సేవారంగం – ఆంధ్రప్రదేశ్ – 'విజన్ 2020'

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో కూడా, భారత ఆర్థిక వ్యవస్థలో లాగానే, సేవారంగం



విస్తృతంగా పెరిగిపోతోంది. రాష్ట్ర స్థూల ఉత్పత్తిలో సేవారంగం వాటా 1960–61లో 29.1 శాతం ఉండగా, 1995–96 నాటికి అది 49 శాతానికి పెరిగింది. రాష్ట్రాన్ని సేవా ఆర్థిక వ్యవస్థగా మార్చడానికి ఉద్దేశించిన 'విజన్ 2020' ఏయే సేవారంగాల మీద ఏ విధంగా కేంద్రీకరించవలసి ఉన్నదో స్పష్టంగానే ప్రకటించింది. రానున్న 20 సంవత్సరాలలో సేవారంగం వాటాను 67 శాతానికి పెంచాలనే లక్ష్యాన్ని కూడా 'విజన్ 2020' నిర్దేశించింది.

సేవారంగంలో కేంద్రీకరించవలసిన అభివృద్ధి కారకాలలో 'విజన్ 2020' ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, జ్ఞాన–ఆధారిత సేవలు, పర్యాటక రంగం, నిల్వ, సరఫరా, రవాణాలకు సంబంధించిన లాజిస్టిక్స్ సేవలు, చిన్నతరహా సేవలు, ఆరోగ్యం, విద్య వంటి అంశాలను గుర్తించింది. మొత్తంగానే 'విజన్ 2020' ప్రైవేటీకరణ తారకమంత్రాన్ని జపించింది గనుక ఆరోగ్యం, విద్యలను ప్రస్తావించడాన్ని ఆ నేపథ్యంలోనే చూడవలసి ఉంటుంది.

నామమాత్రంగా ఆరోగ్యం, విద్యలను ప్రస్తావించినప్పటికీ, సత్పరిపాలన గురించి మాట్లాడుతున్నప్పటికీ ఎపిస్వాన్, ట్విన్స్, ఇ–సేవ, ఎపివాన్ వంటి చర్యల ద్వారా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సేవారంగాన్ని ప్రైవేటీకరిస్తుందని, ప్రభుత్వాధీనంలో ఉంచవలసివస్తే లాభనష్టాల లెక్కలలోకి మార్చి, ఆ సేవల సామాజిక శ్రేయోరాజ్యలక్ష్యాన్ని ధ్వంసం చేస్తుందని, యూజర్ ఛార్జీల వసూలు పేరుతో అంతిమంగా అన్ని సేవలను ప్రభుత్వరంగం నుంచి దూరమయ్యేలా చేస్తుందని అర్థమవుతుంది.

## సేవారంగ ప్రాధాన్యత – ప్రభావాలు – దుష్ఫలితాలు

ఆర్థిక వ్యవస్థలో సేవారంగానికి అవసరమైన దానికన్నా ఎక్కువ ప్రాధాన్యత దొరకడం, పాలకులు సేవా రంగ ప్రాధాన్యతతోనే దేశాభివృద్ధి, రాష్ట్రాభివృద్ధి జరుగుతుందని ప్రగల్భాలు పలకడం, చుట్టూ కనీసావసరాలు తీరని ప్రజా సముద్రం ఉండగా, తాము ఒంటరి ద్వీపాల లాగ విలాసవంతమైన సేవలు అందుకోవాలని అత్యల్పసంఖ్యాక వర్గమొకటి అర్రులు చాచడం వంటి పరిణామాలన్నీ కలిసి మొత్తంగా సమాజం మీద, ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక రంగాల మీద ప్రగాఢమైన ప్రభావాన్ని వేస్తాయి. ఆ ప్రభావం తక్షణ, స్వల్ప కాలిక దుష్ఫలితాలకు మాత్రమే కాక దీర్ఘకాలిక దుష్ఫలితాలకు కూడా దారి తీస్తుంది.

సేవారంగం మీద సామ్రాజ్యవాద ప్రపంచీకరణ దేగకన్ను పడడంతో దేశ ఆర్థిక వ్యవస్థలో కొనసాగుతున్న ఆదాయ పంపిణీ మరింతగా ఒడిదుడుకులకు లోనవుతుంది. మామూలుగానే మన ఆర్థిక వ్యవస్థలో, ఆదాయ పంపిణీలో తీవ్రమైన, అసమానతలు, అఖాతాలు ఉండగా, సేవారంగ ప్రపంచీకరణవల్ల ఆ అసమానత ఇంకా విస్తరిస్తుంది. ఆర్థిక వ్యవస్థలోని ముఖ్యమైన భాగాలైన ద్రవ్య, బ్యాంకింగ్ రంగాలలో బహుళజాతి సంస్థల ప్రవేశంతో, గాట్స్ షరతుల అమలుతో ప్రభుత్వం ఆ రంగాల నుంచి ఉపసంహరించుకోవలసి వస్తుంది. అంటే ఇంత వరకూ ఎంతో కొంత అమలయిన ప్రాధాన్య రంగాల పరపతి సౌకర్య పథకాలు రద్దయిపోతాయి.

తగ్గిపోతాయి. ఉన్న ప్రభుత్వరంగ బ్యాంకులను మొండిబాకీలతో నిర్వీర్యం చేసి కొత్త ప్రైవేటు బ్యాంకులు, విదేశీ బ్యాంకులు పెరిగిపోయే ఉద్దేశ్యపూర్వక కుట్ర కొనసాగుతుంది. ద్రవ్య రంగంలోకి ఎగిరిపోయే పెట్టుబడి, కాలునిలవని పెట్టుబడి, జూదగృహాల పెట్టుబడి ప్రవేశించి ఆర్థిక వ్యవస్థను అస్థిరం చేస్తుంది. అతలాకుతలం చేస్తుంది. మొత్తంగా ద్రవ్య రంగంలోని ఈ సేవా సంస్థల స్వభావం వల్లనే లెక్కలేనన్ని కుంభకోణాలు జరిగి విలువైన ప్రజాధనం దుర్వినియోగమయి పోతుంది.

సేవారంగం పెరుగుదల నల్లధనం పెరుగుదలకు దారితీసి ఆ లెక్కలేని డబ్బు రాజకీయాలలోకి ప్రవేశిస్తుంది. ఈ డబ్బుకు ఏ స్థాయిలోనూ ఉత్పత్తితో సంబంధం లేదు గనుక కనీస క్రమశిక్షణ కూడా ఉండదు. ఈ డబ్బుతో పెంచిపోషించబడే రాజకీయాలు కూడా అందువల్లనే అరాచక, మాఫియా రాజకీయాలుగానే ఉంటాయి తప్ప ప్రజాసేవ కోసం, సామాజిక అవసరాల కోసం సాగే రాజకీయాలుగా ఉండవు. సాధారణంగా సేవారంగ పెట్టుబడి ఉత్పాదక రంగంలోని పెట్టుబడి లాగ నియమాలకు లోబడి కాక లంపెన్ లక్షణాలతో ఉంటుంది. ఆ పెట్టుబడి పోషణలో రాజకీయాలకు కూడా ఆ స్వభావమే వస్తుంది. రాజకీయాలలో రియల్ ఎస్టేట్, ఫైనాన్స్, ట్రాన్స్‌పోర్ట్, హోటళ్లు, వినోద పరిశ్రమల నుంచి వచ్చిన డబ్బు ప్రాబల్యం పెరిగిన కొద్దీ రాజకీయాలలో దిగజారుడు ఎక్కువ అయిపోతుండడం అందరికీ తెలిసిన విషయమే.

సేవారంగంలో ప్రైవేటీకరణ పెరిగిన కొద్దీ ప్రభుత్వ నిర్వహణలో ఉండవలసిన సేవారంగాలయిన విద్య, వైద్యం, ఆరోగ్యం వంటి వాటిపై వ్యయాన్ని తగ్గించడం మొదలవుతుంది. బడ్జెట్‌లోటు తగ్గింపు పేరుతో ఈ పని జరుగుతుంది. మరోవైపు ప్రభుత్వ సేవలలోనే భాగమైన రక్షణ, పోలీసు శాఖల వ్యయం పెరిగిపోతూ ఉంటుంది. అంటే సామాజిక అర్థంలో సంక్షేమ రాజ్యం రద్దయిపోతూ పోలీసు రాజ్యం పెరిగిపోతుంది. ఈ పరిణామం ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల మీద కూడా ప్రభావం వేస్తూ ఉంటుంది.

సేవారంగం ప్రాధాన్యతవల్ల అన్నిటికన్నా పెద్ద ప్రమాదం సాంస్కృతిక రంగంలో, సాంస్కృతిక విలువల మార్పులో జరుగుతుంది. వ్యవసాయోత్పత్తి, పారిశ్రామికోత్పత్తి పెరుగుతూనే ఉన్నప్పటికీ, జాతీయాదాయంలో వాటి వాటా తగ్గిపోయి, సేవారంగం వాటా పెరగడమంటే సాపేక్షికంగా వ్యవసాయ, పారిశ్రామికోత్పత్తుల వాటా తగ్గడమనే అర్థం. అంటే కనబడే ఉత్పత్తి విలువ తగ్గిపోయి, కనబడని 'సేవ' అనబడే దాని విలువ పెరుగుతుందని అర్థం. ఇది శ్రమ గౌరవం తగ్గిపోవడానికి, శ్రమను చిన్నచూపు చూసి, సేవారంగాన్ని గౌరవించడానికి దారితీస్తుంది. మరో మాటలో చెప్పాలంటే శారీరక శ్రమకు, మానసిక శ్రమకు ఇప్పటికే ఉన్న అంతరాన్ని ఈ పరిణామం మరింత లోతుగా, మరింత విశాలంగా మార్చివేస్తుంది.

మరోవైపు సేవారంగంలోని పర్యాటక పరిశ్రమ, లీజర్ పరిశ్రమ పేరుతో సాగే హోటళ్లు, రెస్టారెంట్లు, వినోద, విలాస సాధనాలు ఇబ్బడిముబ్బడిగా పెరిగిపోయి, సమాజ సంస్కృతిలో



ఉన్న మానవీయ విలువలన్నిటినీ ధ్వంసం చేస్తాయి. ఈ సేవారంగం పెరుగుదల వల్ల వ్యభిచారం, వికృత కామ కలాపాలు, భోగలాలస పెరగడం వంటి సాంస్కృతిక రంగ దుష్పరిణామాలు ఎన్నో ఆసియన్, లాటిన్ అమెరికన్ దేశాల అనుభవంలో ఉన్నాయి.

**ఉపయుక్త గ్రంథాలు**

John Madeley - Big Business Poor Peoples - The Impact of Trans-national Corporation on the World's Poor - Zed Books, London, 1999

Anne O Kreger (ed) - The WTO as an International Organisation. Oxford University Press, 1998

Public Interest Research Group - Gattastrophe - PIRG, Delhi 1993.

Neil Botten and John Mc Manus - Competitive Strategies for Service Organisations, Macmillan Press, 1999

Ruth Kaplan - GATS Handbook - on the Internet

Arun Kumar - The Black Economy in India, Penguin Books, 1999

Ashok Mitra - Terms of Trade and Class Relations, Rupa & Co., Calcutta, 1979

Nirmal Kumar Chandra - The Retarded Economics, Sameeksha Trust & Oxford University Press, 1998

*సుందరయ్య విజ్ఞాన కేంద్రం ప్రచురణ,*
*'ప్రపంచీకరణ - పదేళ్ల అనుభవాలు 1991-2001', జనవరి 2003*

# 29

# తలసరి ఆదాయం సూచించేదేమిటి?

సామాజికాభివృద్ధికి ఒక సూచికగా జాతీయాదాయం పెరుగుదలనో, తలసరి ఆదాయం పెరుగుదలనో చూపడం ఒక ఆనవాయితీ అయింది. మరీ ముఖ్యంగా గత దశాబ్దంగా 'అభివృద్ధి మాయాజాలాన్ని' ప్రచారం చేస్తున్న పాలకులు అంకెల గారడీతో ఆరు శాతం పెరుగుదల, పదిశాతం పెరుగుదల, పన్నెండు శాతం పెరుగుదల వంటి డాంబికాలు ప్రకటిస్తున్నారు.

ఒకవైపు జాతీయాదాయం, తలసరి ఆదాయం, వాటి పెరుగుదల రేట్లు పైపైకి ప్రయాణిస్తుండగా, మరోవైపు ప్రజల జీవన ప్రమాణాలు దిగజారుతుండడం, పేదరికం పెరిగిపోతూ ఉండడం నిత్యజీవిత వాస్తవికత అయింది. ఈ స్థితిలో మానవాభివృద్ధి అంటే నిజంగా ఏమిటి, కేవలం తలసరి ఆదాయం పెరుగుదలతో మానవాభివృద్ధిని కొలవవచ్చునా, మానవాభివృద్ధిని లెక్కించడానికి పరిశీలించవలసిన ఇతర ప్రమాణాలేమిటి అనే చర్చ అభివృద్ధి అర్థశాస్త్రంలో ప్రధానమైన చర్చ అయింది.

తలసరి ఆదాయాన్ని ఒక సమాజపు అభివృద్ధికి చిహ్నంగా చూడడంలో ప్రధానంగా మూడు సమస్యలున్నాయి. ఒకటి, ఆ తలసరి ఆదాయపు అంకె దేశం మొత్తానికో, రాష్ట్రం మొత్తానికో సగటు అంకె కావడం వల్ల ఆ జనాభాలోని



అంతరాల గురించి ఆ అంకె చెప్పజాలదు సరిగదా తప్పుడు సూచికలను కూడా ఇస్తుంది. ఉదాహరణకు మన దేశంలోనూ రాష్ట్రంలోనూ రోజుకు పది రూపాయల ఆదాయం రావడాన్నే మహాభాగ్యంగా భావించే వాళ్లు కోట్లాది మంది ఉన్నారు. మరొక కొసన రోజుకు కొన్ని డజన్ల కోట్ల రూపాయలో, వందల కోట్ల రూపాయలో ఆదాయం వచ్చే వాళ్లు కూడా కనీసం కొన్ని వందల మంది అయినా ఉన్నారు. వారినీ వీరినీ కలగలిపి, వారిరువురి ఆదాయాలను కలిపేసి, మొత్తం జనాభాతో భాగహారం చేస్తే వచ్చే అంకె ఎంత హాస్యాస్పదమైనదో చెప్పనక్కరలేదు. కాని దశాబ్దాలుగా ఇటువంటి అంకెలూ తయారవుతున్నాయి. ప్రభుత్వాలు ఆ అంకెలనే పట్టుకుని తమ అభివృద్ధిని ప్రకటించుకుంటున్నాయి.

రెండో సమస్య, తలసరి ఆదాయం అనే అంకె ఉజ్జాయింపుగా సరైన ఆదాయాలనే ప్రతిబింబించే చోట కూడా దాని లక్షణం పరిమాణాత్మకమైనదే గాని గుణాత్మకమైనది కాజాలదు. అంటే వచ్చే ఆదాయం సామాజిక శ్రేయోదాయకమైన కార్యక్రమాల నుంచి వస్తుందా, అందుకు భిన్నంగా సామాజిక ఆరోగ్యాన్ని భంగపరిచే కార్యక్రమాల నుంచి వస్తుందా అనే దానితో తలసరి ఆదాయం అంకెకు నిమిత్తం లేదు. అట్లాగే ఆ తలసరి ఆదాయం మానవాభివృద్ధి కోసం వినియోగించబడి, మనుషుల జీవన ప్రమాణాలు పెరుగుతున్నాయా, లేక అనుత్పాదక, అనవసర, వ్యర్థ రంగాలలో వినియోగించబడుతూ మనుషుల జీవన ప్రమాణాల మీద ఎటువంటి ప్రభావం చూపడం లేదా అనే ప్రశ్నతో ఆ అంకెకు నిమిత్తం లేదు.

మూడో సమస్య, తమ ప్రజల వర్తమానాన్నీ, భవిష్యత్తునూ తీర్చిదిద్దవలసిన ప్రభుత్వాలు, ప్రజల కనీస అవసరాలను తీర్చడం మాత్రమే గాక విజ్ఞాన, వినోద అవసరాలను తీర్చవలసిన ప్రభుత్వాలు ఆ పని నుంచి తప్పుకునేందుకు, ఆ పనిని విస్మరింపజేసేందుకు తలసరి ఆదాయంలో పెరుగుదల అంకెలను ఒక ముసుగుగా వాడుకుంటున్నాయి. పిడికెడు మంది సంపన్నుల ఆస్తులను ఇంకా పెంచడం ద్వారా, పనిచేసే చేతులకు ఉపాధి కల్పించకపోయినా ఎక్కువ పెట్టుబడులను, ఎక్కువ సాంకేతిక విజ్ఞానాన్ని, ఎక్కువ లాభాలను ప్రవేశపెట్టడం ద్వారా జాతీయాదాయం అంకెలను ఇతోధికంగా పెంచడానికి ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నాయి. ఆ రకంగా పెరిగిన జాతీయాదాయాన్ని జనాభాతో భాగించి తలసరి ఆదాయం పెరిగిందని ప్రగల్భాలు పలుకుతున్నాయి. అందువల్లనే తలసరి ఆదాయంలో పెరుగుదల కనబడుతున్నప్పటికీ పేదరికం పెరగడం, సంపద కొందరి చేతుల్లో పెరుగుతుండడం, అంతరాలు పెరుగుతుండడం జరుగుతున్నాయి.

ఈ నేపథ్యంలో మానవ అభివృద్ధికీ, సంక్షేమానికీ సూచికగా కేవలం తలసరి ఆదాయం అంకెను తీసుకోగూడదనీ, మరింత విశాలమైన నిర్వచనంతో, మరిన్ని ప్రమాణాలను నెలకొల్పాలనీ ఆలోచన ప్రారంభమైంది. ఐక్యరాజ్య సమితి అభివృద్ధి పథకం (యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం) గత పది సంవత్సరాలకు పైగా మానవ సంక్షేమాన్ని కొలవడానికి కొత్త ప్రమాణాలను తయారు చేస్తూ వస్తోంది. పాకిస్తాన్‌కు చెందిన అభివృద్ధి అర్థశాస్త్రవేత్త

మహబూబుల్ హక్, యుఎన్‌డిపి సంయుక్తంగా 1989 నుంచి 'మానవాభివృద్ధి నివేదిక' అనే ఒక కొత్త దృక్పథానికి సంబంధించిన ఆలోచనలను ప్రకటిస్తున్నారు.

మానవాభివృద్ధి అంటే ప్రజల ముందు ఉండే ఎంపిక అవకాశాలను విస్తృతం చేసే ప్రక్రియ అని, సంక్షేమాన్ని ఇతోధికంగా ఉన్నత స్థాయికి తీసుకుపోయే ప్రక్రియ అని 'మానవాభివృద్ధి నివేదిక' నిర్వచించింది. ఎంపిక అవకాశాలనేవి స్థలకాలాలను బట్టి మారవచ్చునని, వేరువేరుగా ఉండవచ్చునని కూడా 'మానవాభివృద్ధి నివేదిక' అంగీకరించింది.

స్థూలంగా ఇప్పటివరకు 'మానవాభివృద్ధి నివేదిక'లో వ్యక్తమయిన ఆలోచనల ప్రకారం ఎంపిక అవకాశాలంటే, సుదీర్ఘకాలం, ఆరోగ్యంగా జీవించగలిగే అవకాశం కావచ్చు. జ్ఞానాన్నీ, విద్యనూ పొందగలిగే అవకాశం కావచ్చు. గౌరవప్రదమైన జీవనం గడపడానికి అవసరమైన వనరులను పొందగలిగే అవకాశం కావచ్చు. ప్రధానంగా ఈ మూడు మార్గాలను గుర్తించిన 'మానవాభివృద్ధి నివేదిక'లు ఆయుఃప్రమాణం, అక్షరాస్యత, స్త్రీ పురుష సమానత్వం, సర్వతో ముఖాభివృద్ధి వంటి ఎన్నో అంశాలను పరిగణనలోకి తీసుకున్నాయి. తలసరి ఆదాయం కూడా ఒకానొక సూచిక కావచ్చునని అంగీకరించాయి.

ఆయుఃప్రమాణం, విద్యార్హతలు అనేవి వాటికవిగానే లక్ష్యాలుగా ఉంటాయని, ఒక మనిషి జీవన ప్రమాణానికి గుణాత్మక సూచికలుగా పనిచేస్తాయని యుఎన్‌డిపి అంటుంది. తలసరి ఆదాయం అనే సూచిక ఎంత లోపభరితమయినదయినా, దాన్ని సాధించవలసిన ఇతర ప్రమాణాలకు సాధనంగా చూసినప్పుడు అంగీకరించవచ్చునని ఆ నివేదిక అంటుంది.

అంటే కొత్త దృక్పథం ప్రకారం మానవాభివృద్ధికీ, సంక్షేమానికీ ఆయుఃప్రమాణం, విద్య, ఆరోగ్యం, స్త్రీ పురుష సమానత్వం, వనరులపై అధికారం వంటి లక్ష్యాలూ, తలసరి ఆదాయం వంటి సాధనాలూ ప్రమాణాలుగా ఉంటాయి.

సరిగ్గా ప్రపంచవ్యాప్తంగా ప్రపంచీకరణ క్రమం ఉధృతం కావడం, మన దేశంలో ప్రపంచీకరణలో భాగంగా నూతన ఆర్థిక విధానాలు అమలు కావడం. పెట్టుబడిదారీ సాంఘిక ధర్మం మినహా, 'గత్యంతరం లేదు' అని మార్గరెట్ థాచర్ సిద్ధాంత ప్రవచనం చేయడం, మానవాభివృద్ధి గురించి కొత్త దృక్పథం ఉనికిలోకి రావడం ఒకే నేపథ్యం నుంచి వెలువడడం గమనించదగిన విషయం. యుఎన్‌డిపి మొదటి నుంచీ పెట్టుబడిదారీ ప్రపంచీకరణ శక్తులు ప్రకటించే అభివృద్ధికి భిన్నమైన వాదనలు చేస్తూ వస్తోంది.

'మానవాభివృద్ధి నివేదిక' 1999 ప్రధాన సంకలనకర్త డా. రిచర్డ్ జాలీ మాటల్లో చెప్పాలంటే, 'మానవ జీవితమంటే ఆదాయం ఒక్కటే కాదు. మానవాభివృద్ధి అనే భావన ఆదాయం కన్న లోతయినది, విలువైనది. ఆదాయం మానవాభివృద్ధికి ఒక మార్గం మాత్రమే గాని గమ్యం కాదు.'

అయినా ఇప్పటికీ మన ప్రభుత్వాలు తలసరి ఆదాయాన్నే ప్రధాన సూచికగా తీసుకుని మనం ఇంకా ఇంకా పైపైకి వెళ్లాలని ఉద్బోధిస్తున్నాయి. నిజానికి యుఎన్‌డిపి 'మానవాభివృద్ధి



నివేదిక' సోదాహరణంగా తలసరి ఆదాయం హెచ్చుగా ఉన్నంత మాత్రాన అభివృద్ధి ఎక్కువగా ఉన్నదని చెప్పడానికి వీల్లేదని ప్రకటించింది. తలసరి ఆదాయం ఖతర్‌లో 20,987 డాలర్లు ఉన్నప్పటికీ, మానవ సంక్షేమ విషయంలో ఖతర్ ప్రజలు 7,910 డాలర్లు సగటు తలసరి ఆదాయం ఉన్న స్లోవాకియా ప్రజలతో సమానంగా ఉన్నారని 'మానవాభివృద్ధి నివేదిక' చూపింది.

తలసరి ఆదాయం అనేది ప్రధానంగా ద్రవ్యరూపపు కొలత. అంటే మార్కెట్ ప్రక్రియలో భాగమై, ద్రవ్యరూపంలోకి మారగల అవసరాలను, అవకాశాలను మాత్రమే అది పరిగణనలోకి తీసుకుంటుంది. 'ప్రపంచీకరణ, కొత్త సూత్రాలు, వాటిని రాస్తున్న స్వార్థపరశక్తులు, అంతర్జాతీయ మార్కెట్లను ఏకం చేయడం మీద శ్రద్ధ చూపుతారు. మార్కెట్ల ద్వారా తీరడానికి వీలులేని అవసరాలు కూడా ప్రజలకు ఉంటాయని వాళ్లు గుర్తించరు. కనుక వాటిని నిర్లక్ష్యం చేస్తారు. ఈ క్రమం వల్ల అధికారం, సంపద కొన్ని దేశాల దగ్గర, కొంతమంది దగ్గర కేంద్రీకృతమై, అశేష ప్రజానీకం పక్కకు తప్పుకోవలసి వస్తుంది' అని యుఎన్‌డిపి రాసింది.

ఈ కొత్త దృక్పథం మన దేశంలోనూ కొందరు మేధావులను ఆకర్షించింది. ప్రభుత్వ గణాంకాలలో కూడా ఎంతో కొంత ఈ దృక్పథాన్ని జొప్పించడానికి కొంతకాలంగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇప్పటికే కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు తమ తమ రాష్ట్రాల మానవాభివృద్ధి నివేదికలను ప్రకటించాయి. ఆ ప్రయత్నాలన్నింటినీ ఇంకా సమగ్రం చేస్తూ కేంద్ర ప్రణాళికా సంఘం 2002 మార్చిలో భారతదేశపు జాతీయ మానవాభివృద్ధి నివేదిక 2001ని మొదటిసారిగా ప్రచురించింది.

ఈ తాజా నివేదిక దాదాపు 70 వేర్వేరు ప్రమాణాల ఆధారంగా గణాంకాలను సేకరించి చాలా సమగ్రమైన విశ్లేషణలు చేసి, అంచనాలు ప్రకటించింది. ఎంతో కాలంగా కేవలం తలసరి ఆదాయం మీద ఆధారపడి అభివృద్ధి మాయాజాలాన్ని ప్రచారం చేస్తున్న మన దేశంలో ఈ మానవాభివృద్ధి నివేదిక కొత్త అంచనాలను అందిస్తోంది.

***సమీక్ష, జనవరి 1-15, 2003***

# 30

# నిత్య జీవితంలో బహుళజాతి సంస్థలు

## 1

'చక్రి సర్వోపగతుండెందెందు వెతికిన అందందే గలడు' – అని చెప్పి ప్రహ్లాదుడు నరసింహావతారాన్ని స్తంభంలోంచి రప్పించాడు. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం అని అహంకరించిన బ్రిటిష్ పాలకవర్గాలు భూగోళం మొత్తం మీద తమ వలసలు స్థాపించి ఇరవై నాలుగు గంటలూ సూర్యుడు తమ పాలనలోనే ఉండేట్లు శాసించారు. అయినా నరసింహావతారం కథనాటికి తెలిసిన భూగోళం చాలా చిన్నది. బ్రిటిష్ వలసవాదానికి తెలిసిన భూగోళం పెద్దదే కానీ వలసలు విస్తరించిన భూభాగం ప్రపంచంలో మూడోవంతు మాత్రమే.

ఈ రెండు సామ్రాజ్యాలను తలదన్నేలా విశ్వవ్యాపితమైన, నిజంగా రవి అస్తమించని సామ్రాజ్యం బహుళజాతి సంస్థలది. ఇవాల్టి ప్రపంచంలో బహుళజాతి సంస్థల ప్రమేయం లేని చోటు లేదు. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో బహుళజాతి సంస్థల సరుకులు వాడని మనుషులు లేరు. బహుళజాతి సంస్థలకు ముడిసరుకులు సమకూర్చి పెట్టని దేశమూ, ప్రాంతమూ లేవు. మన సొంత అనుభవంలోనే పరిశీలిస్తే మన నిత్య జీవితం బహుళజాతి సంస్థల సరుకులతో, బహుళజాతి సంస్థలు ప్రచారం చేసే సంస్కృతితో ఎంత ఎక్కువ కాలం ముడిపడి



ఉన్నదో ఆలోచిస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఉదయం లేచీ లేవగానే వాడుకునే టూత్‌బ్రష్, టూత్‌పేస్టల దగ్గర ప్రారంభించి రాత్రి పడుకునే మంచాలు, పరుపుల దాకా, రోజంతా చదివే పత్రికలు, చూసే ప్రకటనలు, టెలివిజన్ కార్యక్రమాలు, వినే రేడియో కార్యక్రమాలు, ప్రయాణించే వాహనాలు, ఇతరంగా వినే రేడియో కార్యక్రమాలు, ప్రయాణించే వాహనాలు, ఇతరంగా వాడే విద్యుత్, టెలిఫోన్, బ్యాంక్, ఇన్సూరెన్స్, పరికరాలూ – సేవలూ అన్నీ కూడా ఏదో ఒక రూపంలో బహుళజాతి సంస్థలతో సంబంధం కలిగినవే. ఆయా వస్తువులను, సేవలను అందించే దేశీయ పరిశ్రమలు లేకపోవడం ఒక ఎత్తైతే, ఉన్న పరిశ్రమలను కూడా నానాటికీ బహుళజాతి సంస్థలు తమ అధీనంలోకి తెచ్చుకోవడం మరో ఎత్తు. దేశంలో 1991 జూలైలో ప్రారంభం అయిన నూతన ఆర్థిక విధానాలు – ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ, సరళీకరణ క్రమం దేశ ప్రజల జీవితాన్ని ఈ బహుళజాతి సంస్థల అధీనంలోకి మరింతగా నెట్టివేశాయి.

అసలు ఈ బహుళజాతి సంస్థలంటే ఏమిటి? వాటిని ఎందుకు వ్యతిరేకించాలి? అవి ఈ దేశంలోకి ప్రవేశించి చేయదల్చుకున్న పని ఏమిటి? ఎందువల్ల బహుళజాతి సంస్థల చొరబాటు, విస్తరణ ఈ దేశ ప్రజల ప్రయోజనాలకు హానికరమవుతాయి? ఈ ప్రశ్నలకు జవాబులు తెలుసుకోవాలంటే నాలుగు వందల సంవత్సరాల పెట్టుబడిదారీ విధానం చరిత్రను, పెట్టుబడిదారీ విధానం దాని అత్యున్నత దశలోకి ఎదిగి గత నూటయాభై సంవత్సరాలుగా సాగిస్తున్న సామ్రాజ్యవాద రాజకీయార్థిక విధానాలను అర్థం చేసుకోవాలి.

సామ్రాజ్యవాదం ఇవాళ బహుళజాతి సంస్థల రూపంలో వ్యక్తీకరణ పొందుతున్నది. భారతదేశంలో రాజకీయాధికారం నిర్వహించిన బ్రిటిష్ సామ్రాజ్యవాదం కన్నా, నిన్న మొన్నటి వరకూ వియత్నాంలో సైనిక, రాజకీయ ఆధిపత్యం చలాయించిన అమెరికన్ సామ్రాజ్యవాదం కన్నా – ఈ బహుళజాతి సంస్థల ఆర్థిక విస్తరణ కాంక్ష ప్రమాదకరమైనది. ఇది ప్రత్యేకంగా ఏ వలసనూ ఎంచుకోదు. కానీ అన్ని దేశాల రాజకీయార్థిక విధానాలను నిర్ణయించే అధికారం తనకే కావాలంటుంది. అమెరికన్ ప్రభుత్వాన్ని, పాలకవర్గాలను కూడా శాసించే ఈ బహుళజాతి సంస్థలదే ఇవాళ నిజమైన ప్రపంచాధిపత్యం. అమెరికన్ ప్రభుత్వ విదేశాంగ నీతిని బహుళజాతి సంస్థలే నిర్ణయిస్తున్నాయనేది బహిరంగ రహస్యమే. విడివిడిగా ప్రపంచ ప్రజలు తమ దైనందిన జీవితంలో ఉపయోగించే వస్తువుల దగ్గర నుంచి అంతర్జాతీయ సంబంధాల దాకా సకల విషయాలనూ నిర్దేశిస్తున్న ఈ బహుళజాతి సంస్థలు ఎక్కడి నుంచి పుట్టుకువచ్చాయి? ఎవరికి జవాబుదారీగా ఉంటాయి? ఏ లక్ష్యాల కోసం పనిచేస్తాయి?

బహుళజాతి సంస్థలు (మల్టీ నేషనల్ కార్పొరేషన్స్) అని ఇవాళ మనం పిలుస్తున్న పారిశ్రామిక, వ్యాపార సంస్థలను జాతి అతీత సంస్థలు (ట్రాన్స్ నేషనల్ కార్పొరేషన్స్) అని కూడా పిలుస్తున్నారు. ఈ రెండు పేర్ల వెనక ఉన్న అర్థాలలో స్వల్ప భేదం ఉంది. ఆ భేదాన్ని తెలుసుకోవడానికన్నా ముందు అసలు బహుళజాతి సంస్థల పుట్టుక, పెరుగుదల గురించి ఆలోచించాలి.

బహుళజాతి సంస్థ అన్న మాట వినగానే ఆ సంస్థలో అనేక జాతుల భాగస్వామ్యం ఉంటుందనే అర్థం వస్తుంది. కాని అది నిజం కాదు. పెట్టుబడిదారీ విధానం వ్యాపార పెట్టుబడి

నుంచి పారిశ్రామిక పెట్టుబడి దశకు ఎదుగుతున్న సమయంలో ఒకదేశపు పారిశ్రామిక సంస్థలు అనేక దేశాల ముడిసరుకులను కొల్లగొట్టడానికి, ఆయా దేశాల మార్కెట్లలో తమ సరుకులు అమ్ముకోవడానికి ఆ దేశాలలోనే తమ శాఖలు తెరవడం మొదలుపెట్టాయి. ఆ రకంగా పారిశ్రామిక వస్తువుల తయారీ ఒకే సంస్థకు సంబంధించినదైనప్పటికీ బహు దేశాలకు విస్తరించింది. ఒక ఉదాహరణ చెప్పాలంటే అమెరికాకు చెందిన జనరల్ మోటార్స్ అనే సంస్థ తయారు చేసే కార్లలో విడిభాగాలు దక్షిణ కొరియా, జపాన్, జర్మనీ, తైవాన్, బ్రిటన్, ఐర్లండ్ వంటి ఎన్నో దేశాల నుంచి వస్తాయి.

ఈ దశ దాటి పెట్టుబడిదారీ విధానం ఒక అడుగు ముందుకు వేసి ద్రవ్య పెట్టుబడి దశకు చేరుకున్నప్పుడు పారిశ్రామిక ఉత్పత్తి వివిధ దేశాలలో జరిగినా, జరగకపోయినా – ద్రవ్య పెట్టుబడి అన్ని దేశాల నుంచి అన్ని దేశాలకూ విస్తరించింది. అంటే ఒక సంపన్న దేశపు పెట్టుబడిదారీ వర్గం ఒక పేదదేశంలో స్వయంగా పరిశ్రమలు నెలకొల్పకుండానే, ఉన్న సంస్థలలో మదుపుపెట్టి ఆ సంస్థలను శాసించగలుగుతుంది.

ఇవాళ్టి ప్రపంచంలో ఈ రెండురకాల విధానాలూ అమలులో ఉన్నాయి. స్థానికంగా తమ ఉత్పత్తి కేంద్రాలను నెలకొల్పడం, ఉన్న ఉత్పత్తి కేంద్రాలను కొనివేయడం, దేశీయ సంస్థల వాటాలను షేర్ మార్కెట్లో కొని వాటిలో నిర్ణయాధికారాన్ని సొంతం చేసుకోవడం మొదలైన పనులకు బహుళజాతి సంస్థలు పూనుకుంటున్నాయి. అంటే పెట్టుబడి, యాజమాన్యం సంపన్న దేశాల పెట్టుబడిదారుల చేతులలో ఉండి ప్రపంచవ్యాప్తంగా ఉత్పత్తి కేంద్రాలు, మార్కెట్ విస్తరించిన సంస్థలు అన్నింటినీ బహుళజాతి సంస్థలు అని పిలవవచ్చు.

ఇటువంటి సంస్థలు ప్రపంచవ్యాప్తంగా 40,000 ఉంటాయని ఒక అంచనా. వీటికి వేరువేరు దేశాలలో భాగస్వామ్య సంస్థలూ, శాఖలూ మూడు లక్షల దాకా ఉన్నాయి. ఇవి ఎంత పెద్దవి అంటే ఫోర్డ్, జనరల్ మోటార్స్ అనే రెండు అమెరికన్ బహుళజాతి వాహన ఉత్పత్తి సంస్థల అమ్మకాలు సహారా ఎడారిలో ఉన్న 12 దేశాల స్థూల జాతీయోత్పత్తి కన్నా ఎక్కువ. ఆరు జపనీస్ బహుళజాతి సంస్థల వార్షిక ఆదాయం మొత్తం లాటిన్ అమెరికన్ ఖండంలోని దేశాల జాతీయ ఆదాయం కన్నా ఎక్కువ.

భారతదేశంలో దాదాపు 150 బహుళజాతి సంస్థల శాఖలో, భాగస్వామ్య సంస్థలో ఉన్నాయని ఒక అంచనా. ఈ బహుళజాతి సంస్థల వార్షిక ఆదాయం భారత జాతీయ ఆదాయం కన్నా 20 రెట్లు ఎక్కువ.

ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థలతో పోల్చి చూసినప్పుడు బహుళజాతి సంస్థలు ఇంత బలోపేతమయినవి కనుక ఆయా దేశాల ప్రభుత్వాలకూ, బహుళజాతి సంస్థలకూ మధ్య సంబంధం సమానంగా ఉండడం సాధ్యం కాదు. బహుళజాతి సంస్థలు ప్రవేశించినపుడు కేవలం ఆ దేశంలోని ఖనిజ వనరులను, ముడిసరుకులను తీసుకుపోవడానికి, ఆ మార్కెట్లలో తమ సరుకులు అమ్ముకోవడానికి అంటే కేవలం వ్యాపార ప్రయోజనాల కోసమే ప్రవేశించవచ్చు. కానీ తమ బలంవల్ల, సంపద నుంచి వచ్చే అహంకారం వల్ల ఆ ప్రభుత్వాలను లొంగదీయడం ప్రారంభిస్తాయి. తమకు ముడిసరుకులు అందడానికి ఉన్న ఆటంకాలన్నింటినీ తొలగించమని



ఆదేశిస్తాయి. ఒక్క మాటలో చెప్పాలంటే స్థానిక ప్రభుత్వ రాజకీయార్థిక విధానాలను తామే నిర్దేశిస్తాయి.

ప్రపంచీకరణ, సరళీకరణ అనే పదాలకు స్థూలమైన అర్థం ఇదే! పేద దేశాలు తమ ముడిసరుకులను, తమ మార్కెట్లను ప్రపంచీకరించాలి. ఆ ప్రపంచీకరణకు ఆటంకాలుగా ఉన్న స్థానిక పరిరక్షణ చట్టాలను, ఆంక్షలను, ఆచారాలను సరళీకరించాలి.

ఈ పని జరిగిన తరువాత మార్కెట్లలోకి బహుళజాతి సంస్థల సరుకులు ఇబ్బడి ముబ్బడిగా దిగుమతి అవుతాయి. అవసరం ఉన్నా లేకపోయినా సరుకులను వాడే వినియోగదారీ సంస్కృతి వ్యాపిస్తుంది. ప్రకటనలతో, ప్రోత్సాహకాలతో, ఆకర్షణలతో, బెదిరింపులతో కొత్త సరుకులను మప్పడం మొదలవుతుంది. ఒక దశాబ్దం వెనకకూ ఇప్పటికీ మన వ్యక్తిగత జీవితంలోకి ఎన్ని కొత్త సరుకులు ప్రవేశించాయో, వాటిలో నిజంగా అవసరం కొద్దీ వచ్చినవెన్నో, అవసరం లేకపోయినా ప్రచార ఆర్భాటం వల్ల, సామాజిక కార్యక్రమాల వల్ల వచ్చినవెన్నో సమీక్షించుకుంటే సరుకు జీవితంలోకి ఎంత చొచ్చుకువచ్చిన సరుకుల్లో 90 శాతం పైన బహుళజాతి సంస్థల ఉత్పత్తులే.

ఈ బహుళజాతి సంస్థల ఉత్పత్తుల వినియోగానికి ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక కోణాలెన్నో ఉన్నాయి. ఆ సరుకులు మన ఉపయోగం కోసమో, సౌకర్యం కోసమో, విలాసం కోసమో వచ్చినట్లు పైకి కనపడవచ్చు కానీ వాస్తవంగా వాటి వినియోగం వల్ల మనం పొందే ప్రయోజనం కన్నా మనం వాటిని వినియోగించటం వల్ల బహుళజాతి సంస్థలు పొందే ప్రయోజనం ఎక్కువ.

మనం నిత్యజీవితంలో వాడుతున్న వస్తువులను ఒకటొకటిగా తీసుకుని వాటిని, వాటి వెనుక రాజకీయార్థిక ప్రయోజనాలను వివరించడం ఈ శీర్షిక లక్ష్యం. వరుసగా ఆయా సరుకులను, వాటి మార్కెట్లను, వాటి ఉత్పత్తిదారులను వివరించి వాటికి ప్రత్యామ్నాయాలను సూచించడం జరుగుతుంది. బహుళజాతి సంస్థల మీద పోరాటం స్థూలస్థాయిలో కూడా అంతగానే జరగవలసి ఉందనే గుర్తింపును కలిగించడం కోసమే ఈ వ్యాస పరంపర.

## 2

మన దైనందిన జీవితంలో ఇవాళ బహుళజాతి సంస్థలు ప్రవేశించని చోటు, విస్తరించని సమయం లేదని గత అధ్యాయంలో స్థూలంగా చెప్పుకున్నాం. ఈ చొరబాటును ఇంకా వివరంగా సూక్ష్మస్థాయిలో అర్థం చేసుకోవాలంటే అటు బహుళజాతి సంస్థల కార్యక్షేత్రాల వైపు నుంచి గాని, ఇటు మన జీవన కార్యకలాపాలలో మనం వాడుతున్న సరుకుల వైపు నుంచి గాని, సేవల వైపు నుంచి గాని వర్గీకరించి అర్థం చేసుకోవలసి ఉంటుంది. సబ్బులు, టూత్‌పేస్టుల తయారీ నుంచి విమానాలు, విద్యుదుత్పత్తి పరికరాల దాకా బహుళజాతి సంస్థలు తయారు చేసే సరుకులు ఎన్నో ఉన్నాయి. బ్యాంకింగ్, రవాణా సేవల నుంచి ప్రభుత్వాలకు సలహాలిచ్చేదాకా బహుళజాతి సంస్థలు మూడో ప్రపంచ దేశాలకు అమ్ముతున్న సేవలు ఎన్నో ఉన్నాయి. అంటే మనం నేరుగా ఏ ఒక్క బహుళజాతి సంస్థ సరుకునూ, సేవనూ ఉపయోగించగూడదని

అనుకున్నా, పరోక్షంగా ఏదో ఒక బహుళజాతి సంస్థ సరుకునూ, సేవనూ ఉపయోగించక తప్పని స్థితి ఉంది.

నిత్య జీవితంలో బహుళజాతి సంస్థల చొరబాటును పరిశీలించడానికి భారీ యంత్ర పరికరాలలో, సేవారంగంలో, వ్యవసాయోత్పత్తుల ప్రాసెసింగ్, మారుబేరాలలో, వినియోగ వస్తువులలో వాటి ప్రవేశాన్ని, వాటి ప్రయోజనాలను అధ్యయనం చేయవలసి ఉంటుంది. నిజానికి ఈ నాలుగు రంగాలలోను భారతదేశం వంటి విస్తృతమైన సహజ వనరులు, మానవ శ్రమశక్తి ఉన్న దేశం బహుళజాతి సంస్థలమీద ఆధారపడనక్కరలేదు. భారత పరిశ్రమ, సాంకేతిక పరిజ్ఞాన స్థాయి ఉత్పత్తి చేయలేని భారీ యంత్ర సామాగ్రి ఏమీలేదు. సేవా రంగంలో నిజంగా భారత ప్రజలకు అవసరమైన సేవలేవో సమీక్షించుకొని సరైన విధానాలను అవలంబిస్తే సేవల స్వావలంబన సాధించవచ్చు. వ్యవసాయోత్పత్తులలో భారతదేశం సాధించిన స్వయం సమృద్ధిని పాలకులే చేజేతులా విధ్వంసం చేసి, వ్యవసాయ రంగాన్ని బహుళజాతి సంస్థల చేతికి అప్పగించారు. ఇక వినియోగ వస్తువులలో ఆడంబరానికి పోకుండా, తక్షణావసరాలు తీర్చే ప్రాతిపదికపై ఒక సమగ్ర విధానాన్ని గనుక రూపొందించగలిగితే దేశ ప్రజలకు అవసరమైన వినియోగ వస్తువులను స్వయం శక్తితో తయారు చేసుకోవడం సాధ్యమే.

కాని ఈ నాలుగు రంగాలలోనూ బలసంపన్నమైన బహుళజాతి సంస్థలు భారత పాలకుల మెడలు వంచి, మరీ ముఖ్యంగా 1991 నూతన ఆర్థిక విధానాల తర్వాత, దేశంలోకి విస్తరించి ఊడల మర్రిలా పాకిపోయాయి.

ఈ 'పైనుంచి' బహుళజాతి సంస్థల చొరబాటు చిత్రానికి, 'కింది నుండి' ప్రజలలో తయారైన సమ్మతిని కలపకపోతే దృశ్యం పూర్తికాదు. కిందినుంచి, ముఖ్యంగా మధ్యతరగతిలో బహుళజాతి సంస్థల ప్రవేశానికి అనుకూలమైన, ఆహ్వానించే భావాలను ప్రవేశపెట్టడం, పదే పదే ప్రచారం చేసి గత్యంతరం లేదనే అభిప్రాయం కలిగించడం క్రమబద్ధంగా, ప్రణాళిక ప్రకారం జరిగింది.

అందులోనూ భారీ యంత్ర సామాగ్రి, స్థూల ఆర్థిక వ్యవస్థ స్థాయి సలహాల రంగంలో విడివిడిగా ప్రజలకు నిర్ణయాధికారం ఏమీలేదు. ఆ స్థాయిలో నిర్ణయాధికారం అటు ప్రభుత్వాలకు గాని, బడా పారిశ్రామికవేత్తలకు గాని మాత్రమే ఉంటుంది. అంతిమ ఫలితాలు ప్రజల నిత్య జీవితం మీద ఉన్నప్పటికీ ఈ స్థాయిలో ఫలానా నిర్ణయం తీసుకోమని గాని, వద్దనిగాని చెప్పడానికి తగిన సమాచారం ప్రజలకు అందుబాటులో లేదు. చెప్పే అవకాశమూ లేదు. ఇక వ్యవసాయోత్పత్తులు. ఇవి మన మార్కెట్లలోకి ఎంతగా విస్తరించాయంటే కొన్ని రంగాలలో మార్కెట్లో పోటీపడేవీ, దొరికేవీ అన్నీ బహుళజాతి సంస్థల ఉత్పత్తులే. వినియోగదారు వాటిలోనే ఏదో ఒకదాన్ని ఎంచుకోవలసిన దుస్థితి ఉంది.

వీటిలో వినియోగదారీ సరుకుల దగ్గర మన పరిశీలన మొదలుపెడదాం.

బహుళజాతి సంస్థల, వ్యాపారస్తుల మార్కెట్ పరిభాషలో వీటిని వేగంగా అమ్ముడయ్యే వినియోగ వస్తువులు (ఫాస్ట్ మూవింగ్ కన్స్యూమర్ గూడ్స్ – ఎఫ్.ఎం.సి.జి.) అంటారు.



ఎక్కువ కాలం నిలువ ఉండని, రోజువారీ అవసరానికి ఉపయోగపడే సరుకులన్నీ ఈ వర్గీకరణ కిందికి వస్తాయి. వ్యాపారస్తుల, ఉత్పత్తిదార్ల నిర్వచనం ప్రకారం ఈ సరుకులను ప్రతి వినియోగదారు సగటున నెలకొకటైనా కొంటారు.

అంటే భారత జనాభాలో కనీసం మధ్యతరగతినే లెక్కవేసుకున్నా ముప్పై కోట్లమంది ఉన్నారనుకుంటే, సరుకుల వినియోగం కూడా మనుషుల లెక్కన కాక కుటుంబం లెక్కన వేసుకున్నా, ప్రతి నెలా ఈ సరుకులు కనీసం ఆరు కోట్లు అమ్ముడవుతాయనుకోవాలి. ఇది కనీస పక్షం అంచనా. నిజానికి ఈ వినియోగ సరుకులకు మధ్యతరగతిలోనే కాక ఇతర వర్గాలలో కూడా మార్కెట్ ఉంది గనుక ఇది కొన్ని వేల కోట్ల రూపాయల మార్కెట్.

ఈ ఎఫ్.ఎం.సి.జి. రంగంలో బట్టలు ఉతికే సబ్బులు, పౌడర్లు, వంటి సబ్బులు, టూత్ పేస్టులు, టూత్ పౌడర్లు, బ్రష్షులు, షాంపూలు, క్రీములు, పౌడర్లు, ఆహార పదార్థాలు, తీపి పదార్థాలు, పానీయాలు, సిగరెట్లు వంటి ఎన్నో సరుకులను లెక్కిస్తారు.

ఈ సరుకులకు వ్యాపార వర్గాలు, ఉత్పత్తిదార్లు ఆపాదిస్తున్న లక్షణాలను చూస్తే, వీటిలో బహుళజాతి సంస్థలు లేదా భారీ పెట్టుబడిదారులు మాత్రమే నిలదొక్కుకోవడానికి ఎటువంటి పరిస్థితులు కల్పించబడ్డాయో అర్థమవుతుంది.

ఈ సరుకులు విడివిడిగా, ఒక్కొక్కటిగా చూస్తే ఖరీదైనవి కావు. కాని ఒక వినియోగదారు మొత్తం ఖర్చులో ఈ సరుకుల వాటా చాలా ఎక్కువ. ఒక్కొక్క సరుకు మీద ఉత్పత్తిదారుకు గాని, వ్యాపారికి గాని వచ్చే లాభం ఎక్కువ కాకపోవచ్చు కాని ఆ సరుకుల వినియోగం విపరీతంగా ఉండడం వల్ల లాభాలు చాలా ఎక్కువగా ఉంటాయి.

ఈ సరుకులు కొనేటప్పుడు వినియోగదారులు పెద్దగా ఆలోచించరు. ఆ సరుకుల సాంకేతిక లక్షణాలేమిటనేది చూడరు. తెలిసిన బ్రాండ్‌నే పదే పదే కొంటూ ఉండడమో, ఎవరైనా చేసిన సిఫారసు ఆధారంగా, ప్రకటన ఆకర్షణతో కొంటూ ఉండడమో చేస్తూ ఉంటారు.

ఉత్పత్తిదార్లు, వ్యాపారస్తులు ఈ ఎఫ్.ఎం.సి.జి. సరుకులకు ఆపాదించే మిగిలిన లక్షణాలు ఎలా ఉన్నా, ఈ రెండు లక్షణాలూ బహుళజాతి సంస్థలకు, భారీ పెట్టుబడిదారులకు ఈ రంగాన్ని చాలా ఆకర్షణీయమైన, అనువైన రంగంగా మారుస్తాయి. ఈ సరుకుల విషయంలో యూరప్, అమెరికా మార్కెట్లు ఇప్పటికే పూర్తయిపోవడం వల్ల, భారత మార్కెట్ చాలా పెద్దది కావడం మాత్రమే కాక, భారత మార్కెట్‌లో సగానికి పైగా ఇప్పటికీ స్థానిక, చిన్న ఉత్పత్తిదార్ల సరుకులతో నిండి ఉండడం వల్ల, ఈ మార్కెట్‌ను ఆక్రమించడానికి బహుళజాతి సంస్థలు తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నాయి.

అట్లాగే, వినియోగదారుల మనసుల్లో తమ బ్రాండ్ మాత్రమే నిలిచి ఉండేలా చూడాలంటే అన్ని ప్రచార, ప్రసార సాధనాల్లో విపరీతంగా వ్యాపార ప్రకటనలు ఇవ్వవలసి ఉంటుంది. స్థానిక, చిన్న పెట్టుబడిదారుల కన్న బహుళజాతి సంస్థలు, భారీ పెట్టుబడిదారులు ఇటువంటి భారీ వ్యాపార ప్రకటనలు ఇవ్వగలరు. క్రమక్రమంగా మార్కెట్లను విస్తృతం చేసుకోగలరు.

అంతర్జాతీయంగా ఎఫ్.ఎం.సి.జి. మార్కెట్లలో యూనిలివర్, ప్రోక్టర్ అండ్ గాంబిల్,

కోల్గేట్, నెస్లె, హీంజ్, స్మిత్‌క్లైన్ వంటి కొన్ని బహుళజాతి సంస్థలే అత్యధిక మార్కెట్ వాటాలతో రాజ్యం చేస్తున్నాయి. ఈ అన్ని బహుళజాతి సంస్థలు ప్రత్యక్షంగానో, మిలాఖత్తులతోనో భారత మార్కెట్‌లో కూడా సింహభాగాన్ని ఆక్రమించి ఉన్నాయి.

భారత మార్కెట్లలో బహుళజాతి సంస్థల ప్రవేశాన్ని 1947 తర్వాత కూడా ఆమోదించాలని భారత ప్రభుత్వం నిర్ణయించుకుంది. అప్పటికి హిందుస్తాన్ లివర్ (యునిలివర్ మిలాఖత్తు సంస్థ) కు మాత్రం భారతదేశంలో ఉత్పత్తి కేంద్రాలు ఉండేవి. కోల్గేట్, నెజిల్‌లు వ్యాపారం మాత్రం ఉండేవి. 1960లలో ఎన్నో బహుళజాతి సంస్థలు భారత మార్కెట్లో ప్రవేశించి ఉత్పత్తి కేంద్రాలను ఏర్పాటు చేశాయి. అప్పటి చట్టాలను స్వావలంబన విధానం పునాదిగా ఈ బహుళజాతి సంస్థల ప్రవేశం మీద, వ్యాపారం మీద ఆంక్షలు విధించాయి. 1978లో జనతాపార్టీ ప్రభుత్వం బహుళజాతి సంస్థలు భారతీయ ఉత్పత్తి కేంద్రాలలో వాటాను 40 శాతానికన్నా తగ్గించుకోవాలని లేదా దేశం వదిలిపోవాలని ఆదేశించింది. ఐ.బి.ఎం., కోకాకోలా వంటి కంపెనీలు దేశం వదిలి వెళ్లిపోగా, హిందుస్తాన్ లివర్ ఆ ఆంక్షలకు లోబడి కొనసాగింది.

నూతన ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణ ప్రారంభమైన 1991 తర్వాత (నిజానికి 1985 రాజీవ్‌గాంధీ దిగుమతుల సడలింపు నుంచే) భారత ప్రభుత్వం బహుళజాతి సంస్థలకు ఆహ్వానాలు పలకడం, వాటి విస్తరణకు అనుకూలమైన పరిస్థితులు కల్పించడం ప్రారంభించింది. ముఖ్యంగా ఎఫ్.ఎం.సి.జి. రంగంలో అప్పటి వరకూ దిగుమతులను నిరుత్సాహపరచడానికి అమలులో ఉండిన భారీ ఎక్సైజ్ డ్యూటీలను విపరీతంగా తగ్గించడం ప్రారంభించింది.

బట్టలు ఉతికే సబ్బుల మీద, పౌడర్ల మీద ఎక్సైజ్ సుంకాన్ని 1993-94లోని 35 శాతం నుంచి 1998-99 నాటికి 16 శాతం తగ్గించింది. ఈ తగ్గుదల వంటి సబ్బులలో 20 శాతం నుంచి 16 శాతానికి, టూత్‌పేస్టులలో 20 శాతం నుంచి 8 శాతానికి, కాస్మెటిక్స్‌లో 120 శాతం నుంచి 30 శాతానికి జరిగింది.

అప్పటివరకూ ఎఫ్.ఎం.సి.జి. రంగంలో ఉండిన లైసెన్సింగ్ నిబంధనలను కూడా సులభతరం చేసి, స్థానిక, అసంఘటిత ఉత్పత్తిదార్ల మార్కెట్లను బహుళజాతి సంస్థలు కొల్లగొట్టేందుకు రంగం సిద్ధం చేసింది. గ్రామీణ మార్కెట్లలోకి కూడా బహుళజాతి సంస్థలు సులభంగా చొరబడేందుకు వీలుగా ప్రపంచ బ్యాంకు, ఆసియా అభివృద్ధి బ్యాంకు, జపాన్ ఒ.ఇ.సి.ఎఫ్. వంటి సంస్థల నిధులతో పెద్ద ఎత్తున రోడ్ల నిర్మాణ కార్యక్రమాలు చేపట్టింది.

ఇప్పటికీ ఎఫ్.ఎం.సి.జి. రంగంలో బహుళజాతి సంస్థల ప్రవేశానికి కొన్ని ఆటంకాలున్నాయని, వాటిని తొలగించమని బహుళజాతి సంస్థలు, అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు భారత ప్రభుత్వం మీద, రాష్ట్ర ప్రభుత్వాల మీద ఒత్తిడి తెస్తున్నాయి. ప్రజల ఆదాయ స్థితి తక్కువ స్థాయిలో ఉండడం వల్ల కొనుగోలు శక్తి లేదని, అందువల్ల ప్రభుత్వ కార్యక్రమాలు నేరుగా బహుళజాతి సంస్థల సరుకుల పంపిణీకి సహకరించాలని, మార్కెట్లను అభివృద్ధి చేయాలని, తక్కువ ఉత్పత్తి వ్యయంతో తక్కువ ధరలకు అమ్ముతూ తమకు పోటీగా నిలుస్తున్న స్థానిక ఉత్పత్తిదారులను నాణ్యత పేరుతో కట్టడి చేయాలని బహుళజాతి సంస్థలు కోరుతున్నాయి.



దేశంలో మొత్తం యాభై లక్షలకు పైగా చిల్లర దుకాణాలు ఉన్నాయని, ఇంత పెద్ద సంఖ్యలో దుకాణాలు ఉండడం పంపిణీ వ్యవస్థను సంఘటితం చేయడానికి ఆటంకమని, అందువల్ల భారీ సూపర్ మార్కెట్లను ప్రోత్సహించే విధానాలు చేపట్టమని బహుళజాతి సంస్థలు కోరుతున్నాయి. కోల్డ్ స్టోరేజీలు, మంచిరోడ్లు వంటి సాధన సంపత్తి కల్పించడం ద్వారా మార్కెట్లను ఆధునికీకరించాలని కోరుతున్నాయి.

ఈ ఒత్తిడులకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఇప్పటికే తల ఒగ్గుతున్నాయి. అందువల్ల గత పది సంవత్సరాలలో మన మార్కెట్లలో ఎన్నో గణనీయమైన మార్పులు జరిగిపోయాయి. కొత్త కొత్త సరుకులు, మార్కెటింగ్ పద్ధతులు, పంపిణీ పద్ధతులు, సూపర్ మార్కెట్లు, గ్రామీణ మార్కెట్లలో కూడా బ్రాండెడ్ సరుకులు ప్రవేశించాయి. స్థానిక పారిశ్రామిక కేంద్రాలలో తయారు చేసి చిన్న పట్టణాలలో, గ్రామీణ మార్కెట్లలో అమ్ముకునే చిన్న తరహా పారిశ్రామిక సంస్థలు కుప్పకూలి పోయాయి. ఆ సంస్థల కార్మికులు వీధుల్లో పడ్డారు. బహుళజాతి సంస్థల సరుకులు ఎంతటి విశ్వరూపం ప్రదర్శిస్తున్నాయంటే టూత్‌పేస్ట్, పౌడర్, బ్రష్‌ల మార్కెట్‌లో సంఘటిత రంగంలో 85 శాతం అమ్మకాలను కేవలం రెండే బహుళజాతి సంస్థలు – కోల్గేట్, హిందుస్తాన్ లివర్ శాసిస్తున్నాయి.

## 3

నిత్యజీవితంలో బహుళజాతి సంస్థల ప్రవేశాన్ని చొరబాటును, విస్తరణను నిశితంగా అర్థం చేసుకోవాలంటే మనం వాడుతున్న సరుకులనూ, సేవలనూ ఒక్కొక్కటిగా తీసుకుని వాటిలో బహుళజాతి సంస్థల భాగస్వామ్యం ఎంతో అంచనా వేయాలి. కొన్ని సరుకులూ, సేవలూ బహుళజాతి సంస్థలకు సంబంధం లేనివని బయటకు అనిపించినప్పటికీ, వాటి ముడిసరుకు తోనో, సాంకేతిక విధానంతోనో, యాజమాన్యంతోనో, ఆర్థిక వనరులతోనో, పంపిణీతోనో వాటికి బహుళజాతి సంస్థలతో సంబంధం ఉండి ఉంటుంది. ఆ వివరాలను కూడా పరిశీలించినప్పుడే మన జీవితాల మీద బహుళజాతి సంస్థల ప్రభావం పూర్తిగా అర్థమవుతుంది.

ఉదయం లేవగానే పళ్లుతోముకోవడం అనేది భారతీయులందరికీ సర్వ సాధారణమైన అలవాటు. ఆహార పదార్థాలలోని సూక్ష్మక్రిములు పళ్ల సందులలో చేరి నోటి ఆరోగ్యానికీ, తద్వారా మొత్తంగా మనిషి ఆరోగ్యానికీ ప్రమాదకరంగా మారుతాయి గనుక రోజుకు ఒకసారో, రెండుసార్లో పళ్లు తోముకోవాలనేది ఆరోగ్య సూత్రం. ప్రతి సరుకుకూ ఒక ఈ ఉపయోగ విలువ ఉంటుందన్నట్టుగానే పళ్లు తోముకోవడానికి ఉపకరించే సరుకులకూ ప్రాథమికమైన ఉపయోగ విలువ ఉంటుంది.

అయితే పళ్లు తోముకునే పదార్థాలు సరుకుల రూపం ధరించి మారకపు విలువల రూపం ఎత్తి లాభాలు ఆర్జించే సాధనాలు కావడానికి ముందు శతాబ్దాలపాటు మనిషికి ఆ పదార్థాలతో సంబంధం ఉంది. పళ్లు తోముకునే సాధనాలు సమాజానికి మార్కెట్ ద్వారాకాక మార్కెటేతర రూపాలలో అందిన శతాబ్దాల చరిత్ర ఉంది.

పళ్లు తోముకోవడానికి మనుషులు సహజమైన నీటిని వాడుకోవడంతో పాటు ఇంకా ఎక్కువ సమర్థంగా ఉండేందుకు ఔషధ విలువలున్న చెట్ల రెమ్మలను, వేర్లను, చిన్న పొదల కాండాలను, ఆకులను వాడుకున్న, వాడుకుంటున్న సందర్భాలు ఉన్నాయి. నిజానికి బహు ఆడంబరమైన ప్రచారంతో వస్తున్న బహుళజాతి సరుకుల కన్న ఈ సహజ పదార్థాలే ఎక్కువ సమర్థంగా పనిచేశాయి. ప్రకృతికీ, మనిషికీ దూరం పెరిగినకొద్దీ, పట్టణీకరణ పెరిగిన కొద్దీ ఈ సహజ వనరుల లభ్యత, వినియోగం తగ్గిపోయాయి.

క్రమంగా చిన్న పట్టణాలలో, 'నాగరికత' పేరు మీద కొత్త విలువలు ప్రచారంలోకి వచ్చిన ప్రాంతాలలో సహజ దంత ధావన పదార్థాల స్థానాన్ని, మరొక స్థాయి పదార్థాలు ఆక్రమించాయి. ఉప్పు, బొగ్గు, కచ్చిక (కాల్చిన పిడక), ఇటుకపొడి వంటి గరుకుగా, ఉప్పగా, కొంతవరకు ఔషధ లక్షణాలతో ఉండే పదార్థాలు వాడకంలోకి వచ్చాయి. బొగ్గుపొడిని గాని, ఇటుకపొడిలా కనబడే పదార్థాన్ని గాని, ఔషధాలు కలిపి స్థానికంగా ఉత్పత్తిచేసి అమ్మడం ప్రారంభమైంది. ఒక సహజ అవసరం కోసం, ఒక సహజంగా దొరికే వనరును వాడుకోవడం అనే స్థితినుంచి, ఒక సహజ అవసరంకోసం పారిశ్రామికంగా తయారు చేసే సరుకును సరఫరా చేయడం అనే స్థితివచ్చింది. ఇది మన దేశం మొత్తంగా గాని, తెలుగు సమాజంలోనే గాని గత శతాబ్ది మధ్యభాగంలో మొదలై ఏడో, ఎనిమిదో దశకాల కల్లా విస్తరించింది. అంటే దంత ధావన పదార్థాలు సహజమైన స్థితి నుంచి అసహజమైన స్థితికి, సరుకు స్థితికి, పారిశ్రామికస్థితికి ప్రయాణం చేశాయి. మార్కెటేతర సంబంధం నుంచి మార్కెట్ సంబంధానికి పరిణమించాయి.

అప్పటికి కూడా నోటి శుభ్రతా పదార్థాల పరిశ్రమ దేశీయ, స్థానిక పరిశ్రమగానే ఉండింది. ఒక ప్రాంతంలో ఒక ఫారూఖీ దంత మంజన్, మరొక ప్రాంతంలో మరొక గణేశ్ పళ్లపొడి లాగా గుత్త పెట్టుబడికి, ఇబ్బడి ముబ్బడి లాభాలకు అవకాశం లేని స్థానిక పరిశ్రమలే నడుస్తుండేవి. వాటిలో స్థానిక, చిన్న పెట్టుబడిదారుల పెట్టుబడి ఉండడం మాత్రమే కాక, అది వాడే ప్రజలకు ఆ పదార్థాలతో ఎంతో కొంత సాన్నిహిత్యం ఉండేది.

ఈ స్థితిలో గుత్తపెట్టుబడి ఈ స్థానిక, చిన్న మార్కెట్లన్నిటినీ ఏకం చేసి విశాలమైన మార్కెట్లు స్థాపించదలచింది. ఇది కింది నుంచి ప్రజల మధ్య ఏర్పడే ఐక్యత కాదు. పై నుంచి విపరీతమైన లాభాల కోసం విశాలమైన మార్కెట్‌ను కోరుకునే పెట్టుబడిదారీ విధానపు 'వాతాపి జీర్ణం' అనుకునే ఐక్యత. ఈ పెట్టుబడిదారీ లాభాపేక్ష వెనుక కచ్చితమైన లెక్కలే ఉన్నాయి. ఇవాల్టి గణాంకాలను బట్టి అంచనా వేస్తే, వందకోట్ల జనాభాలో పది కోట్ల మంది, వాళ్ల వయసు వల్ల, ఇతరేతర కారణాల వల్ల పళ్లు తోముకోలేని స్థితిలో ఉన్నారనుకున్నా, ప్రతిరోజూ కనీసం ప్రతి మనిషి సగటున రోజుకు ఐదుగ్రాముల పొడిగాని, పేస్టు గాని వాడుతారనుకున్నా రోజుకు 4,500 టన్నుల దంత ధావన పదార్థం అవసరమవుతుంది. నెలకు 1,35,000 టన్నులు, సంవత్సరానికి పదహారు లక్షల టన్నులు అవసరమవుతుంది.

జనాభాలోని మొత్తం తొంభై కోట్ల మందికి ఈ పొడర్లు, పేస్టులు వాడే అలవాటు లేదనుకున్నా, కేవలం మధ్యతరగతికే, అంటే అందులో మూడోవంతైన ముప్ఫైకోట్ల మందికే



ఆ అలవాటు ఉందనుకున్నా, దేశంలో ఆ పొడర్లు, పేస్టుల మార్కెట్ ఐదులక్షల టన్నుల పైచిలుకే. ఇవాళ మార్కెట్‌లో యాభై గ్రాముల పొడరు, పేస్టు ఖరీదు రు. 5–8 మధ్య ఉంది. అంటే దేశంలో ఈ మార్కెట్ విలువ ఎంత తక్కువలో తక్కువ అంచనా వేసినా సాలీనా రు. 5,000 కోట్ల నుంచి రు. 8,000 కోట్లు ఉందన్నమాట.

ఈ మార్కెట్‌లో మరో కిటుకు ఉంది. ఎఫ్.ఎం.సి.జి. రంగంలో పంపిణీ, సరఫరా వ్యవస్థ విస్తృతంగా ఉంటుంది గనుక, ఉత్పత్తిదారు నుంచి చిల్లర వ్యాపారి వరకు కనీసం ఐదు ఆరు అంచెలు ఉంటాయి గనుక, ప్రతి స్థాయిలోనూ లాభం లెక్కవేసుకుంటారు గనుక ఉత్పత్తి వ్యయానికీ, ధరకూ మధ్య చాలా వ్యత్యాసం ఉంటుంది. అంటే 6 రూపాయలకు అమ్మే డబ్బా, ట్యూబ్ ఉత్పత్తి వ్యయం నిజానికి 3 రూపాయల కన్న తక్కువే ఉంటుంది. అంటే రు. 5,000 కోట్ల మార్కెట్‌లో రు. 2,500 కోట్లు మారుబేరగాళ్ల లాభాలకే పోతుంది.

ఇంత విపరీతంగా లాభాలు ఉన్నాయి గనుకనే బహుళజాతి సంస్థల కళ్లు ఈ రంగం మీద పడ్డాయి. ఈ మార్కెట్ మీద సర్వేలు చేయించడం, దంత వైద్యులతో తమ సరుకుల ప్రచారాలు చేయించుకోవడం, అన్ని ప్రచార, ప్రసార సాధనాలలో ఆర్భాటంగా, ఆకర్షణీయంగా తమ సరుకుల గురించి ఊదరగొట్టడం సాగిస్తున్నాయి. స్థానిక పరిశ్రమలను దెబ్బ తీయడానికి, ప్రజల మామూలు అలవాట్లను తప్పుపట్టి వాళ్లను మార్కెటేతర సహజ పదార్థాల వినియోగం నుంచి, తమ సరుకుల వినియోగంలోకి మార్చడానికి బహుళజాతి సంస్థలు ప్రయత్నిస్తున్నాయి.

దేశంలో ఐదు లక్షల టన్నులైనా ఉండవలసిన దంత ధావన పదార్థాల వినియోగంలో సంఘటిత మార్కెట్ లక్ష టన్నుల వినియోగమే ఉందని మార్కెట్ సర్వేలు తెలుపుతున్నాయి. మిగిలిన వినియోగం అసంఘటిత రంగంలో ఉండవచ్చు. ఈ మార్కెట్ సర్వేల పరిభాషలో సంఘటిత మార్కెట్ అంటే బహుళజాతి సంస్థలు, దేశవ్యాప్త గుత్త సంస్థలు. అసంఘటిత మార్కెట్ అంటే స్థానిక, చిన్న పారిశ్రామిక సంస్థలు.

మార్కెట్ సర్వేల ప్రకారం సంఘటిత రంగంలోని పారిశ్రామిక సంస్థలు ఏడు – అవి, కోల్గేట్ పామోలివ్ ఇండియా లిమిటెడ్, హిందుస్తాన్ లివర్ లిమిటెడ్, బల్సారా హైజీన్ లిమిటెడ్, డాబర్ ఇండియా లిమిటెడ్, స్మిత్‌క్లైన్ బీచమ్ కన్స్యూమర్ హెల్త్‌కేర్, ఆంకర్ హెల్త్ అండ్ బ్యూటీ ప్రాడక్ట్స్, వికో లాబరేటరీస్, ఇవికాక జెఫ్రీ మానర్స్, హిందుస్తాన్ సీబా – గెయిగి వంటి మరికొన్ని సంస్థలు కూడా ఉన్నాయి.

సంఘటిత రంగంలోని టూత్‌పేస్ట్ మార్కెట్‌లో 85 శాతం మొదటి రెండు సంస్థలు – కోల్గేట్ పామోలివ్, హిందుస్తాన్ లివర్ – గుప్పిట్లోనే ఉంది. ఈ రెండు సంస్థలూ బహుళజాతి సంస్థలే. సంఘటిత రంగంలోని టూత్‌పొడర్ మార్కెట్లో 75 శాతం కోల్గేట్, డాబర్ సంస్థల చేతుల్లోనే ఉంది. వీటిలో డాబర్ స్వదేశీ సంస్థే అయినప్పటికీ సాంకేతిక విధానం కోసం, పంపిణీ కోసం బహుళజాతి సంస్థలతో మిలాఖత్తు కావడానికి ఉవ్విళ్లూరుతోంది.

కోల్గేట్ పామోలివ్ ఈ మార్కెట్‌లో అగ్రభాగాన ఉంది గనుక దాని గురించి వివరంగా తెలుసుకోవడం అవసరం.

కోల్గేట్ సంస్థను 1806లో అమెరికాలో ప్రారంభించారు. దాదాపు మొదటి వంద సంవత్సరాలు ఆ సంస్థ అమెరికాలో మాత్రమే వ్యాపారం చేసింది. గత శతాబ్దం తొలిరోజుల నుంచి విదేశీ వ్యాపారాలు ప్రారంభించి, ఇవాళ రెండు వందలకు పైగా దేశాలలో తన సరుకులు అమ్ముతోంది. కోల్గేట్, పామోలివ్, అజాక్స్, ఫాబ్, మెన్నెన్ లాంటి ఎన్నో ప్రపంచవ్యాప్తమైన బ్రాండ్లతో, నోటి పరిశుభ్రతా సరుకుల మార్కెట్లోనే కాక ఇతర ఎఫ్.ఎం.సి.జి. మార్కెట్లలో కూడా అగ్రస్థానంలో ఉంది. ఈ సంస్థ అమ్మకాల విలువ సాలీనా దాదాపు యాభై వేల కోట్ల రూపాయలు.

ఈ సంస్థ భారతదేశంలో వ్యాపారాన్ని 1937లో కోల్గేట్ డెంటల్ క్రీమ్ అనే టూత్‌పేస్ట్‌తో ప్రారంభించింది. అప్పుడు ఈ సంస్థ స్థాపక పెట్టుబడి రు. 1,50,000 మాత్రమే. ఈ పెట్టుబడికి గాను, ఎన్నో రెట్ల లాభాన్ని ఈ సంస్థ అమెరికాకు తరలించుకుపోయింది. 1975 నాటికి భారతదేశం నుంచి అమెరికాకు లాభాల వాటా రూపంలోనే రు. 5 కోట్లు తరలిపోయాయి. 1978లో జనతాపార్టీ ప్రభుత్వం మిగిలిన అన్ని బహుళజాతి సంస్థల మీద ఆంక్షలు విధించినట్టుగానే, కోల్గేట్ మీద కూడా ఆంక్షలు విధించింది. విదేశీ వాటాను 51 శాతం నుంచి 40 శాతానికి తగ్గించుకొమ్మని కోరింది. మళ్లీ 1993లో మాతృసంస్థ అమెరికాలోని బహుళజాతి సంస్థ రు. 230 కోట్ల లాభం చేసుకుంది. కేవలం 1998-99లోనే కోల్గేట్ పామోలివ్ ఇండియా మొత్తం అమ్మకాలు రు. 998 కోట్లు కాగా, లాభం రూ. 250 కోట్లు పై చిలుకు.

తాజా గణాంకాల ప్రకారం కోల్గేట్ పామోలివ్‌కు టూత్‌పేస్టుల మార్కెట్లో 52 శాతం, టూత్‌పౌడర్ల మార్కెట్లో 48 శాతం, టూత్‌బ్రష్‌ల మార్కెట్లో 36 శాతం వాటా ఉంది. అంటే ప్రతి రెండో మనిషి వాడే టూత్‌పేస్టు వల్ల, టూత్‌పౌడర్ వల్ల, ప్రతి మూడో మనిషి వాడే టూత్ బ్రష్ వల్ల ఆ మనుషుల నోటి ఆరోగ్యాలు బాగుపడుతున్నాయో లేదో తెలియదు గాని, కోల్గేట్ పామోలివ్ కంపెనీకి అదనపు లాభాలు మాత్రం చేకూరుతున్నాయి.

కోల్గేట్ పామోలివ్‌కు దంత ధావన పదార్థాలతో పాటు వంటి సబ్బులు, షాంపూలు, చర్మపు క్రీములు, షేవింగ్ క్రీములు, ఆఫ్టర్ షేవ్ లోషన్లు, పాత్రలు కడిగే పేస్టులు వంటి ఇతర వ్యాపారాలు కూడా ఉన్నాయి.

హిందుస్తాన్ లివర్ తదితర బహుళజాతి సంస్థల గురించి ఇతర నిత్య జీవితావసరాల సందర్భంలో చర్చించుకుందాం.

## 4

మన జీవితంలో బహుశా అన్నిటికన్నా ఎక్కువగా బహుళజాతి సంస్థలు ఎదురుపడే రంగం సబ్బుల రంగం. శరీర శుభ్రతకు ఉపయోగించే ఒంటి సబ్బులు గాని, షాంపూలు గాని, దుస్తుల శుభ్రతకు ఉపయోగించే బట్టల సబ్బులు గాని, పౌడర్లు గాని అత్యధిక భాగం బహుళజాతి సంస్థల ఉత్పత్తులే. మారుమూల గ్రామీణ ప్రాంతాల కిరాణా దుకాణాలలోకి కూడా ఈ సబ్బుల రూపంలో బహుళజాతి సంస్థలు ప్రవేశించాయి.



శరీర శుభ్రతకూ, బట్టల శుభ్రతకూ అవసరమైన పదార్థాలను వాడడం మనకేమీ కొత్తకాదు. ఆ పదార్థాల తయారీలో అతి క్లిష్టమైన విదేశాల నుంచి దిగుమతి చేసుకోవలసిన సాంకేతిక పరిజ్ఞానం కూడా ఏమీలేదు. కాని బ్రిటిష్ వలస పాలన కాలంలో కేవలం మన సంపదను దోచుకుపోయే మార్గంగా మొదలైన ఈ బహుళజాతి సంస్థల సబ్బుల వ్యాపారం ఇవాళ దేశవ్యాప్తంగా పది, పదిహేను వేల కోట్ల రూపాయల పరిశ్రమగా ఎదిగిపోయింది. ఇబ్బడిముబ్బడిగా లాభాలు పండే ఈ రంగం ప్రధానంగా బహుళజాతి సంస్థల చేతుల్లోనే ఉంది.

మన శీతోష్ణస్థితి వల్ల, వాతావరణం వల్ల మనం శరీర శుభ్రత గురించి, దుస్తుల శుభ్రత గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకోవలసి ఉంటుంది. అందువల్లనే మన సంస్కృతిలో శరీరాన్ని, దుస్తులను పరిశుభ్రం చేసే పదార్థాల గురించి, సాంకేతిక విధానాల గురించి ఆలోచన మొదటి నుంచీ ఉంది. బంకమన్ను, ఆకులు, చెట్ల బెరళ్లు, సున్నిపిండి వంటి మౌలిక పదార్థాలు, ఔషధ తైలాల వంటి తయారు చేసిన పదార్థాల వంటివెన్నో ఎన్నోతరాల ప్రయోగాల తర్వాత కనిపెట్టబడ్డాయి. అట్లాగే బట్టల పరిశుభ్రతకు సోడియం పేరుకునే చవుడును వాడడంతో సహా అనేక పద్ధతులను మన సమాజం, ముఖ్యంగా చేతివృత్తుల కులాలు కనిపెట్టాయి.

క్రమక్రమంగా ఒంటి సబ్బులలోకి జంతువుల కొవ్వు, తైలాలు, క్షార పదార్థాలను కలిపి బిళ్లలుగా చేసే విధానం వచ్చింది. ఆ తర్వాత జంతువుల కొవ్వు స్థానంలో వృక్షజాతుల నుంచి సేకరించిన కొవ్వుకు సమానమైన జిగురు వాడకం వచ్చింది. అట్లాగే బట్టల సబ్బుల తయారీలో రసాయనిక పదార్థాల వాడకం పెరిగింది.

ఈ సాంకేతిక విధానాలు వేరు వేరు దేశాలలో అభివృద్ధి చెందినప్పటికీ వీటిలో ఇతరులు నేర్చుకోవడానికి వీలు లేనంత సంక్లిష్టత ఏమీ లేదు. పైగా సబ్బుల తయారీలో వాడే ముడిసరుకులు ప్రపంచంలో అన్ని చోట్లా దొరికేవే. మరీ ముఖ్యంగా కాయగూరల నుంచి, సుగంధ మొక్కల నుంచి, పూల నుంచి సంగ్రహించే తైలాలు, సోడా ఉప్పు తదితర రసాయనాలు భారతదేశంలో విస్తారంగా లభించేవే. కనుక సబ్బుల తయారీలో అటు సాంకేతిక విధానం కోసం గాని, ఇటు ముడిసరుకుల కోసం గాని భారత ఆర్థిక వ్యవస్థ విదేశీ, బహుళజాతి సంస్థల మీద ఆధార పడవలసిన అవసరమేమీ లేదు.

కాని ఒంటి సబ్బుల, బట్టల సబ్బుల విషయంలో భారతదేశపు మార్కెట్ ప్రపంచంలోనే అతిపెద్ద మార్కెట్. దేశవ్యాప్తంగా సాలీనా 6 లక్షల టన్నుల ఒంటి సబ్బులు, 30 లక్షల టన్నుల బట్టల సబ్బులు, పౌడర్లు వాడకమవుతున్నాయని ఒక అంచనా. వీటి విలువ ఒంటి సబ్బుల విషయంలో ఐదువేల కోట్ల రూపాయలు కాగా, బట్టల సబ్బుల, పౌడర్ల విషయంలో మరొక ఐదు వేల కోట్ల రూపాయలు ఉంటుంది.

అయితే ఈ లెక్కలు కేవలం సంఘటిత రంగానికి సంబంధించినవి మాత్రమే. సంఘటిత రంగంలో కూడా తీవ్రమైన వ్యాపార పోటీ వల్ల గణాంకాలు ఉజ్జాయింపుగా చెప్పేవే గాని కచ్చితమైన స్థితికి అద్దం పట్టేవి కావు. ఇప్పటికీ గ్రామీణ ప్రాంతాల్లో, మారుమూల ప్రాంతాల్లో

ఎంతో కొంత అసంఘటిత రంగం, స్థానిక చిన్న పారిశ్రామికవేత్తల ఉత్పత్తులు పనిచేస్తుండడం వల్ల దేశపు సబ్బుల వ్యాపారాన్ని నిర్దుష్టంగా అంచనా వేయడం సాధ్యం కాదు.

దేశంలో ఒంటి సబ్బుల వ్యాపారం పరిమాణం రీత్యా 7-8 శాతం పెరుగుదలతో, విలువ రీత్యా 15 శాతం పెరుగుదలతో ఉందని 1999 నాటి అంచనాలు తెలుపుతున్నాయి. పరిమాణం పెరుగుదలకూ విలువ పెరుగుదలకూ మధ్య ఇంత వ్యత్యాసం ఉందంటే, సబ్బుల ధరలు విపరీతంగా పెరుగుతున్నాయని అర్థం. దీనికి వ్యాపారవేత్తలు చెప్పే సమాధానం ఇటీవలి కాలంలో మధ్యరకం, ఖరీదైన సబ్బులకు వేరు వేరు ఎక్సైజ్ పన్నులుండేవి. అందువల్ల చౌకరకం సబ్బుల మార్కెట్ విస్తారంగా ఉండేది. నూతన ఆర్థిక విధానాలలో భాగంగా 1993లో ఈ పన్నుల తేడాను తొలగించడంతో మధ్యరకం, ఖరీదైన సబ్బుల వ్యాపారం పెరిగిపోయింది.

ఒంటి సబ్బుల మార్కెట్‌లో ప్రధానమైన వ్యాపార సంస్థలు హిందుస్తాన్ లివర్ లిమిటెడ్, నిర్మా, గోద్రెజ్ సోప్స్ లిమిటెడ్, ప్రాక్టర్ అండ్ గాంబిల్, జాన్సన్ అండ్ జాన్సన్, రెకిల్ అండ్ కాల్‌మన్, పార్క్ డేవిస్, టాటా, విప్రో.

వీటిలో నిర్మా మినహా మరే సంస్థనీ స్వదేశీ సంస్థగా చెప్పడానికి వీలులేదు. గోద్రెజ్ సోప్స్, టాటాలు స్వదేశీ సంస్థలుగానే ప్రారంభమైనప్పటికీ, విదేశీ, బహుళజాతి సంస్థలతో ఏదో ఒకరకమైన ఒప్పందాల ద్వారా బహుళజాతి సంస్థల వ్యాపారవలయంలో భాగమైపోయాయి. వీటిలో గోద్రెజ్ సోప్స్ ప్రాక్టర్ అండ్ గాంబిల్‌తోనూ, టాటా హిందుస్తాన్ లివర్‌తోనూ కలిసిపోయాయి.

అయితే ఒంటి సబ్బుల తయారీలో పేరుకు డజను దాకా సంస్థలు ఉన్నప్పటికీ మొత్తం మార్కెట్‌లో 72 శాతం హిందుస్తాన్ లివర్ చేతుల్లోనే ఉంది.

ఒంటి సబ్బుల స్థానంలో ద్రవరూపం వంటి సబ్బు వాడకం కూడా ఈ మధ్యనే ప్రారంభమైంది. పన్నెండు వందల టన్నుల వినియోగంతో రు. 24 కోట్ల వ్యాపారంగా ఉన్న ఈ రంగం మొత్తంగా హిందుస్తాన్ లివర్, రెకిట్ కోల్‌మన్ వంటి బహుళజాతి సంస్థల చేతుల్లోనే ఉంది.

ఇక బట్టల సబ్బుల విషయానికొస్తే, దేశంలో 20 శాతం వినియోగ అవసరాలను స్థానిక, చిన్న పారిశ్రామిక సంస్థల, అసంఘటిత రంగమే తీరుస్తోంది. సంఘటిత రంగంలో ప్రధాన వ్యాపార సంస్థలు హిందుస్తాన్ లివర్, నిర్మా, ప్రాక్టర్ అండ్ గాంబిల్, హెంకెల్ స్పిక్, గోద్రెజ్ సోప్స్, విప్రో.

ఈ రంగంలో కూడా పేరుకు అరడజనుకు పైగా ఉత్పత్తిదారులు ఉన్నప్పటికీ 28 శాతం మార్కెట్, 47 శాతం ఆదాయం ఒక్క హిందుస్తాన్ లివర్ లిమిటెడ్ చేతుల్లోనే ఉంది. 1980లలో ప్రవేశించిన దేశీయ సంస్థ నిర్మా, హిందుస్తాన్ లివర్‌తో పోటీ పడుతూ బట్టల సబ్బుల మార్కెట్‌లో రెండో స్థానానికి చేరింది గాని ఏటేటా ఈ రెండు సంస్థల మధ్య నువ్వా నేనా అనేంత తీవ్రమైన పోటీ కొనసాగుతోంది. నిర్మాకు దేశీయ మార్కెట్‌లో 25 శాతం వాటా ఉండగా మార్కెట్ విలువలో మాత్రం 28 శాతం వాటా ఉంది. అంటే పరిమాణంలో 3 శాతం తేడా విలువలో 20 శాతం తేడాగా మారింది. దీనర్థం బహుళజాతి సంస్థతో దేశీయ సంస్థ పోటీ పడే సందర్భంలో కూడా అది ఆర్జించగలిగే ఆదాయం చాలా తక్కువగా ఉంది.



1950ల్లో బట్టల సబ్బుల మార్కెట్లోకి బహుళజాతి సంస్థల ప్రవేశం విపరీతంగా పెరిగింది. స్థానిక చిన్న ఉత్పత్తిదార్లను కొనివేస్తూ వాళ్ల మార్కెట్లను దెబ్బతీసి వాళ్లను దివాళా తీయిస్తూ క్రమక్రమంగా ఈ బహుళజాతి సంస్థలు దేశీయ మార్కెట్లో 60 శాతం పైగా ఆక్రమించుకోగలిగాయి. అయినప్పటికీ దేశ తలసరి బట్టల సబ్బుల వినియోగం ఇతర దేశాలతో పోలిస్తే చాలా తక్కువ. మలేషియా, ఫిలిప్పైన్స్‌లలో సగటు వార్షిక వినియోగం 3.7 కిలోలు, తైవాన్‌లో 4 కిలోలు, అమెరికాలో 10 కిలోలు కాగా భారత్‌లో అది 3.2 కిలోలు మాత్రమే. అంటే ఒక్క కిలో సగటు వినియోగం పెరిగినా లక్ష టన్నుల మార్కెట్ పెరుగుతుంది.

సబ్బులు గాని, పౌడర్ గాని స్థానిక చిన్న ఉత్పత్తిదారులు పదిహేను రూపాయలకు కిలో అమ్మగలుగుతుండగా బహుళజాతి సంస్థలు, స్వదేశీ గుత్త సంస్థలు 60 రూపాయల నుంచి 150 రూపాయలకు అమ్ముతున్నాయి. ఈ లెక్కన ఉన్న మార్కెట్‌లోనే విపరీతమైన లాభాలకు అవకాశం ఉంది. పోటీదార్లను దెబ్బతీసి తమ మార్కెట్ పెంచుకున్నా, అసంఘటిత రంగంలోని వినియోగదార్లను తమ చేతుల్లోకి తెచ్చుకున్నా, కొత్త మార్కెట్ సృష్టించుకోగలిగినా ఈ సబ్బుల తయారీదార్లకు లాభాల పంట ఇంకా ఇనుమడిస్తుంది.

అందుకే బహుళజాతి సంస్థలన్నీ ఇటు ఒంటి సబ్బుల మార్కెట్‌లోను, అటు బట్టల సబ్బుల, డిటర్జెంట్ పౌడర్‌ల మార్కెట్‌లోను ఈ మూడు రకాల చర్యలకు పూనుకుంటున్నాయి.

మొదటిదిగా స్థానిక చిన్న ఉత్పత్తిదార్లను దెబ్బతీసేందుకు చిన్న పట్టణాల మార్కెట్లలోకి, గ్రామీణ మార్కెట్లలోకి బహుళజాతి సంస్థలు దూకుడుగా వస్తున్నాయి. గ్రామీణ మార్కెట్లకు అవసరమైన చిన్న పరిమాణపు సబ్బులను, పౌడర్ ప్యాకెట్లను విడుదల చేయడం, గ్రామీణ ప్రాంతాల వ్యాపారస్తులకు ఎక్కువ కమిషన్లు, ప్రోత్సాహకాలు ఇవ్వడం, మారుమూల ప్రాంతాలకు కూడా నిరంతర సరఫరా ఉండేటట్లు గోడౌన్లు ఏర్పాటు చేసుకోవడం వంటి పనులు చేస్తున్నాయి. అంతర్జాతీయ ద్రవ్య సంస్థల చేత స్థానిక ప్రభుత్వాలకు అప్పులిచ్చేటప్పుడు గ్రామీణ ప్రాంతాలకు మంచి రోడ్ల సౌకర్యం కల్పించమనే షరతుపెట్టి తమ సరుకుల నిరంతర సరఫరాకు ఏర్పాటు చేసుకుంటున్నాయి. ఆంధ్రప్రదేశ్‌నే ఉదాహరణగా తీసుకుంటే రాష్ట్ర ప్రభుత్వంతో మిలాఖతై హిందుస్తాన్ లివర్ సంస్థ తమ సరుకులను డ్వాక్రా గ్రూపుల చేత అమ్మించే ఒప్పందం చేసుకుంది.

దీనివల్ల మారుమూల గ్రామీణ ప్రాంతాల ప్రజలకు కూడా 'నాణ్యమైన సరుకులు అందుతాయనే' ఒక భ్రమ ప్రచారంలో ఉంది. ఈ భ్రమలోని నిజానిజాలను మరొకసారి చర్చిద్దాం గాని ఈ బహుళజాతి సంస్థల సరుకుల చొరబాటు వల్ల గ్రామాల్లో, చిన్న పట్టణాల్లో జరుగుతున్న మార్పు ఏమంటే స్థానిక జిల్లా పారిశ్రామిక కేంద్రాలలో గాని, ఇతరంగా గాని చిన్న చిన్న పారిశ్రామికవేత్తలు సహకారరంగంలో ఏర్పాటు చేసుకున్న సబ్బుల కార్ఖానాలు మూతబడిపోతాయి. అంటే ప్రజలకు తక్కువ ధరకు దొరుకుతున్న ఈ సరుకులు అందకుండా పోతాయి. ఆ కార్ఖానాల్లో పనిచేస్తున్న కార్మికులు ఉపాధి కోల్పోతారు. అంత గొప్ప సంక్లిష్టమైన

సాంకేతిక విధానమేమీ కానప్పటికీ కొత్త సాంకేతిక విధానంలో తమకు తెలియని, తాము అర్థం చేసుకోలేని వ్యాపార చక్రంలోని సరుకులను హెచ్చు ధరలకు ప్రజలు కొనుక్కోవలసిన స్థితి వస్తుంది.

ఇది ఆర్థిక వ్యవస్థ మీద ప్రభావం వేయడం మాత్రమే కాక సామాజిక జీవనం మీద కూడా ప్రభావం వేస్తుంది.

రెండో స్థాయిలో పోటీదార్లను దెబ్బతీయడానికి ఉత్పత్తిదార్ల మధ్య జరిగే పోరాటంలో 'ఆంబోతుల పోట్లాటలో లేగల కాళ్లు విరిగినట్లు' ప్రజాజీవితం కల్లోలానికి గురవుతుంది. ఒక ఉదాహరణ చెప్పాలంటే కేవలం సబ్బుల పరిశ్రమలో పోటీదార్ల మార్కెట్‌ను ఆక్రమించుకోవడానికి ప్రతి సంస్థ చేసే కుటిల ప్రయత్నాలలో భాగమైన వ్యాపార ప్రకటనల మీద కనీసపక్షం 1500 కోట్ల రూపాయలు వ్యయం అవుతున్నాయి. కడుపు నిండుతుందా, కాలు నిండుతుందా? కేవలం తమ సరుకులు కొనేలా ఆకర్షించడానికి తప్ప మరెందుకూ ఉపయోగపడని వ్యాపార ప్రకటనల మీద ఇంత భారీ ఎత్తున ప్రజాధనం దుర్వినియోగం అవుతోంది. ఈ ప్రకటనల మీద వ్యర్థం అయ్యే లేదా తమ సరుకులను ఎక్కువగా అమ్మడానికి వ్యాపార నిచ్చెనలో ఒక్కొక్క స్థాయికి ఇచ్చే కమిషన్లకు అవసరం అయ్యే వేలాది కోట్ల రూపాయలను ఈ సరుకుల ధరల్లోనే భాగం చేశారు. అందువల్లనే రెండు రూపాయలకు మించని ఉత్పత్తి వ్యయంతో తయారయ్యే సబ్బులను 10 రూపాయలకు, 10 రూపాయల ఉత్పత్తి వ్యయంతో తయారయ్యే బట్టల పౌడర్లను 60 రూపాయలకు పైగా అమ్ముతున్నారు.

ఇక్కడి నుంచి మూడోస్థాయికి వెళితే వ్యాపార ప్రకటనలను పోటీదార్లను దెబ్బతీయడమే కాక కొత్త మార్కెట్లను సృష్టించడానికి, ఆక్రమించడానికి కూడా వాడుతున్నారు. ఇప్పటివరకు ఒంటి సబ్బుల, బట్టల సబ్బుల అవసరం లేకుండా బతికిన ప్రజా సమూహాలకు వాటిని మప్పేందుకు ఈ ప్రకటనలను వాడుకుంటున్నారు. ఈ సరుకుల ఖరీదు ఎక్కువని, అందువల్ల తాము వాడలేమని దూరంగా ఉన్న ప్రజాసమూహాలను ఆకర్షించి మభ్యపెట్టేందుకు చిన్న చిన్న ప్యాకేజీల్లో 25 గ్రాముల సబ్బులు, 10 గ్రాముల సబ్బులు, 25 గ్రాముల పౌడర్లు, రూపాయికి పౌడర్ ప్యాకెట్లు వంటి కొత్త ఎత్తుగడలు పన్నుతున్నారు. వీటివల్ల ఏమాత్రం కొత్త మార్కెట్ ఏర్పడినా అది పూర్తిగా తమ గుప్పిట్లోనే ఉంటుందని ఆశపడుతున్నారు.

మొత్తం మీద మన శరీరం, మన బట్టలు, మన శరీర, బట్టల శుభ్రత బహుళజాతి సంస్థల కుట్రలకు, వ్యాపారానికి, పోరాటాలకు రంగస్థలాలయ్యాయి. మూడువేల కోట్ల రూపాయల వార్షిక ఆదాయంతో అందులో కనీసం నాలుగోవంతు లాభాలతో హిందుస్తాన్ లివర్ నిజంగా అందిస్తున్న సరుకులు, సేవలు మన మురికిని వదలగొట్టడానికి కాదు. దీని ప్రధాన లక్ష్యం మన మురికిని రూపాయల్లోకి మార్చుకోవడం. ఆ క్రమంలో మన మురికి కూడా వదులుతుండవచ్చు గాని ఆ పనికోసం మనం ఒక విదేశీ సంస్థ మీద ఆధారపడి దానికి వేల కోట్లు దోచిపెట్టనక్కరలేదు.



## 5

బహుళజాతి సంస్థల సరుకుల అమ్మకాలకు ఎప్పుడూ లక్ష్యంగా అమాయకులు, సులభంగా ఆకర్షణలకు లోనయ్యేవారు, ప్రచార ఆర్భాటానికి మైమరిచిపోయేవాళ్లు ప్రధానంగా ఉంటారు. నిత్యజీవితావసర సరుకుల మార్కెట్లను శాసించడం ఒక ఎత్తైతే, అవసరమే లేని సరుకులను సృష్టించి ఇటువంటి వర్గాలకు చేరవేసి లాభాలను గడించడం మరో ఎత్తు. అందుకే బహుళజాతి సంస్థల ప్రధాన కార్యక్షేత్రాలలో పిల్లలకు అవసరం అయినవి, అవసరమైనవని భ్రమ కల్పించేవి ఉత్పత్తి చేయడం ముఖ్యాంశం. ఇటీవలి కాలంలో ఇబ్బడిముబ్బడిగా పెరిగిన పిల్లల వస్తువుల దుకాణాలు, వాటిలో పాలసీసాల నుంచి పొత్తిళ్ల నుంచి దుస్తుల వరకు కంప్యూటర్ గేమ్స్ వరకు పిల్లలను లక్ష్యంగా పెట్టుకున్న బహుళజాతి సంస్థల సరుకులు కోకొల్లలు. పిల్లల పెంపకం బాల్య కౌమార దశల్లో అవసరమయ్యే వస్తువులు ఏ సమాజానికీ కొత్తగా పరిచయం చేయనక్కరలేదు. తరతరాలుగా మానవ సమాజం పిల్లల పోషణకు సంబంధించిన జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకుంటూ వస్తోంది. కాని ఇప్పుడు హఠాత్తుగా బహుళజాతి సంస్థలు ఆ జ్ఞానాన్నంతా తోసిరాజని తమకు తెలిసినదే, తమ సరుకుల అమ్మకాలకు సహకరించేదే జ్ఞానమని ప్రవచిస్తున్నారు. పిల్లలు ఎటువంటి పాలు, ఆహారం తీసుకుంటే సరైన పోషణ పొందుతారో దగ్గరనుంచి ఎటువంటి దుస్తులు వేసుకోవాలో, ఎటువంటి ఆటలు ఆడాలో బహుళజాతి సంస్థలు నిర్దేశిస్తున్నాయి.

భారతదేశం విషయానికొస్తే అధికారిక గణాంకాల ప్రకారమే దేశవ్యాప్తంగా పిల్లల సంఖ్య దాదాపు 20 కోట్లు. వారిలో కనీసం రెండుకోట్ల మంది పిల్లల తల్లిదండ్రులకు కొనుగోలు శక్తి ఉన్నదని అంచనా వేసినా ఇది సువిశాలమైన మార్కెట్. బహుశా ప్రపంచంలో ఏ దేశంలోనూ లేనంత పెద్ద మార్కెట్. అందువల్ల ఈ మార్కెట్‌లో ప్రవేశించడానికి, విస్తరించడానికి బహుళజాతి సంస్థలు తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నాయి.

నిజానికి వాళ్లు అటువంటి తీవ్ర ప్రయత్నాలు ఏమీ చేయనవసరం లేదు. సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక కారణాలు వాళ్ల ప్రవేశానికి రంగం సిద్ధం చేస్తున్నాయి.

పిల్లల పట్ల తల్లిదండ్రుల శ్రద్ధాసక్తులు, పిల్లల పోషణ గురించి తల్లిదండ్రులకు ఉండే జాగ్రత్త ఎవరు ఎటువంటి సరుకునందచేసినా తీసుకోవడానికి వీలుకల్పిస్తాయి. అట్లాగే పిల్లలకు అవసరం అయిన వస్తువుల విషయంలో ధర గురించి తల్లిదండ్రులు ఎక్కువ ఆలోచించని పరిస్థితి ఉంటుంది. తమ అవసరాలు, ఇతర ఖర్చులు తగ్గించుకొని అయినా పిల్లల అవసరాలు చూడాలని తల్లిదండ్రులు అనుకోవడం వల్ల పిల్లల వస్తువుల మార్కెట్ ఎప్పుడూ లాభసాటిగా ఉంటుంది. ఉత్పత్తి వ్యయానికీ, ధరకూ మధ్య ఎంత అంతరం ఉన్నా ప్రతిఘటనలేని స్థితి ఉంటుంది. ఈ కారణాలన్నింటికి తోడు పిల్లల వస్తువుల గురించి పిల్లల సాయంతోనే వ్యాపార ప్రకటనలిప్పిస్తే అవి పిల్లల మీద తీవ్రమైన ప్రభావాన్ని చూపుతాయి. ఆ వస్తువులు కావాలని తల్లిదండ్రుల మీద పిల్లలు పెట్టే డిమాండు పెరిగిపోతుంది. వీటన్నింటికి తోడు పిల్లల వస్తువులు తయారుచేసే బహుళజాతి సంస్థలు చాలా దేశాల ప్రభుత్వాల కన్నా సంపన్నమైనవి,

శక్తిమంతమైనవి గనుక అవి ఆయా దేశాల రాజకీయార్థిక విధానాలను తమకు అనుగుణంగా మార్చుకోగలుగుతాయి.

ఈసారి పిల్లల వస్తువుల్లో ముఖ్యమైన పోషకాహార పదార్థాల మార్కెట్‌ను చూద్దాం. తల్లిపాలకు ప్రత్యామ్నాయాలు, పాలలో కలిపే పొడులు, పోషకపదార్థాల సమ్మేళనాలు వంటి ఎన్నో సరుకులు ఇవాళ మార్కెట్‌లో దొరుకుతున్నాయి. వీటిని మార్కెట్ పరిభాషలో ఆరోగ్య పానీయాల మార్కెట్ అంటారు. ఒక అంచనా ప్రకారం దేశంలోని మొత్తం ఆహార పదార్థాల వినియోగంలో ఈ మార్కెట్ ఇవాళ ఒక్క శాతంగా ఉంది. అంటే ఈ మార్కెట్ విస్తరించడానికి చాలా అవకాశాలు ఉన్నాయని, ఆరోగ్య పానీయాల వ్యాపారం వందల కోట్ల రూపాయలు విస్తరించడానికి అవకాశాలు ఉన్నాయని మార్కెట్ సర్వేలు తెలుపుతున్నాయి. ఈ ఉత్పత్తుల్లో హార్లిక్స్, బూస్ట్, వివా, మాల్టోవా, బోర్న్‌విటా, మిలో, కాంప్లాన్ వంటివెన్నో ఉన్నాయి. మరోవైపు తల్లిపాలకు ప్రత్యామ్నాయంగా సెరిలాక్, ఫారెక్స్, లాక్టోజెన్ లాంటి బహుళజాతి సంస్థల ఉత్పత్తులు, అమూల్ వంటి స్వదేశీ సహకారరంగ ఉత్పత్తి మార్కెట్‌లో ఉన్నాయి. తల్లిపాల ప్రత్యామ్నాయాలను పక్కనపెడితే ఇతర ఆరోగ్య పానీయాల మార్కెట్ తొంభైశాతం బహుళజాతి సంస్థల చేతిలో ఉంది. స్మిత్‌క్లైమ్ బీచమ్ (హార్లిక్స్, బూస్ట్, వివా, మాల్టోవా ఉత్పత్తిదారు) 70 శాతం మార్కెట్‌ను ఆక్రమించగా, క్యాడ్‌బరీ (బోర్న్‌విటా), హీన్జ్ (కాంప్లాన్) చేతుల్లో చెరి పన్నెండు శాతం మార్కెట్ నెస్లె (మిలో) చేతుల్లో మూడుశాతం మార్కెట్ ఉందని ఒక అంచనా.

దేశంలో మొత్తం మార్కెట్ సైజ్ సాలీనా 82 వేల టన్నులు. ఒక శిశువుకు నెలకు ఒక డబ్బా లేదా సీసా అవసరం అనుకుంటే మార్కెట్‌లో 200 గ్రాముల / మిలీ సీసా 50 రూపాయల నుంచి 120 రూపాయల వరకు ఉంది. ఈ లెక్కన మొత్తం మార్కెట్ ఖరీదు రెండు వేల కోట్ల రూపాయల నుంచి నాలుగు వేల కోట్ల రూపాయల వరకు ఉంటుంది. ముందే చెప్పినట్లు ఈ సరుకులలో లాభాల రేటు చాలా ఎక్కువ గనుక లాభం కనీసపక్షం రు. 500 కోట్ల పైచిలుకే. అతితక్కువ శ్రమతో, మార్కెటింగ్ ప్రయత్నాలతో ఇంత విస్తృతమైన లాభాలు సంపాదించే అవకాశం ఉంది గనుక బహుళజాతి సంస్థలు ఈ రంగం మీద చాలా శ్రద్ధ చూపుతున్నాయి. అమూల్ లాంటి స్థానిక ఉత్పత్తులను దెబ్బతీయడానికి, తమ మార్కెట్ ఆధిపత్యాన్ని విస్తరించుకోవడానికి అన్ని రకాల కుటిల ప్రయత్నాలకు, ఆకర్షణీయమైన వ్యాపార ప్రకటనలకు పూనుకుంటున్నాయి. ఇవాళ ఏ టెలివిజన్ ఛానల్ చూసినా అతి ఎక్కువ ప్రకటనలు ఈ ఆరోగ్య పానీయాల గురించే కనబడుతాయి. క్రికెట్ క్రీడాకారుడు సచిన్ టెండూల్కర్ తన విజయ రహస్యం బూస్టేనని చెబుతాడు. పిల్లవాడు సరిగ్గా ఎదగడానికి కాంప్లాన్ కారణమని మరో ప్రకటన చెబుతుంది. ఇటువంటి ప్రకటనల ద్వారా పిల్లల లేత మనసులపై ప్రభావం వేసి తమ సరుకుల అమ్మకాలను పెంచుకోవడం బహుళజాతి సంస్థల లక్ష్యం. స్విట్జర్లాండ్‌కు చెందిన నెస్లెకు ఈ ఆరోగ్య పానీయాలతోపాటు అనేక ఆహార పదార్థాల మార్కెట్ ఉంది. 87 దేశాలకు విస్తరించిన ఈ బహుళజాతి సంస్థల వంద దేశాల్లో ఉత్పత్తులను అమ్ముతూ ఐదు వేల రెండు వందల కోట్ల డాలర్ల (రెండు లక్షల యాభై వేల కోట్ల రూపాయల) అమ్మకాలను,



311 కోట్ల డాలర్ల (1500 కోట్ల రూపాయల) లాభాన్ని సాలీనా పొందుతోంది. ఎనిమిది వేల ఐదు వందల రకాల ఉత్పత్తులను సాగించే ఈ సంస్థ తన గజబలంతో ఇతర దేశాల మార్కెట్‌లలో ప్రవేశించి చిన్న ఉత్పత్తిదారులను ధ్వంసం చేసి తన మార్కెట్‌ను స్థాపించుకుంటోంది. దానికి పోటీదార్లయిన స్మిత్‌క్లైమ్ బీచమ్, హీన్జ్, క్యాడ్‌బరీ సంస్థలు కూడా అందుకు తక్కువ తిన్నవేమీ కావు. ఈ నాలుగు సంస్థల మధ్య భారత మార్కెట్ కోసం తీవ్రమైన పోటీలు జరుగుతున్నాయి.

ఈ పోటీలో భాగంగా దాదాపు ఈ అన్ని పౌడర్‌లలోను కోకో పౌడర్ కలుపుతున్నారు. నిజానికి ఈ కోకో పౌడర్ ఒక మత్తుమందు. ఆ పదార్థాలను అలవాటు చేయడానికి, అది మానలేని వ్యసనంగా మార్చడానికి ఈ కోకో కలుపుతుండగా అది మొత్తం శరీర ఆరోగ్యానికే హాని కలిగిస్తుంది. ఈ కోకో మిశ్రమం గురించి యునిసెఫ్, ప్రపంచ ఆరోగ్య సంస్థ వంటి అంతర్జాతీయ సంస్థలు ఎన్నోసార్లు నిరసన ప్రకటించినా బహుళజాతి సంస్థలకు చీమకుట్టినట్లైనా లేదు.

ఈ పాల ఉత్పత్తులు, పాలలో కలుపుకునే పదార్థాలు ఒక ఎత్తైతే అక్కడి నుండి ఎదుగుతున్న పిల్లలకు ముప్పుతున్న చాక్‌లెట్లు, బిస్కెట్ల మార్కెట్ మరింత విస్తృతమైనది. బహుళజాతి సంస్థలకు మరిన్ని లాభాలను సమకూర్చి పెడుతున్నది. ఆ మార్కెట్ గురించి మరో అధ్యాయంలో పరిశీలిద్దాం.

కాని ఈ ఆహార పానీయాల రంగం వరకు మాత్రమే చూసినా ప్రభుత్వాలు, నియంత్రణ సంస్థలు తల్లిదండ్రులు తీవ్రంగా పట్టించుకోవలసిన సమస్య ఇది. ఏ సమాజానికైనా భవిష్యత్ తరం గొప్ప ఆస్తి. ఆ భవిష్యత్ తరం ఆరోగ్యవంతంగా, ఆహ్లాదకరంగా, సామాజిక శ్రేయోదాయకంగా పెరగాలని ఏ సమాజమైనా కోరుకుంటుంది, కోరుకోవాలి. కాని ఇవాళ ఆరోగ్యం పేరుతోనే అనారోగ్యాన్ని వ్యాపింపచేసే విటమిన్ల ఆహారం, సంతులిత ఆహారం పేరుతో విషపదార్థాలు అందించడం, ఆహ్లాదకరమైన వాతావరణాన్ని సామాజిక శ్రేయస్సు భావనలను కల్పించకపోవడం ఇవాళ ఈ దేశంలో పాలకనీతిగా అమలవుతున్నది. ఈ పాలకనీతి బహుళజాతి సంస్థల రంగప్రవేశానికి దారులు తీస్తున్నది.

***సమీక్ష, జూన్ - అక్టోబర్ 2003***

# 31

# ఆంధ్రప్రదేశ్‌లో సేవారంగ అభివృద్ధి

ఒక ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందిందని చెప్పడానికి, ఆ ఆర్థిక వ్యవస్థలో సేవారంగ వాటా ఒక చిహ్నమని, సేవారంగం అభివృద్ధి చెందితే ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందినట్టేనని ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రి, ఎంతోమంది ముఖ్యులైన తెలుగుదేశం నాయకులు ఈ ఎనిమిది సంవత్సరాలలో ఎన్నోసార్లు అన్నారు. అమెరికా, సింగపూర్ ఆర్థిక వ్యవస్థల్లాగా ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో కూడా సేవారంగం వాటా ఇతోధికంగా పెరిగిపోతున్నది. అంటే మనం అమెరికాతో, సింగపూర్‌తో సమానం కావడానికి చేరువలో ఉన్నామని పదే పదే ప్రభుత్వ ఆర్థిక పత్రాలు ప్రకటిస్తున్నాయి.

ఈ నేపథ్యంలో ఆంధ్రప్రదేశ్‌లో సేవారంగం స్థితి ఏమిటో 1995-96 ఆర్థిక సంవత్సరం నుంచి ఇప్పటి వరకూ గడిచిన ఎనిమిది సంవత్సరాలలో సేవారంగం ఎట్లా మారుతూ వచ్చిందో, విజన్ 2020, శ్వేతపత్రాలు వంటి ప్రభుత్వ విధాన పత్రాలలో చేసిన ప్రకటనలు ఎట్లా వాస్తవ రూపం ధరించి, ప్రజా జీవనంలో ఏ ప్రభావాలు కలగజేశాయో విశ్లేషించుకోవలసి ఉంది.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థలో సేవారంగం వాటా 1995-96 నాటికి 49 శాతం అని, దాన్ని 2020-21 నాటికి 67 శాతానికి పెంచవలసి ఉందని



విజన్ 2020 నిర్ధారించింది. సేవారంగంలో ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, పర్యాటక రంగం, చిన్నతరహా సేవలు, రవాణా, జ్ఞాన-ఆధారిత సేవలు, విద్య, ఆరోగ్యం అనే ఏడు రంగాలను ప్రత్యేకంగా విడదీసి ప్రగతికారకాలుగా, ప్రత్యేక శ్రద్ధ చూపవలసిన రంగాలుగా ప్రకటించింది. ఈ సేవారంగంలో వార్షిక ప్రగతి రేటు 1995-2000 మధ్య 7 శాతంగా, 2000-05 మధ్య 9.5 శాతంగా, మొత్తంగా 1999-2000 మధ్య 11.7 శాతంగా ఉండాలని సూచించింది. ఈ రకమైన పెరుగుదల సాధిస్తే 2020 నాటికి స్థూల రాష్ట్రోదాయంలో రు. 5,40,000 కోట్లు సేవారంగం నుంచే వస్తాయని విజన్ 2020 అంచనా వేసింది. ఈ లక్ష్యాలను సాధించాలంటే మొత్తంగా రు. 17,27,000 కోట్లు పెట్టుబడులు అవసరం గనుక, ఈ సేవారంగంలోకి ప్రైవేటు పెట్టుబడులను ఆహ్వానించక తప్పదని, తద్వారా మాత్రమే ప్రగతి అవకాశాలు సాధ్యమవుతాయని విజన్ 2020 రాసింది.

అంతకు ముందే 'ఆంధ్రప్రదేశ్ - ఎజెండా ఫర్ ఎకనమిక్ రిఫార్మ్స్'లో రాసిన విషయాలనే విజన్ 2020 పునరుద్ఘాటించగా, విజన్ 2020లోని విషయాలను ఆ తర్వాతి బడ్జెట్ ప్రసంగాలు, శ్వేతపత్రాలు, ఇతర ప్రకటనలు ప్రతిధ్వనిస్తున్నాయి.

సేవారంగం మీద మన పాలకుల ఈ మితిమీరిన శ్రద్ధకు కారణం ప్రజలకు అవసరమైన సేవలను ఇంకా ఎక్కువగా అందించడం కాదు. నిజానికి ప్రజా జీవితాలను మెరుగుపరిచే ఎన్నో సంక్షేమ రంగాలను రద్దుచేసి, సంక్షేమ సేవల కేటాయింపులను కత్తిరించిన ప్రభుత్వం సేవారంగం అభివృద్ధి గురించి ఇంతగా మాట్లాడడం వెనుక అసలు కారణాలు వేరు. సేవారంగం అభివృద్ధి పేరిట రాష్ట్రంలో జరిగినదాని వల్ల రాష్ట్ర ప్రజలకు ఒరిగిందేమీ లేదు.

వ్యాపారం, హోటళ్లు, రెస్టారెంట్లు, రవాణా, నిలువ, సమాచార సంబంధాలు, బ్యాంకులు, బీమా, రియల్ ఎస్టేట్, ప్రభుత్వ పాలన, ఇతర సేవలను అర్థశాస్త్రం తృతీయ రంగమైన సేవారంగంలో భాగంగా గుర్తిస్తుంది. వీటిలో తక్షణ లాభాలు విపరీతంగా ఉన్నప్పటికీ, అర్థశాస్త్ర పరిభాషలో ఇవి మౌలిక ఉత్పాదక రంగాలు కావు. సామాజిక ఉత్పత్తి పెరుగుదలకు మూలమైన ప్రాథమిక (వ్యవసాయం, అడవులు, చేపలు, గనులు - ప్రధానంగా ప్రకృతి ఆధార పనులు), ద్వితీయ (పరిశ్రమలు, నిర్మాణం, విద్యుచ్ఛక్తి, ఇంధనం, నీటి సరఫరా - ప్రధానంగా యంత్రాల మీద ఆధారపడే పనులు) రంగాల కన్నా భిన్నంగా తృతీయ రంగాన్ని పరిశీలించడం ఆనవాయితీ. మొదటి రెండు రంగాలలో పనిచేసే వ్యక్తులకు, మొత్తంగా సమాజానికి అవసరమైన సామూహిక, వ్యక్తిగత సేవలను అందించడం ఈ మూడోరంగం పని.

అయితే, అంతకంతకు ఎక్కువగా ఈ మూడోరంగంలో బహుళజాతి సంస్థల గుత్తాధిపత్యం పెరిగిపోతోంది. విపరీతమైన లాభాలు పండే ఈ రంగం మీద ఆధిపత్యం చెలాయిస్తున్న బహుళజాతి సంస్థలు మూడో ప్రపంచ దేశాల ప్రజలకు అవసరం ఉన్నా లేకపోయినా తమ లాభాల కోసం తమ సేవలు అమ్మడం ప్రారంభించాయి. స్థానిక సేవా సంస్థలతో మిలాఖత్తు అయ్యో, తమ సొంత శాఖలను ఏర్పాటు చేసుకునో, ప్రభుత్వానికి తమ

సేవలను అమ్మడం ద్వారానో ఈ బహుళజాతి సంస్థలు ఇబ్బడిముబ్బడిగా లాభాలు చేసుకుంటున్నాయి.

ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థను ప్రపంచీకరణ రథచక్రాలకు కట్టివేసిన తర్వాత సహజంగానే ఇక్కడ కూడా సేవారంగం మీద శ్రద్ధ పెరిగింది. పైన చెప్పినట్లు సేవారంగంలో ఏడు అంశాలను అభివృద్ధి చేయాలని ప్రభుత్వం ప్రణాళిక వేసుకుంది. ఈ ఏడు అంశాలలో కూడా పేరుపొందిన బహుళజాతి సంస్థలు రాష్ట్రంలో ప్రవేశించాయి. ప్రైవేటు, విదేశీ పెట్టుబడులను ఆహ్వానించడం ద్వారానే ఈ రంగాలలో ప్రగతి సాధ్యమని ప్రభుత్వం స్పష్టంగానే ప్రకటించింది.

## ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ

ప్రభుత్వ సేవారంగం ప్రాధాన్యతలలో అగ్రభాగాన ఉన్నది ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ. ఈ రంగం ద్వారా ఉపాధి కల్పనకూ, ఆర్థిక అభివృద్ధికీ బ్రహ్మాండమైన అవకాశాలున్నాయనీ, ఆంధ్రప్రదేశ్ వాటిని అందుకోవలసి ఉన్నదనీ, చాలావరకు అందుకున్నదనీ ప్రభుత్వం అంటోంది. సాఫ్ట్‌వేర్ ఎగుమతులు, పెట్టుబడులు, ఉపాధి కల్పన మూడు రంగాలలోనూ ఈ ఎనిమిది సంవత్సరాలలో ఘన విజయాలు సాధించామని ప్రభుత్వం చెప్పుకుంటోంది. ఈ ఎనిమిది సంవత్సరాలలో సాఫ్ట్‌వేర్ ఎగుమతులు రు. 60 కోట్లు (1995-96) నుంచి రు. 3600 కోట్ల (2002-03)కు పెరిగాయని, డెబ్భైవేల ఉద్యోగాలు కల్పించామని, రు. 3000 కోట్ల (2002-03) పెట్టుబడులు రాష్ట్రంలోకి వచ్చాయని ప్రభుత్వం చెపుతోంది.

అంకెల్లో చూస్తే ఇది అభివృద్ధిగానే కనబడుతుంది. కాని ఆ అంకెల సారాంశంలోకి వెళ్లి పరిశీలిస్తే ఈ ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ అభివృద్ధి వల్ల రాష్ట్రానికి జరిగిన మేలు పెద్దగా ఏమీ లేదని తేటతెల్లమవుతుంది. రాష్ట్రంలో నుంచి సాఫ్ట్‌వేర్ ఎగుమతులు వందల రెట్లు పెరిగిన మాట నిజమే. కాని ఆ ఎగుమతుల ఆదాయమంతా కొన్ని బహుళజాతి సంస్థల చేతుల్లోకో, కొందరు పెట్టుబడిదారుల చేతుల్లోకో వెళ్లింది తప్ప రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు వచ్చిందేమీ లేదు. ఎందుకంటే ప్రభుత్వమే స్వయంగా ఈ రంగం అభివృద్ధి కోసం అనే పేరుతో వారికి పన్నుల రాయితీలిచ్చింది. మినహాయింపులు ఇచ్చింది. మామూలుగా ఎగుమతుల ద్వారా వచ్చే ఆదాయంపై రాష్ట్ర ప్రభత్వానికి రావలసిన పన్నును కూడా ప్రభుత్వం వదిలేసుకుంది. ఇక ఉద్యోగ కల్పన రంగంలో చూపుతున్న అభివృద్ధి కూడా అంత గొప్పదేమీ కాదు. చూపుతున్న డెబ్భైవేల ఉద్యోగాల్లో స్థానికులెందరోన ఏ నైపుణ్య స్థాయి కలవారికి ఉద్యోగాలొచ్చాయో, ప్రధానంగా ఏ వర్గాలకు ఉద్యోగాలందాయో విశ్లేషిస్తే గాని అసలు వాస్తవం బయటపడదు. అందులోనూ ముప్ఫై లక్షల మంది విద్యావంతులైన నిరుద్యోగులు ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజిలో నమోదు చేసుకుని ఉన్న నేపథ్యంలో పన్నెండు సంవత్సరాలుగా ఊదరగొట్టుకుంటూ అనేక రకాల సౌకర్యాలు, రాయితీలు పొందుతూ నడుస్తున్న 'పరిశ్రమ' డెబ్భై వేల ఉద్యోగాలు కల్పించడం గొప్ప విషయమేమీ కాదు. ఇక పెట్టుబడుల విషయానికి వస్తే ఇన్ని సంవత్సరాలుగా విస్తరిస్తున్న



రంగంలో పెట్టుబడులు మూడు నాలుగు వేల కోట్ల రూపాయల కన్నా ఎక్కువ లేకపోవడం ప్రచారార్భాటానికి, వాస్తవానికి సంబంధం లేదని చూపుతున్నది.

పైగా ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగం వల్ల రాష్ట్ర ప్రజలకు, రాష్ట్ర ఖజానాకు చెప్పుకోదగిన మేలు ఏదీ జరగకపోగా ప్రభుత్వమే ప్రజాధనం నుంచి కొన్ని వేల కోట్ల రూపాయలు ఈ రంగానికి వెచ్చించవలసి వచ్చింది. వందల ఎకరాల భూమిని ఉచితంగానో తక్కువ ధరలకో అప్పగించడం, ఆయా ప్రాంతాలకు రోడ్లు, తాగునీరు, విద్యుచ్ఛక్తి సౌకర్యాలు కల్పించి పెట్టడం, విద్యుత్ ఛార్జీల్లో, నీటి పన్నుల్లో రాయితీలివ్వడం వంటి ఎన్నో రూపాలలో ఈ రంగానికి ప్రజాధనాన్ని దుర్వినియోగం చేయడం జరిగింది. అంటే ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగం అభివృద్ధి వల్ల రాష్ట్రానికి జరిగిన మేలు కన్నా రాష్ట్ర వనరుల వల్ల ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగానికి జరిగిన మేలే ఎక్కువ.

## పర్యాటక రంగం

పర్యాటక రంగం విపరీతంగా డబ్బులు సంపాదిస్తుందని, విదేశీ మారక ద్రవ్యాన్ని సంపాదిస్తుందని, విస్తృతంగా ఉద్యోగ కల్పన సాధిస్తుందని ప్రభుత్వం చెబుతుంది. ఈ ఎనిమిది సంవత్సరాల్లో పర్యాటక రంగ అభివృద్ధి పేరు మీద ఎంపిక చేసిన స్థలాల అభివృద్ధికి, ప్రచారానికి, ఆర్భాటానికి వందల కోట్ల రూపాయలు ఖర్చు పెట్టింది. నిజానికి విజన్ 2020లో పర్యాటక రంగ అభివృద్ధికి ఆదర్శంగా చూపిన థాయ్‌లాండ్, మెక్సికో ఉదాహరణలు చాలా దుర్మార్గమైనవి. విపరీతమైన ప్రైవేటు భాగస్వామ్యంతో ఈ రంగాన్ని అభివృద్ధి చేయాలని ముందే చెప్పుకున్న ప్రభుత్వం రాష్ట్రంలోని పాత పర్యాటక ప్రాంతాల మీద, కొత్తగా రూపొందించిన పర్యాటక ప్రాంతాల మీద ప్రైవేటు రంగానికి గుత్తాధిపత్యం ఇచ్చింది. పదిలక్షల రూపాయల ఖర్చుకు పర్యాటక రంగంలో 48 ఉద్యోగాల, కల్పన జరుగుతుందని చెప్పుకున్న ప్రభుత్వం ఈ అంకెల గారడీతో రెండు రకాల మోసం చేసింది. మొదటిది ఈ 48 ఉద్యోగాలు ఏ స్థాయి ఉద్యోగాలో, మనుగడకు తగినంత ఆదాయాన్ని ఇవ్వగలవో లేదో ఎక్కడా మాట్లాడలేదు. రెండు, ఈ ఎనిమిది సంవత్సరాల్లో ఈ రంగంలో వెచ్చించిన వందల కోట్ల రూపాయలు ఈ చెప్పిన నిష్పత్తిలోనే ఉద్యోగాలు కల్పించాయో లేదో ఎక్కడా చెప్ప లేదు.

వాస్తవం ఏమంటే ప్రైవేట్ రంగంలో పర్యాటక రంగం అభివృద్ధి అతి తక్కువ ఉద్యోగాలకు, విపరీతమైన లంచగొండితనానికి దారితీసింది. వేశ్యావ్యాపారం, మాఫియా అభివృద్ధి, పర్యావరణ సమస్యలు వంటి ఇతర సమస్యలకు దారితీసింది.

## చిన్నతరహా సేవలు

స్థానిక రవాణా, రెస్టారెంట్లు, దుకాణాలు, పర్యాటక సంస్థలు, ప్యాకేజింగ్, ప్రచురణ, శిరోజాలంకరణ, సౌందర్య పోషణ, వడ్రంగం, రజక సేవలు, స్థానిక ప్రకటనలు, ప్రోత్సాహక

సంస్థలు వంటి అనేక చిన్న తరహా సేవలు సేవారంగాన్ని విస్తరిస్తాయని, రాష్ట్ర స్థూల ఉత్పత్తికి దోహదం చేస్తాయని ప్రభుత్వం చెప్పుకుంది. వీటిలో సగం సేవలు ఏ ప్రభుత్వ విధానంతో సంబంధం లేకుండానే అంతకు ముందు నుంచీ ప్రజలకు అందుబాటులో ఉన్నవే. మిగిలిన సగం సేవలు ఈ రాష్ట్రంలోకి బహుళజాతి సంస్థల సరుకులను, సేవలను ప్రవేశపెట్టడానికి, వారికి లాభాలు సమకూర్చి పెట్టడానికి ఉపయోగపడేవే తప్ప ప్రజల మేలు కోసం వస్తున్న సేవలేమీ కావు.

## లాజిస్టిక్స్

సరుకుల రవాణా, మనుషుల ప్రయాణం మొదలైన అవసరాలకు ఒక మజిలీగా, కేంద్రంగా ఉపయోగపడే సేవలను లాజిస్టిక్స్ అంటారు. ఆంధ్రప్రదేశ్‌ను లాజిస్టిక్స్ సేవా కేంద్రంగా అభివృద్ధి చేయడం ద్వారా రాష్ట్రంలో ఉపాధి కల్పనకు, ఆదాయ సమీకరణకు వీలు కలుగుతుందని ప్రభుత్వం చెబుతుంది. రాష్ట్రానికి వెయ్యి కిలోమీటర్ల సముద్ర తీరమున్నందువల్ల ఎన్నో ఓడరేవులను నిర్మించవచ్చునని, హైదరాబాద్, విశాఖపట్నం విమానాశ్రయాలను అంతర్జాతీయ విమానాశ్రయాలుగా అభివృద్ధి చేయవచ్చునని, రాష్ట్రమంతటా నాలుగు లైన్ల రహదారులు నిర్మించవచ్చునని ప్రభుత్వం అంటుంది. నిజానికి ఈ అన్ని కార్యక్రమాలు రాష్ట్ర సంపదలను బహుళజాతి సంస్థల, సంపన్నుల చేతులలో పెట్టే కార్యక్రమాలే తప్ప ప్రజలకు వీటివల్ల ఉపయోగం అంతంత మాత్రమే. ఈ పేరుతో కాకినాడ, కృష్ణపట్నం ఓడరేవు, గంగవరం ఓడరేవులను ప్రైవేటు సంస్థలకు అప్పగించడం జరిగింది. కళింగపట్నం, భావనపాడు, ముత్యాలమ్మపాలెం, నరసాపురం, మచిలీపట్నం, నిజాంపట్నం, భీమునిపట్నం ఓడరేవులను ప్రైవేటీకరణకు సిద్ధంగా ఉంచారు. హైదరాబాద్‌లో అంతర్జాతీయ విమానాశ్రయ నిర్మాణాన్ని ఒక ప్రైవేట్ సంస్థకు అప్పగించి, ఈ సంస్థ కోరినట్టుగా వందల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని వడ్డీ లేకుండా అందజేశారు. బహుళజాతి సంస్థల సరుకులు మారుమూల పల్లెటూర్లకు కూడా ప్రవహించడానికి వీలుగా నాలుగు లైన్ల, ఆరులైన్ల రహదారులు నిర్మించారు. దీన్నంతా అభివృద్ధిగా ప్రచారం చేస్తూ మధ్యతరగతిని భ్రమల్లో ముంచుతున్నారు. ఈ రోడ్ల వల్ల మధ్యతరగతి ప్రయాణ సౌకర్యాలు ఏమాత్రమైనా మెరుగుపడ్డాయని అనుకున్నా అది ఒక కొసరే తప్ప అసలు మాత్రం బహుళజాతి సంస్థల ప్రయోజనాలే.

## ఇతర సేవలు

విజన్ 2020లో ప్రాధాన్యతా సేవలుగా చూపిన జ్ఞాన ఆధారిత సేవల్లో, విద్య - ఆరోగ్య రంగాలు కూడా ఉన్నాయి. విద్య, ఆరోగ్య రంగాల గురించి వివరంగా ప్రత్యేక వ్యాసాల అవసరం ఉంది గనుక ఇక్కడ ప్రస్తావించడం లేదు. జ్ఞాన ఆధారిత సేవలు అనే అంశంలో బయో టెక్నాలజీ వంటి వాటి ద్వారా ప్రభుత్వం కొన్ని వేల ఎకరాల భూమిని ఐసిఐసిఐ, షాపూర్జీ పల్లోంజి వంటి దేశంలోని బడా గుత్తా పెట్టుబడిదారీ సంస్థలకు అందచేసింది.



నిజంగా ప్రభుత్వం ప్రజలకు అందించవలసిన సేవలు ఎన్నో ఉన్నాయి. ప్రజలకు ఆ సేవలు అందడంలో ప్రభుత్వం సహకరించవలసిన రంగాలెన్నో ఉన్నాయి. విద్య, వైద్యం, ఆరోగ్యం, సాంఘిక సంక్షేమం, నీటిపారుదల, తాగునీరు, రక్షణ, రవాణా సంబంధాలు, సమాచార సంబంధాలు వంటి ఎన్నో రంగాలు ప్రజాధనం ఖర్చు పెట్టి ప్రభుత్వం పాల్గొనవలసిన రంగాలే. కాని క్రమక్రమంగా ఈ రంగాలన్నింటి నుంచి తప్పుకుంటున్న ప్రభుత్వం, ఈ రంగాలన్నింటిని ప్రైవేట్ లాభాపేక్షకు బలిచేస్తున్న ప్రభుత్వం తనకు సేవారంగం మీద ఎంతో ప్రేమ ఉన్నట్లు, సేవారంగాన్ని అభివృద్ధి చేస్తున్నట్లు నటించడం ఒక క్రూరమైన పరిహాసం.

***వీక్షణం, డిసెంబర్ 1-31, 2003***

# 32

# స్వావలంబన స్వరూప స్వభావాలు

ఇటీవలి కాలంలో స్వావలంబన అనేమాట విస్తృతంగా వినబడుతోంది. దాదాపు దేశంలో నూతన ఆర్థిక విధానాలు అమలు కావడం మొదలయినప్పటి నుంచీ కొన్ని రాజకీయ పక్షాలు, కొందరు మేధావులు లేవనెత్తుతున్న ఈ నినాదం ఈ మధ్య మరింత ప్రాచుర్యంలోకి వచ్చింది. ఈ ఇరవై ఒకటో శతాబ్దపు ప్రపంచీకరణ యుగంలో ఈ నినాదానికి అర్థం లేదని, ఒకవేళ నినాదం మంచిదే అయినా ఇప్పుడు సాధ్యం కాదని కొందరు వాదిస్తుండగా, భారతదేశం వంటి సుసంపన్నమైన వనరులున్న దేశంలో, సామ్రాజ్యవాద దోపిడీ పీడనలు పెరిగిపోతున్న సమయంలో ఇది చాలా అవసరమైన విధానమని మరికొందరు వాదిస్తున్నారు. ఈ నేపథ్యంలో అసలు స్వావలంబన అంటే ఏమిటి, ప్రస్తుత తరుణంలో దాన్ని ఎలా అర్థం చేసుకోవాలి, ఆ విధానం రాజకీయార్థిక ఆలోచనలలోకి వచ్చిన చరిత్ర ఏమిటి, ఇప్పుడు ఆ నినాదం అవసరమేమిటి చర్చించవలసి ఉంది.

మొట్టమొదట, స్వావలంబన గురించి ఉన్న రెండు మూడు అపోహలను తొలగించాలి. స్వావలంబన అంటే సొంత వనరుల మీద ఆధారపడి అవసరాలను తీర్చుకోవడం, అవసరాలకు తగినట్టుగా సొంత వనరులను



పెంచుకోవడం. అంతే గాని, కొందరు అపార్థం చేసుకొంటున్నట్టుగా తలుపులు మూసుకుని కూచుని, అవసరాలను తగ్గించుకోవడం కాదు. అయితే ప్రతి అవసరాన్నీ సమీక్షించి, అది నిజమైన అవసరమేనా, కేవలం అమ్మకందార్ల, ఉత్పత్తిదార్ల, మదుపుదార్ల లాభాల వేటలో మన మీద రుద్దబడుతున్నదా అని నిర్ధారించిన తర్వాతనే అవసరాలను తీర్చడం అనే విధానం స్వావలంబనలో ముఖ్యమైనది. అంటే అవసరాలను సరుకులవైపు నుంచి కాక మనుషుల వైపు నుంచి, మారకపు విలువల వైపు నుంచి కాక ఉపయోగ విలువల వైపు నుంచి చూడడం స్వావలంబనకు పునాది. అప్పుడు కూడా ఏ సమాజానికి ఆ సమాజమే తయారు చేసి, తీర్చుకోలేని అవసరాలు మిగిలిపోవచ్చు. ఆ అవసరాల సంతృప్తి కోసం ఇతర సమాజాల మీద ఆధాపడవలసి రావచ్చు. ఆ ఇతర సమాజాలతో సంబంధం దాత – గ్రహీత సంబంధంలా అసమానంగాకాక, స్నేహ పూర్వకంగా, సమానస్థాయిలో ఉండాలనేది కూడా స్వావలంబనలో ముఖ్యమైన అంశం.

అంటే, స్వావలంబన అనగానే 'ఆధునిక మానవ అవసరాలను కుదించి, సమాజానికీ, ఆర్థిక వ్యవస్థకూ తలుపులు మూసి, ఒక ఇనుపతెర కప్పిన సమాజాన్ని సృష్టించడం' అని సాగుతున్న దుష్ప్రచారాన్ని తిప్పికొట్టాలి. ప్రాచీన భారత గ్రామం స్వయం సమృద్ధంగా, స్వావలంబితంగా ఉన్నదని భావించిన ఆర్థిక చరిత్రకారులు కూడా కనీసం వ్యవసాయావసరమైన ఇనుము కోసం, ఆహారావసరమైన ఉప్పుకోసం గ్రామాల మధ్య ఆదాన ప్రదానాలు ఉండి ఉంటాయని ఊహించారు. సమస్యల్లా ఈ ఆదాన ప్రదానాల ప్రాతిపదిక సమానత్వం అవునా కాదా అనేదే.

మరొక అపోహ, స్వావలంబన పాత సమాజాల్లో, గత శతాబ్దాల్లో సాధ్యమై ఉండేదేమో గాని ఆధునిక సమాచార, రవాణా సంబంధాలు విస్తరించిన ఈ రోజుల్లో సాధ్యం కాదనేది. అంటే అమాయకంగా ఈ అపోహను నమ్ముతున్న వాళ్లకు, ఉద్దేశ్యపూర్వకంగా ఈ దుష్ప్రచారాన్ని కొనసాగిస్తున్న వాళ్లకు లోలోపల ఉన్న దురభిప్రాయమేమంటే స్వావలంబనకూ సాంకేతికాభివృద్ధికీ చుక్కెదురని. ఇది పూర్తిగా అబద్ధం. స్వావలంబన రాజకీయార్థిక విధానాలు ఆధునిక శాస్త్ర, సాంకేతికాభివృద్ధికి వ్యతిరేకం కావు. ఆ రాజకీయార్థిక దృక్పథం కోరేదల్లా శాస్త్ర, సాంకేతిక ఫలాలు అందరికీ అందాలని మాత్రమే. శాస్త్ర, సాంకేతిక అన్వేషణలు కొందరి గుత్తసొమ్మయి, అసంఖ్యాక ప్రజలు, దేశాలు వారి మీద ఆధారపడి, వారి దయాదాక్షిణ్యాల మీద బతకవలసిన స్థితి ఉండగూడదని మాత్రమే. శాస్త్ర, సాంకేతిక అభివృద్ధి కొన్ని ప్రాంతాల మీద, కొన్ని ప్రజా సమూహాల మీద కొన్ని బహుళజాతి సంస్థలకు అధికారం ఇచ్చే సాధనం కాగూడదని మాత్రమే. అసలు సొంతంగా, సహజంగా శాస్త్ర, సాంకేతిక అభివృద్ధిని సాధించని సమాజమేదీ లేదు. పెట్టుబడిదారీ విధానం వచ్చే వరకూ మానవ చరిత్రలో అన్ని సమాజాలూ, అన్ని నాగరికతలూ తమ అవసరాలకు తగిన, తమ వనరులను ఉపయోగించుకోగలిగిన శాస్త్ర, సాంకేతిక అభివృద్ధి సాధించాయి. పెట్టుబడిదారీ విధానం ఈ సమాజ అభివృద్ధిని అడ్డుకుని, శాస్త్ర, సాంకేతిక అభివృద్ధి మీద ఇతర దేశాలు, సమాజాలు పరాధీనంగా ఉండే స్థితిని కల్పించింది.

సామ్రాజ్యవాదం ఈ స్థితిని మరింత విస్తృతం చేసింది. అందువల్ల స్వావలంబన, శాస్త్రవిజ్ఞానం పరస్పరం ఎదురుబొదురుగా ఉండే శక్తులనే తప్పుడు అభిప్రాయం చలామణీలో ఉంది.

స్వావలంబనకు మొట్టమొదట కావలసింది వనరుల సమృద్ధి. స్వావలంబనను ఒక మనిషయినా, ఒక కుటుంబమయినా, ఒక గ్రామమయినా, ప్రాంతమయినా, దేశమయినా తన వనరుల మీదనే ఆధారపడి, పరాధీనం కాకుండా ఉండాలంటే మొట్టమొదట తన అవసరాల గురించి వాస్తవికమైన అంచనా ఉండాలి. ఆ అవసరాలను తీర్చే వస్తువులను, సేవలను తయారు చేయగల వనరులుండాలి. స్వయం సమృద్ధి అని పిలిచే ఈ స్థితి కొన్ని సందర్భాలలో ఉండవచ్చు. కొన్ని సందర్భాలలో ఉండకపోవచ్చు. స్వయం సమృద్ధిని సాధించడమెట్లా అనే వ్యూహంతో నిరంతరం ప్రయత్నించడంతో పాటు, స్వయం సమృద్ధి లేని సందర్భాలలో ఆ వస్తువులూ, సేవలూ సరఫరా చేయగల వాళ్ల షరతులకూ, ఆంక్షలకూ లోబడకుండా గౌరవప్రదమైన సంబంధం పెట్టుకోవడమెట్లా అనే వ్యూహం కూడా ఉండాలి.

ఈ అర్థంలో చూసినప్పుడు ఒక వ్యక్తికో, ఒక కుటుంబానికో, ఒక గ్రామానికో వనరుల స్వయం సమృద్ధి లేకపోవచ్చు. కాని సమృద్ధి ఉంది. మళ్లీ అందులో కూడా మధ్యప్రదేశ్ నుంచి పైన కొన్ని ఉత్తరాది రాష్ట్రాలకు సముద్రతీరం లేకపోవచ్చు గాని దేశం మొత్తాన్ని పరిగణనలోకి తీసుకున్నప్పుడు ప్రపంచంలో ఒక్క చైనా మినహా మరే దేశమూ వనరుల స్వయం సమృద్ధిలో భారతదేశంతో సరిపోలదు. చైనాలో కూడా సాగుయోగ్యమైన భూమి భారతదేశంతో పోల్చినప్పుడు తక్కువ.

అందువల్ల స్వావలంబన గురించి చేసే చర్చలో మొట్టమొదట ఆలోచించవలసిన వనరుల స్థితి, వనరుల స్వయం సమృద్ధి అనే వాటి విషయంలో భారతదేశం ఇతర దేశాలతో పోలిస్తే చాలా మెరుగైన స్థితిలో ఉంది. ఇక్కడ స్వావలంబన సాధ్యం కాదని అనడం పచ్చి అబద్ధం.

స్వావలంబన గురించి చర్చలో తరువాత చర్చించవలసింది ఆ సమాజ ప్రజల అవసరాలేమిటనేది. ఒక్కొక్కసారి వనరులకూ – అవసరాలకూ సమతుల్యత సాధించకపోవడం వల్ల స్వావలంబనకు విఘాతం కలుగుతుంది. అందువల్ల సమాజం మొత్తానికీ తమకు ఉన్న వనరులేమిటో వాస్తవికమైన అవగాహన కలిగించి వాటిని సమాజం ఎట్లా వాడుకోవడం ఉచితమో వివరించగలగాలి. అంటే వనరుల వినియోగంలో తీవ్రమైన అసమానతలు ఉన్న సమాజంలో ఇటువంటి అవగాహన సాధ్యం కాదు. అప్పుడు నిజంగానే వనరుల కొరత, లేదా వనరుల దుర్వినియోగం జరుగుతుంది. అప్పుడు స్వావలంబన రద్దవుతుంది. ఉదాహరణకు ఒక సమాజంలో దొరికే ఉక్కునంతా అటు విలాసవంతమైన కార్లు తయారు చేయడానికి వాడవచ్చు. లేదా ప్రజా రవాణా సౌకర్యంగా ఉండే బస్సుల తయారీకీ వాడవచ్చు. లేదా రెండు అవసరాలనూ ఏదో ఒక దామాషాలో తీర్చవచ్చు. ఈ మూడు మార్గాలు కాకుండా, ఉక్కును బైట నుంచి దిగుమతి చేసుకొని, బైటి దేశానికి అధీనంగా మారిపోవచ్చు. వీటిలో ఏ మార్గమైనా ఎంపిక రాజకీయార్థిక వ్యవస్థలో నిర్ణాయక శక్తుల చేతిలోనే ఉంటుంది.



అంటే స్వావలంబన సాధించాలంటే, ఆ సమాజంలోని నిర్ణయాధికార శక్తులు ఆ సమాజ అవసరాలను నిష్పాక్షికంగా సమీక్షించి, ఆ అవసరాలకు ఎంత ప్రాధాన్యతనివ్వాలో నిర్ణయించి, దాన్ని బట్టి వనరుల కేటాయింపు జరపాలి. అప్పుడు మాత్రమే వనరుల – అవసరాల మధ్య సమతుల్యత ఏర్పడి స్వావలంబనకు మార్గం సుగమమవుతుంది.

ఇక్కడ కూడా భారతదేశం ఉదాహరణ తీసుకుంటే, మన ప్రజల అవసరాలన్నిటినీ తీర్చగలిగిన వనరులు మన దగ్గర ఉండి కూడా, ఒక అత్యల్ప సంఖ్యాక సంపన్న వర్గం తన అవసరాలను పెంచుకుంటూ పోవడంతో, కృత్రిమ వనరుల కొరతకు దారితీసింది. ఈ సంపన్న వర్గం, యూరప్, అమెరికాలలోని సంపన్నవర్గం అనుభవిస్తున్న జీవన సరళిని అనుభవించ దలచుకుని దుబారా వ్యయానికి పూనుకుంటోంది. ఈ పరిణామాన్ని ఇటు ప్రభుత్వ విధానాలు, అటు సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థల సరుకుల ఉత్పత్తి విధానం ప్రోత్సహిస్తున్నాయి. దీనితో దేశమే అమ్మేవాడి అంగడిగా మారిపోయి, కొనుగోలుదార్లకు నిజంగా ఏం కావాలో, ఎంత కావాలో అంచనా లేని స్థితి వచ్చింది. అందువల్ల ఒకవైపు అవసరమైన వాళ్లకు సరుకులూ సేవలూ అందకపోవడం, మరోవైపు వస్తువులూ, సేవలూ అధికోత్పత్తి జరుగుతుండడం ఉంది. ఇది స్వావలంబనను దెబ్బతీస్తుంది.

స్వావలంబన విషయంలో మరికొంత నిశితంగా ఆలోచిస్తే ఏయే రంగాలలో ఎంత స్వావలంబనను అవలంబించవచ్చుననే విశ్లేషణ చేయవచ్చు. వ్యవసాయం, పరిశ్రమ, సాంకేతిక పరిజ్ఞానం, సేవలు, విద్య, శాస్త్రవిజ్ఞానం, సాంస్కృతిక ప్రవర్తన మొదలయిన రంగాలను విడివిడిగా పరిశీలిస్తే, ఒక్కొక్క ప్రత్యేక రంగంలో ఆ సమాజానికి ఉన్న సొంత, చారిత్రక, వారసత్వ అనుభవం ఎంత, ఆ అనుభవం తీర్చలేని కొత్త అవసరాలేమయినా తలెత్తుతున్నాయా, ఆ అవసరాలను తీర్చుకోవడానికి స్థానిక వనరులతో, స్థానిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవచ్చునా, లేక పరాయి సమాజాల నుంచి ఎంతో కొంత గ్రహించక తప్పదా, ఆ స్వీకరణ ఏ పరిమితుల లోపల జరగాలి లాంటి ఎన్నో ప్రశ్నలకు జవాబులు చెప్పుకోవలసి ఉంటుంది. కొనసాగుతున్న అవగాహనలను మౌలికంగా ప్రశ్నించుకుంటే తప్ప విడివిడిగా ఒక్కొక్క రంగంలో స్వావలంబన సాధ్యమా కాదా అర్థం కాదు.

ఉదాహరణకు వ్యవసాయరంగం తీసుకుందాం. లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఆసియా దేశాలలో – ముఖ్యంగా ఉష్ణమండల దేశాలలో – నదీ తీరాలలో వ్యవసాయ నాగరికతలు కొన్ని వేల సంవత్సరాలుగా అభివృద్ధి చెందాయి. పర్యావరణాన్ని ధ్వంసం చేయకుండా, ఏయే వృక్షజాతులను ఎట్లా పెంచవచ్చునో, ఏయే వృక్షజాతులు ఎటువంటి ఆహార పదార్థాలను సమకూరుస్తాయో కొన్ని వందల తరాల అనుభవం మీద నిర్ధారణ అయింది. నిజానికి ఇదంతా గొప్ప సాంకేతిక పరిజ్ఞానం, గొప్ప శాస్త్ర విజ్ఞానం. పారిశ్రామిక విప్లవం తర్వాత, ముఖ్యంగా ఇరవయో శతాబ్దంలో వ్యవసాయ పనులలో శ్రమను యంత్రాలకు అప్పగించే ప్రయత్నం ప్రారంభమై, తక్కువ మానవ శ్రమతో ఎక్కువ దిగుబడి సాధించడం మొదలయిన తర్వాత,

క్రమంగా వ్యవసాయ రంగంలో దక్షిణార్ధగోళపు దేశాల సాంకేతిక విజ్ఞానం కన్న, ఉత్తరార్ధ గోళపు పారిశ్రామిక దేశాల సాంకేతిక విజ్ఞానానిది పైచేయి కావడం మొదలయింది. ఈ క్రమంలో వ్యవసాయ పరికరాల రంగంలో నుంచి ఎరువులు, క్రిమి సంహారకాలు, విత్తనాలు వంటి రంగాలలోకి కూడా పారిశ్రామిక దేశాల సాంకేతిక విజ్ఞానం విస్తరించి, మూడో ప్రపంచ దేశాల సాంప్రదాయిక వ్యవసాయ పరిజ్ఞానమంతా పనికిరానిదిగా మొదలయింది. వేల ఏళ్లుగా వినియోగంలో ఉన్న, పర్యావరణ సమతుల్యాన్ని కాపాడే ఎరువులు, రైతులు సాంప్రదాయకంగా, వారసత్వంగా పరిరక్షించుకునే వందలాది వంగడాల విత్తనాలు తెరమరుగయిపోయి, రసాయనిక ఎరువులు, హైబ్రిడ్ విత్తనాలు వ్యవసాయ రంగంలోకి ప్రవేశించాయి. ఇవి ఎక్కువ దిగుబడినిస్తాయని చెప్పినప్పటికీ, వాటి సాంఘిక, పర్యావరణ వ్యయాన్ని పరిగణనలోకి తీసుకుంటే, ఆ దిగుబడికి ప్రయోజనం హళ్లికి హళ్లికి సున్నకు సున్న అవుతుంది. ఈ అధిక దిగుబడి వంగడాల వల్ల జరిగిన మరొక ముఖ్యమైన పరిణామం, అవన్నీ ఎక్కువ చీడ పీడలను, కొత్త క్రిములను ఆశించేవి కావం. అందువల్ల కొత్త క్రిమిసంహారక మందులు అవసరమయ్యాయి. ఈ మొత్తం క్రమం అంతిమంగా మన వ్యవసాయ రంగాన్ని బహుళజాతి ఎరువుల, విత్తనాల, క్రిమి సంహారక మందుల కంపెనీల దయాదాక్షిణ్యాలకు బలిచేసింది. వేల ఏళ్లుగా సాగుతున్న మన వ్యవసాయరంగం, మన రైతుల సాంప్రదాయిక విజ్ఞానం స్వావలంబనను కోల్పోయి, పూర్తిగా పరాధీనం అయిపోయాయి. వీటికి తోడు పంటల ప్రాసెసింగ్, మార్కెటింగ్, రవాణా ప్రక్రియలన్నిటి మీద కూడా రైతులకు కాక బహుళజాతి సంస్థలకు, వారి దళారీలకు నియంత్రణ ఉండడంతో అక్కడ కూడా స్వావలంబన రద్దయిపోయింది.

చాలా క్లుప్తంగా వివరించిన ఈ వ్యవసాయరంగ ఉదాహరణ మన స్వావలంబన ఎట్లా క్షీణించిందో, అంతిమంగా వ్యవసాయరంగం మొత్తం పరాధీనమైపోయిందో చూపుతుంది. నిజానికి ఈ క్రమాన్ని చాలా వివరంగా, సూక్ష్మస్థాయి నుంచి, స్థూల స్థాయి వరకు చూడవచ్చు. ఇటువంటి క్రమాలే పరిశ్రమలలో, సాంకేతిక పరిజ్ఞానంలో, విద్యలో, సేవారంగంలో, శాస్త్రవిజ్ఞానంలో, సాంస్కృతిక రంగంలో గుర్తించవచ్చు.

ఇలా స్వావలంబన కోల్పోవడం వల్ల, పరాధీనత పెరగడం పర్యవసానాలుగా, మన ఆర్థిక వనరులు విదేశాలకు, బహుళజాతి గుత్త సంస్థలకు, సాంకేతిక పరిజ్ఞానం హక్కుదార్లకు తరలిపోవడం, మన సాంస్కృతిక జీవితంలో అవాంఛనీయమైన ధోరణులు తలెత్తడం, అయినదానికీ, కానిదానికీ ఇతరుల మీద ఆధారపడవలసి రావడం, మనలో న్యూనతాభావాలు తలెత్తి మనకు నాణ్యతా ప్రమాణాలు లేవని, మనం కొన్ని పనులు చేయలేమని మనమే అనుకోవడం వంటి దుష్పరిణామాలు తలెత్తుతాయి.

అయితే స్వావలంబన విధానాలను అమలు చేయాలని, ఏ సమాజమైనా, దేశమైనా స్వయం ఆధారితంగా, మరొకరి మీద ఆధారపడకుండా, సొంత కాళ్లమీద నిలబడాలని వాదించేటప్పుడు, దాని అర్థం తలుపులు మూసుకుని కూచోవాలని కాదు. సహజ వనరులతో,



శాస్త్ర విజ్ఞానంలోనయితే చాలా దేశాలు వెనుకబడే ఉన్నాయి. (అయితే ఈ వెనుకబాటు అనేది కూడా సామ్రాజ్యవాద నిర్వచనాల నుంచి చెప్పేదే. ఐదారు వందల సంవత్సరాల పెట్టుబడిదారీ దోపిడీ వల్ల, వలసవాద, సామ్రాజ్యవాద చరిత్ర వల్ల మూడో ప్రపంచదేశాలలో స్వతంత్ర శాస్త్ర విజ్ఞాన అభివృద్ధి ధ్వంసమైపోయి, యూరోపియన్, అమెరికన్ శాస్త్ర విజ్ఞానమే కొలబద్దగా మారిపోయింది). అందువల్ల కొన్ని రంగాలలో ఆ దేశాలు విదేశీ సహాయాన్ని అర్థించవలసి వస్తుంది.

అట్లాగే, అర్థశాస్త్రంలో ఒక్కోదేశానికి తులనాత్మకంగా ఉండే హెచ్చు అవకాశాల గురించి మాట్లాడతారు. ఒక దేశంలో వరి పండించడం ఎక్కువ లాభదాయకమైతే, మరో దేశంలో చెరకు పండించడం ఎక్కువ లాభదాయకం కావచ్చు. అటువంటప్పుడు ఎవరికి ఏ రంగంలో ఎక్కువ ప్రయోజనం ఉంటుందో, ఆ రంగం మీదనే కేంద్రీకరించి, ఇతర రంగాలలో విదేశీ సహాయం తీసుకోవచ్చు.

అయితే ఈ రెండు సందర్భాలలోను, ఆదాన ప్రదానాలు, ఇచ్చిపుచ్చుకోవడాలు పరస్పర ప్రయోజనకరంగా, సమానమైన, స్నేహ పూర్వకమైన సంబంధాల మీద ఆధారపడి ఉన్నప్పుడే స్వావలంబన కొనసాగుతుంది.

భారత చరిత్రలో వలసవాదం వల్ల, జాతీయోద్యమ క్రమంలో స్వావలంబన ఆలోచనలు విస్తృతంగా వ్యాపించాయి. బ్రిటిష్ వలసవాదం మన వ్యవసాయ, పారిశ్రామిక రంగాలను ఎట్లా దెబ్బతీసి, పరాధీనం చేసిందో స్పష్టంగా అర్థమైన తర్వాత జాతీయోద్యమం స్వావలంబనను ఒక ముఖ్యమైన ఆశయంగా గ్రహించింది. అందువల్లనే రెండో, మూడో పంచవర్ష ప్రణాళికల్లో స్వావలంబన మీద కేంద్రీకరించడం జరిగింది. కాని క్రమక్రమంగా భారత పాలక వర్గాలు స్వావలంబనను తుంగలో తొక్కి, దేశాన్ని సామ్రాజ్యవాద రథచక్రాలకు కట్టివేశారు.

***వీక్షణం, నవంబర్ 16-30, 2004***

# 33

## ప్రపంచీకరణ - సంస్కృతి - విలువలు

మొట్టమొదట ఇంత పెద్ద సంఖ్యలో డి.టి.ఎఫ్. తన మహాసభలను జయప్రదంగా జరుపుకుంటున్నందుకు అభినందనలు తెలియజేస్తున్నాను. అత్యంత పాశవికంగా ఉపాధ్యాయులపైన నిర్బంధం అమలు చేయబడ్డ కరీంనగర్‌లో డి.టి.ఎఫ్. సభలను నిర్వహించడం, అదీ ఇంత భారీ ఎత్తున నిర్వహించడం, నిజంగా ముదావహం. నిర్బంధం ఉద్యమాన్ని ఆపలేదు. ఏమంటే బంతిని ఎంత బలంగా నేలకి విసిరితే, అంతే ఉధృతంగా అది పైకి లేస్తుంది. అదే విధంగా నిర్బంధం పెరిగేకొద్దీ, ఉద్యమం విస్తృతమవుతుంది. ఈ సత్యాన్ని ఈ మహాసభలు నిరూపించాయి.

ఇక విషయంలోకి పోతే, ప్రపంచీకరణ, దీనిని ఎట్లా అర్థం చేసుకోవాలి? సంస్కృతిని ఎట్లా అర్థం చేసుకోవాలి? విలువలను ఎట్లా అర్థం చేసుకోవాలి? ప్రపంచీకరణ విలువలను, సంస్కృతిని ఎట్లా ప్రభావితం చేస్తోంది? అనే విషయాలను, ఒక రాజకీయార్థిక శాస్త్ర విద్యార్థిగా, సాహిత్య విమర్శకుడిగా మీతో పంచుకోవడానికి ప్రయత్నం చేస్తాను.

'రాజుల సంస్కృతి, ప్రజలది అంటే, చెల్లదు, చెల్లదు, చెల్లదులే' అని చెరబండరాజు రాశాడు. సంస్కృతులు రెండు రకాలు. ఒకటి ప్రజలది, రెండోది రాజుల సంస్కృతి. సంస్కృతి అనగానే ఏకశిలా సదృశంగా ఉండదు. అంతేకాదు



రాజుల సంస్కృతిని, ప్రజల సంస్కృతిగా చలామణీ చేసిన, దుర్మార్గమైన సంప్రదాయం ఒకటుంది. ఈ ముసుగును తొలగించాల్సిన అవసరం ఉంది.

నిన్నటి రోజు అంటే ఫిబ్రవరి 14 'వాలెంటైన్స్ డే'. 'ఇది భారతీయ సంస్కృతిని చిన్నాభిన్నం చేస్తోంది. అందుకనే మనం దీనిని వ్యతిరేకిస్తున్నాం' అని ఆర్.ఎస్.ఎస్. ప్రకటించింది. అయితే శివసేన అధినేత, ఆర్.ఎస్.ఎస్. భావాలతో ఏకీభవించే బాల్‌థాకరే, అప్పట్లో మైఖేల్ జాక్సన్ బొంబాయికి వచ్చి ప్రదర్శన ఇచ్చినప్పుడు, బాల్‌థాకరే ఇంటికి వచ్చి మీ బాత్‌రూమ్ వాడుకుంటానంటే అనుమతినిచ్చి, ఆ తరువాత ఆయన (మైఖేల్ జాక్సన్) వాడడం వల్ల నా బాత్‌రూమ్ పవిత్రమైందని ప్రకటించి తన అసలు రంగు బయటపెట్టాడు. ఈ రకమైన సంస్కృతీ పరిరక్షకులు 'వాలెంటైన్స్ డే'కు వ్యతిరేకంగా, గ్రీటింగ్ కార్డులమ్మే చిల్లర దుకాణాలపై దాడి చేస్తారు. అయితే ఈ 'శివసేన' మాత్రం – ఈ గ్రీటింగ్ కార్డులను తయారు చేసే కంపెనీలను ఈ దేశానికి ఆహ్వానించే ప్రభుత్వంలో భాగస్వామిగా ఉంటుంది. వీళ్లు కూడా భారతీయ సంస్కృతిని కాపాడే వారే.

ఇంతకీ భారతీయ సంస్కృతి అంటూ ఒకటి ఉన్నదా? దీన్ని ఒకే సంస్కృతిగా చూడాలా? లేక ప్రజల సంస్కృతి, రాజుల సంస్కృతి అని వేరువేరుగా చూడాలా అని ప్రశ్నించుకోవాలి. ప్రపంచీకరణ ఈ రెండు సంస్కృతులపై ఏ రకమైన ప్రభావాన్ని చూపుతున్నది? అయితే మనకు బయట ఉన్న శత్రువును విమర్శించటం తేలిక, మన లోపలి శత్రువును ప్రశ్నించటం చాలా కష్టం. మన సంస్కృతిగా మన మీద రుద్దబడ్డ, మన రక్తంలోకి ఇంకిన సంస్కృతిని మనం ప్రశ్నించగలమా? ఏది మన సంస్కృతో, ఏది రాజుల సంస్కృతో గమనించి మనదైన దాన్ని మనం సొంతం చేసుకోగలమా? ఇలా చాలా ప్రశ్నలున్నాయి. వీటికి సమాధానాలు తెలుసుకోవాల్సి ఉంది.

అసలు ప్రపంచీకరణ అంటే ఏమిటి? దాదాపు పదిహేను సంవత్సరాల నుంచి ఈ మాటను వింటున్నాం. 1991లో ఆర్థిక సంస్కరణలను మొదలుపెట్టిన పి.వి. నరసింహారావు ప్రభుత్వం, 'ప్రపంచం మొత్తం ఏకమైపోతోంది, స్వేచ్ఛా వాణిజ్య సంస్కరణలు ప్రపంచ దేశాల్లో వేగంగా అమలైపోతున్నాయి, ఈ సంస్కరణలను మనం కూడా అమలు చేయకపోతే వెనకబడిపోతాం' అని వాదించారు. ఈ వాదన చూడ్డానికి న్యాయంగా ఉంటుంది. ప్రపంచీకరణ అంటే కేవలం ప్రపంచం అంతా ఏకమైపోవడమేనా? అయితే ఏకం కావద్దని ఎవరంటున్నారు? ఎందుకంటున్నారు? ప్రపంచం అంతా ఏకమైపోతే లాభమా? నష్టమా? పదిహేనేళ్ల క్రితం వీళ్లు చెప్పిన ప్రపంచీకరణ, ఈ రోజు చెప్తున్న ప్రపంచీకరణ ఒకటేనా? ఇవన్నీ అర్థం చేసుకోవాల్సిన అవసరం ఉంది.

అయితే 'వసుధైక కుటుంబం' అనే భావన ఈ భారతదేశంలో చాలా వేల ఏళ్ల క్రితం నుంచే ఉంది. 'ఎల్ల లోకములొక్క ఇల్లై' అన్నాడు గురజాడ. యూనివర్సల్ బ్రదర్‌హుడ్ అన్నది క్రైస్తవం. అదే స్వీకరించి కొనసాగించింది ఇస్లాం. ఇట్లా ప్రపంచం ఒక్కటైపోవాలన్న కాంక్ష చాలా కాలం క్రితం నుంచే ఉంది. ఈ మాటలన్నీ ఎట్లా ఉన్నా బుష్, బ్లెయిర్, చంద్రబాబు

చెబుతున్న ప్రపంచీకరణ, పైన చెప్పిన ప్రపంచీకరణ ఒకటేనా? కాదు, కాబట్టి దీన్ని వ్యతిరేకించాలి.

ఎందుకు వ్యతిరేకించాలి? వీళ్లు ప్రపంచీకరణ అంటే 'ఇంటిగ్రేషన్ ఆఫ్ వరల్డ్ మార్కెట్స్' అంటే 'ప్రపంచ మార్కెట్ల ఏకీకరణ' అని. అంతేనా దీని అర్థం? అసలు ఆచరణకు, దీనికి తేడా ఉందా, లేదా? ఉన్నది. వీళ్లు ఏకం చేయదల్చుకున్నది, ప్రపంచ మొత్తం మార్కెట్లలో వాళ్ల సరుకే అమ్మకం అయ్యేట్లుగా అనుసంధానం చేయడమే వీళ్ల ప్రపంచీకరణ అసలు అర్థం. మానవ సమాజాలను సన్నిహితం చేయడం వీళ్ల ఉద్దేశ్యం కాదు. సంస్కృతుల ఆదాన, ప్రదానం వీళ్ల ఉద్దేశ్యం కాదు.

చరిత్రను చూస్తే అనేక నాగరికతలు ఒకదాని నుంచి మరొకటి సుసంపన్నం చేసుకోవడం మనం చూస్తాం. వీళ్ల ప్రపంచీకరణ అసలు ఉద్దేశ్యం అది కాదు. వీళ్ల అసలు ఉద్దేశ్యం కేవలం గుత్తాధిపత్యమే. అయితే గోముఖవ్యాఘ్రం లా ఇది ముందుకు వస్తున్నది. ఇది క్రమక్రమంగా దేశాల్ని అదుపులోకి తీసుకోవడానికే వస్తోంది. దీని అసలు పేరు 'సామ్రాజ్యవాద ప్రపంచీకరణ'. ప్రపంచీకరణ లక్ష్యాలు, సామ్రాజ్యవాద లక్ష్యాలు ఒక్కటే. ఇందులో లాభాల పరిభాష తప్ప, మానవ సంబంధాల పరిభాష లేదు. ఒకవేళ ఉన్నా అది భ్రమలు కల్పించడానికే అని అర్థం చేసుకోవాలి. ఈ రకంగా పెట్టుబడి కేవలం లాభనష్టాల పరిభాషతో మానవ సంబంధాలను మంటగలిపింది. సామ్రాజ్యవాద రూపం ధరించింది. మార్కెట్ల కోసం పోటీలో రెండు ప్రపంచ యుద్ధాలు చేసింది. కోట్లాది మందిని చంపింది. ఈ సంక్షోభం ఫలితంగా, అనివార్యంగా ఒక సోషలిస్టు ప్రభుత్వం ఏర్పడగానే బెదిరి, సంక్షేమ రాజ్యం రూపం ధరించింది. అనేక కుట్రలతో, కుతంత్రాలతో సోషలిస్టు రాజ్యాన్ని కూలదోసి, తనకు ఎదురేలేదని ఇప్పుడు వీర్రవీగుతోంది. ఈ దశలో పాత ముఖాలేవీ చెల్లక, ప్రపంచీకరణ అనే కొత్త ముసుగుతో, కొత్త ముఖంతో మళ్లీ మన ముందుకు వస్తోంది. ఈ లాభాలకు, సరకులకు సంస్కృతి ఉండదు. మనుషులకు సంస్కృతి ఉంటుంది. మరి సంస్కృతి లేకపోయినా సామ్రాజ్యవాద సంస్కృతి అని మనం ఎందుకంటున్నాం? అంటే సరుకులు ఒక సంస్కృతిని మోసుకొస్తున్నాయి. ఇదివరకటి మన సంస్కృతికి వ్యతిరేకమైన సంస్కృతిని తీసుకువస్తున్నాయి. ఈ సరుకులు మన డ్రాయింగ్ రూమ్‌లలోకి, వంట గదుల్లోకి కొత్త సంస్కృతిని తీసుకు వచ్చేస్తున్నాయి.

ఈ సామ్రాజ్యవాదానికి ప్రతీక అయిన, అధినేత అయిన అమెరికాకు సంస్కృతి లేదు. వలస వచ్చిన యూరోపియన్ జాతులు అమెరికా ఖండంలోని, స్థానిక గిరిజనులను, తెగలను ఊచకోత కోసిన సంస్కృతి, అమెరికా సంస్కృతి. అమెరికా భాష సొంత భాషకాదు, కట్టూ, బొట్టూ ఏదీ సొంతం కాదు. ఇట్లాంటి సంస్కృతి గల దేశం తన ఆధిపత్యాన్ని ప్రపంచంపై నిలుపుకోవడం కోసం ఏ రకమైన సంస్కృతిని కూడా సరుకు చేయడమే దాని లక్ష్యం. వివిధ దేశాల్లోని, ప్రాంతాల్లోని ప్రజలు ఇష్టపడే, ప్రజలకు ఉపయోగపడే వస్తువులను సరుకు చేయడమే దాని లక్ష్యం. ఇట్లాంటి నైజం కలిగిన అమెరికా ప్రపంచీకరణ ద్వారా, మనకు సంస్కృతి గురించి నేర్పుతాననంటుంది. పట్టుమని ఐదు వందల సంవత్సరాల వయస్సులేని మిశ్రమ సంస్కృతి, వేల వేల ఏళ్ల సంస్కృతీ చరిత్రగల మనకి నేర్పేదేమిటి?



ఇకపోతే సంస్కృతి ఎట్లా ఏర్పడుతుంది, భాష ఎట్లా ఏర్పడుతుంది అని ప్రశ్నించుకుంటే, భాషా శాస్త్రజ్ఞులను అడిగితే శ్రమ నుండి భాష ఏర్పడిందని చెబుతారు. కాబట్టి భాషకు, సంస్కృతికి మౌలికమైన వనరు, శ్రమ మాత్రమే. కాని ఇప్పుడు శ్రమను పక్కనబెట్టి, శ్రమను అప్రధానం చేసి సంస్కృతిని అర్థం చేసుకునే విధంగా ఆ సంస్కృతి, అప సంస్కృతిని ప్రవేశపెట్ట ప్రయత్నిస్తున్నారు.

మన దేశంలో విద్యా విధానాన్ని ప్రవేశపెట్టిన మెకాలే ఆయన తండ్రికి రాసిన ఉత్తరంలో 'ఈ తూర్పు దేశాలలోని సమస్త గ్రంథాల్లో గల విజ్ఞానం, మన దేశంలో ఒక బీరువాలోని ఒక వరుసలో గల గ్రంథాలలోని విజ్ఞానానికి సమానం మాత్రమే. వీళ్ల గ్రంథాలలో సరుకులేదు, వీళ్లకు విజ్ఞానం నేర్పాల్సిన బాధ్యత మనపై ఉంది' అని రాశాడు. ఇంకా ఏం రాశాడంటే, 'పుట్టుకతో మాత్రమే వారు భారతీయులై ఉండాలి. లక్షణాల్లో, అభిరుచులలో వారిని, ఇంగ్లిష్ వారిగా తీర్చిదిద్దాలి. అదే మనం నేర్పబోయే విద్యకావాలి' అని రాశాడు. అంటే ఈ దేశంలో ఇంతవరకు సంస్కృతి లేదని, మనకున్నది సంస్కృతే కాదని, దీన్నంతా రద్దుచేసి ఒక కొత్త గుమస్తాలను తయారు చేసే విద్యను, సంస్కృతిని మనకు బోధించాలనుకున్నారు. అయితే ఈ సాంస్కృతిక ఆభిజాత్యం బహిరంగంగా బయటకు కనబడేది. కాని ఇప్పుడు ప్రపంచీకరణ పేరిట వస్తున్న, మనపైన రుద్దబడుతున్న సంస్కృతి మాత్రం పైకి ఏ మాత్రం తన ఆధిపత్యాన్ని ప్రదర్శించకుండా మన రక్తంలో ఇంకించ బడుతున్నదని మనం గ్రహించాలి. ఈ ధోరణినే, దాదాపు మెకాలే కాలంలోనే కార్ల్‌మార్క్స్ రాజకీయార్థ శాస్త్రం దృష్టితో చూస్తూ 'పెట్టుబడి సంస్కృతి, తనకు తాను ప్రపంచమంతటా పునరుత్పత్తి చేసుకుంటుంది' అని చెప్పాడు.

పెట్టుబడిదారీ సంస్కృతిలో గల పోటీవల్ల అది రోజు రోజూ తయారు చేస్తున్న కొత్త కొత్త ఉత్పత్తులను అమ్మడానికి కొత్త మార్కెట్లను వెతుక్కుంటుంది. ఈ క్రమంలో అది వలసవాదానికి, సామ్రాజ్యవాదానికి పాల్పడుతుంది. అట్లా కొత్త మార్కెట్‌ను పొందినపుడు ఆ ప్రజలు, ఈ సరుకులను కొనకపోవచ్చు, అందుకోసం వాళ్లు తయారు చేసిన సరుకులను మీకు చాలా అవసరం అని మీచే నమ్మించడం పెట్టుబడి సంస్కృతి. అట్లా మీరు నమ్మాలంటే, మీరు ఇప్పటివరకు ఆచరిస్తున్న సంస్కృతి పనికిరాదని ఊదరగొట్టాలి. అంటే 'సరుకు' కేవలం 'సరుకు'గానే రాదు. అది సరుకు సంస్కృతితో వస్తుంది. అట్లా వచ్చిన సంస్కృతి, ఆయా ప్రాంతాల్లో ఉనికిలో ఉన్న సంస్కృతులను ధ్వంసం చేస్తుంది. ప్రపంచీకరణకు కావాల్సిన మొదటి అవసరం. 'సాంస్కృతిక వినాశనం' అని మనం గ్రహించాలి.

అయితే ఈ పెట్టుబడిదారీ సంస్కృతికి, బ్రాహ్మణవాద సంస్కృతికి ఉన్న లంకె ఏమిటంటే, మన దేశంలో వర్ణ, కుల భేదాలతో మెజారిటీ ప్రజలు చాలాకాలం పాటు అగ్రవర్ణాలకంటే తాము తక్కువని నమ్మారు, తమ సంస్కృతి అల్పమైనదని, హీనమైందని, బ్రాహ్మణ సంస్కృతి నమ్మింపజేసింది. అదే విధంగా పెట్టుబడిదారీ సంస్కృతి కూడా మన సంస్కృతి అల్పమైనదని, కట్టూ బొట్టూ, రీతీ, రివాజు ఇవన్నీ పనికిరానివని నమ్మింపజూస్తుంది. ఇదే ఆధిపత్య శక్తుల (బ్రాహ్మణీయ, పెట్టుబడిదారీ శక్తుల) మధ్య ఉండే సారూప్యతగా మనం అర్థం చేసుకోవాల్సిన

అవసరం ఉంది. అంతేకాకుండా పెట్టుబడిదారీ వ్యవస్థ మొదట, మార్కెట్ విస్తరణకోసం యూరోపులోనూ, ఇంగ్లాండ్‌లోనూ రాజరికంపై పోరాడింది. అయితే వెనుకబడ్డ ఆసియా ఖండానికి కూడా ఇది విస్తరించినపుడు అదేం చేయాలి? ఆసియా దేశాలలోని భూస్వామ్యంతో పోరాడాలి. కాని మొదటి ప్రపంచ యుద్ధం, 1914-17 తరువాత అది తాను భూస్వామ్యానికి కొమ్ముగాసి, భూస్వామ్యంతో మిలాఖత్ అయి తన మార్కెట్‌ను విస్తరించుకోవాలి అని నేర్చుకున్నది. ఈ విషయాన్ని లెనిన్ వేరే సందర్భంలో విశ్లేషించి చెప్పాడు. కేవలం ఈ కారణంగా మూడవ ప్రపంచ దేశాలలోని భూస్వామ్యం, పెట్టుబడిదారీ సంస్కృతిని అంత ఇబ్బంది లేకుండా ఆమోదించడం మనం చూస్తాం.

ఈ విధంగా ఆయా దేశాల సంస్కృతిని నీచంగా చూపడం వల్లనే, మనం మన భాషల కంటే ఆంగ్ల భాష ఉత్తమమైంది, ఉన్నతమైందని భావిస్తున్నాం తప్ప మరేం కాదు. అయితే ఈ విధంగా ఒక భాష గొప్పదని భావిస్తే నష్టం లేదు. అయితే అది అక్కడితో ఆగకుండా, ఇంగ్లిష్ మాట్లాడే వాడు గొప్పవాడు, వాడి సంస్కృతి గొప్పది, వాడి సాహిత్యం గొప్పది అనే ఆలోచన సహజంగానే ఏర్పడుతుంది. నిజానికి ఇప్పటి భారతదేశ మధ్యతరగతి ఆలోచనా ధోరణి ఇలాగే ఉంది. ఇది ప్రమాదకరం. అయితే వాస్తవమేమిటంటే, మనం తెలుగువాళ్లం కాబట్టి చెబుతున్నాను, మన తెలుగులో లిఖిత సాహిత్యం వచ్చే నాటికి, ఆంగ్ల భాష అనేదే ఒకటి లేదంటే అతిశయోక్తి కాదు. అంతేకాదు భారతదేశంలో ఇతర అనేక భాషలన్నీ ఆంగ్లం కంటే బాగా ప్రాచీనమైనవే, సుసంపన్నం అయినవే. మన తెలుగుజాతిని, భాషను, ఆత్మగౌరవాన్ని నిలబెడతానన్న తెలుగుదేశం, తన స్వర్ణాంధ్రప్రదేశ్ కలలను మాత్రం, విజన్ – 2020లో ఆంగ్లంలోనే కన్నది. ఇప్పటిదాకా ఇంకా తెలుగులో కనలేదు.

ఈ విధంగా భాషలో, సంస్కృతిలో విభజనను, నిమ్న ఉన్నతాల్ని సృష్టిస్తే, ఇది సహజంగానే సరుకుల విషయంలో కూడా వర్తించి సరుకు అమ్మకానికి మార్గం సుగమం అవుతుంది. అది ఒక రకమైన దాడి.

ఇక రెండోది ఇంకాస్త ముందుకుపోయి, మార్కెటైజేషన్, అంటే మార్కెటీకరణ ద్వారా, అన్ని మార్కెట్లను తన గుప్పిట్లో బంధించడం, తన సరుకులే అమ్ముడుపోయేటట్లుగా చేయడం. అయితే దీనికి చేయాల్సింది ఏమిటి? స్థానిక పరిశ్రమలను నాశనం చేయడం. ప్రభుత్వాలను స్థానిక పరిశ్రమలకు చేయూత నివ్వకుండా చేయడం. అవసరంలో ఉన్నవాడికి, కావాల్సిన జాలి, దయ మొదలైనవి ఏవీ లేకుండా చేయడం. సరుకు అమ్మడానికి అడ్డం వచ్చే ప్రతీదాన్ని నాశనం చేయడం. ఇది పెట్టుబడి సంస్కృతి. ఇప్పుడు మన దేశంలోకి వచ్చిన బహుళజాతి కంపెనీలవల్ల ఎన్ని స్థానిక పరిశ్రమలు, కులవృత్తులు నాశనం అయ్యాయో మనకు తెలియంది కాదు. ఈ విధంగా వచ్చిన బహుళజాతి కంపెనీలు ఆ మధ్య ఒక లెక్క వేశాయి. ఈ దేశంలో మొత్తం వంద కోట్ల జనాభా ఉంది. దీంట్లో ముప్పై కోట్ల మంది మధ్యతరగతి అంటే వినియోగదారీ సంస్కృతి వంటబట్టిన తరగతి. ఈ తరగతికి సంబంధించిన వారిని మనం ఆకర్షించగలిగితే చాలు అని నిర్ణయించాయి. అంటే సుమారు ఆరు కోట్ల మధ్యతరగతి ఇళ్లు. మనం ఇళ్లుగా,



కుటుంబాలుగా అర్థం చేసుకుంటున్నాం. కాని వాళ్లకు ఆరు కోట్ల కుటుంబాలు, అంటే ఆరు కోట్ల మోటారు సైకిళ్లు, రిఫ్రిజిరేటర్లు, వాషింగ్ మెషీన్లు, టేప్ రికార్డర్లు మొదలైనవి. అంటే కుటుంబాలు అంటే మనుషులు కాదు, సరుకులు అని వాళ్ల అర్థం. ఈ విధంగా ఉన్న లెక్కలతో వాళ్లు సరుకు ఉత్పత్తి చేస్తూ, మార్కెట్ చేస్తే ఇప్పుడిప్పుడు ఈ ముప్పై కోట్ల మందికి కొనుగోలు శక్తిలేదని అర్థమైంది. అసలు మధ్యతరగతి జనాభా ఇరవై కోట్లు లేదా పదిహేను కోట్లు అని లెక్కలు తిరగరాసుకున్నారు. కారణం మనది పేదదేశం. ఇక్కడ కొనుగోలు శక్తిలేదు. విలువతగ్గిన చిన్న చిన్న సరుకులతో భారతదేశ గ్రామాలలోకి విస్తరించడం ఇప్పటి లక్ష్యమైంది. ప్రస్తుతం వాళ్లకు పట్టణాలలో కంటే భారతదేశ గ్రామాలలోనే ఎక్కువ మార్కెట్ ఉంది అని అర్థమైంది. అందుకే ఇక్కడికి నాలుగు లైన్ల రోడ్లు కావాలి, ప్రతీ గ్రామానికి రోడ్డు ఉండాలి. ఉంటే అక్కడికి కోకాకోలా, టూత్‌పేస్ట్‌లు, వాళ్లకు అవసరం లేని షాంపూ పాకెట్లు, రకరకాల చిల్లర సరుకులు సరఫరా చేసి, అమ్ముకోవచ్చు.

ఈ విధంగా మనముందుకు వచ్చిన సరుకులను మనం ఒకవేళ కొనకపోవచ్చు. తెలుగులో మన వాళ్లు ఒక సామెత చెబుతుంటారు. 'గుర్రాన్ని నీళ్ల దగ్గరకు తీసుకుపోగలం కాని దాంతో నీళ్లు తాగించలేం' అని. మరి గుర్రానికి దాహం పుట్టించడం ఎలా? అంటే సరుకులు కొనే వినియోగదాహం పుట్టించడం అవసరం. దానికే సంస్కృతి కావాలి. మనం ఇప్పుడు జీవిస్తున్న విధానం ఉత్తమమైంది కాదు, సౌకర్యవంతం కాదు, అని మనం భావించాలి. దీనికి మనల్ని ఎక్కువగా ప్రభావితం చేయగలిగేది సమాచార ప్రసార వ్యవస్థ. ఇప్పుడు వచ్చే వ్యాపార ప్రకటనలు చూడండి, టి.వి. సీరియల్స్ చూడండి, చెప్పేదేమో మధ్యతరగతి కుటుంబీకులు, కానివాళ్ల ఇళ్లు, వ్యవహారశైలి, డాబు, దర్పం మాత్రం అలా అనిపించవు. ఇట్లా చాలాకాలం చూస్తే మనకి కూడా ఇట్లా విలాసవంతంగా జీవించాలనే కోరిక పుట్టవచ్చు. అదే కావాలి వాళ్లకు. అదే వాళ్ల సరుకును మనచే కొనిపిస్తుంది. అదే మనలో వస్తు వినియోగ దాహాన్ని పుట్టిస్తుంది. ఈ విధంగా జీవించడమే మన లక్ష్యంగా చూపబడుతున్నది. ఈ దాహం మనిషిలో స్వార్థాన్ని, స్వసుఖవాదాన్ని పెంచి, మనిషిని, మనిషిని వేరు చేయడానికి కూడా ఉపయోగపడుతున్నది. ఇవన్నీ పొందలేక పోయినపుడు మనిషి నిరాశలోకి పోతాడు. తనపై తాను నమ్మకం కోల్పోతాడు. అతీత శక్తులపై నమ్మకం పెంచుకుంటాడు. 'అందుకే దైవత్వం ఎట్లానైతే వాస్తవం కాదో, వస్తు వ్యామోహం కూడా నిన్ను వాస్తవం కాకుండా మాయగా మార్చి, నిన్ను నిస్తేజం చేస్తుంది. నీ ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయేలా చేస్తుంది' అని సరుకు గురించి మార్క్స్ రాస్తాడు.

ఈ విధంగా సరుకును మార్కెట్లలో నింపడం ద్వారా, వాళ్ల సరుకును కొనేటట్లు చేయడాన్ని అమెరికా వాడు ఇప్పుడు మెక్‌డొనాల్డైజేషన్ అంటున్నాడు. ఈ విధంగా మెక్‌డొనాల్డైజేషన్ ద్వారా, మనం పరాయీకరించబడుతున్నాం. ఈ విధంగా మనం మన సంస్కృతి నుండి దూరం చేయబడుతున్నాం. వస్తు వినియోగ సంస్కృతికి లోనవుతున్నాం. ఇది వస్తు వినియోగ వ్యామోహం దగ్గరే ఆగిపోదు. దానిని ప్రదర్శించుకోవాలనిపిస్తుంది. నా దగ్గర

ఇన్ని వస్తువులు ఉన్నాయని చూపించుకోవాలనిపిస్తుంది. ఈ ఆర్భాటానికి హద్దు అంటూ ఏమీలేదు. అవసరం ఉన్నా లేకున్నా యాభై నుంచి అరవై లక్షలు ఖరీదు చేసే ఇళ్లు కడుతున్నారు. పెళ్లిళ్లు చేస్తే కోట్లు ఖర్చు పెట్టిచేస్తున్నారు. పెళ్లి అంత వైభవంగా ఫలానా ఆయన చేశాడు, అని ప్రచారం కావడం కూడా వినియోగ సంస్కృతి పరాకాష్ట. వస్తువులను గురించి ఆర్థిక శాస్త్రంలో ఒక విభజన ఉంటుంది. అదేమిటంటే అవసరాలు, సౌకర్యాలు, విలాసాలు. ఇరవై ఏళ్ల క్రితం అందరికీ అవసరాలు తీరాలి అని కొంతైనా ఉండేది. కాని ఇప్పుడు అవసరాల కంటే విలాసాల మీదనే ఎక్కువ ఖర్చుపెట్టే దుబారా సంస్కృతి పెట్టుబడిదారీ వర్గాలచే పెంచి పోషించబడుతున్నది. ఈ ప్రచారం వల్ల సరుకు అమ్మకానికి మార్గం సుగమం అవుతుంది.

ఇదే రకమైన విధానాన్ని రాజకీయ రంగంలోకి కూడా ప్రవేశపెట్టాడు, దానికి సమర్థుడు చంద్రబాబు. ప్రజలకు అవసరమైన పనులు ఏమీ చేయడు. కాని ప్రచారం మాత్రం చేసుకుంటాడు. పనిచేయడు. నేను ఇంత, అంత పని చేశానని మాట్లాడుతాడు. ఈ గోబెల్స్ ప్రచారాన్ని, మానవ విలువలను లుప్తం చేయడానికి ఉపయోగిస్తున్నారు. ఈ విధమైన ధోరణి వల్ల, పనిచేసే వాడి కంటే, ఎక్కువ మాట్లాడే వాడికి, ప్రచారం చేసుకునేవాడికి, గౌరవం దక్కే పరిస్థితి ఏర్పడింది. ఇది మానవ విలువలను తలక్రిందులుగా చూపే ప్రయత్నం. ఉత్పాదక రంగంలో ఉన్న వారికి దక్కాల్సిన గౌరవం, ఈ సంస్కృతి వల్ల అనుత్పాదక రంగంలో వారికి దక్కుతున్నది. శారీరక శ్రమ చేసే వాడికి దక్కాల్సిన గౌరవం, శారీరక శ్రమతో సంబంధం లేని వారికి దక్కుతున్నది. ఈ విధమైన తలక్రిందుల విలువలను మాత్రమే నిజమైనవని ప్రచారం చేయడమే ఈ విష సంస్కృతి లక్ష్యం. అందుకే కార్ల్ మార్క్స్ 'ఈ ప్రపంచం తలకిందులుగా ఉంది, దీన్ని మళ్లీ కాళ్లమీద నిలబెట్టడమే మనపని' అని అన్నాడు.

ఇకపోతే నేను కరీంనగర్‌లో ప్రవేశించాక, మన డి.టి.ఎఫ్. పోస్టర్ల కంటే, జనచైతన్య వేదిక పేరుతో, పోలీసులు వేసిన పోస్టర్లే ఎక్కువగా ఉన్నాయి. వాళ్లేం అంటున్నారు, ఉపాధ్యాయులు గ్రామాల్లోనే ఉండండి అని అంటున్నారు. అయితే ఉపాధ్యాయులు గ్రామాలలో ఉండడానికి ఎందుకు భయపడుతున్నారు? వాళ్లు చైతన్యం తెస్తున్నారనే కాదా! నువ్వు వివిధ ఉద్యమాలలో ఉన్న ఉపాధ్యాయులను కూడా చంపావు. పెట్టుబడి సంస్కృతికి అడ్డుచెప్పే దీన్ని నువ్వు సహించలేకనే కదా! ఇంకా ఏమంటున్నారంటే 'విధ్వంసం ఆపండి, వికాసాన్ని కోరండి' అని, ఇదింకా బాగుంది. విధ్వంసం చేస్తున్నది ఎవరు? వికాసాన్ని కోరుతున్నదెవరు?

దాదాపు రెండు దశాబ్దాల క్రితం చాలా నిరంకుశంగా, పాశవికంగా అమలైన భూస్వామ్యాన్ని వ్యతిరేకించినందుకు వచ్చిన ఉద్యమాన్ని అణచివేసేందుకు అప్పటి ప్రభుత్వం ఈ కరీంనగర్ జిల్లాలోని జగిత్యాల, సిరిసిల్ల మొదలైన ప్రాంతాలను 'కల్లోలిత ప్రాంతాలు'గా ప్రకటించింది. అంటే తమపైన క్రూరత్వం, పాశవికత అమలైతే, దానికి వ్యతిరేకంగా ఉద్యమిస్తే అది విధ్వంసం. దీన్ని అణచివేయడానికి పోలీసులు చేసే బీభత్సం మాత్రం శాంతి. విధ్వంసాన్ని పరిశీలించడానికి ఢిల్లీ నుంచి పి.యు.సి.ఎల్. బృందం వచ్చి పరిశీలించినప్పుడు, ఒక సాధారణ రైతు, వాళ్లకు ఏం చెప్పాడంటే 'ఇంతవరకు ఇక్కడ దొర దుమ్మును, ధూళిని తమ చెప్పుకింద



అణచిపెట్టాడు. ఇప్పుడు దుమ్ము ఎగిరి దొర కళ్లల్లో పడ్డది' అని అన్నాడు. దుమ్మును అణచిపెట్టడం విధ్వంసం అవుతుందా? దుమ్ము కంట్లోకి ఎగిరిపడడం విధ్వంసం అవుతుందా? తేల్చుకోవాల్సిన ప్రశ్న ఇది. ఈ తేల్చుకోవాల్సిన ప్రశ్నను పెట్టుబడిదారీ వ్యవస్థ తలకిందులుగా నిలబెడుతుంది.

ప్రపంచీకరణ, పెట్టుబడిదారీ సంస్కృతి ఈ వ్యవస్థలో ఉన్న రకరకాల ఉన్నత వర్గాలకు, ఐ.ఎ.ఎస్. ఆఫీసర్లకు ఏమిచ్చిందని వాళ్లు 'ప్రపంచీకరణ' జరగాలని కోరుకుంటున్నారు? లంచం ఇచ్చిందని చెప్పక తప్పదు. ఈ ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. అధికార్లు, మనం సెక్రటేరియట్‌కి వెళితే ఒకప్పుడు లంచగొండితనం మరిగిన వాళ్లు ఒక్కళ్లో, ఇద్దరో కనపడే వారు. కాని ప్రపంచీకరణ మొదలైన తరువాత ఉన్న అధికార్లందరిలో ఒక్కరో ఇద్దరో నిజాయితీపరులు, మిగిలిన వారందరూ కరప్ట్ అని తెలుస్తుంది. జూబ్లీహిల్స్ పక్కన ఉన్న 'ప్రశాసన్ నగర్' వెళ్లి చూస్తే, ఒక్కొక్క అధికారి ఎన్ని కోట్ల రూపాయలు పెట్టి ఇల్లు కట్టుకున్నారో. వీరందరూ ఈ విధమైన సుఖలాలసతకు మరిగిన తరువాత ప్రపంచీకరణ ఫలితంగా వచ్చిన ఈ హోదాతో ప్రపంచీకరణ జరగాలని కాక వారు మరేం కోరుకుంటారు?

ఈ డబ్బుతో వారు ఏం చేయాలనుకుంటున్నారు? వస్తు వ్యామోహంతో అనేక రకాలైన సరుకులు కొనాలనుకుంటున్నారు. పెట్టుబడిదారీ సంస్కృతి వస్తు వినియోగ సంస్కృతిని పెంచింది. వినిమయదాహాన్ని పెంచింది. అందుకని మీ బోటి, నాబోటి ఉద్యోగులు డబ్బు దాచుకోనో, లేదా తిండి తగ్గించో వస్తువు కొంటున్నాం. కాని లంచం తీసుకోవడానికి, అవినీతికి అవకాశం ఉన్న ఉద్యోగులు, వస్తు వ్యామోహాన్ని తీర్చుకోవడానికి అవినీతికి పాల్పడుతున్నారు. అంటే ప్రపంచీకరణ, పెట్టుబడిదారీ వ్యవస్థ తీసుకువచ్చిన 'వినియోగ సంస్కృతి' ఉన్నత అధికార్ల వ్యవస్థలో విపరీతమైన అవినీతిని కూడా ఉత్పత్తి చేసింది. ఇది కింది నుంచి మీది వరకు అన్ని స్థాయిల్లో పెరిగిపోయింది. అంటే ప్రపంచీకరణ ముద్దుబిడ్డలలో 'అవినీతి' ఒకటి. ఈ దేశంలో అవినీతి అంతకుముందు లేదనికాదు. కాని అది ఒక వ్యవస్థలా వేళ్లూనుకుని పోవడానికి, అత్యున్నత స్థాయిలో కూడా బలంగా తయారు అవడానికి కారణం మాత్రం, ప్రపంచీకరణ అని చెప్పాల్సి ఉంటుంది. ఈ కింది నుంచి మీద వరకు ఉన్న అవినీతిలో చివరి అంచుల్లో ఉన్న అవినీతిని పట్టుకొని, ఇదిగో మేం అవినీతిని పట్టుకున్నాం, అని పెద్ద ప్రచారం చేస్తాయి 'లోక్‌సత్తా' లాంటి సంస్థలు.

ఈ రకంగా ప్రపంచీకరణకు వ్యతిరేకంగా తలెత్తుతున్న అసంతృప్తిని, చల్లార్చడానికి కూడా ఇట్లాంటి సుద్దులు చెప్పే విధానం పనికొస్తుంది. అందుకే ప్రపంచబ్యాంకు అధిపతి ఉల్ఫెన్‌సన్ కూడా మొన్న బొంబాయిలో జరిగిన వరల్డ్ సోషల్ ఫోరమ్ మీటింగ్‌కు తన సందేశాన్ని పంపాడు. 'ఈ వర్ధమాన ప్రపంచంలో మీలాంటి వారి అవసరం చాలా ఉంది' అని. సరే సందేశం పంపించడానికి వాడికి సిగ్గులేకపోయినా, వాళ్లు నడిపిన పత్రికలో ఆ సందేశం వేయడానికి వీళ్లకు కూడా సిగ్గులేదు. నేను ముందునుంచి చెబుతున్నట్టు, డబ్ల్యు.ఎస్.ఎఫ్. కూడా ఒక ప్రపంచీకరణ ముద్దుబిడ్డే. వాడు ఎన్నెన్ని ముఖాలతో మనపై దాడి చేస్తున్నాడో గమనించండి. ఈ విధంగా మనిషిని అవినీతికి, స్వార్థానికి, కృత్రిమత్వానికి లోను చేయడానికి

ఈ ప్రపంచీకరణ, సరుకులపై వ్యామోహం ఉపయోగపడుతోంది. సంస్కృతిని చిన్నాభిన్నం చేసి మనిషి నుంచి మనిషిని వేరుచేసి ఒంటరి ద్వీపంగా మనిషిని మార్చి వేస్తోంది. అందుకొరకే ఈ సంస్కృతిని వ్యతిరేకించాలి. మనిషి తోటి మనిషి గురించి పట్టించుకోకుండా, శిలగా మార్చే సంస్కృతి మనకు అక్కర్లేదు.

సంస్కృతి అంటే ఏమిటి? మానవ సంబంధాలను పటిష్టపరిచేది – మనిషిలో సహజమైన, జాలి, కరుణ, దయ మొదలయిన గుణాలను పెంపొందించేదే – సంస్కృతి. దీనికి వ్యతిరేకమైనది ఏదైనా దాన్ని వ్యతిరేకించవలసినదే. కచ్చితంగా ప్రపంచీకరణ మనిషిని స్వార్థపరుడిగా మారిస్తే తప్ప తన సరుకును అమ్ముకోలేదు. అందువల్లనే దానిని వ్యతిరేకించాలి. అయితే దీనిని వ్యతిరేకించే విధానం ఏది? ఈరోజు శివసేన, ఆర్.ఎస్.ఎస్., స్వదేశీ జాగరణ్ మంచ్ మొదలైన సంస్థలు విదేశీ సంస్కృతికి వ్యతిరేకంగా పనిచేస్తున్నామని చెప్పుకుంటున్నాయి. కాని అవి విదేశీ సంస్కృతిని ముమ్మాటికి, తలుపులు బార్లా తెరిచి ఆహ్వానిస్తున్న ఎన్.డి.ఎ., బి.జె.పి. ప్రభుత్వంలో భాగస్వాములు. అంటే వారి ప్రపంచీకరణ వ్యతిరేకత ఒక ముసుగు మాత్రమే. అది 'నేతి బీరలో నెయ్యి' లాంటిది.

మనం అర్థం చేసుకోవలసినది ఏమంటే, ప్రపంచీకరణ, బ్రాహ్మణ ఆధిపత్యం, భూస్వామ్యం, పెట్టుబడి ఇవన్నీ ఈరోజు కలిసిపోయి, వివిధ రూపాల్లో మనపై దాడి చేస్తున్నాయి. వీటిపై మనం చేయాల్సిన పోరాటం కూడా విడివిడిగా కాకుండా అన్ని ఆధిపత్యాలపై జమిలిగానే పోరాడాలి అని గుర్తించాల్సి ఉంది. ఈ విధమైన, భూస్వామ్య వ్యతిరేక, పెట్టుబడి వ్యతిరేక ఆకాంక్షగల ప్రజలందరినీ ఏకం చేసి, ఒక్క వేదిక మీదకు తీసుకువచ్చి, పోరాడితే తప్ప కొద్దిపాటి ఫలితాన్ని కూడా మనం సాధించలేం. ఈ రకమైన పోరాటం, విశాలమైన ఐక్య ప్రజాసంఘటన వల్ల మాత్రమే సాధ్యం. ఈ పోరాటం బహుముఖంగా, వివిధ రూపాల్లో సాగాల్సి ఉంది. ఇది వ్యక్తిగత స్థాయి నుండి కూడా సాగాల్సి ఉంది. ప్రపంచీకరణ మనపై వేసిన గుర్తుల్ని, మనకు నేర్పిన సంస్కృతిని, వ్యక్తి స్థాయిలో, కుటుంబ స్థాయిలో పునః సమీక్షించుకోవాలి. ఆ విధంగా మాత్రమే మనం ప్రపంచీకరణకు వ్యతిరేకంగా, బలంగా, శక్తివంతంగా పోరాడగలం. దానిని ఓడించడం పెద్ద కష్టమేమీ కాదు.

డి.టి.ఎఫ్. సభ్యులకు నేను కొత్తగా చెప్పాల్సింది ఏమీ లేదు. ప్రపంచీకరణ వ్యతిరేక చర్చను మీరు చాలాకాలంగా ముందుకు తీసుకుపోతూ ఉన్నారు. అయితే మీరు నిర్వహించిన సభలన్నింటిలో వచ్చిన వారందరిని లెక్కవేసుకున్నా వేలల్లోనే ఉంటుంది. కాని ఒక్క ఈ రాష్ట్రంలోనే ఏడు కోట్ల మంది ప్రజలున్నారు. వారందరికీ ఈ చర్చను చేరవేయాల్సిన బాధ్యత మనపై ఉంది. ఆ రకంగా దేశమంతా వ్యాపింప చేయవలసిన బాధ్యత మనపై ఉంది.

***(డి.టి.ఎఫ్. సభలలో ప్రసంగం)***
***అధ్యాపక జ్వాల, జూలై - ఆగస్ట్ 2004***



# 34

# గుడ్‌గాంవ్ దమనకాండ ప్రకటిస్తున్న హెచ్చరిక

పదమూడు సంవత్సరాలుగా దేశంలో కొనసాగుతున్న ప్రపంచీకరణ క్రమం మన పారిశ్రామిక రంగాన్ని, సంఘటిత కార్మికోద్యమాన్ని ఏరకంగా మార్చేసిందో అర్థం చేసుకోవడానికి గుడ్‌గాంవ్ దమనకాండ ఒక ప్రబలమైన చిహ్నం. గుడ్‌గాంవ్‌లోని హోండా ఉత్పత్తి యూనిట్‌లో కార్మికులు ఐక్యం కావడాన్ని దెబ్బతీయడానికి కొన్ని నెలలపాటు జరిగిన ప్రయత్నాలు చివరికి జూలై 25న బహిరంగంగా దమనకాండగా మారాయి. టి.వి. ఛానళ్లు, పత్రికల కెమెరాలు చూస్తుండగానే కార్మికుల మీద అమానుషంగా పోలీసుల దాడి సాగింది. గుడ్‌గాంవ్ దేశ రాజధానికి సమీపంలో ఉండడం వల్ల, ఈ దారుణ దమనకాండ సాగుతున్న సమయానికి పార్లమెంట్ సమావేశాలు జరుగుతుండడం వల్ల, హోండా కార్మిక యూనియన్‌కు ప్రఖ్యాత పార్లమెంటేరియన్, సిపిఐ నాయకుడు గురుదాస్ దాస్‌గుప్తా నాయకత్వం వహిస్తుండడం వల్ల గుడ్‌గాంవ్ దారుణానికి ఎక్కువ ప్రాచుర్యమే లభించింది. దేశ వ్యాపితంగా ఈ దురంతంపై పెద్ద చర్చే జరిగింది. కాని రెండు నెలలుగా సాగుతున్న ఈ చర్చలో అత్యధిక భాగం జరిగిన ఘోరం గురించి మాట్లాడడానికి తప్ప, ఆ ఘోరం ఎందుకు జరిగిందో పూర్వాపరాలలోకి వెళ్లే ప్రయత్నం జరగలేదు. గుడ్‌గాంవ్ ఘటన ప్రపంచీకరణ

క్రమానికి తార్కిక ఫలితం. అందువల్ల ఈ దురంతం నుంచి సరైన పాఠాలు తీసుకుంటేనే, ఇప్పటికైనా ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ఒక బలమైన ప్రజా ఉద్యమాన్ని, ముఖ్యంగా కార్మికోద్యమాన్ని నిర్మించడం సాధ్యమవుతుంది. కాని ప్రపంచీకరణను వ్యతిరేకిస్తున్నామని చెప్పుకునే పార్టీలు, కార్మిక సంఘాలు కూడా ఆ దిశలో ప్రయత్నాలు ప్రారంభించలేదు. కనీసం సంఘటిత కార్మికవర్గం ఇప్పటివరకు పోరాడి సాధించుకున్న ప్రయోజనాలను నిలబెట్టు కోవడానికైనా, గుడ్‌గాంవ్ దురంతం హెచ్చరికగా, ఉద్యమం ప్రారంభించవలసి ఉండగా అటువంటి ప్రయత్నాలేమీ కనబడడం లేదు.

ఈ నేపథ్యంలో అసలు గుడ్‌గాంవ్‌లో ఏం జరిగింది, ఎందుకు జరిగింది, ఆ జరిగిన ఘటనను ఎట్లా అర్థం చేసుకోవలసి ఉంది, దానికి ప్రతిగా ఏమి చేయగల అవకాశాలున్నాయి వివరంగా చర్చించుకోవాలి.

నిజానికి గుడ్‌గాంవ్ లాఠీఛార్జిని అర్థం చేసుకోవాలంటే అంతకు ముందు కొన్ని నెలలుగా హోండా కర్మాగారంలో సాగుతున్న ఘర్షణలను, యాజమాన్యం అనుసరిస్తూ వచ్చిన కార్మిక వ్యతిరేక వైఖరిని అర్థం చేసుకోవలసి ఉంటుంది.

ప్రపంచీకరణ వెల్లువలో ఈ దేశంలో ప్రవేశించిన అనేక బహుళజాతి సంస్థలలో జపాన్‌కు చెందిన హోండా మోటర్స్ అండ్ స్కూటర్స్ ఒకటి. గుడ్‌గాంవ్ జిల్లాలోని మానెసర్‌లో, ఢిల్లీకి ముప్పై కిలోమీటర్ల దూరంలో హోండా తన ఉత్పత్తి కర్మాగారాన్ని తెరిచింది. ఈ కర్మాగారంలో దాదాపు మూడువేల మంది కార్మికులు, సిబ్బంది పనిచేస్తున్నారు. అందులో అత్యధికులు ఉద్యోగ భద్రత లేని స్థితిలో కాంట్రాక్టు, క్యాజువల్ కార్మికులుగానే పని చేస్తున్నారు. ఒకవైపు ఉద్యోగ భద్రత లేకపోవడం మాత్రమే కాక పని పరిస్థితులలో కూడా హోండా కార్మికులు, సిబ్బంది దారుణమైన స్థితిని అనుభవిస్తున్నారు. ఎక్కువ పని భారం ఉండడం, కార్మికులను మరింత ఎక్కువగా పిండి ఎక్కువ ఉత్పత్తి సాధించాలని అనుకోవడం యాజమాన్యాలకు మామూలే. కాని హోండా కర్మాగారంలో ఇటువంటి పని ఒత్తిడితో పాటుగా, కార్మికులకు విశ్రాంతి సౌకర్యాలు లేకపోవడం, కార్మికులను నిరంతరం అవమానించడం వంటి పనులతో కూడా ఒత్తిడి పెంచుతూ వచ్చారు. చివరికి కార్మికులు ఎక్కువసేపు మరుగుదొడ్లకు వెళ్లడానికి వీలు లేదని కూడా యాజమాన్యం శాసించింది. మరుగుదొడ్లకు వెళ్లే కార్మికుల మీద నిఘా కోసం మరుగుదొడ్లకు తలుపులు లేకుండా నిర్మింపజేసింది. మహిళా కార్మికుల మరుగుదొడ్లను కూడా ఇదే విధంగా నిర్మింపజేసి వారు నిత్యం అవమానాలకు గురయ్యేలా చేసింది.

ఈ పని పరిస్థితుల నేపథ్యంలో కార్మికుల్లో చాలా సహజంగా, అనివార్యంగా అసంతృప్తి పెరిగిపోయింది. ఈ అసంతృప్తి నుంచి బైటపడాలని, కార్ఖానాలో పని పరిస్థితులు మెరుగుపరుచు కోవాలంటే సంఘటితం కాక తప్పదని కార్మికులు ఆలోచించడం ప్రారంభించారు. మరొక వైపు నుంచి గత ఆరు నెలలుగా యాజమాన్యానికీ, కార్మికులకూ మధ్య ఏదో ఒక విషయమై ఘర్షణలు పెరగడం మొదలయింది. హోండా వైస్ ప్రెసిడెంట్లలో ఒకరయిన హిరోషె అనే జపాన్‌కు చెందిన యాజమాన్య ప్రతినిధి కార్మికుల పట్ల ప్రవర్తిస్తూ వచ్చిన తీరు ఈ ఘర్షణకు ఆజ్యం పోసింది. 2004 డిసెంబర్ 16న వెల్డ్‌షాప్‌లో పనిచేస్తున్న రాజేష్ అనే కార్మికుడిని హిరోషె తన్నాడు. తోటి కార్మికుడి పట్ల జరిగిన ఈ అవమానాన్ని కార్మికులందరూ నిరసించారు. యాజమాన్య ప్రతినిధులతో, ముఖ్యంగా జపనీయులతో కార్మికులే జాగ్రత్తగా మెలగాలని యాజమాన్యం కార్మికులను హెచ్చరించి ఈ సమస్యను పరిష్కరించాననుకుంది. మరికొద్ది రోజులకే హిరోషె ఒక సిక్కు కార్మికుడి తల మీద కొట్టి అతని పాగా ఊడబెరికాడు.



ఈ అవమానాలతో కోపోద్రిక్తులైన కార్మికులు ఇక సంఘటితం కాక తప్పదని నిర్ణయించుకున్నారు. హోండా ఎంప్లాయీస్ యూనియన్ పేరుతో కార్మిక సంఘాన్ని ఏర్పరచుకుని, దాన్ని 2005 మే 30న రిజిస్టర్ చేయించారు. ఆ యూనియన్‌ను భారత కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో నడిచే ఎఐటియుసి కి అనుబంధ సంస్థగా ప్రకటించారు.

తమ కంపెనీలో కార్మికులు సంఘటితమయి కార్మిక సంఘం స్థాపించడాన్ని సహించలేక పోయిన యాజమాన్యం ఏ విధంగానయినా కార్మికుల సంఘీభావాన్ని దెబ్బతీయాలని ప్రయత్నాలు ప్రారంభించింది. మొట్టమొదట, ఏర్పడిన యూనియన్‌ను చీల్చడానికి ప్రయత్నించింది. అది సాధ్యం కాకపోయేసరికి కంపెనీకి లాకౌట్ ప్రకటించింది. ఉన్న కార్మికులందరినీ తొలగించి కొత్త రిక్రూట్‌మెంట్ కోసం ప్రయత్నించింది. ఈ క్రమాన్ని అర్థం చేసుకుంటేగాని జూలై 25 లాఠీఛార్జ్ నేపథ్యం అర్థం కాదు.

మామూలుగా హోండా కార్మికులు ప్రతిరోజూ ఉదయం 7 గంటలకే కంపెనీకి చేరవలసి ఉంటుంది. అలా చేరడానికి జూన్ 27 ఉదయం బస్సులు రాలేదు. కార్మికులు తమంతట తామే కంపెనీకి చేరుకునే సరికి కంపెనీ గేటు తాళం వేసి ఉంది. గేటు దగ్గర పెట్టిన నోటీసులో తమ సత్ప్రవర్తన గురించి హామీ ఇచ్చిన కార్మికులనే ఫ్యాక్టరీ లోపలికి అనుమతిస్తామని రాసిపెట్టారు. అంటే ఎంప్లాయీస్ యూనియన్‌లో సభ్యులుగా చేరని వాళ్లనే అనుమతిస్తామని యాజమాన్యం ప్రకటించిందన్నమాట.

ఆ రోజు ఎనిమిదిన్నర కల్లా కార్మికులందరూ అక్కడ చేరారు. అందరికందరూ సత్ప్రవర్తన కలిగి ఉంటామని, యూనియన్‌లో చేరబోమని రాసి ఇవ్వడానికి అంగీకరించారు. ఈ పరిణామాన్ని ఊహించని యాజమాన్యం పాత కార్మికులందరినీ ఉద్యోగాల నుంచి తొలగిస్తున్నామని కనుక వారికి కంపెనీకి వందగజాల పరిధి లోపలికి వచ్చే హక్కు లేదని ప్రకటించింది. మర్నాటి నుంచి కొత్త కార్మికులను నియమించడం ప్రారంభించింది. అప్పటి నుంచీ పాత కార్మికులు ప్రతిరోజూ కంపెనీకి వచ్చి ఎదురుగా పార్కులో కూర్చునేవారు. యాజమాన్యంతో చర్చలు జరపాలని ప్రయత్నించేవారు. యాజమాన్యం కార్మిక శాఖతో జరిపిన చర్చలలో రోజుకొక మాట మాట్లాడుతూ పోయింది. ఈ చర్చోపచర్చల తరువాత కార్మికులు జూలై 11న ఒక ఊరేగింపు జరిపి ప్రభుత్వానికీ, యాజమాన్యానికీ తమ డిమాండ్లను తెలియజేయదలిచారు. కానీ ప్రభుత్వం 144వ సెక్షన్ విధించి ఊరేగింపును భగ్నం చేసింది.

కార్మికులు అక్కడే ఒక పార్కులో సమావేశం కాగా జిల్లా అధికారులు అక్కడికే వచ్చి కార్మికుల విజ్ఞాపన పత్రం తీసుకున్నారు. ఈలోగా నలుగురు యూనియన్ నాయకులను ఉద్యోగాల నుంచి తొలగించడం, నలభై మంది కార్మికులను సస్పెండ్ చెయ్యడం కార్మికులను మరింత ఆగ్రహానికి గురిచేశాయి. సిపిఐ నాయకుడు గురుదాస్ దాస్‌గుప్తా ఈ సమస్యపై తాను రాష్ట్ర ప్రభుత్వంతో మాట్లాడతానని, ఆ తర్వాత జూలై 28న పార్లమెంట్ ముందర ప్రదర్శన జరుపుదామని అన్నాడు.

పార్లమెంట్ ప్రదర్శన కంటే ముందే మళ్లీ ఒకసారి జిల్లా యంత్రాంగానికి తమ డిమాండ్లు వివరించాలని అనుకున్న కార్మికులు జూలై 25 ఉదయం ఊరేగింపు ప్రారంభించారు. ఆ ఊరేగింపు మీద రెండుసార్లు పోలీసులు లాఠీఛార్జ్ చేసి కార్మికులను చితకబాదారు. ఆ లాఠీఛార్జ్ దృశ్యాలన్నీ టివి తెరలమీదా, పత్రికలలోనూ దేశవ్యాప్తంగా ప్రచారమయ్యాయి.

ఇక్కడ గుర్తించవలసిన అంశాలు కొన్ని ఉన్నాయి. మొట్టమొదటిది ప్రపంచీకరణ వెల్లువలో ఈ దేశంలోకి ప్రవహిస్తున్న విదేశీ పెట్టుబడిని మన ప్రభుత్వాలు ఎంత నిరభ్యంతరంగా, ఎంత ఆంక్షలు లేకుండా, ఉన్న ఆంక్షలను ఎంతగా సరళీకరించి, ఆహ్వానిస్తున్నాయో చూడాలి. అంతకు ముందే పారిశ్రామిక వివాదాల చట్టం, అనేక కార్మిక సంక్షేమ చట్టాలు లొసుగులతోనూ, యాజమాన్యాలకు అనుకూలంగానూ ఉంటూ వచ్చాయి. ఇక 1992 తరువాత విదేశీ పెట్టుబడులను ఆకర్షించడం కొరకు విదేశీ పెట్టుబడులకు అనుకూలమైన చట్టాలు తీసుకరావడం, ప్రతికూల చట్టాలను రద్దు చేయడం, సవరణలు చేయడం జరుగుతూ వచ్చింది. ఒకవైపు దేశీయ పరిశ్రమలనూ, ప్రభుత్వ రంగ సంస్థలనూ చిన్నాభిన్నం చేస్తూ మరోవైపు విదేశీ పెట్టుబడుల కొరకూ, సంస్థల కొరకూ వెంపరలాడడం జరిగింది. ప్రభుత్వం వైపు నుంచి సాగుతున్న ఈ వెంపరలాటను గమనించిన బహుళజాతి సంస్థలు మన ప్రభుత్వాల మీద అంతకంతకూ ఎక్కువ డిమాండ్లు పెడుతూ పోయాయి. హిరణ్యాక్ష వరాలు కోరాయి. తామ కార్మికులతో ఏ విధంగా ప్రవర్తించినా, ఈ దేశ సంపదను ఎంతగా కొల్లగొట్టినా ఎవరూ ప్రశ్నించడానికి వీలు లేని ఒక స్థితిని కల్పించుకున్నాయి. అందువల్ల గుడ్‌గాంవ్‌లో సంఘటన ఏదో హఠాత్తుగా ఆకాశం నుంచి ఊడి పడ్డది కాదు. 1992 నుంచి ప్రభుత్వాలు ఉద్దేశ్యపూర్వకంగా అమలు చేస్తున్న రాజకీయార్థిక విధానాల సహజ ఫలితంగానే ఈ దారుణ దమనకాండ జరిగింది. అందువల్ల గుడ్‌గాంవ్‌లో లాఠీఛార్జ్‌ని ఒకానొక కార్ఖానాలో జరిగిన ఒక కార్మిక వివాదంగా మాత్రమే కాక ప్రపంచీకరణ విధానాలలో అనివార్యమైన క్రమంగా అర్థం చేసుకోవాలి.

అలా అర్థం చేసుకున్నప్పుడు మాత్రమే ఇటువంటి ఘటనలకు ప్రతిగా ఏమి చేయగలమో ఆలోచించడం సాధ్యమవుతుంది. లేకపోతే ప్రస్తుతం జరిగినట్లుగా వామపక్ష ట్రేడ్ యూనియన్ కూడా దీనిని ఒకానొక కంపెనీలో సమస్యగా మాత్రమే చూసి దానిని పరిష్కరించడానికి ఒప్పందం కుదుర్చుకుంది. ఇప్పుడు కుదిరిన ఒప్పందం యజమానులకే అనుకూలంగా కార్మికులకు వ్యతిరేకంగా కుదిరింది. అందువల్లనే కార్మికుల తక్షణ సమస్యలపై పరిష్కారం కొరకు



పోరాడుతూనే అదే సమయంలో దీర్ఘకాలిక ప్రయోజనాలు ఇమిడి ఉన్న రాజకీయార్థిక విధానాల గురించి కూడా ఆలోచించవలసి ఉంది. కార్మిక సంక్షేమ చట్టాలను, ఉద్యోగ భద్రత, పని పరిస్థితుల మెరుగుదల, పనిస్థలంలో సౌకర్యాలూ, యాజమాన్యాలూ తప్పనిసరిగా అనుసరించ వలసిన విధానాలూ మొదలయిన చట్టబద్ధ హామీల కొరకు పోరాడవలసి ఉంటుంది. కార్మికులకు ఉన్న సంఘటితమయ్యే హక్కు, సంఘం పెట్టుకునే హక్కు ఎట్టి పరిస్థితుల్లోనూ భగ్నం కాకూడదని పోరాడవలసి ఉంది. కార్మికులకూ యాజమాన్యానికీ మధ్య వివాదాలు తలెత్తినప్పుడు కార్మిక శాఖ, పౌర, అధికార యంత్రాంగం జోక్యం చేసుకుని పరిష్కరించాలి గానీ, పోలీసు యంత్రాంగం జోక్యం చేసుకుని కార్మికులకు వ్యతిరేకంగా, యాజమాన్యాల తరఫున బలప్రయోగం చెయ్యకూడదని డిమాండ్ చెయ్యవలసి ఉంది. పదమూడు సంవత్సరాలుగా దిగజారుతూ వచ్చిన, బలహీనపడుతూ వచ్చిన భారత సంఘటిత కార్మికోద్యమం గుడ్‌గాంవ్ సంఘటనలతో నయినా మేలుకోవాలి. ప్రపంచీకరణ వ్యతిరేక పోరాట దీక్ష సంతరించుకోవాలి.

***వీక్షణం, అక్టోబర్ 2005***

# 35

# బడుగు బతుకుపై బాక్సైట్ పోటు

మనం నిలబడిన నేల కింద, మన తాత ముత్తాతలు నుంచీ నివాస ముంటున్న నేల కింద, మనం మన సొంతమనుకుని ఆనందమో, విషాదమో అనుభవిస్తున్న నేల కింద పరాయి వారికి అవసరమైన సరుకుండడం మన దురదృష్టం కాబోలు. పాతకాలపు విక్రయ పత్రాలలో 'నిధి నిక్షేప తలగుల్మలతాది సమేతముగా..' అని మన నేలలోని నిధి నిక్షేపాలకు మనమే సొంతదారులుగా, యజమానులుగా గుర్తించేవారు. మన నేలలో ఖనిజాలేవైనా ఉంటే మనవే అయి ఉండేవి. మరొకరికి అవి అవసరమైతే బతిమాలో, బామాలో కొని సంపాదించేవారు. కాని కొత్త సామాజిక ధర్మం ప్రకారం మన నేలలో ఖరీదైన ఖనిజాలుండడం మన దురదృష్టం. ఆ ఖనిజాలు బహుళజాతి సంస్థలకు ఎంతగా అవసరమైనవయితే అంతగా మన దురదృష్టం పెరిగిపోతుంది. అప్పుడిక మన నాయకుల మెడలు వంచి, మన రాజకీయార్థిక విధానాలను మార్చి, మన ప్రాణాలు విలువలేనివన్నట్టు చూసి మన భూములను ఆక్రమిస్తారు. మన ఖనిజాలను కొల్లగొడతారు. అవసరమైతే యుద్ధమైనా చేసి, అటూ ఇటూ వందలాది మందిని బలి ఇచ్చి ఖనిజ నిలువలను వరప్రసాదంగా గ్రహిస్తారు.

అది పశ్చిమాసియాలోని చమురు అయినా, మధ్య ఆసియాలోని సహజ వాయువు అయినా, లాటిన్ అమెరికాలోని రాగి, తగరం అయినా, దక్షిణాఫ్రికా లోని వజ్రాలయినా, బంగారమయినా, మన విశాఖ ఏజెన్సీలోని బాక్సైట్ అయినా కథ ఒకటే. స్థలాలు వేరు కావచ్చు, సందర్భాలు వేరు కావచ్చు, పద్ధతులు వేరు కావచ్చు.



తూర్పు గోదావరి, విశాఖపట్నం జిల్లాల లోని అటవీ ప్రాంతాలలో బాక్సైట్ నిక్షేపాలున్నాయని తెలియంతో బహుళజాతి సంస్థల కళ్లు ఆ ప్రాంతాల మీద పడ్డాయి. ఒకప్పుడు 54 కోట్ల టన్నుల ఖనిజ నిలువలున్నాయని వేసిన అంచనా, ఇటీవలి కాలంలో ఇంకా పెరిగి 70 కోట్ల టన్నులుగా మారింది. ఈ బాక్సైట్ నిక్షేపాల గురించి ఆలోచించేటప్పుడు మూడున్నర దశాబ్దాల కింద అమెరికన్ మార్క్సిస్టు అర్థశాస్త్రవేత్త, ప్రపంచ ప్రఖ్యాత సోషలిస్టు పత్రిక మంత్లీ రివ్యూ సహ సంపాదకుడు హారీ మాగ్డాఫ్ రాసిన మాటలు గుర్తొస్తాయి. కొత్త సామ్రాజ్యవాదానికి నిత్య జీవితావసరంగా ఏయే ముడిసరుకులు కావాలో, అవి ఎక్కడెక్కడ ఉన్నాయో, అందువల్లనే ఆ ప్రాంతాలను తన గుప్పెట్లో ఉంచుకోవడానికి సామ్రాజ్యవాద దేశాల పాలకులు ఎట్లా ప్రయత్నిస్తున్నారో ఆయన ఆ వ్యాసంలో రాశారు.

'అల్యూమినియంను పొదుపుగా వాడుకునే మార్గాలను పరిశ్రమ ఎంతగా కనిపెట్టినప్పటికీ, బాక్సైట్ నుంచి ఎంత ఎక్కువ అల్యూమినాను ఉత్పత్తి చేయగలిగినప్పటికీ బాక్సైట్ లేకుండా అల్యూమినియంను తయారు చేయడం సాధ్యం కాదు. అల్యూమినియం లేకుండా విమానం తయారు చేయడం సాధ్యం కాదు. తన బాక్సైట్ సరఫరాలో 80 నుంచి 90 శాతం విదేశాల నుంచే తెచ్చుకోవలసిన స్థితిలో అమెరికా ఉన్నప్పుడు ఆ సరఫరా నిరాటంకంగా సాగుతుందా లేదా అన్నది అమెరికా అల్యూమినియం పరిశ్రమకు మాత్రమే కాదు, విమాన తయారీ పరిశ్రమకూ, అసలు అమెరికా సైనిక శక్తికీ కీలకమైన అంశం' అని మాగ్డాఫ్ రాశారు. ఆయన ఆ మాట అన్న 1968కీ ఇప్పటికీ అమెరికా సైనిక పరిశ్రమ ఇంకా పెరిగింది. అల్యూమినియం అవసరం ఇంకా పెరిగింది.

ఆ నేపథ్యంలోనే భారతదేశంలోని అల్యూమినియం పరిశ్రమ ప్రైవేటీకరణను, వివాదాన్ని 1990ల తర్వాత అంతకంతకూ ఎక్కువగా బహుళజాతి సంస్థల బాక్సైట్ ఖనిజ సేకరణ, శుద్ధి ప్రయత్నాలనూ చూడాలి. ఈ క్రమంలోనే మన తూర్పు గోదావరి, విశాఖపట్నం జిల్లాల బాక్సైట్ కనిజ నిలువలను జిందాల్ గ్రూపు కంపెనీకి ఇవ్వడం జరిగింది.

అమెరికన్ యుద్ధ పరిశ్రమ అవసరాలూ, వాటిని తీర్చే విదేశీ, స్వదేశీ బహుళజాతి, దళారీ సంస్థల అవసరాలూ సరే, ఈ క్రమంలో మన దేశానికీ, మన ప్రజలకూ, మన ఆర్థిక వ్యవస్థకూ ఏం జరుగుతుంది?

మొట్టమొదట ఈ బాక్సైట్ తవ్వకం రాజ్యాంగంలో ఐదవ షెడ్యూల్‌ను ఉల్లంఘిస్తుంది. 1/70 చట్టంగా ప్రచారంలోకి వచ్చిన షెడ్యూల్డ్ ప్రాంతాల భూ బదిలీ నియంత్రణ చట్టం, 1959 సవరణను ఉల్లంఘిస్తుంది. పంచాయితీ (షెడ్యూల్డ్ ప్రాంతాల విస్తరణ) నిబంధనల చట్టం, 1996ను ఉల్లంఘిస్తుంది. సుప్రీంకోర్టు 1997లో సమత వర్సస్ స్టేట్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ కేసులో ఇచ్చిన చరిత్రాత్మకమైన తీర్పును ఉల్లంఘిస్తుంది.

ఈ చట్టపరమైన, న్యాయపరమైన ఉల్లంఘనల వెనుక వాస్తవంగా ఉన్నది మానవ జీవితం పట్ల, సంస్కృతి పట్ల, జీననోపాధి పట్ల అగౌరవం, అణచివేసే, దోపిడీ చేసే దృక్పథం. ఈ ఉల్లంఘనల వల్ల దాదాపు 180 గ్రామాలకు చెందిన 45 వేల మంది ఆదివాసులు తమ స్వస్థలాల నుంచి బైటికి వెళ్లగొట్టబడతారు. వందలాది, వేలాది చదరపు కిలోమీటర్ల అటవీ భూమి, పరిసర ప్రాంతాల భూమి పరిరక్షణ కాలుష్యం బారిన పడుతుంది. విలువైన అటవీ సంపద ధ్వంసమైపోతుంది. అడవితో, కొండలతో మమేకమై ఒకరకమైన జీవన విధానానికి, సంస్కృతికి అలవాటు పడిన ఆదివాసులు భౌతికంగా నిర్వాసితులు కావడం మాత్రమే కాదు, మానసికంగానూ ఒడ్డున పడిన చేపల్లా మారిపోతారు.

అమాయకంగా, నిరక్షరాస్యులుగా, నిజాయితీ ఉండే ఆదివాసులను మైదాన ప్రాంతాల వ్యాపారులుగాని, భూస్వాములు గాని దోపిడీ పీడనలకు గురిచేసే అవకాశం ఉంది గనుకనే ఆదివాసీ ప్రాంతాలను ఏజెన్సీలుగా, షెడ్యూల్డ్ ప్రాంతాలుగా గుర్తించి రక్షణలు కల్పించవలసిన అవసరం వచ్చింది. ఆ రక్షణలు ఉన్నప్పటికీ ఆధివాసుల భూములు అన్యాక్రాంతమైపోయాయి. ఆదివాసీ ప్రాంతాల మధ్యలో, అడవి గర్భంలో ఆదివాసీయేతరులు తిష్టవేసుకుని కూచున్నారు. అటువంటి సమయంలో ఆదివాసులను కాపాడేందుకు, రాజ్యాంగ రక్షణలను మరింత కట్టుదిట్టంగా అమలు జరపవలసిన ప్రభుత్వమే ప్రపంచీకరణ మోజులో, అమెరికన్ సైనిక పరిశ్రమ అవసరాల కోసం, బహుళజాతి సంస్థలు విదిల్చే నాలుగు డాలర్ల ఎంగిలి మెతుకుల కోసం ఆధివాసుల జీవితాలను పణంగా పెడుతుంటే, నోరుండి ఊరక కూచున్న మనది కాదా బాధ్యత?

***ఆంధ్రజ్యోతి, మే 19, 2006***



# 36

## చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి

దేశంలో చిల్లర వర్తకంలోకి ప్రవేశించాలని విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి చాలాకాలంగా ప్రయత్నిస్తోంది. నూతన ఆర్థిక విధానాలు అమలవుతున్న ఈ పదిహేను సంవత్సరాలుగా ఆ ప్రయత్నాలు మరింత ముమ్మరమయ్యాయి. చిల్లర వ్యాపార రంగంలోని బహుళజాతి సంస్థలు ప్రభుత్వ విధానాలను మార్చడానికి, తమ ప్రవేశానికి అడ్డంకిగా ఉన్న నిబంధనలను తొలగింప జేయడానికి చాలా ప్రయత్నాలు చేస్తూ వచ్చాయి. ఇతర రంగాలన్నిటిలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని, విదేశీ జోక్యాన్ని అనుమతించిన కేంద్ర ప్రభుత్వం కూడా 1997లో చిల్లర వర్తకంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని నిరోధించే విధానాన్ని ప్రకటించింది. ఆ విధానాన్ని తిరగదోడుతూ 2005 అక్టోబర్‌లో మరొక నిర్ణయం తీసుకుంది. అప్పటి నుంచి దేశవ్యాప్తంగా ప్రజానుకూల ఆర్థిక శాస్త్రవేత్తలు, చిల్లర వ్యాపారుల సంఘాలు, దేశభక్తియుత ప్రజాస్వామికవాదులు ఈ చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని అనుమతించే రాజకీయార్థిక విధానాలను ప్రతిఘటిస్తున్నారు. దేశంలో ఎన్నోచోట్ల పెద్ద ఎత్తున ప్రజా ప్రదర్శనలు జరిగాయి.

ఈ నేపథ్యంలో అసలు ఈ సమస్య ఏమిటో, దాని పూర్వాపరాలు,

పరిష్కార మార్గాలు ఏమిటో, ప్రభుత్వ వాదనలలోను, విమర్శకుల వాదనలోను ఉన్న సమంజసత్వం ఎంతో తెలుసుకోవలసి ఉంది. ఒక దేశభక్త, ప్రజాతంత్ర ఉద్యమంలో భాగస్వాములుగా మనం ఈ అంశంలో ఎటువంటి వైఖరి తీసుకోవలసి ఉంటుందో నిర్ధారించుకోవలసి ఉంది.

చిల్లర వర్తకం గురించి తెలియని వాళ్లు ఎవరూ ఉండరు. మన నిత్య జీవితంలో మనం వినియోగించే అనేక సరుకులను మనం మన ఇరుగు పొరుగు చిల్లర వ్యాపారుల నుంచే తెచ్చుకుంటూ ఉంటాం. మన నగరాల్లో, పట్నాల్లో, పల్లెల్లో కూడా చిన్న చిన్న పాన్ షాపులు, కిళ్లీ కొట్ల నుంచి, పెద్ద కిరాణా, జనరల్ షాపుల దాకా ఎన్నో చిల్లర వ్యాపార సంస్థలను మనం చూస్తూ ఉంటాం. వాటితో వ్యవహరిస్తూ ఉంటాం. సాధారణంగా ప్రజల అవసరాలను తీర్చే ఈ చిల్లర వ్యాపారాలను నడిపే వాళ్లతో ప్రజలకు చాల సన్నిహిత సంబంధాలుంటాయి. ఆ వ్యాపారులను, వ్యాపార కుటుంబాలను వరుసలు పెట్టి పిలుచుకోవడం దగ్గర ప్రారంభించి అరువులు, ఖాతాల దాకా ఈ సంబంధాలు ఎన్నో రకాలుగా ఉంటాయి. ఈ చిల్లర వ్యాపారులు తూకం తప్పుగా కొలుస్తున్నారని, లాభం ఎక్కువ వేసుకుని ఎక్కువ ధరలు చెపుతున్నారని, నాణ్యమైన సరుకులు ఇవ్వడం లేదని ఘర్షణలు కూడా ఉంటాయి. ఈ సంబంధాలు, ఘర్షణలు ఎన్ని ఉన్నా, చిల్లర వ్యాపారుల వర్గం ఒకటి ప్రత్యేకంగా ఉందనుకున్నా, ఆ వర్గం విశాల ప్రజానీకంలో భాగమే. విశాల ప్రజానీకం అనుభవిస్తున్న కష్టనష్టాలన్నీ ఆ వ్యాపార వర్గాలు కూడా అనుభవిస్తున్నాయి. ఆ చిల్లర వ్యాపార వర్గం మీద ప్రపంచీకరణ శక్తులు ఎక్కుపెట్టిన దాడి ఈ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశం. ఈ దాడివల్ల అటు చిల్లర వ్యాపార వర్గమూ దెబ్బతింటుంది. ఇటు విశాల ప్రజారాశులకూ ఇబ్బందులు కలుగుతాయి. అందువల్ల చిల్లర వ్యాపారంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశం అనేది ఏదో చిల్లర వర్తకులకు మాత్రమే సంబంధించిన సమస్య కాదు. అది మొత్తంగా సామాజికార్థిక సమస్య. దానివల్ల ప్రత్యేకంగా, ప్రత్యక్షంగా చిల్లర వర్తకులకు మాత్రమే కాక కింది వర్గాలకు, మధ్యతరగతికి కూడా ఎన్నో సమస్యలు తలెత్తుతాయి.

సమాజంలో మనుషులకు తమ నిత్య జీవితావసరాలు – ఆహార పదార్థాలు, బియ్యం, ఉప్పులు, పప్పులు, నూనెలు, చింతపండు, కూరగాయలు, శరీర శుభ్రతా సాధనాలు, వస్త్రాలు – వంటి ఎన్నో సరుకులు కొనుక్కోవలసి ఉంటుంది. కొనుక్కునే సరుకులు నాణ్యతలో, పరిమాణంలో, ఖరీదులో తేడాలు ఉండవచ్చు గాని అసలు సరుకుల అవసరమే లేని మనుషులు ఎవరూ ఉండరు. చరిత్రలో ఎంత వెనక్కి వెళ్లినా పూర్తిగా వ్యవసాయ, స్వయం సమృద్ధ సమాజాలు ఉనికిలో ఉన్న రోజులలో కూడా ఏవో కొన్ని వస్తువులు బయటి నుంచి కొనుక్కోవలసిన అవసరం ఉండేదని అర్థమవుతుంది.

ఈ రకంగా సమాజపు సరుకుల అవసరాలను తీర్చిన వ్యవస్థలు ఎలా నిర్మాణమయ్యాయో పరిశీలిస్తే మొట్టమొదట ఏవో కొన్ని గ్రామాలకు కలిసి వారానికోసారో, రెండు వారాలకోసారో



జరిగే అంగళ్లు, సంతలు, గ్రామానికి వచ్చి సరుకులు అమ్మిపోయే సంచార వ్యాపారులు కనబడతారు. క్రమక్రమంగా గ్రామాల్లో ఒకటో రెంటో చిల్లర వర్తక దుకాణాలు, కిరాణా దుకాణాలు వచ్చాయి. పట్టణాల్లో ఈ వ్యాపారం మరింత పెద్ద ఎత్తున సాగి వర్తక కేంద్రాల సంఖ్యా, సరుకుల విస్తృతీ, ఈ వ్యాపారం మీద ఆధారపడిన జనాభా పెరిగాయి.

క్రమంగా ప్రభుత్వం ప్రజా పంపిణీ వ్యవస్థను, చౌకధరల దుకాణాలను ఏర్పాటు చేయడంతో గ్రామాలలోను, పట్టణ ప్రాంతాలలోను అప్పటికే ఉన్న చిల్లర వర్తక కేంద్రాలతో పాటు సమాంతరంగా ప్రభుత్వం నడిపే చిల్లర వర్తక కేంద్రాలు, సహకార వర్తక కేంద్రాలు, ఖాదీ గ్రామోద్యోగ భండార్ వంటి వర్తక కేంద్రాలు కూడా వచ్చాయి.

ఈ మూడు రకాల చిల్లర వర్తక కేంద్రాలు ఉనికిలో ఉండగానే పట్టణాలలో సూపర్ మార్కెట్, సూపర్ బజార్‌ల పేరుతో అన్ని రకాల సరుకులు ఒకేచోట దొరికే వ్యాపార కేంద్రాలు పుట్టుకు వచ్చాయి. ఇవి పాత కిరాణా, జనరల్ షాపుల కన్న భిన్నంగా విశాలమైన ఆవరణ, పెద్ద ఎత్తున పెట్టుబడి అవసరమయినవి. అంటే ఈ రకమైన వ్యాపార కేంద్రాల ప్రవేశంతో చిల్లర వ్యాపారంలోకి బడా వ్యాపారస్తులు, పెద్ద పెట్టుబడిదారులు ప్రవేశించారు. అప్పటి దాకా ప్రధానంగా కుటుంబం నడిపే వ్యాపారంగా ఉన్నదల్లా, పెట్టుబడిదారుకూ దుకాణ నిర్వాహకుడికీ సంబంధంలేని స్థితి వచ్చింది. దుకాణ నిర్వాహకుడు చాలాచోట్ల కేవలం ఉద్యోగిగా కూడా మారిపోయాడు.

ఈ సూపర్ మార్కెట్లనే ఇంకా పరిమాణంలో వైవిధ్యంలో పెట్టుబడితో విస్తరిస్తే హైపర్ మార్కెట్లు, డిపార్ట్‌మెంటల్ స్టోర్స్, షాపింగ్ మాల్స్ లాంటి అత్యాధునిక చిల్లర వర్తక కేంద్రాలు తయారవుతాయి. సమాజాన్ని అంతకంతకూ ఎక్కువగా వినియోగదారీ సంస్కృతిలోకి ప్రవేశపెట్టి సరుకుల కొనుగోలే మనుషుల సమయాన్నంతా వెచ్చించే ఒక ప్రక్రియగా మార్చదలచిన పెట్టుబడిదారీ సంస్కృతిలో ఇది భాగం.

మొదటి మూడు రకాల వర్తక కేంద్రాలలో కూడా వ్యాపారం, అమ్మకం – కొనుగోలు ఉన్నప్పటికీ, ఎంతో కొంత మానవ సంబంధాలకు అవకాశం ఉంది. చిన్న పెట్టుబడికి అవకాశం ఉంది. ఈ చివరి రకం వర్తక కేంద్రంలో మాత్రం సరుకే ప్రమాణం. సరుకు కొనుగోలు మాత్రమే మొత్తం వ్యవస్థను నిర్ణయిస్తుంది. పెట్టుబడిదారీ ఆర్థిక సంబంధాలు, గుత్తాధిపత్యం, వినియోగదారీ విలువలు విస్తృతం కావడానికి ఈ మొత్తం చిల్లర వర్తక కేంద్రాల వ్యవస్థ పనిచేస్తుంది.

ఇవాళ చిల్లర వర్తక కేంద్రాలలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశం అనేది పై మూడు రకాల వర్తక కేంద్రాలను చావుదెబ్బతీసి, వాటి స్థానంలో నాలుగో రకం వర్తక కేంద్రాలను ఏర్పాటు చేయడానికి మాత్రమే. వాటికి అవసరమైన పెట్టుబడి వల్ల, వాటిలో అమ్మకం అయ్యే సరుకుల వల్ల, అవి ప్రచారం చేసే వినియోగదారీ సంస్కృతి వల్ల, అవి అంతర్జాతీయ ఉత్పత్తి, సరఫరా, వినిమయ వ్యాపారాల గొలుసులలో లంకెలు కావడం వల్ల వాటిని బహుళజాతి

సంస్థలు, సామ్రాజ్యవాద శక్తులు ముద్దుబిడ్డలుగా భావిస్తాయి. భారతదేశం వంటి సువిశాల మార్కెట్‌లో అటువంటి వ్యాపార సంస్థలు ప్రవేశించగలిగితే అటు సరుకుల అమ్మకాలు, లాభాలు, ఇటు పెట్టుబడిదారీ భావజాల ప్రభావం ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోతాయి.

చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశానికి గల ప్రయోజనాలు ఇంత బహిరంగంగా, స్పష్టంగా ఉండగా ప్రభుత్వం ఆ ప్రయోజనాలను నెరవేర్చడానికే నడుం కట్టింది. ఏదో ఒకరకంగా ఈ విషయంలో ప్రభుత్వం మెడలు వంచి అయినా తమకు అనుకూలమైన విధానాలను ప్రకటింపజేయాలని, అమలు చేయించాలని బహుళజాతి సంస్థలు ఒత్తిడి తెచ్చాయి.

దేశంలో సాగుతున్న చిల్లర వర్తకపు పరిమాణాన్ని చూస్తే బహుళజాతి సంస్థలకు ఈ రంగం మీద ఎందుకింత దృష్టి పడిందో అర్థమవుతుంది.

దేశంలో కచ్చితంగా ఎన్ని చిల్లర వ్యాపార సంస్థలు ఉన్నాయో, వాటి ద్వారా ఎంత వ్యాపారం జరుగుతున్నదో, ఆ రంగం మీద ఆధారపడిన జనాభా ఎంతో నిర్దిష్టమైన గణాంకాలు ఎవరి దగ్గరా లేవు. స్థూలంగా కనీస గణాంకాలు, గరిష్ఠ గణాంకాలు మాత్రమే అందుబాటులో ఉన్నాయి. దేశం మొత్తం మీద ఒక కోటి నుంచి ఒక కోటీ ఇరవై లక్షల చిల్లర దుకాణాలున్నాయని, వాటిలో సాలీనా పదిలక్షల కోట్ల రూపాయల నుంచి పదమూడున్నర లక్షల కోట్ల రూపాయల దాకా వ్యాపారం సాగుతున్నదని అంచనా. ఈ రంగంపైన దేశ జనాభాలో ఏడు శాతం నుంచి ఎనిమిది శాతం, అంటే ఏడు కోట్ల నుంచి ఎనిమిది కోట్ల మంది ప్రత్యక్షంగా ఆధారపడి ఉన్నారని అంచనా. మరో రకంగా చెప్పాలంటే దేశ ఆర్థిక వ్యవస్థలో ఈ రంగం చాలా ప్రధానమైన స్థానంలో ఉండి జాతీయాదాయానికి పది నుంచి పద్నాలుగు శాతం వాటా సమకూరుస్తోంది. వ్యవసాయ రంగం తర్వాత అతి ఎక్కువ మందికి ఉపాధి కల్పిస్తోంది.

అయితే మన సమాజానికి సంబంధించిన ప్రత్యేకత ఏమంటే సాలీనా పదిలక్షల కోట్ల రూపాయలకు పైగా వ్యాపారం సాగే ఈ రంగం ప్రధానంగా అసంఘటితంగా ఉంది. సంఘటిత రంగంలోని వ్యాపారం రెండు శాతం నుంచి ఐదు శాతం లోపు మాత్రమే ఉంది. మొత్తం మీద ఉనికిలో ఉన్న దుకాణాలలో 96 శాతం ఐదు వందల చదరపు అడుగుల లోపలే అంటే ఒక గది – రెండు గదుల లోపల మాత్రమే ఉన్నాయి.

ఈ మొత్తం వ్యాపారాన్ని సంఘటితరంగంలోకి, సాంకేతిక పరిజ్ఞానం వాడి బిల్లుల ద్వారా మాత్రమే అమ్మకాలు జరిగే స్థితిలోకి మార్చకపోతే బహుళజాతి సంస్థల ప్రవేశానికి వీలు కుదరదు. కనీసం పదిలక్షల కోట్ల రూపాయలు అమ్మకాలు జరుగుతున్నాయనుకున్నా రెండు లక్షల కోట్ల రూపాయలయినా లాభాలుంటాయి. బహుళజాతి సంస్థలు ఎన్నో దేశాలలో ఆర్జించే లాభాలతో పోలిస్తే ఒక్క భారతదేశపు మార్కెట్‌లో ఆర్జించగల లాభాలు ఎక్కువ.

ఈ లాభాలు ఆర్జించడానికి, భారత మార్కెట్‌లో ప్రవేశించడానికి ఇంతకాలం ఏవో కొన్ని నిబంధనలు అడ్డుపడుతుండేవి. ఆంక్షలుండేవి. అయినా నూతన ఆర్థిక విధానాల తర్వాత నిబంధనలలోని లొసుగులను ఉపయోగించుకొని కొన్ని చిల్లర వ్యాపార సంస్థలు దేశంలో ప్రవేశించాయి. అంతకుముందు నుంచే దేశీయ మార్కెట్‌లో పనిచేస్తున్న కొన్ని విదేశీ సంస్థలు బలపడ్డాయి. కొన్ని స్వదేశీ గుత్త సంస్థలు విదేశీ చిల్లర వర్తక సంస్థలతో సహకార ఒప్పందాలు కుదుర్చుకున్నాయి.



రెడీమేడ్ దుస్తులు, శరీర శుభ్రతా సాధనాలు, పాదరక్షలు, గృహోపకరణాలు, వినోద సాధనాలు వంటి సరుకులు విదేశీ సంస్థల నుంచి దిగుమతి చేసుకోవడం, విదేశీ, స్వదేశీ మిలాఖత్తుతోనో, స్వయంగా విదేశీ సంస్థలే ఉత్పత్తి కేంద్రాలు తెరవడం ద్వారానో, స్వదేశీ సంస్థలు సాంకేతిక పరిజ్ఞానం కొనుక్కోవడం ద్వారానో సరుకులు ఇక్కడే తయారు చేసి సరఫరా చేయడం జరుగుతూ వచ్చాయి.

ఈ రకంగా మారిన నిబంధనల కాలంలో టాటాలు, ఆర్.పి. గోయెంకా, ఐ.టి.సి., రహేజా వంటి సంస్థలు విదేశీ సహాయంతో దేశవ్యాప్తంగా గొలుసు కట్టు చిల్లర వర్తక కేంద్రాలు స్థాపించడం మొదలుపెట్టాయి. ఏదో ఒక స్వదేశీ లేదా విదేశీ బ్రాండు సరుకులు మాత్రమే అమ్మే దుకాణాలు, అనేక బ్రాండులతో ఒకే రకమైన సరుకులు అమ్మే దుకాణాలు, సరఫరా దార్లతో సంబంధం లేకుండా స్వయంగా ఉత్పత్తిదారులే తమ సరుకులు అమ్మే దుకాణాలు రూపొందాయి.

ఒకవైపు దేశంలో ఈ పరిణామాలు జరుగుతుండగా, సమాంతరంగా ఉరుగ్వే రౌండ్ గాట్ చర్చలు, ప్రపంచ వాణిజ్య సంస్థ ఏర్పాటు ప్రయత్నాలు సాగుతూ చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశాన్ని అనుమతించాలని భారత ప్రభుత్వం మీద ఒత్తిడి పెరిగింది.

ఆ ఒత్తిడి వల్ల కలిగిన వెసులుబాటులో డెయిరీ ఫామ్ ఇంటర్నేషనల్ అనే బహుళజాతి సంస్థ ఆర్.పి. గోయెంకా అనే దేశీయ సంస్థలో 51:49 వాటాతో దేశంలో ప్రవేశించి, ఫుడ్ వరల్డ్ అనే చిల్లర వర్తకపు గొలుసు సంస్థను ప్రారంభించింది. మెక్‌డోనాల్డ్స్ వంటి బహుళజాతి సంస్థలు ప్రవేశించాయి.

ఆ తర్వాత 2005లో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిగాని, బహుళజాతి సంస్థలు గాని దేశంలోకి ప్రవేశించడానికి మార్గం సుగమమయ్యేలా ప్రభుత్వ విధానాలు మారాయి. విదేశీ సంస్థకు గాని, స్వదేశీ సంస్థకు గాని ప్రతినిధిగా ఉండవచ్చునని, ఉత్పత్తిదారు స్వయంగా చిల్లర వర్తక సంస్థను తెరవవచ్చునని, పంపిణీదారుగా ఉండవచ్చునని, ఈ రంగంలోకి 49 శాతం వరకు విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశించవచ్చునని ప్రభుత్వం ప్రకటించింది. ఒక ప్రత్యేకమైన పద్ధతిలో చిల్లర వర్తకం చేసే, క్యాష్ అండ్ క్యారీ అనే టోకు వర్తకంలోకి 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి రావచ్చునని ప్రభుత్వం ప్రకటించింది.

వాల్‌మార్ట్, క్యారీఫోర్, ఎహోల్, జెసిపెన్నీ లాంటి చిల్లర వర్తకంలోని బహుళజాతి సంస్థలెన్నో ఈ ప్రభుత్వ నిర్ణయాన్ని హర్షించి దేశంలోకి ప్రవేశించడానికి ప్రయత్నాలు ప్రారంభించాయి.

ఈ నిబంధనల మార్పుకు, కొత్త విధానానికి చాలా ప్రయోజనాలున్నాయని ప్రభుత్వం

చెపుతోంది. ఇందువల్ల దేశంలోకి విరివిగా పెట్టుబడులు, నిధులు తరలి వస్తాయని, విదేశీ సంస్థలు ఇక్కడ మౌలిక సదుపాయాలను పెంచుతాయని, కొత్త సాంకేతిక విధానాన్ని పరిచయం చేస్తాయని, తక్కువ ఖరీదుకు సరుకులు దొరికే అవకాశం వస్తుందని, దుకాణాల సామర్థ్యం, సరుకుల నాణ్యత పెరుగుతాయని, ప్రాతినిధ్యశాఖలు ఏర్పాటు చేయడం ద్వారా స్థానికులకు ఉపాధి దొరుకుతుందని, సరుకు ఉత్పత్తి అయిన దగ్గరి నుంచి వినియోగదారుకు చేరేదాకా ఉండే సరఫరా గొలుసులో పెట్టుబడులు పెరుగుతాయని, కోల్డ్ స్టోరేజీలు, గిడ్డంగులు పెరుగుతాయని, సమాచార సాంకేతిక పరిజ్ఞానం పెరుగుతుందని, ఉద్యోగ కల్పన పెరుగుతుందని ప్రభుత్వం చెపుతోంది.

అయితే ఈ ప్రభుత్వ ప్రచారంలో సగం అవాస్తవాలు, సగం అర్ధసత్యాలు. చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని అనుమతించినంత మాత్రాన దేశంలోకి పెట్టుబడులు, నిధులు విరివిగా రావాలని లేదు. విదేశీ సంస్థలు దేశంలోని మౌలిక సదుపాయాలను పెంచుతాయనే హామీ కూడా లేదు. గత అనుభవంతో పోలిస్తే వచ్చే నిధులు, పెట్టుబడులు కూడా అతి కొద్దిమంది దళారీలకే చేరడం, ప్రజాధనం వెచ్చించి ప్రభుత్వమే మౌలిక సదుపాయాలు కల్పించడం జరిగింది. ఇక చిల్లర వర్తకంలోకి కొత్త సాంకేతిక విధానం రావలసిన అవసరం పెద్దగా ఏమీలేదు. చిల్లర వర్తకం మానవ ఆధారిత రంగమే కాని సాంకేతిక విధాన ఆధారిత రంగం కాదు.

విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి వల్ల సరుకుల ధరలు తగ్గినట్టు కనబడే మాట నిజమే గాని అది అర్ధసత్యమే. అటువంటి పెద్ద చిల్లర దుకాణాల వల్ల ఖర్చులు తగ్గడంతో ఆ దుకాణాలలో సరుకులు తక్కువ ధరకు అమ్మినా లాభాలు వస్తాయి. పోటీలో ఉన్న చిన్న వర్తకులను చావు దెబ్బ తీయడానికి ఈ పెద్ద దుకాణదారులు తొలి రోజుల్లో లాభం తక్కువ వేసుకుని, తక్కువ ధరకు సరుకులు అమ్ముతారు. కాని కాలక్రమంలో పోటీదార్లు చితికిపోయి తమ గుత్తాధిపత్యం బలపడిన తర్వాత విపరీతమైన లాభాలు చేసుకుంటూ హెచ్చు ధరలకే అమ్ముతారు. దుకాణాల సమర్థత, సరుకుల నాణ్యత అనేవి ఒకవైపు నుంచి ఆకర్షణీయంగా కనబడతాయి గాని వాటికోసం విదేశీ పెట్టుబడి అవసరమేమీ లేదు. ఇక ఉద్యోగ కల్పన విషయంలో ప్రభుత్వ ప్రకటనలు పచ్చి అబద్ధాలు. ప్రపంచవ్యాప్తంగా సంఘటిత చిల్లర వర్తకంలో 85,000 చదరపు అడుగుల సగటు దుకాణంలో 292 మంది ఉద్యోగులున్నారని అంచనా. అంతే వైశాల్యం గల దుకాణాలు మన దేశంలో ఇప్పుడు కనీసం 400 – 500 మందికి ప్రత్యక్ష ఉద్యోగాలు కల్పిస్తున్నాయి. అందువల్ల ఈ కొత్త దుకాణాలు మన దుకాణదారుల, దుకాణాల గుమస్తాల పొట్టలు గొట్టడమే తప్ప కొత్త ఉద్యోగ కల్పనకు దారితీయవు. పైగా ప్రస్తుతం ఉపాధి కోల్పోతున్న వారు కొత్త ఉద్యోగాలకు పనికి వస్తారని కొత్త దుకాణ యజమానులు భావించే అవకాశం కూడా లేదు.

అందువల్ల ఈ కొత్త విధానం లక్షలాది మంది చిల్లర వర్తకుల, వారి కుటుంబాల జీవనోపాధినీ, భవిష్యత్తునూ కొల్లగొడుతుంది. దేశంలో నిరుద్యోగ సైన్యంలోకి మరికొన్ని లక్షల



మందో, కోట్లమందో అదనంగా చేరుతారు. ఈ కొత్త దుకాణాలకు నగరాల, గ్రామాల నడిబొడ్లలో ఆకర్షణీయమైన, విశాలమైన స్థలాలు అవసరమవుతాయి. కనుక స్థలాల ధరలు విపరీతంగా పెరిగిపోయి మధ్యతరగతికి, పేద వర్గాలకు ఇళ్ల స్థలాలు గగన కుసుమమయ్యే పరిస్థితి వస్తుంది. ఇతర పోటీదార్లను అదృశ్యం చేయడానికి మొదట ధరలు తగ్గించి అమ్మడం, తర్వాత గుత్తాధిపత్యం రాగానే ధరలు పెంచడం వల్ల సామాన్య ప్రజల జీవితం దుర్భరమవుతుంది.

అంటే ఈ చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశం వల్ల ప్రజలకు, చిల్లర వ్యాపారులకు ప్రయోజనాలేమీ లేకపోగా నష్టాలే ఉన్నాయి. ఈ విధానం వల్ల లాభపడేది కేవలం స్వదేశీ, విదేశీ బడా పెట్టుబడిదారులు, బహుళజాతి సంస్థలు మాత్రమే.

ప్రజలకు – మధ్యతరగతికి, బడుగు వర్గాలకు, ఇంత నష్టదాయకంగా వస్తున్న ఈ విధానాన్ని ఆకర్షణీయంగా కనిపించేలా చేయడానికి ఈ విషపుగుళికకు ప్రభుత్వాలు, పెట్టుబడిదారులు అనేక పంచదార పూతలు పూస్తున్నారు. వినియోగదారులకు సులభమైన పరపతి సౌకర్యాలు, తక్కువ వడ్డీరేట్లతో రుణాలు, ఖర్చు పెట్టుకోవడానికి వీలయిన ఆదాయం పెరిగేలా కొన్ని వర్గాల ఉద్యోగులకు జీతాలు పెంచడం, అంతర్జాతీయ జీవన ప్రమాణాలను ప్రచారం చేసి వాటిపట్ల మోజు పెంచడం వంటి అనేక చర్యలు చేపడుతున్నారు. దేశంలో ప్రస్తుతం 17–21 వయస్సులో ఉన్న వారి జనాభా పదికోట్లు ఉంటుందని, వారే తమ వినియోగదారులని కూడా పెట్టుబడిదారులు అంటున్నారు.

ఈ నేపథ్యంలో చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశాన్ని వ్యతిరేకించే పోరాటం కేవలం చిల్లర వర్తకుల జీవనోపాధికి మాత్రమే వర్తించే ఒంటరి పోరాటం కాదు. అది ఏకకాలంలో పెట్టుబడిదారీ దోపిడీకీ, విలువలకూ వ్యతిరేకమైన పోరాటంగానూ, మన ప్రజల సంక్షేమానికీ, జీవన భద్రతకూ సంబంధించిన పోరాటంగానూ ఉంటుంది. చిల్లర వర్తకంలో ప్రస్తుతం ఉన్న లోటుపాట్లను సరిదిద్దుకుంటూ, అదే సమయంలో ఈ వర్తకరంగంలోకి సామ్రాజ్యవాద సంస్థల ప్రవేశాన్ని గట్టిగా ఎదుర్కోవలసి ఉంటుంది. ఈ సమస్యకున్న విస్తృతిని వివరించి చెప్పడం ద్వారా ఈ పోరాటాన్ని విశాల ప్రజారాశుల సమైక్య పోరాటంగా తీర్చిదిద్దవలసి ఉంటుంది.

(దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం 2006న గుంటూరులో నిర్వహించిన సదస్సులో చేసిన ఉపన్యాస సారాంశం)

***మరో స్వతంత్ర ఉద్యమం, జూలై - ఆగస్ట్ 2006***

# 37

# ఎవరికోసమీ యురేనియం?

కడప జిల్లా వేముల మండలం తుమ్మలపల్లె లో యురేనియం గనుల తవ్వకం కొరకు ఉద్దేశించిన ప్రాజెక్టు చేపట్టాలా లేదా అని ప్రజాభిప్రాయం సేకరించేందుకు ఏర్పాటయిన బహిరంగ విచారణ అనుకున్నట్టు గానే "పులివెందుల మార్కు ప్రజాస్వామ్యం" అనబడే దాన్ని నిజం చేస్తూ "ప్రజాస్వామికంగా" ముగిసింది. ఈ దేశంలో అమలవుతున్నది నిజమయిన ప్రజాస్వామ్యమేననీ, ప్రజలకు తమ సమస్యలు చెప్పుకునే, తమ సమస్యలకు తామే పరిష్కారాలు వెతుక్కునే అవకాశం ఉన్నదనీ ఇంకా ఎవరయినా నమ్ముతూ ఉంటే ఆ అభిప్రాయాలు నిజం కాదని తెలుసుకోవడానికి విప్లవ సాహిత్యం దాకా పోనక్కరలేదు, తుమ్మలపల్లెలో జరిగిన ప్రజాభిప్రాయసేకరణ అనే ప్రహసనం చూస్తే చాలు.

ప్రభుత్వం అనబడేది, యురేనియం కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, స్థానిక రాజకీయ పెత్తందారీ వర్గాలు ఎన్ని అక్రమాల మీద, ఎన్ని అబద్ధాల మీద, ఎంత దౌర్జన్యం మీద ఆధారపడి ఈ తుమ్మలపల్లె యురేనియం ప్రాజెక్టు వ్యవహారాన్ని నడుపుతున్నాయో చూస్తేనే, అసలు ప్రాజెక్టులో ఏవో ప్రజావ్యతిరేక అంశాలున్నాయని అర్థమవుతుంది. ప్రజల ఆరోగ్య, జీవనభద్రతా, ఉపాధి దృష్టితో చూసినా, సాంకేతిక దృష్టి తో చూసినా, పర్యావరణ దృష్టితో చూసినా, 'అభివృద్ధి' కోణం నుంచి చూసినా, పరిసర ప్రాంతాల వనరుల వినియోగం వైపు నుంచి చూసినా, చట్టబద్ధమయిన అనుమతులవైపు నుంచి చూసినా ఆ ప్రాజెక్టు సంబద్ధత సందేహాస్పదంగా ఉంది. అయినా, స్థానిక పెత్తందార్లు, ప్రజా ప్రతినిధులుగా తమను తాము ప్రకటించుకునే వాళ్లు ఆ ప్రాజెక్టు రావలసిందే అంటున్నారు.



ఆ ప్రాంతంలో దొరికే ఖనిజంలో వాస్తవంగా వినియోగంలోకి వచ్చే యురేనియం అతి తక్కువ అని స్వయంగా పర్యావరణ ప్రభావ అంచనా నివేదిక తెలుపుతోంది. ఆ యురేనియం కూడ అణ్వస్త్రాలు తయారు చేయడంకోసం మాత్రమే గనుక దాని వెలికితీత దేశ ప్రయోజనాలకోసమనో, అభివృద్ధి కోసమనో అనడం పచ్చి అబద్ధం. దాని నుంచి అణువిద్యుత్తు తయారు చేస్తామనడం కూడ అర్ధసత్యమే తప్ప పూర్తి నిజం కాదు. ఎందువల్లనంటే, అణు విద్యుదుత్పత్తి కేంద్రాలు కూడ అంతిమంగా, అణ్వాయుధాలకు ముడి సరుకు సమకూర్చిపెట్టే వనరులే. ఇక తుమ్మలపల్లెలో తవ్వకాలు జరిగితే చిట్టచివరికి మిగిలేది అక్కడ పోగుపడే రెండు కోట్ల డెబ్భైలక్షల టన్నుల అణుధార్మిక వ్యర్థపదార్థాలు. అవి గాలిలో, నీటిలో, పంటలలో కలిసి కొన్ని వందల ఏళ్లపాటో, వేల ఏళ్లపాటో, పరిసర ప్రాంతాల ప్రజల ప్రాణాలనూ ఆరోగ్యాలనూ హరిస్తాయి. ఇక్కడ పరిసర ప్రాంతాలు అన్నప్పుడు, అది కేవలం వేముల మండలానికో, కడప జిల్లాకో కూడ పరిమితం కాదు. అణుధార్మిక ప్రభావం 170 కిలోమీటర్ల వరకూ ఉండే అవకాశం ఉంటుంది.

తుమ్మలపల్లె ప్రాజెక్టు తక్షణమే ఒక ఐదు గ్రామాల ప్రజలను నిర్వాసితులను చేస్తుంది గనుక వారికి ఏదోఒకరకమైన పునరావాసం కల్పిస్తే, ప్రాజెక్టు నిర్మించవచ్చునని ప్రాజెక్టు అనుకూలవర్గాలు వాదిస్తున్నాయి. ఇప్పటివరకూ ఏ అభివృద్ధి ప్రాజెక్టు లోనూ పునరావాసం సక్రమంగా కల్పించలేదనేది ఒక వాస్తవం కాగా, అసలు ప్రాజెక్టు అవసరమా అనేది ముఖ్యమైన ప్రశ్న. ఆ ప్రాజెక్టు వల్ల స్థానికులకు రాబోయే ఉద్యోగాలు కూడ లేవు. ముందు ఒకటి రెండు సంవత్సరాలు సివిల్ నిర్మాణ పనుల్లో తట్టమోసే పనులు దొరుకుతాయేమో గాని, ఆ తర్వాత స్థానికులకు అక్కడ ఒక్క ఉద్యోగం కూడ ఉండదు. ఆ ప్రాజెక్టే వస్తే దానికి నీటి అవసరం చాల ఉంటుంది. వట్టిపోయిన చిత్రావతి రిజర్వాయర్ నుంచి నీరు తీసుకుంటామని యురేనియం కార్పొరేషన్ చెపుతోంది గాని దాని అర్థం ఆ ప్రాంతంలోని భూగర్భ జలాలను ఇంకా లోతుకు పంపిస్తామని మాత్రమే.

ఇన్ని తప్పుడు వాదనలతో ముందుకేపోవడానికి యురేనియం కార్పొరేషన్‌కు ఏవో ప్రయోజనాలుండవచ్చు. కాని స్థానిక రాజకీయ నాయకులకు ప్రజల గురించి ఎంతోకొంత ప్రేమాభిమానాలు ఉండాలిగదా? ఒకవైపు ముఠాకక్షలు, మరోవైపు ఏ పనిలోనైనా కోట్లకుకోట్లు గడించే పన్నాగాలు తప్ప రాజకీయాలగురించి గాని, ప్రజా ప్రయోజనాలగురించిగాని ఏమాత్రం తెలియని, పట్టించుకోని ఆ స్థానిక నాయకులకు, ఈ రు. 1029 కోట్ల ప్రాజెక్టులో కాంట్రాక్టుల

రూపంలోనైనా, బెదిరింపుల రూపంలోనైనా, భూనష్టపరిహారం రూపంలోనైనా కనీసం నాలుగోవంతు అయినా దక్కుతుందనే ఆశ మిగిలిన మానవసహజమైన లక్షణాలన్నింటినీ విస్మరించేలాచేస్తోంది.

ప్రజాస్వామ్యం నిజంగా లేకపోతే పోయింది, కనీసం అది ఉన్నట్టు భ్రమ అయినా కల్పించాలని పాతతరం నాయకులకు అనిపిస్తుండేది. ఈ తరం నాయకులు ఎట్లా ఉన్నారంటే, చట్టబద్ధంగా జరగవలసిన బహిరంగ విచారణ దగ్గరికి కేవలం ఘర్షణ సృష్టించడానికి, ప్రాజెక్టు పట్ల భిన్నాభిప్రాయం ఉన్నవారిని బెదిరించడానికి, కొట్టడానికి, వారు మాట్లాడేది వినబడకుండా అల్లరి చేయడానికి వందలాదిమందిని పోగుచేసి తీసుకురావడం ప్రజాస్వామ్యమే అనిపిస్తోంది. అక్కడ బహిరంగ విచారణ గురించి చట్టం నిర్దేశించిన అన్ని ప్రమాణాలనూ, పద్ధతులనూ తుంగలో తొక్కి కాలరాచివేయడం ప్రజాస్వామ్యమే అనిపిస్తోంది. ప్రాజెక్టు పట్ల భిన్నాభిప్రాయం ప్రకటించడానికి వెళ్లినవాళ్ల చుట్టూ మూగి బూతులతో అవమానించారు. ఆ సమస్యలో అవగాహన కలిగిన వాళ్లు మాట్లాడడానికి అవకాశమే ఇవ్వలేదు. ఒకరిద్దరు తమ అభిప్రాయం చెప్పడానికి ప్రయత్నిస్తే ఆ మాటలు వినబడకుండా అల్లరి చేశారు. జిల్లాకు చెందిన ఒక రాజకీయ పార్టీ నాయకుడు వేదిక ఎక్కబోతే కిందికి లాగేశారు. ఆ ఘర్షణలో అటూ ఇటూ రాళ్లు విసురుకుంటే కేవలం ప్రాజెక్టు వ్యతిరేకులమీద మాత్రమే పోలీసు కేసులు పెట్టారు. ఒక్కమాటలో చెప్పాలంటే, అక్కడ వ్యక్తమైనది దౌర్జన్యమే తప్ప స్వేచ్ఛగా ప్రకటితమైన ప్రజాభిప్రాయం కాదు. నిష్పాక్షికంగా ఉండవలసిన ప్రభుత్వాధికారులు ఆ దౌర్జన్యానికి మౌన సాక్షులుగా ఉండడమే కాదు, దానికి వత్తాసు పలకడం ఇంకా ఘోరం.

నిజంగా యురేనియం ప్రాజెక్టు ప్రజలకోసమే అయితే, దానికి ప్రజా ప్రయోజనాలు, దేశాభివృద్ధి తప్ప మరో లక్ష్యం ఏదీ లేనట్టయితే, ఇంత దౌర్జన్యం, పెత్తందారీతనం, భిన్నాభిప్రాయాన్ని తొక్కిపట్టడం ఎందుచేత?

ఈ అక్రమాలన్నీ చాలవన్నట్టు, ఆదివారం బహిరంగవిచారణ జరిగితే, మంగళవారం దినపత్రికలలో యురేనియం కార్పొరేషన్ ఒక ప్రకటన ఇచ్చింది. నిజానికి, చట్టబద్ధమైన బహిరంగ విచారణ జరిపిన ఆంధ్రప్రదేశ్ కాలుష్య నియంత్రణ మండలి ఆ విచారణ ఫలితాలపై నివేదిక ప్రకటించే వరకూ, ఆ వివాదంలో భాగస్తురాలయిన యురేనియం కార్పొరేషన్‌కు తన అభిప్రాయం ప్రకటించే హక్కు లేదు. కాని ఆ ప్రకటన ప్రాజెక్టు వ్యతిరేకవాదనలు చేసినవారిమీద నిందలతో పాటు, తనకు అనుకూలంగానే విచారణ జరిగిందనే అర్థం వచ్చేట్టుగా ఉంది.

ప్రాజెక్టు రాకముందే ఇన్ని అక్రమాలు జరుగుతున్నాయంటే, అది నిజంగా వస్తే మరెన్ని అక్రమాలు జరుగుతాయనుకోవాలి?

***ఆంధ్రజ్యోతి, అక్టోబర్ 10, 2006***



# 38

## "దొర"ల దొంగతనానికి మారుపేరు

"దొంగలు దొంగలు కలిసి ఊళ్లు పంచుకున్నార"నేది పాత సామెత. ఇప్పుడు జరుగుతున్న స్పెషల్ ఎకనామిక్ జోన్ల (ఎస్ ఇ జెడ్) వ్యవహారం చూస్తుంటే దొరలు దొరలు కలిసి ఊళ్లు పంచుకుంటున్నారనిపిస్తుంది. (నిజానికి ఎప్పుడైనా ఊళ్లకు ఊళ్లనే పంచుకోగలిగిన, దోపిడీ చేయగలిగిన, మింగేయగలిగిన శక్తీ అధికారమూ అంగబలమూ అర్థబలమూ దొరలకే ఉంటాయిగాని దొంగలనబడేవాళ్లకెక్కడ ఉంటాయి?)

స్పెషల్ ఎకనామిక్ జోన్ ల పేరుమీద జవాబుదారీతనం లేని అధికారదుర్వినియోగం ఎంత పెద్దఎత్తున జరుగుతున్నదంటే, సుప్రసిద్ధ ఆధునిక భారత చరిత్రకారుడు సుమిత్ సర్కార్ 'ఆధునిక భారత చరిత్రలో ఇది ఒక అతిపెద్ద భూఆక్రమణ కు దారితీయబోతోంది. చరిత్ర మొత్తంలోనూ ఎప్పుడూ భారతదేశంలో ఈ విధంగా లక్షలాది హెక్టేర్ల వ్యవసాయ భూమిని ప్రైవేటు పరిశ్రమలకోసం బదిలీ చేయడం జరగలేదు. భారతదేశంలోమాత్రమే కాదు, బహుశా మరే వర్ధమాన దేశంలోనూ ఇలా జరిగిఉండదు' అన్నారు. సాధారణంగా పత్రికలకెక్కని, తీవ్రంగా మాట్లాడని సుమిత్ సర్కార్ కూడ ఇలా వ్యాఖ్యానించవలసి వచ్చిందంటే ఈ దోపిడీ ఎంత విస్తృతమైనదో అర్థమవుతుంది.

వలసలకు స్వాతంత్ర్యం అనబడేది ఇవ్వడం మొదలై, ఆయా స్వతంత్ర దేశాల ప్రభుత్వాలు విదేశీ పెట్టుబడులమీద ఆంక్షలు, పరిమితులు విధించడం ప్రారంభించిన తర్వాత ఎస్ ఇ జెడ్ ల కొత్త ఆలోచన తలెత్తింది. "రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం" కూలిపోయింది గనుక కొత్త సామ్రాజ్యాన్ని నిర్మించదలచిన సామ్రాజ్యవాద శక్తులు తమ పాత వలసలలో, స్వతంత్ర పాలన చెల్లని తమ ద్వీపాలు ఏర్పడాలని కోరుకున్నారు. ఆ ద్వీపాలకు పెట్టిన ముద్దుపేరు ఎక్స్‌పోర్ట్ ప్రాసెసింగ్ జోన్. పన్నుల విషయంలోనూ, కార్మికులకు సౌకర్యాల విషయంలోనూ, యజమానుల అధికారాలపై ప్రభుత్వాల నియంత్రణ విషయంలోనూ స్వదేశీ చట్టాలు, నిబంధనలు చెల్లని ఒక అతీత అధికారాన్ని వ్యాపారవేత్తలకు కట్టబెట్టడానికి ఉనికిలోకి వచ్చిన ఇపిజెడ్‌ల సంఖ్య ప్రపంచవ్యాప్తంగా 1960లలో 10 ఉండగా, 1980ల నాటికి 47 దేశాలలో 176 కు, 2003 నాటికి 116 దేశాలలో 3000 పైచిలుకుకు చేరిందంటే, 'రవి అస్తమించని బహుళజాతిసంస్థల సామ్రాజ్యం' ఎంతగా పెరిగిపోయిందో అర్థమవుతుంది. ఈ ఇపిజెడ్‌ల పేరును ఎస్‌ఇజెడ్‌లుగా మార్చిన ఘనత ప్రపంచీకరణకు ఎంతగా దక్కుతుందో, మావో అనంతర చైనా నాయకత్వానికీ అంతగా దక్కుతుంది.

భారతదేశంలోకూడ 1965లో కాండ్లాలో మొదటి ఇపిజెడ్ మొదలయింది. ఆ తర్వాత ముప్పైఐదు సంవత్సరాలలో మరొక ఏడు ఇపిజెడ్‌లు ఏర్పాటయ్యాయి. భాజపా నాయకత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వంలో వాణిజ్యశాఖ మంత్రిగా పనిచేసిన మురసోలి మారన్ చైనా పర్యటన తర్వాత భారత ప్రభుత్వం కూడ ఎస్‌ఇజెడ్‌ల గురించి ఆలోచించడం మొదలుపెట్టింది. ఎగుమతి-దిగుమతుల విధాన పత్రం 1997-2002 లో ఇటువంటి ప్రత్యేక ఆర్థిక మండలాల మార్గదర్శక సూత్రాలు తయారయ్యాయి. అలా ఎన్‌డిఎ ప్రభుత్వం తయారు చేసిన బిల్లును 2005 మే లో యుపిఎ ప్రభుత్వం చట్టంగా మార్చింది. 2006 ఫిబ్రవరిలో నిబంధనలు తయారుచేసింది. అంటే ఇవాళ తమతమ రాజకీయ అవసరాలకోసం ఏ రాజకీయ పక్షం ఏ గంభీరమైన ప్రకటనలు చేస్తూ ఉన్నప్పటికీ అటు ఎన్‌డిఎ లో, ఇటు యుపిఎ లో ఉన్న అన్ని పార్టీలకూ ఈ తిలాపాపంలో తలా పిడికెడు భాగం ఉందన్నమాట.

ఎస్‌ఇజెడ్‌ల ద్వారా ఎంతో విదేశీ పెట్టుబడి దేశంలోకి ప్రవహిస్తుందని, స్వదేశీ పెట్టుబడికి అవకాశాలు పెరుగుతాయని, పెద్ద ఎత్తున ఉద్యోగకల్పన జరుగుతుందని అధికారులు నమ్మబలుకుతున్నారు. సాధారణంగా రాజకీయనాయకుల మాటలు నీటిమూటలని నమ్మేవాళ్లుకూడ, ఈ వాగ్దానాలలో ఎంతోకొంత నిజం ఉందేమోనని భ్రమపడుతున్నారు.

ఉద్యోగకల్పన అబద్ధాలయితే ఎంత పెద్దఎత్తున సాగుతున్నాయంటే, మా తాత మీసాలు...అని సామెతచెప్పినట్టుగా ఉంది. రాష్ట్రం విషయమే చూస్తే రానున్న రెండు సంవత్సరాలలో ఎస్‌ఇజెడ్ లలోనే నాలుగులక్షల యాభైవేలమందికి ఉద్యోగాలు దొరుకుతాయట. అంటే సగటున ఒక్కొక్క సంస్థలో పదివేల ఉద్యోగాలు అన్నమాట. ఇంతవరకూ రాష్ట్రంలో ఇన్ని దశాబ్దాల పారిశ్రామిక వికాసం తర్వాత, ఒకేస్థలంలో పదివేలమందికి ఉపాధి కల్పిస్తున్న సంస్థలు ఒకటి రెండు కూడ లేవు. రానున్న రెండేళ్లలో నలభైఎనిమిది వస్తాయని మనను



నమ్మమంటున్నారు. నిజానికి రానున్న 48 ఎస్‌ఇజెడ్‌లలో, అవి తమకు ఇచ్చిన భూమిని రియల్ ఎస్టేట్ గా మార్చకుండా నిజంగానే పారిశ్రామిక, వ్యాపార సంస్థలుగా రూపు ధరించినా అన్ని ఉద్యోగాలు రావు.

ఎస్‌ఇజెడ్‌ల పేరుమీద ప్రభుత్వం, వ్యాపారవర్గాలు చేస్తున్న వాగ్దానాల్లో ఎన్ని నిజమవుతాయో తెలియదుగాని, ఆ పేరుమీద వ్యాపారసంస్థలకు అందే భూమి మాత్రం నూటికినూరుపాళ్లు నిజం. ఆ భూమి కూడ ఆయా సంస్థలకు అవసరమయింది ఎకరమో, రెండెకరాలో అయితే, వందలఎకరాలు అందడం కూడ నిజం. అంతర్జాతీయంగా, ఒక ఐటి ఉద్యోగికి వంద చదరపు అడుగుల పనిస్థలం అవసరమవుతుందనే అంచనాలు ఉండగా, మన ప్రభుత్వం వంద మంది ఉద్యోగులుకూడ లేని సంస్థలకు వంద ఎకరాలు, ఆ పైన కూడ కట్టబెట్టిన ఉదాహరణలు కొల్లలుగా ఉన్నాయి. ఇలా కట్టబెట్టిన భూమిలో అత్యధిక భాగం రియల్ ఎస్టేట్‌గా మారిపోతుందనడానికి సందేహమే అక్కరలేదు. ఎందుకంటే చట్టం ప్రకారమే, ఎస్‌ఇజెడ్‌లలో భూమి పొందిన సంస్థలు తమకందిన భూమిలో 35 శాతాన్ని మాత్రమే తాము చూపిన పనులకు ఉపయోగించుకుని, మిగతాది తమ ఇష్టం వచ్చినట్టు వాడుకోవడానికి అవకాశం ఉంది.

మొత్తం ఎంతభూమి ఇలా ఎస్‌ఇజెడ్‌లకు ఇస్తున్నారో స్పష్టమైన లెక్కలను ప్రభుత్వం చెప్పడం లేదుగాని, ఇప్పటికి అనుమతి పొందిన 267 ఎస్‌ఇజెడ్‌లను, ప్రతి ఎస్‌ఇజెడ్‌కు కనీసం వెయ్యి హెక్టేర్లు ఇవ్వాలనే సూచనను బట్టిచూస్తే కనీసం ఏడులక్షల ఎకరాల భూమి ఇప్పటికే చేతులు మారిందని తెలుస్తుంది.

నిజంగా నిజమయ్యే మరొక అంశం ఆయా ఎస్‌ఇజెడ్‌ల దెవలపర్లకు అందే రాయితీలు, మినహాయింపులు. వారు దిగుమతి చేసుకునే యంత్రసామగ్రికి పన్ను లేదు. వారి ఆదాయంపైన 15 సంవత్సరాలవరకు ఆదాయపు పన్ను లేదు. ఈ రాయితీలద్వారా ప్రభుత్వం కనీసం ఏడాదికి ఒక లక్ష కోట్ల రూపాయలు నష్టపోతుందని స్వయంగా కేంద్రమంత్రి కమల్ నాథ్ అన్నారు. ఆ మండలి నెలకొన్న ప్రాంతానికి 'విదేశీ భూభాగం' హోదా వస్తుందిగనుక ఏ దేశీయ చట్టమూ, రాజ్యాంగనియమాలూ వర్తించవు. ఆ సంస్థల గేట్ల దగ్గర దెవలపర్లు పాత బ్రిటిష్ దొరలలాగ 'నో ఎంట్రీ ఫర్ ఇండియన్స్' అని బోర్డులు పెట్టుకుని బతకవచ్చు.

ఈ ప్రత్యేక ఆర్థిక మండలాలవల్ల నిజంగా జరగబోయే మరొక పరిణామం – లక్షల ఎకరాల వ్యవసాయ భూములు, అడవులు, తీరప్రాంతాలు, ఖనిజ వనరులు ఉన్న ప్రాంతాలు బహుళజాతిసంస్థలకో, వారి జూనియర్ భాగస్వాములుగా ఉండబోయే దేశీ పెట్టుబడిదారులకో, రాజకీయ నాయకులకో హక్కుభుక్తమైపోవడం. అంటే లక్షలాదిమంది చిన్న రైతులు తమ భూములనుంచి బేదఖలయిపోయి పొట్టచేతపట్టుకుని వలసకూలీలుగా మారిపోవడం. ఆ నిరాశ్రయత, ఆ సంక్షోభం ఎంత హింసాత్మక వ్యక్తీకరణ పొందనుందో పాలకులకు ఏమయినా అర్థమవుతుందా?

***ఆంధ్రజ్యోతి, అక్టోబర్ 23, 2006***

# 39

## ప్రపంచీకరణ - కొత్త కోణాలు - కథాప్రక్రియ

కొత్త సహస్రాబ్దిలో మొదటి దశాబ్దం సగం గడిచిపోయింది. అంతకుముందరి దశాబ్దంలో తెలుగు సాహిత్య ప్రక్రియలన్నిటినీ విపరీతంగా ప్రభావితం చేసిన వస్తువు ప్రపంచీకరణ అని అందరికీ తెలుసు. కాగా, ఈ దశాబ్దంలో ఆ వస్తువు సాహిత్యం మీద ఎటువంటి ప్రభావాన్ని వేస్తోంది, అటు ఆ వస్తువులో గాని, ఇటు దాని ప్రభావంలో గాని ఏమైనా చెప్పుకోదగిన మార్పులు వచ్చాయా అని పరిశీలించడం సమాజ - సాహిత్య సంబంధాల అధ్యయనంలో ఒక ముఖ్యమైన, ఆసక్తికరమైన అంశం. ప్రపంచీకరణక్రమంలో ఏ కొత్త కోణాలు ఉనికిలోకి వచ్చాయి, వస్తున్నాయి, అవి మన కథా ప్రక్రియను ఏ పద్ధతిలో ప్రభావితం చేస్తున్నాయి, అందువల్ల తెలుగు సమాజానికీ సాహిత్యానికీ ఏ మేలు జరుగుతోంది, లేదా ఏ కొత్త కోణాలను మన కథా రచయితలు గుర్తించలేకపోతున్నారు, అందువల్ల తెలుగు సమాజానికిగానీ, సాహిత్యానికిగానీ జరుగుతున్న నష్టం ఏమిటి అని చర్చించడం ఇవాళ్టి ప్రసంగ (ఈ వ్యాస) లక్ష్యం.

ఈ దశాబ్దంలో కథా ప్రక్రియ, అంతకుముందరి దశాబ్దంలో ఉన్నంత ఆశావహంగా లేదని, ఎంపిక చేసుకోవడం ఒకప్పుడు ఉన్నంత సులువుగా



ఉండడం లేదని, మంచికథలనుకున్నవాటి సంఖ్య తగ్గిపోతున్నదని కథ సిరీస్ సంపాదకులలో ఒకరయిన నవీన్ అంటున్నారు. మొత్తంగానే కథాప్రక్రియ గురించి అటు పాఠకులనుంచి, ఇటు రచయితల నుంచి కూడ కొంత అసంతృప్తి వినబడుతున్నది. పత్రికలలో అచ్చవుతున్న కథల సంఖ్య, విడిగా వెలువడుతున్న కథాసంపుటాల, సంకలనాల సంఖ్య చాల ఆశావహంగా ఉంటున్నదిగాని కథల నాణ్యత అంత సంతృప్తిని ఇస్తున్నట్టులేదు. ఈ అసంతృప్తికి ఎన్నో తెలిసిన, తెలియని, అన్వేషించవలసిన కారణాలు, సంక్లిష్ట కోణాలు ఉండవచ్చు గాని, ఇక్కడ మొత్తంగా సమాజంలోనూ, ప్రత్యేకించి తెలుగు రచయితలలోనూ ప్రపంచీకరణ విషయంలో కొనసాగుతున్న అస్పష్టత, గందరగోళం, అసమగ్ర, పైపై, మూస అవగాహనలు కారణం కావచ్చుననిపిస్తున్నది. అందువల్ల ఈ సమస్యను కొంత లోతుగా అధ్యయనం చేయవలసిఉంది.

ఈ దశాబ్దంలో కథ ఎలా ఉంది అని ప్రశ్నించుకోవడం, అసంతృప్తి పడడం ఇవాళ చాల మామూలయిపోయింది. అటువంటి అసంతృప్తులన్నిటినీ చూస్తే, ప్రధానంగా కనబడే అభిప్రాయాలలో కొన్ని - కథలు లోలోపలినుంచి కదిలించేట్టుగా ఉండడంలేదు, కొత్త కొత్త సామాజిక అనుభవాలు కథలలోకి రావడం లేదు, కథకులు మంచి వస్తువులు తీసుకున్నప్పుడుకూడ లోతయిన అధ్యయనం, పరిశీలన, వస్తువు మీద సమగ్ర అవగాహన లేకుండానే రాసేస్తున్నారు, మన కథారచయితలందరూ వయసు రీత్యా ముప్పైలలోనూ ఆపైనా ఉన్నవారేగాని, ఇరవైఐదులోపలి రచయితలే కనబడడంలేదు, 199౦లలో ఒకవైపు కథాసాహితి పూనికతో వెలువడడం ప్రారంభించిన కథ సిరీస్ , దానితోపాటే కథాప్రక్రియలో వచ్చిన ఇతర పరిణామాలు, కొత్త గాలులు సాధించిన విజయాలు కోల్పోతున్నామేమోనని అనిపిస్తోంది. ఇవేకాక మరికొన్ని విమర్శలు, అసంతృప్తులు కూడ ఉండవచ్చునుగాని, స్థూలంగా ఈ ప్రాతినిధ్య అసంతృప్తులను చూస్తే, అవి అన్ని రంగాలకూ -- కథావస్తువుకూ, రూపానికీ, రచయితల శక్తికీ, రచయితల అవగాహనకూ, సామాజిక స్థితికీ - సంబంధించినట్టుగా కనబడుతున్నాయి.

బహుశా ఇంతగా అసంతృప్తి ఉండడానికి ఒక కారణం అంతకు ముందరి దశాబ్దంలో కథాప్రక్రియ సాధించిన విజయాలు, సాధించిన వస్తు విస్తృతి, వైవిధ్యం, లోతు కావచ్చు. ఈ దశాబ్దపు కథలను అంతకుముందరి దశాబ్దపు కథల ప్రాతిపదికమీద పోల్చిచూడడం జరుగుతుండవచ్చు. అందువల్ల ఇవాళ్టి అసంతృప్తి గురించి మాట్లాడుకోవాలంటే, మొదట, గత దశాబ్దంలో కథాప్రక్రియకు ఏమి జరిగిందో పరిశీలించాలి.

తెలుగుకథాప్రక్రియ 199౦ దశకంలో ఒక కొత్త సందర్భాన్ని ఎదుర్కొంది. ఆ సందర్భం ప్రపంచీకరణ. ఆ సందర్భానికి తగినట్టుగా స్పందించడానికి తెలుగు కథ ప్రయత్నించింది. తెలుగు కథకులందరికీ ఆ ప్రపంచీకరణ క్రమం ఏమిటో, దానిలో ఇమిడిఉన్న అంశాలు, దాని పర్యవసానాలు ఏమిటో సంపూర్ణంగా తెలుసునని ఏమీ అనుకోనక్కరలేదు. కాని మన మార్కెట్లలోకి వస్తున్న కొత్త సరుకులు, మన డ్రాయింగ్ రూములలోని రంగులటీవీల ద్వారా మనకు అందుతూఉండిన, మనను ఆకర్షిస్తుండిన, సమ్మోహపరుస్తుండిన కొత్త జీవనశైలులు,

కొత్త మానవసంబంధాలు మన కథారచయితలకు ప్రపంచీకరణ గురించి ఒక అవగాహన కలిగించాయి. తెలుగు కథకులు వెంటనే ఒక అసంకల్పితప్రతీకారచర్య లాగ, తక్షణ స్పందన లాగ ప్రపంచీకరణను వ్యతిరేకించారు, ప్రపంచీకరణ మానవసంబంధాలమీద ఎటువంటి దుష్ఫలితాలను వేయగలదో స్థూలంగానైనా గుర్తించి తమస్పందనలకు కథారూపాలు ఇచ్చారు.

ఆ స్పందన చాల సముచితమయినదీ, అవసరమయినదీ అనడంలో సందేహంలేదు గాని, ఇప్పుడు వెనక్కితిరిగి చూస్తే, ఆ స్పందన రోగసూచికలనే పట్టుకుందిగాని, లోపలికివెళ్లి రోగపు అసలు కారణాలనుగాని, ఆ రోగపు పరిష్కారాలనుగాని గుర్తించినట్టు కనబడదు. అందువల్లనే ఆ దశాబ్దంలో ప్రపంచీకరణ ఇతివృత్తంతో వెలువడిన గొప్ప కథలలో చాల భాగం రోగసూచికలమీద కథలుగా మిగిలిపోయాయి. ఈ విశ్లేషణ ఆ కథల పాత్రను తక్కువ చేయడానికి కాదు. అవన్నీ కూడ నిజంగా గొప్ప కథలు. సాలభంజిక, ఖాదర్ లేడు, తెల్ల దయ్యం, రైతుల ఆత్మహత్యల కథలు, కార్మికుల జీవనోపాధి హరించడం మీద కథలు, వాటర్, పెండెం సోడా సెంటర్, వలసపక్షి, ఆఖరికి ఐదు నక్షత్రాలు, మురళీవాళ్లమ్మ, టైటానిక్, సూపర్ మామ్ సిండ్రోమ్, చివరి పిచ్చుక వంటి కథలన్నీ నిజంగా గొప్ప కథలే. జీవనానుభవాన్నీ, అవగాహననూ ఉన్నతీకరించే కథలే. కాని వాటిలో చాలభాగం రోగకారణం దగ్గరికి, మూలానికి వెళ్లలేకపోయాయని గుర్తించడం అవసరం.

నిజానికి ప్రపంచీకరణకు చెప్పలేనన్ని ముఖాలున్నాయి, సంక్లిష్ట కోణాలున్నాయి. అనేక రంగాలలో దాని ధాతువులు, పర్యవసానాలు ఉన్నాయి. గత పదిహేనుసంవత్సరాలుగా ప్రపంచవ్యాప్తంగానూ, దేశంలోనూ, తెలుగులోనూ వెలువడుతున్న ప్రపంచీకరణ అధ్యయనాలను చూస్తే ఈ విషయం అర్థమవుతుంది. ప్రపంచీకరణకు రాజకీయార్థిక, సామాజిక, చారిత్రక, సాంస్కృతిక రంగాలన్నిటిలోనుంచీ చెప్పుకోగల అర్థాలెన్నో ఉన్నాయి. ఇవన్నీ ఒక సృజనాత్మక రచయిత తెలుసుకొని ఉండాలా, అవన్నీ రాస్తే అది కథ అవుతుందా అని ప్రశ్నిస్తే ఆ సైద్ధాంతికస్థాయి సంక్లిష్టతను ఉన్నదున్నట్టుగా రాస్తే అది కథ అవుతుందో కాదో కాని ఆ మూలాల అవగాహన కథా రచయితకు ఉండడం అవసరం అని నేననుకుంటాను.

తొలిదశాబ్దంలో ప్రపంచీకరణను ఇంత లోతుగా, తాత్వికస్థాయిలో అర్థంచేసుకోవడంలో మనం చేయవలసినంత కృషి చేయలేదేమోననిపిస్తుంది. బహుశా అందువల్లనే ఆ దశాబ్దంలో సాహిత్యప్రక్రియలన్నీ ప్రపంచీకరణపట్ల స్థూలంగా వ్యతిరేకవైఖరినే తీసుకున్నప్పటికీ, క్రమక్రమంగా ఆ వైఖరి మూసగా మారిపోయింది. ఆ తర్వాత వచ్చిన సాహిత్యరచనలన్నీ, ముఖ్యంగా కథలు పాత కథలకు అనుకరణలుగా కనిపించడం మొదలయింది. బహుశా ఇవాళ్టి అసంతృప్తికి ఒక కారణం అది కావచ్చు.

ఈ నేపథ్యంలో ఈ దశాబ్దపు అవసరం ఆ లోతులకు వెళ్లి, ప్రపంచీకరణను సమగ్రంగా, విశాల అర్థంలో గ్రహించడం. అలా గ్రహించినప్పుడు, మొదట ప్రపంచీకరణ క్రమపు తాత్విక, రాజకీయార్థిక, సాంస్కృతిక అర్థాలు ఏమిటో తెలుసుకోవాలి.



ఇదివరకు చాలసార్లు చెప్పినమాటే, ఇక్కడ కొందరయినా వినిఉన్న మాటే కాని, మరొకసారి చెప్పదలిచాను. కవి, రచయిత, బుద్ధిజీవి ఎవరయినా ఎందుకు ప్రపంచీకరణ గురించి తెలుసుకోవాలంటే, ఎందుకు ప్రపంచీకరణను వ్యతిరేకించాలంటే, ప్రపంచీకరణ అనేది తాత్వికంగానే మనిషికి వ్యతిరేకమయినదిగనుక. సాహిత్యకారులుగా మనకు మనిషే తొలి ప్రమేయం గనుక. ప్రపంచీకరణకు, దానికి మూలమయిన సామ్రాజ్యవాదానికి, పెట్టుబడిదారీవిధానానికి నిఘంటువులో మనిషి అనే మాట లేదు. ఆ నిఘంటువులో ఉన్నది అమ్మకందారు, కొనుగోలుదారు అనే మాటలు మాత్రమే. నువ్వు నీ రక్తాన్నీ చెమటనీ నాకు ఎంత చౌకగా, ఎంత ఎక్కువగా అమ్మగలవు, నీ నేలమీది వనరులను నాకు ఎంతగా అమ్మగలవు, నేను నీ నేలమీది వనరులతోనే తయారుచేసిన సరుకులను ఎంతఎక్కువగా కొనగలవు – పెట్టుబడిదారీ విధానానికి తెలిసింది ఇంతే. కాని మనకు, సాహిత్యకారులకు, సృజనకర్తలకు, బుద్ధిజీవులకు, ఆలోచనాపరులకు మనిషంటే రక్తమాంసాల మనిషి, ఉద్వేగాల మనిషి, ప్రకృతితో, సహ మానవులతో నిత్యం సంబంధాలలో ఉండే మనిషి. సాహిత్యమంతా ఈ మనిషిగురించే. మానవసంబంధాలగురించే. అందువల్ల, మౌలికంగానే తాత్వికస్థాయిలో సాహిత్యకారులకూ ప్రపంచీకరణకూ చుక్కెదురు. ఈ మౌలిక, స్వాభావిక వ్యతిరేకత అర్థమయితేగాని మన సాహిత్యరచనలలో ప్రపంచీకరణ వ్యతిరేకత లోతుగా, సమగ్రంగా ప్రతిఫలించదు.

ఇక ప్రపంచీకరణకు ఎన్నెన్ని వ్యక్తీకరణ రూపాలున్నప్పటికీ, దాని సుస్పష్టమైన ప్రయోజనం రాజకీయార్థిక రంగంలోనిదే. పెట్టుబడిదారీ విధానం పుట్టిననాటినుంచీ కూడ, దానికి మౌలిక లక్ష్యాలు తన ఉత్పత్తి యంత్రానికి చౌక ముడిసరుకులను ఇబ్బడిముబ్బడిగా, నిరంతరాయంగా సమకూర్చుకోవడం, ఆ ముడిసరుకులలో ప్రకృతి సహజమైన వ్యవసాయోత్పత్తులు, ఖనిజ వనరులు, మానవశ్రమ ఉండవచ్చు, అప్పటివరకూ సరుకులుగా గుర్తించబడని ఎన్నో వస్తువులు, సేవలు – మనిషికీ ప్రకృతికీ మధ్య ఉండేవి, మనిషికీ మనిషికీ మధ్య ఉండేవి – ఉండవచ్చు. ఈ సహజ సంబంధాలన్నిటినీ సరుకుల సంబంధాలుగా మార్చి, అన్ని సంబంధాలనూ, అన్ని వస్తువులనూ, అన్ని సేవలనూ మార్కెట్ తో అనుసంధానం చేయడం పెట్టుబడిదారీ విధాన లక్ష్యం. ఆ తర్వాత తన ఉత్పత్తి యంత్రం తయారుచేసే సరుకులను అమ్ముకోగలిగే మార్కెట్లను రూపొందించుకోవడం, వాటిని విస్తరించుకోవడం. ఈ లక్ష్యాలను మరో మాటల్లో చెప్పాలంటే సమాజంమొత్తాన్నీ మార్కెటీకరించడం దాని పరమధ్యేయం. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఈ ధ్యేయం అమలుచేసే వ్యూహానికి పరాకాష్ట. ప్రపంచీకరణలోని ఈ రాజకీయార్థిక సారాంశాన్ని ఎంతలోతుగా అర్థం చేసుకోగలిగితే, దాని విభిన్న వ్యక్తీకరణలను గుర్తించగలిగితే, మన కథారచయితలు ఎటువంటి ఇతివృత్తం తీసుకున్నా దానిలో ప్రపంచీకరణ ప్రభావాన్ని, పర్యవసానాలను కనిపెట్టగలరు, కథారూపం ఇవ్వగలరు.

ప్రపంచీకరణ క్రమం సంస్కృతిమీద ఎటువంటి ప్రభావం వేస్తున్నదో ఇప్పటికే చాల చర్చ జరిగింది, జరుగుతోంది. ఆ విషయం మళ్లీ ఇక్కడ ప్రస్తావించబోవడంలేదు. కాని, మన

సంస్కృతి అనేదాని పట్ల ఒకవైపు హిందూత్వ, బ్రాహ్మణ్యం చేస్తున్న వాదనలు, ప్రపంచీకరణ వల్ల %ట%మన సంస్కృతి%% ధ్వంసమైపోతున్నదని సంఘపరివారం చేస్తున్న వాదనలు ఒకవైపు ఉండగా, మరోవైపు స్థానిక, పరంపరాగత శ్రమజీవన సంప్రదాయాన్ని రద్దుచేసి, సరుకుగా మార్చేందుకు ప్రపంచీకరణ శక్తులు చేస్తున్న ప్రయత్నాలు సాగుతున్నాయి. ఈ సంక్లిష్ట వాస్తవికతలో ప్రపంచీకరణ సాంస్కృతిక ప్రభావాల గురించి మన కథారచయితలు శ్రద్ధగా, నిశితంగా అధ్యయనం చేయవలసిఉంది.

ఈ సంక్లిష్ట అంశాలను గుర్తించడానికి, అర్థం చేసుకోవడానికి అవసరమయినంత దృక్పథ స్పష్టత లేకపోవడం మన రచయితలలో ఒక ముఖ్యమైన లోపమని అనిపిస్తుంది. మన సమాజంలో, సాహిత్యలోకంలో అనేకదృక్పథాల కలగూరగంప అభిప్రాయాలు, తాము ఒక దృక్పథానికి చెందినవారమని చెప్పుకుని తిరుగుతున్నప్పటికీ ఆ దృక్పథపు లోతుపాతుల గురించి అవగాహన లేకపోవడం సర్వసాధారణంగా జరుగుతోంది. ప్రగాఢమైన జీవితానుభవంతో, సన్నిహిత జీవనస్పర్శతో ఒకటో రెండో మంచికథలు రాయవచ్చును గాని, జీవితాన్ని సమగ్రంగా, సునిశితంగా అవగాహన చేసుకోగలిగిన దృక్పథ స్పష్టత లేకపోవడం వల్ల కొత్తకొత్త జీవనసందర్భాలను అర్థంచేసుకోవడం కష్టమవుతుంది. అందువల్ల వాటికి కథారూపం ఇవ్వడం కష్టమవుతుంది.

ఇవాళ్టి కథారచనలోని సమస్యలకు ఒక ప్రధాన కారణం ఈ దృక్పథస్పష్టత లేకపోవడమేననిపిస్తుంది. అందువల్లనే మన నిత్యజీవితానుభవంలోకి వస్తున్న అనేక కొత్త జీవనరంగాలు, వృత్తులు, జీవనశైలులు మనం అర్థం చేసుకోలేకపోతున్నం. ప్రపంచీకరణ ఫలితంగా, అందులో భాగంగా మనచుట్టూ జీవితం చాల మారిపోతున్నది. ఆ మారిపోతున్న జీవితాన్ని ఎంతోకొంత పత్రికా వార్తలు, ఇతర ప్రచార, ప్రసార మాధ్యమాలు మన దృష్టికి తెస్తున్నాయి. కాని ఆ ఉపరితల నివేదికలతోనే కథ, నవల వంటి వచనప్రక్రియలు రాయడం సాధ్యం కాదు. ఆ వార్తా నివేదికలకు రక్తమాంసాలు, మానవసంబంధాలు, ఉద్వేగాలు, సన్నివేశాలు, సంభాషణలు వంటివెన్నో చేర్చవలసిఉంటుంది.

ఒక్కసారి మనచుట్టూ ఉన్న జీవనరంగాలను, అసలు మన జీవితాలనే పరిశీలించిచూడండి. ఒక పది సంవత్సరాలకింది జీవితంతో పోల్చిచూడండి. ఎంత మార్పు కనబడుతోంది? ఆ మార్పు కింద ఎంత పాత కొనసాగింపే కనబడుతోంది? నిజానికి సాహిత్యం చేయవలసిన పని ఇట్లా మన జీవితానుభవంలోకి వచ్చి మనకు అప్రజ్ఞాతంగా ఉన్న విషయాలను మనకు విప్పిచెప్పగలగడం. కథకూ, ఇతరవచనప్రక్రియలకూ ఆ శక్తి ఉంది. మనకథారచయితలు ఆ శక్తిని గుర్తిస్తున్నారా, వాడుకుంటున్నారా?

ఇక్కడ ఇటీవలి రెండుకథలను గురించి ప్రస్తావించాలి. ఆ కథల్లో శిల్పపరమైన లోపాలో, ఇతర లోపాలో ఉండవచ్చును గాని ఆ రెండు కథలూ కూడ తెలుగు సమాజంలోకి కొత్తగా ప్రవేశిస్తున్న జీవన రంగాలగురించి, జీవనశైలులగురించి, మానవసంబంధాల



పరిణామాలగురించి వెలుగు ప్రసరించడానికి ప్రయత్నించాయి. వాటిలో మొదటిది అక్కిరాజు భట్టిప్రోలు రాసిన గేటెడ్ కమ్యూనిటీ. తెలుగు సమాజంలోకి కొత్తగా గేటెడ్ కమ్యూనిటీ అనే బృందం వచ్చి చేరుతోంది. నిజానికి ఈ బృందం ప్రవేశించి పది సంవత్సరాలు గడుస్తున్నా, ఇంతకాలం అది మన సాహిత్యంలోకి రాకుండానే ఉండిపోయింది. ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ సంపాదకులు రామమనోహర్ రెడ్డి %ఎఏ%టు ఇండియాస్ %ఎఏ% పేరుతో ఈ కొత్త పరిణామాన్ని విశ్లేషిస్తూ ఒక వ్యాసం రాశారు. భారత సమాజంలోపలనే, చుట్టూ ఉన్న సమాజానికి భిన్నమైన ఒక బృందం తమ నివాసాలచుట్టూ గోడలు కట్టుకుని, సమాజంనుంచి వేరయిపోయి, అంతర్జాతీయ సంపన్నులు అనుభవించే విలాసాలన్నీ అనుభవించాలని ఉవ్విళ్లూరుతూ బతుకుతోంది. ఇటువంటి గేటెడ్ కమ్యూనిటీలు హైదరాబాదుకు, ఇతర తెలుగు నగరాలకు విస్తరించి చాలకాలమే అయినా ఎందువల్లనో అది తెలుగు కథా వస్తువు కాలేకపోయింది. అలాగే, మానవ సంబంధాలలో, ముఖ్యంగా స్త్రీ పురుష సంబంధాలలో కాజువల్ వైఖరి ఎప్పటినుంచో ఉన్నదే, పురుషులు అనుభవిస్తున్నదే కాని, ప్రపంచీకరణ తర్వాత వచ్చిన ఎంతోకొంత వెసులుబాటువల్ల మధ్యతరగతి యువతి ఆ కాజువల్ వైఖరిని తాను అమలుచేయదలచుకుంటే ఏమవుతుంది? ఇది ఒక కొత్త జీవనశైలి. దీనిగురించి తాడికొండ శివకుమారశర్మ రాసిన పెళ్లంటే కథ వచ్చింది. ఈ రెండు కథలూ ప్రపంచీకరణ తర్వాత విస్తరిస్తున్న జీవితాన్ని, లేదా విచ్ఛిన్నమవుతున్న జీవితాన్ని పట్టుకోవడానికి చేసిన ఆహ్వానించదగిన ప్రయత్నాలని నేననుకుంటున్నాను. ఇప్పటివరకూ తెలుగుకథ ప్రపంచీకరణ గురించి రాయడమంటే మానవసంబంధాల విచ్ఛిన్నాన్ని, ముఖ్యంగా చెదిరిపోతున్న గ్రామీణ జీవన సౌందర్యాన్ని రాయడమే నని, నోస్టాల్జియా – పురాస్మృతిని – రాయడమేనని ఒక అభిప్రాయంతో ఉంది. అది కొంతవరకు నిజమేగాని, అంతకుమించి రాయవలసిన విషయాలెన్నో ఉన్నాయని గుర్తించవలసి ఉంది. కొన్ని ఉదాహరణలు చెప్పుకోవాలనుకుంటే, నేరం తీసుకోండి, ఒక మహా విషవలయంలా విస్తరిస్తున్న ప్రపంచీకరణ వలలను చూడండి. ప్రపంచీకరణలో భాగంగా పాలకవర్గాలు ప్రోత్సహిస్తున్న సమ్మతి తయారీ ని చూడండి. సంస్కృతులమధ్య ఘర్షణ పేరుతో అంతర్జాతీయంగా ముస్లిములమీద దాడి దగ్గరినుంచి అట్టడుగున అనాదృత, దళిత వర్గాలమీద దాడి దాకా సాగుతున్న బహిరంతర యుద్ధాలను చూడండి. వీటన్నిటికీ ప్రపంచీకరణకూ ఉన్న అవినాభావ సంబంధాన్ని చూడండి. ఇవన్నీ కథా ప్రక్రియలోకి తప్పకుండా రావలసినవే. మొదట నేరం సంగతి చూద్దాం. పదిసంవత్సరాలకిందికీ ఇప్పటికీ మన సమాజంలో నేరం పాత్ర ఎంత పెరిగిపోయిందో చూడండి. ఒకప్పుడు దినపత్రికల్లో నేరం వార్తలు జిల్లాల అనుబంధాల్లో పావుపేజీ, అరపేజీకి మించేవికావు. ఇప్పుడవి హైదరాబాదులోనైతే రెండుపేజీలకు దాటిపోతున్నాయి. అంతర్జాతీయంగా, ముఖ్యంగా లాటిన్ అమెరికన్ దేశాల్లోనూ, తూర్పు ఆసియా దేశాల్లోనూ ఎంతోమంది విశ్లేషకులు ప్రపంచీకరణకూ నేరం పెరుగుదలకూ ఉన్న ప్రత్యక్ష సంబంధంగురించి నిర్ధారించిఉన్నారు. ప్రపంచీకరణ క్రమం వల్ల విచ్చలవిడిగా పెరిగిన

రియల్ ఎస్టేట్, మాఫియా, లంచగొండితనం, మాదకద్రవ్యాల వాడకం, జూదం, పాలనలో అరాచకం, మీడియా పేరుమీద స్వార్థప్రయోజనాల రక్షణ వంటి పరిణామాలన్నీ మానవ జీవితాన్ని అతలాకుతలంచేస్తున్నవే. తప్పనిసరిగా సాహిత్యరూపం పొందవలసినవే. గత పది సంవత్సరాలుగా రియల్ ఎస్టేట్ మన నగరాలలోనూ, పట్టణాలలోనూ జీవితాన్ని అల్లకల్లోలం చేస్తుంటే, ఒక్క కథ కూడ రాలేదంటే విచారించవలసిన విషయమే.

ఇక ప్రపంచీకరణకు ఒక అంతర్జాతీయ స్వభావం, అన్నిటినీ కప్పేసే వల స్వభావం, వాతాపిజీర్ణం అని అన్నిటినీ మింగేయగల స్వభావం ఉన్నాయి. ఇంతగా సంక్లిష్టత, పరస్పరాశ్రయత, పొరలుపొరలుగా సంబంధాలు ఉన్నచోట ఆ ఇతివృత్తాన్ని సృజనాత్మక ప్రక్రియలోకి తీసుకురావడం చాల ఆసక్తికరంగా, సవాలులాగ ఉంటుంది. రాజకీయార్థశాస్త్ర విద్యార్థిగా నా అనుభవంలో ఉన్న ఒక విషయం చెపుతాను.

ఇది గ్లోబల్ కుగ్రామం, ఇది ప్రపంచ సంగ్రామం అన్నప్పుడు శ్రీ శ్రీది అతిశయోక్తి అనిపించవచ్చు. గంగవరంలో చిందిన మత్స్యకారులనెత్తురుకూ, అమెరికన్ సామ్రాజ్యవాదానికీ సంబంధం ఉన్నదని నేనంటే బట్టతలకూ మోకాలుకూ ముడిపెట్టినట్టుందని అనిపించవచ్చు. కాని, అమెరికన్ సామ్రాజ్యవాదం, అమెరికన్ ఆర్థిక వ్యవస్థ, అమెరికన్ సైనిక–పారిశ్రామిక యంత్రాంగం తమ జలాంతర్గాముల నిర్మాణానికీ, బాంబర్ల, జెట్ ఫైటర్ల, క్షిపణి వ్యవస్థల నిర్మాణానికీ ఆధారపడే లోహాలలో ప్రధానమైనది అల్యూమినియం. ఆ అల్యూమినియం తయారు కావాలంటే బాక్సైట్ అనే ఖనిజం కావాలి. ప్రపంచంలో దొరికే బాక్సైట్ ఖనిజం మొత్తంలో తొంభై శాతం వాడుకునే అమెరికా లో బాక్సైట్ ఖనిజం లేదు. ఆ ఖనిజాన్ని తవ్వితీసే దేశాలన్నిటినీ తన గుప్పెట్లో పెట్టుకునిఉండడం అమెరికా కు అత్యవసరం. ఆ బాక్సైట్ మన విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాల సరిహద్దు అడవి కింద ఉందిగాని, అక్కడ తవ్వకాలు జరపడానికి వన్ ఆఫ్ సెవెంటీ చట్టం అడ్డం వస్తుంది. ఆదివాసుల జీవనసరళి అడ్డంవస్తుంది. అక్కడినుంచి బాక్సైట్ తవ్వే పనిని సామ్రాజ్యవాదుల దళారీ సంస్థ జిందాల్ కంపనీ కి అప్పగించి, దాన్ని రవాణా చేయడానికి ప్రత్యేకంగా గంగవరం ఓడరేవు నిర్మించాలి. అక్కడ తరతరాలుగా జీవిస్తున్న మత్స్యకారులు అడ్డం వస్తే వారిమీద కాల్పులు జరిపి, నెత్తురు పారించి అయినా సరే, బాక్సైట్ తరలింపుకు మార్గం సుగమం చేయాలి. అమెరికాలో తయారయిన జలాంతర్గామి మీద గంగవరంలో పోలీసుకాల్పులకు బలిఅయిపోయిన నూకరాజు నెత్తురు అంటి ఉందనే దృశ్యం ఒక వచనరచయితకు ఎంత అవకాశం ఇవ్వగల ఇతివృత్తం?

రోడ్ల వెడల్పు కార్యక్రమం మన రాష్ట్రంలో ప్రారంభమై, అన్నిచోట్లా, రహదారులపక్కన చిన్నచిన్న వ్యాపారాలు చేసుకుని బతుకు వెళ్లదీస్తున్న అభాగ్యుల జీవితాలలో భూకంపం సృష్టించినప్పుడు ఖాదర్ లేదు వంటి ఆర్ద్రమైన కథలతో తెలుగు కథ స్పందించింది. కాని ఒక దశాబ్దం గడవకుండానే, ఇవాళ మన పాలకవర్గాలు, ప్రపంచీకరణశక్తులు ఎంత విజయం సాధించాయంటే, రోడ్ల వెడల్పు కార్యక్రమానికి సమ్మతి తయారీ మొదలయిపోయింది. ఇవాళ



అనేకానేక ఆకర్షణీయమైన పథకాలలో విపరీతంగా వాహనాలు కొనుక్కున్న మధ్యతరగతి (ఆ వాహనాల అమ్మకాల వెనుక ఉన్న చమురు పరిశ్రమ, వాహన పరిశ్రమ ప్రయోజనాలు, వాటికోసం దేశవ్యాప్తంగా వేలకోట్ల రూపాయలతో నిర్మాణమవుతున్న రోడ్లు – అదంతా మరో కథ) ఇవాళ రోడ్డు మీదికి రాగానే రద్దీని చూసి విసుక్కుని రోడ్ల వెడల్పు కార్యక్రమం ఎంత మంచిదో నని కితాబులు ఇస్తున్నారు. ఇంకా రోడ్లు వెడల్పు అయితే బాగుండునంటున్నారు. ఈ మానసికస్థితిలో మార్పు మన కథలకు ఇతివృత్తంకాదా? ఆ మార్పుకు మూలమైన సమ్మతి తయారీ, ఆ మార్పుతో లాభపడే బహుళజాతి సంస్థల కుట్రలు మన కథలకు ఇతివృత్తాలు కావా?

ఇక చివరిగా, చమురునేలలమీద జీవితాలు గడుపుతున్న ముస్లిములమీద దాడి చేయడానికి సంస్కృతులమధ్య ఘర్షణ అని అమెరికన్ సామ్రాజ్యవాదం, బహుళజాతి సంస్థలు ఒక సిద్ధాంతాన్ని తయారు చేసుకున్నాయి. ఆ సిద్ధాంతం అంతర్జాతీయస్థాయిలో మాత్రమే కాదు, అన్నిచోట్లా అమలులో ఉంది. అన్నిచోట్లా, ఏయే వర్గాలు, సమూహాలు తరతరాలుగా చేతివృత్తులకూ, వ్యవసాయానికీ, స్వతంత్ర వైద్యానికీ, సహస్రవృత్తుల శ్రమలకూ ఆలవాలమో ఆయా వర్గాలనూ సమూహాలనూ అణచివేయడానికీ, పక్కకు తోసేయడానికీ, వారి నైపుణ్యాలకు విలువలేకుండా చేయడానికీ సామ్రాజ్యవాదం, బహుళజాతిసంస్థలు ప్రయత్నిస్తున్నాయి. వారిలో చాల ఎక్కువమంది ఇంకా మార్కెటేతర సంబంధాలలో ఉన్నారు గనుక, వారిని పక్కకు తోసేయడమే ఏకైక మార్గంగా సామ్రాజ్యవాదం భావిస్తోంది. ఇవాళ రెండో దశ సంస్కరణలు అనీ, గ్రామీణ మార్కెట్లలోకి ప్రవేశం అనీ, మైక్రోఫైనాన్స్ అనీ, చేతివృత్తుల ఆధునికీకరణ అనీ వినబడుతున్న నినాదాల అసలు సారం ఇదే. ఇది ప్రపంచీకరణ కొత్త ముఖాలలో ఒకటి. ఈ ఘర్షణలో నష్టపోయే వారు ముస్లింలు, ఆదివాసులు, స్త్రీలు, దళితులు, వృత్తికులాలవారు – ఒక్క మాటలో చెప్పలంటే, మన సమాజంలోని అత్యధిక సంఖ్యాకులు. వారి జీవితాల్ని అల్లకల్లోలంచేయబోతున్న ఈ ప్రపంచీకరణముఖం గురించి రాయడంకన్న మన సాహిత్యం సాధించగలిగిన ప్రయోజనం మరేమన్నా ఉన్నదా?

ప్రపంచీకరణ అనివార్యమని, దాన్ని ఆపలేమని, కేవలం దానికి మానవీయ ముఖం కలపడం తప్ప మరొక దారి లేదని చాలమంది మేధావులు భావిస్తున్నారు, ప్రకటిస్తున్నారు. కాని ప్రపంచీకరణను అడ్డుకోవడం పరిమిత అర్థంలోనైనా సాధ్యమేనని లాటిన్ అమెరికన్ ప్రజా ఉద్యమాలు అనుభవాలు చూపుతున్నాయి. ప్రపంచీకరణను అంతిమంగా అడ్డుకోవడం, రద్దుచేయడం ఒక రాజకీయ చర్య అని, రాజకీయార్థిక క్రమం అని అందరికీ తెలుసు. ఆ చర్యలనూ, క్రమాలనూ బలపరచడం రచయితల బాధ్యత. ఒకవేళ ఆ రాజకీయకార్యక్రమంలో భాగం పంచుకోదలచుకోకపోయినా, ప్రపంచీకరణ ప్రోత్సహించదలచిన మార్కెటీకరణ క్రమానికి వ్యతిరేకంగా, మనసమాజంలో ఉన్న మార్కెటేతర సంబంధాలను ఎత్తిపట్టే పని చేయవచ్చు. అంటే ఒక ప్రత్యామ్నాయ సంస్కృతికి మనం సాహిత్య వ్యక్తీకరణ ఇవ్వవచ్చు.

ఈ పని చేయకుండా మనను అడ్డుకుంటున్నవి ఏమిటి? ఎందువల్ల మన బుద్ధిజీవులు, కథారచయితలు ఈ కొత్త కోణాలవైపు తమ దృష్టి సారించడంలేదు?

ఇందుకు కారణాలు మన సమాజంలోనూ, మన సాహిత్య సంప్రదాయాలలోనూ, మన బుద్ధిజీవులు రూపొందే పద్ధతిలోనూ ఉన్నాయనుకుంటాను. మన సమాజంలో కొంత సాధించగానే ఆగిపోయే తత్వం ఎక్కువ. జ్ఞానం అపారమనీ, ఎంత నేర్చుకున్నా ఇంకా నేర్చుకోవలసింది ఉంటుందనీ మనకు తెలుసు గాని, దాన్ని అమలులోకి తేవడానికి మనలో మధ్యతరగతికి సహజమైన బద్ధకం, నిర్లిప్తత, అలక్ష్యం వంటి ఆటంకాలెన్నో ఉన్నాయి. మన సమాజంలోనే, మన సాహిత్య సంప్రదాయంలోనే అసమగ్రతను ఆమోదించే, చూసీ చూడనట్టుపోయే గుణం ఏదో ఉన్నట్టుంది. నిజానికి ఎంత జ్ఞానికైనా, ఎంతటి అనుభవజ్ఞుడికైనా అసమగ్రత ఉంటుంది. ఆ అసమగ్రతను ఎవరైనా అధ్యయనం ద్వారా, పరిశీలనద్వారా తగ్గించుకోగలరు. సమగ్రత వైపు ప్రయాణించగలరు. మరొక సందర్భంలో, తత్వశాస్త్ర చర్చలో భాగంగా లెనిన్ అన్నట్టు, పరమసత్యం అనేదేమీ లేదు, ఏ ఒక్కరూ పరమ సత్యాన్ని చేరుకోలేరు, ప్రతిఒక్కరూ చేసేది ఆ పరమసత్యంవైపు ప్రయాణం మాత్రమే. ఆలోచనాపరులందరూ చేసే అధ్యయనం ద్వారా, జీవిత పరిశీలనద్వారా చేసే ఆ ప్రయాణానికి అదనంగా ఒక కథారచయిత వస్తువైవిధ్యం కొరకు, కొత్త శిల్ప పద్ధతుల కొరకు అన్వేషణ సాగించవలసి ఉంటుంది. కొత్త ప్రయోగాలు చేయవలసిఉంటుంది. ఇదంతా కథారచయితలమీద మోయలేని బరువులు మోపడంకాదు. కథారచయితలు పండితులుగా మారిపోవాలని సూచించడం కాదు. మనకాలపు కథారచయితలముందర కాలం ప్రపంచీకరణ అనే ఒక సవాలును పెట్టింది. ఆ సవాలును అర్థంచేసుకుని, ఇతరులకు అర్థంచేయించే కథలు అల్లి, సామాజిక జీవితాన్ని ఉన్నతీకరించగల ఒక అద్భుతమైన అవకాశం ఇది. చరిత్ర తెలుగు సాహిత్యకారులముందు ఎన్నోసార్లు అటువంటి అవకాశాల్ని పెట్టింది. గతకాలపు సాహిత్యకారులందరూ ఆ అవకాశాల్ని వాడుకుని తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నంచేశారు. తెలుగు జీవితాన్ని ఉన్నతీకరించారు. తమ రచనలకూ తమకూ సుస్థిర స్థానం సంపాదించుకున్నారు. ఇవాళ్టి కథారచయితలు కూడ అటువంటి కృషి చేస్తారనడంలో సందేహంలేదు.

*(వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్ ల సంపాదకత్వంలో "కథాసాహితి" ప్రచురణగా పదహారు సంవత్సరాలుగా క్రమం తప్పకుండా వెలువడుతున్న కథాసంకలనాల సిరీస్‌లో తాజా సంకలనం కథ 2005 ఆవిష్కరణ సభలో కర్నూలులో సెప్టెంబర్ 10, 2006న చేసిన ప్రసంగం ఈ వ్యాసానికి తొలిరూపం)*

***అరుణతార, అక్టోబర్ 2006***



40

# మరొకసారి అమ్మకానికి ఆంధ్రప్రదేశ్ !

సోమవారంనాడు రాష్ట్ర శాసనసభలో ఆర్థికమంత్రి కొణిజేటి రోశయ్య ప్రవేశపెట్టిన 2007–08 బడ్జెట్ 'అమ్మకానికి ఆంధ్రప్రదేశ్' రెండో అంకానికి సంపూర్ణంగా తెరతీసింది. 2004 మేలో అధికారానికి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన పూర్తికాలపు బడ్జెట్లలో ఇది మూడవది. అంతకు ముందరి ఏలిక నారా చంద్రబాబునాయుడును 'ప్రపంచబ్యాంకు జీతగాడు' అని తీవ్రంగా విమర్శించి, ప్రపంచబ్యాంకు నిర్దేశించిన ఆ రాజకీయార్థిక విధానాలను తామేదో మార్చబోతామని భ్రమలు కల్పిస్తూ అధికారానికి వచ్చిన కాంగ్రెస్ మొదటి రెండు సంవత్సరాలు బెరుకుబెరుకుగా, సంకోచిస్తున్నట్టుగా ప్రపంచబ్యాంకు ఆదేశాలను అమలుచేస్తూ, అమలు చేయనట్టు నటిస్తూ, కొన్ని సందర్భాలలో తాను ప్రపంచబ్యాంకును ఎదిరించడానికి కూడ సిద్ధమన్నట్టు ప్రకటిస్తూ వచ్చింది. పైకి ఈ వాగాడంబరం కనబడుతున్నప్పటికీ, దేశంలోకి ప్రపంచీకరణ విధానాలను తీసుకువచ్చిన కాంగ్రెస్ ఈ మాటలు కట్టిపెట్టి, పాత విధానాలను కొనసాగిస్తుందని అందరూ ఊహించిందే. ఆ ఊహను నిజంచేస్తూ, గత బడ్జెట్ నాటినుంచి మారుతూ వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వ స్వరం ఈ బడ్జెట్ తో పూర్తిగా మారిపోయి మళ్లీ 1995–2004 మధ్య కాలపు బడ్జెట్ల శ్రుతికి మారిపోయింది.

అయినా కొట్టవచ్చినట్టు కనిపించే తేడా ఏమంటే, చంద్రబాబు నాయుడు పాలనా కాలంలోని బడ్జెట్ ఉపన్యాసాలలో బహిరంగంగానే ప్రపంచబ్యాంకు భజన ఉండేది. పేజీకి ఒకటిరెండుసార్లయినా ప్రపంచబ్యాంకు ప్రస్తావన, ప్రశంస ఉండేవి. ఈసారి మాత్రం 28 పేజీల బడ్జెట్ ఉపన్యాసంలో ఒక్కసారికూడ ప్రపంచబ్యాంకు ప్రస్తావనలేదు. అవసరమైనప్పుడు కూడ, అంటే ప్రపంచబ్యాంకు నిధులతో ప్రకటిస్తున్న, అమలుచేస్తున్న పథకాలగురించి, నిధులగురించి మాట్లాడుతున్నప్పుడు కూడ ప్రపంచబ్యాంకు ప్రస్తావనలేదు. పైగా "ప్రపంచీకరణ అనేక చిన్నతరహా పరిశ్రమల మూసివేతకు దారితీస్తోంది" అని ప్రపంచీకరణ వ్యతిరేకమైన మాట కూడ ఒకటి ఉంది. పాతరోజుల్లో ప్రపంచబ్యాంకునో, ఫార్చ్యూన్ పత్రికనో, వాల్ స్ట్రీట్ జర్నల్ పత్రికనో ఉటంకించినట్టు ఈసారి బడ్జెట్ ఉపన్యాసం అమర్త్యసేన్ మాటలతో మొదలయి, జెఫ్రీసాక్స్ నూ, స్వామీ వివేకానందనూ ఉటంకించింది. (బడ్జెట్ ఉపన్యాస రచయితలకు స్వామీ వివేకానంద సోదరుడు వినోబా భావే ఉటంకింపు దొరికినట్టులేదు!)

బడ్జెట్‌తో పాటే గత సంవత్సరపు ఆర్థిక సర్వేను కూడ ప్రవేశపెట్టడం ఆనవాయితీ. ఈ సారి దానిపేరు మార్చి సామాజిక ఆర్థిక సర్వే అన్నారు. ఏమి రాయాలో ఏమి రాయగూడదో బడ్జెట్ ఉపన్యాస రచయితలకు అందిన జాగ్రత్తలు సామాజిక ఆర్థిక సర్వే రచయితలకు అందినట్టులేవు. ఇంకా సంతకాలు జరగని, ఆమోదం మాత్రం దొరికిన, రు. 1600 కోట్ల రూపాయల వ్యయమయ్యే ఆంధ్రప్రదేశ్ రోడ్ సెక్టర్ ప్రాజెక్ట్‌కు కేంద్రంనుంచీ, ప్రపంచబ్యాంకు నుంచీ నిధులు రాబోతున్నట్టు సర్వే రాసింది. ఈ ఫిబ్రవరి 8న సంతకం అయినట్టు చెపుతున్న ఆంధ్రప్రదేశ్ నగర సంస్కరణల, మునిసిపల్ సేవల పథకానికి, తొమ్మిదినెలలముందునుంచే, అంటే మార్చ్ 17, 2005 నుంచే అమలులోకి వచ్చేటట్టుగా ప్రపంచబ్యాంకు రు. 86.86 కోట్ల నిధులు సమకూరుస్తున్నదని సర్వే రాసింది. ఆంధ్రప్రదేశ్ పట్టణ పేదల సేవల పథకానికి బ్రిటిష్ ప్రభుత్వశాఖ అయిన డి.ఎఫ్.ఐ.డి. రు. 747.22 కోట్లు సమకూరుస్తున్నదని సర్వే రాసింది. హుస్సేన్ సాగర్ అభివృద్ధికోసం జపాన్ బ్యాంక్ ఫర్ ఇంటర్నేషనల్ కోఆపరేషన్ రు. 310 కోట్లు ఇచ్చిందని, ఆ పనిని రెండు జపనీస్ కంపెనీలు చేస్తున్నాయని కూడ సర్వే రాసింది.

ఇంకా వివరాలక్కరలేదుగాని, ఒక్కమాటలో చెప్పాలంటే, 1995-2004 మధ్యన నడిచినట్టే, ప్రస్తుతంకూడ రాష్ట్రప్రభుత్వం విదేశీ ద్రవ్యసంస్థల, బహుళజాతిసంస్థల కనుసన్నలలో నడుస్తున్నదని, వాళ్ల నిధులు, షరతులు, వాళ్లు చెప్పినవారికే కాంట్రాక్టులు అన్నీ జరుగుతున్నాయని, చెప్పుకోదగిన తేడా ఏమీ లేదని ఈ బడ్జెట్ పత్రాలు, సర్వే స్పష్టంగానే తెలియజేస్తున్నాయి.

దీన్ని మరొకవైపు నుంచి చూడాలంటే, రాష్ట్రప్రభుత్వ రుణభారం ఈ మూడు సంవత్సరాలలో ఏమీ తగ్గలేదని, అసలు తగ్గేదిశలో కూడ లేదని, రాష్ట్రఆర్థికవ్యవస్థ మరింతగా అప్పుల ఊబిలో కూరుకుపోతున్నదని బడ్జెట్ పత్రాలు చూపుతున్నాయి. రాష్ట్ర ప్రభుత్వపు మొత్తం రుణభారం 2004-05 ఆర్థిక సంవత్సరానికి రు. 66,393 కోట్లుగా ఉన్నదల్లా, ఆ తర్వాతి సంవత్సరాలలో క్రమంగా రు. 70,407 కోట్లు, రు. 77,952 కోట్లు, రు. 86,464 కోట్లుగా మారింది. అంటే, తెలుగుదేశం ప్రభుత్వం దిగిపోయినతర్వాత ఈ మూడుసంవత్సరాలలో రాష్ట్ర రుణభారం ఇరవైవేలకోట్లరూపాయలు పెరిగిందన్నమాట.



ఇదే సమయంలో రాష్ట్రప్రభుత్వం రుణాల అసలు, వడ్డీలు కలిపి తిరిగి చెల్లింపులకోసం 2004-05లో రు. 7091 కోట్లు చెల్లించినదల్లా, ఆ తర్వాతి సంవత్సరాలలో క్రమంగా రు. 7207 కోట్లు, రు. 8196 కోట్లు, రు. 8864 కోట్లు చెల్లించవలసి వచ్చింది. ఈ విధంగా మన అసలు-వడ్డీ చెల్లింపులు ఏటేటా కనీసం ఎనిమిదివందలకోట్లరూపాయల చొప్పున పెరుగుతున్నాయన్నమాట.

సరిగ్గా ఇదే సమయంలో, ఆంధ్రప్రదేశ్ ఆర్థిక పునర్నిర్మాణ పథకం మూడో దశకు రుణం ఇస్తూ ప్రపంచబ్యాంకు విధించబోతున్న కొత్త షరతులగురించి బి వి రాఘవులు వెల్లడించారు. ఆ పథకం మొదటిరెండుదశలను చంద్రబాబునాయుడు తీసుకురాగా, మూడోదశను రాజశేఖరరెడ్డి తీసుకువస్తున్నారు.

నిజానికి, ఆంధ్రప్రదేశ్ పాలనలో ప్రపంచబ్యాంకు పాత్ర గురించి అధ్యయనం చేస్తున్నప్పుడు ఒక ఆశ్చర్యకరమైన విషయం బయటపడింది. ప్రపంచబ్యాంకు ఆంధ్రప్రదేశ్ కు రుణాలు ఇవ్వడం 1963లో ప్రారంభమయింది. అప్పటినుంచి 1994 దాకా గడిచిన 31 సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీసుకున్న రుణాలసంఖ్య 16. అవికూడ పెద్దపెద్ద రుణాలు కాదు. ఆ తర్వాత చంద్రబాబు నాయుడు పాలనాకాలంలో తొమ్మిదిసంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీసుకున్న రుణాలసంఖ్య 11. అవి క్రమక్రమంగా పెద్ద రుణాలుగా మారుతూ వచ్చి రాజకీయార్థిక విధానాలను మార్చమని ఆదేశించగలంత పెద్దవైపోయాయి. రాజశేఖర రెడ్డి ప్రభుత్వం ఆ రికార్డును కూడ బద్దలుకొడుతూ మూడు సంవత్సరాలు నిండకుండానే ఆరు రుణాలకోసం లావాదేవీలు ప్రారంభించింది. ఆ ఆరింటిలో మొదటి రుణ ఒప్పందంమీద ఈ ఫిబ్రవరిలో సంతకాలు కాగా మిగిలిన ఐదు రుణాల సంప్రదింపులు జరిగిపోయినట్టుగానే అనిపిస్తోంది. ఆంధ్రప్రదేశ్‌ను అమ్మకానికి పెడుతున్న ఏలికల జెండాలు, రంగులు, నినాదాలు మారుతున్నాయి. అంతే. ఆంధ్రప్రదేశ్ అమ్మకం నిరాటంకంగా జరిగిపోతోంది.

***ఆంధ్రజ్యోతి, ఫిబ్రవరి 20, 2007***

# 41

## ప్రపంచ బ్యాంక్ అతివిశ్వాసపు ప్రకటన

ప్రపంచబ్యాంకు నుంచి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వానికి అందనున్న ఆంధ్ర ప్రదేశ్ ఆర్థిక వ్యవస్థా సంస్కరణల రుణం మూడవ విడత గురించి ఒక్కొక్క వివరమూ క్రమక్రమంగా బయటపడుతున్నాయి. తనకు ముందరి ఏలికను 'ప్రపంచబ్యాంకు జీతగాడి'గా అభివర్ణించి, గంభీరోపన్యాసాలుచేసి అధికారపీఠం అధిరోహించినవారు మరెంత పెద్ద డిటో గా మారుతున్నారో ఆ వివరాలు రుజువుచేస్తున్నాయి.

1996 సెప్టెంబర్ లో రహస్య పత్రంగా తయారయి, 1997 జనవరిలో బహిరంగంగా వెలువడిన "ఆంధ్రప్రదేశ్ – ఎజెండా ఫర్ ఎకనమిక్ రిఫార్మ్స్" అనే పత్రంద్వారా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం పైన ప్రపంచబ్యాంకు ప్రత్యక్ష పాలన ప్రారంభమయిందని ఇప్పుడు అందరికీ తెలుసు. తెలుగుదేశం ప్రభుత్వం 1995లో నియమించిన హితేన్ భయ్యా (విద్యుత్ రంగం), గంగోపాధ్యాయ (ప్రభుత్వోద్యోగులు), కె సుబ్రహ్మణ్యం (ప్రభుత్వ రంగసంస్థలు), కోనేరు రామకృష్ణారావు (విద్యారంగం) కమిటీలు, 1996 లో ప్రకటించిన ఏడు శ్వేతపత్రాలు ఆ ప్రపంచబ్యాంకు సంస్కరణల ఆదేశ పత్రానికి రంగం సమకూర్చి పెట్టగా, 1999లో వెలువడిన "విజన్ 2020" ఆ సంస్కరణల క్రమాన్ని బలోపేతం చేసింది. ఇవికాక చంద్రబాబునాయుడు పాలనాకాలంలో వచ్చిన



అనేక పథకాలు, వాటి రుణ ఒప్పందాలు, ఆ ఆదేశ పత్రాలు – ఆ కథ అంతా అందరికీ తెలిసిందే.

విచిత్రమేమంటే, ఆ తొమ్మిది సంవత్సరాల కాలంలో ఏయే పత్రాలనూ, విధానాలనూ అప్పటి ప్రతిపక్ష నాయకులూ, ఇప్పటి ముఖ్యమంత్రీ ప్రతిరోజూ దుమ్మెత్తిపోశారో, అవే పత్రాలనూ విధానాలనూ ప్రస్తుత ప్రభుత్వం ఔదలదాలుస్తోంది. చంద్రబాబునాయుడు ఆపివేసినచోట అందుకుని ప్రపంచబ్యాంకు, రాష్ట్రప్రభుత్వం కలిసికట్టుగా, మహోత్సాహంగా యుగళగీతం పాడుతున్నారు.

ఎంతచెడినా మరీ ఇంత దగుల్బాజీతనం ఉంటుందా, నిన్న తిట్టిననోటితో ఇవాళ పొగడడానికి అది నాలికా తాటిమట్టా అని ఎవరికైనా అనుమానం వస్తే, ప్రపంచబ్యాంకు వారి తాజా ప్రోగ్రామ్ డాక్యుమెంటు చదవండి. నివేదిక నం. 36927 – ఐ ఎన్ అని పేరు పెట్టుకున్న ఈ నివేదిక ఐ బి ఆర్ డి, ఐ డి ఎ కలిసి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వానికి 225 మిలియన్ డాలర్ల (దాదాపు రు. 1100 కోట్లు) రుణం ఇవ్వడం కోసం తయారుచేసినది. ఈ పత్రం 2006 డిసెంబర్ 11 న తయారయిందిగాని 'పరిమిత ప్రచారం' కొరకు మాత్రమే ఉద్దేశించబడింది. అది రాష్ట్రంలోని ఎనిమిది కోట్ల ప్రజల జీవితాలను ధ్వంసంచేయడానికి, ముఖ్యంగా పేద, మధ్యతరగతి ప్రజల జీవితాలను బుగ్గి చేయడానికి వస్తున్నదిగాని అది చదివిచర్చించే అధికారం మాత్రం మొత్తం ఆంధ్రప్రదేశ్ ప్రజానీకానికి లేదు. కనీసం తమను తాము ప్రజాప్రతినిధులమని పిలుచుకుంటున్న 294 మందికి కూడ లేదు.

ఆంధ్రప్రదేశ్ రాజకీయార్థిక వ్యవస్థను అల్లకల్లోలం చేయనున్న ఈ ఎనభై పేజీల పత్రం గత పది సంవత్సరాలుగా రాష్ట్రంలో అమలవుతున్న ప్రపంచబ్యాంకు నిర్దేశిత సంస్కరణలను స్తోత్రం చేస్తూ మొదలయింది. సరిగ్గా "ఎజెండా ఫర్ ఎకనమిక్ రిఫార్మ్స్" లాగనే, అతివిశాలమైన రాజకీయార్థిక మార్పులనుంచి, ప్రభుత్వం స్వయంగా చేయవలసిన అతిచిన్న పనులవరకూ అనేక సూచనలు, ఆదేశాలు చేసింది. ఇవన్నీ రుణంతో కలిసివస్తున్నాయిగనుక ఇవన్నీ అప్పు తీసుకుంటున్నందుకు షరతులన్నమాట.

ఆరు అధ్యాయాలు, ఆరు అనుబంధాలు ఉన్న ఈ పత్రం జాతీయ, రాష్ట్ర స్థాయిలోని ఆర్థిక, రాజకీయ పరిణామాలను చర్చించి ఆ తర్వాతి చర్చకు పూర్వరంగం సిద్ధం చేసింది. ఆ తర్వాత, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వ సంస్కరణ కార్యక్రమం, ప్రపంచబ్యాంకు సహాయం అనే అధ్యాయంలో చంద్రబాబు నాయుడి పాలననూ, విజన్ 2020నీ ప్రశంసించి, రాజశేఖరరెడ్డి ప్రభుత్వం ఆ సంస్కరణలక్రమాన్ని కొనసాగిస్తున్నదని కితాబు ఇచ్చింది. విద్యుత్ సరఫరా ను ప్రైవేటీకరించాలనే లక్ష్యం నుంచి కొంచెం వెనక్కి తగ్గవలసి వచ్చిందని సన్నాయి నొక్కు నొక్కి, కొత్త రుణంతో ఆ లక్ష్యంవైపు వెళ్లవచ్చునని ఆశను వ్యక్తంచేసింది.

రాష్ట్రప్రభుత్వ విధానాలవల్ల రాష్ట్రం దేశదేశాల పెట్టుబడిదారుల నోరూరిస్తున్నదని, పెట్టుబడిదారుల ప్రయోజనాలు రక్షించడంలో రాష్ట్రప్రభుత్వం అగ్రభాగాన ఉన్నదని పొగిడింది. ఈ వ్యవహారంలో రాష్ట్రప్రభుత్వం ఎంతగా పెట్టుబడిదారులకు సాగిలపడుతున్నదో నివేదిక

ఎంత స్పష్టంగా రాసిందో చూడండి: 'కాంట్రాక్టు కార్మికుల చట్టాన్ని సవరించి కార్మికులను పనిలో పెట్టుకోవడం, తొలగించడం సులభతరం చేసిన రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ అగ్రభాగాన నిలిచింది. ఆ తర్వాత 2003లో పారిశ్రామిక వివాదాల చట్టాన్ని కూడ సవరించి కార్మికుల మార్కెట్లో ఉన్న సంకుచితత్వాన్ని రద్దుచేయదలచింది. కాని ఈ చట్టం రాష్ట్రపతి ఆమోదం పొందనందువల్ల అవే నిబంధనలను 2005లో ఆమోదించిన ప్రత్యేక ఆర్థిక మండలాల చట్టంలో భాగం చేసింది'. అంటే, మన మహా ఘనత వహించిన రాష్ట్రప్రభుత్వం, 'మాకు మాకార్మికులు ఏమయిపోయినా ఫరవాలేదు, మా రాష్ట్రపతి కూడ మాకు లెక్కలేదు, సదా మీసేవలోనే మేమున్నాం' అని పెట్టుబడిదారులకు చెప్పదలిచాయన్నమాట. అలా చెప్పినందుకు ప్రపంచబ్యాంకు 'ఎంత దండి బంటువో' అని వీరతాడు వేస్తున్నదన్నమాట.

విధాన పరమైన సంస్కరణలు, రాష్ట్రాన్ని పెట్టుబడుల గమ్యస్థానంగా మార్చే సంస్కరణలు, ద్రవ్య సంస్కరణలు, ప్రభుత్వరంగ సంస్కరణలు, పాలనాపరమైన సంస్కరణలు, విద్యుత్ రంగ సంస్కరణలు, పాఠశాల విద్యా సంస్కరణలు, ఆరోగ్యసేవారంగ సంస్కరణలు అని విడివిడిగా ఈ నివేదికలో ఒక్కొక్క రంగంలో తేవలసిన మార్పుల గురించి ప్రపంచబ్యాంకు ఏ ఆదేశాలు ఇచ్చిందో, వాటివల్ల ప్రజాజీవనానికి జరగబోయే హాని ఏమిటో వివరంగా చర్చించవలసి ఉంది. ఇక్కడ స్థలాభావం వల్ల ఆ చర్చ సాధ్యంకాదు గాని, ఒకటి రెండు ముఖ్యమైన విషయాలు చూడాలి.

ప్రభుత్వరంగ సంస్థల పునర్నిర్మాణంలో మొదటి రెండు దశల లక్ష్యాలు సాధించామని రాసిన నివేదిక, మూడో దశ సంస్కరణల్లో భాగంగా ఏమి చేయనున్నారో సూచించింది. 'రెండో దశ సంస్కరణల్లో 27 సంస్థలను పక్కన పెట్టడం జరిగింది. వీటిలో రాజకీయంగానూ, సామాజికంగానూ ఇబ్బందికరమైన పెద్ద సంస్థలున్నాయి. వాటిలో సంస్కరణలకు ముందస్తుగా చాల పనులు చేయాలి...రానున్న రెండుమూడు సంవత్సరాలలో మిగిలిన 27 సంస్థల విషయంలో కూడ నిర్ణయాలు తీసుకోవడం జరుగుతుంది' అని రాసింది. ఆ రెండు సంస్థలు సింగరేణి, ఆర్టీసీ అని కొత్తగా చెప్పనక్కరలేదు. ఇక విద్యారంగ సంస్కరణల గురించి మాట్లాడుతూ చేయనున్న పనులలో పాఠశాలల నిర్వహణను విద్యాకమిటీలకు అప్పగించడం, ఉపాధ్యాయుల నిర్వహణ పద్ధతులను సంస్కరించడం, పాఠ్యాంశాలను సంస్కరించడం మొదలయినవి ఉన్నాయని సూచించింది.

ఈ నివేదికకు అనుబంధంగా అచ్చువేసిన రాష్ట్రప్రభుత్వ లేఖలో2000-01 నుంచి ఇప్పటివరకు ప్రపంచబ్యాంకు చెప్పిన పనులు ఎంత పకడ్బందీగా చేశారో, 2006-07 నుంచి 2008-09 వరకు ఇంకా ఎట్లా అమలు చేయనున్నారో పట్టికలు వేసిమరీ విశ్వాసప్రకటన చేశారు.

1956 కు ముందు హైదరాబాదు ఎప్పుడూ ఢిల్లీ పాలనలో లేదు, ఇప్పుడు ఢిల్లీకి మాత్రమేకాదు, వాషింగ్టన్ కూ సామంతుల పాలనలో ఉన్నట్టున్నాం.

***ఆంధ్రజ్యోతి, మార్చ్ 13, 2007***



# 42

# నెత్తురుచిందిన నందిగ్రామ్

పశ్చిమబెంగాల్ లోని తూర్పు మేదినీపూర్ జిల్లా నందిగ్రామ్ లో తమభూమిని మరొకరు ఆక్రమించగూడదన్నందుకు, ఆ ఆకాంక్షను సమరశీలంగా ప్రకటించినందుకు రైతుకూలీల నెత్తురు చిందింది. హల్దీనదికి దక్షిణభాగం నుంచి ఒక కొన్నెత్తుటినది కొత్త ఉపనదిగా చేరింది. ప్రభుత్వం చెపుతున్నట్టు పదకొండు మందా, పద్నాలుగు మందా, ప్రభుత్వంలో భాగస్వామి అయిన ఆర్ఎస్‌పి కి చెందిన మంత్రి క్షితి గోస్వామి స్వయంగా ఆస్పత్రిలో మృతదేహాలను చూశానని చెపుతున్నట్టు యాభై మందా, ప్రతిపక్ష తృణమూల్ కాంగ్రెస్ అధినేత్రి మమతా బెనర్జీ, కొన్ని పత్రికలు, కొందరు స్వతంత్ర పరిశీలకులు చెపుతున్నట్టు దాదాపు వందమందా - పోలీసు కాల్పులలో కచ్చితంగా చనిపోయినవాళ్లు ఎందరో ఎవరి అంచనాలు వాళ్లకున్నాయి. వాస్తవం ఈ అన్ని అంకెలమధ్యన ఎక్కడో ఒకచోట ఉంటుంది. కాని ఎవరూ నిరాకరించలేని నిజం మాత్రం అంతమంది ప్రజలూ తనను తాను మార్క్సిస్టు ప్రభుత్వమని పిలుచుకునే ప్రభుత్వ పోలీసుల కాల్పులలోనే అసువులు బాశారన్నదే. అన్నిచోట్లా ప్రజలమీద అమానుషమైన అత్యాచారాలు చేసిన పోలీసులు అన్నట్టుగానే, నందిగ్రామ్ లోని 'మార్క్సిస్టు' పోలీసులు కూడ ఆత్మరక్షణ కోసమే కాల్పులు జరిపామని సమర్థించుకుంటున్నారు.

పశ్చిమబెంగాల్ ను గత మూడు దశాబ్దాలుగా పాలిస్తున్న వామపక్ష కూటమికి నాయకత్వం వహిస్తున్న భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) ఈ కాల్పులను ఏ పద్ధతిలో సమర్థించుకోజూచినా, ఏ కారణాలు చూపినా సమర్థించడం సాధ్యంకాని నరమేధం ఇది. సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి, పౌరహక్కుల ఉద్యమంలో కురువృద్ధుడు వి ఆర్ కృష్ణయ్యర్ తన తొంభైమూడేళ్ల వయసులో నందిగ్రామ్ దుర్మార్గంపై చలించి సిపిఎం ప్రధానకార్యదర్శి ప్రకాశ్ కరత్ కు రాసిన లేఖలో ప్రకటించిన ఆగ్రహం, ఆక్రోశం, ఆవేదన ఆ పార్టీ వర్గాలలో ఇసుమంతయినా పశ్చాత్తాపాన్ని కలిగించినట్టులేదు. ఆ పార్టీ పత్రికలు, మేధావులు అసలు పోలీసుకాల్పులు ఖండించదగిన దారుణసంఘటన కానేకాదన్నట్టు, హతులే ఆ కాల్పులకు బాధ్యులన్నట్టు, ప్రజల మొండితనం వల్లనే కాల్పులు అనివార్యమైనట్టు వాదిస్తున్నారు. అచ్చంగా అన్నిచోట్లా గద్దెల మీద ఉన్నవాళ్లు ఆందోళనకారుల గురించి మాట్లాడే మాటలే వల్లిస్తున్నారు. అగ్రనాయకుడు సీతారాం యేచూరి మరొక అడుగు ముందుకువేసి కాల్పులకు తృణమూల్ కాంగ్రెస్, మావోయిస్టు కార్యకర్తలే బాధ్యులని కూడ అన్నారు. బహుశా ఆ పద్నాలుగుమందో, యాభైమందో హతులు పోలీసులముందుకు దూసుకెళ్లి 'కాల్చండి, కాల్చండి, మేం మీచేతుల్లో చచ్చిపోవడానికి తహతహలాడుతున్నాం' అని అంటున్నదృశ్యం ఆయన సులోచనాలకు స్పష్టంగా కనబడుతున్నట్టుంది. దేశంలోకెల్లా నిజమైన ఏకైక వామపక్షమని తనకుతాను కితాబులిచ్చుకుంటున్న పార్టీ నాయకులు ఏమన్నారో సరిగ్గా అవే మాటలను ఆ రాష్ట్రపు పోలీసు ఉన్నతాధికారులు కూడ అంటున్నారంటే అది ఆ పోలీసుఅధికారులు వామపక్షభావజాలం నేర్చుకున్నందుకు గుర్తా? లేక వామపక్షనేతలు నరహంతక పోలీసు అధికారులలాగ మాట్లాడడం నేర్చుకుంటున్నారనుకోవాలా?

సిపిఎం నాయకులు కాల్పుల తర్వాత మరొక కొత్త పాట ఎత్తుకున్నారు. నందిగ్రామ్‌లో భూసేకరణ జరపబోమని ప్రభుత్వం నెలకిందనే ప్రకటించిందని, కనుక అసలు అక్కడ సమస్యే లేదని, సమస్యలేనిచోట తృణమూల్ కాంగ్రెస్ సమస్య సృష్టించడానికి ప్రయత్నించిందని, అందువల్లనే హింస జరిగిందని అంటున్నారు. అసలు సిపిఎం పత్రికల్లో పోలీసు కాల్పులు అనే వార్తే రాలేదు. అన్ని పత్రికలూ ఆ రోజు ఆ వాస్తవఘటనను పతాకశీర్షికగా ఉంచగా, సిపిఎం పత్రికలు మాత్రం 'నందిగ్రామ్‌లో హింస' అని మాత్రం అన్నాయి !

మరి అసలు సమస్యే లేనిచోటికి ఐదువేలమందిపోలీసులను తరలించాలని ప్రభుత్వం ఎందుకు అనుకున్నట్టు? అంతమంది పోలీసులు అక్కడ ఏ సమస్యను పరిష్కరించడానికి వెళ్లారు? లేదా ఏసమస్యను సృష్టించడానికి వెళ్లారు? నిజానికి కాల్పులకు రెండురోజులముందే ఆ ప్రాంతంలోకి పెద్దఎత్తున సాయుధబలగాలను పంపించబోతున్నామని రాష్ట్ర హోంకార్యదర్శి ప్రకటించాడు. అంటే కాల్పులు పోలీసులు, సిపిఎం నాయకులు చెపుతున్నట్టు ఆత్మరక్షణకోసం, అనివార్యంగా జరిగినవి కావన్నమాట. ఉద్దేశ్యపూర్వకంగా, ప్రజలను భయభ్రాంతులను చేయడానికి, పరిస్థితులు చక్కబడగానే భూసేకరణ జరగడానికి వీలుగా పరిస్థితులు చక్కబరచ డానికి, అంటే శ్మశానశాంతి నెలకొల్పడానికి ఐదువేలమంది పోలీసులను పంపించారన్నమాట.



అసలు విషయం అది. ఆ పోలీసులు వెళ్లినది ప్రజలకు ఒక హెచ్చరిక చేయడానికి. అది కేవలం నందిగ్రామ్ ప్రజలకు మాత్రమే హెచ్చరిక కాదు, దేశంలో ఏర్పడబోతున్న అన్ని ప్రత్యేక ఆర్థిక మండలాలను వ్యతిరేకిస్తున్న ప్రజాశక్తులన్నిటికీ హెచ్చరిక. 'ఎక్కడయినా ప్రత్యేక ఆర్థిక మండలాలను వ్యతిరేకించేవారిని కాల్చిచంపి అయినాసరే ముందుకేపోతాము. భూసేకరణ జరిపి బహుళజాతిసంస్థలకు అప్పగిస్తాము' అని ఈ దేశంలోని పాలకవర్గాలన్నీ, బహుళ జాతిసంస్థల తరఫున, దేశదేశాల పెట్టుబడిదారులందరి తరఫున ఈ దేశప్రజలందరికీ ఒక సందేశం పంపదలచుకున్నాయి. ఆ పాలకవర్గాలు ఒక్కొక్క రాష్ట్రంలో ఒక్కొక్క పేరున ఉండవచ్చు. పశ్చిమ బెంగాల్ లో యాదృచ్ఛికంగా ఆ పాలకవర్గాల పేరు భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) కావచ్చు. మళ్లీ ఆ పాలకవర్గాల ముఠా తగాదాలలో భాగంగా అవే ఒక రాష్ట్రంలో ప్రత్యేక ఆర్థికమండలాలను వ్యతిరేకిస్తున్నట్టు, వ్యతిరేకంగా పోరాడుతున్నట్టు కూడా నటిస్తుండవచ్చు. మరొక రాష్ట్రంలో తామే అగ్రభాగాన నిలిచి ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేస్తూ, బహుళజాతిసంస్థలకు, పెట్టుబడిదారులకు తాము ఎంత విశ్వాసపాత్రులమో చూపుకోవడానికి పోటీ పడుతుండవచ్చు. మన పార్లమెంటరీ రాజకీయ పార్టీలన్నీ ఈ క్రీడలో అనితరసాధ్యమైన నైపుణ్యం సంపాదించాయి. అందువల్లనే ఎన్‌డిఎ ప్రభుత్వ హయాంలో మొదలయిన ప్రత్యేక ఆర్థిక మండలాల విధానం యుపిఎ హయాంలో మరింతగా దాసోహం అని, లోక సభలోనూ రాజ్య సభలోనూ చిరుచిరు మార్పులతో కేవలం చెరి ఒక రోజు చర్చతో ఆమోదం పొందింది. అక్కడ సిపిఎం నాయకులు కోరిన సవరణలు మొత్తం అధికారం కేంద్రానికి మాత్రమే ఉండగూడదని, రాష్ట్రాలకు కూడ అధికారాలు పంచాలని మాత్రమే.

ఆ సవరణ నాటినుంచీ నందిగ్రామ్ కాల్పులదాకా పరిణామాలన్నీ చూస్తే, సిపిఎం పడుతున్న తపన అర్థమవుతుంది. ఆ తపన ఫలితమే నందిగ్రామ్ కాల్పులు. ఆ తపన ఏమంటే, ఆ పార్టీ దేశదేశాల సంపన్నవర్గాలకు తానూ ఒక పాలకవర్గ పార్టీనేనని, తనపేరుచూసి భయపడవద్దని, తనను ప్రతినిధిగా ఎంచుకొమ్మని సూచిస్తున్నది. 'కాంగ్రెస్ నుంచి భాజపా దాకా ఎన్నో పార్టీలతో ప్రయోగాలు చేశారు, ఒకసారి నాకూ అవకాశం ఇవ్వండి, మీకు నమ్మకమైన ప్రతినిధిగా ఉంటాను' అని ఆ పార్టీ చెప్పదలచుకున్నది. అందుకే ఇటు తాతాలకు సింగూరునూ, అటు సలీం గ్రూపుకు నందిగ్రామ్ నూ బలి ఇవ్వదలచింది. ఇంకొకవైపు తాను ప్రజల పార్టీనేనని ప్రజలకు నమ్మకం కలిగించడానికీ ప్రయత్నాలు చేస్తూ ఉంటుంది, ప్రజానుకూలంగా, విప్లవకరంగా మాట్లాడుతుంటుంది. కాని నిజమైన పరీక్ష వచ్చినప్పుడు, అంటే, తాతాలకూ ప్రజలకూ, సలీం గ్రూపుకూ ప్రజలకూ ఘర్షణ వచ్చినప్పుడు మాత్రం ఎటువైపు ఉండదలచుకున్నదో సింగూరు ఘటనలూ చూపాయి, ఇప్పుడు నందిగ్రామ్ కాల్పులూ చూపుతున్నాయి.

***ఆంధ్రజ్యోతి, మార్చ్ 20, 2007***

# 43

# జీవితమే అర్ధసత్యం

అర్ధసత్యం అనే మాటకు సగం సత్యం అనే వాచ్యార్థం కాక, అసత్యం అనే రూఢ్యర్థం కూడ ఉంది. సంపూర్ణ సత్యంలోని ఒకముక్కను చూపడమంటే ఒకరకమైన అసత్యమే గనుక ఆ అర్థం వచ్చిఉంటుంది. సత్యం ఒకటే అయినా చూసేవారి చూపును బట్టి దానిలో ఏదో ఒక పార్శ్వాన్నే పైకెత్తి చూపినప్పుడు, ఆ ఒక్క పార్శ్వమే సంపూర్ణం కాదుగనుక, అసలది ఆ మొత్తం సత్యంలో ఒకానొక పిపీలికం మాత్రమే కావచ్చుగనుక అర్ధసత్యం అసత్యం కావడానికే అవకాశం ఎక్కువ. అందులోనూ ఆ అర్ధసత్యాన్ని చూపెట్టేవారికి ఉండే ప్రయోజనాల దృష్ట్యా అర్ధసత్యం అసత్యం కావడం సహజం. సగంనీళ్లతో ఉన్నపాత్ర అన్నా, సగం ఖాళీగా ఉన్న పాత్ర అన్నా చెప్పే విషయం ఒకటే అయినా, రెండూ ఎంత సత్యాలో అంత అసత్యాలే, రెండూ అర్ధసత్యాలే, చూసేవారి దృక్పథానికి సూచికలే.

కాని స్వల్పభేదంతో అర్థసత్యం అనే మాట ఉంది. చాలమంది అర్ధ, అర్థ మధ్య ఉచ్చారణా భేదాన్ని గాని, అక్షర భేదాన్ని గాని గుర్తించరుగాని ఆ అర్థ అనే మాటకు డబ్బుసంబంధమైన అనే అర్థం ఉంది. మానవజీవిత మనుగడకు అవసరమైన ఉత్పత్తి కార్యకలాపాలకు సంబంధించిన అనే అర్థం



కూడ ఉంది. ఆ అర్థంలో చూసినప్పుడు అర్థసత్యం అనే మాటకు సగం సత్యం అని కాక, ఆర్థిక పరమైన సత్యం అనే అర్థం వస్తుంది. ఆర్థిక పరమైన అంటే డబ్బు లావాదేవీలు అనే మామూలు అర్థం మాత్రమే కాదు, మన నిత్యజీవితక్రమానికి సంబంధించిన అన్ని ప్రక్రియలూ ఆర్థికపరమైనవే. ఆ అర్థంలో చూసినప్పుడు అర్థసత్యాలు నిజంగా మన జీవితాన్ని శాసించేవి, మన నిత్యజీవితానుభవంలో మనకు తెలియకుండానే మనం వ్యవహరించేవి.

మనకు తెలియకుండానే మనం అనుక్షణం శ్వాసప్రక్రియలో పాల్గొంటున్నట్టు, మనకు తెలియకుండానే మనం ఆర్థిక కార్యకలాపాలలో కూడ అనుక్షణం పాల్గొంటూ ఉంటాం. 'ఏం చేస్తున్నారు' అనే సాధారణ కుశల ప్రశ్నకు 'ఏమీ చేయడంలేదు' అని జవాబు చెప్పే వారు కూడ వారికి తెలిసో తెలియకో ఏదో ఒక ఆర్థికకార్యకలాపంలో పాల్గొంటూనే ఉంటారు. జననం నుంచి మరణం దాకా జీవిత పర్యంతం అన్ని కార్యకలాపాలూ ఆర్థిక కార్యకలాపాలే. మానవీయమైన సహజాతాలూ, సంబంధాలూ, అనుభూతులూ కూడ ఏదో ఒక స్థాయిలో ఆర్థిక కార్యకలాపాల స్పర్శతోనే ఉంటాయి. ప్రతిమనిషీ తన జీవితక్రమంలో అడుగడుగునా ఏవో వస్తువులను, సరుకులను, సేవలను వినియోగించుకోవాలి, వాటితో వ్యవహరించాలి. ఆ సరుకుల, సేవల ఉత్పత్తి, పంపిణీ, వినిమయం, వినియోగం అనే నాలుగు మౌలిక ఆర్థికకార్యకలాపాలలో పాల్గొనకుండా ఏ ఒక్క జీవితమూ ఒక్క క్షణం కూడ నడవదు. కొందరికి ఏకకాలంలో ఆ అన్ని ప్రక్రియలతోనూ సంబంధం ఉండవచ్చు, మరికొందరు ఏదో ఒక ప్రక్రియలోనే పాలుపంచుకుంటూ ఉండవచ్చు. కాని అసలు ఆర్థిక కార్యకలాపంలో పాల్గొనని వ్యక్తి ఒక్కరుకూడ ఉండే అవకాశం లేదు. అందువల్ల జీవితసత్యం ఏమన్నా ఉన్నదంటే అది అర్థసత్యం మాత్రమే. అంటే అదే పరమార్థసత్యం అన్నమాట.

మన దైనందిన కార్యకలాపాలలో మనందరమూ వందలాది సరుకులనూ సేవలనూ వినియోగిస్తుంటాం, మనలో కొందరు వాటిని ఉత్పత్తి చేస్తుంటారు, కొందరు వాటిని పంపిణీ చేస్తుంటారు, కొందరు వాటిని వినిమయం చేస్తుంటారు. ఈ పనులన్నీ మనం మనకోసం మాత్రమే చేసుకుంటున్నామని మనలో చాలమంది అనుకుంటారు. కాని మనందరం విడివిడిగా చేస్తున్నట్టు భావిస్తున్న ఈ పనులవల్లనే సమాజం మొత్తంగా నడుస్తూ ఉంది. ఉత్పత్తి, పంపిణీ, వినిమయం, వినియోగం – ఇదంతా ఒక మహాద్భుత యంత్రంలాగ, ఒకదానితో ఒకటి పరస్పర, అన్యోన్య సంబంధంలో నిరంతరం గిరగిరా తిరుగుతూ ఉంటుంది.

ఎవరు ఉత్పత్తిలో పాల్గొనాలి, ఏమి ఉత్పత్తి చేయాలి, ఉన్న వనరులను ఏయే సరుకుల ఉత్పత్తి కోసం వెచ్చించాలి, పంపిణీ ప్రక్రియను శాసించే నియమాలేమిటి, వినిమయం చేసే పద్ధతులేమిటి, వినియోగానికి అవకాశాలూ పరిమితులూ ఏమిటి అనే అంశాలను నియంత్రించడానికి వేల ఏళ్లుగా ప్రయోగాలమీద ప్రయోగాలు చేస్తూ మానవసమాజం కొన్ని వ్యవస్థలను నిర్మించుకుంది. ఆ వ్యవస్థలలో ఒకానొకటి మార్కెట్. ఆ వ్యవస్థలను క్రమబద్ధంగా, సమాజహితం లక్ష్యంగా నడిపే బాధ్యతను సమాజమే ప్రభుత్వాలకు అప్పగించింది.

అంటే స్థూలంగా మార్కెట్, ప్రభుత్వం అనే సంస్థలు మానవ ఆర్థిక జీవితాన్ని మెరుగు పరచడానికి, సులభతరం, సుఖతరం చేయడానికి పుట్టుకువచ్చాయి. కాని కాలక్రమంలో ఆర్థిక కార్యకలాపాలు సంక్లిష్టమైపోయి, ఆర్థిక కార్యకలాపాలలో కొందరి స్వార్థప్రయోజనాలు పెరిగిపోయిన తర్వాత, ఆర్థికవ్యవహారాలను కొందరినుంచి దాచిపెట్టవలసి వచ్చింది. అందరికీ అవసరమైన విషయాలను కొందరికి మాత్రమే అర్థమయ్యే భాషలో మాట్లాడవలసి వచ్చింది. అలా ఆర్థికసత్యాలు నిజంగానే అర్ధసత్యాల స్వభావాన్ని సంతరించుకున్నాయి. ఇప్పుడిక ఆర్థిక శాస్త్ర విషయాలు ఎవరో కొందరు నిపుణులకు, ప్రభుత్వాధికారులకు, పారిశ్రామిక వేత్తలకు, వ్యాపారవేత్తలకు మాత్రమే సంబంధించిన విషయాలుగా, మామూలు ప్రజలకు అర్థంకాని, పట్టని విషయాలుగా మారిపోయాయి.

ఇలా నిపుణుల చేతిలో బందీ అయిపోయిన అర్థశాస్త్రాన్ని ఆ చెరసాల నుంచి విడుదల చేయవలసి ఉంది. ఆర్థిక వ్యవహారాలంటే ప్రజలందరికీ సంబంధించినవిగనుక వాటిని ప్రజలందరికీ విప్పిచెప్పవలసి ఉంది. అర్థశాస్త్రం పేరుమీద సాగుతున్న అంకెలగారడీని బద్దలుకొట్టి ప్రజల నిత్యజీవిత వ్యవహారాలకు ఆ అంకెలు ఎంత ముఖ్యమైనవో వివరించవలసి ఉంది. పరమార్థసత్యపు రహస్యాన్ని బహిరంగం చేయవలసిఉంది.

ఆర్థిక కార్యకలాపాలు అనగానే చాలమంది అంకెలు, లెక్కలు, గణాంకాలు, మనకు తెలియని పారిభాషిక పదజాలం అనుకుంటుంటారు. ఏ శాస్త్రానికయినా ఉన్నట్టుగానే ఈ శాస్త్రంలోనూ అర్థం కాని, అస్పష్టమైన పారిభాషిక పదాలు ఉన్నమాట నిజమే గాని, చాలమంది ఆర్థికశాస్త్ర నిపుణులు అంకెలతో భయపెట్టేమాట నిజమేగాని, అర్థశాస్త్రపు అసలుసారం అది కాదు. అర్థశాస్త్రపు అట్టడుగున ఉన్నది మనిషి మనుగడ. ఆ మనిషి మనుగడ మనందరికీ అవసరమైనది, మనందరమూ పట్టించుకోవలసినది. మనంకూడ పాల్గొనవలసినది.

జాతీయోత్పత్తి, తలసరి ఆదాయం, పెరుగుదల రేటు, బడ్జెట్లు, సబ్సిడీలు, రుణాలు, ప్రోత్సాహకాలు, వడ్డీరేట్లు, పెట్టుబడులు, ఉత్పత్తివ్యయాలు, లాభనష్టాలు, విదేశీ పెట్టుబడులు, విదేశీ మారకద్రవ్యం, మారకపురేట్లు, మదుపుదారులు, స్టాక్ మార్కెట్లు, షేర్లు, విదేశీ సంస్థాగత మదుపుదార్లు, కేటాయింపులు, ద్రవ్యోల్బణం, అంతర్జాతీయ ద్రవ్యసంస్థలు, ఎగుమతి దిగుమతి విధానాలు, పారిశ్రామిక విధానాలు, ఒక స్వతంత్రదేశపు రాజకీయార్థిక విధానాలపై అంతర్జాతీయ ద్రవ్య సంస్థల ప్రభావం మొదలయిన మాటలన్నీ మనకు సుదూరమయినవిగా కనిపించినప్పటికీ అవన్నీ మనం ఏమి తింటున్నాం, ఏమి తాగుతున్నాం, ఏమి ఆలోచిస్తున్నాం, ఏమి చదువుతున్నాం, మన ప్రభుత్వం మనకోసం ఏమిచేస్తోంది, ఏమి చేయడంలేదు, మనం వంటి మన ప్రశ్నలకు జవాబులు ఆ మాటల్లో, ఆ మాటల వెనుక దాగిన రహస్యాలలో ఇమిడి ఉన్నాయి. అందువల్ల వాటి గుట్టువిప్పి తెలుసుకోవడం మన అవసరం, మన బాధ్యత. ఎప్పటికప్పుడు ఆర్థికరంగ పరిణామాల నేపథ్యంలో ఆ అవసరాన్ని, ఆ బాధ్యతను గుర్తింపజేయడమే ఈ 'పరమార్థసత్యం' వారంవారం శీర్షిక లక్ష్యం.

***సూర్య, అక్టోబర్ 11, 2007***



# 44

## సెన్సెక్స్ ఉత్థానం పతనం వైపేనా?

నిరాశనూ నిరుత్సాహాన్నీ పెంచడానికి కాదు గాని, ఏ బలమైన కారణమూ లేకుండా సెన్సెక్స్ రోజు రోజూ పైకి పైపైకి పరుగులు పెడుతుంటే భయం కలుగుతున్నది. సెన్సెక్స్ పైకి పోతున్న ఆ గ్రాఫు మనకు కనబడుతున్న పటాన్ని కూడ దాటి ఫ్రేము పగలగొట్టుకుని ఆకాశంలోకి దూసుకుపోతుంటే ఏదో తెలియని భయం వ్యాపిస్తోంది. ఇంకా మన సమాజంలో స్టాక్ మార్కెట్ అంటే ఏమిటో ఎక్కువమందికి తెలియదు గనుక, అయినా యావన్మందీ చదివే పత్రికల పతాకశీర్షికలలోను, చూసే బుల్లితెర మీదా ఈ సెన్సెక్స్ వార్తలు, స్టాక్ మార్కెట్ వార్తలు ఇబ్బడిముబ్బడిగా వస్తున్నాయి గనుక సాధారణ పాఠకులూ ప్రేక్షకులూ ఈ సెన్సెక్స్ పరుగును ఎట్లా అర్థం చేసుకుంటున్నారో, వాళ్లమీద ఆ వార్తల ప్రభావం ఎట్లా ఉంటుందో ఊహిస్తేనే భయం వేస్తున్నది.

ఆ కాళ్లు విరిగిపోయే పరుగును చూపించి మన ఆర్థిక వ్యవస్థ ఎంత వేగంగా ఎంత బ్రహ్మాండంగా పురోగమిస్తున్నదో చూడండి అని నమ్మబలుకుతున్న రాజకీయ నాయకులను, ఆర్థిక వేత్తలను, స్టాక్ మార్కెట్ విశ్లేషకులను చూస్తుంటే, వాళ్లు కలిగించే ఆకర్షణలవల్ల మరెంతమంది కొత్త మదుపుదార్లు ఈ పద్మవ్యూహంలో ప్రవేశించి ఒరిగిపోతారోనని ఆ భయం మరింత పెరుగుతున్నది.

స్టాక్ మార్కెట్ చరిత్రలో ఇటువంటి 'పురోగమనం' చాలసార్లు జరిగిందనీ, ఆ 'పురోగమనం' వెనుక ప్రతిసందర్భంలోనూ ఏవో కొన్ని స్వార్థపరశక్తులో, ప్రయోజనాలో, కుట్రలో, కుంభకోణాలో ఉన్నాయని, ప్రతిసారీ ఆ 'పురోగమనం' తర్వాత దారుణమైన పతనాలు, తిరోగమనాలు సంభవించాయని చారిత్రక పరిజ్ఞానం వల్ల ఆ భయం మరింత పెరుగుతున్నది. సరిగ్గా ఇట్లాంటి పరుగే గతంలో కుప్పకూలిపోవడానికి ముందు కూడ జరిగింది గనుక చిన్న మదుపుదార్ల నిధులు ఏ గంగలో కలిసిపోతాయోనని విచారం వేస్తున్నది.

అసలింతకీ స్టాక్ మార్కెట్ అంటే ఏమిటి? ఇప్పుడు సాధారణంగా వినబడుతున్నట్టు అది ఆర్థిక వ్యవస్థకు పర్యాయపదమా, దానిలో పురోగమనానికీ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికీ ఏమన్నా సాపత్యం ఉంటుందా?

ఆర్థిక వ్యవస్థను సాధారణంగా ప్రాథమిక రంగం (వ్యవసాయం, అడవులు, మత్స్యసంపద, గనులు వంటి భూమి ఆధారిత ఆర్థిక కార్యకలాపాలు), ద్వితీయ రంగం (పరిశ్రమలు, పారిశ్రామిక సరుకుల ఉత్పత్తి, విద్యుత్తు, నీరు, నిర్మాణం తదితర కార్యకలాపాలు), తృతీయ రంగం (వ్యాపారం, హోటళ్లు, రవాణా, సమాచార సంబంధాలు, ద్రవ్య వ్యవహారాలు, రియల్ ఎస్టేట్, వ్యక్తిగత సేవలు, ప్రజాపాలన వంటివి కలిసిన సేవారంగం) గా విభజిస్తారు. వీటిలో తృతీయ రంగంలో చేరిన అనేక అంశాలలోని ద్రవ్యవ్యవహారాలలో ఒక భాగం స్టాక్ మార్కెట్. అందువల్ల దాన్ని మొత్తం ఆర్థిక వ్యవస్థతో సమానంగా చూసి మాట్లాడడం అతిశయోక్తి మాత్రమే కాదు, అర్థరహితం కూడ. నిజానికి అది చిన్న భాగం కావడం మాత్రమే కాదు, మొత్తం ఆర్థిక వ్యవస్థ చలనానికి ఒక సూచికగా కూడ పనికివచ్చే ప్రమాణం కాదు.

సరే, దాని స్థానం ఏదయినా, అది చేసే పని ఏమిటి? మామూలుగా మనం మార్కెట్‌లోకి వెళ్లి సరుకులు కొనుక్కున్నట్టు, ఈ స్టాక్ మార్కెట్ అనే దానిలో స్టాకులు కొనుక్కోవచ్చు, అమ్మవచ్చు. స్టాకులు లేదా షేర్లు అంటే వ్యాపార, పారిశ్రామిక సంస్థల యాజమాన్యంలో భాగస్వామ్య వాటాలు అన్నమాట. అంటే స్టాక్ మార్కెట్లో లావాదేవీలు జరిపేవాళ్లు ఆ స్టాక్ మార్కెట్లో నమోదు అయి ఉన్న వ్యాపార పారిశ్రామిక సంస్థల యాజమాన్యంలో ఏ చిన్నవాటానో కొనుక్కునే అవకాశం ఉంటుంది. ఇక్కడ తప్పనిసరిగా ఆయా స్టాక్ మార్కెట్లలో ఆ సంస్థలు నమోదు కావలసి ఉంటుందనే పరిమితి ఉంది. అలాగే ఆ సంస్థ తన మొత్తం మూలధనంలో ఎంతభాగాన్ని వాటాల కింద అమ్మజూపుతున్నదనేది కూడ ఆ సంస్థ మొదట ప్రారంభించిన పెట్టుబడిదారుల చేతిలోనే ఉంటుంది. అంటే వాళ్లు తమ నిర్ణయాధికారానికి భంగం కలగకుండా జాగ్రత్త పడి, మిగిలిన భాగాన్నే అమ్మకానికి పెడతారు. అందువల్ల ఈ వాటాల కొనుగోలు, అమ్మకాలు లావాదేవీల వల్ల సంస్థ మౌలిక స్వభావంలో ఎటువంటి మార్పు రాదు.

అసలు ఈ అమ్మకాలు, కొనుగోళ్లు లావాదేవీలు ఎందుకు జరుగుతాయి? సాధారణంగా పెట్టుబడిదారీ ఆర్థిక కార్యకలాపాలన్నీ లాభాపేక్షతోనే జరుగుతాయి గనుక, ఇవాళ ఒక ధరకు వాటా కొనేవాళ్లు రేపు ఆ వాటా ఎక్కువ ధర పలుకుతుందని, తమ డబ్బు పిల్లల్ని పెడుతుందని నమ్మకంతోనే కొంటారు. ఎక్కువ ధర పలికిన రోజున అమ్ముతారు. అంటే ఈ లావాదేవీలన్నీ



ఊహాపోహలమీద ఆధారపడి మాత్రమే జరుగుతాయన్నమాట. అంటే ఈ లావాదేవీలన్నీ సారాంశంలో మనకు బాగా తెలిసిన జూదానికి, సట్టావ్యాపారానికి, లాటరీకి దగ్గరిగా ఉంటాయన్నమాట.

కాదంటే న్యాయంగా చూస్తే సమాజానికి అవసరమైన సరుకులు ఉత్పత్తి చేసే సంస్థల వాటాలు చాల ఆకర్షణీయంగా ఉండాలి, ఉత్పత్తిమీద, ఉత్పాదకాల ధరలమీద, మార్కెట్ మీద ప్రభావం చూపే రాజకీయార్థిక నిర్ణయాలు షేర్ల ధరల హెచ్చుతగ్గులకు దారి తీయాలి. మదుపుదార్లకు తెలిసిన వస్తువులను ఉత్పత్తిచేసే, వ్యాపారం చేసే సంస్థల వాటాలలో హెచ్చు లావాదేవీలు జరగాలి. కాని అదేమీలేకుండా స్టాక్ మార్కెట్ ఉత్థానపతనాలు నిర్హేతుకంగా జరుగుతున్నాయి. సరిగ్గా జూదంలాగే. ఒక వాటాను కొనేటప్పుడు ఆ సంస్థ అవసరమయిన సరుకులు ఉత్పత్తి చేస్తున్నదా, ఆ ఉత్పత్తి పెరుగుతున్నదా అనే ప్రశ్నలతో సంబంధంలేకుండా, ఆ సంస్థ లాభాలు సంపాదించగలదా లేదా అనే ప్రమాణం మీదనే కొనడం జరుగుతున్నదన్న మాట.

అసలు స్టాక్ మార్కెట్ నిర్మాణంలోనే ఉన్న ఈ అసంగతానికి తోడు ఇవాళ పెద్ద ఎత్తున ప్రచారంలో ఉన్న సెన్సెక్స్ అనేది మొత్తం స్టాక్ మార్కెట్‌కు ప్రాతినిధ్యం వహించే ప్రమాణం కూడ కాదు. దేశ ఆర్థిక రాజధాని ముంబాయిలో పనిచేసే దేశంలోకెల్లా పురాతనమైన బాంబే స్టాక్ ఎక్స్‌చేంజిలో నమోదు అయిన వేలాది వ్యాపార సంస్థల షేర్లలో నుంచి మంచి లావాదేవీలు జరిగే ముప్పై షేర్లను ఎంపికచేసి తయారు చేసింది సెన్సెక్స్. ఈ ముప్పైలో ప్రభుత్వరంగ సంస్థలూ ఉన్నాయి, ప్రైవేటురంగ సంస్థలూ ఉన్నాయి. సిమెంటు కంపెనీలనుంచి ఐటి సంస్థలవరకు, నిర్మాణ కంపెనీలనుంచి బ్యాంకులవరకు ఉన్నాయి. ఈ ముప్పై సంస్థల షేర్ల సూచి ఇప్పుడు ఇరవైవేల దగ్గర అటూ ఇటూ ఆడుతున్నది.

ఈ సెన్సెక్స్ పురోగమనాన్ని చూపడంద్వారా, అన్ని షేర్ల ధరలు పైకి పోతాయేమోననే ఆశను కల్పించడం ద్వారా చిన్నమదుపుదార్లను స్టాక్ మార్కెట్ కొనుగోళ్లవైపు ఆకర్షించడమే అసలు లక్ష్యం. తద్వారా ఎక్కువమంది స్టాక్ మార్కెట్లో మదుపు పెట్టి ఎక్కువ షేర్లు కొనుక్కుంటారు. ఆయా షేర్ల అమ్మకందార్లకు, సంస్థలకు, ద్రవ్య ఆర్థిక వ్యవస్థకు, స్టాక్ బ్రోకర్లకు అదనంగా కోట్లాది రూపాయల ధనం అందుతుంది. ఇలా ఎక్కువమంది ఎగబడినందువల్ల ధరలు పెరిగిన షేర్లను సంస్థాగత మదుపుదార్లు పెద్ద ఎత్తున అమ్మడం మొదలుపెట్టగానే వాటి ధరలు పడిపోతాయి. హెచ్చు ధరకు కొనుక్కున్న చిన్న మదుపుదార్లు రోజురోజూ పడిపోతున్న ధరలు చూసి ఏదో ఒక రోజున ఎక్కువ లాభం లేకుండానో, నష్టానికో అమ్మవలసిన పరిస్థితి వస్తుంది. అలా నష్టపోయేది చిన్న మదుపుదార్లు, లాభపడేది విదేశీ, స్వదేశీ సంస్థాగత మదుపుదార్లు, స్టాక్ మార్కెట్ బ్రోకర్లు. ఈ వ్యవహారం జూదగృహాలకు వెళ్లివచ్చేవారందరికీ అనుభవైకవేద్యమే.

***సూర్య, నవంబర్ 2, 2007***

# 45

## ఎవరి జేబులోంచి ఈ సబ్సిడీలు?

గత గురువారం న్యూఢిల్లీలో పదకొండవ పంచవర్ష ప్రణాళికను ఆమోదించడానికి ఏర్పాటయిన సమావేశంలో ప్రారంభోపన్యాసం చేస్తూ ప్రధాని డా. మన్మోహన్ సింగ్ దేశంలో ఆహారానికి, ఎరువులకు, పెట్రోలియం ఉత్పత్తులకు ఇస్తున్న సబ్సిడీల భారం పెరిగిపోతున్నదన్నారు. ఈ సంవత్సరం అది లక్షకోట్ల రూపాయలకు చేరిందని వాపోయారు. ఈ సబ్సిడీలను తగ్గించే విషయమై మంత్రివర్గ సహచరులు, ప్రణాళికాసంఘం సభ్యులు ఆలోచించాలని ఉద్బోధించారు. ఈ సబ్సిడీల భారాన్ని భరించడమంటే అర్థం తక్కువ పాఠశాలలు, తక్కువ ఆస్పత్రులు, తక్కువ స్కాలర్ షిప్పులు, తక్కువ వ్యవసాయ మౌలికసౌకర్యాలు అని ఆయన బెదరగొట్టారు.

మన్మోహన్ సింగ్ మామూలు మనిషి కాదు. ప్రపంచప్రఖ్యాత మహా మేధావి. కేంబ్రిడ్జి, ఆక్స్ ఫర్డ్, ఢిల్లీ విశ్వవిద్యాలయాల్లో అర్థశాస్త్రం చదువుకున్న, చదువుచెప్పిన ఆచార్యుడు. ఐక్యరాజ్యసమితి, సౌత్ కమిషన్, అంతర్జాతీయ ద్రవ్యనిధిసంస్థ వంటి అంతర్జాతీయ సంస్థలలో బాధ్యతాయుత స్థానాలలో పనిచేసినవాడు. భారత ప్రభుత్వంలో రిజర్వ్ బ్యాంక్ గవర్నర్, విదేశాంగ



మంత్రి, ఆర్థికమంత్రి నుంచి ప్రధానమంత్రి దాకా ఎన్నోపదవులను అధిష్ఠించినవాడు. ఆయన ఏదయినా మాట అంటే, అందులోనూ ఆర్థిక వ్యవహారాల గురించి మాట్లాడితే 'ఆయనకన్నా మనకు ఎక్కువ తెలుసా' అని సామాన్యులు భయపడే అవకాశం ఉంది.

కాని ఇక్కడ సమస్య తెలియడం, తెలియకపోవడం కాదు. ఆ మాటలు ఏ ప్రయోజనాలకొరకు, ఎవరి అవసరాల కొరకు, ఎవరి పొట్ట కొట్టడం కొరకు వెలువడుతున్నాయనేది ముఖ్యం. ప్రయోజనాలది పైచేయి అయినప్పుడు మహాజ్ఞానులు కూడ పచ్చి అబద్ధాలు చెప్పగలరు, పామరులు కూడ చేదు నిజాలు చెప్పగలరు.

'చదవేస్తే ఉన్న మతి పోయింది' అని సామెత చెప్పినట్టు ఇప్పుడు డాక్టర్ మన్మోహన్ సింగ్ కూడ తన దేవతా వస్త్రాలను చూపిస్తూ భారత ఆర్థిక వ్యవస్థలోని సబ్సిడీలమీద అలవోకగా పచ్చి అబద్ధాలు ప్రకటించారు. ఆయన ప్రకటన ఎట్లా అనుచితమో, అబద్ధమో, మోసపూరితమో కనీసం డజను కోణాలనుంచి వివరించవచ్చు. అసలు ఆయనే సౌత్ కమిషన్ ప్రధాన కార్యదర్శిగా 1990లో ప్రచురించిన 'చాలెంజెస్ టు ది సౌత్' నివేదికలో సబ్సిడీల గురించి, పేదదేశాల మీద సంపన్నరాజ్యాల దాష్టీకం గురించి ఏమన్నారో చెపితే ఇవాళ్టి ప్రకటన ఎంత అబద్ధమో తెలుస్తుంది. రెండు సంవత్సరాల కింద ఇంటర్నేషనల్ ఫుడ్ పాలసీ రిసర్చ్ ఇన్స్టిట్యూట్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో 'భారతదేశంలో వ్యవసాయ సబ్సిడీలు వాటికవిగా పెద్ద సమస్య కాదు' అని ఆయనే అన్నారని చూస్తే ఇవాళ్టి ప్రకటన ఎంత అబద్ధమో తెలుస్తుంది.

మొట్టమొదట సబ్సిడీలు అనబడేవి ఏదో మన పాలకులు తమ జేబులలోంచి దయతో ప్రజలకు అందజేస్తున్నవి కాదు. ఆరు దశాబ్దాల ప్రణాళికాబద్ధ అభివృద్ధి మార్గంలో ప్రయాణం చేసినతర్వాత కూడ కొన్ని వర్గాల ప్రజల కొనుగోలు శక్తి పెరగలేదు గనుక వారి కొనుగోలుశక్తికీ, ఆయా సరుకుల ఉత్పత్తి ధరలకూ మధ్య ఉన్న వ్యత్యాసాన్ని పూడ్చడానికి సబ్సిడీలు అవసరమవుతున్నాయి. అంటే సబ్సిడీగా ఇస్తున్న ప్రతి రూపాయి కూడా ఈదేశ పాలకులు తమ అసమర్థ నిర్వహణకు చెల్లిస్తున్న మూల్యమే.

ఆ సబ్సిడీలకు అందుతున్న నిధులు ఈ దేశప్రజలు తమ నెత్తుటిని చెమటగా మార్చి రూపొందిస్తున్న సంపదలో అతి కొద్దిభాగం మాత్రమే. సబ్సిడీల పేరు మీద కేటాయించబడుతున్న నిధులలో గణనీయమైన భాగం నిజంగా అవసరమైన ప్రజలకు దక్కడం లేదు. దాన్నీ సంపన్నవర్గాలే కొట్టుకుపోతున్నాయి. నిజానికి ఈ సబ్సిడీల లెక్కను ప్రభుత్వం చెప్పినట్టు యథాతథంగా అంగీకరించినా అది మన పాలకులు తమ రక్షణకోసం, విలాసాల కోసం కేటాయించుకుంటున్నదానికన్న తక్కువే. ప్రధాని చెప్పిన లక్షకోట్ల రూపాయల అంకెను అంగీకరించినా, ప్రత్యేకఆర్థికమండలాల పన్ను రాయితీల ద్వారా, మినహాయింపులద్వారా సాలీనా లక్షకోట్ల రూపాయల ఆదాయానికి గండిపడుతుందని ఆర్థిక మంత్రి చిదంబరం చెప్పిన అంకెతోపోల్చి చూస్తే, ఐదువందల చిల్లర ప్రత్యేక ఆర్థిక మండలాలకు ఎంత అందుతున్నదో, కనీసం ఎనభై కోట్ల ప్రజానీకానికి అంతే అందుతున్నదనుకోవాలి.

ఇంతకూ మొత్తం జాతీయాదాయంలో సబ్సిడీలు పన్నెండు శాతానికి మించవని ఒక అంచనా. ప్రధాని ఆ మాటలు చెప్పిన సమావేశంలోనే ఆమోదించిన పంచవర్షప్రణాళిక 36,44,000 కోట్ల రూపాయలుగా ఉంది. ఆ లెక్కన చూస్తే వార్షిక ప్రణాళికావ్యయం ఏడులక్షల కోట్లు అన్నమాట. ఏడులక్షల కోట్ల ప్రణాళికా వ్యయంలో లక్షకోట్ల సబ్సిడీలు భారమవుతాయా?

ఇంతకన్న దారుణమైన విషయం సబ్సిడీల గురించి ఇంతగా గొంతు చించుకుంటున్న పాలకులు తాము సంపన్నులకు ఇవ్వదలచిన కానుకలకు మాత్రం ప్రోత్సాహకాలు అని ముద్దుపేరుపెట్టి, విదేశీ పెట్టుబడులు సాధిస్తాయని, ఎగుమతులు పెంచుతాయని, మౌలిక సౌకర్యాలు కల్పిస్తాయని, సాంకేతిక పరిజ్ఞానం తెస్తాయని అబద్ధాలు నమ్మబలుకుతున్నారు. ఆ ప్రోత్సాహకాలన్నీ నర్మగర్భంగా, ఊహించలేని రూపాలలో ఉంటాయి గనుక వాటిని లెక్కవెయ్యడం కూడ కష్టమే గాని, అవన్నీ లెక్కవేస్తే పేద, మధ్య తరగతి వర్గాలకు అందే సబ్సిడీలకన్న, ధనిక, వ్యాపార, పారిశ్రామిక వర్గాలకు అందే ప్రోత్సాహకాలు చాల ఎక్కువని తేలుతుంది.

ఇవాళ దేశంలో ఉన్న సబ్సిడీల విధానం లోపభూయిష్టంగా ఉన్నదని, కొన్ని వర్గాలకు అవసరంలేకపోయినా సబ్సిడీ అందుతున్నదని, అవసరమైన వర్గాలకు అందడంలేదని అనేమాట నిజమే. తప్పకుండా సబ్సిడీలను సమీక్షించి మెరుగుపరచవలసిందే. కాని కోత విధించడం, మూకుమ్మడిగా రద్దుచేయాలని వాదించడం అర్థరహితం. ఈ మాటల ద్వారా సాధించదలచింది పేద, మధ్యతరగతి వర్గాలకు అందే సబ్సిడీలపైన కోత మాత్రమే.

ఇంతకూ ఈదేశంలో వ్యవసాయ రంగానికి అందుతున్న సబ్సిడీల మీద కోత విధించి, ఇక్కడి రైతు నడ్డి విరవమని, దేశీయ ఎరువుల పరిశ్రమను మూసివేయమని, మధ్యతరగతిని వీధులపాలు చేయమని మన పాలకులకు ఆదేశాలిస్తున్నవి ప్రపంచవాణిజ్యసంస్థ, ప్రపంచబ్యాంకు వంటి అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు. ఒకపక్క అమెరికా వంటి దేశాలలో బిలియన్ డాలర్ల సబ్సిడీలు అందజేస్తుంటే, అక్కడి వ్యవసాయోత్పత్తుల ఉత్పత్తివ్యయం అంతా ప్రభుత్వమే భరించి, ఆ రైతులు విదేశాలకు ఎగుమతిచేసి పేద దేశాల రైతుల పొట్టకొట్టడానికి సిద్ధమవుతుంటే పెదవి విప్పని ప్రపంచవాణిజ్యసంస్థ మన సబ్సిడీలను మాత్రం తగ్గించమని అడుగుతోంది. ఆ ఆదేశాన్ని ఆ సంస్థల మాజీ ఉద్యోగి మన్మోహన్ సింగ్ 'జీ హుజూర్ జో హుకుం' అని మనమీద రుద్దుతున్నారు. ఆ వినయప్రకటనలో ఎంత జ్ఞాని అయినా నేలమీద పాకవలసిందే.

***సూర్య, నవంబర్ 16, 2007***



# 46

# కాగ్ నివేదికల ప్రయోజనమేమిటి?

ఈ సంవత్సరం కూడ కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ఆఫ్ ఇండియా (కాగ్) నివేదికలు రాష్ట్రప్రభుత్వ ఆర్థిక నిర్వహణను తప్పుపట్టాయి. ఒకరకంగా కాంగ్రెస్ ప్రభుత్వ హయాంలో విపరీతంగా పెరిగిపోయిన అవినీతి గురించి చాలమంది చాలరోజులుగా మాట్లాడుతున్న విషయాలనే కాగ్ నివేదికలు మరొకసారి నిర్ధారించాయన్నమాట. అధికారపక్షాన్ని విమర్శించడానికి ఏ ఆధారం దొరుకుతుందా అని ఎదురుచూస్తున్న ప్రతిపక్షాలకు అయాచితంగా ఒక అవకాశం దొరికింది. రెండురోజులుగా ప్రచార సాధనాలనిండా కాగ్ నివేదికల మీద దుమారమే రేగుతోంది.

అయితే మొట్టమొదట గుర్తించవలసిన విషయం కాగ్ నివేదికలు రాష్ట్రప్రభుత్వ ఆర్థికవ్యవహారాల నిర్వహణను తప్పుపట్టడం ఇదే మొదటిసారి కాదు, బహుశా చివరిసారీ కాబోదు. ఇందులో ప్రతిపక్షాలు ఎగిరి గంతు వేయవలసిందేమీ లేదు. గతంలో కూడ కాగ్ నివేదికలు కేంద్ర ప్రభుత్వాన్నీ, వివిధ రాష్ట్ర ప్రభుత్వాలనూ ఏ పార్టీ అధికారంలో ఉన్నా ఇంతగానో ఇంతకన్న తీవ్రంగానో తప్పుపట్టి ఉన్నాయి. కాని గద్దెనెక్కి కూచుని మహాభయంకరమైన ఆర్థిక నేరాలకూ కుంభకోణాలకూ పాల్పడినవారెవరికీ ఆ నివేదికలవల్ల

పూచికపుల్లంత ప్రమాదం కూడ జరగలేదు. కనుక ఆ నివేదికలలో ఎంతటి మహాద్భుత సత్యాలు ఉన్నా వాటికి ఫలితమూ పర్యవసానమూ ఏమీ ఉండబోదు. కాగ్ నివేదిక అంతిమ నిర్ధారణ కాదని, కాగ్ నివేదిక ఎత్తిచూపిన ఆర్థిక, గణాంక, నిర్వహణా లోపాల గురించి అంతిమతీర్పు న్యాయస్థానపు విచారణలో తేలవలసిందేనని స్వయంగా 'కాగ్ అకౌంటింగ్ స్టాండర్డ్స్' చెపుతాయి. అంటే కాగ్ నివేదిక ఎక్కువలో ఎక్కువగా పత్రికలలో దుమారానికి తప్ప మరెందుకూ పనికి రాదన్నమాట.

ప్రజాధనాన్ని వ్యయం చేసేటప్పుడు ఉండవలసిన జవాబుదారీతనాన్ని ఎత్తిపట్టడానికే ఈ సంస్థ ఏర్పడింది. ఐదు దశాబ్దాల నిర్విరామమైన, నిశితమైన కృషి తర్వాత కూడ కాగ్ వంటి రాజ్యాంగ సంస్థ, తప్పుడులెక్కలూ అక్రమాలూ అవినీతీ నిండిన ప్రభుత్వాలలో భయాన్నీ బెదురునూ ఎందుకు కలిగించలేకపోతున్నదంటూ మాజీ డిప్యూటీ కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ఆఫ్ ఇండియా డా. బి పి మాథుర్ రాసిన 'గవర్నమెంట్ అకౌంటబిలిటీ అండ్ పబ్లిక్ ఆడిట్' అనే పుస్తకంలో కాగ్ కు ఉన్న అధికారాలు ఎంత నామమాత్రమైనవో చూపారు.

ఇవాళ కాగ్‌గా మనం పిలుస్తున్న సంస్థకు మూలాలు 1858లో బ్రిటిష్ పాలకులు రూపొందించిన ఇండియన్ ఆడిట్ అండ్ అకౌంట్స్ డిపార్ట్‌మెంట్‌లో ఉన్నాయి. ఆ తర్వాత రెండు సంవత్సరాలకు ఆడిటర్ జనరల్ కార్యాలయం తయారయింది. తర్వాత 1919, 1935 భారత ప్రభుత్వ చట్టాలద్వారా ఆ పదవిని ఫెడరల్ కోర్టు న్యాయమూర్తి స్థానానికి పెంచడం జరిగింది.

భారత రాజ్యాంగం కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ఆఫ్ ఇండియా పదవిని చాల ముఖ్యమైనదిగా గుర్తించి 148-151 అధికరణాలలో కాగ్ విధులనూ బాధ్యతలనూ స్పష్టంగా నమోదుచేసింది. ప్రస్తుతం దాదాపు అరవైవేలమంది ఉద్యోగులు ఉన్న ఈ స్వతంత్ర, రాజ్యాంగబద్ధ సంస్థ భారతీయ రైల్వేలు, తంతి తపాలా శాఖలతో సహా అన్ని కేంద్ర, రాష్ట్రప్రభుత్వ శాఖల పని తీరును మదింపు చేస్తుంది. దాదాపు 1200 కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ రంగ వ్యాపార సంస్థల లెక్కలను, 400 వ్యాపారేతర ప్రభుత్వ సంస్థల లెక్కలను, ప్రభుత్వ ఆర్థిక సహాయం పొందే 4400 సంస్థల లెక్కలను పర్యవేక్షిస్తుంది. ఆ పరిశీలనలద్వారా తయారుచేసిన నివేదికలను కేంద్రస్థాయి సంస్థల విషయంలోనయితే రాష్ట్రపతికి, రాష్ట్రస్థాయి సంస్థల విషయంలోనయితే ఆయా రాష్ట్రాల గవర్నర్లకు సమర్పిస్తుంది. వాళ్లు మళ్లీ పార్లమెంటులో గాని, శాసనసభలలో గాని ఆ నివేదికలను ప్రవేశపెట్టవలసి ఉంటుంది.

సైద్ధాంతికంగా చూస్తే ఆ నివేదికలమీద ప్రజాప్రతినిధులు, పబ్లిక్ అకౌంట్స్ కమిటీలు చర్చించి, నివేదికలు ఎత్తిచూపిన తప్పులను సవరించే ప్రయత్నాలు చేయాలి. కాని మన చట్టసభలకు ఆ నివేదికలను చర్చించే తీరిక గాని ఓపిక గాని ఉండడమే లేదు. సాధారణంగా ఒక ఆర్థిక సంవత్సరానికి సంబంధించిన నివేదికలు ఆ ఆర్థిక సంవత్సరం గడిచిపోయాక కనీసం ఆరునెలల తర్వాత వెలువడుతాయి. అంటే అప్పుడిక అది గత జల సేతుబంధనం



అయి చేయవలసిందేమీ ఉండదు. ఇకముందు అటువంటి పొరపాట్లు జరగకుండా చూడవచ్చుననే సమాధానం ఉంటుందిగాని, జరిగిన అక్రమాల మీద శిక్షలు విధించడానికి గాని, ఆ అక్రమాలకు పాల్పడినవారినుంచి కైంకర్యమైన ప్రజాధనాన్ని రాబట్టడానికి గాని అవకాశమేమీ ఉండదు. అంతేకాదు, అసలు కాగ్ తన నివేదికలకొరకు నమూనా సమాచారం రాబట్టడానికి ప్రయత్నించినప్పుడు ప్రభుత్వ శాఖల అధికారులు సహకరించడం లేదని, వారి సహాయనిరాకరణమీద కూడ చర్య తీసుకునే అధికారం తమకు లేదని మాథుర్ రాశారు.

మాథుర్ రాసిన ఒక ఉదాహరణ చెప్పుకోదగినది: ప్రపంచబ్యాంకు ఆదేశాల ప్రకారం టెలికాం రంగంలో సంస్కరణల ఫలితంగా టెలికాం రెగ్యులేటరీ అథారిటీ ఆఫ్ ఇండియా (ట్రాయి) అనేసంస్థ ఏర్పడింది. దాని కార్యదర్శి అధికారిక పనిమీద ఫిలిప్పైన్స్ లోని మనిలా లో ఏషియన్ డెవలప్‌మెంట్ బ్యాంక్ ఏర్పాటుచేసిన ఉచిత హోటల్ వసతిని అనుభవించి కూడ, అక్కడ ఉన్నన్ని రోజులూ హోటల్ ఖర్చుల కింద రోజుకు 500 డాలర్ల చొప్పున మన ప్రజాధనం నుంచి రాబట్టాడు. దానిమీద కాగ్ ప్రశ్నించినప్పుడు ట్రాయి స్వతంత్ర సంస్థ అని కనుక దాని పనితీరు గురించి ప్రశ్నించేఅధికారం కాగ్‌కు లేదని సవాలు చేశాడు. దానిమీద సంవత్సరాల తరబడి అటూ ఇటూ ఉత్తరాలు నడిచాయి తప్ప జరిగిందేమీ లేదు.

ఇలా రోజుకు 500 డాలర్లకు కక్కుర్తి పడిన అధికారుల నుంచి వేల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని దొడ్డిదారిన తమ ఖాతాలలోకి మళ్లించుకున్న రాజకీయనాయకుల దాకా మన పాలకులు కొల్లగొడుతున్న ప్రజాధనానికి లెక్కలేదు. వందకోట్ల ప్రజలు తమ నెత్తుటిని చెమటగా మార్చి సృష్టిస్తున్న సంపదను ఇటువంటి కొన్ని వందలమంది దొంగలు తన్నుకుపోతున్నారు. మళ్లీ ఆ జలగలూ గద్దలూ పందికొక్కులూ (నిజానికి ఇలా నోరులేని మూగప్రాణులను అవమానించనక్కరలేదు, నిలువెల్లా విషం ఉన్న మనుషుల పనే ఇది) అధికారపక్షంలో ఉన్నప్పుడు అవేపనులు చేసి ప్రతిపక్షంలోకి రాగానే గగ్గోలు పెడుతున్నాయి.

1994 నుంచి 2004 దాకా కాగ్ నివేదికలమీద రాజశేఖరరెడ్డి ఏమన్నారో 2005 నుంచి ఇప్పటిదాకా చంద్రబాబు నాయుడు అదే అంటున్నారు. కాగ్ నివేదికలలో బయటపడుతున్న కుంభకోణాల వందలకోట్ల రూపాయల నిధులు వాళ్లిద్దరివీ కాదనీ, సంపూర్ణంగా తమవేనని ప్రజలు గుర్తించేదాకా, తామే స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నించేదాకా ఎన్ని కాగ్ నివేదికలు వచ్చినా ప్రయోజనం లేదు.

***సూర్య, నవంబర్ 23, 2007***

# 47

# చెరకు రైతు బతుకు చేదు

వరి మద్దతుధర గురించి ఆందోళనలకు పరిష్కారం దొరకకముందే చెరకు ధర గురించి రైతుల ఆందోళన మొదలు కాబోతున్నది. ఇప్పటికే జహీరాబాద్ ప్రాంతానికి చెందిన చెరకు రైతు దశరథ్ గత సంవత్సరం కర్మాగారానికి తోలిన చెరకుకు ఇప్పటికీ చెల్లింపులు జరగక ఆత్మహత్య చేసుకున్నాడు. ప్రత్యేకించి చెరకు రైతుల సమస్యల గురించి, మొత్తంగా రైతాంగ సమస్యల గురించి పాలకుల దృష్టికి తేవడం కోసం డి వసంత్ కుమార్ జహీరాబాద్ నుంచి ఢిల్లీ దాకా పాదయాత్ర జరిపి అక్కడ అన్ని రాజకీయ పక్ష నేతల కళ్లూ చెవులూ తెరిపించడానికి విఫలప్రయత్నం చేసి తిరిగివచ్చాడు.

ఆహారధాన్యాలు పండించే రైతులకన్న వాణిజ్యపంటల రైతుల పరిస్థితి కొంత మెరుగు అని ఒక భ్రమ గతంలో చాలమంది పరిశీలకులకు ఉండేది గాని ఇప్పుడు ఆ స్థితి కూడ మారుతున్నట్టున్నది. పాలకవిధానాలు మొత్తంగానే వ్యవసాయ రంగాన్ని చిన్నచూపు చూస్తుండడంవల్ల, అన్ని పంటలపట్ల, అసలు మొత్తంగా గ్రామీణుల పట్ల, రైతుల పట్ల ఒకేరకమైన నిర్లక్ష్యం కనబడుతున్నట్టున్నది. ఆ నేపథ్యంలోనే ఇప్పుడిక చెరకు రైతుల ఆత్మహత్యలకు కూడ రంగం సిద్ధమవుతున్నట్టున్నది.



ఇప్పటికీ డెబ్బై శాతం మందికి జీవనోపాధిని కల్పిస్తున్న, ఈ దేశ జీవన విధానంగా ఉన్న వ్యవసాయ రంగంలో, ముఖ్యంగా రైతుల సంక్షేమం కోసం, అమలవుతున్న విధానాలను స్థూలంగా పరిశీలించినా అసలు ఈ దేశ పాలకులు ప్రజలకు ఎంత దూరంగా ఉన్నారో, కొనసాగుతున్న రాజకీయార్థిక విధానాలు ఎంత అస్తవ్యస్తంగా ఉన్నాయో అర్థమవుతుంది.

వ్యవసాయం గిట్టుబాటు కావడం కొరకు, సమాజ మనుగడకు అత్యవసరమైన వ్యవసాయరంగంనుంచి రైతులు బయటికి రాకుండా చూడడం కొరకు ప్రభుత్వాలు చాల కాలంగా కనీస మద్దతు ధర నిర్ణయించడం అనే పద్ధతిని అమలు చేస్తున్నాయి. ప్రస్తుతం 26 వ్యవసాయోత్పత్తులకు ఈ కనీస మద్దతు ధర ప్రకటన ఉంది. మొత్తం పంట విస్తీర్ణం, దిగుబడి, గిరాకీ, ఉత్పాదకాల ధరలు, మొత్తంగా ఉత్పత్తివ్యయం, ద్రవ్యోల్బణం వంటి అనేక ప్రాతిపదికల మీద ఆధారపడి ఈ కనీస మద్దతు ధర ఏ ఏడాదికి ఆ ఏడాది నిర్ణయమవుతుంది. మార్కెట్ ధరలు ఈ కనీస మద్దతు ధరకు అటూ ఇటూగా ఉంటాయి.

ఈ కనీస మద్దతుధర నిర్ణయం వరకూ మొక్కుబడిగా ఇప్పటికీ అమలవుతున్నది గాని, ప్రపంచీకరణ క్రమం మొదలయినప్పటి నుంచీ ఇటువంటి ప్రభుత్వ జోక్యం వద్దనీ, అన్నిటినీ మార్కెట్ శక్తులకు వదిలేయాలనీ ఆధిపత్య భావజాలం చెపుతున్నది.

అది అలా ఉంచినా కనీసమద్దతుధర విషయంలో రెండు సమస్యలున్నాయి. ఒకటి, ప్రభుత్వం ఈ కనీసమద్దతుధరలను నిర్ణయించేటప్పుడు హేతుబద్ధమైన పద్ధతి పాటించడం లేదు. ఉత్పాదకాల వ్యయాన్ని, ద్రవ్యోల్బణాన్ని సరిగా అంచనా కట్టడం లేదు. అందువల్ల ఉత్పాదకాల వ్యయం విపరీతంగా పెరిగిపోతున్నప్పటికీ వ్యవసాయోత్పత్తుల కనీస మద్దతు ధరలో అందుకు సమానమైన పెరుగుదల ఉండడం లేదు. రెండు, అసలు దేశవ్యాప్తంగా గాని, ఒకే రాష్ట్రంలో గాని ఒకే రకమైన మద్దతు ధర ప్రకటించడమనేది, అన్ని ప్రాంతాలనూ సమానంగా చూడడమనేది న్యాయబద్ధమైన చర్యకాదు. మన రాష్ట్రం విషయానికే వస్తే, ప్రజాధనాన్ని ఉపయోగించి ప్రభుత్వమే నీటిపారుదల సౌకర్యాలు కల్పించిన కోస్తా ప్రాంతానికీ, స్వయంగా రైతులు తామే నీటిపారుదల సౌకర్యం కలిగించుకోవలసిన తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలకూ మధ్య ఉత్పత్తి వ్యయంలో విపరీతమైన తేడా ఉంటుంది. ఆ తేడాను పరిగణనలోకి తీసుకోకుండా మద్దతుధరను ఒకే రకంగా నిర్ణయిస్తే అది ఒకప్రాంత రైతులకు గిట్టుబాటుగా ఉంటే మరొక ప్రాంత రైతులకు నష్టదాయకంగా ఉంటుంది.

చెరకు విషయానికి వచ్చేసరికి కేంద్రప్రభుత్వం 'కనీసమద్దతుధర నిర్ణయించేటప్పుడు వినియోగదారులను దృష్టిలో పెట్టుకోవాలి' అనే ఒక కొత్త వాదన ముందుకుతెస్తోంది. నిజంగా వినియోగదారు మీద ఎక్కువభారం పడకుండా చూడడం ప్రభుత్వ బాధ్యతే కాని అందుకొరకు రైతు కడుపుమీద కొట్టనక్కరలేదు. అసలు సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంచి చెరకు నుంచి చక్కెర దిగుబడిని పెంచగలిగినా, మధ్య దళారీల పాత్ర తగ్గించగలిగినా, చక్కెర కర్మాగారాల యజమానుల, చక్కెర వ్యాపారుల లాభార్జనా అత్యాశను తగ్గించగలిగినా వినియోగదారుల

ప్రయోజనాలు నెరవేరుతాయి. నిజానికి చెరకు రైతు ప్రయోజనాలకు, చక్కెర వినియోగదారుల ప్రయోజనాలకు మధ్య పూడ్చరాని అఖాతమేమీ లేదు. కాని ప్రభుత్వ అస్తవ్యస్త విధానాలు ఈ రెండు సమూహాలను ఒకదానికి ఎదురుగా మరొకదాన్ని నిలిపి పబ్బం గడుపుకుంటున్నాయి.

చెరకు మద్దతు ధరలో ప్రభుత్వం గతసంవత్సరం క్వింటాలుకు 75 పైసలు, ఈ సంవత్సరం 90 పైసలు పెంచిందంటే, క్వింటాలు చెరకు నుంచి సగటున పదికిలోలు చక్కెర వస్తుందనుకుంటే, కిలో చక్కెర మీద రైతు ఆదాయంలో పెరుగుదల పది పైసల లోపే అనుకోవాలి. మరి చక్కెర ధరలో రూపాయలకొద్దీ పెరుగుదల ఉండగా పెరిగిపోతున్న చక్కెరధర ఎక్కడికిపోతున్నట్టు? రైతుల ప్రయోజనాలను బలిపెట్టి సాధించిన వినియోగదారుల ప్రయోజనాలు ఏమయినట్టు?

ఇందులో రాష్ట్రప్రభుత్వ జోక్యం కూడా ఉంది. రాష్ట్ర సలహా ధర అనే పద్ధతి ఒకటి ఉందిగాని, ఆ ధర నిర్ణయంలోకూడ ఎంతమాత్రం శాస్త్రీయ, హేతుబద్ధ పద్ధతి లేదు.

ఇక చక్కెర కర్మాగారాల యాజమాన్యాలు చెరకు రైతాంగం మీద సాగిస్తున్న అక్రమాలకు అంతులేదు. కేన్ డెవలప్‌మెంట్ కౌన్సిల్ అనే ప్రజాస్వామిక సంస్థల ఆధ్వర్యంలోనే కర్మాగారాల పనితీరు నడవాలి గాని ఆ సంస్థలకు ఎన్నికలు లేవు. యాజమాన్యాల, ప్రభుత్వాల, అధికార పార్టీల నామినేటెడ్ ప్రతినిధులతో అవి ఇష్టారాజ్యంగా నడుస్తున్నాయి. అందువల్ల యాజమాన్యాల ప్రయోజనాలకు, రైతుల ప్రయోజనాలకు వైరుధ్యం వచ్చినప్పుడల్లా యాజమాన్యాలదే పైచేయి అవుతున్నది.

ఒక్కొక్క చక్కెర కర్మాగారం ఎంత చెరకును క్రష్ చేయగలదు, ఒక కర్మాగారం పరిధిలో ఎంత చెరకును పండించడం సముచితం అనే విషయాలు శాస్త్రీయంగా లెక్కకట్టడానికి వీలు ఉన్నప్పటికీ, ఎక్కువ ప్రాంతంలో పండించమని రైతులను ప్రోత్సహించడానికి, ఒప్పందంలేకుండా పండించిన చెరకును కొనడానికి కర్మాగారాలు ఉత్సాహం చూపుతున్నాయి. చెరకు సాగు, రైతుల సమస్యలు అర్థం కూడా కాని పరిశ్రమల శాఖ పరిధిలోకి వస్తుంది గాని వ్యవసాయ శాఖ కిందికి రాదు. పొగాకు, పత్తి, కాఫీ, సుగంధద్రవ్యాలు మొదలయిన వాణిజ్య పంటలకు ఉన్నట్టుగా చెరకుకు ఒక స్వతంత్ర సంస్థకూడా లేదు.

ఇలా 'అరయంగా కర్ణుడీల్గెనార్గురిచేతన్..' అన్నట్టు చెరకు రైతులు అప్పులబారిన పడి ఆత్మహత్యలే పరిష్కారమనుకునే స్థితి ఏర్పడుతోంది. ఇది ఒక్క చెరకు రైతుల సమస్యమాత్రమే కాదు. దేశంలో వ్యవసాయరంగంలో ఉన్నవారందరి సమస్య ఇదే. గత పది సంవత్సరాలలో లక్షన్నర మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారంటే మన నోటిదగ్గరి ముద్దలో మెతుకు మెతుకు మీదా ఎంత నెత్తురు అంటి ఉన్నట్టు? ఆ నెత్తురుమరక తుడిచేయడానికి మనం ఏంచేస్తున్నామని ప్రశ్నించుకోవడం మన బాధ్యత.

***సూర్య, డిసెంబర్ 14, 2007***



# 48

# ఎంత గొప్ప ప్రణాళిక !

పదకొండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాను జాతీయ అభివృద్ధి మండలి ఎట్టకేలకు బుధవారం నాడు ఆమోదించింది. నూతన ఆర్థిక విధానాల తర్వాత అసలు మన రాజకీయార్థిక పాలనా విధానాలలో ప్రణాళికల పద్ధతే నిర్లక్ష్యానికి గురవుతున్నది గనుక, ప్రణాళికలలో ఏమి రాసినా వాటిని పాటించడం లేదు గనుక ఈ ఆమోదాన్ని 'ఎట్టకేలకు' అనవలసి వస్తున్నది. అంతేకాదు, ఈ పదకొండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా మీద కసరత్తు చాల రోజులుగా సాగుతున్నది, ఒక నెల కిందనే కేంద్ర మంత్రివర్గం దీన్ని ఆమోదించింది. ఇప్పుడిక జాతీయ అభివృద్ధి మండలి దీన్ని ఆమోదించడం శుష్కమైన తంతు మాత్రమే. ఈ మొక్కుబడి ఆమోదాన్ని పొందిన ప్రణాళికను కూడ ప్రజల వైపు నుంచి లోతుగా పరిశీలించడం, అది ప్రజలను ఎట్లా మోసం చేయబోతున్నదో వివరించడం అవసరం.

నిజానికి వలసపాలన అనంతరం ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానాన్ని ప్రారంభించినపుడు ఈదేశ పాలకులకు కొన్ని ఆదర్శాలైనా ఉన్నాయి. ప్రజల అవసరాలు తీర్చగల శక్తి ప్రభుత్వానికి ఉంటుందని, ప్రభుత్వం ఒక పద్ధతి ప్రకారం దేశంలో ఉన్న వనరులేమిటో, ప్రజల అవసరాలేమిటో అంచనావేసి,

ఆ అవసరాలను తీర్చడానికే అన్ని సన్నాహాలు చేయవలసి ఉంటుందని ఆరోజున భావించారు. ఒకరకంగా రాజ్యాంగ లక్ష్యాలయిన సామాజిక న్యాయాన్ని, ఆర్థిక, రాజకీయ, సామాజిక సమానత్వాన్ని సాధించడం ప్రణాళికాబద్ధ ప్రగతి ద్వారా సాధ్యమవుతుందని ఆశించారు. అప్పటికే సోవియట్ యూనియన్ లో అమలవుతున్న పంచవర్ష ప్రణాళికల ద్వారా సాధించిన అద్భుతమైన ప్రగతిని చూసి, అదేరకమైన ప్రగతిని ఇక్కడ కూడ సాధించవచ్చుననుకున్నారు.

అలా 1951లో మొదలయిన పంచవర్షప్రణాళికలు ఆశించిన లక్ష్యాలను సాధించకుండానే ఇప్పటికి పది విడతలుగా సాగిపోయాయి. ఈ మధ్యలో ఏడాదికేడాదికి మార్చిన ప్రణాళికలు, నాలుగో సంవత్సరంలో ప్రభుత్వం మారినందువల్ల ముగిసిపోయిన పంచవర్ష ప్రణాళికలు ప్రణాళికాబద్ధ విధానాన్ని ఒక ప్రహసనంగా మార్చివేశాయి. అందువల్ల ప్రస్తుతం పన్నెండో ప్రణాళిక నడుస్తుండవలసి ఉండగా దాని స్థానంలో పదకొండో ప్రణాళిక మొదలవుతున్నది. అదికూడ 2007-12 పంచవర్ష ప్రణాళిక, 2007-08 ఆర్థిక సంవత్సరం సగం గడిచిపోయిన తర్వాత ఆమోదం పొందిందంటే మన పాలకులకు ఈ ప్రణాళికలపట్ల ఎంత శ్రద్ధ ఉన్నదో అర్థమవుతుంది.

ఈలోగా ప్రణాళికా బద్ధ ఆర్థిక విధానమన్నా, ప్రభుత్వ రంగం అన్నా సోషలిజం అవశేషాలనీ, వాటిని వదుల్చుకోవాలనీ ప్రైవేటురంగ ప్రముఖులు, పెట్టుబడిదారీ అర్థశాస్త్రవేత్తలు పాలకులకు సలహాలు ఇస్తూ వచ్చారు. సోవియట్ యూనియన్ పతనమై, బహుళజాతిసంస్థల నాయకత్వాన ప్రపంచీకరణ కొత్త దశ మొదలయిన తర్వాత ఆ సలహాల ఉధృతి మరింత పెరిగి ప్రణాళికాబద్ధ ఆర్థికవిధానం ఒక అవమానకరమైన మాట అయిపోయింది. అందువల్లనే ఎనిమిదోప్రణాళిక (1990-95) కాలం నుంచీ కూడ పేరుకు ప్రణాళికా రచన జరగడం, సమాజం ముందర కొన్ని లక్ష్యాలు నిర్ధారించడం, చివరికి ఆ లక్ష్యాలలో సంపన్నులకు ఉపయోగపడేవాటిని మాత్రం సాధించడం, ప్రజలకు ఉపయోగపడే, ప్రజాజీవనాన్ని మెరుగుపరిచే లక్ష్యాలను నిర్లక్ష్యం చేయడం జరుగుతూనే ఉన్నాయి.

ఇక పదకొండో ప్రణాళికా కాలానికి వచ్చేసరికి, అసలు ప్రణాళిక అనేమాటే గిట్టని, సమానత్వం పొడే సహించని, అన్నిటినీ మార్కెట్ శక్తులే శాసించాలని కోరుకునే ప్రపంచబ్యాంకు సేవకుడు మోంటెక్ సింగ్ అహ్లువాలియా ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడయ్యాడు.

అందుకే 'త్వరితమైన, సమ్మిళితమైన అభివృద్ధి దిశగా' అనే పేరుతో వెలువడిన పదకొండో ప్రణాళిక ప్రతిపాదనాపత్రం చాల గంభీరమైన ప్రవచనాలు చేసినప్పటికీ, ఇప్పటివరకూ అభివృద్ధి ఫలాలు అందని సంపన్నులకోసం త్వరితమైన అభివృద్ధిని సాధించాలని, అన్ని వర్గాలనూ సమ్మిళితం చేస్తాననే ఆశ చూపుతూ, అన్ని వర్గాల సమ్మతిని కూడగట్టే ప్రయత్నం చేయాలని ప్రయత్నిస్తోంది. ఆ ప్రాతిపదిక పత్రంలోని ఉదాత్త లక్ష్యాలు, ప్రజానుకూలమనిపించే లక్ష్యాలు అన్నీ గాలికిపోయి, ఇప్పుడు జాతీయ అభివృద్ధి మండలి ద్వారా బయటపడిన ప్రణాళికలో అంకెల గారడీలు, బహుళజాతిసంస్థలకు ఇబ్బడిముబ్బడిగా లాభాలు సమకూర్చిపెట్టే పథకాలు, ఈ దేశ సంపన్నుల అవసరాలు తీర్చే మార్గాలు మాత్రం కనబడుతున్నాయి.



ఈ ప్రణాళిక జాతీయోత్పత్తిలో ఎనిమిది శాతం అభివృద్ధిని సాధించడాన్ని లక్ష్యంగా పెట్టుకున్నదని చెపుతున్నారు. అయితే సమస్య జాతీయోత్పత్తి అభివృద్ధి ఎనిమిది శాతమా పది శాతమా అని కాదు, పెరుగుతున్న జాతీయోత్పత్తి సమానంగా పంపిణీ అవుతున్నదా లేదా, దేశ ప్రజలందరికీ కనీస అవసరాలు తీరుస్తున్నదా లేదా అని. ఆ ప్రశ్నలే వేసుకోకుండా అంతకంతకూ ఎక్కువ అభివృద్ధి సాధించాలని, అలా అభివృద్ధి సాధిస్తూ పోతే అది ఎప్పటికో ఒకప్పటికి కిందికి బొట్లుబొట్లుగా జారి పేదప్రజలకు అందుతుందని అరవై సంవత్సరాలుగా స్వతంత్రభారత పాలకులు చెపుతూనే ఉన్నారు. ఆ బొట్లు కిందికి జారిందీ లేదు, ప్రజలకు అందిందీ లేదు. పది ప్రణాళికలు విజయవంతమైన తర్వాత ప్రభుత్వ లెక్కల ప్రకారమే ఇంకా దేశంలో మూడో వంతు జనాభా పేదరికంలో ఉన్నారు. పనిచేయగల జనాభాలో సగం నిరుద్యోగంలోనో, అల్పోద్యోగంలోనో ఉన్నారు. ప్రణాళికలు పేదరికాన్ని, నిరుద్యోగాన్ని తగ్గించే ప్రత్యేక చర్యల గురించి చేసిందేమీలేదు. ఈ పదకొండో ప్రణాళికా అంతే.

వ్యవసాయం, ఆరోగ్యం, నీటిపారుదల రంగాలపై పెట్టుబడులు పెరగాలని, గ్రామీణ - పట్టణ ప్రాంతాల మధ్య అంతరాల్ని తగ్గించాలని, పేదరికాన్ని తగ్గించాలని, నాణ్యమైన విద్యను అందించాలని, వలసలను తగ్గించాలని ప్రణాళికా పత్రం గంభీరమైన, భారీ జనాకర్షక వాగ్దానాలు చాలా చేసింది. ఇవన్నీ వినడానికి చాల బాగుంటాయి. ఇవి వినగానే ప్రభుత్వం ప్రజలకు ఏదో ఒరగబెడుతోందని అనిపిస్తుంది. కాని నిజంగా ఈ మాటలను విశ్లేషించి చూస్తే వాటి అసలు రంగు తెలుస్తుంది.

మొత్తం ప్రణాళికా వ్యయం రు. 36,44,718 కోట్లు. దానిలో విద్యారంగానికి 20 శాతం అంటే రు. 7,28,943 కోట్లు కేటాయించినట్టు ప్రకటిస్తున్నారు. అంటే సాలీనా రు 1,65,788 కోట్లు అన్నమాట. దీన్ని రాష్ట్రాలకు విభజిస్తే సగటున ఒక్కొక్క రాష్ట్రానికి రు. 6,000 కోట్ల కన్న ఎక్కువ రావు. దీన్ని విద్యార్థుల సంఖ్యతో విభజిస్తే ప్రతివిద్యార్థి చేతికి అందేది కొన్ని వేలకు మించదు. వాటితో ఎంత నాణ్యమైన విద్య అందుతుందో చెప్పనక్కరలేదు. ఆ నిధులు సక్రమంగా వచ్చినా అవి ఉన్న వసతులను నిర్వహించడానికే సరిపోతాయి గాని కొత్త వసతులు కల్పించడానికి పనికిరావు. అంటే వెరసి అంత గొప్పగా కనబడుతున్న అంకెలు వాస్తవరూపం ధరించేసరికి హళ్లికి హళ్లి సున్నకు సున్న అవుతాయన్నమాట. వ్యవసాయం, నీటిపారుదల, వైద్యం, గ్రామీణాభివృద్ధి వంటి రంగాల కేటాయింపుల కథా ఇంతే.

మరొక పక్క దేశ విద్యుత్తు అవసరాలు తీర్చడానికి అణుశక్తి అత్యవసరమని, అందువల్ల భారత - అమెరికన్ అణు ఒప్పందం అనివార్యమని ఈ ప్రణాళికా పత్రమే పేర్కొంటున్నది. సబ్సిడీలు ఇవ్వనక్కరలేదని ఈ ప్రణాళిక విడుదల సందర్భంగా ప్రధానమంత్రి అన్నారు. ప్రజాపంపిణీ విధానం, చౌకధరల దుకాణాలు తలకు మించిన భారం అయిపోయాయని ఆర్థిక మంత్రి అన్నారు. అంటే పైన చెప్పిన ఆదర్శాలన్నీ అబద్ధం. ఈ మాటలే నిజం.

**సూర్య, డిసెంబర్ 21, 2007**

# 49

## ఇక రవాణా ధనయజ్ఞం !

'బస్సుచక్రం ప్రజాప్రగతికి చిహ్నం' అనే మాట చూడని వారెవరూ మన రాష్ట్రంలో ఉండరు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ నడిపే బస్సులమీద ఉండే ఆ సంస్థ చిహ్నంలో ఈమాట ఉంటుంది. ఈ సంస్థ 1950 రోడ్ ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ అక్ట్ ప్రకారం 1958 జనవరి 11 న పుట్టింది. ఇంకొక రెండువారాల్లో యాభయవ పడిలో పడబోతున్న ఈ సంస్థ తాను ఎందుకు పుట్టానో మరిచిపోతున్నట్టుంది. దాని పుట్టుకకు కారణమైన చట్టం ప్రయాణికుల రవాణా బాధ్యత పూర్తిగా ప్రభుత్వానిదేనని పేర్కొనగా, ప్రస్తుతం ఆర్టీసీ మాత్రం ఆ బాధ్యతను ఎట్లా వదిలించుకుందామా అని ప్రయత్నాలు చేస్తోంది. అయితే ఈ లక్ష్యాల తారుమారు ఆర్టీసీ దగ్గర మాత్రమే మొదలు కాలేదు. కేంద్రస్థాయిలోనే 1980లలో బస్సుల నిర్మాణకంపెనీలు రవాణాను ప్రభుత్వ రంగం నుంచి తప్పించాలని ఒత్తిడి మొదలుపెట్టి 1988లో మోటారువాహనాల చట్టానికి సవరణ తెచ్చేలా చూశాయి. ప్రైవేటు వాహనాలకు అన్ని మార్గాల్లోనూ అనుమతి ఇవ్వాలని, ప్రభుత్వ, ప్రైవేటు వాహనాల పోటీలోనే ప్రజలకు మేలయిన రవాణాసేవలు అందుతాయని కొత్త భాష్యాలు మొదలయ్యాయి. ఈలోగా 1990లలో మన రాజకీయార్థిక విధానాలను ప్రపంచబ్యాంకు నేరుగా శాసించడం మొదలయింది. ఆ క్రమంలోనే వాదనలు ముందుకుసాగి మొదట



లాభాలు వచ్చే రూట్లన్నీ ప్రైవేటు రంగానికి, నష్టాలు వచ్చే రూట్లన్నీ ప్రభుత్వ రంగానికి అప్పగించడం జరిగింది. ఆ తర్వాత నష్టాలు వచ్చే రూట్లలో, అంటే ప్రధానంగా గ్రామీణ, మారుమూల ప్రాంతాల రూట్లలో, బస్సులు నడపడం దండగ అనీ, అందువల్ల ఆ బస్సులు రద్దుచేసి, అక్కడి డిపోలను కూడ రద్దు చేయాలని, ఆ తర్వాత ఉద్యోగులను తొలగించడమో, ఖాళీ అయిన స్థానాలను నింపకపోవడమో చేయాలని ఒకదాని తర్వాత ఒకటి ఆదేశాలు, చర్యలు జరుగుతూ వచ్చాయి.

అందువల్లనే అధికారిక చిహ్నంలో ఏమి రాసుకున్నప్పటికీ, గత రెండు దశాబ్దాలుగా పాలకుల దృష్టిలోనూ, ఆర్టీసీ యాజమాన్యం దృష్టిలోనూ ప్రజా ప్రగతి అంటే నిర్వచనం మారిపోయింది. ప్రస్తుతం వారి దృష్టిలో ప్రజలు అంటే ప్రైవేటు బస్సు యజమానులు. వారికి లాభాలు చేకూర్చి, వారి ప్రగతి సాధించడమే ఆర్టీసీపని. ఆ పనిలో తమ బస్సు చక్రాల గాలి తామే తీసుకునే దివాళాకోరువిధానాలకు పాలకులు, ఆర్టీసీ యాజమాన్యం సిద్ధపడుతున్నారు. ప్రస్తుతం ఆర్టీసీ యాజమాన్యం కొత్తగా 1500 బస్సులు అద్దెకు తీసుకోవాలని నిర్ణయించి, టెండర్లు పిలవడం, ఆర్టీసీ ఉద్యోగ, కార్మిక సంఘాలు ఆందోళనకు దిగడం ఈ నేపథ్యంలోనే అర్థం చేసుకోవాలి.

పది సంవత్సరాల కింద ప్రపంచబ్యాంకు ప్రకటించిన 'ఆంధ్రప్రదేశ్ – ఎజెండా ఫర్ ఎకనమిక్ రిఫార్మ్స్' పత్రంలోనూ, ఆ తర్వాత కుదిరిన ఒప్పందాలలోనూ ఆర్టీసీని ప్రైవేటీకరించాలని బహిరంగంగానే ఆదేశించారు. కాకపోతే ఆర్టీసీని ప్రైవేటీకరించడం అంటే రాష్ట్రవ్యాప్తంగా లక్షకు పైగా కార్మికుల కుటుంబాలను వీథులపాలు చేయడం అవుతుంది గనుక, 'రాజకీయంగా సున్నితమైన చర్య' గనుక ఆపని జాగ్రత్తగా చేయాలని ప్రపంచబ్యాంకు సన్నాయినొక్కు నొక్కింది. తత్ఫలితంగానే గత పది సంవత్సరాలుగా ఆర్టీసీలో అనేక ప్రజావ్యతిరేక, కార్మిక వ్యతిరేక చర్యలు మెల్లమెల్లగా జరుగుతున్నాయి. ప్రస్తుతం ఆర్టీసీ కార్మికులు సమ్మెకు సిద్ధపడుతున్న తక్షణ కారణమైన అద్దెబస్సుల ప్రవేశం ఆ పనుల్లో ఒకటి.

ఆర్టీసీ సేవలు మరింత మెరుగ్గా అందించేందుకు ప్రైవేటు బస్సు యజమానులనుంచి బస్సులను అద్దెకు తీసుకోవాలని ఆర్టీసీ యాజమాన్యం ఆలోచించడం ఇరవై ఏళ్లకింద మొదలయింది. నిజానికి మెరుగైన సేవలకోసం ఎక్కువ బస్సులు కావాలంటే ఆర్టీసీయే కొత్త బస్సులు కొనుక్కోవచ్చు, లేదా ప్రభుత్వం రాయితీలు ఇచ్చి, రుణం ఇచ్చి బస్సులు కొనిపించవచ్చు. కాని ప్రైవేటు బస్సు యజమానులకు, బస్సుల తయారీదారులకు, వాహనాల ఫైనాన్సింగ్ సంస్థలకు లాభాలు సమకూర్చడం కోసం పాలకులు ఈ విధానం మొదలుపెట్టారు.

ప్రజలకు మెరుగైన సేవలు అందించడం అనే ప్రకటితలక్ష్యం పైకి చూడడానికి చాల ఉదాత్తంగా కనబడుతుంది గాని, దాని వెనుక ఉన్న కారణాలు చూడాలి. రాష్ట్రంలో ప్రైవేటు రవాణాసంస్థలను ఏర్పాటు చేసుకున్న కోస్తాంధ్ర భూస్వాములకు, రాయలసీమ ముఠానేతలకు లాభాలు చేకూర్చి పెట్టడం ఈ విధానపు అసలు లక్ష్యం. ఈ రవాణా ధనయజ్ఞం 1980లలో మొదలై 1990లతర్వాత ప్రపంచబ్యాంకు ఆదేశాలతో మరింత వేగం పుంజుకుంది. ఈ రవాణా ధనయజ్ఞ లబ్ధిదారులకు రాజకీయ పార్టీల పట్టింపులు కూడ ఏమీలేవు, వీరిలో రెండు ప్రధాన

రాజకీయ పక్షాలకు చెందిన వారూ ఉన్నారు. అలా 1990–91లో కేవలం 244 (మొత్తంలో 2 శాతం) ఉన్న అద్దె బస్సులు 2001–02 నాటికి 1557 (మొత్తంలో 8 శాతం) కు చేరాయి, ప్రస్తుతం అవి 2,300 (12 శాతం) అని, ఇప్పుడు టెండర్లు పిలిచిన 1500 కూడ వస్తే అవి ఇరవై శాతం దాటిపోతాయని ఒక అంచనా.

ప్రస్తుతం ఆర్టీసీ దగ్గర దాదాపు పందొమ్మిదివేల బస్సులు ఉన్నాయి. కాని వాటిలో కనీసం ఆరేడువేల బస్సులు మరమ్మత్తుల అవసరం తోనో, పాతబడిపోయో పనికిరాకుండా ఉన్నాయి. ఇప్పటికిప్పుడు పాతవాటి స్థానంలో కొత్త బస్సులు ఆరువేలు కొనవలసి ఉంటుందని చెప్పవచ్చు. కాగా పెరుగుతున్న జనాభా రవాణా అవసరాల కోసం ప్రతిఏటా ఆర్టీసీ కొత్త బస్సులు కొనవలసి ఉంటుంది. కొత్త బస్సులు కొనడం అంటే ఆ మేరకు డిపోల సంఖ్యను, గారేజీల సంఖ్యను, షెడ్ల, వర్క్ షాపుల సంఖ్యను పెంచవలసి ఉంటుంది. దేశవ్యాప్తంగా ప్రభుత్వ రవాణా సంస్థలలో ఉన్న నిష్పత్తి ప్రకారం చూసినా ప్రతి బస్సుకు ఏడుగురు ఉద్యోగులను (డ్రైవర్లు, కండక్టర్లు, క్లీనర్లు, మెకానిక్‌లు) కొత్తగా పనిలోకి తీసుకోవలసి ఉంటుంది. అవన్నీ ప్రభుత్వోద్యోగాలు కాబట్టి అందులో తప్పనిసరిగా దళితులకు, ఆదివాసులకు, వెనుకబడిన కులాలకు, మహిళలకు రిజర్వేషన్లు కల్పించవలసి ఉంటుంది. అంటే ప్రస్తుతం ప్రభుత్వం కొత్తగా అద్దెకు తీసుకోదలచిన బస్సుల సంఖ్యనే చూసినా కనీసం పదివేల కొత్త ఉద్యోగకల్పన జరగవలసి ఉంటుంది, అందులో కనీసం ఐదువేల ఉద్యోగాలు వెనుకబడిన వర్గాలకు ఇవ్వవలసి ఉంటుంది. ఆర్టీసీలో కార్మిక సంఘాల ప్రాబల్యం హెచ్చుగానే ఉంది గనుక ఆమేరకు కార్మిక ఉద్యమం కూడ పెరుగుతుంది. ఈ అన్ని 'బెడదల'నుంచి తప్పించుకునేందుకు, ఆర్టీసీ యాజమాన్యం, పాలకులు, తమకు ఏ బాదరబందీ లేకుండా ఎవరో బయటివాళ్లకు బస్సును అప్పజెపితే సరిపోతుందని, వారికి ప్రతిఫలం చెల్లించామని తలపోశారు. అయితే వారికి చెల్లించబోయే ప్రతిఫలం ప్రజాధనం నుంచి దోచిపెట్టడమే. బస్సు కొని, అదికూడ చేతిలోంచి డబ్బు పెట్టకుండా ఫైనాన్స్ మీద కొని, డ్రైవర్–కండక్టర్‌ను మాత్రం నియమించినందుకు ఇవ్వవలసినదానికన్న చాల ఎక్కువ ఇస్తారన్నమాట. కొంతకాలంతర్వాత ఆ ప్రైవేటు బస్సు యజమానులు మరింతగా బలపడి ఆర్టీసీని కూడ తమకు అమ్మమని అడిగే స్థితికి వస్తారు.

అలా ప్రైవేటు బస్సు యజమానుల ప్రయోజనాలు, బస్సుల నిర్మాణ సంస్థల ప్రయోజనాలు, పాలకుల ప్రయోజనాలు, ప్రపంచబ్యాంకు ఆదేశాలు కలగలిసిపోయి, మన రాష్ట్రంలో అద్దె బస్సుల విస్తరణ పెరుగుతోంది. ఆ క్రమంలో ప్రజాసేవ లక్ష్యాలు శిథిలమవుతున్నాయి. ప్రజాధనం దోపిడీ అవుతోంది. ఈ పరిణామాన్ని ప్రస్తుతం కార్మికులు వ్యతిరేకిస్తున్నారంటే అదేదో వారి సమస్య మాత్రమే కాదు, నిజానికి వారికన్న ఎక్కువగా సమస్య మనందరిదీ, ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థదీ, ఆంధ్రప్రదేశ్ సమాజానిదీ. అది గుర్తించి అద్దెబస్సులను ప్రవేశపెట్టడాన్ని వ్యతిరేకిస్తూ ఆర్టీసీ కార్మికులు జనవరి 3 నుంచి చేపట్టనున్న ఆందోళనకు విస్తృత ప్రజా సహకారం అందించవలసి ఉంది.

***సూర్య, డిసెంబర్ 28, 2007***



# 50

# సెజ్‌ల రద్దులో గోవా దారి

ప్రత్యేక ఆర్థిక మండలాలను రద్దుచేస్తూ, తన పరిధిలో ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేయబోనంటూ గోవా రాష్ట్రప్రభుత్వం చరిత్రాత్మక నిర్ణయం తీసుకున్నది. ఈ విషయంలో గోవా రాష్ట్రప్రభుత్వం తీసుకున్న నిర్ణయం, ప్రజల ఒత్తిడివల్ల తీసుకోక తప్పని నిర్ణయం, ఒక ఆశావహమైన మార్పుకు సంకేతంగా ఉంది.

గోవా మూవ్‌మెంట్ అగెనెస్ట్ సెజ్ (జిఎంఎఎస్) అనే విభిన్న సంస్థల, రాజకీయ పక్షాల ఐక్య సంఘటన గత కొద్ది కాలంగా చేస్తున్న ఆందోళన ఫలించి ప్రభుత్వం ఈ నిర్ణయం తీసుకోక తప్పలేదు. ఈ ఐక్య సంఘటనలో భారతీయ జనతాపార్టీ, గోవా సురాజ్ పార్టీ వంటి రాజకీయ పక్షాలతో పాటు కొన్ని స్వచ్ఛంద సంస్థలు కూడా ఉన్నాయి. ఈ ఐక్య సంఘటన తోపాటే చర్చి సంస్థలకు అనుబంధంగా ఉన్న ఆక్షన్ ఫర్ సోషల్ జస్టిస్ అనే సంస్థ, గోవా బచావ్ అభియాన్ అనే సంస్థకూడ గోవా నుంచి ప్రత్యేక ఆర్థిక మండలాలను పూర్తిగా రద్దుచేయాలని కొంతకాలంగా డిమాండ్ చేస్తున్నాయి.

కొంతకాలంగా సాగుతున్న సెజ్ వ్యతిరేక ఆందోళన డిసెంబర్ చివరి వారంలో తీవ్రరూపం దాల్చింది. భారతీయ జనతా పార్టీ నాయకుడు, మాజీ

పర్యాటకశాఖ మంత్రి మతనీ సల్దానా, జిఎంఎఎస్ నాయకుడు క్రిస్మస్ తర్వాత తమ ఆందోళనను ఉధృతంచేస్తామని, నూతన సంవత్సర ఉత్సవాలకు గోవాకు వచ్చే పర్యాటకులు వెళ్లిపోకపోతే తీవ్రపరిణామాలు ఎదుర్కోక తప్పదని కూడ హెచ్చరించారు. గోవన్లు తమ పిల్లల భవిష్యత్తు కోసమూ, గోవా ప్రత్యేక అస్తిత్వాన్ని కాపాడడం కోసమూ సంవత్సరాది ఉత్సవాలను త్యాగం చేయవలసి ఉంటుందని కూడ ఆయన పిలుపు ఇచ్చారు.

రాష్ట్రంలోని అన్ని ప్రత్యేక ఆర్థిక మండలాలను రద్దుచేయాలని కోరుతూ ఈ ఐక్య సంఘటన డిసెంబర్ 12 న ముఖ్యమంత్రి దిగంబర్ కామత్ కు ఒక విజ్ఞప్తి చేసింది. అప్పటికే రాష్ట్రంలో మొత్తం ఏడు ప్రత్యేక ఆర్థిక మండలాలు ఏర్పాటు చేయాలని ప్రతిపాదించారు. వాటిలో రెండిటి విషయంలో ఉత్తర్వులు కూడ వెలువడ్డాయి గాని, ప్రజా ఆందోళనల వల్ల ఆ పనులు ముందుకు సాగలేదు. ఒకవైపు ఈ ఆందోళన సాగుతుండగానే దక్షిణ గోవాలోని సాంకోలెలో మూడో ప్రత్యేక ఆర్థిక మండలాన్ని ప్రకటిస్తూ ప్రభుత్వ ఉత్తర్వులు వెలువడ్డాయి. ఈలోగా ప్రధాని డా. మన్మోహన్ సింగ్ గోవాలో రెండు రోజుల పర్యటనకోసం రాగా ఆయన పాల్గొన్న సభలలో కూడ నిరసన ప్రదర్శనలు సాగాయి.

ఈ నేపథ్యంలో తమ ప్రభుత్వం ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని సమీక్షిస్తుందనీ, ఆ విషయంలోనే ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి తయారుచేసిన శ్వేత పత్రాన్ని నిశితంగా పరిశీలించి ఒక నిర్ణయం తీసుకుంటుందనీ ముఖ్యమంత్రి అన్నారు.

ఈ వ్యవహారాలన్నీ పరిగణనలోకి తీసుకున్న పాలకపక్షం కాంగ్రెస్ ఒక పరిశీలక బృందాన్ని నియమించింది. ఆ బృందం డిసెంబర్ 29 న ఇచ్చిన తన నివేదికలో గోవాలో ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేయడం గోవా ప్రయోజనాలకు గాని, గోవన్ల ప్రయోజనాలకు గాని ఉపయోగకరం కాదని ప్రకటించింది. దక్షిణ గోవా నియోజకవర్గానికి ప్రాతినిధ్యం వహించే పార్లమెంటు సభ్యుడు, గోవా ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు ఫ్రాన్సిస్కో సర్దిన్హా ఆ బృందం అభిప్రాయాలను పత్రికలకు వెల్లడిస్తూ, సెజ్‌ల వల్ల ఇతర రాష్ట్రాల నుంచి విపరీతంగా గోవాలోకి జనం తరలివచ్చే అవకాశం ఉందని, అందువల్ల రాష్ట్ర పర్యాటక రంగం మీద తీవ్రమైన ప్రభావం కలగవచ్చునని చెప్పాడు. ఇంత పెద్ద ఎత్తున పారిశ్రామికీకరణ జరిగితే గోవాకు ప్రధాన ఆదాయ వనరు అయిన పర్యాటక రంగం దెబ్బతినిపోతుందని అన్నాడు.

ఈ పూర్వరంగంలో గోవన్ల భూమిని పెద్ద ఎత్తున గోవనేతరులకు అమ్మడం, అన్యాక్రాంతం కావడం జరుగుతున్నదని, దాన్ని ఆపివేయాలని గోవా ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కోరింది. ప్రజా అవసరాల కొరకు మినహా ఈ విధంగా పారిశ్రామిక వేత్తల, పెట్టుబడిదారుల అవసరాల కొరకు ప్రభుత్వం భూసేకరణ జరపగూడదని కూడ ప్రదేశ్ కాంగ్రెస్ కోరింది.

చివరికి స్వయంగా ముఖ్యమంత్రి అధ్యక్షతన ఉన్న టాస్క్ ఫోర్స్ ప్రత్యేక ఆర్థిక మండలాలను రద్దు చేయాలని డిసెంబర్ 30న నిర్ణయం తీసుకున్నది. పారిశ్రామికీకరణ ఫలాలను రాష్ట్రానికి అందించాలనే, రాష్ట్రంలోని నిరుద్యోగ యువతకు ఉద్యోగాలు కల్పించాలనే



ఉద్దేశ్యాలతోనే రాష్ట్రంలో ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేయాలనుకుంటే ఆ రెండు పనులూ ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేయకుండా కూడ సాధించవచ్చునని టాస్క్ ఫోర్స్ అభిప్రాయపడింది. అంతేకాక, ప్రత్యక్ష, పరోక్ష పన్నుల మినహాయింపులు, రాయితీల వల్ల కూడ గోవా రాష్ట్రప్రభుత్వం సాధించబోయే ఆదాయం కూడ ఏమీ ఉండబోదని టాస్క్ ఫోర్స్ ప్రకటించింది. ఆదాయం ఏమీ లేకపోగా, ప్రత్యేక ఆర్థిక మండలాలకు అవసరమైన మౌలిక సౌకర్యాలను కల్పించడంకోసం రాష్ట్రప్రభుత్వం అదనపు ఖర్చు కూడ పెట్టవలసి ఉంటుంది, నీరు, విద్యుత్తు కల్పించవలసి ఉంటుంది అని టాస్క్ ఫోర్స్ వ్యాఖ్యానించింది. వేలాది ఎకరాలను సెజ్ లకోసం కేటాయించడం వల్ల నిజంగా పరిశ్రమలు ఏర్పాటు చేయదలచుకున్న వారికి గాని, సాధారణ ప్రజల నివాస అవసరాలకు గాని భూమి దొరకదని కూడ టాస్క్ ఫోర్స్ అంది.

గోవాలో ఒక పాలకపక్ష పార్టీ తీసుకున్న ఈ నిర్ణయం ఇతర రాష్ట్రాలలోని పాలకపక్షాలన్నిటి కళ్లు తెరిపించాలి. నిజానికి మన దేశంలోని రాజకీయ పక్షాలన్నీ ప్రతిపక్షాలుగా ఉన్నప్పుడు అంటున్న మాటలే ఇవి. ప్రత్యేక ఆర్థిక మండలాలవల్ల స్థానిక ప్రజల ప్రయోజనాలేవీ తీరవని, అవి కేవలం దేశదేశాల సంపన్నులకు మన సంపదలు దోచిపెట్టే సాధనాలు మాత్రమేనని రాజకీయ పక్షాలన్నిటికీ కూడ తెలుసు. కాని అధికారంలో ఉన్నప్పుడు ముడుపులు సంపాదించడం కోసమో, తమ ఆశ్రితులకో, కుటుంబ సభ్యులకో వేలాది ఎకరాల భూములు కట్టబెట్టడం కోసమో ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని తలకెత్తుకుంటున్నాయి. ఇవాళ మొదటిసారి గోవా ప్రభుత్వం అధికార పక్షంగా ఉండి కూడ ప్రజల ఒత్తిడి మేరకు నిజాలు అంగీకరించి, ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని వెనక్కి తీసుకున్నది.

ఈ విధంగా ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని ఉపసంహరించే పని ఒక రాష్ట్రంలో కాంగ్రెస్ అయినా చేసింది గాని మిగిలిన పార్టీలేవీ తాము పాలిస్తున్న రాష్ట్రాలలో చేయలేకపోయాయి. పశ్చిమ బెంగాల్, కేరళ, త్రిపుర లలో తప్ప దేశమంతా ప్రత్యేక ఆర్థిక మండలాల విధానానికి వ్యతిరేకంగా మాట్లాడుతున్న వామ పక్షాలు, ప్రత్యేక ఆర్థిక మండలాల కొరకు తమ భూమి లాక్కోవద్దన్న రైతుల ప్రాణాలు బలిగొన్న వామపక్షాలు గోవా ప్రభుత్వం నుంచి నేర్చుకోవలసింది ఎంతో ఉంది.

ప్రత్యేక ఆర్థిక మండలాల వెనుక బహుళజాతిసంస్థలు, దేశదేశాల సంపన్నులు ఉన్నప్పటికీ బలమైన ప్రజాఉద్యమాన్ని నిర్మించగలిగితే ప్రభుత్వం మెడలు వంచి ఉపసంహరించేలా చేయవచ్చునని చూపిన గోవా ప్రజా ఉద్యమం అన్ని రాష్ట్రాలలో సెజ్ లకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలకు ఆదర్శం కావాలి.

**సూర్య, జనవరి 4, 2008**

# 51

# సోషలిజం అనివార్యం - అవసరం - సుసాధ్యం

గత శనివారం నాడు భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) కురువృద్ధుడు జ్యోతి బసు 'ప్రస్తుత సమయంలో సోషలిజం సాధించడం సాధ్యం కాద'ని విస్పష్టంగా ప్రకటించారు. అంతకు రెండు రోజులముందే పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి బుద్ధదేవ్ భట్టాచార్య తమ రాష్ట్రాన్ని పారిశ్రామికీకరించడానికి పెట్టుబడిదారీవిధానమే ఏకైక మార్గమని ప్రకటించారు. ఈ రెండు వ్యాఖ్యలద్వారా తమ నాయకులు సోషలిజాన్ని వదులుకున్నట్టు కాదని, పత్రికలవారు అజ్ఞానంతో అలా చిత్రించారని, తమ నాయకులు కేవలం ప్రస్తుత పరిస్థితుల పరిమితులను మాత్రమే ప్రస్తావించారని ఆ పార్టీ ప్రధాన కార్యదర్శి ప్రకాశ్ కరత్ ఒక వివరణ కూడ ఇచ్చారు.

ఈ వ్యాఖ్యలన్నీ ఈ దేశంలో అమలు కావలసిన సామాజిక, రాజకీయార్థిక విధానం గురించి జరగవలసిన ఒక ముఖ్యమైన చర్చకు తెర తీస్తున్నాయి. స్వయంగా మార్క్సిస్టుపార్టీ నాయకులే నిజం గుర్తించి, సోషలిజం అవసరంలేదని అంటున్నారని పెట్టుబడిదారీమార్గ సమర్థకులు ఒకవైపున చంకలు గుద్దుకుంటున్నారు. పేరులోనే మార్క్సిజం తప్ప అది ఒక పాలకవర్గ పార్టీయేనని తాము ఎంతోకాలంగా చెపుతున్న విషయం నిజమయిందని విమర్శకులు నిర్ధారిస్తున్నారు.



ఈ రాజకీయ వివాదాన్ని పక్కనపెట్టి, సోషలిజం ఒక రాజకీయార్థిక సిద్ధాంతంగా ఈ దేశంలో అనుసరణీయమా కాదా చర్చించవలసి ఉంది. సోషలిజాన్ని అనుసరించడం ప్రస్తుత పరిస్థితులలో సాధ్యం కాదని పావుశతాబ్దిపాటు పనిచేసిన ముఖ్యమంత్రి, ఆధునిక పారిశ్రామిక వైతాళికుడిగా చెప్పుకుంటున్న మరొక ముఖ్యమంత్రి, అందులోనూ ఇద్దరూ మార్క్సిస్టు నాయకులుగా చలామణీ అవుతున్నవారు, అంటున్నారంటే వాళ్ల మాటల అర్థమేమిటో ఆలోచించవలసి ఉంది.

నిజానికి సోషలిజం – సామ్యవాదం – ఒక సమానత్వ సిద్ధాంతంగా మరే సమాజం కన్న ఎక్కువగా భారత సమాజానికి అత్యంత అవసరమైన, అనివార్యమైన సిద్ధాంతం. ఇతర సమాజాలలో మనుషులమధ్య అసమానతలకు నైసర్గిక పరిస్థితులో, మతమో, ఆర్థికస్థితో కారణం కాగా, భారత సమాజంలో అసమానతలకు ప్రధాన కారణం కులం. నైసర్గిక వనరులనో, మతాన్నో, ఆర్థికస్థితినో మార్చుకోవచ్చు గాని, కులాన్ని మార్చుకోవడానికి వీలు లేదు. పైగా పురుషసూక్తం నుంచి మనుస్మృతి, భగవద్గీతల దాకా కులం దైవిక ఆమోదాన్ని కూడ పొందింది. మనుషులను అసమానంగా సృష్టించానని స్వయంగా భగవానువాచ ఉన్నచోట ఆ అసమానతకు సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక పునాది ఉండడం సహజం. సామాజిక పునర్నిర్మాణం జరగాలని కోరుకునే వారెవరయినా తప్పనిసరిగా తమ కార్యక్రమాలకు ఆ అసమానతను తొలగించే, సమానతను స్థాపించే సామ్యవాద సిద్ధాంతాన్ని ప్రాతిపదికగా పెట్టుకోక తప్పదు. సామ్యవాద సిద్ధాంతానికి మినహా మరే సిద్ధాంతానికి కూడ సామాజిక అసమానతలను తొలగించే కార్యక్రమం లేదు. మరీ ముఖ్యంగా పెట్టుబడిదారీ విధానానికి అయితే ఆ కార్యక్రమం ఉండే అవకాశమే లేదు సరిగదా, అసమానతను పెంచి పోషించి సంపదను పిడికెడుమంది చేతిలో కేంద్రీకరించడమే దాని లక్ష్యం. మరి తమను తాము మార్క్సిస్టు నాయకులుగా, అసలు ఈ దేశంలో నిజమైన, ఏకైక మార్క్సిస్టుపార్టీగా భావించుకునే పార్టీ నాయకులుసోషలిజం అవసరంలేదని, పెట్టుబడిదారీ విధానమే శరణ్యమని ప్రకటించడం ఎందువల్ల? నిజానికి భారత సమాజంలో ఆర్థిక అసమానతలను తొలగించడానికి మాత్రమే కాదు, సామాజిక అసమానతలను తొలగించడానికి కూడ సోషలిజం వంటి సిద్ధాంతాన్ని చిత్తశుద్ధితో, సమగ్రంగా అమలుచేయడం అవసరం, అనివార్యం.

ప్రస్తుత పరిస్థితుల్లో పెట్టుబడిదారీ పునాదులమీదనే పారిశ్రామికీకరణ జరిగే అవకాశం ఉందని, అందుకు కారణం పెద్దఎత్తున వనరులను సమీకరించే పని రాజ్యం చేయజాలదని, పరిశ్రమలు నెలకొల్పడానికి అవసరమైన నిధులు ప్రభుత్వం దగ్గర లేవని బుద్ధదేవ్ అన్నారు. ఇవి ఎంత అబద్ధాలో విమర్శకులు ఎవరూ చెప్పనక్కరలేదు. ఇటువంటి మాటలనే గతంలో కాంగ్రెస్ తదితర పాలకపక్షాలు అన్నప్పుడు, ఈ మార్క్సిస్టు పార్టీ నాయకులు, మేధావులే ఆ మాటలను వీరోచితంగా ఎలా ఖండించి, ఏ వాదనలు పెట్టారో వారి గతకాలపు సాహిత్యాన్ని చూస్తే చాలు.

ఇక ప్రస్తుతం కొనసాగుతున్న రాజ్యాంగం ప్రకారం గాని, సామాజిక రాజకీయార్థిక పరిస్థితుల ప్రకారం గాని సోషలిజం సాధ్యం కాదన్న మాటలో కూడ వాస్తవం లేదు. ఎందుకంటే రాజ్యాంగమే సోషలిజాన్ని ప్రవేశికలో భాగం చేసుకుంది. భారత జాతీయోద్యమంలో ప్రగతిశీల

శక్తులు ఈ దేశంలో వలస పాలన అనంతరం సామ్యవాద వ్యవస్థను ఏర్పరచవలసిన అవసరం ఉందని, సామ్యవాదం ద్వారా మాత్రమే ఈ దేశంలో అసమానతలను తొలగించవచ్చునని అభిప్రాయపడ్డాయి. అందువల్లనే మిశ్రమ ఆర్థికవ్యవస్థ భావన, పంచవర్ష ప్రణాళికల రూపంలో ప్రణాళికాబద్ధ ఆర్థికవిధానం వగైరా వచ్చాయి. ఆదేశిక సూత్రాలలో భాగమైన అధికరణం 38, 39లు సుస్పష్టంగా సోషలిజం మౌలిక సూత్రాలను ప్రతిపాదించాయి. అధికరణం 38 సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయం గురించీ, సమానత్వం గురించీ మాట్లాడింది. అధికరణం 39 "సామాజిక భౌతిక వనరులపై యాజమాన్యం, అదుపు, ఉమ్మడి ప్రయోజనాలకు అనుగుణంగా పంపిణీ జరగాల"ని, "సంపద, ఉత్పత్తి సాధనాలు కొందరి చేతుల్లోనే కేంద్రీకృతమై ఉమ్మడిప్రయోజనాలు దెబ్బతినకుండా ఆర్థిక వ్యవస్థా నిర్వహణ జరగాల"ని సోషలిజం సూత్రాలను ప్రకటించింది. రాజ్యాంగంలోని ఇటువంటి ఆదర్శాలకు పాలకవర్గాలు తూట్లు పొడిచాయనేది అందరికీ తెలిసిన సత్యమే. ఇవాళ మార్క్సిస్టు పార్టీ కూడ ఈ ఆదర్శాలను వదిలివేస్తానని బహిరంగంగా ప్రకటిస్తున్నదన్న మాట.

నిజానికి మార్క్సిస్టు పార్టీ గాని, మరే పార్టీగాని, నిజమైన ప్రజల ప్రత్యామ్నాయంగా మారలేకపోయినా, పార్లమెంటరీ పాలకవర్గాలలోపలే ప్రత్యామ్నాయ విధానాలను ఎంతో కొంత మేరకు అమలు చేయడానికి రాజ్యాంగంలోనే, చట్టాలలోనే అవకాశం ఉంది. కేంద్ర ప్రభుత్వం తమ పనులకు అడ్డుపడుతోందనో, తమచేత ఇష్టంలేని పనులు చేయిస్తోందనో ఇన్నాళ్లుగా వామపక్ష నేతలు చెపుతున్న మాటలు కూడ అవాస్తవాలే. ఎందువల్లనంటే, రాష్ట్ర ప్రభుత్వాలకు అంత చిత్తశుద్ధి ఉంటే కనీసం రాష్ట్రాల జాబితాలోని పనుల పరిధిలోనయినా ప్రజా సంక్షేమ కార్యక్రమాలు అమలు చేయవచ్చు. కాని వామపక్షాలు ఆ రాష్ట్రాల జాబితా పనులను, తాము చేయగలిగిన పనులను కూడ చేయకుండా ఉండిపోయాయి. సెజ్‌ల ఏర్పాటు, నందిగ్రామ్ మారణ కాండ లలో మార్క్సిస్టుపార్టీ వైఖరి అందరికీ తెలిసిందే.

పైగా, కేంద్రం ప్రవేశపెట్టిన అనేక తప్పుడు, దుర్మార్గ, ప్రజావ్యతిరేక చట్టాలను ఎటువంటి సందేహంలేకుండా అమలు చేశాయి. చివరికి రాష్ట్ర జాబితాలో ఉన్న శాంతి భద్రతల విషయంలోకూడ ఇన్ని గొప్పలు చెప్పుకునే వామపక్ష రాష్ట్రప్రభుత్వాలు 'ప్రజా ఉద్యమాలపై పోలీసుల హింసను ప్రయోగించబోము' అనే అతిచిన్న ప్రజాస్వామిక వైఖరిని కూడ తీసుకోలేదు. 'సోషలిజాన్ని అమలు చేయడం సాధ్యం కాదు, చేయగలిగింది పెట్టుబడిదారీ అభివృద్ధిలోపలే సాంఘిక సంక్షేమ చర్యలు చేపట్టడం' అని జ్యోతి బసు ఇప్పుడు అంటున్నారు గాని, మరి ఆయన అధినాయకత్వం వహించిన ప్రభుత్వం మూడు దశాబ్దాలు గడిచిన తర్వాత, ఒక తరం గడిచిపోయిన తర్వాత, బెంగాల్‌లో అంతగా పేదరికం, నిరుద్యోగం, అవిద్య తాండవిస్తున్నాయంటే వామపక్ష నామాంకితులు తాము చేయవలసిన, చేయదగిన, చేయడానికి అవకాశం ఉన్న పనులను కనీసంగా కూడ చేయలేదన్నమాట. వారుకూడ ఈ ఆరు దశాబ్దాలుగా అధికారంలో సాగుతున్న పాలకవర్గాల తానులోని ముక్కేనన్నమాట.

**సూర్య, జనవరి 11, 2008**



# 52

# ఎవరికోసమీ చిన్నకారు?

టాటా మోటర్స్ లక్ష రూపాయల చిన్నకారు నానో ను విడుదల చేయడం ఒక చరిత్రాత్మక, విప్లవాత్మక పరిణామంగా ప్రచార సాధనాలన్నీ హోరెత్తుతున్నాయి. అభిప్రాయాలు వ్యక్తీకరించగలవాళ్లందరూ, సాధారణంగా కార్ల వినియోగదారులే గనుక ఈ చిన్నకారుతో దేశం ఒక మలుపు తిరగబోతున్నదని, ఇక ఒక్క అంగవేస్తే అమెరికాతో సమానమైపోయినట్టేనని సుభాషితాలు ప్రకటిస్తున్నారు. మాట్లాడలేనివాళ్లు ఈ దేశంలో కోట్లాది మంది గనుక వాళ్లు ఈ కార్ల వరద గురించి ఏమనుకుంటున్నారో తెలియదు. లక్ష అంటే అక్షరాలా లక్ష కాదని, నానో రహదారి మీదికి వచ్చేసరికి పన్నులు వగైరాలన్నీ కలిపి దాని వెల లక్షన్నర అవుతుందని అంకెలు ప్రకటిస్తున్న వారున్నారు. ఇంత పెద్దఎత్తున కొత్త కార్ల ప్రవేశంవల్ల కాలుష్యం పెరుగుతుందని విమర్శిస్తున్న వారూ ఉన్నారు.

ఈ నేపథ్యంలో అసలు ఈ చిన్నకార్ల వల్ల నిజంగా మధ్య తరగతికి లాభమేనా, ఎవరి అవసరాలకొరకు, ఎవరికి మేలు చేకూర్చడానికి వ్యక్తిగత వాహనాలు ఇంతగా ఇబ్బడిముబ్బడిగా మన రహదారులమీదికి వస్తున్నాయి, ఈ కార్లు ప్రకటిత లక్ష్యాలనైనా నెరవేర్చగలవా, అసలు భారత ఆర్థిక వ్యవస్థ ప్రాధాన్యతలలో కార్ల స్థానం ఏమిటి వంటి విషయాలు ఆలోచించవలసి ఉంది.

నూతన ఆర్థిక విధానాల తర్వాత, విదేశీ కార్ల కంపెనీలను దేశంలోకి ఏ ఆంక్షలు లేకుండా ఆహ్వానించడం, కొత్త కొత్త రకాల కార్లు మన మార్కెట్లలోకి ప్రవేశించడం, కార్లు కొనుక్కోవడానికి విపరీతంగా రుణాలు ఇచ్చే దేశీ విదేశీ ద్రవ్య సంస్థలు మారుమూల పట్టణాలలో కూడ దుకాణాలు తెరిచి కాస్త డబ్బున్నవాళ్లందరినీ ఆకర్షించడం, కార్ల ధరల మీద రాయితీలు, తగ్గింపులు, తక్కువ వడ్డీలకు రుణాలు వంటి సౌకర్యాలు కల్పించడం వంటి అనేక కార్యక్రమాల వల్ల దేశంలో కార్ల వినియోగం విపరీతంగా పెరిగిపోయింది. నిజానికి 1992 నుంచి 2005 మధ్య దేశంలో జాతీయోత్పత్తి పెరుగుదల సాలీనా సగటున ఎనిమిది శాతం దాటకపోగా అదేకాలంలో కార్ల ఉత్పత్తి అంతకు మూడురెట్ల కన్న ఎక్కువ పెరుగుదలను, దాదాపు 30 శాతం పెరుగుదలను చూపింది. అంటే సంపద పెరుగుదలలో అతి ఎక్కువ వాటాను కార్ల తయారీ పరిశ్రమ తన కైవసం చేసుకున్నదన్నమాట.

ఈ కార్ల ఉత్పత్తి ఎంత ఎక్కువగా ఉన్నదంటే 2001-02 ఆర్థికసంవత్సరంలో 6,69,719 కార్లు తయారు కాగా, ఐదుసంవత్సరాలు తిరగకుండానే 2005-06 ఆర్థికసంవత్సరంలో 13,08,913 కార్లు తయారయ్యాయి. దేశ ఆర్థిక వ్యవస్థలో మొత్తంగా గాని, మధ్య తరగతి ఆదాయంలో గాని ఈ ఐదు సంవత్సరాలలో పెరుగుదల రెట్టింపు కాలేదు. కాని కార్ల ఉత్పత్తి రెట్టింపు జరిగిందంటే, మరొక రంగానికి వెళ్లవలసిన నిధులు ఈ రంగంలోకి ప్రవహించాయని అర్థం. ఈ కార్లతయారీ రంగంలో వ్యాపారం ఎంత పెద్ద ఎత్తున జరిగిందంటే 2002-03లో అరవై వేల కోట్ల రూపాయల కన్న తక్కువగా ఉండిన వ్యాపారం మరుసటి సంవత్సరం లక్ష కోట్ల రూపాయలు దాటింది. ఈ రంగంలో ఉన్న లాభాల రేటును బట్టి చూస్తే కార్ల ఉత్పత్తిదార్లకు, పంపిణీదార్లకు, దుకాణదార్లకు కలిసి కనీసం ముప్పై వేల కోట్ల రూపాయల మిగులు చేకూరిందనుకోవాలి.

సాలీనా ఈవిధంగా కైంకర్యం చేసున్న ముప్పైవేల కోట్ల పైన లాభాలలో సింహభాగం ఉత్పత్తిదార్లదే. వాళ్లు టాటా మోటర్స్, మారుతీ ఉద్యోగ్, జనరల్ మోటర్స్ ఇండియా, ఫోర్డ్ ఇండియా, ఐషర్ మోటర్స్, బజాజ్ ఆటో, హిందుస్తాన్ మోటర్స్, సుజుకి, ఫోక్స్‌వాగెన్, స్కోడా ఆటో, బిఎండబ్ల్యు, మెర్సిడిస్, నిస్సాన్, హ్యుండాయి, టొయొటా, మహీంద్రా, రెనాల్ట్, షెవర్లె, మిట్సుబిషి, ఫియట్ మొదలయిన బహుళజాతి సంస్థలు, లేదా స్వదేశీ సంస్థలతో ఒప్పందాలు చేసుకున్న విదేశీ సంస్థలు. అంటే మన మధ్య తరగతి తమ ప్రయాణ సౌకర్యం కోసం అని భ్రమపడుతూ కొనుక్కుంటున్న కార్ల వల్ల వాళ్లకు ఎంత సౌఖ్యం చేకూరుతున్నదో తెలియదుగాని ఈ స్వదేశీ, విదేశీ పెట్టుబడిదార్ల బొక్కసాలు మాత్రం పొంగి పొర్లుతున్నాయన్నమాట.

కార్ల పరిశ్రమ అభివృద్ధి చెందాలంటే దానికి మంచి రహదారులు, పెట్రోలు, డీజిల్ వంటి ఇంధనాలు, సర్వీసింగ్ స్టేషన్లు, నిపుణులైన మెకానిక్కులు, రహదారుల పక్కన హోటళ్లు, మోటెళ్లు వంటి ఎన్నో వసతులు ఏర్పడవలసి ఉంటుంది. ఈ వసతులు కల్పించడానికి మరెన్నో నిధులు అవసరమవుతాయి, చాల ప్రజాధనం వెచ్చించవలసి వస్తుంది. ఈ వసతుల కల్పనలో



కూడ విదేశీ ఇంధన కంపెనీలు, బహుళజాతిసంస్థలు, కన్సల్టెంట్ల దగ్గరినుంచి కాంట్రాక్టర్ల దాకా ఆ ప్రజాధనాన్ని తమ బొక్కసాలలో నింపుకుంటారు. మొత్తం మీద చెప్పాలంటే కార్లు విపరీతంగా ప్రవేశించడం వల్ల అవి ఎవరికి ప్రయాణసౌకర్యం కల్పించడంకోసం అనే ప్రకటితలక్ష్యంతో వస్తున్నాయో అది కనుమరుగయిపోయి, లేదా పలచబడిపోయి, ఎక్కువ ప్రజాధనం అనవసర రంగాల మీద వినియోగం, ప్రైవేటు సంస్థలకు, వ్యక్తులకు లాభాలు సమకూర్చిపెట్టడం అనే లక్ష్యం మాత్రం మిగులుతుంది.

ఇక మరొకవైపు నుంచి చూస్తే, ఒకవేళ కొనగలిగిన వాళ్లందరికీ కార్లు ఇవ్వాలనే ఆలోచన ఉన్నా, ప్రస్తుతం కార్ల ఉత్పత్తి సంఖ్యను బట్టి చూస్తే, ఇంకొక పది సంవత్సరాలు గడిచినా దేశ జనాభాలో పది శాతం మందికి మించి కార్లు అందుబాటులోకి వస్తాయా అనేది సందేహాస్పదమే. అంటే వందకోట్లకు మించిన జనాభాలో కేవలం పది శాతం మంది అవసరాలను తీర్చడానికి మాత్రమే ఈ కార్ల ఉత్పత్తి విధానం ఉద్దేశించిందన్నమాట. అనేక మార్కెట్ సర్వేలు అంచనావేస్తున్నట్టు ఈదేశంలో కొనుగోలు శక్తి ఉన్న మధ్య తరగతి దాదాపు ఇరవైకోట్ల మంది (నాలుగుకోట్ల కుటుంబాలు) ఉన్నారని అనుకున్నా, వాళ్లందరూ తలా ఒక కారు కొనుక్కున్నా అది మొత్తం దారిద్ర్య మహా సముద్రంలో అక్కడక్కడ ఒంటరి ద్వీపాలను సృష్టించడమే అవుతుంది తప్ప నిజంగా సామాజిక అభివృద్ధికి చిహ్నం కాదు.

ఇక ప్రకటిత లక్ష్యం గురించి ఆలోచిస్తే, నిజంగానే మన మధ్యతరగతి కుటుంబాలకు జీవన ప్రమాణాల పెరుగుదలలో భాగంగా కారు అవసరంలేదా, దాన్ని అద్దుకోవడం మంచిదేనా అనే ప్రశ్న తలెత్తుతుంది. ఆ ప్రశ్నలో కొంత వాస్తవం కూడ ఉంది. కాని జీవనప్రమాణాల మెరుగుదలకు సూచిక సొంత వాహన వినియోగమేనా? జీవన ప్రమాణాల మెరుగుదల ఎప్పుడయినా వ్యక్తిగతంగా సాధించగలిగినదీ, సాధించవలసినదీ కాదు. ప్రమాణాల మెరుగుదల తప్పనిసరిగా సామూహికంగా ఉన్నప్పుడే అర్థవంతమవుతుంది. వేలాదిమందికి కనీస జీవన ప్రమాణాలు కూడ లేని స్థితిలో, కూడు గూడు గుడ్డ కూడ కరువైన స్థితిలో, ఒక కుటుంబం తనకు సొంత వాహనం కావాలని అనుకోవడం, ఆ కుటుంబానికి ఆ ఆర్థిక వనరులు ఉన్నప్పటికీ, అసహజమే.

అసలు మొత్తం దేశ, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలవైపునుంచి చూసినప్పుడు ప్రజారవాణా వ్యవస్థను ఒకవైపు బలహీన పరుస్తూ, మరొకవైపు సొంత వాహనాల వ్యవస్థను ఈ విధంగా బలపరచడం ప్రజాద్రోహం. నాలుగు కుటుంబాలకు మాత్రం ఉపయోగపడే నాలుగు కార్లు తయారు చేయడానికి ఎన్ని వనరులు అవసరమవుతాయో అన్నే వనరులతో ఒక ప్రజారవాణా బస్సును తయారుచేయడం ద్వారా నాలుగైదు రెట్లు ఎక్కువమంది ప్రయాణ అవసరాలు తీర్చవచ్చు. కార్ల ఉత్పత్తిదారు ఫోర్డ్ సలహామేరకు అమెరికా ప్రభుత్వం అంత విశాల దేశంలో రైలుమార్గాల నిర్మాణాన్ని ఆపివేసి, రహదార్లు నిర్మించి, బకాసుర ఇంధనదాహంలో పడి ఇవాళ ఎక్కడికి చేరిందో చూస్తున్నాం. మనమూ ఆదారిలో నడవవలసిందేనా?

**సూర్య, జనవరి 18, 2008**

# 53

# అమెరికాలో తుమ్మితే...

సోవియట్ యూనియన్ బాగున్న రోజుల్లో, ముఖ్యంగా 1940, 50 దశకాల్లో, ఇక్కడి కమ్యూనిస్టులు సోవియట్ విధానాలను గుడ్డిగా అనుకరిస్తారని ఒక విమర్శ ఉండేది. రష్యాలో వర్షం పడుతుంటే ఇక్కడ కమ్యూనిస్టులు గొడుగులు పడతారని వెటకారం ఉండేది. అలాగే 1960 ల చివర నక్సల్బరీ పంథా నాయకులు కొందరు "చైనా చైర్మనే మా చైర్మన్" అనే హాస్యాస్పద నినాదం ఇచ్చి ఈ దేశ రాజకీయార్థిక విధానాల మీద విదేశీ పరిణామాల, శక్తుల ప్రభావం ఎంతగా ఉంటుందో ప్రకటించారు. వాళ్ల వైఖరిని సమకాలీనంగానూ, ఇప్పటికీ విమర్శిస్తున్న వాళ్లు ఎందరో ఉన్నారు. అయితే, కమ్యూనిస్టులు ఎంత చేసినా, కేవలం తమ శ్రామికవర్గ అంతర్జాతీయతను ఒక సైద్ధాంతిక స్థాయిలో ప్రకటించారే గాని, రోజువారీ కార్యకలాపాలలో అంత లోతయిన విదేశీ జోక్యం ఉన్నట్టు కనిపించదు.

కాని 1991 తర్వాత సాగుతున్న ప్రపంచీకరణ, నూతన ఆర్థిక విధానాల పాలనలో మన ప్రభుత్వాలు, ద్రవ్యసంస్థలు, అధికార యంత్రాంగం సాగించే రోజువారీ కార్యక్రమాల్లో కూడ అమెరికన్ ప్రభుత్వమో, అంతర్జాతీయ ద్రవ్యసంస్థలో, బహుళజాతిసంస్థలో ఇచ్చే ఆదేశాలు పనిచేస్తున్నాయి. కమ్యూనిస్టుల "విదేశీ దాస్యం" గురించి ఇన్నాళ్లూ ఇల్లెక్కి అరిచిన వాళ్లందరూ



ఇప్పుడూ వందలరెట్ల విదేశీ దాస్యం చేస్తున్నారు. గత పదిహేడు సంవత్సరాలలో దేశాన్ని పాలించిన అన్ని పార్టీలూ – అటు చివర మతోన్మాద పార్టీలుగా పేరుపడిన భాజపా, శివసేనల దగ్గరినుండి, తమనుతాము కమ్యూనిస్టులుగా పిలుచుకునే పార్లమెంటరీ వామపక్ష పార్టీల వరకు, దేశంలో వయసులో అతిపెద్దదయిన కాంగ్రెస్ నుంచి అతి చిన్నవయిన ప్రాంతీయ పార్టీల వరకు అన్ని రాజకీయ పక్షాలూ ఈ అమెరికా అనుకూలతను, దాస్యాన్ని బహిరంగంగా నిస్సిగ్గుగా కొనసాగిస్తూ వచ్చాయి. బైటి మద్దతుతో సాగిన కాంగ్రెస్ మైనారిటీ ప్రభుత్వం (1991–96), కాంగ్రెస్, సిపిఐ(ఎం) బైటినుంచి మద్దతు ఇచ్చిన ఏడుపార్టీల యునైటెడ్ ఫ్రంట్ (1996–98), 13 పార్టీల కూటమి నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్ (1999–2004), నాలుగు వామపక్ష పార్టీలు, బహుజన సమాజ్ పార్టీ, మరికొన్ని చిన్నపార్టీలు బయటి నుంచి మద్దతు ఇస్తున్న 12 పార్టీల యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్ (2004) – అన్ని ప్రభుత్వాలూ అమెరికన్ ప్రభుత్వమో, పాలకవర్గాలో, బహుళజాతిసంస్థలో కోరుకున్నట్టుగానే భారత ప్రభుత్వాన్ని నడపడానికి ప్రయత్నించాయి.

ఈ మాట ఏదో గిట్టని విమర్శకులు అంటున్నారని అనుకోకుండా ఉండేందుకు తాజా ఆధారంగా స్వయంగా కేంద్ర ఆర్థికమంత్రి, ప్రభుత్వం, జాతీయ ద్రవ్యసంస్థలు అప్రూవర్ సాక్ష్యం ప్రకటిస్తున్నారు. భారతీయ స్టాక్‌మార్కెట్ల పతనంతో, ముఖ్యంగా బొంబాయి స్టాక్ మార్కెట్‌లో ముప్పై ముఖ్యమైన షేర్లతో తయారయిన సెన్సెక్స్ భారీగా నష్టపోవడంతో ఆర్థికరంగ నిపుణులు ఎంతోమంది ఇదంతా అమెరికన్ ఆర్థిక వ్యవస్థలో జరిగిన పరిణామాల ఫలితమే నంటున్నారు. భారతీయ స్టాక్ మార్కెట్ జనవరి రెండోవారం నుంచీ ఒడిదుడుకులకు లోనవుతూ వచ్చి సోమవారం భారీ పతనాన్ని చవిచూసింది. గత ఐదారు నెలలుగా పైపైకి దూసుకుపోతూ ఇరవైవేల పాయింట్లను దాటిన సెన్సెక్స్ ఒక్కసారిగా 1400 పాయింట్లకు పైగా నష్టపోయింది.

నిజానికి భారతఆర్థికవ్యవస్థలో ఈ వారం పదిరోజుల్లో అంత పెద్ద ఎత్తున చెప్పుకోదగిన పరిణామాలేమీ సంభవించలేదు. అంతేకాదు, భారతీయ పారిశ్రామిక, వ్యాపార సంస్థల మూడో త్రైమాసిక ఆర్థిక ఫలితాలు స్థూలంగా మెరుగ్గానే ఉన్నాయి. మరి అటువంటప్పుడు భారతీయ స్టాక్ మార్కెట్ మొత్తంగాగాని, సెన్సెక్స్ గాని ఇంతగా సంక్షోభంలో పడడానికి హేతుబద్ధమైన కారణమేదీ ఉండడానికి వీలులేదు. అయినా ఒక్కరోజున సెన్సెక్స్ అంతగా పతనమయింది. ఆ పతనానికి కారణమయిన విదేశీ మదుపుదార్లు తమ పెట్టుబడులను ఉపసంహరించుకుని బాగుపడగా, చిన్నా పెద్దా దేశీయ మదుపుదార్లెందరో నష్టపోయారు.

ఈ పతనం గురించి చెప్పుకోవలసిన విషయాలు చాల ఉన్నాయి గాని ఇక్కడ ప్రస్తుతానికి రెండు మూడు ముఖ్యమైన అంశాలు మాత్రం గుర్తించాలి.

నూతనఆర్థికవిధానాలను ప్రారంభిస్తున్నప్పుడు దేశీయ, అంతర్జాతీయ ఆర్థిక రంగ నిర్వాహకులందరూ భారతీయ ఆర్థిక వ్యవస్థను అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థతో సమ్మిళితం చేసినందువల్ల దేశ ఆర్థిక వ్యవస్థకు ఏవో లాభాలు ఒనగూడుతాయని ప్రకటించారు. గత పదిహేడు సంవత్సరాల అనుభవంలో లాభాలు ఏమైనా చేకూరిఉంటే అవి పిడికెడు మంది సంపన్నులకు, మధ్య తరగతిలో పైపొరకు మాత్రం అందాయి గాని, నష్టాలు మాత్రం

ఇబ్బడిముబ్బడిగా దేశప్రజల మీద, దేశ ఆర్థిక వ్యవస్థ మీద దాడి చేస్తున్నాయి. ఆ దాడికి తాజా ఉదాహరణ ఈ సెన్సెక్స్ పతనం. అమెరికన్ ఆర్థిక వ్యవస్థలో జరిగిన నాలుగైదు పరిణామాలు – ప్రధానంగా అక్కడి పెరుగుదల రేటు తగ్గడం, దాన్ని సవరించడానికి పన్నుల విధానంలో చేసిన మార్పులు, అక్కడ ద్రవ్యోల్బణం పెరగవచ్చునన్న భయాలు, అమెరికాలో ఒక ద్రవ్యసంస్థ రేటింగ్ పడిపోవడం – మన ఆర్థిక వ్యవస్థ మీద ఎందుకు ప్రభావం చూపాలి? ఈ రెండు దశాబ్దాలలో సరళీకరించిన మన ద్రవ్య విధానాల వల్ల మన స్టాక్ మార్కెట్లలో విదేశీ మదుపు సంస్థల ప్రాబల్యం పెరిగిపోయింది. ఆ విదేశీ మదుపు సంస్థలు తమ లాభాల దృష్టితోనే ఇక్కడ మదుపు పెడుతున్నాయి తప్ప మన ఆర్థిక వ్యవస్థను ఆదుకోవడానికీ కాదు, ఆ నిధులను వాడుకొని మనం బలపడడానికీ కాదు. ఎక్కడ ఒక్క సెంటు ఎక్కువ లాభం వస్తుందంటే అక్కడికి క్షణాల్లో ఎగిరిపోవడానికి వీలుగా పోర్ట్ ఫోలియో పెట్టుబడుల రూపంలో భారతీయ స్టాక్ మార్కెట్లలో ఈ విదేశీ ద్రవ్యసంస్థల పెట్టుబడులున్నాయి. అసలు ఈ పెట్టుబడి కాలునిలవని పెట్టుబడి. అమెరికాలో మబ్బులు కమ్ముతున్నాయంటే ఇక్కడ గొడుగుపట్టే పెట్టుబడి, ఇక్కడినుంచి మరెక్కడికి పరుగెత్తుదామా అని చూసే పెట్టుబడి. అటువంటి పెట్టుబడిని ఏ ఆంక్షలూ, షరతులూ, నిబంధనలూ లేకుండా రానివ్వడమే మన ఆర్థిక వ్యవస్థ నిర్వాహకులు చేసిన తప్పు. అటువంటి తప్పే తూర్పు ఆసియా దేశాలు ఎంతోకాలంచేసి పది సంవత్సరాల కింద ఒక్కసారిగా ఘోరంగా చతికిలపడ్డాయి. అటువంటి దుష్ఫలితమే ఇప్పుడు దలాల్ స్ట్రీట్ లో కనబడుతున్నది.

ఇతర మదుపులన్నిటికన్న స్టాక్ మార్కెట్లో మదుపు ఎక్కువ ఫలితాన్నిస్తుందనే అపోహను పెద్ద ఎత్తున ప్రచారం చేసినందువల్ల ఎంతో మంది మధ్యతరగతి, ఉద్యోగవర్గాలు తాము అష్టకష్టాలుపడి సంపాదించిన కొద్దిపాటి నిధులను షేర్లమీద పెట్టడానికి ఉత్సాహపడుతున్నారు. అసలు స్టాక్ మార్కెట్ ఇప్పుడు నడుస్తున్న పద్ధతి జూదంతో సమానంగా ఉన్నది గనుక ఇటువంటి చిన్న మదుపుదార్లు నష్టపోవడం, వారి పెట్టుబడులన్నీ పెద్దలచేతికి చేరడం జరుగుతోంది. అయితే ఈ నష్టం ఎంత అన్నది కూడ కాకి లెక్కలే తప్ప కచ్చితమైన లెక్కలు ఎవరయినా చెప్పగల స్థితిలేదు. మొన్నటి పతనం గురించి ఒక్కరోజు ఆరులక్షలకోట్ల రూపాయల నష్టం జరిగిందని లెక్కలు వేస్తున్నారు గాని అది కేవలం ఊహ మాత్రమే. సెన్సెక్స్ లో ఉన్న మొత్తం షేర్ల సంఖ్యతో అదికోల్పోయిన 1400 పాయింట్లను గుణిస్తే వచ్చే అంకె ఇది. నిజానికి అందరికందరూ అమ్మజూపినప్పుడు సెన్సెక్స్ ఇరవైవేల స్థాయిలో ఉండదు. కొనుగోలు ఒత్తిడి పెరిగినప్పుడు ధర పెరగడం, అమ్మకాల ఒత్తిడి పెరిగినప్పుడు ధర తగ్గడం మామూలే. ధర తగ్గుదలను ఒక స్థాయి దగ్గర ఆపి ఇలా గుణించి ఊహాత్మక అంకెకు రావడం సందేహాస్పదం. “మా చచ్చిపోయిన గొడ్డిగేదె రోజుకు పన్నెండు లీటర్ల పాలు ఇచ్చేది, ఎంతలేదన్నా రోజుకు వందరూపాయలు మిగిలేది. ఈ ఆరునెలల్లో ఇరవైవేలు నష్టపోయాను” అన్నట్టుగా ఉంటుందిది. సరిగ్గా ఇట్లాగే మన స్టాక్ మార్కెట్ కూడ జూదక్రీడకు సహజమైన భయాలు, అనుమానాలు, అబద్ధాలు, పిచ్చిమాటలు, శకునిపాచికలు, ఆత్మగౌరవం తాకట్టు అన్నిటితో సాగుతున్నది.

***సూర్య, జనవరి 25, 2008***



# 54

# గ్రామీణాభివృద్ధి అంటే ఏమిటి?

భారత జాతీయోద్యమానికి నాయకత్వం వహించిన వారిలో ఎక్కువ మంది పట్టణ మధ్యతరగతి విద్యావంతుల వర్గం నుంచి వచ్చినవారే అయినప్పటికీ భారతదేశం ప్రధానంగా వ్యవసాయ దేశమని, గ్రామీణ సమాజమని వారికి గుర్తింపు ఉండింది. ‘భారతదేశం గ్రామాలలోనే నివసిస్తుంది’ అని చెప్పి గ్రామస్వరాజ్ తన లక్ష్యంగా ప్రకటించిన గాంధీ గాని, ఉత్తరాది గ్రామీణ జీవితం గురించి ఎక్కువగా రాసిన నెహ్రూ గాని స్వాతంత్ర్యానంతర భారతదేశంలో గ్రామాల ప్రాధాన్యతను గుర్తించారు. ఇవాళ్టికీ దేశంలో 70 శాతం జనాభా వ్యవసాయం మీదనే ఆధారపడి గ్రామాలలో నివసిస్తున్నదంటే 1947కు ముందరి స్థితి అర్థం చేసుకోవచ్చు.

అందువల్లనే వలస పాలన ముగిసిపోగానే ఏర్పడిన ప్రభుత్వాలన్నీ గ్రామీణాభివృద్ధి గురించి ఆలోచించడం ప్రారంభించాయి. ఈ అరవై ఏళ్లలో గ్రామీణాభివృద్ధి ప్రభుత్వాల ప్రధాన ప్రకటిత లక్ష్యంగా ఉంటూ ఉన్నది. పంచవర్ష ప్రణాళికలలో వ్యవసాయాభివృద్ధిగాని, సహకార రంగాల అభివృద్ధి గాని, సామాజికాభివృద్ధి పథకాలు గాని, నీటి పారుదల, గ్రామీణ విద్యుదీకరణ, గ్రామీణ రహదారులు, ప్రాథమిక విద్యా, వైద్య, ఆరోగ్య సౌకర్యాలు వంటి

అన్ని పాలనాపరమైన చర్యలు, ఆలోచనలు గ్రామీణాభివృద్ధినే లక్ష్యంగా పెట్టుకున్నాయి. ఆ గ్రామీణాభివృద్ధికి ప్రభుత్వం పెట్టుకున్న లక్ష్యాలు గాని, ప్రమాణాలు గాని, సూచికలు గాని ఆరు దశాబ్దాల తర్వాత కూడా సంపూర్ణంగా నెరవేరలేదు. ఇంతకూ ప్రభుత్వం ప్రకటించిన గ్రామీణాభివృద్ధి లక్ష్యాలతో, ప్రమాణాలతో, సూచికలతో, అసలు తాత్విక దృక్పథంతోనే చాల సమస్యలు ఉన్నాయి.

గ్రామీణాభివృద్ధి గురించి పాలకులు ఆరు దశాబ్దాలకు పైగా మాట్లాడుతున్నప్పటికీ గ్రామీణాభివృద్ధి నిర్వచనం ఏమిటనేది ఇప్పటికీ స్పష్టంగా లేదు. గ్రామీణాభివృద్ధి అనగానే అంకెలలో ఎన్ని కిలోమీటర్ల రహదారులు, ఎన్ని ఎకరాల సాగు, ఎన్ని ఎకరాలకు కొత్తగా నీటి పారుదల సౌకర్యం, ఎన్ని పాఠశాలలు, ఎన్ని ప్రాథమిక వైద్య కేంద్రాలు, ఎంత అక్షరాస్యత వంటి గణాంకాలు ప్రకటించడమే ప్రభుత్వ శాఖలు చేస్తున్నాయి. నిజానికి మానవాభివృద్ధిని సంపూర్ణంగా అంకెలలో, అంకెల ద్వారా గ్రహించగలమా అనేది ప్రధానమైన ప్రశ్న.

ఆ ప్రశ్నను కాసేపు పక్కన పెట్టినా గ్రామీణాభివృద్ధి అనే పద బంధంలో గ్రామం, అభివృద్ధి అనే రెండు మాటలు ఉన్నాయి. ఈ రెండు మాటలను భారత పాలక వర్గాలు ఎలా అర్థం చేసుకున్నాయి, ఎలా నిర్వచిస్తున్నాయి అనేది లోతుగా పరిశీలించవలసి ఉంది.

పాలకుల దృష్టిలో గ్రామం అంటే కొంత మంది మనుషులు ఉండే ఒక ప్రాంతం మాత్రమే. గ్రామానికి ఇటువంటి నిర్వచనం ఇవ్వడం వల్ల ఆ మనుషులకు కాస్త విద్య, కాస్త వైద్యం, కాస్త తాగునీరు, సాగునీరు, కొన్ని వినోద, విజ్ఞాన అవసరాలు తీరిస్తే గ్రామం అభివృద్ధి సాధించినట్టే అనే భావన పాలకులలోనూ, అధికారవర్గంలోనూ ఉంది. గ్రామం అంటే ఒక ప్రాంతంలో కొందరు మనుషులు నివసించడం అన్నంత వరకు సరైనదే కాని, ఆ మనుషులు, ముఖ్యంగా మన సమాజంలో కుల అంతరాల నిచ్చెన మెట్ల వ్యవస్థలో ఉన్నారు. వారిలో కొందరి పట్ల అస్పృశ్యత కూడా అమలవుతున్నది. వారిలో అత్యధిక సంఖ్యాకులకు తమవైన వనరులు లేవు. అందువల్ల జీవనోపాధి కొరకు ఇతరుల మీద ఆధారపడి వారి దయాదాక్షిణ్యాల మీద బతకవలసి వస్తున్నది. ఆ వనరులను హక్కుభుక్తం చేసుకున్నవారు అత్యధిక సంఖ్యాకులకు జీవన అవకాశాలేవీ అందకుండా నిరోధిస్తున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే గ్రామంలో ఉండే సమాజం సంఘర్షణామయంగా ఉంది. ఈ సంఘర్షణను తొలగించకుండా ఆ మనుషుల అభివృద్ధి గురించి మాట్లాడడం అసాధ్యం.

అట్లాగే గ్రామం అన్నప్పుడు ఆ గ్రామంలో నివసించే మనుషుల అవసరాలు తీర్చడానికి ఉపయోగపడే వనరులు చాలా ముఖ్యమైనవి. దేశంలోని వైశాల్యం వల్ల, వైవిధ్యం వల్ల అన్ని గ్రామాలలోను వనరులు సమానంగా గాని, సరిపోయినంతగా గాని లేవు. కనుక గ్రామీణాభివృద్ధి గురించి ఆలోచించేటప్పుడు ఏ గ్రామానికి ఆ గ్రామానికి ఉన్న భూమి ఎంత, ఆ భూమి నాణ్యత ఎటువంటిది, ఆ భూమికి నీటి వనరులు ఎటువంటివి, ఆ భూమిలో పండగల పంటలు ఏమిటి, గరిష్ఠ దిగుబడితోనయినా ఆ గ్రామంలోని ప్రజల అవసరాలను తీర్చడం సాధ్యమౌతుందా,



వ్యవసాయంలోని మిగులు ఆదాయాన్ని, వ్యవసాయానికి అవసరం లేని మిగులు మనుషులను ఉపయోగించి వ్యవసాయాధార పరిశ్రమలు పెట్టడం సాధ్యమౌతుందా, గ్రామంలో పని చేయగల శక్తి ఉన్న వారందరికీ ఉద్యోగ కల్పన సాధ్యమౌతుందా, వంటి ప్రశ్నలు వేసుకొని నిర్దిష్టమైన జవాబులు చెప్పుకొని ఆ మేరకు పథక రచన చేయవలసి ఉంటుంది. కాని, ఇప్పటి వరకు గ్రామీణాభివృద్ధి పేరు మీద అమలైన పథకాలన్నీ ఢిల్లీలో తయారై కిందికి వచ్చినవే తప్ప కింద గ్రామంలో వాస్తవ స్థితి ఏమిటో అంచనా కట్టి వాటి ఆధారంగా తయారైనవి కావు. అందువల్ల మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంనుంచి కూడా వేల కోట్ల రూపాయలు, లక్షల కోట్ల రూపాయలు అనే ప్రకటనలు, కేటాయింపులు ఢిల్లీలోనో, రాష్ట్ర రాజధానులలోనో జరగడం, ఆ పథకాలకు కింద గ్రామాలకు ఆచరణ యోగ్యత లేకపోవడం, పైనుంచి కింది దాకా నిర్మాణం అయిన శాఖలకు, అధికారవర్గానికి అవసరమయ్యే ఖర్చులకే ఈ నిధులన్నీ స్వాహా అయిపోవడం జరుగుతూ వచ్చింది.

అందువల్ల ఆరు దశాబ్దాల గ్రామీణాభివృద్ధి అనుభవం తరువాత కొత్తగా ఆలోచించవలసిన అవసరం చాలా ఉంది. రాజకీయార్థికశాస్త్ర పరిభాషలో గ్రామీణాభివృద్ధి గురించి ఆలోచించాలంటే మొదట గ్రామం అనేదాన్ని కొన్ని ఉత్పత్తి శక్తుల, కొన్ని ఉత్పత్తి సంబంధాల సమాహారంగా చూడాలి. ఈ మాటలు కష్టమైన మాటలుగా కనబడవచ్చు గాని, వాటి అర్థం ఏమంటే గ్రామం అనేది ఒక మానవ సమూహం. మానవులు ఏమి చేసినా, ఏమి మాట్లాడినా, పాడినా, రాసినా మొట్టమొదట తినవలసి ఉంటుంది. అంటే ఉత్పత్తి చేయవలసి ఉంటుంది. ఈ ఉత్పత్తి చేయడానికి కొన్ని సాధనాలను ఉపయోగించవలసి ఉంటుంది. ఆ సాధనాలలో భూమి, నీరు వంటి సహజ సాధనాలు ఉండవచ్చు, నాగలి, గడ్డపార, ఎరువులు వంటి మానవ శ్రమతో తయారైన సాధనాలు ఉండవచ్చు. ఈ ఉత్పత్తి సాధనాలను ఉపయోగించి ఉత్పత్తిని సాధించే ఉత్పత్తి శక్తులలో మనుషులు కూడా భాగమే. మనుషులు ప్రధానం. అయితే మనుషులు కూడా ఒంటరిగా ఈ ఉత్పత్తిని సాధించలేరు. తప్పనిసరిగా సామూహికంగా, శ్రమవిభజనతో, ఒక్కొక్కరు ఒక్కొక్క రంగంలో నైపుణ్యం సంపాదించి ఈ ఉత్పత్తి సాగిస్తారు. మౌలికంగా, సామూహికంగా మాత్రమే ఉండే ఈ ఉత్పత్తి క్రియలో పాల్గొంటున్న వారి మధ్య సంబంధాలు ఏర్పడతాయి. ఆ ఉత్పత్తి సంబంధాల పునాది పైననే సమాజం నిర్మాణం అవుతుంది. సమాజం వికసిస్తున్న కొద్దీ ప్రత్యక్ష ఉత్పత్తిలో పాల్గొనని ఒక చిన్న సమూహం కూడా ఏర్పడుతుంది కాని, వారిలో వారికి గాని, వారికీ ప్రత్యక్ష ఉత్పత్తిదారులకూ మధ్య గాని ఉండే సంబంధాలను కూడా ఉత్పత్తి సంబంధాలే నిర్ణయిస్తాయి.

ఏ సమాజంలోనైనా సాధారణ దృశ్యం ఇది కాగా, భారత సమాజంలో, ముఖ్యంగా గ్రామీణ సమాజంలో ఈ ఉత్పత్తి సంబంధాలలో కులం పాత్రకూడా ఉంది. గ్రామీణ ప్రాంతాలలో భూమి, నీరు తదితర వనరుల మీద, మొత్తంగా వ్యవసాయం మీద, అంటే ఉత్పత్తి మీద కొన్ని అగ్రవర్ణాల ఆధిపత్యం ఉంది. ఆ అగ్రవర్ణాలు నిజంగా ఉత్పత్తిదారులైన శ్రామిక కులాల శ్రమ

శక్తిని దోచుకోవడం మాత్రమే కాక, ఆ కులాలకు చెందిన వ్యక్తులు వనరుల మీద అదుపు సంపాదించకుండా అడ్డుకుంటూ వచ్చారు. ఈ ఉత్పత్తి శక్తులలోని అత్యధిక భాగాన్ని ఇలా వనరుల నుంచి దూరం చేయడంలో మతం కూడా ప్రధాన పాత్ర వహించింది. గ్రామీణ సమాజంలో నెలకొని ఉన్న ఆచార వ్యవహారాలు కూడా ఈ కుల, మత అంతరాలను పెంచిపోషించాయి. కనుక గ్రామీణాభివృద్ధి అన్నప్పుడు ఆ ప్రాంతంలోని ఉత్పత్తి సాధనాల అభివృద్ధి మాత్రమే కాదని, ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి కూడా అని గుర్తించాలి.

ఇంతకాలం సాగిన గ్రామీణాభివృద్ధి పథకాలన్నీ కూడా ఉత్పత్తి సాధనాలను సంఖ్యాత్మకంగా పెంచితే, గ్రామీణాభివృద్ధి దానంతట అదే సాగిపోతుందని భావించాయి. కాని, ఆ అభిప్రాయంలో వాస్తవం లేదని, దేశంలో వేలాది గ్రామాల ఉదాహరణలు చూపుతున్నాయి. మన రాష్ట్రం లోనే ప్రఖ్యాతమైన ఉదాహరణ చెప్పాలంటే ప్రకాశం జిల్లా కారంచేడు గ్రామంలో ఉత్పత్తి సాధనాలు అసాధారణంగా అభివృద్ధిచెందాయి. పంటకాల్వలు, వ్యవసాయంలో ట్రాక్టర్లు, కోత యంత్రాలు వంటి పరికరాలు, రైస్‌మిల్లులు వచ్చి వ్యవసాయంలో మిగులు విపరీతంగా వచ్చింది. ఆ మిగులు గ్రామంలోకి వాహనాలను, ఆధునిక రవాణా సౌకర్యాలను, సమాచార సంబంధాలను తీసుకురావడం మాత్రమే కాదు, బయటికి వెళ్లి పట్టణాలలో సినిమా పరిశ్రమలోకి, ఇతర పరిశ్రమలలోకి విస్తరించింది. అయినా, 1985లో ఆ గ్రామంలో అస్పృశ్యత అమలు కావడం మాత్రమే కాదు, ప్రశ్నించినందుకు అగ్రవర్ణాల వారు హత్యలు చేశారు. అంటే గ్రామీణాభివృద్ధి అనేది కేవలం ఉత్పత్తి సాధనాల అభివృద్ధి మాత్రమే కాదు, ప్రధానమైన ఉత్పత్తి శక్తిఅయిన మనుషుల ఆలోచనలలో, ఆచరణలలో అభివృద్ధికి, తద్వారా ఉత్పత్తి సంబంధాల అభివృద్ధికి దారి తీయాలి.

అయితే అభివృద్ధి అంటే ఏమిటి అనే ప్రశ్న మిగిలిపోతుంది. ఇంతకాలం సంఖ్యాత్మకంగా ఎక్కువ కావడమే, నిన్నలేని సౌకర్యం ఇవాళ ఉండడమే, నిన్న వాడని వస్తువు ఇవాళ వాడడమే అభివృద్ధి అని సాంప్రదాయిక నిర్వచనం ఉంది. కాని, సంఖ్యలో పెరుగుదల, కొత్త సౌకర్యాలు, కొత్త సరుకుల వాడకం దానికదిగా అభివృద్ధి అని చెప్పడానికి వీలులేదు. గుణాత్మకంగా, మనిషే ప్రధానంగా, మనిషి సృజనాత్మకత ప్రధానంగా, సామూహికత ప్రధానంగా ఉన్నప్పుడు సంఖ్యలో పెరుగుదల, కొత్త సౌకర్యాల అనుభవం, కొత్త సరుకుల అనుభవం మనిషిని ఉన్నతీకరిస్తుంది. తన వినియోగం, తన అవసరాలు తీరడం, తన సృజనాత్మకత పెరగడం మాత్రమే కాక, తన తోటి వారందరి అవసరాలు తీరడం, తోటి వారందరి సృజనాత్మకత పెరగడం జరగాలని ప్రతి మనిషీ కోరుకున్నప్పుడే అది సమాజం అభివృద్ధికి చిహ్నం అవుతుంది. 'ఒక్కరి కోసం అందరు నిలిచి, అందరి కోసం ఒక్కరు నిలిచి' అనే భావన సామాజిక అభివృద్ధికి ఒక మౌలిక షరతు. ఆ షరతు మీద మనుషులందరికీ కనీస అవసరాలైన కూడు, గూడు, గుడ్డ తీరడం, వాటితోపాటు ఆరోగ్య, విద్యా, వైజ్ఞానిక, వినోద అవసరాలు తీరడం, శ్రమ శిక్షగానో, ఇబ్బందికరంగానో కాక, సామాజిక అవసరం కోసం ఆనందంగా చేయడం జరిగే స్థితిని అభివృద్ధి అనాలి.



దేశంలో ఇప్పటివరకు అమలైన డజన్ల కొద్దీ గ్రామీణాభివృద్ధి పథకాలు, గ్రామాల సమస్య ప్రధానంగా పేదరికం, దున్నేవారికి భూమిలేకపోవడం అని సరిగానే గుర్తించాయి. కాని ఆ సమస్యలను తీర్చే పనులను మాత్రం సక్రమంగా చేయలేకపోయాయి. అందువల్ల అనేక దారిద్ర్య నిర్మూలనా పథకాలు, చిన్న, సన్నకారు రైతుల అభివృద్ధి పథకాలు, వ్యవసాయ కార్మికుల అభివృద్ధి పథకాలు, కరువు పీడిత ప్రాంతాల పథకాలు, గ్రామీణ ఉపాధి కల్పనా పథకాలు, పనికి ఆహార పథకాలు, సాగునీటి – తాగునీటి పథకాలు, రహదారుల పథకాలు, విద్యా–వైద్య సదుపాయాల కల్పనా పథకాలు అన్ని కూడా గ్రామీణాభివృద్ధి పథకాలుగా మిగిలిపోయాయి గాని గ్రామీణాభివృద్ధిని సాధించలేకపోయాయి. ఈ నేపథ్యంలో ప్రపంచీకరణ తరువాత అసలు గ్రామీణాభివృద్ధి అనేదే బహుళజాతి సంస్థలకు ముడి సరుకులు సంపాదించి పెట్టే, బహుళజాతి సంస్థల సరుకుల అమ్మకాలకు మార్కెట్ ఇచ్చే పథకం మారిపోయింది. ఈ రెండు దశాబ్దాలలో 'ప్రధానమంత్రి గ్రామ్ సడక్ యోజన', 'సంపూర్ణ గ్రామీణ రోజ్‌గార్ యోజన', 'స్వర్ణజయంతి గ్రామ్ స్వరోజ్‌గార్ యోజన', 'వాటర్ షెడ్ పథకాలు' వంటి సరుకుల మీద, సరుకుల రవాణామీద, సరుకుల కొనుగోలుకు అవసరమైన ఏర్పాట్ల మీద దృష్టి ఉన్న పథకాలే వచ్చాయి తప్ప గ్రామీణ మానవ సంబంధాల అభివృద్ధి కాదుగదా గ్రామీణ ఉత్పత్తి సాధనాల అభివృద్ధి కూడా వెనకపట్టు పట్టింది.

***వీక్షణం, జనవరి 2008***

# 55

## కాలునిలవని అతిథికి ఎర్రతివాచీ !

బుధవారం నాడు జరిగిన కేంద్ర మంత్రివర్గ సమావేశం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశం గురించి ఇప్పటివరకూ ఉన్న విధానాన్ని మరింత సరళీకరించాలని నిర్ణయించింది. ఈ సరళీకరణ సంపూర్ణ స్వరూపం ఏమిటో మరికొన్నాళ్లకు గాని పూర్తిగా బయటపడదు. కాని మంత్రివర్గ సమావేశం అయిపోయిన వెంటనే ఆ సమావేశ వివరాలను తెలియజేస్తూ కేంద్ర సమాచార, ప్రసార శాఖల మంత్రి ప్రియరంజన్ దాస్ మున్షీ ప్రకటించిన స్థూల అంశాలయితే ప్రియరంజనంగానో, జనరంజనంగానో లేవు సరిగదా బహుళజాతిసంస్థల దాస్యమూ, వారిసేవలో తరించదలచిన భారతపాలకుల మున్షీతనమూ కొట్టవచ్చినట్టు కనబడుతున్నాయి.

కొత్త సడలింపులప్రకారం పౌర విమానయాన రంగంలోని అనేక విభాగాలు ఏ షరతులూ లేకుండా విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని స్వీకరించవచ్చు. విమానాల నిర్వహణ, మరమ్మత్తు, శిక్షణ వంటి రంగాలలో 100 శాతం విదేశీ పెట్టుబడి రావచ్చు. టిటానియం, తత్సంబంధిత ఖనిజాల తవ్వకాల రంగంలోకి 100 శాతం విదేశీ పెట్టుబడి రావచ్చు. పరపతి, రుణ గ్రహీతల సమాచార రంగంలోకి 49 శాతం విదేశీ పెట్టుబడి రావచ్చు. ఇంధన, సహజవాయు వ్యాపార రంగంలో 26 శాతం స్థానిక పెట్టుబడి తప్పనిసరిగా ఉండాలని ఇంతకాలమూ ఉన్న నిబంధన ఇక రద్దయిపోతుంది. ప్రభుత్వరంగ చమురుశుద్ధి కర్మాగారాలలో విదేశీ పెట్టుబడి 26 శాతానికి దాటగూడదని ఇంతవరకూ ఉన్న నిబంధనను సడలించి దాన్ని 49 శాతానికి పెంచారు. అలాగే పారిశ్రామిక కేంద్రాల అభివృద్ధిలోనూ, నిర్మాణ సంస్థల విషయంలోనూ ఉన్న నిబంధనలను కూడా సడలించారు. షేర్ల లాగ వాణిజ్య వ్యవసాయోత్పత్తులలో వ్యాపారం కోసం ప్రారంభించిన కమాడిటీ ఎక్స్ చేంజిలలో విదేశీ పెట్టుబడి నిబంధనలను కూడా సడలించారు.



అయితే ఇప్పుడు ప్రకటించిన సడలింపులలో కొత్తవేమీ లేవు. మహాఘనత వహించిన సర్వసత్తాక భారతప్రభుత్వం గత పదహారు సంవత్సరాలలో – అది కాంగ్రెస్ మైనారిటీ అయినా, యునైటెడ్ ఫ్రంట్ అయినా, నేషనల్ డెమొక్రటిక్ అలయెన్స్ అయినా, యునైటెడ్ ప్రోగ్రెసివ్ అలయెన్స్ అయినా – సాగిస్తూ వచ్చిన సరళీకరణల కొనసాగింపే తప్ప ఇది మరొకటి కాదు.

నిజానికి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల విషయంలో లాభనష్టాలు, అంకెలు మాత్రమే కాక చరిత్రతో అనుసంధానం చేసి చూడవలసిన ప్రత్యేకపరిస్థితి మన సమాజంలో ఉంది. మారుబేరం కొరకు, వ్యాపారం కొరకు ప్రవేశించి బలపడిన విదేశీ పెట్టుబడి మన దేశాన్ని రెండు శతాబ్దాలపాటు బానిసత్వ వలసపాలనలో ఉంచి, మన సంపదను పీల్చిపిప్పిచేసింది గనుక, విదేశీ పెట్టుబడులను అనుమానంతో చూసే వైఖరిని జాతీయోద్యమంలోని అన్ని పాయలూ ప్రదర్శించాయి. ఆ ధోరణినే భారత ప్రభుత్వం కూడ 1947 నుంచి 1957–58 దాకా అనుసరించింది.

అందువల్లనే అప్పుడు దేశీయ వనరులను ఉపయోగించి దేశీయంగానే పరిశ్రమలను స్థాపించాలని, విలువైన స్వదేశీవనరులను విదేశీపెట్టుబడులు లాభాలుగా కొల్లగొట్టుకుపోవడానికి అంగీకరించగూడదనీ, పిడికెడుమంది సంపన్నుల విలాస అవసరాల కోసం ఖరీదయిన సరుకులను దిగుమతి చేసుకుని విదేశీ మారకద్రవ్యాన్ని వృథా చేయగూడదనీ, దిగుమతి చేసుకునే ప్రతి వస్తువుకూ ప్రత్యామ్నాయాన్ని సొంతంగా ఉత్పత్తి చేసే నైపుణ్యాన్ని సంపాదించాలనీ, ఆ రకంగా దేశాన్ని స్వావలంబనవైపు, స్వయంసమృద్ధివైపు నడిపించాలని తొలిరోజులలో భారత ప్రభుత్వం ఆలోచించింది. కనీసం ఆలోచించినట్టు కనబడింది. జాతీయోద్యమ ఆదర్శాలు ప్రజల మనసులలో ఇంకా తాజాగా ఉన్నాయి గనుక, ఆ ఆదర్శాలకు ద్రోహంచేసే పనిని భారత పాలకులు ఇప్పటిలాగ బహిరంగంగా, నిర్లజ్జగా చేయలేకపోయారు. ఆచరణలో చేసినా కనీసం మాటలలో, కాగితాలలో ఆ ఆదర్శాలకు కట్టుబడ్డారు.

తొలిసారిగా 1957–58 లో వచ్చిన చెల్లింపుల సంక్షోభకాలం నుంచి క్రమక్రమంగా ఆ ఆదర్శాలు రద్దవుతూ వచ్చాయి. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశం మీద ఉన్న ఆంక్షలు ఒకటొకటిగా రద్దవుతూ వచ్చాయి. ఆ సడలింపులు 1968లో రెండోసారి, 1980లలో మరొకసారి మరింత పెద్దఎత్తున సాగాయి. నూతన ఆర్థిక విధానాల వెల్లువలో 1991 తర్వాత అసలు ఈ దేశంలో ఒకప్పుడు విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులమీద ఆంక్షలు ఉండేవంటే నమ్మలేని స్థితి వచ్చింది.

ఆ చరిత్రంతటిలోకీ ఇప్పుడు పోనక్కరలేదు గాని, ఈ విదేశీప్రత్యక్ష పెట్టుబడి గురించి కనీసం రెండు విషయాలు చెప్పుకోవాలి.

ఇన్ని రాయితీలు, హామీలు, సడలింపులు ఇచ్చి సాగిలపడి ఆహ్వానిస్తున్న విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి నిజంగా పాలకులు చెపుతున్న ప్రకటిత లక్ష్యాలను కూడా సాధించడంలేదు సరిగదా, అది మరొకరూపంలో మన సంపదను కొల్లగొట్టుకుపోవడానికి సరిగా వలసవాదంలాగనే ప్రయత్నిస్తున్నది. విదేశీ ప్రత్యక్షపెట్టుబడి రాకవల్ల మనకు ఇంతవరకూ లేని నిధులు, సాంకేతికపరిజ్ఞానం, ఆధునిక మార్కెట్లతో అనుసంధానం వంటి లాభాలు ఒనగూరుతాయని పాలకులు ప్రకటిస్తున్నారు. కాని మన ఆర్థికవ్యవస్థ పరిమాణంతో పోల్చినప్పుడు విదేశీ ప్రత్యక్షనిధులు ఎన్ని రాయితీలు ఇచ్చి ఆహ్వానించినా ఏ ఒక్క సంవత్సరంలోనూ ఒక్క శాతాన్ని కూడ మించిపోలేదు. ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో కొద్దిగా పెరిగి రెండు శాతానికి చేరవచ్చునన్నట్టు కనబడుతోంది. మరి ఈ మాత్రం నిధులకోసం మన విధానాలు అంతగా మార్చుకోవాలా, మన ఆర్థిక వ్యవస్థను తాకట్టుపెట్టాలా, 'జీ హుజూర్ జోహుకుం' అనాలా అన్నది ప్రశ్న. ఇక అవి తెచ్చే, మనకు తెలియని కొత్త సాంకేతిక పరిజ్ఞానం ఏమీ లేదు. ఆ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులలో దాదాపు సగం రియల్ ఎస్టేట్, ఫైనాన్స్ వంటి రంగాలలోకే వస్తున్నాయి.

ఈ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులలో మరొక గుర్తించవలసిన అంశం ఇవి వలసవాద కాలంలోని పెట్టుబడిలాగ ఇక్కడికివచ్చి, ఇక్కడ పరిశ్రమలు పెట్టి, ఇక్కడి మానవవనరులను ఉపయోగించుకుని, ఇక్కడ ఎంతోకొంత వనరుల కల్పనకు, అభివృద్ధికి దారితీసేవి కావు. అధికారిక అంచనాల ప్రకారమే 1990-91 నుంచి 2003-04 మధ్య మొత్తం 6,468 కోట్ల డాలర్ల విదేశీ పెట్టుబడులు వస్తే, అందులో 3,537 కోట్ల డాలర్లు (అంటే సగానికన్న ఎక్కువ) కేవలం పోర్ట్‌ఫోలియో పెట్టుబడులరూపంలో వచ్చాయి. అంటే అసలు ద్రవ్య రూపంలో మన దేశంలోకి ప్రవేశించకుండానే కేవలం మనదగ్గర పనిచేసే వ్యాపార సంస్థల షేర్ల కొనుగోలు రూపంలో వచ్చాయి. ఆ షేర్ల ధరలు పెరిగినప్పుడు అమ్మేసి లాభం చేసుకుని మరొకచోటికి తరలిపోతాయి. మరొకచోట ఇంకా ఎక్కువ లాభాలు వస్తాయంటే వెంటనే అక్కడికి తరలిపోతాయి. మొత్తంమీద వస్తున్న విదేశీపెట్టుబడులలో సగం ఇలా 'కాలు నిలవని పెట్టుబడే'నన్న మాట. కాలు నిలవని పెట్టుబడికోసం మనం ఎర్రతివాచీలు పరుస్తున్నా మన్నమాట.

మరొకవైపు, పైన చెప్పిన కాలంలోనే భారతీయులు విదేశాలకు వెళ్లి తమ కుటుంబాలకొరకో, ఇతర పెట్టుబడులరూపంలోనో దేశంలోకి పంపిన నిధులు పన్నెండువేల కోట్ల డాలర్ల పైచిలుకు. అంటే విదేశీ పెట్టుబడి సంస్థల నుంచి వచ్చినదానికన్న రెట్టింపు. వాళ్లకు కూడ ఏవోకొన్ని రాయితీలు ఉన్నాయి గాని, ఈ బహుళజాతి సంస్థలకు అందుతున్న రాయితీలతో పోలిస్తే అవి చాల తక్కువ. వంద సంవత్సరాల కింద దాదాభాయి నౌరోజీ ఏ నిధుల దోపిడీ ప్రవాహం గురించి మాట్లాడాడో అది ఇవాళ ఇంకా ఎక్కువ వాస్తవంగా కనబడుతోంది.

***సూర్య, ఫిబ్రవరి 1, 2008***



# 56

# కలవారికి పన్నుల సెలవు ప్రజలపై మరింత బరువు

వానాకాలం ప్రవేశించగానే, ఒక్క వాన పడి గాలి చల్లబడగానే కుప్పలుగా ఉసిళ్లు పుట్టుకొచ్చినట్టు బడ్జెట్ రుతువులో ఆశలూ గొంతెమ్మకోర్కెలూ విపరీతంగా వినబడుతుంటాయి. కాకపోతే అవి ప్రజల ఆశలూ, సామాన్యుల కోర్కెలూ కావు. ఢిల్లీలోనూ, ముంబాయిలోనూ కొలువుదీరిన పారిశ్రామిక, వ్యాపారవర్గాల బృందాలన్నీ తమ తమ కోర్కెల జాబితాలు తయారుచేసి ఆర్థిక మంత్రికో, మంత్రిత్వశాఖలో కీలక అధికారులకో సమర్పిస్తుంటాయి. దేశంలోని ఆర్థిక, వ్యాపార పత్రికలన్నీ ఆ జాబితాలను విపరీతంగా ప్రచారం చేస్తూ ఆ కోర్కెలను నెరవేర్చడం మీదనే దేశ భవితవ్యం ఆధారపడి ఉన్నట్టు సంపాదకీయాలూ, వ్యాసాలూ రాస్తుంటాయి. ఆ పని మళ్లీ ఇప్పుడు కూడ మొదలయింది.

లాబీయింగ్ అని ముద్దుపేరు పెట్టుకున్న ఈ పైరవీ ప్రక్రియ ద్వారా తమ వ్యాపారాలకు ఎక్కువ రాయితీలు, పన్ను మినహాయింపులు, పన్ను సెలవులు, తాము సంపాదించిన లాభాలపై పన్ను కట్టనక్కరలేని ఏర్పాట్లు, ఎగుమతి దిగుమతులపై ఆంక్షల తొలగింపు, తాము వాడుకుంటున్న వనరుల

కొనుగోలుపై అమ్మకం పన్ను మినహాయింపులు, తాము వాడుకునే మానవవనరులకు కల్పించవలసిన సౌకర్యాలు కల్పించకపోయినా ఫరవాలేదనే ఏర్పాట్లు వంటి కోర్కెలెన్నో ఈ జాబితాల్లో ఉంటాయి. నిజం చెప్పాలంటే ఇవన్నీ గొంతెమ్మకోర్కెలే. ప్రజావ్యతిరేక, దేశవ్యతిరేక కోర్కెలే. కాని మన పారిశ్రామిక, వ్యాపారవర్గాలు ఈ కోర్కెలను నిస్సిగ్గుగా ప్రకటిస్తూనూ ఉన్నాయి, మన పాలకులు వాటిని నిరభ్యంతరంగా ఆమోదిస్తూనూ ఉన్నారు.

అసలు ఈ దేశ ప్రజల్లో నిజంగా ఎవరికి ఉపశమనం దక్కవలసి ఉన్నదో, ఎవరికి ఎక్కువగా పన్నుల భారం నుంచి మినహాయింపులు అందవలసి ఉన్నదో వారి గురించి పట్టించుకునే వాళ్లూ లేరు. వాళ్ల కోర్కెలకు గొంతు ఇచ్చేవాళ్లూ లేరు. వాళ్ల కోసం బడ్జెట్ తయారీ ముందు లాబీయింగ్ చేసే వాళ్లూ లేరు. తమ భూములనుంచీ, ఉపాధినుంచీ, బతుకునుంచీ బయటికి తరిమివేయబడుతున్న ఆదివాసులు, వ్యవసాయం కష్టభరితమై, బతుకు బరువై ఆత్మహత్య తప్ప మరొక మార్గం లేదనుకుంటున్న రైతులు, వ్యవసాయం కుప్పకూలిపోవడం వల్ల చితికిపోయిన వ్యవసాయాధార చేతివృత్తుల శ్రామికులు, మొత్తంగా గ్రామీణ ప్రజానీకం, పట్టణ పేదలు, దిగువ మధ్యతరగతి ప్రజలు ఈ దేశ జనాభాలో మూడింట రెండువంతుల పైన అయినప్పటికీ వారి కోర్కెలేమిటో, వాటిని తీర్చడానికి బడ్జెట్ లో ఏమి చేయవలసి ఉన్నదో, ఏ రాయితీలు, మినహాయింపులు ఇవ్వవలసి ఉన్నదో మాట్లాడే వాళ్లు లేరు.

అంటే ఒక్కపూట తిండికి కూడ నోచుకోనివాళ్లకు, ఆ ఒక్కపూట తిండి కూడ నోటిముందు నుంచి జారిపోతున్నవాళ్లకు రక్షణ కల్పించడానికి ఎటువంటి ప్రయత్నమూ బడ్జెట్లో లేదు. ఉండాలనే ఆలోచనా లేదు. కాని ఇప్పటికే ముప్పూటలా తింటూ ఇంకా అత్యాశలు పోతున్న వాళ్ల ఆశలు తీర్చడానికి బడ్జెట్లో ఏమి చేయాలా అని ప్రభుత్వమూ ఆలోచిస్తున్నది, "మా బకాసుర ఆకలి తీర్చడానికి ఇంకా ఏమేమి ఇస్తావు" అని వ్యాపార, పారిశ్రామిక, సంపన్న వర్గాలూ అడుగుతున్నాయి.

ఇది కేవలం కొందరి అత్యాశ, మరికొందరికి గొంతులేకపోవడం సమస్య మాత్రమే కాదు, ఇది దేశ రాజకీయార్థిక సమస్య. దేశపు ఖజానా నిండే మార్గం ఏమిటనే సమస్య. దేశపు ఖజానా పంపిణీ ఏరకంగా, ఎంత సమానంగా, ఎంత రాజ్యాంగబద్ధంగా జరుగుతున్నదనే సమస్య.

ఒక ఉదాహరణ చూద్దాం. ఒక ప్రముఖ వ్యాపార పత్రిక దేశ వ్యాప్తంగా ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ పరిశ్రమ ఈ బడ్జెట్లో ఏమి కోరుకుంటున్నదో అడిగి ఆ కోర్కెల జాబితా తయారుచేసి ఆర్థిక మంత్రిత్వశాఖకు అందజేసే పవిత్ర కార్యానికి పూనుకున్నది. అలా రూపొందిన కోర్కెలపత్రంలో చాల కోర్కెలు ఉన్నాయిగాని అన్నిటికన్న పైన ఉన్న కోర్కె సాఫ్ట్ వేర్ టెక్నాలజీ పార్క్ అనే పేరు మీద భారత ప్రభుత్వం గత పదిహేను సంవత్సరాలుగా అమలుచేస్తున్న పన్నుల సెలవును మరొక పది సంవత్సరాలు పొడిగించాలని అట.

అసలు పన్నుల సెలవు అంటే ఏమిటి? ఒకానొక పరిశ్రమను, రంగాన్ని



ప్రోత్సహించడానికి ప్రభుత్వం ఇచ్చే రాయితీ ఇది. ఆ రంగం ద్వారా విదేశీ పెట్టుబడి వస్తుందని, లేదా నూతన సాంకేతిక పరిజ్ఞానం వస్తుందని, ఆ సంస్థలలో ఇతోధికంగా ఉపాధికల్పన జరుగుతుందని, ఆ సంస్థల ఎగుమతుల ద్వారా విదేశీమారకద్రవ్యం వస్తుందని ప్రభుత్వాలు నమ్మబలుకుతున్నాయి. ఆ కారణాలవల్ల వాటి స్థాపనను ఆకర్షించడానికి వారికి రాయితీలు, మినహాయింపులు ఇవ్వాలని, పన్నుల సెలవు వాటిలో ఒకటని పాలకులు చెపుతున్నారు. అంటే ఆ సంస్థలు ఈ దేశంలో ఇతర సంస్థలకు, ప్రజలకు వర్తించే పన్నుల విధానానికి లోబడి ఉండనవసరంలేదు.

నిజానికి ఈ నాలుగు కారణాలు శుద్ధ అబద్ధాలు. ఆ సంస్థలద్వారా విదేశీ పెట్టుబడి పెద్దగా వచ్చిందీలేదు, వచ్చింది ఏకొంచెమో ఉన్నా దానికి ఎన్నోరెట్లు లాభాల రూపంలో విదేశాలకే, బహుళజాతిసంస్థల బొక్కసాలకే తరలిపోయింది. ఈ కానుకలను వాడుకున్న సంస్థలద్వారా దేశంలోకి కొత్తగా వచ్చిన సాంకేతికపరిజ్ఞానమూలేదు, ఉన్నది ఈ దేశప్రజల బతుకులు బాగుచేయడానికి ఏమీ ఉపయోగపడలేదు, బహుళజాతిసంస్థల, దేశదేశాల సంపన్నుల ఆస్తి పెరగడానికే ఉపయోగపడింది. గతపదిహేను సంవత్సరాలుగా ప్రభుత్వం అప్పనంగా ఇచ్చిన ముడుపులు పుచ్చుకుని, వేలకోట్ల రూపాయలు లాభాలు చేసుకుని, అంతిమంగా ఈ రంగం చేసిన ఉద్యోగ కల్పన పదహారు లక్షలు దాటలేదు. అంటే దేశ జనాభాలో 0.12 శాతం కన్న తక్కువ. దేశంలోని శ్రామిక, ఉద్యోగ జనాభాలో ఈ రంగం వాటా ఒక్క శాతం కూడా కాదు. ఈ మాత్రం ఉద్యోగకల్పనకు అన్నన్ని రాయితీలు ఇవ్వవచ్చునంటే, మరి 60 శాతం ప్రజలకు ఉపాధికల్పిస్తున్న గ్రామీణ రంగానికి, వ్యవసాయరంగానికి, చేనేత రంగానికి ఎన్ని రాయితీలు కల్పించవలసి ఉంటుంది? ఇక ఆ సంస్థల ఎగుమతుల ద్వారా విదేశీ మారకద్రవ్యం వస్తుందన్న మాట నిజమే అయినా ఆ విదేశీ మారకద్రవ్యాన్ని నాయకులకు ముడుపులు ముట్టే ఆయుధాల కొనుగోళ్లకు, పిడికెడుమంది సంపన్నుల విలాస సరుకుల దిగుమతులకు వెచ్చించేటప్పుడు ఆ విదేశీ మారకద్రవ్యం వస్తే ఎంత, రాకపోతే ఎంత?

బడ్జెట్ అనేది దేశ సంపదను విభిన్నవర్గాల ప్రజలమధ్య పంపిణీ చేసే ఒక ప్రక్రియ గనుక ప్రతి వర్గమూ బడ్జెట్ ముందు తనకే ఎక్కువ వాటా రావాలని అడగడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. కాని ఏ వర్గానికి ఎంత ఇవ్వవచ్చును, ఏ వర్గానికి ఎంత అవసరం, ఎటువంటి పంపిణీ రాజ్యాంగ ఆదర్శాలయిన సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయం, సమానత్వం అనే విలువలకు సంబద్ధంగా ఉంటుంది అని ఆలోచించవలసిన బాధ్యత పాలకులది. నోరున్నవాడు ఏమి అడిగినా ఇస్తాం, నోరులేనివాడు అడగలేదు గనుక ఇవ్వం అని అనడం తమనుతాము ప్రజాస్వామిక పాలకులమని చెప్పుకునేవాళ్లకు తగదు. కాని అరవై సంవత్సరాలుగా జరుగుతూ వస్తున్నది ఈ తగని పనే. అయినవారికి, ఉన్నవారికి ఇంకా ఇంకా ఎక్కువగా తాయిలాలు, మామూలు ప్రజలకేమో వీపులపై పన్నుల, అధికధరల, ఆంక్షల వడ్డింపులు.

**సూర్య, ఫిబ్రవరి 15, 2008**

# 57

## ఈ బడ్జెట్ స్వభావం ఏమిటి?

ఈ సారి రాష్ట్ర బడ్జెట్‌కు చాల ప్రత్యేకతలు ఉన్నాయని ప్రచారం జరుగుతున్నది. ఆ ప్రత్యేకతలలో కొన్నిటిని రాష్ట్ర ఆర్థిక మంత్రి కొణిజేటి రోశయ్య బడ్జెట్ ఉపన్యాసం లోనూ, ముఖ్యమంత్రి వై ఎస్ రాజశేఖర రెడ్డి ఆ తర్వాత పత్రికాసమావేశంలోనూ వాచ్యంగా చెప్పి ఉన్నారు కూడ. ఈ సారి బడ్జెట్ లక్ష కోట్ల రూపాయలు దాటిపోయి బంగ్లాదేశ్ బడ్జెట్ కన్నా మించిందనే ప్రత్యేకత వాటిలో ఒకటి. అట్లాగే రాష్ట్రప్రభుత్వానికి ఇది ఎన్నికల సంవత్సరం గనుక, ఎన్నికలు మధ్యంతరంగా కాక పద్ధతి ప్రకారం జరిగినా ఈ ప్రభుత్వానికి మరొక బడ్జెట్ ప్రవేశపెట్టే అవకాశం ఉండదుగనుక కూడ ఇది ప్రత్యేకమైన బడ్జెటే. ఎన్నికల దృష్టితో వరాలు కురిపించడానికి ప్రయత్నించింది గనుక కూడ ఇది ప్రత్యేక బడ్జెటే. రోశయ్య ఆర్థిక మంత్రిగా ప్రవేశపెట్టిన బడ్జెట్లలో ఇది పన్నెండోదో పదమూడోదో గనుక కూడ ప్రత్యేకమైనదే.

అయితే ఇటువంటి గొప్పలు ఎన్ని చెప్పుకున్నా అసలు వ్యవహారం తేలవలసినది ఈ ప్రగల్భాలద్వారా కాదు. ఈ వాగాడంబరాలకూ బడ్జెట్‌కూ ఏమీ సంబంధంలేదు. బంగ్లాదేశ్ బడ్జెట్ కన్న ఎక్కువ అయినంత మాత్రాన ప్రజలకు ఒరిగేదేమీలేదు.

బడ్జెట్ ను చూడవలసిన ప్రత్యేక దృష్టికోణం ఒకటి ఉంటుంది. అది



కేవలం అంకెల గారడీ కాదు. మాటల గారడీ కూడ కాదు. బడ్జెట్ అనేది సామాజిక సంపదను సమాజం లోని వివిధ వర్గాలమధ్య పంపిణీ చేసే ఒక ప్రక్రియ. సమాజ గమనం కొరకు వేరువేరు ప్రజాసమూహాలు, వర్గాలు వేరు వేరు పనులు చేసి తరతమ స్థాయిలలో సామాజిక సంపదను సృష్టిస్తుంటాయి. అలా పోగుపడుతున్న సంపదను పంపిణీ చేయడానికి బడ్జెట్ ఒక సాధనం. నేరుగా ఆ సంపద సృష్టికర్తల అవసరాలనో, నిర్వాహకుల అవసరాలనో, సమాజానికి అవసరమయిన ఇతర వర్గాల అవసరాలనో మాత్రమే గాక భవిష్యత్ తరాల అవసరాలను కూడ పరిగణనలోకి తీసుకుని ఆర్థిక వ్యవస్థ నిర్వాహకురాలుగా ప్రభుత్వం బడ్జెట్ తయారుచేస్తుంది. కొన్ని వర్గాల దగ్గర ఎక్కువ పన్నులు వసూలు చేయడం, కొన్ని వర్గాలకు ఎక్కువ రాయితీలు ఇవ్వడం, కొన్ని వర్గాలకు సౌకర్యాలు కల్పించడం, కొన్ని రంగాలకు ఎక్కువ కేటాయింపులు చేయడం వంటి పనులన్నీ ఈ పంపిణీలో భాగంగానే సాధికారికమైనవవుతాయి.

మామూలుగానయితే ఇటీవలి కాలంలో ప్రాధాన్యత కోల్పోయిన రాష్ట్ర బడ్జెట్ ఈ అర్థంలో చూసినప్పుడు కొంతయినా ప్రాధాన్యతను సంతరించుకుంటుంది. సంపద పునఃపంపిణీ కార్యక్రమాన్ని 2008-09 బడ్జెట్ ఎలా సాధించిందో, సాధించలేకపోయిందో చూడడం ఆసక్తికరంగా ఉంటుంది.

వర్గ, కుల, ప్రాంత, లింగ అసమానతలు విపరీతంగా కొనసాగుతున్న సమాజంలో మొత్తంగా ప్రభుత్వ రాజకీయార్థిక విధానాలుగాని, ప్రతేకించి బడ్జెట్ గాని ఆ అసమానతలను తగ్గించే దిశలో వనరుల పునఃపంపిణీని చేపట్టాల్సి ఉంటుంది. కాని ఈ బడ్జెట్ వర్గ అసమానతలను తగ్గించే విషయం మాట మాత్రమైనా ఎత్తలేదు సరిగదా, ఉన్నవారికీ లేనివారికీ మధ్య అసమానతలు మరింతగా పెరిగే విధానాలను ప్రకటించింది.

ఒక ఉదాహరణ చెప్పాలంటే, వర్గ అసమానతలను మరింత పెంచే, లక్షలాదిమంది ప్రజలను తమ గ్రామాలనుంచి, శాశ్వత జీవనోపాధి వనరులనుంచి, చివరికి బతుకునుంచి నిర్వాసితులను చేసే ప్రత్యేక ఆర్థిక మండలాలను ఇబ్బడి ముబ్బడిగా పెంచుతానని ఆర్థిక మంత్రి ఎటువంటి శషభిషలు లేకుండా ప్రకటించారు. ఒకవైపు గోవాలో రాష్ట్రప్రభుత్వం వైపునుంచి నిరసనను, దేశ వ్యాప్తంగా ప్రజలనుంచి వ్యతిరేకతను ఎదుర్కొంటున్న ప్రత్యేక ఆర్థిక మండలాలను, ఆంధ్రప్రదేశ్ ఎర్రతివాచీ పరిచి సవినయంగా ఆహ్వానిస్తుందని బడ్జెట్ ఉపన్యాసం ప్రకటించింది. మొత్తం 72 సెజ్ లను ఏర్పాటు చేసి అతిఎక్కువ సెజ్ లు ఉన్న రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ను తయారుచేస్తామని ఆర్థిక మంత్రి అన్నారు. అంటే ప్రస్తుతం ఆమోదం పొందిన 57 ప్రత్యేక ఆర్థిక మండలాలకు తోడుగా మరొక 15 ఈ ఆర్థిక సంవత్సరంలోనే వస్తాయన్నమాట. ఈ సూచన రాష్ట్రప్రభుత్వ ప్రాధాన్యాలేమిటో, ఎవరి ప్రయోజనాలు నెరవేర్చడానికి ప్రభుత్వం కంకణం కట్టుకున్నదో స్పష్టం చేస్తున్నది.

ఇక కుల అసమానతలను తొలగించే దిశలో బడ్జెట్ కేటాయింపులు ఉండాలని, బడ్జెట్ లక్ష్యాలలో అది ఒకటని రాష్ట్ర ప్రభుత్వం గుర్తించినట్టు కూడ కనబడడం లేదు. ప్రధానంగా కాంట్రాక్టర్ల మేలు కొరకు, రాజకీయ నాయకుల ముడుపుల కొరకు సాగుతున్న జలయజ్ఞం

పథకానికి రు. 17,875 కోట్లు, గృహనిర్మాణ పథకానికి రు. 5850 కోట్లు కేటాయించిన బడ్జెట్, మొత్తం సాంఘిక సంక్షేమానికి మాత్రం రు. 1293 కోట్లు, వెనుకబడినకులాల సంక్షేమానికి రు. 353 కోట్లు కేటాయించిందంటే దాని ప్రాధాన్యాలు ఎక్కడ ఉన్నాయో అర్థమవుతుంది. ఇటువంటి నిర్లక్ష్య వైఖరి కేవలం సాంఘిక సంక్షేమం విషయంలో మాత్రమే కాదు, గ్రామీణాభివృద్ధి (రు. 3838 కోట్లు), వ్యవసాయం (రు. 1066 కోట్లు), విద్య (రు. 1771 కోట్లు), ఆరోగ్యం (రు. 1315 కోట్లు) కేటాయింపులలో కూడ వ్యక్తమయింది. నిజానికి ఈ కేటాయింపులలో ఆయారంగాల సిబ్బంది జీతభత్యాలకు, శాఖల నిర్వహణకు అయ్యే వ్యయం మినహాయిస్తే అసలు ప్రజల అభివృద్ధి అవసరాలు ఏమేరకు తీరే అవకాశం ఉంటుందో ఎవరయినా ఊహించవచ్చు.

గత కొన్ని సంవత్సరాలుగా కేంద్ర బడ్జెట్ విషయంలో జెండర్ బడ్జెట్ అనే పేరుతో మొత్తంగా ప్రభుత్వ రాజకీయార్థిక విధానాలలోనూ, ప్రత్యేకించి బడ్జెట్ లోనూ స్త్రీలు ఎదుర్కొంటున్న అసమానతను తొలగించే దిశలో కేటాయింపులు ఎలా జరుగుతున్నాయని చర్చ జరుగుతున్నది. కేంద్ర ప్రభుత్వ స్థాయిలో ఈ ఆలోచనను బడ్జెట్ తయారీలో భాగం చేసే ప్రయత్నం జరుగుతున్నది. బహుశా మన రాష్ట్రానికీ, దేశానికీ కూడ బడ్జెట్ తయారీలో వెనుకబడిన కులాల, సామాజిక వర్గాల దృష్టి నుంచి బడ్జెట్ తయారీని పరిశీలించి అవసరమయిన మార్పులు చేయవలసిన అవసరం పెరుగుతున్నట్టున్నది.

ప్రాంతీయ అసమానతలను తొలగించే కోరిక ప్రభుత్వానికి లేదని, చివరికి తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ ఉధృతమవుతున్న సందర్భంలో కూడ ఇంతకాలం జరిగిన ప్రాంతీయ వివక్షను ఇప్పటికైనా తొలగించే ప్రయత్నం ప్రారంభించాలని పాలకులు అనుకోవడం లేదని ఈ బడ్జెట్ కొట్టవచ్చినట్టుగా చూపుతున్నది. చివరికి వేలకోట్ల రూపాయలు కేటాయింపులు జరిగిన జలయజ్ఞం వంటి పథకాలలో కూడ తెలంగాణలోని పథకాల విషయానికి వచ్చేసరికి తగిన కేటాయింపులు జరగలేదు. ఒకవేళ కేటాయింపులు ఉన్నా అవి సక్రమంగా అమలు కాకపోవడం గత అనుభవం.

నిజానికి బడ్జెట్ ను కేవలం అంకెలుగా మాత్రమే చూస్తే, ఆ అంకెలకు ఇవ్వవలసిన ప్రాధాన్యతకన్న ఎక్కువ ప్రాధాన్యత ఇస్తే, వాటికి పవిత్రతను ఆపాదిస్తే ఇటువంటి సమస్య వస్తుంది. ఎప్పుడయినా బడ్జెట్‌లలోని అంకెలు ఒక స్వభావాన్ని సూచిస్తాయి. అంకెల ద్వారా లాభపడే మనుషులు,నష్టపడే మనుషులు ఉంటారు. ఆ లాభాన్ని, నష్టాన్ని, మనుషులను దాచడానికి కూడ అంకెలు ఉపయోగపడతాయి. ప్రభుత్వం తన విధానాల ద్వారా కొన్ని వర్గాలకు మేలు చేకూర్చదలచుకున్నప్పుడు ఆ పని చేస్తూనే, అది దాచి ఉంచడానికి కూడ అంకెలను వాడుకుంటుంది. కొందరికి కీడుచేస్తూ అంకెలవెనుక దాక్కుని మేలు చేస్తున్నట్టు నటిస్తుంది.

***సూర్య, ఫిబ్రవరి 21, 2008***



# 58

## అబ్బ, రైతులకు ఎన్నివేల కోట్లు!?

రైతులకు రుణమాఫీ, రుణాల చెల్లింపులో రాయితీల పద్దు కింద ఈ ఆర్థిక సంవత్సరపు బడ్జెట్ లో అరవైవేల కోట్ల రూపాయల సహాయం అందించబోతున్నామని, ఇంతటి మహత్కార్యానికి దేశమంతా నీరాజనాలు పలకవలసి ఉందని బడ్జెట్ ఉపన్యాసంలో కేంద్ర ఆర్థికమంత్రి పి చిదంబరం అన్నారు. పైపైన చూస్తే, అరవైవేలకోట్ల రూపాయలు అనే పెద్దఅంకెచూస్తే అదేదో రైతులకు, దేశ వ్యవసాయరంగానికి చేస్తున్న గొప్ప మేలు లాగనే కనబడుతుంది. కాని తీగలాగి డొంక కదిలిస్తే ఈ ప్రకటన బండారం బయటపడుతుంది. ఈ భారీ రుణమాఫీ పథకపు అసలుగుట్టును అర్థం చేసుకోవాలంటే రైతుల రుణ అవసరాల గురించి, రుణాలు తీసుకుంటున్న రైతుల గురించి, రుణాలు ఇచ్చే సంస్థల, సంస్థేతర వనరుల గురించి, ప్రభుత్వమే స్వయంగా మూలనపడేసిన రైతు సహాయ కార్యక్రమాల గురించి, ఇప్పుడు మాఫీ చేస్తామని ప్రకటించిన మొత్తానికి సమానమైన, అంతకన్న ఎక్కువ మొత్తాలు సంగ్రహిస్తున్న ఇతరపద్దుల గురించి చర్చించవలసి ఉంటుంది.

వ్యవసాయరంగపు రుణభారం గురించి అధ్యయనం చేసి, పరిష్కారాలను సూచించవలసిందిగా కేంద్రప్రభుత్వం 2006 ఆగస్టులో

ఆంధ్రవిశ్వవిద్యాలయ మాజీ వైస్ ఛాన్సలర్, ముంబైలోని ఇందిరాగాంధీ ఇన్స్టిట్యూట్ ఫర్ డెవలప్‌మెంట్ రిసర్చ్ డైరెక్టర్, ప్రఖ్యాత అర్థశాస్త్రవేత్త ప్రొ. ఆర్ రాధాకృష్ణ నాయకత్వంలో నియమించిన నిపుణుల బృందం 2007 జూలైలో వివరమైన నివేదికను సమర్పించింది. ఆ నివేదిక చేసిన సిఫారసులకన్న ఎక్కువగానే తమ ప్రభుత్వం రైతుల రుణభారాన్ని తొలగించడానికి చర్యలు తీసుకుంటున్నదని చిదంబరం ప్రకటించారు. డిసెంబర్ 31, 2007 నాటికి చిన్న, సన్నకారు రైతులు వాణిజ్య బ్యాంకులకు, గ్రామీణ బ్యాంకులకు, సహకార రుణసంస్థలకు బకాయి పడిన రుణాలను మొత్తంగా మాఫీ చేస్తామని, ఇతర రైతుల బాకీలు ఒకేసారి చెల్లిస్తే 25 శాతం మినహాయింపు ఇస్తామని ఆర్థిక మంత్రి అన్నారు. ఈ రుణమాఫీ, రాయితీ పథకం వల్ల మూడుకోట్ల మంది చిన్న, సన్నకారు రైతులు, ఒకకోటి మంది ఇతర రైతులు లబ్ధి పొందుతారని, రుణ మాఫీ పథకం కింద యాభైవేల కోట్ల రూపాయలు, ఒకేసారి చెల్లింపుకు రాయితీ పథకం కింద పదివేలకోట్ల రూపాయలు, మొత్తం అరవైవేల కోట్ల రూపాయలు ఇందుకు కేటాయిస్తున్నామని ఆర్థిక మంత్రి అన్నారు.

ఈ అంకెలగారడీతో మైమరచిపోకుండా, అసలు మొట్టమొదట మన రైతాంగం రుణ అవసరాలు ఏమిటో, అవి ఎందుకు పెరుగుతున్నాయో చూడాలి. రైతుల రుణాలలో అత్యధికభాగం ఉత్పాదక అవసరాలకోసమేననీ, ఇంటి అవసరాలకోసం అప్పులు చేస్తున్నారనే అభిప్రాయం సరయినది కాదనీ స్వయంగా ప్రభుత్వం నియమించిన నిపుణుల బృందం చేసిన అధ్యయనం ప్రకారం తేలింది. అంటే ఇటీవలి కాలంలో వ్యవసాయం ఖరీదు పెరిగిపోయిందన్నమాట. ప్రపంచబ్యాంకు, ప్రపంచవాణిజ్యసంస్థ ఆదేశాలమేరకు, ప్రపంచీకరణ క్రమంలో బహుళజాతిసంస్థల కుతంత్రాలముందు కనీస రక్షణలు కూడ లేకుండా రైతులను వదిలినందువల్ల వచ్చిన ఫలితమిది. మార్కెట్ కోసం పంటలను ప్రోత్సహిస్తూ, ఆ మార్కెట్లను అంతర్జాతీయ బేహారుల ఇష్టారాజ్యానికి వదిలిన ఫలితమిది. విత్తనాలు, ఎరువులు, పురుగుల మందులు, వ్యవసాయ పరికరాలు, ప్రాసెసింగ్, మార్కెట్లు మొదలయిన అన్ని రంగాలలోనూ ప్రవేశపెట్టిన కొత్త విధానాలవల్ల, రైతు అనుకూల విధానాలను రద్దుచేసినందువల్ల రైతులకు అప్పులు చేయకుండా పంటలు పండించలేని స్థితి ఏర్పడింది. ఇక వ్యవసాయేతర అవసరాల కోసం కూడ రైతులు అప్పులు చేసి ఉండవచ్చు గాని అవి కూడ మన సాంస్కృతిక జీవనంలోకి, విలువల చట్రంలోకి వినియోగదారీ తత్వాన్ని, భోగలాలసను, అనవసరమైన సరుకులను ప్రవేశపెట్టిన ప్రపంచీకరణ శక్తుల ఘనకార్యాలే.

కనుక ఏ పాలకవర్గాలయితే గత రెండు దశాబ్దాలుగా మన రైతులు అప్పులపాలు కావడానికి కారణమయ్యాయో అవే పాలకవర్గాలు ఇవాళ ఆ అప్పులను మాఫీ చేసే చిట్కా తమ దగ్గర ఉందని ప్రగల్భాలు పలకడం నూటికి నూరుపాళ్లు మోసం తప్ప మరొకటి కాదు.

ఇక ఇంతకన్న హాస్యాస్పదమైన విషయం చిన్న, సన్నకారు రైతుల సంస్థాగత రుణాలు మాఫీ చేస్తామని అనడం. నిజానికి మన రుణసంస్థలు – వాణిజ్యబ్యాంకులు, గ్రామీణ బ్యాంకులు, సహకార సంస్థలు – చిన్న, సన్నకారు రైతులకు ఇంతపెద్ద మొత్తంలో అప్పులు ఇచ్చిన దాఖలాలు ఎక్కడాలేవు. సాధారణంగా పెద్ద, ధనిక రైతులకు ఎక్కువగానూ, మధ్యతరగతి రైతులకు కొద్దిగానూ మాత్రమే మన రుణసంస్థలు అప్పులు ఇస్తాయి. మిగిలిన చిన్న, సన్నకారు రైతులు సంస్థేతర రుణవనరులను, అంటే వడ్డీవ్యాపారులను ఆశ్రయించకతప్పదు. ప్రస్తుత రుణమాఫీ పథకం ఈ సంస్థేతర రుణవనరులకు వర్తించదు.



బ్యాంకుల జాతీయీకరణ సమయంలో వ్యవసాయరంగాన్ని ప్రాధాన్య రుణసహాయ రంగంగా గుర్తించి, బ్యాంకులు ఇచ్చే మొత్తం రుణాలలో కనీసం 18 శాతం వ్యవసాయరంగానికి అందేలా చూడాలని ఒక నియమం ఏర్పాటు చేశారు. నూతన ఆర్థిక విధానాల తర్వాత, బ్యాంకింగ్ రంగ సంస్కరణల తర్వాత ఆ నియమానికి నీళ్లు వదలడం జరిగింది. నిజానికి ఆ నియమాన్ని సక్రమంగా పాటించినా వడ్డీ వ్యాపారుల దగ్గర రైతుల రుణభారం ఇంతగా పెరిగి ఉండేది కాదు. ప్రభుత్వ గణాంకాల ప్రకారమే బ్యాంకుల రుణాలలో వ్యవసాయరంగానికి 18 శాతం కన్న తక్కువగా రుణం అందగా ఏర్పడిన లోటు ఒక్క 2005–06 లోనే రు. 22,000 కోట్లు. అంటే ఇప్పుడు రుణమాఫీగా భారీగా ప్రకటిస్తున్న మొత్తం గత మూడు నాలుగు సంవత్సరాలలో వ్యవసాయరంగానికి న్యాయంగా అందవలసిన రుణం కన్న తక్కువేనన్నమాట.

సహకారరంగంలో స్వల్పకాలిక రుణవ్యవస్థను మెరుగు పరచవలసిన అవసరం గురించి ప్రొ. వైద్యనాథన్ కమిటీ ఇచ్చిన సిఫారసుల ప్రకారం 17 రాష్ట్రాలకు నిధులు విడుదల చేయదలచుకున్నామని, మొదటి విడతగా నాలుగు రాష్ట్రాలకు నిధులు విడుదల చేశామని చిదంబరం గంభీరంగా ప్రకటించారు. కాని ఆ వాగాడంబరాన్ని దాటి లోపలికి వెళ్లి చూస్తే మొత్తం 17 రాష్ట్రాలకు కేంద్రం తయారు చేసిన పథకం రు 3,074 కోట్లు, నాలుగు రాష్ట్రాలకు కేటాయించిన నిధులు రు. 1185 కోట్లు మాత్రమే.

అవన్నీ అట్లా ఉంచి, నాలుగుకోట్ల రైతులకు లబ్ధి పథకంగా ఇప్పుడు ప్రకటిస్తున్న మొత్తం రు. అరవైవేలకోట్లు కాగా రక్షణ వ్యయంలో గత మూడు సంవత్సరాల పెరుగుదలతో అది సమానం. గత ఆర్థిక సంవత్సరంలో ఎగుమతిదారులకు (వ్యాపార, పారిశ్రామిక వర్గాలకు) అందిన ప్రోత్సాహకాల విలువ రు. 58,416 కోట్లు. భారత పారిశ్రామిక, వ్యాపారవర్గాలకు పన్నుల రాయితీలుగా, మినహాయింపులుగా, పన్ను సెలవుగా అందిన మొత్తం రు. 58,655 కోట్లు. (వారు రు. 5,56,190 కోట్లు లాభాలు చేసుకుని, పన్ను చెల్లించినది మాత్రం రు. 3,41,606 కోట్లకు మాత్రమే. అంటే రు. 2,14,584 కోట్ల లాభాన్ని వ్యాపారవేత్తలు ఎటువంటి పన్నులు చెల్లించకుండా తమ బొక్కసాల్లో నింపుకున్నారన్నమాట). ఎక్సైజ్ సుంకాలపై రాయితీల రూపంలో భారతప్రభుత్వ ఖజానా పోగొట్టుకున్నది రు. 87,992 కోట్లు.

ఈ ప్రజాస్వామిక, సర్వసత్తాక, గణతంత్ర పాలనలో ఎవరు లాభపడుతున్నారు? ఎవరు నష్టపోతున్నారు? ఎవరి పేరుచెప్పుకుని ఎవరు బతుకుతున్నారు? ప్రగల్భాలు పలుకుతున్నారు?

***సూర్య, మార్చ్ 12, 2008***

# 59

## గాలి మోటర్ల అడ్డా నిండా గాలి!

హైదరాబాదులో ఏడు దశాబ్దాలుగా పనిచేస్తున్న బేగంపేట గాలి మోటర్ల అడ్డాను తోసిరాజంటూ కొత్త అడ్డా వచ్చింది. వారంరోజుల కింద యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్ అధినేత్రి సోనియాగాంధీ ప్రారంభించిన ఆ అడ్డా అధికారిక పేరు రాజీవ్‌గాంధీ అంతర్జాతీయ విమానాశ్రయం. నిర్మాణవ్యయం రు. 1418 కోట్ల అంచనాతో మొదలయి, త్వరలోనే రు. 1760 కోట్ల వ్యయ అంచనాకు చేరినాక పనులు మొదలయి, ప్రస్తుతానికి రు. 2478 కోట్ల వ్యయంతో ముగిసింది. సాలీనా ఒకకోటీ ఇరవై లక్షల మంది ప్రయాణికులకు విమానయాన సౌకర్యం కలిగించే ఈ భారీ నిర్మాణం శంకుస్థాపన జరిగిన రోజునుంచి సరిగ్గా 36 నెలలు గడవకముందే పూర్తయి ప్రారంభోత్సవం కూడా జరుపుకుంది. ప్రారంభం అంటే మామూలుగా భాష తెలిసిన వాళ్లు ఆ రోజు నుంచో ఆ మర్నాటినుంచో అక్కడ పని మొదలయి ఉంటుందని అనుకుంటారు. కాని ఇప్పటికీ అక్కడ విమానాలు దిగడమూలేదు, అక్కడినుంచి విమానాలు ఎగరడమూలేదు. అక్కడ లోహ విహంగాల సంచారం ఎప్పుడు మొదలవుతుందో ఎవరూ చెప్పగల స్థితిలేదు.

హైదరాబాదు కొనుక్కున్న ఈ కొత్త బొమ్మ ఇంత తొందరగానే



పనికిరాకుండా పోయినందుకు, లేదా ఇంకా పని మొదలుపెట్టలేకపోతున్నందుకు ఎవరికి విచారంగా ఉన్నదో, ఎవరు ఎన్నికోట్ల రూపాయలు నష్టపోతున్నామని లెక్కలు వేసుకుంటున్నారో తెలియదుగాని, అసలు ఈ విమానాశ్రయం కథా కమామీషూ కొంచెం వివరంగా పరిశీలించవలసి ఉంది.

ప్రపంచీకరణ తర్వాత దేశంలో అప్పటికి ఉన్న విమానాశ్రయాలు సరిపోవనీ, అందువల్ల కొత్త సౌకర్యాలతో, అంతర్జాతీయ ప్రమాణాలతో, కొత్త విమానాశ్రయాలు నిర్మించాలనీ, కొత్త విమానయాన విధానం ఉండాలనీ 1990ల మధ్య నుంచే కేంద్రప్రభుత్వం లోని అధికారులూ, మంత్రులూ, ప్రధాన మంత్రులూ, కొందరు ముఖ్యమంత్రులూ కూడ మాట్లాడుతూ వస్తున్నారు. అప్పటివరకూ జాతీయోద్యమ లక్ష్యాలతో ప్రజాప్రయోజనం కొరకు విమానయానం ఉండాలనే దృక్పథంతో తయారయి అమలులో ఉన్న 1953 ఎయిర్ కార్పొరేషన్ చట్టాన్ని ఆనేపథ్యంలోనే 1994లో రద్దుచేశారు. బహుళజాతిసంస్థల, దేశదేశాల సంపన్నుల ప్రయోజనాలు నెరవేర్చడమే ప్రధానంగా సాగిన ఈ కొత్త ఆలోచనలు విధానరూపంలోకి మారి కేంద్రప్రభుత్వ పౌర విమానయాన శాఖ 2000 ఏప్రిల్ లో ఒక కొత్త విధాన ముసాయిదాను తయారు చేసింది. ఎనిమిది సంవత్సరాలు గడిచినా ఆ ముసాయిదా ఇంకా తుదిరూపానికి రాలేదన్నది వేరే సంగతి కాని భారతీయ జనతాపార్టీ నాయకత్వంలోని నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్ ప్రభుత్వం తయారు చేసిన ఆ విధానాన్ని యథాతథంగా కొనసాగించడానికి యుపిఎకు ఎటువంటి అభ్యంతరం లేకపోయిందని, విధానం ఖరారు కాకముందే దాన్ని అమలు చేయడం ప్రారంభమయిందని గుర్తించాలి.

ఒకవైపు విధానం తుదిరూపు దిద్దుకోకముందే, ఆ విధానంలో ప్రధానాంశమైన పబ్లిక్ – ప్రైవేటు భాగస్వామ్యం కింద కొత్త విమానాశ్రయాలు నిర్మించేపని మాత్రం మొదలయిపోయింది. ఆగస్టు 2000లో హైదరాబాదులో కొత్త విమానాశ్రయం ఆలోచన మొదలయితే, మే 2001లో టెండర్ ప్రక్రియలో జివిఎంఆర్ వాసవి అనే సంస్థ, మరొక మలేషియా సంస్థతో కలిసి సంయుక్తంగా ఆ టెండర్ గెలుచుకుంది. సెప్టెంబర్ 2003లో కేంద్రప్రభుత్వ విమానాశ్రయ ప్రాధికార సంస్థకూ, రాష్ట్రప్రభుత్వానికీ, హైదరాబాదు ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్ లిమిటెడ్ అనే సంయుక్తసంస్థకూ మధ్య కుదిరిన ప్రభుత్వ సహకార, వాటాదార్ల ఒప్పందాలతో ఈ విమానాశ్రయ నిర్మాణపని మొదలయింది. అలాగే కేంద్రప్రభుత్వ విమానయాన మంత్రిత్వ శాఖకు, హైదరాబాద్ ఇంటర్నేషనల్ ఏర్ పోర్ట్ లిమిటెడ్ కూ మధ్య 2004 డిసెంబర్ లో కుదిరిన 'రాయితీ ఒప్పందం' (ఒప్పందం అనాలి గాని అసలు శీర్షికలోనే రాయితీ ఒప్పందం అని రాయడంతోనే ఈ ప్రక్రియ అసలు లక్ష్యం బయట పడుతోంది) ప్రకారం హైదరాబాద్ కొత్త విమానాశ్రయం తయారయింది.

ఆ ఒప్పందంలో 5.2.1. అనే నిబంధన ప్రకారం ఈ విమానాశ్రయం ప్రారంభమయిన నాటినుంచి 25 సంవత్సరాల వరకు 150 కిలోమీటర్ల పరిధిలోని పాత విమానాశ్రయాల

నుంచి అంతర్జాతీయ విమానాలు నడపడానికి, కొత్త అంతర్జాతీయ విమానాశ్రయాలు నెలకొల్పడానికి కేంద్రప్రభుత్వం అనుమతించదు. అదేవిధంగా 5.2.2. అనే నిబంధన ప్రకారం దేశీయ విమానాలు నడపడానికి కూడ ప్రస్తుతం ఉన్న విమానాశ్రయాలను అనుమతించకపోవడం, కొత్త విమానాశ్రయాలను నిర్మించకపోవడం ప్రభుత్వ బాధ్యత. అంటే ఐదు సంవత్సరాల కొరకు ఎన్నికయిన ప్రభుత్వం రానున్న ఇరవై ఐదు సంవత్సరాల భవిష్యత్తును తాకట్టు పెట్టిందన్నమాట.

ఈ ఒప్పందాల కథ ఒక ఎత్తయితే, ఈ విమానాశ్రయ నిర్మాణ వ్యయం సమకూరిన వ్యవహారం మరొక ఎత్తు. ప్రభుత్వ ప్రైవేటు భాగస్వామ్యంలో, ప్రైవేటు వ్యాపారవేత్తలు నిర్మించి, నిర్వహించే ఈ నిర్మాణానికి అంచనా వేసిన రు. 1760 కోట్ల వ్యయంలో రు. 960 కోట్లు ద్రవ్య సంస్థలనుంచి, బ్యాంకులనుంచి 16 సంవత్సరాల రుణంగా పొందారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రు. 315 కోట్లు వడ్డీ లేని రుణంగా ఇచ్చింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమే రు. 107 కోట్లు గ్రాంటుగా ఇచ్చింది. ఇవన్నీ పోగా, విమానాశ్రయం నిర్మిస్తామని ముందుకు వచ్చిన వ్యాపారవేత్తల బృందం రు. 378 కోట్లు మాత్రమే (అప్పటి నిర్మాణ వ్యయంలో 21 శాతం) వెచ్చించిందన్నమాట.

ఇక ఈ విమానాశ్రయ నిర్మాణం కోసం ఐదువేల ఐదువందల ఎకరాలు సేకరించడానికి శంషాబాద్ పరిసరాలలో అనేక గ్రామాల నుంచి వందలాదిమంది రైతులను, వేలాది మంది ప్రజలను నిర్వాసితులను చేశారు. ఆ నిర్వాసితుల ఆందోళనల మీద ప్రభుత్వం ఒకవైపు ఉక్కుపాదం మోపింది, మరొకవైపు కొంతమందిని నష్టపరిహారం రూపంలో ప్రలోభపెట్టి అనేకమందికి శాశ్వత జీవనోపాధి సౌకర్యాలు పోగొట్టింది. అసలు హిమాయత్ సాగర్‌కు పది కిలోమీటర్ల పరిధిలోని ఈ భారీనిర్మాణం వల్ల ఆ తాగునీటి జలాశయం కలుషితమవుతుందనీ, అందువల్ల ఆ అనుమతిని రద్దుచేయాలనీ పర్యావరణవేత్తలు హైకోర్టు ముందు ఫిర్యాదు చేస్తే, హైకోర్టు ప్రభుత్వ పర్యవేక్షణ మీద నమ్మకం ఉంచి ఆ ఫిర్యాదును కొట్టివేసింది.

ప్రతిరోజూ ఒక కోటీ ముప్పైలక్షలమందికి ప్రయాణసౌకర్యం కల్పిస్తున్న ఆర్టీసీని రక్షించడానికి, పునరుద్ధరించడానికి చేతులు రాని ప్రభుత్వానికి, పాలకవర్గాలకు సాలీనా ఒకకోటీ ఇరవైలక్షలమంది ప్రయాణావసరాలు తీర్చే నిర్మాణం కోసం మాత్రం ఇవన్నీ చేయడం వీలయింది. భూమి ఇచ్చి, వడ్డీలు లేని అప్పులు ఇచ్చి, ఇతరుల దగ్గర పూచీపడి అప్పులు ఇప్పించి, ఇరవై ఐదేళ్ల దాకా మరొక వ్యాపారి పోటీ రాకుండా ఆటంకాలు కల్పించి… ఈ 'జీహుజూర్ జోహుకుం' బానిసత్వాన్ని ప్రదర్శిస్తూ దానికి ప్రభుత్వ–ప్రైవేటు భాగస్వామ్యమని పేరుపెడితే, ప్రజాధనం నుంచి వందలకోట్ల రూపాయలు అలా అప్పనంగా అప్పగిస్తుంటే దానివల్ల ప్రజలకు ఏమి ఒరుగుతున్నట్టు?

విమానాశ్రయాలు అవసరం లేదని కాదు. ఇటీవలికాలంలో సంపన్నులకు మాత్రమే కాక, మధ్యతరగతికి కూడ విమాన ప్రయాణం అందుబాటులోకి వచ్చిందన్నమాట కూడ



నిజమే. పాత విమానాశ్రయాలు పెరుగుతున్న అవసరాలను తీర్చలేకపోతున్నమాట కూడ నిజమే. కాని ఇన్నిన్ని రాయితీలతో ఈ ఆధునిక సౌకర్యాలను కల్పించవలసిందేనా? చుట్టూ పేదరికం, అవిద్య, అనారోగ్యం, నిరుద్యోగం మహాసముద్రాలు రాజ్యం చేస్తుంటే వాటిని తగ్గించడానికైనా నిధులు వెచ్చించలేని ప్రభుత్వాలు, ఇటువంటి ఆధునిక సంపన్న ద్వీపాల నిర్మాణానికై ఈ విధంగా సాగిలపడడం, దాసోహం అనడం ప్రభుత్వాల స్వభావానికి అద్దంపట్టడం లేదా?

***సూర్య, మార్చ్ 19, 2008***

# 60

## బియ్యం పథకం ఔదార్యం కాదు, అనివార్యం

రాష్ట్రప్రభుత్వం మళ్లీ ఒకసారి రెండు రూపాయలకు కిలో బియ్యం పథకాన్ని ప్రారంభించింది. ఇరవై ఐదు సంవత్సరాల కింద కొత్తగా రాజకీయాలలోకి ప్రవేశిస్తూ ఎన్ టి రామారావు ప్రారంభించిన ఈ పథకం అప్పటినుంచి ఇప్పటివరకు అనేకమంది ముఖ్యమంత్రుల కింద అనేక రకాలుగా మారుతూ వచ్చి డా. వై ఎస్ రాజశేఖరరెడ్డి పాలనలో మళ్లీ మొదటికి వచ్చింది. మహా ఆర్భాటంగా, ఎన్నికల ఎత్తుగడగా, ప్రతిపక్షాల విజయావకాశాలను చెదరగొట్టే అస్త్రంగా ఉనికిలోకి వస్తున్న ఈ పథకానికి రెండు వైపుల నుంచీ అతిశయోక్తులతో కూడిన ప్రశంసలూ విమర్శలూ చెలరేగుతున్నాయి. ఎద్దుల కుమ్ములాటలో లేగదూడల కాళ్లు విరిగినట్టు ఈ అతిశయోక్తుల యుద్ధంలో వాస్తవాలు, సరయిన విశ్లేషణలు, పథకపు అవసరం, పథకాన్ని విస్తరించవలసిన అవసరం అంతర్ధానమవుతున్నాయి.

రెండు రూపాయలకు కిలో బియ్యం పథకం ప్రభుత్వపక్షం చెప్పుకుంటున్నట్టు కేవలం ప్రజాసంక్షేమ దృష్టితో, పేదప్రజల ఆహారభద్రత లక్ష్యంతో సాగుతున్న పాలకపక్షపు ఔదార్యపూరిత కార్యక్రమం కాదు. పాలకులెవరయినా, ఏ జెండాలవాళ్లయినా గత ఆరు దశాబ్దాలుగా ప్రజాజీవనం పట్ల సాగిస్తున్న దుర్మార్గానికి, నిర్వాకానికి ప్రాయశ్చిత్తంగా, ప్రజలకు చేసిన నష్టాలకు పరిహారంగా అనివార్యంగా అమలు చేయవలసివస్తున్న పథకం అది.



ఆ పథకం ప్రతిపక్షాలు చెపుతున్నట్టు మరొకరికి అనుకరణో, ఎన్నికల ఎత్తుగడో మాత్రమే కాదు, అది ఈ రాష్ట్రపు పేదప్రజల సహజమైన హక్కు. ప్రజల శ్రమను, సంపదలను, ఉమ్మడి వనరులను దోచుకుని పాలకులు, వారి ఆశ్రితులు పోగుచేసుకున్న వేలరెట్ల, కోట్ల రూపాయల ఆస్తుల గురించి ప్రజలు నిలదీయకుండా ఉండేందుకు ఒక రక్షణకవచంగా, ఉపశమనంగా, ప్రజల హక్కుకు గుర్తింపుగా విదిలిస్తున్న ఒక చిన్నభాగం మాత్రమే.

అది కొంతమంది మేధావులు భావిస్తున్నట్టు రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను దిగజార్చే ప్రజాకర్షక (పాపులిస్టు) పథకం కాదు, ప్రజల ఇబ్బందులలో అతి స్వల్ప భాగాన్నయినా సరే తీర్చగలిగే తప్పనిసరి చర్య. అసలు ప్రజలకు అందవలసిన నిధులలో కొద్దిభాగాన్ని ప్రజలకు ఇవ్వడాన్ని పాపులిస్టు చర్యగా అభివర్ణించి వ్యతిరేకించడమే అన్యాయం.

ప్రభుత్వం, పాలకపక్షం తామేదో పేదప్రజల పట్ల అభిమానంతో, ప్రజాసంక్షేమం కోసమే ఈ కార్యక్రమాన్ని చేపట్టినట్టు ప్రకటిస్తున్నాయి గాని, అసలు ఆ ప్రకటనలోనే గుర్తించదగిన లోపాలున్నాయి. ఈ పథకం కోసం సాలీనా దాదాపు రెండు వేల కోట్ల రూపాయలు తాను సబ్సిడీగా వెచ్చించవలసివస్తుందని, ఒకకోటీ ఎనభైఎనిమిది లక్షల తెల్లకార్డుల లబ్ధిదారులకు, అంటే ఆరుకోట్లమంది ప్రజలకు దీనివల్ల ప్రయోజనం చేకూరుతుందని ప్రభుత్వం ప్రకటిస్తోంది.

రాష్ట్రంలో తెల్లకార్డుల సంఖ్య ఎంత? తెల్లకార్డుల సంఖ్యకూ, మొత్తం కుటుంబాల సంఖ్యకూ, రాష్ట్రప్రభుత్వం నిర్ణయించిన ప్రమాణాల ప్రకారం తెల్లకార్డు పొందడానికి అర్హత ఉన్న కుటుంబాల సంఖ్యకూ ఏమన్నా పొంతన ఉన్నదా?

రాష్ట్ర జనాభా ఎనిమిది కోట్ల ఇరవైరెండు లక్షలు అని, అందులో 85 శాతం ఈ పథకం వల్ల లబ్ధి పొందుతారని, 1.88 కోట్ల తెల్లకార్డుల కుటుంబాలు లబ్ధి పొందుతాయని ముఖ్యమంత్రి అన్నారు. ఈ మూడు అంకెలమధ్య పొంతన లేదు. జనాభా సంఖ్యను గనుక ప్రమాణంగా తీసుకుంటే ఆరు కోట్ల మంది అంటే 70 శాతం అవుతారు. 85 శాతం లబ్ధిదారులంటే ఏడుకోట్లమంది కావాలి!

ఈ అంకెలగారడీ అసలు వాస్తవమేమంటే, రాష్ట్రంలో 2001 జనగణన ప్రకారం జనాభా ఏడుకోట్ల అరవై లక్షలు కాగా, మొత్తం కుటుంబాల సంఖ్య 1,68,49,857. సాధారణంగా జనగణనలో హౌజ్‌హోల్డ్ అనే ప్రమాణమే ఉంటుంది. అది స్థూలంగా ఇల్లు అని చెప్పుకోవచ్చు, సరిగ్గా కుటుంబం కాకపోవచ్చు. ఒక్కో ఇంటిలో ఒకటికన్న ఎక్కువ కుటుంబాలు ఉండవచ్చు. కాని 2001 జనగణన హౌజ్‌హోల్డ్స్ కు సంబంధించి చాల వివరాలు సేకరించింది. దానిలో హౌజ్‌హోల్డ్స్ సంఖ్యతో పాటు ఆ ఇళ్లలో ఉన్న వివాహిత జంటల సంఖ్యను కూడ లెక్కపెట్టింది. దానిప్రకారం రాష్ట్రంలో మొత్తం 1,77,42,719 వివాహిత జంటలున్నాయి. అప్పటినుంచి గడిచిన ఆరు సంవత్సరాలలో మొత్తం జనాభాలో పది శాతం పెరుగుదల ఉంది గనుక

కుటుంబాల సంఖ్యలో కూడ అంతే పెరుగుదల ఉందనుకుంటే మొత్తం కుటుంబాల సంఖ్య రెండు కోట్లకు దాటడానికి వీలులేదు. మరొకవైపు నుంచి చూసినా మన రాష్ట్రంలో సగటు కుటుంబ పరిమాణం 5 కన్న తక్కువే గనుక 8.22 కోట్ల జనాభాకు 1.64 కోట్ల కుటుంబాలకన్న ఎక్కువ ఉండడానికి వీలు లేదు. మొత్తంమీద ఎటునుంచి ఎటు చూసినా కుటుంబాల సంఖ్య ఒక కోటి అరవై లక్షల నుంచి 2 కోట్ల మధ్య మాత్రమే. ప్రభుత్వ గణాంకాల ప్రకారం 30 శాతం మాత్రమే దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారు గనుక తెల్లకార్డులు 55 లక్షల నుంచి 66 లక్షల కన్న ఎక్కువ ఉండడానికి వీలులేదు. మరి కేవలం తెల్లకార్డుల సంఖ్యే మొత్తం కుటుంబాల సంఖ్య కన్న ఎక్కువ ఉంది.

నిజానికి ఈ జనాభాకూ తెల్లకార్డుల సంఖ్యకూ మధ్య ఉన్న అంతరం గురించి 1992లోనే గుర్తించిన కె ఆర్ వేణుగోపాల్ రాష్ట్రంలో మొత్తం కుటుంబాల సంఖ్య కన్న తెల్ల, గులాబీ కార్డుల సంఖ్య ఎక్కువగా ఉన్నదని ప్రకటించారు. 'ఇండియాస్ పబ్లిక్ డిస్ట్రిబ్యూషన్ సిస్టం – ఎ నేషనల్ అండ్ ఇంటర్నేషనల్ పర్స్పెక్టివ్' అని 1997లో ప్రపంచబ్యాంకు కోసం చేసిన అధ్యయనంలో ఆర్ రాధాకృష్ణ, కె సుబ్బారావు కూడ ఈ అంకెలగారడీని, బోగస్ కార్డుల సమస్యను ప్రస్తావించారు.

కనుక ఈ పథకం వల్ల ఎంతమందికి లాభం చేకూరుతుంది, ఎన్నికోట్లు ఖర్చు అవుతుంది అనేవన్నీ కాకిలెక్కలేతప్ప, విశ్వసనీయమైన, కచ్చితమైన సమాచారం కాదు. ఆ సంగతి గుర్తిస్తూనే, అసలు ఇటువంటి పథకం వచ్చిన సందర్భాన్ని, ఉండవలసిన అవసరాన్ని కూడ గుర్తించవలసి ఉంది.

విదేశీపాలన రద్దయిందని అనుకున్నతర్వాత నాలుగు దశాబ్దాలకు కూడ జనాభాలో అత్యధికులకు రోజుకు రెండుపూటల ఆహారం చౌకగా అందే పరిస్థితి లేకపోవడం, మరొకవైపు ఆహారధాన్యాల దిగుబడి జనాభా పెరుగుదల కన్న గణనీయంగా ఎక్కువగా ఉన్నప్పటికీ ఆహారభద్రత కల్పించడంలో, న్యాయమైన, సమానమైన పంపిణీని ప్రోత్సహించడంలో పాలకులు విఫలమయ్యారని గుర్తించడం ఫలితంగా 1960ల నుంచీ ఎన్నో రాజకీయార్థిక సంచలనాలు పాలకవిధానాలను ఎదిరిస్తూ వచ్చాయి. అందువల్లనే ఇందిరాగాంధీ 'రోటీ కపడా ఔర్ మకాన్' అనీ, భూసంస్కరణలు అనీ అనవలసి వచ్చింది. ఆ నినాదాల భ్రమలు కూడ ఒక దశాబ్దం కన్న ఎక్కువ నిలవని స్థితిలో దేశభద్రత, రక్షణ ప్రమాదం, తీవ్రవాదం అనే కొత్తబూచిలను చూపి ప్రజల కళ్లు కప్పడం మొదలయింది. ఆ దశలో రాజకీయాలలోకి ప్రవేశించిన ఎన్ టి రామారావు కొంత నిజంగానూ, కొంత పాలకవర్గ ఎత్తుగడలలో భాగంగానూ రెండురూపాయలకు కిలో బియ్యం పథకాన్ని అమలులోకి తెచ్చారు.

ప్రజా ఆగ్రహాన్ని పక్కదారి పట్టించడానికి ఒక ఎత్తుగడగా ఇది పనికి వచ్చినప్పటికీ, ఇది ప్రజాసంక్షేమ రాజకీయాలకు చిహ్నంగనుక ఇది కొనసాగగూడదని ప్రపంచబ్యాంకు దగ్గరినుంచి స్థానిక సంపన్నుల వరకూ అందరూ ఈ పథకం మీద కత్తి కట్టారు. ఒక దశాబ్దం



తర్వాత చంద్రబాబు నాయుడు పాలనాకాలానికి ప్రజలను భ్రమల్లో ముంచడానికి అభివృద్ధి మాయాజాలం వచ్చింది గనుక, 'రొట్టెలు అడిగేవాళ్లకు సర్కస్ ఇద్దాం' అనే పెట్టుబడిదారీ సలహాదార్లు వచ్చారు గనుక ఆకలిగొన్న ప్రజలకు కొంత ఉపశమనంగా ఉండే ఈ పథకం బదులు, ఫ్లై ఓవర్లు, మల్టిప్లెక్సులు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ జిలుగులు, విదేశీ అనుకరణలు వచ్చాయి. ప్రజల ఆహార అవసరాలలో అతికొద్ది భాగాన్నయినా తీర్చే సంక్షేమపథకం ప్రపంచీకరణ గాలికి కొట్టుకుపోయింది.

ఆ పథకం ఇప్పుడు ఎన్నికల అవసరం కోసమయినా మళ్లీ పునరుత్థానమయినందుకు సంతోషించాలి. దీన్ని మరింత విస్తరించాలనీ, కుటుంబానికి అవసరమైనంత బియ్యం ఇచ్చేలా సవరించాలనీ, నిజంగా అవసరమయిన పేదలకే అందేలా చూడాలనీ, మంత్రుల, శాసనసభ్యుల, అధికారుల అవినీతి, రక్షణ సౌకర్యాల, విలాసాల ఖర్చుల ముందు రెండువేలకోట్ల సబ్సిడీ ఒక లెక్కకాదనీ, ఈ సబ్సిడీ ఇంకా పెరిగినా ఫరవాలేదనీ అవగాహన పెంచవలసి ఉంది. ప్రజాపంపిణీ వ్యవస్థను, చౌకధరల దుకాణాల విధానాన్ని బలోపేతం చేయడానికి ఒక తొలిమెట్టుగా ఈ బియ్యం పథకాన్ని వినియోగించుకోవలసి ఉంది.

***సూర్య, ఏప్రిల్ 9, 2008***

# 61

# ప్రపంచీకరణ సందర్భంలో కార్మికోద్యమం

దేశంలో సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ, నూతన ఆర్థిక విధానాలు ప్రారంభమయిన తొలిరోజుల్లో ఈ విధానాల వల్ల కార్మికోద్యమం ఎటువంటి మార్పులకు, సమస్యలకు, సంక్షోభానికి గురి అవుతుందోననే ఆందోళన కొంత ఉండింది. ప్రపంచీకరణ వల్ల కార్మికవర్గం మొత్తంగానూ, కార్మికోద్యమం ప్రత్యేకంగానూ ఎదుర్కోనున్న సవాళ్ళ గురించి అటు దేశవ్యాపిత సంఘటిత కార్మిక సంఘాలు, ఇటు కిందిస్థాయి, అసంఘటిత కార్మిక ఉద్యమ సంస్థలు, కొందరు ఆలోచనాపరులు కూడ చాలా తీవ్రంగా ఆలోచించారు. 'ప్రపంచీకరణ – మూడవ ప్రపంచ దేశాల కార్మికోద్యమాలు' అనే అంశం మీద చాలా చర్చ జరిగి, వ్యాసాలు పుస్తకాలు వెలువడ్డాయి. కాని క్రమక్రమంగా ఆ చర్చ వెనుకపట్టు పట్టినట్టుంది. ప్రపంచీకరణ క్రమం కార్మికోద్యమాన్ని లోపలినుంచీ బయటినుంచీ కూడ తొలిచివేయడం మొదలయింది. పని పరిస్థితులలో మార్పులు, పెరుగుతున్న నిరుద్యోగ సైన్యం, దివాళాకోరు నాయకత్వం, కార్మిక, ఉద్యోగ వర్గాలలో మధ్యతరగతి భావజాలం, వినియోగదారీ సంస్కృతి పెరిగి కార్మికులలో శిష్టవర్గం (లేబర్ అరిస్టోక్రసీ) తలెత్తడం వంటి పరిణామాలతో కార్మికోద్యమం బలహీనపడడం మొదలయింది. నూతన ఆర్థిక విధానాలు ప్రారంభమై పదహారు సంవత్సరాల తర్వాత ఇప్పుడు చూస్తే దేశవ్యాపితంగా



గాని, రాష్ట్రంలో గాని కార్మికోద్యమం బలంగా ఉన్నదని చెప్పగల స్థితి మాత్రం లేదు. తమ కొత్త కోర్కెలమీదనో, పని పరిస్థితులు మెరుగుపరచమనో, జీతభత్యాలు పెంచమనో ఆందోళనలు చేయడం అలా ఉంచి, తమ మీద పెద్ద ఎత్తున సాగుతున్న దాడులను ఎదుర్కోగల చేవ కూడా కార్మిక, ఉద్యోగవర్గాలకు లేకుండాపోయింది.

కార్మిక, ఉద్యోగ వర్గాలమీద ప్రపంచీకరణ క్రమం ఏయే రూపాలలో దాడులు చేస్తూ వస్తున్నదో ఆ దాడులకు కనీస ప్రతిఘటన కూడ చూపలేని దుస్థితికి కార్మికవర్గం ఎలా దిగజారిపోయిందో అర్థం చేసుకుంటే ఈ స్థితినుంచి బయటపడడానికి ఏమయినా అవకాశాలున్నాయేమో ఆలోచించవచ్చు.

ప్రపంచీకరణ క్రమంలో ప్రైవేటీకరణ చాల ప్రధానమైన భాగం. ప్రభుత్వ రంగ ప్రాధాన్యాన్ని తగ్గించడం, ప్రభుత్వరంగ సంస్థలను మూసివేయడం, వాటినుంచి ప్రభుత్వ పెట్టుబడులను ఉపసంహరించడం వాటిని ప్రైవేట్ వ్యాపారవేత్తలకు, బహుళజాతి సంస్థల దళారీలకు అప్పగించడం, కొత్త సంస్థలన్నిటినీ ప్రైవేట్ రంగంలోనే ప్రోత్సహించడం వంటి పరిణామాలన్నీ నూతన ఆర్థిక విధానాలలో విపరీతంగా జరిగిపోయాయి.

ఈ ప్రైవేట్‌రంగ పారిశ్రామిక, వ్యాపార విజృంభణవల్ల ఆర్థిక రంగంలో వచ్చిన మార్పులను గురించి ఇక్కడ అప్రస్తుతం గాని, కార్మికుల పని పరిస్థితుల విషయంలో, జీతభత్యాల విషయంలో, హక్కుల విషయంలో, సంఘటిత కార్మికోద్యమం విషయంలో ఈ ప్రైవేటీకరణ చాల లోతయిన మార్పులు తీసుకువచ్చింది. అప్పటివరకూ ప్రభుత్వరంగంలో అరకొరగానయినా ఉండిన ఉద్యోగభద్రతకు, సామూహిక బేరసారాల అవకాశాలకు, సంఘటిత నిర్మాణాలకు ప్రైవేట్‌రంగంలో అవకాశం లేకుండాపోయింది. ప్రైవేట్ సంస్థలు పెరిగినకొద్దీ కార్మికోద్యమ శక్తి సన్నగిల్లుతూ వచ్చింది. ప్రైవేటీకరణ ప్రమాదాన్ని ముందుగానే గుర్తించి దాని గురించి విస్తృత ప్రచారం చేయడంలో, ఎదుర్కోవడంలో, కార్మికులందరినీ సమీకరించడంలో సంఘటిత కార్మిక సంఘాలు తగినంత చొరవను ప్రదర్శించలేకపోయాయి. దానితో క్రమంగా ప్రైవేటీకరణ మొత్తం కార్మికవర్గాన్నే ముంచెత్తింది.

ఒకవైపు కార్మికవర్గాన్ని ప్రపంచీకరణ ప్రమాదం ఇలా ముంచెత్తుతుండగా దేశంలోని కార్మికోద్యమం రాజకీయాల ప్రాతిపదికపైన, పరిశ్రమల ప్రాతిపదికపైన, పరిశ్రమలోని కార్మికుల, ఉద్యోగుల హోదాల ప్రాతిపదికపైన, కుల, మత, ప్రాంత, భాషా ప్రాతిపదికలపైన చీలికలు పీలికలుగా మారిపోయింది. ఆయా కార్మికులకు ఉండే నిర్దిష్ట సమస్యల వల్ల కొన్ని సందర్భాలలో విభిన్న నిర్మాణాలు కూడ అవసరం కావచ్చు గాని సందర్భం వచ్చినప్పుడు ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా ఆయా భిన్న నిర్మాణాల మధ్య ఐక్యత అనివార్య అవసరమవుతుంది. భారత కార్మికోద్యమంలో అటువంటి ఐక్యత ప్రదర్శితమైన సందర్భాలు చాలా తక్కువ. ఒక సంఘం సమ్మెకు పిలుపు ఇస్తే, అందుకు ఎంత న్యాయమైన కారణాలున్నప్పటికీ ఇతర సంఘాలు తప్పనిసరిగా ఆ సమ్మెను భగ్నం చేయడానికి ప్రయత్నించడం మామూలయిపోయింది. యాజమాన్యాలు, ప్రభుత్వం ఇతర సంఘాలను లొంగదీసుకొని, కార్మికోద్యమాన్ని విచ్ఛిన్నం చేసి తమ పబ్బం గడుపుకోవడం మామూలయి పోయింది.

ఈ సమస్య ప్రపంచీకరణ తర్వాత మరింత పెరిగిపోయింది. ప్రపంచీకరణ తర్వాత యాజమాన్యాలు, ప్రభుత్వాలు కొత్త భాష నేర్చుకున్నాయి. కొత్త వనరులు సంపాదించాయి. యాజమాన్యాల దగ్గర, ప్రభుత్వాల దగ్గర అందుబాటులోకి వచ్చిన కొత్త వనరుల వల్ల సంఘాల నాయకత్వాలను, క్రియాశీల కార్యకర్తలను కొనివేసే, మచ్చిక చేసుకునే అవకాశాలు పెరిగిపోయాయి. కాంగ్రెస్ అనుబంధ సంస్థ అయిన ఐ.ఎన్.టి.యు.సి. బహిరంగంగా ప్రపంచీకరణ విధానాలను సమర్థిస్తుండగా, ఇతర రాజకీయ పక్షాలన్నీ కూడ ప్రపంచీకరణ విధానాలను అమలు చేస్తున్నవే గనుక వాటి అనుబంధ కార్మిక సంఘాలు ద్వంద్వ వైఖరులను ప్రకటిస్తున్నాయి.

ప్రైవేటీకరణతో పాటు వచ్చిపడిన మరొక పెద్ద ప్రమాదం ఉత్పత్తి పద్ధతులలో వచ్చిన మార్పులు. పనిని చిన్న చిన్న ముక్కలుగా విడగొట్టడం, అనేకమంది కాంట్రాక్టర్లకు, సబ్‌కాంట్రాక్టర్లకు అప్పగించడం, అసలు ఉత్పత్తి సంస్థలకూ కార్మికులకూ ఎటువంటి సంబంధం లేకపోవడం, కార్మికులు ఒకేచోట సంఘటితంగా ఉండలేని పరిస్థితులు కల్పించి చిన్న చిన్న సంస్థలలో, ఇళ్లలో పని అప్పగించడం, దాన్ని స్త్రీలు, చిన్న పిల్లలు చేయడం వల్ల సంఘటిత నిర్మాణం లోకి రాలేకపోవడం వంటి పరిస్థితులు తలెత్తాయి. ఇటువంటి కాంట్రాక్టు, కాజువల్, గృహ ఉత్పత్తి పద్ధతిని కార్మిక సంఘాలు మొదటినుంచీ వ్యతిరేకించి ఉండవలసింది. ఈ పద్ధతులకు వ్యతిరేకంగా కార్మికవర్గాన్ని మొత్తంగా జాగృతం చేయవలసి ఉండింది. ఈ రకమైన ధోరణులు పెరిగిపోతూ ఉన్నప్పుడు కాంట్రాక్టు, కాజువల్, గృహ శ్రామికులను కూడ సంఘటిత నిర్మాణాలలోకి తీసుకువచ్చే ప్రయత్నం చేసి ఉండవలసింది. వామపక్ష ట్రేడ్ యూనియన్లతో సహా జాతీయ కార్మిక సంఘాలన్నీ ఈ పనిలో విఫలమయ్యాయి. ఒకవైపు ఇలా ఇబ్బడిముబ్బడిగా పెరుగుతున్న అసంఘటిత కార్మిక రంగం, సంఘటిత కార్మిక రంగంలో, ముఖ్యంగా నాయకత్వంలో పెరుగుతున్న నిర్లిప్తత కలిసి మొత్తంగా కార్మికోద్యమ బలహీనతకు దారి తీశాయి. ఇంతకాలమూ అసంఘటిత రంగంగా గుర్తించబడిన ఈ రంగాల శ్రామికులను పటిష్టమైన నిర్మాణాలలో సంఘటిత పరచినప్పుడు మాత్రమే వారి పని పరిస్థితులను మెరుగు పరచడానికి వీలవుతుంది. ఆ విధంగా మాత్రమే కార్మికోద్యమంలో అంతకంతకూ ఎక్కువమంది భాగస్వాములు కావడానికి, కార్మికోద్యమం బలపడడానికి వీలు కలుగుతుంది.

అసంఘటిత కార్మికరంగం పెరుగుదలలో ముఖ్యమైన అంశం గత రెండు దశాబ్దాలలో గ్రామాల నుంచి పట్టణాలకు విపరీతంగా పెరుగుతున్న వలసలు, పెరుగుతున్న పట్టణీకరణ. ఈ విధంగా లక్షలాది మంది శ్రామికులు పట్టణాలలో ప్రవేశించి నిరుద్యోగ సైన్యంలో చేరుతున్నారు గనుక, ఉన్న తక్కువ ఉద్యోగాలకు పోటీ పెరుగుతోంది. ఉత్పత్తి పద్ధతులు, వ్యాపారాలు ఇంకా ఇంకా ఎక్కువ అసంఘటితంగా మారడానికి అవసరమైన చౌక శ్రామికుల సరఫరా నిరంతరాయంగా జరుగుతోంది. దానితో కనీస వేతనాలు తగ్గిపోతున్నాయి. వేతనాలు తగ్గనిచోట్ల కూడ పట్టణీకరణ వల్ల, ధరల పెరుగుదల వల్ల, పట్టణాల జీవన ప్రమాణాల వల్ల



నిజవేతనాలు కూడ తగ్గిపోతున్నాయి. వేతనాలను పెంచుకోవడానికి, నిజవేతనాలు తగ్గకుండా చూడడానికి పోరాడవలసిన కార్మిక సంఘాలు ఆ బాధ్యతనే విస్మరిస్తున్నాయి.

ప్రపంచీకరణ తర్వాత కార్మికోద్యమానికి వచ్చిన మరొక ప్రమాదం ఆర్థికవ్యవస్థలో పాత పారిశ్రామిక, ఉత్పత్తి రంగ సంస్థల ప్రాధాన్యం తగ్గిపోయి, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, రియల్ ఎస్టేట్, హోటళ్లు వంటి వ్యాపార, సేవారంగసంస్థల ప్రాబల్యం పెరగడం. ఈ రంగాల ప్రత్యేకమైన పనిపద్ధతుల వల్ల అక్కడ ఒకేచోట చాలమంది ఉద్యోగులు, కార్మికులు ఉండే పరిస్థితి ఉన్నప్పటికీ వారందరికీ ఒకే రకమైన ప్రయోజనాలు, పని పరిస్థితులు, కోర్కెలు, జీవనప్రమాణాలు ఉండే అవకాశంలేదు. కార్మిక, ఉద్యోగ సంఘాల ఏర్పాటుకు అవకాశం లేదు. అందువల్ల సామూహిక బేరసారాలకు అవకాశం తగ్గిపోయింది. ఒకప్పుడు కార్మికోద్యమం బలంగా ఉండిన ప్రభుత్వాధీనంలోని బ్యాంకింగ్, ఇన్సూరెన్స్ రంగాలలోకి ప్రైవేట్ సంస్థలు విపరీతంగా ప్రవేశించడం వల్ల, ప్రభుత్వ రంగ సంస్థలలో కొత్త నియామకాలు లేకపోవడం వల్ల ఆ రెండు రంగాల కార్మికోద్యమాలు కూడ బలహీనపడ్డాయి.

కార్మికోద్యమం బలహీనపడినందువల్ల గత పదిహేను సంవత్సరాలుగా ప్రభుత్వం కార్మిక, ఉద్యోగ ప్రయోజనాలను దెబ్బతీసేలా పెన్షన్ నిబంధనలను మారుస్తూ వచ్చినప్పటికీ కార్మికోద్యమం పెద్ద ఎత్తున ప్రతిఘటించలేకపోయింది. అనేక కార్మిక సంక్షేమ చట్టాలను ప్రభుత్వాలు మారుస్తూ, కార్మిక వ్యతిరేక నిబంధనలను ప్రవేశపెడుతూ వచ్చినప్పటికీ కార్మికోద్యమం పెద్ద ఎత్తున ప్రతిఘటించలేకపోయింది. దేశ వ్యాప్తంగా ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేస్తూ, వాటిని విదేశీ భూభాగాలుగా ప్రకటిస్తూ, అక్కడ అన్ని కార్మిక సంక్షేమ చట్టాలను రద్దు చేస్తూ వస్తే కూడ ప్రతిఘటించే శక్తి కార్మికోద్యమానికి లేకపోయింది. నిజానికి జాతీయ కార్మిక సంఘాలన్నిటికీ రాజకీయ పక్షాలతో సంబంధం ఉన్నది గనుక అన్ని రాజకీయ పక్షాలూ ప్రత్యేక ఆర్థిక మండలాలను సమర్థించేవే గనుక ఏ ఒక్క కార్మిక సంఘమూ ప్రత్యేక ఆర్థిక మండలాల రూపంలో కార్మికోద్యమం మీద జరుగుతున్న దాడిని అడ్డుకోలేకపోయాయి.

ఈ దృశ్యానికి అవతలి కోణం కూడ ఉంది. నిజానికి ప్రపంచీకరణ వల్ల నిజంగా ప్రయోజనం పొందుతున్నవారు పదిశాతానికి మించరు. మిగిలిన తొంబై శాతం ప్రజలు ఏదో ఒకరకంగా ప్రపంచీకరణ వల్ల నష్టపోతున్నవారే. దేశంలోని శ్రామిక జనాభాకు కూడ ఇది వర్తిస్తుంది. అందువల్ల ప్రపంచీకరణ వ్యతిరేక పోరాటాన్ని నిజాయితీగా నడపదలచుకున్న నాయకత్వం ఉంటే, సరయిన పంథాలో కార్మికులను సమీకరించగలిగితే చాల బలమైన కార్మికోద్యమం నిర్మించడానికి మరెప్పటికన్నా ఎక్కువ అనుకూలమైన పరిస్థితులు ఇప్పుడే ఉన్నాయి. కావలసిందల్లా కార్మికోద్యమ నిర్మాణాలు ఇంతకాలం చేసిన పొరపాట్లను సరిగా సమీక్షించుకుని, విశాల శ్రామిక ప్రజాబాహుళ్యాన్ని సంఘటితం చేయగలిగిన సరైన విధివిధానాలను రూపొందించుకోవడం.

**వీక్షణం, మే 2008**

# 62

# అణు ఒప్పందం అసలు సమస్యలు

అణు ఒప్పందం వ్యవహారంలో అమెరికా షరతులను అంగీకరిస్తూ ముందుకు సాగడానికి ప్రభుత్వం నిర్ణయించుకోవడం, ఆ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ యుపిఎ భాగస్వామ్య పక్షాలయిన వామపక్షాలు కూటమికి మద్దతును ఉపసంహరించుకోవడం ఇవాల్టి వార్త. ఇది ప్రధానంగా రాజకీయ సంక్షోభంగానో భారత సార్వభౌమాధికార సమస్యగానో కనబడుతున్నది. ఇంఖా కొంచెం ముందుకు వెళితే అది అణు విద్యుత్తుకు సంబంధించిన సాంకేతిక అంశంగా కూడా చూపి ఆ సాంకేతిక నిపుణులు తప్ప మరెవరూ ఆ విషయంలో నోరెత్తడానికి వీలులేదన్న వ్యాఖ్యలూ వినబడుతున్నాయి.

ఇందులో రాజకీయ, సార్వభౌమాధికార, సాంకేతిక అంశాలు ఉన్నమాట నిజమే గాని, వాటితో సమానంగానో, ఇంకా ఎక్కువ ప్రాధాన్యతతోనో రాజకీయార్థిక అంశాలు ఉన్నాయి. ఆ రాజకీయార్థిక అంశాలు అసలు మొత్తం సమస్యకు మూలాధారంగా కూడా ఉన్నాయి. అణు ఒప్పందాన్ని వ్యతిరేకిస్తున్నామంటున్న ప్రతిపక్షాలు కూడా ఆ రాజకీయార్థిక మూలాలను ప్రశ్నించకపోవడం వల్ల, కొంతవరకు ఆ రాజకీయార్థిక మూలాలను సమర్థించే వాదనలు కూడా చేస్తున్నందువల్ల సమస్య మరింత జటిలం అవుతున్నది.



వామపక్షాలు చేస్తున్న వాదనలలో సార్వభౌమాధికార అంశం ఉన్నంతగా అణువిద్యుత్తు గురించిన మౌలిక ప్రశ్నలు లేవు. నిజానికి భారత ప్రభుత్వం నిజమైన సార్వభౌమాధికారాన్ని అనుభవించిన సందర్భాలు ఈ అరవై సంవత్సరాలలో అతి తక్కువ గనుక సార్వభౌమాధికార చర్చకు అర్థం లేదు. అలాగే ప్రధాని మన్మోహన్ సింగ్ అమెరికా అనుకూలత గురించో, జార్జి బుష్‌కు ఆయన దాసోహమంటున్న తీరు గురించో వామపక్షాలు చాల తీవ్రమైన అభ్యంతరాలు తెలుపుతున్నాయి గాని, భారత రాజకీయాలలోకి ప్రవేశించిన నాటి నుంచీ ప్రపంచబ్యాంకు మాజీ ఉద్యోగిగా ఆయన ప్రవర్తిస్తున్న తీరు అదే. ప్రధానమంత్రిగా ఉంటూ కూడ రెండు సంవత్సరాల కింద ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ ఉపన్యాసంలో ఆయన బ్రిటిష్ వలసవాద పాలనను సమర్థించాడు. కనుక ఆయన విదేశీ గులాంగిరీ ఇవాళే కొత్తగా తెలిసినట్టు నటించడం ఆత్మవంచనో, పరవంచనో కావాలి.

అసలు మొత్తంగా అణు ఇంధన వ్యవహారంలోనే సంక్లిష్టత ఉంది. మనమీద అమెరికా పెత్తనం ఏమిటి అనే ప్రశ్న వేసుకుంటే మన అణువిద్యుత్తు కార్యక్రమాన్ని సమర్థించవలసి వస్తుంది. అసలు అణు విద్యుత్తు అవసరమా, అది ఎవరి ప్రయోజనాల కోసం అనే ప్రశ్న వేసుకుంటే ఆ కార్యక్రమాన్ని వ్యతిరేకించవలసి వస్తుంది. భారతదేశానికి అణువిద్యుత్తు అవసరమా, ఇతర విద్యుదుత్పత్తి అవకాశాలన్నీ ప్రయత్నించిన తర్వాతనే మనం అణువిద్యుత్తు వైపు చూస్తున్నామా, అణువిద్యుత్పత్తి వల్ల వచ్చే సమస్యలను పరిష్కరించగలమా, అణు విద్యుత్తు వైపు వెళ్లడంలో నిజంగా మన అవసరాల, ప్రాధాన్యతల పాత్ర ఎంత, బహుళజాతి విద్యుత్ కార్పొరేషన్ల పాత్ర ఎంత, వాటికోసం అమెరికా ప్రభుత్వం మనమీద తెస్తున్న ఒత్తిడి ఎంత, ఇంతకూ అణు విద్యుత్తును శాంతియుత ప్రయోజనాల కోసం వినియోగించడం అనే మాటకు అర్థం ఉందా, అలా వినియోగించినా ఎంత విద్యుత్తు తయారు చేయగలం, మిగిలిపోయిన అణువ్యర్థ పదర్థాలు బాంబులు తయారు చేయడానికి తప్ప మరెందుకూ పనికిరానప్పుడు శాంతియుత అణువిద్యుదుత్పత్తి కూడా అంతిమంగా అణ్వస్త్ర దేశంగా మారడానికేనా, అంటే లెక్కపత్రమూ లేకుండా వేల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని ఈ రంగానికి బదలాయించి బహుళజాతి సంస్థలకు దోచిపెట్టడమూ, వారి భారతీయ జూనియర్ భాగస్వాములకూ, ఆ రంగంతో సంబంధం ఉండి నిర్ణయాధికారం ఉన్న రాజకీయ వేత్తలకూ వందల కోట్ల రూపాయల ముడుపులు ముట్టడానికేనా వంటి అనేక ప్రశ్నలకూ సమాధానం చెప్పుకోవలసి ఉన్నది.

నిజానికి అణు ఒప్పందాన్ని వ్యతిరేకిస్తున్నట్టు నటిస్తున్న ప్రతిపక్షాలేవీ కూడా ఇటువంటి ప్రశ్నలేమీ వేయడం లేదు. అసులు దేశంలో అణు కార్యక్రమమే చాల అబద్ధాలతో, అతిశయోక్తులతో, అరాచకంగా మొదలయింది. కేవలం ప్రధానమంత్రికి మాత్రమే జవాబుదారీగా ఉండి, మంత్రివర్గానికి గానీ, పార్లమెంట్‌కు గానీ, ప్రజలకు గానీ ఎటువంటి సమాచారం లేకుండా అణుకార్యక్రమం సాగేలా ఇందిరాగాంధీ ఈ కార్యక్రమాన్ని ప్రారంభించారు. 2000 నాటికి 10,000 మెగావాట్ల అణువిద్యుత్ ఉత్పాదక శక్తిని స్థాపిస్తామని 1980ల మధ్యలో ప్రకటించినప్పటికీ, ప్రస్తుతానికి భారతదేశం సాధించిన స్థాపిత అణువిద్యుదుత్పత్తి శక్తి నాలుగువేల

మెగావాట్ల లోపే. ప్రస్తుతం 2020 నాటికి 20,000 మెగావాట్ల స్థాపిత శక్తిని సాధిస్తామనీ, ప్రస్తుతం దేశ విద్యుత్ అవసరాలలో 2.6 శాతాన్ని మాత్రమే తీరుస్తున్న అణువిద్యుత్తును 2020 నాటికి 25 శాతానికి తీసుకుపోతామనీ, అందుకు అవసరమైన యురేనియం నిలువలు దేశంలో లేనందువల్ల దిగుమతి చేసుకోవలసి వస్తుందనీ, అలా దిగుమతి చేసుకోవాలంటే అమెరికా విధిస్తున్న షరతులకు తల ఒగ్గక తప్పదనీ భారత ప్రభుత్వం వాదిస్తున్నది.

కాని ఇదంతా పచ్చి అబద్ధం. కేవలం అణు విద్యుత్ కేంద్రాలు ఏర్పాటు చేయడానికి రానున్న పదహేలు సంవత్సరాలలో 40 బిలియన్ డాలర్లు (నాలుగు వేల కోట్ల డాలర్లు, ఒక లక్షా అరవై వేల కోట్ల రూపాయలు) ఖర్చు పెడతామని భారత ప్రభుత్వం 2006లో ప్రకటించింది. అణు విద్యుత్ కేంద్రాలను రూపొందించే. నిర్మించే, మరమ్మత్తు చేసే సాంకేతిక పరిజ్ఞానం, యంత్ర సామగ్రి ఐదారు బహుళజాతి సంస్థలకు మాత్రమే ఉన్నది. మనం ఖర్చు పెట్టనున్న లక్షా అరవై వేల కోట్ల రూపాయలు కేవలం నాలుగు బహుళజాతి కంపెనీలకు మాత్రమే చేరుతుంది. అవి అమెరికాకు చెందిన జనరల్ ఎలక్ట్రిక్, వెస్టింగ్ హౌజ్ అనే కంపెనీలు, ఫ్రాన్స్‌కు చెందిన అరెవా ఎస్.ఎ. ఎలక్ట్రిసిటి డి ఫ్రాన్స్ అనే కంపెనీలు.

ఈ లక్షా అరవై వేల కోట్ల రూపాయలు కేవలం అణు విద్యుత్ కర్మాగారాలకు మాత్రమే. దానికి ముందూ వెనకా ఖర్చులు మరింతగా ఉంటాయి. అ ఖర్చులలో పదో వంతు నిధులు వెచ్చించినా సౌర విద్యుత్తు గాని, తరంగ విద్యుత్తు గాని, వాయు విద్యుత్తు గాని, ఇతర ప్రత్యామ్నాయ ఇంధన వనరులు గాని అతిచౌకగా తయారు చేసుకోగల సాంకేతిక పరిజ్ఞానాన్ని రూపొందించుకోవచ్చు. లేదా, మనకు ఇప్పటికే తెలిసి ఉన్న బొగ్గు ఆధారిత థర్మల్ కేంద్రాలను స్థాపించుకున్నా మరింత తక్కువ సమయంలో మన అవసరాలు తీర్చుకోవచ్చు. అసలు ఇంతకూ మన విద్యుత్ సరఫరా, పంపిణీ నష్టాలను అరికట్టే సామర్థ్యం పెంచుకుంటే, విద్యుత్తు వినియోగంలో దుబారాను అరికడితే మూడో వంతు విద్యుత్తును ఆదా చేయవచ్చు. ఇటువంటి ప్రత్యామ్నాయ మార్గాలేవీ ఆలోచించకుండా అణు విద్యుత్తు వైపు చూడడం వెనుక ప్రయోజనం వేరు, అవి ప్రజావసరాలు ఎంత మాత్రం కావు.

అణు ఒప్పందం అనేది అబద్ధపు విద్యుదవసరాల అంచనాల మీద, అబద్ధపు అణువిద్యుత్ సరఫరా మీద ఆధారపడి, బహుళజాతి సంస్థలకు వేల కోట్ల లాభాలు తెచ్చిపెట్టే ప్రక్రియ తప్ప మరేమీ కాదు. దేశాన్ని అనవసరంగా అణ్వస్త్ర ఆయుధపోటీలోకి ఈడ్చి, దేశ రక్షణ వ్యయాన్ని ఇబ్బడి ముబ్బడిగా పెంచి, దేశ ప్రజల కనీసావసరాలు తీర్చడానికి అవసరమైన నిధులు లేకుండా చేసే కుట్ర. దేశం అణ్వస్త్ర దేశంగా మారిందనే కుహనా గర్వాన్ని, జాతి దురహంకారాన్నీ మధ్యతరగతిలో ఎగసనదోసే కుట్ర, నాయకులకు, అధికారులకు ఎంగిలి మెతుకుల ముడుపులు కట్టబెట్టి స్విస్ బ్యాంకు ఖాతాలు సమకూర్చిపెట్టే కుట్ర ఇది.

**సూర్య, జూలై 10, 2008**



# 63

# ప్రత్యేక ఆర్థిక మండలాలు రాజకీయార్థిక దృక్పథం

మన దేశ రాజకీయార్థిక వ్యవస్థలోకి మహమ్మారిలా దూసుకొచ్చిన ప్రత్యేక ఆర్థిక మండలాల విధానం గురించి గత మూడు సంవత్సరాలుగా తీవ్రమైన చర్చ జరుగుతున్నది. ఈ విధానం ప్రజాజీవనంలో కల్పించగల సంక్షోభం దగ్గరినుంచి దేశ వనరులను కొల్లగొట్టడం దాకా, దేశ పారిశ్రామికీకరణ అవసరాల నుంచి వివిధ రాజకీయ పక్షాల వైఖరుల దాకా, చట్టం తయారయిన తీరునుంచి అది అమలవుతున్న తీరు దాకా, నష్టపరిహారాల న్యాయాన్యాయాల నుంచి శాశ్వత, సుస్థిర జీవనోపాధి అవకాశాల దాకా అనేక అంశాలమీద చర్చ జరిగింది. ఇంకా జరుగుతున్నది. ఆ విధానాన్ని సమర్థించేవారూ వ్యతిరేకించేవారూ కూడ అనేక వాదనలను ముందుకు తెస్తున్నారు. స్థూల అంశాల గురించీ, సూక్ష్మ అంశాల గురించీ కూడ లోతయిన, వివరమైన చర్చే జరిగినట్టు అనిపిస్తున్నది. అయినా ఇప్పటికీ చర్చించవలసిన ప్రధానాంశాలు కొన్ని మిగిలే ఉన్నాయి. ముఖ్యంగా మార్క్సిస్టు శిబిరంలో జరగవలసిన చర్చ జరగవలసిన స్థాయిలో జరుగుతున్నట్టు లేదు. ప్రత్యేక ఆర్థిక మండలాల సమస్యను ఏదో తక్షణ రాజకీయ సమస్యగా, ఆందోళనా భూమికగా మాత్రమే చూస్తున్నట్టు కనబడుతున్నది గాని దాని రాజకీయార్థిక,

తాత్విక మూలాల నుంచి విశ్లేషిస్తున్నట్టు కనబడడం లేదు. ప్రత్యేక ఆర్థిక మండలాలను కొన్నిచోట్ల వ్యతిరేకిస్తూనే, పారిశ్రామికీకరణ కోసం వాటిని సమర్థించడం అవసరమని మరికొన్నిచోట్ల అంటున్న భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) వాదన నుంచి, ప్రజాజీవితం అల్లకల్లోలమవుతున్నది గనుక, ప్రజలు తమ భూములనుంచి నిర్వాసితులవుతున్నారు గనుక వాటిని పూర్తిగా వ్యతిరేకించాలనే విభిన్న ప్రజా ఉద్యమాల వాదనల వరకు అనేక వైఖరులు కనబడుతున్నాయి గాని ఈ వాదనలకు రాజకీయార్థిక శాస్త్ర దృక్పథపు పునాది ఉండవలసినంత స్పష్టంగా, బలంగా ఉన్నట్టు లేదు. ఆ దిశలో కొన్ని ఆలోచనలను పంచుకోవడమే ఈ వ్యాస లక్ష్యం.

రాజకీయార్థికశాస్త్ర దృక్పథం నుంచి చూసినప్పుడు ఏ సంఘటనా, పరిణామమూ దానికదిగా విడిగా ఉండవు. ఒక చారిత్రక పరిణామక్రమంలో అవిభాజ్యమైన భాగాలుగానే, ఒక గొలుసులో భాగంగానే ఉంటాయి. కనుక ఏ సంఘటననయినా పరిణామాన్నయినా వాటికవిగా గుర్తిస్తూనే ఒక క్రమంలో భాగంగా కూడ గుర్తించవలసి ఉంటుంది. ఏ సామాజిక, రాజకీయార్థిక పరిణామాన్నయినా అది అప్పటికి ఉన్న ఉత్పత్తిశక్తులలో, ఉత్పత్తి సంబంధాలలో ఎటువంటి మార్పులు తెస్తుంది, ఆ మార్పులు ప్రగతిశీలమైనవా కావా అనే గీటురాళ్లమీద చర్చించవలసి ఉంటుంది గాని ఆ పరిణామాన్ని విడదీసి విడివిడిగా కేవలం నైతిక దృక్పథం నుంచో, రాజకీయ దృక్పథం నుంచో, ఆర్థిక దృక్పథం నుంచో చర్చించగూడదు. ఎందువల్లనంటే విడిగా నైతిక, రాజకీయ, ఆర్థిక దృష్టికోణాలు వాటికవి ఎంత సమంజసంగా, న్యాయంగా కనిపించినప్పటికీ, వాటికి రాజకీయార్థిక దృక్పథానికి ఉండే సమగ్రత, తాత్విక, చారిత్రక, సామాజిక దృక్పథం ఉండదు. ఒక క్రమపరిణామంలో, ఇతర పరిణామాలతో పరస్పర చర్య-ప్రతిచర్యలలో భాగంగా చూడాలనే దృక్పథం ఉండదు.

నైతిక దృక్పథం అంటే ఏ విషయాన్నయినా నీతి-అవినీతి, మంచి-చెడు అని విభజించి చూసే దృక్పథం. ఆ దృక్పథం నుంచి చూసినప్పుడు ఒక పరిణామపు మంచి చెడులు, నీతి అవినీతులు మాత్రమే పరమంగా, అంతిమంగా కనబడుతాయి. నిజానికి వర్గ సమాజంలో, అంతరాల సమాజంలో మంచి చెడులు సాపేక్షంగానే ఉంటాయి గాని పరమంగా ఉండవు. ఒకరికి మంచి అయినది మరొకరికి చెడు అయ్యే అవకాశం ఉంది. ఒక సందర్భంలో మంచి అయినది మరొక సందర్భంలో చెడు అవుతుంది. కనుక ఒక పరిమాణపు సమంజసత్వాన్ని మంచి చెడుల ఆధారంగా తేల్చిచెప్పడం అసాధ్యం మాత్రమే కాక పాక్షికం కూడ అవుతుంది.

ఇక రాజకీయ దృష్టికోణం అంటే ఆ కాలానికి సామాజిక సమస్యలకు తాము సూచించే పరిష్కారాలకు నిర్మాణ రూపం ఇచ్చే వైఖరి. ఇక్కడ కూడ కొంతవరకు నైతిక దృష్టి పనిచేసి న్యాయం - అన్యాయం అనే భావనలు, కొంతవరకు ప్రాప్తకాలజ్ఞత పనిచేసి ఆచరణసాధ్యం - ఆచరణ సాధ్యం కాకపోవడం అనే వైఖరులు ఉంటాయి. అలా రాజకీయ దృక్పథం నుంచి చూసినప్పుడు వ్యాఖ్యాత విశ్వసించే రాజకీయ ప్రయోజనాలకు అనుగుణమైనది అనుసరణీయమైన



న్యాయంగానూ, అనుగుణంగా లేనిది వ్యతిరేకించవలసిన అన్యాయంగానూ కనబడుతుంది. ఆ రాజకీయ ప్రయోజనాలు కూడ స్థల కాలాలను బట్టి మారే అవకాశం ఉంది గనుక ఆ వైఖరి సూత్రబద్ధమైన వైఖరిగా ఉండడానికి అవకాశం తక్కువ. అంటే ఒక పరిణామపు వస్తుగత స్వభావం మీద ఆధారపడి కాక, ఆ పరిణామం వల్ల ఒనగూడే రాజకీయప్రయోజనాలను బట్టే దానిపట్ల వైఖరి ప్రకటించే స్థితి వస్తుంది.

ఇక కేవలం ఆర్థిక దృష్టికోణం నుంచి చూసినప్పుడు ఆ పరిణామం వల్ల కలిగే లాభాన్ని గాని, నష్టాన్ని గాని అంకెల్లో అంచనావేసి ఆ లాభనష్టాలను బట్టి వైఖరి తీసుకోవడం జరుగుతుంది. ఆర్థిక దృష్టికోణం అంకెల్లోకి కుదించగలిగిన అంశాలను మాత్రమే పరిగణనలోకి తీసుకుని వాటి ఆధారంగా మాత్రమే, ఆచరణసాధ్యాసాధ్యతలను బట్టి మాత్రమే తన వైఖరిని ప్రకటిస్తుంది. కాని సామాజిక పరిణామాలు విస్తృతమైనవి. వాటిని అంకెలలోకి కుదించడం గాని, అందువల్ల అవి లాభమో నష్టమో చెప్పడం గాని కుదరదు.

ఈ మూడు రకాల దృక్పథాలలోను పరిశీలనాపద్ధతులు వేరయినప్పటికీ, వాటి వాదనలు, నిర్ధారణలు భిన్నమైనవయినప్పటికీ వాటిలో మనిషికి, మనిషి అవసరాలకు, సృజనాత్మకతకు, శక్తికి, చరిత్రకు, క్రమ పరిణామానికి స్థానం లేకపోవడం సాధారణ అంశం.

ఆ దృక్పథాలకు భిన్నంగా రాజకీయార్థిక దృక్పథం మనిషి దగ్గర ప్రారంభిస్తుంది. మనిషికి సంబంధించిన సమస్త అంశాలనూ తన పరిధిలోకి తీసుకుంటుంది. అందువల్ల రాజకీయార్థిక దృక్పథంలో రాజకీయ, ఆర్థిక, సామాజిక శాస్త్రాలు, చరిత్ర కలగలసి సాగుతాయి. నిజానికి ఇన్ని శాస్త్రాల సంవిధానాల సమ్మేళనంగా ఉన్నప్పటికీ రాజకీయార్థిక శాస్త్రం చాల మామూలు అంశాల దగ్గర, అట్టడుగున, మనిషి దగ్గర తన చర్చ ప్రారంభిస్తుంది.

మనిషి బతకడానికి తిండి అవసరం. ఆ తిండి కోసం పనిచేయడం అవసరం. అంటే ఉత్పత్తి మానవ మౌలిక అవసరం. అది అవసరం మాత్రమే కాదు, శ్రమ అనేది మనిషి తనను తాను వ్యక్తీకరించుకునే ప్రక్రియ గనుక, శ్రమ తప్పనిసరిగా ఉత్పత్తిగా పరిణమిస్తుంది గనుక ఉత్పత్తి లేకుండా మనిషి ఉండే అవకాశం లేదు. కనుక మనిషి దగ్గర ప్రారంభించే రాజకీయార్థిక శాస్త్ర దృక్పథం మరొక స్థాయిలో ఉత్పత్తి దగ్గర ప్రారంభిస్తుంది. మనిషి మెదడుకు, కండరాలకు ప్రకృతిలో దొరికే సాధనాలను వాడుకుని తన మనుగడకు అవసరమైన నిత్యజీవితావసర వస్తువులను ఉత్పత్తి చేసుకునే లక్షణం ఉంది. ఆ లక్షణం మానవ పరిణామక్రమంలో అభివృద్ధి చెందుతూ వచ్చింది. కనుక మనిషి గురించి మాట్లాడేటప్పుడు తప్పనిసరిగా ఉత్పత్తిలో మెరుగుదల గురించి, పెరుగుదల గురించి, ఉత్పాదకతలో మార్పుల గురించి మాట్లాడుకోవాలి. అంటే ఉత్పత్తి సాధనాల విస్తరణ గురించి, ఉత్పత్తి సాధనాల మెరుగుదల గురించి మాట్లాడుకోవాలి.

సాధారణంగా ఉత్పత్తి సాధనాలు అంటే భూమి, భూమిలో దొరికే ముడిసరుకులు, ఖనిజాలు, పనిముట్లు, నీరు, యంత్రసామగ్రి, విద్యుచ్ఛక్తి, మౌలిక సౌకర్యాలు, వగైరా. అయితే వీటిలో కొన్ని మాత్రమే సహజంగా దొరికేవి, కొన్ని మానవశ్రమ ద్వారా తయారయినవి.

తొలిరోజుల్లో మనుషులు ఆహార సేకరణ దశలో బతికారని మనకు తెలుసు. ప్రకృతి ఇచ్చే ఫలాలనే తమ ఆహారంగా వాడుకునే ఆ రోజులలో కూడ చెట్టు మీది పండును రాలగొట్టడానికో, పరుగెత్తే జంతువును పట్టుకోవడానికో, దొరికిన పండునో, జంతువునో ముక్కలుచేసి, కాల్చి భోజన యోగ్యం చేయడానికో మనుషులు కర్రలను, రాళ్లను, నిప్పును వాడుకున్నారు. బహుశా అవి తొలి ఉత్పత్తి సాధనాలయి ఉంటాయి. వాటినుంచి ఇవాళ్టి భారీ యంత్రాలు, కంప్యూటర్లు, మరమనుషుల దాకా ఉత్పత్తి సాధనాలలో చాల విస్తృతి ఉంది. అంటే మానవజాతి తన చరిత్ర పొడవునా తన మనుగడకొరకు, జీవనం మెరుగుదల కొరకు అనేకరకాల ఉత్పత్తి సాధనాలను కనిపెట్టింది, వాడుకుంటోంది. మెరుగుపరుస్తోంది. అయితే గుర్తించవలసిన విషయమేమంటే, చివరికి అత్యాధునిక, అతిశక్తిమంతమైన మరమనిషితో సహా ఈ ఉత్పత్తి సాధనాలేవీ కూడ మానవ జోక్యం లేకుండా మనిషి మనుగడకు అవసరమైన ఉత్పత్తిని సాగించలేవు. అంటే ఉత్పత్తి సాధనాలు, మానవ శ్రమ కలిసినప్పుడు మాత్రమే మానవ నిత్యజీవితావసర వస్తూత్పత్తి సాధ్యమవుతుంది.

ఉత్పత్తి సాధనాలను, మానవశ్రమను, తరతరాలుగా ఉత్పత్తిక్రమంలో పోగుపడిన మానవజ్ఞానాన్ని కలిపి ఉత్పత్తి శక్తులు అంటారు.

ఏదయినా ఒక పరిణామం అటు ఉత్పత్తి సాధనాలలో, అంటే ఉత్పత్తి సాధనాల వినియోగంలో గాని, ఇటు ఉత్పత్తి శక్తులలో, అంటే శ్రామికుల జీవనస్థితిగతులలో, జ్ఞానంలో, సృజనాత్మకతలో గాని మార్పుకు దారి తీస్తున్నదా లేదా, ఆ మార్పు ప్రగతిశీలమైనదా కాదా అనేదే ఏ పరిణామం గురించయినా చర్చించడానికి గీటురాయి అవుతుంది.

అదేవిధంగా సామాజిక ఉత్పత్తి క్రమం అంతాకూడ సామూహికమే తప్ప వ్యక్తిగతం కాదు. ఏ ఒక్కవ్యక్తీ కూడ తన మనుగడకు అవసరమయిన వస్తువులన్నిటినీ తానే ఉత్పత్తి చేసుకునే అవకాశం ఎప్పుడూ లేదు. అది అతి ప్రాచీన గతంలోనూ సాధ్యం కాలేదు, బహుశా సుదూర భవిష్యత్తులో కూడ సాధ్యం కాదు. మనుషుల మధ్య, మానవ సమూహాల మధ్య ఉత్పత్తిలో, పంపిణీలో, వినియోగంలో, సహకారం, ఆదానప్రదానాలు ఉంటాయి. అంటే మనుషులు తమ ఒంటరి జీవితాలలో మనుగడ సాగించాలనుకున్నాకూడ తోటి మనుషులతో సంబంధంలోకి రావలసి వస్తుంది. సామాజిక ఉత్పత్తి క్రమంలో ఈ రకంగా మనుషులమధ్య ఏర్పడే సంబంధాలను ఉత్పత్తి సంబంధాలు అంటారు. ఈ ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి క్రమంలోనే మనుషులు భాషను, వస్తు వినిమయాన్ని, మెరుగైన వినియోగాన్ని, సంస్కృతిని, సామాజిక చైతన్య రూపాలను అభివృద్ధి చేసుకున్నారు. ఆ క్రమంలోనే మనుషుల ఊహాశక్తి, సృజనాత్మకత, ఉత్పాదకత పెరిగాయి. మనం సాధారణంగా నాగరికత, సంస్కృతి, ప్రజాస్వామ్యం, పాలన, రాజకీయాలు అని చెప్పుకునేవన్నీ ఉత్పత్తి సంబంధాల వికాసపు విభిన్న వ్యక్తీకరణలే. ఆ చర్చంతా ఇక్కడ అక్కరలేదు గాని వేల సంవత్సరాల పరిణామక్రమంలో ఈ ఉత్పత్తి సంబంధాలు అనేక మార్పు చేర్పులకు లోనయి ఇవాళ ఉన్న స్థితికి చేరుకుని ఉన్నాయి. ఇవాళ



సమాజంలో జరిగే ఏ పరిణామం గురించి చర్చించినా ఇవాళ్టికి ఏర్పడి ఉన్న ఉత్పత్తి సంబంధాలలో అది ఎటువంటి మార్పు తేగలుగుతుందనే చర్చ ద్వారానే ఆ పరిణామపు ప్రగతిశీలత, ఆమోదయోగ్యత నిర్ణయమవుతాయి.

ఈ రాజకీయార్థిక శాస్త్ర సైద్ధాంతిక నేపథ్యాన్ని మామూలు మాటల్లో చెప్పాలంటే, ఏ పరిణామమయినా ప్రజాజీవితాన్ని, ప్రజాజీవితానికి అవసరమయిన ఉత్పత్తిశక్తులను, ఆ ఉత్పత్తి సాగడానికి భూమికగా నిలిచే సామాజిక సంబంధాలను ఏ దిశగా మారుస్తున్నదో పరిశీలించడమే రాజకీయార్థిక శాస్త్ర దృక్పథం. ఈ నేపథ్యంలో దేశంలో ప్రస్తుతం విపరీతంగా అమలవుతున్న ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు ప్రగతిశీలమైనదో కాదో, ఆమోదయోగ్యమైనదో కాదో చర్చించవలసి ఉంది.

ప్రస్తుత ప్రత్యేక ఆర్థిక మండలాలు ఉత్పత్తి సాధనాల స్థితిలో పెనుమార్పులు తేనున్నాయనడంలో సందేహం లేదు. అవి భూమినిగాని, నీటినిగాని, ఖనిజాలనుగాని, విద్యుత్తునుగాని, పరికరాలను గాని, యంత్రాలను గాని, మౌలిక సాధన సంపత్తినిగాని ఇవాళ వినియోగిస్తున్న పద్ధతికన్న భిన్నమైన పద్ధతిలో ఉపయోగించనున్నాయి. అయితే ఎప్పుడయినా మార్పు దానికదిగా అభిలషణీయమూ కాదు, తిరస్కరణీయమూ కాదు. ఆ మార్పు స్వభావం ఏమిటనే నిశితమైన చర్చ ద్వారానే ఏ మార్పునయినా అంచనా వేయవలసి ఉంటుంది. మరి ప్రస్తుత ప్రత్యేక ఆర్థిక మండలాలు తేనున్న మార్పు స్వభావం ఎటువంటిది?

ప్రత్యేక ఆర్థిక మండలాల కొరకు లక్షలాది ఎకరాల భూమిని వినియోగించబోతున్నారు. ఈ భూమిలో అత్యధిక భాగం ఇప్పటివరకూ వ్యవసాయ వినియోగంలో, అందులోనూ తిండిగింజల సేద్యంలో ఉన్నది. చాల భాగం మానవ ఆవాసాలకు, ఉమ్మడి అవసరాలకు ఉపయోగ పడుతున్నది. మరోమాటల్లో చెప్పాలంటే ఆ భూమి ప్రజల మనుగడకు ఉపయోగ పడుతున్నది. ప్రస్తుతం ఏర్పడనున్న ప్రత్యేక ఆర్థిక మండలాలు ఆ భూమి చుట్టూ కంచెలు పాతి, అందులో 35 శాతంలోనో, 50 శాతంలోనో పరిశ్రమలు ఏర్పరుస్తామంటున్నాయి. ఆ పరిశ్రమల్లో ఎగుమతి కోసం సరుకులను ఉత్పత్తి చేస్తామంటున్నాయి. భూమిని వ్యవసాయం కోసం వినియోగించడం కన్న పరిశ్రమల కోసం వినియోగించడం చరిత్రక్రమంలో తర్వాతి దశ అని రాజకీయార్థిక శాస్త్రం స్థూలంగా అభిప్రాయపడుతుంది. ఉత్పత్తి విధానంగా చూసినప్పుడు వ్యవసాయం కన్న పరిశ్రమ, భూస్వామ్యం కన్న పెట్టుబడిదారీ విధానం పైమెట్టున ఉండే మాట నిజమే కాని ఇక్కడ కూడ ఆ పరిశ్రమ ఏ వస్తువులు ఉత్పత్తి చేస్తున్నది, ఆ ఉత్పత్తి చుట్టూ ఉన్న సమాజంలోని ఉత్పత్తి శక్తులను, ఉత్పత్తి సంబంధాలను ఏ రకంగా మెరుగుపరచనున్నది అనే ప్రశ్నలు వేసుకోవలసి ఉంటుంది.

ప్రస్తుతం ప్రత్యేక ఆర్థిక మండలాలలో రానున్న వ్యాపార సంస్థలలో చాలభాగం నిజమైన పరిశ్రమలు కూడ కాదు. అవి కేవలం సేవారంగ సంస్థలు అనే పేరుతో సంపన్నవర్గాల విలాస అవసరాలు తీర్చే వ్యాపార సంస్థలు మాత్రమే. ఆ వాదనను కాసేపు పక్కనపెట్టి, నిజంగానే

పరిశ్రమలు రాబోతున్నాయనుకున్నా, వ్యవసాయానికో ఆవాసానికో, మొత్తం మీద మనుగడకు ఉపయోగపడుతున్న భూమిని లాక్కుని, అందులో సగాన్నో, పావువంతునో సరుకుల ఉత్పత్తికి, మార్కెట్ అవసరాలకు తరలించడం ఆ వినియోగంలో మెరుగుదల, అభివృద్ధి కాజాలదు. ఆ భూమి ఇప్పుడు వ్యవసాయ యోగ్యంగా లేదనో, ఆ వ్యవసాయం లాభసాటిగా లేదనో, అక్కడ వ్యవసాయం చేయడం కన్న పరిశ్రమలు ఏర్పాటు చేయడం సముచితమనో వాదనలు కూడ వస్తున్నాయి. కాని ఎవరి భూమి కొల్లగొట్టబడుతున్నదో, పండినా పండకపోయినా ఆ భూమి ఎవరికి శాశ్వత జీవనోపాధిగా ఉన్నదో వారి భాగస్వామ్యంతో, వారి అంగీకారంతో, వారికి ప్రత్యామ్నాయ ఉపాధికల్పనతో మాత్రమే ఆ భూమి వినియోగం మారవలసి ఉంటుంది. మరో మాటల్లో చెప్పాలంటే ఒక ఉత్పత్తి సాధనాన్ని ఒక వినియోగం నుంచి మరొక వినియోగానికి మారుస్తున్నప్పుడు అప్పటివరకూ ఆ ఉత్పత్తి సాధనం మీద ఆధారపడి బతుకుతున్న ప్రజలకు ఆ నిర్ణయంలో భాగస్వామ్యం ఉండాలి. వీలయినంతవరకు ఆ కొత్త వినియోగంలో కూడ ఆ ప్రజలను భాగస్వాములను చేయాలి, వారి జ్ఞానాన్ని, సృజనాత్మకతను కొత్త వినియోగంలో ఉపయోగించుకోవాలి.

ఈ రకంగా ఉత్పత్తి సాధనాల నిరుపయోగం, దురుపయోగం, స్థానిక ప్రజల చైతన్యానికీ సృజనాత్మకతకూ శ్రమకూ విలువలేని ఉపయోగం కేవలం భూమి విషయంలో మాత్రమే జరగడం లేదు. నీరు, ఖనిజాలు, ఇతర సహజ వనరులు, విద్యుత్తు, మౌలిక సాధన సంపత్తి అన్నిటిలోనూ దురుపయోగం, నిరుపయోగం కొనసాగుతున్నాయి. ప్రతి ఒక్క ఉత్పత్తి సాధనం వినియోగం విషయంలోనూ అది ఎలా ప్రగతిశీలమైనది కాదో, ఎలా స్థానిక ప్రజల (ఉత్పత్తిశక్తుల) అభివృద్ధికి ఆటంకంగా పరిణమిస్తున్నదో సవివరంగా రుజువు చేయవచ్చు. ఒకవేళ ప్రత్యేక ఆర్థిక మండలాలలో ఆ ఉత్పత్తి సాధనాల కొత్త వినియోగం ఎక్కువ ఉత్పాదకతను, ఉత్పత్తిని సాధిస్తున్నదని అంకెలగారడీతో చూపగలిగినా ప్రజల జీవితాలలో, జీవనోపాధిలో, చైతన్యంలో, సృజనాత్మకతలో ఆ ఉత్పత్తి, ఉత్పాదకత ఎటువంటి పాత్ర వహిస్తున్నాయో పరిశీలిస్తే ఆ అభివృద్ధి వెలుగు కన్న చీకటి ఎక్కువని తేటతెల్లమవుతుంది.

ప్రత్యేక ఆర్థిక మండలాలు పాత ఉత్పత్తిసాధనాలను కొత్త వినియోగంలోకి తేవడమో, కొత్త ఉత్పత్తి సాధనాలను ప్రవేశపెట్టడమో చేస్తున్నప్పటికీ అవి స్థానిక ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి దారి తీయడంలేదు. ఆ ఉత్పత్తిశక్తుల సహజ అభివృద్ధిగా, ముఖ్యంగా ప్రజల చైతన్యం నుంచి పుట్టడంలేదు, వారి చైతన్యాన్ని పెంచడం లేదు, వారి జీవన స్థితిగతులను మెరుగుపరచడం లేదు. బహుళజాతిసంస్థల నాయకత్వంలో, ఆ సంస్థల లాభాపేక్ష కొరకు మాత్రమే కొత్త ఉత్పత్తి సాధనాలు ఇక్కడ అంటు కట్టబడుతున్నాయి. ఆ ఉత్పత్తి సాధనాలు ఏమిటో, అవి ఏమి ఉత్పత్తి చేస్తాయో, అవి ఎట్లా పనిచేస్తాయో, వాటి మరమ్మతు ఎట్లాచేయాలో స్థానిక ప్రజలకు ఏమీ తెలియదు. తెలిపే ప్రయత్నం కూడ లేదు. అందువల్ల వారు ఆ ఉత్పత్తి సాధనాలమీద పనిచేయడానికి వీలులేదు. అంటే వారు తమ భూమి నుంచి నిర్వాసితులు కావడం మాత్రమే



కాదు, ఉత్పత్తి క్రమం నుంచి కూడ దూరం కొట్టబడతారు. తమకు తెలిసిన ఉత్పత్తి ప్రక్రియకు అవకాశం లేదు, వచ్చిన కొత్త ప్రక్రియ తమకు తెలిసినది కాదు. అలా స్థానిక ప్రజలకు తెలియని, అందుబాటులోలేని, అర్థం కాని కొత్త ఉత్పత్తి సాధనాలు ప్రవేశించి వారికి ఇంతకాలమూ తెలిసిన ఉత్పత్తిసాధనాలనుంచి దూరం చేస్తున్నాయి. అంటే ఒక రకంగా ఉత్పత్తి సాధనాలకు, అవి వినియోగించే ప్రజలకు మధ్య ఘర్షణ తలెత్తుతున్నది. ఉత్పత్తిశక్తులలోపలనే ఘర్షణ పెరుగుతున్నది.

ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు ఉత్పత్తి శక్తులలో, ముఖ్యంగా ప్రజలలో ఏ మార్పు తేనున్నదో చూస్తే అది ఆ ప్రజల జీవితాలను ధ్వంసం చేయడానికే తప్ప మెరుగుపరచడానికి రావడం లేదని స్పష్టంగా తెలుస్తుంది. ఒక కొత్త ఉత్పత్తి సాధనం, ఒక కొత్త ఉత్పత్తి పద్ధతి ఏ ప్రజల జీవితాలలోకి ప్రవేశిస్తున్నదో ఆ ప్రజల అవగాహనలో, జ్ఞానంలో, శక్తిలో, ఉత్పాదకతలో అభివృద్ధిని సాధించాలి, మెరుగుదలకు మార్గం కల్పించాలి. వారిని బండ చాకిరీ నుంచి తప్పించి, వారి సృజనాత్మక శక్తుల వికాసానికి వీలు కలిగించాలి. కాని ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు వల్ల అప్పటివరకూ అక్కడ బతుకుతున్న ప్రజలను వారి ఆవాసాలనుంచి, జీవనోపాధినుంచి బయటికి తరిమివేయడం జరుగుతున్నది. అంటే వారి జీవితాలలో మెరుగుదల సాధించడం లేకపోగా దిగజారుడు జరగబోతున్నది. వారి జ్ఞానమూ సృజనాత్మకతా ఉత్పాదకతా పెరగకపోవడం మాత్రమే కాక ఆ జ్ఞానం పనికిరానిదనీ, ఆ సృజనాత్మకతకు విలువలేదనీ, ఆ ఉత్పాదకతకు మార్కెట్ లేదనీ చిన్నచూపు చూడడం జరుగుతున్నది. అన్ని విలువలకూ మార్కెట్ మాత్రమే ఏకైక కొలబద్ద అయిన చోట, ప్రతిదీ డబ్బుతో, మారకపు విలువతో, సరుకు కాగల శక్తితో మాత్రమే కొలవబడేచోట ఆ శ్రామికుల బతుకే నిరర్థకమన్నట్టుగా వ్యాఖ్యానాలు వినబడుతున్నాయి.

ఇక దేశ వ్యాప్తంగా పెద్ద ఎత్తున రాబోతున్న ఈ ప్రత్యేక ఆర్థిక మండలాలు మొత్తం దేశంలోగాని, కనీసం అవి ఏర్పడిన ప్రాంతాలలో గాని ఉత్పత్తి సంబంధాలలో ఎటువంటి మార్పును తేబోతున్నాయి? మనదేశంలో ప్రస్తుతం కొనసాగుతున్న ఉత్పత్తి సంబంధాలలో పాత భూస్వామ్య ఉత్పత్తి సంబంధాల అంతరాల వ్యవస్థ అవశేషాలు, కొత్త పెట్టుబడిదారీ సరుకుల సంబంధాలు కలగలిసి సాగుతున్నాయి. కనీసం పాత భూస్వామ్య సంబంధాలను పూర్తిగా రద్దు చేసి, కొత్త పారిశ్రామిక, పెట్టుబడిదారీ సంబంధాలను ప్రవేశపెట్టడం జరిగినా ఒక మేరకు అభివృద్ధే. ఒక శతాబ్దానికి పైగా భారత సమాజంలో జరుగుతున్న ఆధునిక పారిశ్రామికీకరణ కొత్త ఉత్పత్తి సంబంధాలను ఏర్పరచలేదు. పుట్టుకమీద, కులంమీద, అంతరాలమీద ఆధారపడిన పాత ఉత్పత్తి సంబంధాలను రద్దుచేసి, వ్యక్తి మీద, నైపుణ్యం మీద, స్వేచ్ఛమీద ఆధారపడిన కొత్త ఉత్పత్తి సంబంధాలను ఏర్పరిచే పనిని యూరప్ లో పారిశ్రామికీకరణ చేసింది. కాని మన సమాజంలో పారిశ్రామికీకరణ పాతదాన్ని తొలగించకుండానే, పాతతో మిలాఖత్తయి, కొత్త సంబంధాలను ప్రవేశపెట్టింది. ఇది పాతకొత్తల

మేలు కలయిక కాదు. పాతకొత్తల అమానవీయ కలయిక. పాతలో ఉన్న అసమానతను, అమానుషత్వాన్ని, బండచాకిరీని, కట్టుబానిసత్వాన్ని, శ్రమఫలితం అందకపోవడాన్ని యథాతథంగా ఉంచుతూ కొత్తలోని వేగాన్ని, శ్రమదోపిడీని, ఉత్పాదకత పెరుగుదలను, ఆధునికతను కలగలిపిన అర్ధ భూస్వామ్య అర్ధ వలస స్వభావం, వికృత, అరాచక పెట్టుబడిదారీ అభివృద్ధి మన సమాజంలో జరిగాయి.

కనుక మనసమాజంలో పారిశ్రామికీకరణ గురించి మాట్లాడుకునేటప్పుడు ఈ ప్రత్యేక స్థితిని గుర్తించవలసి ఉంది. ఇక్కడ ఉత్పత్తి సంబంధాలలో మౌలికమైన మార్పు రాకుండానే పారిశ్రామికీకరణ జరిగింది, జరుగుతోంది. ఇందుకు పెట్టుబడిలో, శ్రమశక్తిలో, పనిపరిస్థితులలో, ఉత్పత్తి నిర్మాణంలో అనేక నిదర్శనాలున్నాయి.

మనదేశంలో పెట్టుబడి యూరప్‌లో లాగ ఆధునిక వ్యక్తి స్వేచ్ఛాభావనను రంగరించుకున్న, శ్రమశక్తిని తన అవసరాలకోసమే అయినా భూస్వామ్య బంధనాల నుంచి విముక్తి చేయదలచుకున్న ప్రగతిశీలమైన పెట్టుబడి కాదు. భారతదేశంలో తొలిదశలోని పెట్టుబడి అనైతికమైన, దుర్మార్గమైన వడ్డీవ్యాపారుల పెట్టుబడి. క్రమంగా ఆ వడ్డీవ్యాపారులు స్వతంత్ర పారిశ్రామిక పెట్టుబడిదారులుగా ఎదగడం కన్న వలస పెట్టుబడికి దళారులుగా మారడంలోనే ఎక్కువ లాభాలూ, వసతులూ ఉన్నాయని అనుకున్నారు. అందువల్ల దేశంలో స్వతంత్ర, దేశభక్తియుత పెట్టుబడిదారీవర్గం ఎదుగుదలకు మొగ్గలోనే చీడ సోకింది. మొదట ఆ పెట్టుబడిదారుల పర్యవేక్షణలో, 1947 తర్వాత ఆ పెట్టుబడిదారుల ఉమ్మడిసంస్థగా మారిన ప్రభుత్వ ఆధ్వర్యంలో జరిగిన పారిశ్రామికీకరణ అంతా ఎక్కువభాగం పరాధీనంగానే, బహుళజాతిసంస్థల ఆదేశాలమేరకే, బహుళజాతిసంస్థల ప్రయోజనాల కొరకే జరిగింది. స్వతంత్ర పెట్టుబడి ఆలోచనలు అప్పుడప్పుడు అక్కడక్కడ కనబడినా వాటికి తగినంత బలం రాలేదు. అందువల్ల ఆ పెట్టుబడి యూరప్‌లో లాగ ఇక్కడ ఒక స్వతంత్ర, ఉదారవాద ఉత్పత్తి సంబంధాలకు దారితీయకుండా పాత భూస్వామ్య బంధనాలను, అంతరాలను అంటిపెట్టుకునే సాగింది. ఇక నూతన ఆర్థిక విధానాల తర్వాత, ప్రపంచీకరణ తర్వాత విదేశీ పెట్టుబడితో మిలాఖత్తు కావడమే సౌభాగ్యానికి రహదారిగా భావించి, బహుళజాతి సంస్థలకు భాగస్వాములు కావడం ఎక్కువయింది.

మనదేశంలోని శ్రమశక్తి కూడ యూరప్‌లో లాగ భూస్వామ్య బంధనాలను తెంచుకుని, భూస్వాముల విశాల భూక్షేత్రాల చెరసాలలనుంచి, కట్టుబానిసత్వంనుంచి, వ్యవసాయం నుంచి, గ్రామాలనుంచి విముక్తమయి రెండురెక్కలు తప్ప మరే ఆస్తీ అనుబంధమూ లేకుండా ఎదిగిన స్వతంత్ర శ్రామిక శక్తి కాదు. 'ఈ దేశంలో శ్రమ విభజన మాత్రమే కాదు, శ్రామికుల విభజన కూడ జరిగింది' అని అంబేద్కర్ అన్నట్టు, మన సమాజంలో శ్రామికులకు స్వతంత్ర శ్రామికులుగా మారకుండా, 'పోరాడితే పోయేవేమీలేవు బానిససంకెళ్లు తప్ప' అని అనుకోలేకుండా విభజించి బంధించిన కుల సంకెళ్లున్నాయి. ఎంత ఆధునిక పరిశ్రమలో పనిచేసే శ్రామికులైనా, ఎన్ని



తరాల కింద వ్యవసాయం వదిలేసిన శ్రామికులైనా మళ్లీ వ్యవసాయంలోకి వెళ్లాలనే కోరిక, మళ్లీ భూమి సంపాదించాలనే కోరిక ఉన్న శ్రమశక్తి మనది. అంటే భూమితో అనుబంధం, పాత సామూహిక అస్తిత్వానికే గుర్తింపు అనే రెండు మౌలిక విషయాలలోనూ మన పారిశ్రామికీకరణ కొత్త ఉత్పత్తి సంబంధాలను ప్రవేశపెట్టలేకపోయింది.

పని పరిస్థితులలో ఇవాళ్టికీ పాత ఉత్పత్తి సంబంధాల అవశేషాలే కొనసాగుతున్నాయనేందుకు లెక్కలేనన్ని ఉదాహరణలు చూపవచ్చు. యూరప్‌లోని తొలి పెట్టుబడిదారీ పరిశ్రమలు కూడ దుర్భరమైన పని పరిస్థితులను అమలులోపెట్టి శ్రామికుల దోపిడీని కొనసాగించాయి గాని, మన దేశంలో పని పరిస్థితులలో కేవలం ఎక్కువ పని, ఎక్కువ చాకిరీ, పని గంటలు, హక్కులు లేకపోవడం వంటి దుర్భరత్వం మాత్రమే కాక, అంతరాలు, కొందరికి ఎక్కువ పని, మరికొందరికి తక్కువ పని, పుట్టుకను బట్టి పనుల విభజన, ప్రాధాన్యత, పర్యవేక్షకులకూ శ్రామికులకూ మధ్య, మేధోశ్రామికులకూ శారీరకశ్రామికులకూ మధ్య పాత భూస్వామ్య అంతరాలు, చాల పనిస్థలాలలో పర్యవేక్షకులు దొరలుగా చూడబడడం, పిలవబడడం కనబడుతున్నాయి. అంటే కొత్త, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలలో ఉండవలసిన స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం మన పెట్టుబడిదారీ పనిస్థలాలలోకి ప్రవేశించలేకపోయాయి, పాత యజమాని–బానిస, దొర–పాలేరు సంబంధాలే కొత్త పేర్లు పెట్టుకుని కొనసాగుతున్నాయి.

పందొమ్మిదో శతాబ్దం చివరిరోజులనుంచి ఇప్పటిదాకా ఒక శతాబ్దం పైగా కొనసాగుతున్న ఈ అసమ, అక్రమ, అమానవ ఉత్పత్తి సంబంధాలను మార్చి కొత్త ఉత్పత్తి సంబంధాలను, కనీసం పెట్టుబడిదారీ సమాజాలలో ఉన్నటువంటి ఉత్పత్తి సంబంధాలను ప్రవేశపెట్టాలనే ఆలోచన ప్రత్యేక ఆర్థిక మండలాలకు ఏమీ లేదు. కనుక నిజంగా ప్రత్యేక ఆర్థిక మండలాలలో పారిశ్రామికీకరణ జరిగినా అది ఉత్పత్తి శక్తులలోగాని, ఉత్పత్తి సంబంధాలలోగాని ప్రగతిశీలమైన మార్పులకు దారి తీస్తుందనే హామీలేదు. ఈ పారిశ్రామికీకరణ గురించి ప్రస్తావనతోనే భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) నందిగ్రామ్, సింగూరు వంటి చోట్ల ప్రత్యేక ఆర్థిక మండలాలను సమర్థిస్తున్నది. కాని ఆ ప్రత్యేక ఆర్థిక మండలాలతో సహా ఏ ఒక్క చోట కూడ పాత ఉత్పత్తి సంబంధాలను తోసివేస్తూ కొత్త ఉత్పత్తి సంబంధాలు రావడం లేదు. కుల అంతరాలను కూడ యథాతథంగా కొనసాగించే, ఇంకా బలోపేతం చేసే విధానాలు ప్రత్యేక ఆర్థిక మండలాలలో రాబోతున్నాయి. సంక్షేమ రాజ్యంలో రూపొందిన కార్మిక అనుకూల చట్టాలను కూడ రద్దు చేస్తూ కార్మికులను ఏ హక్కులూ లేని కట్టుబానిసలుగా మార్చే ఉత్పత్తి సంబంధాలు రానున్నాయి. పాలకవర్గాలకు, యాజమాన్య వర్గాలకు మరిన్ని ఎక్కువ కోరలనూ కొమ్ములనూ కల్పించి శ్రామికులను కాల్చుకుతినే ఉత్పత్తి సంబంధాలు రానున్నాయి. మూడు శతాబ్దాల వలస పాలన కింద నలిగిపోయిన భారత ప్రజానీకం ఆ వలస దుర్మార్గాన్ని తోసివేసే జాతీయోద్యమ క్రమంలో కొన్ని విలువలను అభివృద్ధి చేసింది. సార్వభౌమాధికారం, స్వావలంబన, ప్రజాభాగస్వామ్యం వంటి ఆ విలువలన్నిటినీ రద్దుచేసి

దేశంలోపల విదేశీభూభాగాలను స్థాపించడానికి ప్రత్యేక ఆర్థిక మండలాలు ప్రయత్నిస్తున్నాయి. అంటే ఏ రకంగా చూసినా ప్రత్యేక ఆర్థిక మండలాలు ఏర్పరచనున్న ఉత్పత్తిసంబంధాలు ప్రజా వ్యతిరేకమయినవి, ప్రజల జీవితాలను అల్లకల్లోలం చేసేవి, ప్రజల జీవనోపాధిని కొల్లగొట్టేవి. ఏర్పడిఉన్న పాలనావిధానాలలో మరింత దిగజారుడుకు, అమానుషత్వానికి దారితీసేవి.

మొత్తంగా చూస్తే ప్రత్యేక ఆర్థిక మండలాల విధానానికి మద్దతుగా ప్రభుత్వాలు, పాలకవర్గాలు ప్రకటిస్తున్న లక్ష్యాలు – విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి, కొత్త సాంకేతిక పరిజ్ఞానం, ఉద్యోగ కల్పన, ఎగుమతుల ద్వారా విదేశీమారకద్రవ్యం రాబడి – అన్నిటికన్నీ పచ్చి అబద్ధాలు కాగా, ప్రత్యేక ఆర్థిక మండలాలు ప్రజల శాశ్వత జీవనోపాధి వనరు అయిన భూమిని కొల్లగొట్టడం ద్వారా వారి బతుకులను అల్లకల్లోలం చేయనున్నాయి. పారిశ్రామిక, వ్యాపార సంస్థలు నెలకొల్పడానికనే పేరు మీద ఆ భూమిని దేశదేశాల సంపన్నులకు అప్పనంగా అప్పగించనున్నాయి. ఆ భూమిలో పారిశ్రామిక వ్యాపార సంస్థలు రాబోవడం లేదు సరిగదా గోల్ఫ్ కోర్సులు, విలాసకేంద్రాలు, రియల్ ఎస్టేట్, హోటళ్లు, రెస్టారెంట్లు వంటి సంపన్న వర్గాల అవసరాలు తీర్చే ఏర్పాట్లు జరగబోతున్నాయి. ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేయడానికి రూపొందించిన చట్టం గాని, నిబంధనలు గాని తప్పుల తడకలుగా, ప్రజావ్యతిరేకంగా, దేశద్రోహకరంగా ఉన్నాయి.

ప్రత్యేక ఆర్థిక మండలాలు ఆచరణ స్థాయిలో ఇలా ఉండగా, వాటిని రాజకీయార్థిక దృక్పథం నుంచి చూసినప్పుడు కూడ అవి అటు ఉత్పత్తి సాధనాల వినియోగంలో, ఉత్పత్తి శక్తుల వికాసంలో గాని, ఇటు ఉత్పత్తి సంబంధాలలో గాని ఎటువంటి అభివృద్ధికరమైన మార్పును తేబోవడం లేదు. అందువల్ల ఏ కోణం నుంచి చూసినా, ఏ వాదనలను గమనించినా ప్రత్యేక ఆర్థికమండలాలను వ్యతిరేకించడం, ప్రతిఘటించడం ఈ దేశాన్ని, ప్రజలను, ప్రజాజీవితాన్ని ప్రేమించే ప్రతిఒక్కరి కర్తవ్యమవుతుంది.

***విరసం ప్రచురణ, 'ప్రత్యేక మృత్యు మండలాలు' ఆగస్ట్ 2008***



# 64

# అంతర్జాతీయ ఆర్థిక సంక్షోభం - పూర్వాపరాలు

అమెరికా ఆర్థికవ్యవస్థలో మొదలై ప్రపంచదేశాలన్నిటికీ వ్యాపించిన ఆర్థికసంక్షోభం గురించి అమెరికాలో మాత్రమేగాక ప్రపంచంలోనూ, భారతదేశంలోనూ ప్రతి ఒక్కరూ ఆలోచించక తప్పని స్థితి వచ్చింది. “అది ఎక్కడో జరిగిన పరిణామం, దాని గురించి మనం ఆలోచించడం ఎందుకు” అని అనుకునే స్థితి లేదు. దాని ప్రభావం మనమీద, మన జీవితాల మీద, మన ఆర్థిక వ్యవస్థమీద ఏమన్నా ఉంటుందా అని ప్రపంచంలో ప్రతి ఒక్కరూ ఆందోళనపడే స్థితి ఉంది. ప్రపంచంలోని అన్ని దేశాల ఆర్థిక వ్యవస్థలనూ సంలీనం చేసి ఆయా దేశాలలో స్థూల రాజకీయార్థిక విధానాల నుంచి అతి చిన్న విషయాల దాకా అన్నిటినీ సామ్రాజ్యవాదం ప్రభావితం చేస్తున్నప్పుడు, ప్రస్తుత సంక్షోభం కేవలం అమెరికాకు మాత్రమే చెందినది కాదు. మరీ ముఖ్యంగా భారతదేశంలో నూతన ఆర్థిక విధానాలు మొదలయిన తర్వాత విదేశీ ఆర్థిక వ్యవస్థలతో, అమెరికా ఆర్థిక వ్యవస్థతో అంతకు ముందరికన్న సన్నిహిత సంబంధాలు నెలకొన్నాయి. అందువల్ల ప్రస్తుత ఆర్థిక సంక్షోభం గురించి, దాని పూర్వాపరాల గురించి వివరంగా తెలుసుకోవడం అవసరం. అమెరికాలో మొదలయిన ఆర్థిక సంక్షోభం మనమీద ఎటువంటి ప్రతికూల

ప్రభావం వేస్తుంది అని మాత్రమే కాక, ఆ ఆర్థిక సంక్షోభం రావడానికి కారణాలేమిటి, దాన్ని ఎట్లా పరిష్కరించగలం అని కూడ చర్చించుకోవాలి. అప్పుడే అమెరికాలోనూ, ప్రపంచవ్యాప్తంగానూ కొనసాగుతున్న పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో స్వాభావికమైన సంక్షోభాల గురించి కూడ అర్థం చేసుకోవచ్చును. అమెరికన్ ఆర్థిక వ్యవస్థ, పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం పైకి చూడడానికి ఎంత బలసంపన్నంగా, తిరుగులేకుండా కనిపించినప్పటికీ అవి లోలోపల ఎంత బలహీనమైనవో, ఎంతగా సంక్షోభపూరితమయినవో అర్థం చేసుకోవచ్చును. అంటే ప్రస్తుత ఆర్థిక సంక్షోభాన్ని అర్థం చేసుకోవడం, ఒక వర్తమాన సామాజిక స్థితిని అర్థం చేసుకోవడానికి మాత్రమే కాదు, గతాన్నీ భవిష్యత్తు పరిణామాలనూ అర్థం చేసుకోవడానికి కూడ అవసరం.

స్థూల స్థాయిలో చెప్పుకుంటే అసలు పెట్టుబడిదారీ విధానంలో సంక్షోభాలు చాల సహజమైనవి. అనివార్యమైనవి. పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానంలోని, పెట్టుబడిదారీ సామాజిక, రాజకీయార్థిక నిర్మాణంలోని అంతర్వైరుధ్యాలు, దాని స్వభావం, దాని పనితీరు తప్పనిసరిగా సంక్షోభాలకు దారి తీస్తాయి. పెట్టుబడిదారీ విధానం తలెత్తి, అభివృద్ధి చెందిననాటినుండీ క్రమం తప్పకుండా ఒక్కోసారి పది సంవత్సరాలకూ ఎనిమిది సంవత్సరాలకూ, ఒక్కోకాలంలో ఇంకా తక్కువ వ్యవధిలోనూ ఈ సంక్షోభాలు వస్తున్నాయి. కనుక అసలు పెట్టుబడిదారీ విధానం వల్లనే ఈ సంక్షోభం తలెత్తిందని విశ్లేషించవచ్చు. కాని సూక్ష్మ దృష్టిలో కూడ పరిశీలించి, ప్రస్తుత సంక్షోభం ఎప్పుడు ప్రారంభమయిందో, ఎట్లా తీవ్రతరమయిందో చూసి, ఆ తర్వాత స్వాభావిక అంశాల దగ్గరికి వద్దాం.

ప్రస్తుత సంక్షోభం మీద వ్యాఖ్యానించిన పరిశీలకులందరూ దాన్ని సబ్ ప్రైమ్ సంక్షోభం అనీ, గృహరుణాల సంక్షోభం అనీ అంటున్నారు. ఈసారి సంక్షోభం ఈ రెండు రూపాల్లో వ్యక్తీకరణ పొందిన మాట నిజమే. ఈ రూపాల అసలు అర్థం ఏమిటి?

మనిషికి కూడు, గుడ్డ, గూడు నిత్య జీవితంలో అత్యవసరమైన వస్తువులనే సంగతి అందరికీ తెలుసు. ఇందులో గూడు, ఆశ్రయం కావాలని మనుషులు, కుటుంబాలు పడే తాపత్రయం కూడ అందరికీ తెలుసు. కాని సొంత ఆస్తి ఆధారంగా నడిచే సమాజంలో ఇల్లు అనే సొంత ఆస్తి లేని జనమే అత్యధిక సంఖ్యాకులుగా ఉంటారు. చాలమంది చాలీచాలని ఇళ్లలో, అనారోగ్యకరమైన ఇళ్లలో, మరొకరికి చెందిన ఇళ్లలో అద్దె చెల్లిస్తూ ఉంటారు. అటువంటి కుటుంబాలన్నీ ఒక సొంత ఇల్లు సంపాదించుకోవాలని కలలు కంటూ ఉంటాయి. అటువంటి వారికి ఇల్లు సొంతంచేసుకోవడానికి అవసరమైన భారీ నిధులు ఒక్కసారే ముందస్తుగా ఉండే అవకాశం లేదు. కనుక ముందస్తుగా ఆ నిధులను అప్పుగా సమకూర్చి, ఆ అప్పు తిరిగి చెల్లించేటప్పుడు వడ్డీ వసూలు చేసి, ఆ వడ్డీ మీద తమ మనుగడ సాగించేందుకు ద్రవ్యసంస్థలు, బ్యాంకులు, బీమా, తనఖా సంస్థలు పుట్టుకొచ్చాయి. ఆ అప్పుతీసుకునే వారికి ఒక కచ్చితమైన ఆదాయవనరు, ఉద్యోగమో, వృత్తో, ఆస్తో ఉంటే వాళ్లు తిరిగి తమ అప్పు చెల్లిస్తారనే హామీ



ఉంటుంది. ఒకవేళా ఆ అప్పు చెల్లించలేని స్థితి వస్తే ఆ ఇల్లు స్వాధీనం చేసుకుని తిరిగి మరెవరికయినా అమ్ముకుంటే తాము ఇచ్చిన రుణాన్ని వెనక్కి రాబట్టుకోవచ్చునని ద్రవ్యసంస్థలకు నమ్మకం ఉంటుంది.

ఇది ప్రపంచమంతటా గృహరుణాల్లో కొనసాగే వ్యవహారమే. ఇందులో కూడ ఎక్కువ వడ్డీతో రుణాలివ్వడం, మనుషులకు ఉండే అవసరం మీద ఆడుకోవడం, వాళ్లు అప్పు చెలించలేని స్థితి వస్తే వారిని నిరాశ్రయులను చేసి ఇల్లు లాక్కోవడం మొదలయిన అనైతిక వ్యవహారాలను గురించి కూడ ప్రశ్నించవచ్చుగాని, మొత్తానికి ఈ ప్రక్రియ చాల కాలంగా సజావుగా సాగిపోతూనే ఉంది. ఈ ప్రక్రియలోకి అమెరికన్ ఆర్థిక వ్యవస్థలో మరొక రెండు మూడు విచిత్రమైన వ్యవహారాలు వచ్చి చేరాయి.

ఒకసారి ఒక ద్రవ్యసంస్థ ఒక ఇంటిని తనఖాగా పెట్టుకుని, ఆ ఆస్తే ధరావత్తుగా రుణం ఇచ్చినట్టయితే, ఆ రుణం తిరిగి రావడానికి పది సంవత్సరాలో, ఇరవై సంవత్సరాలో సుదీర్ఘ కాలం పడుతుంది. మరి అసలు ద్రవ్యసంస్థల లావాదేవీలే ఎప్పుడూ చేతిలో డబ్బులు ఆడడం మీద, ఆ డబ్బు ఎప్పటికప్పుడు చలామణీలో ఉండడం మీద పనిచేస్తాయి. తమ చేతిలో ఉన్న డబ్బంతా ఇల్లు కొనుక్కోదలచుకున్న వాళ్లకు ఇచ్చేసి, వాళ్లు ఇరవై ఏళ్లమీద నెలనెలా వాయిదాల్లో ఇస్తారని ఎదురుచూస్తూ కూచుంటే ద్రవ్యసంస్థల రోజువారీ లావాదేవీలకు అవసరమైన డబ్బు సమకూరని స్థితి వస్తుంది. అందుకని ఈ అప్పులను, తనఖాలను మరెవరికయినా అమ్మగలిగితే, ఆ కొన్నవాళ్లు వెంటనే డబ్బులు ఇవ్వగలిగితే బాగుంటుంది గదా అని ద్రవ్యసంస్థల మేధావులు ఒక మహా ఆలోచన చేశారు. ఈ ఆలోచన ఎంత దగుల్బాజీదో చూడగానే అర్థమవుతుంది. ఎందుకంటే అప్పును లేదా తనఖాను అమ్మడం అనే మాటకే అర్థం లేదు. తమకు నష్టదాయకమవుతుందనో, ఆలస్యం వల్ల ఇబ్బందికరమైనది అవుతుందనో అనిపించినది, మరొకరికి ఎట్లా పనికొస్తుందనేది కూడ ప్రశ్నే. కాని గృహ రుణాల ద్రవ్య సంస్థలు ఈ ఆలోచనను ఏదో గొప్ప అన్వేషణగా ప్రకటించాయి. వాటికి డిరైవేటివ్స్, మార్ట్ గేజ్ బేస్డ్ సెక్యూరిటీస్, కొల్లాటరలైజ్డ్ సెక్యూరిటీస్ అని ఆకర్షణీయమైన పేర్లు పెట్టాయి. వాటిని ద్రవ్య ఉత్పత్తులు అన్నారు. వాటిలో ద్రవ్యమూలేదు, అవి ఉత్పత్తులూ కావు. ఉత్తి కాగితాలు, కాకపోతే డాలర్లలో ఆస్తులను చూపిన కాగితాలు. అలా కాగితాల్లో చూపిన అప్పులను, తనఖాలను కొనుక్కోవడానికి కొన్ని తనఖాసంస్థలు, ద్రవ్యసంస్థలు, బ్యాంకులు, అంతర్జాతీయ ద్రవ్యసంస్థలు ముందుకొచ్చాయి.

ఈ చక్రంలో ఇల్లు కొనుక్కున్న కుటుంబాలు, వారికి రుణం ఇచ్చిన బ్యాంకులు, ఆ బ్యాంకులదగ్గర గృహ రుణాలు కొనుక్కున్న తనఖాసంస్థలు, ఆ తనఖాసంస్థలు తయారు చేసిన ద్రవ్య ఉత్పత్తులను కొనుక్కున్న దేశదేశాల ద్రవ్యసంస్థలు ఉన్నాయి. ఇందులో మరికొందరు మారు బేరగాళ్లు, మధ్యవర్తిత్వ, దళారీ సంస్థలు కూడ వచ్చిచేరాయి.

ఈ చక్రంలో మొట్టమొదట ఉన్న రుణగ్రహీతలకు ఇల్లు కావాలి. వారికి ఇల్లు దొరికింది.

చిట్టచివరన ఉన్న ద్రవ్యసంస్థలకు అమెరికన్ డాలర్లలో హామీ ఉండే ధరావత్తు పత్రాలు కావాలి. వారికి అవి దొరికాయి. మధ్యలోని బ్యాంకులకు, తనఖా సంస్థలకు, తామరతంపరగా పుట్టుకొచ్చిన మధ్యవర్తి – దళారీ సంస్థలకు వడ్డీలలో కమిషన్లు (శవ ఊరేగింపులో పేలాలు) కావాలి. వారికి అవి దొరికాయి. ఇలా చూస్తే ఈ చక్రంలో అందరికీ ఎవరికి కావలసినవి వారికి దొరుకుతున్నట్టే, చక్రం చాల బాగా తిరుగుతున్నట్టే కనిపించింది. కాని ఒక్కసారి జాగ్రత్తగా చూస్తే ఈ పేకమేడకు అసలు పునాది లేదు. దీనిలో అటుచివర ఇళ్ళు కావాలనుకునేవారు, వారికి అందిన డబ్బులు తప్ప మిగతా అంతా కేవలం కాగితాలు, గాలి కబుర్లు, గాలి బుడగలు. అందువల్ల ఈ పేకమేడ కూలిపోక తప్పలేదు. ఆ గాలిబుడగలు పేలిపోక తప్పలేదు.

అయితే ఆ పేకమేడ కూలిపోవడానికి మరిరెండు పరిణామాలు దోహదం చేశాయి. వాటిలో ఒకటి సబ్ ప్రైమ్ పేరుమీద ప్రచారంలోకి వచ్చింది. మామూలుగా రుణం తిరిగి చెల్లింపులు చేయడానికి రుణ గ్రహీతకు నెలవారీ స్థిర ఆదాయం ఉన్నదా లేదా, ఒకవేళ స్థిర ఆదాయం లేకపోయినా అప్పుతీర్చడానికి అమ్మదగిన ఆస్తులేమయినా ఉన్నాయా అని చూసి వాటిని ధరావత్తుగా పెట్టుకుని అప్పులివ్వడం బ్యాంకుల ఆనవాయితీ. అమెరికాలో గృహ అవసరాలు విపరీతంగా పెరిగిపోతుండడం చూసిన రియల్ ఎస్టేట్ వ్యాపారస్తులు, తనఖా వ్యాపార కంపెనీలు కలిసి ఇళ్ల ఖరీదును, రియల్ ఎస్టేట్ ధరలను విపరీతంగా పెంచేశాయి. ఈ కృత్రిమ ధరల పెరుగుదలతో ఇళ్ల విలువలు అనూహ్యంగా పెరిగిపోయాయి. అసలు లక్ష డాలర్ల విలువ చెయ్యని ఇల్లు ఐదులక్షల డాలర్ల విలువయినదిగా ప్రచారమయింది. దానితో రుణ గ్రహీత తన అప్పు చెల్లించలేనని ఎప్పుడు చేతులు ఎత్తేసినా, ఆ ఇల్లు స్వాధీనం చేసుకుని అమ్ముకుంటే ఇచ్చిన రుణం, వడ్డీ మాత్రమే కాక ఇంకా ఎక్కువ డబ్బు కూడ రాబట్టవచ్చునని బ్యాంకులు ఆశపడడం మొదలుపెట్టాయి.

ఈ అత్యాశ వల్ల స్థిర ఆదాయం, ఉద్యోగం, ఆస్తి లేని వారికి కూడ గృహరుణాలు ఇస్తాం అని బ్యాంకులు ముందుకొచ్చాయి. నీనా (నో ఇన్ కం, నో అస్సెట్స్ – ఆదాయంలేదు, ఆస్తులు లేవు) అనే కొత్త రుణగ్రహీతల వర్గాన్ని బ్యాంకులు తయారు చేశాయి. అంటే బ్యాంకుల పరిభాషలో అర్హత లేని, యోగ్యత లేని (దాన్నే సబ్ ప్రైమ్ అన్నారు) రుణగ్రహీతల వర్గం ఒకటి తయారయింది. వీరిని బ్యాంకులవైపు, రుణాలవైపు ఆకర్షించడానికి అనేక బ్రోకరేజి కంపెనీలు, సలహా సంస్థలు, మధ్యవర్తి సంస్థలు పుట్టగొడుగుల్లాగ పుట్టుకొచ్చాయి. ఒక అంచనా ప్రకారం అమెరికాలో ఇళ్లు కొనదలచుకున్న వారికి బ్యాంకు రుణాల విషయంలో సలహాలివ్వడానికి 2004 నాటికి నాలుగు లక్షల ఉద్యోగులతో ఏర్పడిన 53 వేల బ్రోకరేజి కంపెనీలుండేవి. ఇలా అమెరికాలో ఇళ్లు అవసరమైన వారిలో దాదాపు తొంభై శాతం జనాభాకు ఇళ్ల సౌకర్యం కలిగిందని ఒక అంచనా. దానితో మొత్తం అమెరికన్ తనఖా వ్యాపార మార్కెట్ 12 ట్రిలియన్ డాలర్లుగా మారిపోగా అందులో అత్యధిక భాగం గృహ తనఖాలే అయ్యాయి.

సబ్ ప్రైమ్ రుణాలు పెరిగిపోయినకొద్దీ మరొక పరిణామం – నెలవాయిదా చెల్లింపులు



జరగకపోవడం – మొదలయింది. తమకు ఆదాయంలేకపోయినా బ్యాంకులు రుణాలు ఇచ్చాయి గనుక తీసుకున్న వాళ్లు, ఆదాయంలేదు గనుకనే నెలవాయిదాలు చెల్లించలేకపోయారు. అలా 2006 లో 12 లక్షల రుణాలు, 2007లో 15 లక్షల రుణాలు, 2008 లో 25 లక్షల రుణాలు మొండి బాకీలుగా, చెల్లింపు జరగని బాకీలుగా మిగిలిపోయాయి. మరొకవైపు ఇళ్ల ధరలు విపరీతంగా పెరిగిపోవడంతో, రియల్ ఎస్టేట్ కంపెనీలు విపరీతంగా ఇళ్లు కట్టడం మొదలుపెట్టాయి. గృహ నిర్మాణంలో అధికోత్పత్తి జరిగింది. ఒక సందర్భంలో 42 లక్షల ఇళ్లు ఎవరూ కొనకుండా ఖాళీగా మిగిలిపోయాయి. ఒకవైపు అప్పుతీసుకున్నవారు తిరిగి చెల్లించకపోవడం, మరొకవైపు కొత్తగా ఇళ్లు కొనడానికి ఎక్కువమంది ముందుకురాకపోవడంతో సహజంగానే ఇళ్లధరలు పడిపోక తప్పలేదు. ఒక్క 2007 సంవత్సరంలోనే అమెరికన్ ఇళ్ల విలువ 6 లక్షల కోట్ల డాలర్లు తగ్గిపోయింది.

ఈ స్థితిలో మనం ముందు చెప్పుకున్న చక్రాన్ని మళ్లీ ఒకసారి పరిశీలిస్తే, రుణగ్రహీతలు నెలవారీ వాయిదాలు చెల్లిస్తూ ఉంటేనే ఈ చక్రం సవ్యంగా తిరుగుతుంది. ఒకసారి రుణగ్రహీతల నెలవారీ వాయిదాల చెల్లింపులు ఆగిపోగానే తనఖా సంస్థలకు, బ్యాంకులకు నెలవారీ ఆదాయం తగ్గిపోయింది. వాళ్ల దగ్గర ఉన్న తనఖా కాగితాలు – విదేశీ ద్రవ్య సంస్థలను నమ్మించి అమ్మిన కాగితాలు – చిత్తుకాగితాలుగా మారడం మొదలయింది. ఆ సంస్థల ఆరోగ్యం దెబ్బతింటున్నదని తెలియగానే వాటి షేర్ల ధరలు పడిపోవడం మొదలయింది. ఆ తనఖా సంస్థలలో మదుపుపెట్టిన బ్యాంకులమీద ఆ ప్రభావం పడింది. ఆ బ్యాంకులు పెట్టిన మదుపు విలువ తగ్గిపోతూ ఒకదశలో శూన్యం అయిపోయింది.

ఈ పరిణామం గత కొద్ది సంవత్సరాలుగా చాపకింది నీటిలా జరుగుతూ వస్తున్నప్పటికీ, 2008 మార్చ్ లో బేర్ స్టేర్న్స్ అనే బ్యాంకు దివాళా తీసింది. అమెరికా కేంద్ర ప్రభుత్వ జోక్యంతో, ఫెడరల్ రిజర్వ్ (మన రిజర్వ్ బ్యాంక్ లాంటిది) సమకూర్చిన 30 బిలియన్ డాలర్ల (ఒక లక్షా ఇరవైవేల కోట్ల రూపాయలు) సహాయంతో ఆ బ్యాంకును జెపి మోర్గన్ చేస్ అనేద్రవ్య, బీమా సంస్థ కొనుగోలు చేసింది. ఆ బ్యాంక్ కార్యకలాపాలను పరిశీలించే క్రమంలో ప్రభుత్వం లోనూ, ద్రవ్య, తనఖా, బీమా సంస్థలలోనూ అధికారంలో ఉన్న వారు ఎన్నెన్ని అక్రమాలకు పాల్పడ్డారో, ఆర్థిక కుంభకోణాలు ఎంత పెద్ద ఎత్తున జరిగాయో బయటపడడం మొదలయింది. సెప్టెంబర్ వచ్చేసరికల్లా అమెరికన్ తనఖా వ్యాపారంలో దాదాపు సగభాగానికి బాధ్యత వహించే ఫానీ మే అండ్ ఫ్రెడ్డీ మాక్ అనే కంపెనీని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవలసి వచ్చింది. అదేనెలలో లేమన్ బ్రదర్స్ అనే తనఖా, ద్రవ్య సంస్థ కుప్పకూలిపోయింది. మెరిల్ లించ్ అనే ద్రవ్య సంస్థ బ్యాంక్ ఆఫ్ అమెరికాకు అమ్ముడుపోయింది. అమెరికన్ ఇంటర్నేషనల్ గ్రూప్ (ఎఐజి) అనే భారీ బీమా, తనఖా వ్యాపార సంస్థ కుప్పకూలిపోయే స్థితి వచ్చి, దాన్ని కాపాడడానికి అమెరికన్ ఫెడరల్ రిజర్వ్ మూడు లక్షల కోట్ల రూపాయల సహాయం అందించవలసి వచ్చింది. ఆ తర్వాత వాషింగ్టన్ మ్యూచువల్ అనే ద్రవ్య సంస్థ కూలిపోయింది.

ఈ దెబ్బకు యూరప్ లో అనేక బ్యాంకులు, ద్రవ్యసంస్థలు కూలిపోవడం మొదలయింది. ఈ పతనాల వివరాలు ఇంతకన్న ఎక్కువ అక్కరలేదు గాని, మొత్తం మీద అమెరికాలో తనఖా, బీమా, ద్రవ్య వ్యాపారాలను ప్రస్తుత సంక్షోభం నుంచి గట్టెక్కించాలంటే 700 బిలియన్ డాలర్ల (ముప్పైలక్షల కోట్ల రూపాయల) సహాయం అందించాలని ప్రభుత్వం నిర్ణయించింది.

ఆ సహాయం అందినా అందకున్నా, ఇలా కుప్పకూలిపోతున్న కంపెనీలన్నీ అంతర్జాతీయ ద్రవ్య, మదుపు, బీమా, తనఖా సంస్థలు కాబట్టి వాటి వాటాలతో, మదుపుతో, పెట్టుబడులతో, సహాయతో నడుస్తున్న వేలాది అమెరికన్ కంపెనీలు, ఇతరదేశాల కంపెనీలు కుప్పకూలిపోయే స్థితి వచ్చింది. ఒక ఉదాహరణ చెప్పాలంటే కూలిపోయిన ఎఐజి కి అమెరికా ప్రభుత్వం మూడు లక్షల కోట్ల రూపాయలు ఇచ్చి ఆదుకోక పోయి ఉన్నట్టయితే, ఆ కంపెనీ మిలాఖత్తుతో నడుస్తున్న మన బీమా సంస్థ టాటా ఎఐజి కూడ కూలిపోయి ఉండేది. అంటే ద్రవ్య వ్యాపారం దగ్గర మొదలయిన ఈ సంక్షోభం ఆ ద్రవ్యం ప్రవహించిన ఇతర వ్యాపార, వాణిజ్య, పారిశ్రామిక సంస్థలకు కూడ పాకింది, పాకుతుంది. ఆ సంస్థలు నిధులకోసం ఇబ్బంది పడే పరిస్థితి వస్తుంది. ఆ ఇబ్బంది నుంచి గట్టెక్కడానికి ఖర్చులు తగ్గించుకోవడం, అంటే ఉద్యోగులను తొలగించడం చేయవలసి వస్తుంది. అంటే ఆయా సంస్థల ఉత్పత్తులు, సేవలు తగ్గిపోతాయి. మరొకవైపు ఉద్యోగాలు, ఉపాధి కోల్పోయినందువల్ల ప్రజల కొనుగోలు శక్తి పడిపోవడం వల్ల మార్కెట్లలో సరుకుల, సేవల అమ్మకాలు తగ్గిపోతాయి. అంటే మొత్తం ఆర్థిక వ్యవస్థలోని ఉత్పత్తి చక్రమే వెనుకకు తిరగడం మొదలవుతుంది.

నిజానికి పెట్టుబడిదారీ వ్యవస్థ గర్భంలోనే ఇటువంటి సంక్షోభానికి సహజమైన అవకాశాలు ఉన్నాయి. పెట్టుబడిదారీ విధానంలో సరుకుల ఉత్పత్తి ప్రజల అవసరాలకు అనుగుణంగా కాక, పెట్టుబడిదారుల లాభాపేక్ష ప్రాతిపదికగా జరుగుతుంది. ఉత్పత్తి ప్రక్రియ ఎంతగా సామాజికంగా మారుతుందో, ఉత్పత్తి సాధనాలు, ఫలితాలు అంతగా వ్యకిగత ఆస్తిగా మారుతాయి. సంపద పెరుగుదల ఎంత పెద్ద ఎత్తున సాగుతుందో, పేదరికం కూడ అంతే ఎక్కువగా విస్తరిస్తుంది. యంత్రాల వాడకం ఎంతగా పెరుగుతుందో అంతగా నిరుద్యోగం విస్తరిస్తుంది. ఇటువంటి అనేక మౌలిక వైరుధ్యాలవలెనే, పెట్టుబడిదారీ విధానంలో ఒక పక్క అధికోత్పత్తి, మరొక పక్క అల్పవినియోగం కొనసాగుతాయి. ప్రస్తుతం గృహ రుణాల విషయంలో కూడ ఇది రుజువయింది. ద్రవ్య, తనఖా, బీమా వ్యాపారంలోని కొందరు వ్యక్తుల, కొన్ని కంపెనీల అత్యాశ, లాభాపేక్ష, దురాశల వల్ల మాత్రమే కాక పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలోని మౌలిక వైరుధ్యంవల్లనే ఈ సంక్షోభం తలెత్తింది. ఈ సంక్షోభాన్ని పరిష్కరించడం పెట్టుబడిదారీ వ్యవస్థ పరిధిలోపల సాధ్యం కాదు. పెట్టుబడిదారీ వ్యవస్థను తోసివేసే ప్రత్యామ్నాయ వ్యవస్థలో మాత్రమే ఇటువంటి సంక్షోభాలు రాకుండా ఉంటాయి.

***మహిళామార్గం, నవంబర్ - డిసెంబర్ 2008***



# 65

# ఆర్థిక సంక్షోభం : మార్క్సిస్టు రాజకీయార్థిక సూత్రాల నిరూపణ

పెట్టుబడిదారీ వ్యవస్థలో ఆ ఉత్పత్తి విధానంవల్ల అనివార్యంగా సంక్షోభాలు వస్తాయని రాజకీయార్థిక శాస్త్రం చదువుకున్నవారందరికీ తెలుసు. ఆ సంక్షోభాల గురించి వివరించకతప్పని పెట్టుబడిదారీ అర్థశాస్త్రం కూడ వాటి లోతునూ విస్తృతినీ తీవ్రతనూ తగ్గించి వాటిని ఏవో స్వల్పకాలికమైన, స్థానికమైన వ్యాపార వలయాలుగా, పారిశ్రామిక వలయాలుగా ప్రచారం చేస్తూ ఉండడం కూడ తెలిసిన విషయమే. సంక్షోభం, మాంద్యం, పునరుజ్జీవనం, వికాసం అనే నాలుగు దశలు పెట్టుబడిదారీ ఉత్పత్తివిధానంలో నిరంతరాయంగా వస్తుంటాయనీ, వాటితో భయపడవలసినదేమీలేదనీ, ఒక రకంగా అవి అధికోత్పత్తినీ, నిరుద్యోగాన్నీ సవరించి, వనరుల వినియోగాన్ని పునర్ నిర్ధారించే వ్యవస్థాగత చర్యలనీ పెట్టుబడిదారీ అర్థశాస్త్రం బోధిస్తుంది. గత రెండు శతాబ్దాలలో ఇటువంటి వలయాలు పది సంవత్సరాలకొకసారి, ఒక్కొక్కసారి ఇంకా తక్కువ వ్యవధిలోనూ వచ్చాయని, ప్రతిసారీ పెట్టుబడిదారీ విధానపు పునరుజ్జీవనం, వికాసం సాధ్యమయ్యాయనీ కూడ పెట్టుబడిదారీ అర్థశాస్త్రం చెపుతుంది. అంటే ఈ వలయంలో సంక్షోభం, మాంద్యాల పాత్రకన్న పునరుజ్జీవనం, వికాసాల పాత్రే ఎక్కువన్నట్టుగా, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం సంక్షోభాలను

అధిగమిస్తుందన్నట్టుగా పెట్టుబడిదారీ అర్థశాస్త్రవేత్తలు ప్రవచిస్తుంటారు. సంక్షోభాల వల్ల పెట్టుబడిదారీ విధానం కూలిపోతుందని మార్క్సిస్టులు చెప్పే మాట నిజం కాదని అంటుంటారు.

అటువంటి అర్థశాస్త్రవేత్తలు, పెట్టుబడిదారీ సమర్థకులు కూడ సమర్థించడానికి తబ్బిబ్బు పడుతున్నటువంటి, సమర్థించలేకపోతున్నటువంటి సంక్షోభం 2008 లో మొదలయింది. ఈ సంక్షోభం భౌగోళిక విస్తృతిలోనూ, వివిధ ఆర్థిక వ్యాపార పారిశ్రామిక రంగాల విస్తృతిలోనూ, లోతులోనూ ఎంత తీవ్రమైనదో గత రెండు నెలలుగా రోజురోజుకూ అంతకంతకూ ఎక్కువగా బయటపడుతోంది. ప్రపంచవ్యాప్తంగా ప్రచార సాధనాల, ప్రభుత్వాల, ద్రవ్యసంస్థల, వ్యాపార పారిశ్రామిక వర్గాల ప్రతిస్పందన తోనే ఈ సంక్షోభం ఎంత తీవ్రమైనదో తేటతెల్లమవుతోంది. చాలమంది అర్థశాస్త్రవేత్తలకు, పరిశీలకులకు ఈ సంక్షోభాన్ని 1929 నాటి మహాసంక్షోభంతో పోల్చకతప్పని స్థితి వచ్చింది. అలా పోల్చే క్రమంలో ఆనాటి మహాసంక్షోభం ధాటికి తట్టుకుని నిలిచిన సోవియట్ ఆర్థికవ్యవస్థ గురించి కూడ చర్చ వస్తోంది. ఈ సమయంలోనే చాలమంది పరిశీలకులు మళ్లీ ఒకసారి మార్క్సునూ, తమ కాలపు సంక్షోభాలను మార్క్స్ – ఎంగెల్స్‌లు విశ్లేషించిన తీరునూ, మొత్తంగా మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్రంలో పెట్టుబడిదారీ ఆర్థిక సంక్షోభం గురించిన విశ్లేషణనూ గుర్తు చేసుకుంటున్నారు. ఆర్థిక సంక్షోభాన్ని అర్థం చేసుకోవడానికీ, వివరించడానికీ, విశ్లేషించడానికీ మార్క్సిస్టు సంవిధానం తప్పనిసరి అని గుర్తిస్తున్నారు.

ప్రస్తుత సంక్షోభం అమెరికాలో గృహరుణాల వల్లనో, సబ్ ప్రైమ్ సంక్షోభం వల్లనో, అమెరికా తనఖా వ్యాపారంలో ఒడిదుడుకులవల్లనో, అమెరికాలో వడ్డీరేట్లకూ ఇతరదేశాల వడ్డీరేట్లకూ ఉన్న తేడాలవల్లనో, అమెరికన్ డాలర్ ప్రాముఖ్యతవల్ల ఇతరదేశాల ద్రవ్యసంస్థలు అమెరికన్ ద్రవ్య ఉత్పత్తులకు ఎగబడడం వల్లనో వచ్చిందని ఇప్పటికే ఎంతోమంది వివరించారు. ఈ కారణాలన్నీ బయటికి కనబడుతున్న కారణాలు కావచ్చు. సంక్షోభం ముదిరిపోవడంలో వాటిపాత్ర కొంతమేరకు ఉండవచ్చు. కాని అంతకన్న ముఖ్యమైన, ప్రధానమైన కారణాలున్నాయి. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో ఉన్న అంతర్వైరుధ్యాలవల్ల, అది ఆధారపడిన మూల సూత్రాల వల్ల, పెట్టుబడిదారీ లాభాపేక్ష నియమాలవల్ల అనివార్యంగానే, సహజంగానే పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం సంక్షోభాల మయంగా ఉంటుంది. ప్రస్తుత ఆర్థిక సంక్షోభం కూడ పెట్టుబడిదారీ జ్వరసూచిక కాదు, ఒకానొక రోగ లక్షణం కాదు. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానపు స్వాభావిక, సహజాత అవలక్షణాలు బయటపడుతున్న సందర్భం మాత్రమే. అసలు పెట్టుబడిదారీ విధానమే సంక్షోభం. తాత్విక స్థాయిలో గాని, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం పునాదిలోగాని, ఆ ఉత్పత్తి విధానం పనితీరులో గాని చాల సహజంగా, అనివార్యంగా ఉండే అంశాలే దాని సంక్షోభానికి దారితీస్తాయి. ప్రస్తుతం కూడ అవే ఈ సంక్షోభానికి దారితీశాయి.

ఆర్థికవ్యవస్థ సంక్షోభం గురించి అటు పెట్టుబడిదారీ అర్థశాస్త్రంలోనూ, ఇటు మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్రంలోనూ అనేక విశ్లేషణలు, అవగాహనలు ఉన్నాయి. మార్క్సిస్టు విశ్లేషణను



మాటమాత్రంగా కూడ ప్రస్తావించకుండా, డజన్లకొద్దీ వ్యాపారవలయాల సిద్ధాంతాలను ప్రస్తావించిన పాల్ శామ్యూల్‌సన్ ఏడు రకాల సిద్ధాంతాల జాబితా ఇచ్చాడు గాని అవేవీ సంక్షోభాన్ని మూలాలనుంచి, సమగ్రంగా విశ్లేషించేవి కావు. ఇటు మార్క్సిస్టు శిబిరంలో కూడ సంక్షోభం గురించి స్వయంగా మార్క్స్ – ఎంగెల్స్‌లు చెప్పిననాటినుంచి, ఆ తర్వాత కాలంలో లెనిన్, రోజా లగ్జెంబర్గ్ వంటి మార్క్సిస్టులు, విశ్వవిద్యాలయాల మార్క్సిస్టు అర్థశాస్త్రవేత్తలు చెప్పినవాటివరకూ ఎన్నో సూత్రీకరణలు, సిద్ధాంతాలు ఉన్నాయి. స్వల్పమైన భేదాలు కూడ ఉన్నాయి. మొత్తం మీద మార్క్సిస్టు శిబిరంలోనే పెట్టుబడిదారీ సంక్షోభం గురించి వెలువడిన సిద్ధాంతాలన్నిటినీ రెండు రకాలుగా వింగడించవచ్చునని పరిశీలకులు అంటున్నారు: అవి, 1. అధికోత్పత్తి – అల్ప వినియోగం; రెండు ఉత్పత్తి శాఖల మధ్య సమన్వయం లేకపోవడం వంటి అసమతౌల్య సంక్షోభాలు. 2. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో లాభాల రేటు పడిపోయే ధోరణి వల్ల వచ్చే సంక్షోభాలు.

పెట్టుబడిదారీ విధానంలో సరుకుల ఉత్పత్తి ప్రజల అవసరాలకు అనుగుణంగా కాక, పెట్టుబడిదారుల లాభాపేక్ష ప్రాతిపదికగా జరుగుతుంది. ఉత్పత్తి ప్రక్రియ ఎంతగా సామాజికంగా మారుతుందో, ఉత్పత్తి సాధనాలు, ఫలితాలు అంతగా వ్యకిగత ఆస్తిగా మారుతాయి. సంపద పెరుగుదల ఎంత పెద్ద ఎత్తున సాగుతుందో, పేదరికం కూడ అంతే ఎక్కువగా విస్తరిస్తుంది. యంత్రాల వాడకం ఎంతగా పెరుగుతుందో అంతగా నిరుద్యోగం విస్తరిస్తుంది. ఇటువంటి అనేక మౌలిక వైరుధ్యాలవలెనే, పెట్టుబడిదారీ విధానంలో ఒక పక్క అధికోత్పత్తి, మరొక పక్క అల్పవినియోగం కొనసాగుతాయి.

ఈ అంశాన్ని 'కమ్యూనిస్టు ప్రణాళిక'లో కూడ మార్క్స్ – ఎంగెల్స్‌లు ప్రస్తావించారు: "కొంతకాలానికి ఒకసారి విడవకుండా వస్తూ, వచ్చిన ప్రతిసారీ మొత్తం పెట్టుబడిదారీ వర్గం అస్తిత్వానికే మరింత భీతావహంగా ప్రమాదం కలిగిస్తున్న వాణిజ్య సంక్షోభాలను చూద్దాం. ఈ సంక్షోభాలలో అప్పటికే తయారయి ఉన్న వస్తువులలోని అధికభాగమే కాకుండా, అంతకు పూర్వం రూపొంది ఉన్న ఉత్పత్తి శక్తులలోని అధికభాగం కూడ నాశనం చేయబడుతుంది. ఈ సంక్షోభాలలో, అంతకు పూర్వపు యుగాలలో అర్థరహితంగా కనబడే మహమ్మారి ఒకటి – అధికోత్పత్తి అనే మహమ్మారి పుట్టుకొస్తుంది. ఈ సంక్షోభాలు కలిగినప్పుడల్లా ఒక క్షణకాలం అనాగరిక దశలోకి, వెనక్కి నెట్టబడినట్టుగా సమాజానికి అనిపిస్తుంది. మహా దుర్భిక్షంగానీ, సర్వవినాశకరమైన ప్రపంచవ్యాప్త యుద్ధంగానీ వచ్చి, నిత్యజీవితావసర సరుకుల సరఫరా నంతటినీ ధ్వంసం చేసినట్టనిపిస్తుంది. పరిశ్రమా, వాణిజ్యమూ నాశనమైనట్టనిపిస్తుంది."

ఇదే అంశాన్ని ఎంగెల్స్ 'సోషలిజం ఊహాజనితమూ శాస్త్రీయమూ' లో కూడ వివరించాడు: "మొట్టమొదటి సార్వత్రిక సంక్షోభం తలెత్తిన 1825 నుంచీ కూడ అన్ని నాగరిక సమూహాలలోనూ, వారి బర్బర సహచరులలోనూ సకల పారిశ్రామిక, వాణిజ్య ప్రపంచమూ, ఉత్పత్తీ వినిమయమూ ప్రతి పది సంవత్సరాలకొకసారి అతలాకుతలమై పోతున్నాయి. వ్యాపారం

స్తంభించిపోతోంది. మార్కెట్లలో సరుకుల గుట్టలు పేరుకుపోతున్నాయి. అమ్ముడుపోని ఉత్పత్తులు అనంతంగా మిగిలిపోతున్నాయి. ప్రతి ఒక్కరి దగ్గరా చేతిలో డబ్బులు ఆడని పరిస్థితి వస్తోంది. పరపతి సౌకర్యం అదృశ్యమవుతోంది. కార్ఖానాలు మూతబడిపోతున్నాయి. కార్మిక జనావళి ఉపాధికోల్పోయి వీధుల్లోపడుతున్నారు. ఇదంతా ఎందుకంటే వాళ్లు మనుగడకు అవసరమయిన దానికన్న ఎక్కువ ఉత్పత్తి చేశారు గనుక."

అధికోత్పత్తి అంటే ప్రజలకు, సమాజానికి అవసరమైనదానికన్న ఎక్కువ ఉత్పత్తి కావడం కాదు. ఉత్పత్తి చేసిన సరుకులన్నిటినీ పెట్టుబడిదారులు అమ్ముకోలేకపోవడం. అంటే అధికోత్పత్తి సంక్షోభానికి మరొక ముఖం ప్రజల అల్ప వినియోగం. ఈ అధికోత్పత్తి – అల్ప వినియోగం ప్రధానంగా ఒక సాపేక్షిక స్థితిని తెలుపుతాయి. అవి పెట్టుబడిదారీ సమాజంలో ప్రజలకు కొనుగోలు శక్తి లేకపోవడానికి సూచికలు.

అసలు అధికోత్పత్తి – అల్ప వినియోగం ఎందుకు వస్తాయి? పెట్టుబడిదారీ ఉత్పత్తి క్రియ మొత్తాన్నీ రెండురకాలుగా విభజించి చూడవచ్చు. అవి మొదటిది, ప్రజలకు అవసరమైన వినియోగ సరుకులను ఉత్పత్తి చేసే శాఖ. రెండవది, ఆ సరుకులను తయారుచేసే భారీ యంత్ర సామగ్రిని ఉత్పత్తి చేసే శాఖ. ఈ రెండు శాఖలూ ఒకదానిమీద ఒకటి ఆధారపడి, సమన్వయంతో పనిచేయవలసినవే. కాని పెట్టుబడిదారీ వ్యవస్థలోని వైరుధ్యాలవల్ల ఆ సమన్వయం కొరవడుతుంది. పెట్టుబడిదారులు విడివిడిగా తమ కార్ఖానాలలో ఎంత క్రమబద్ధంగా, క్రమశిక్షణతో, సమన్వయంతో పనిచేస్తారో, మొత్తం మార్కెట్ లోకి వచ్చినప్పుడు తమ లాభాలే ప్రధానంగా చూసుకుంటూ అంత అరాచకంగా, గందరగోళంగా, పరస్పర పోటీతో వ్యవహరిస్తారు. అందరికన్న తామే ఎక్కువ లాభాలు సంపాదించాలనే దృష్టితో ఎక్కువ వేగవంతమైన, తక్కువ మానవశ్రమను వాడే యంత్రాలతో ఉత్పత్తి చేయాలనుకుంటారు. అలా ఆ యంత్రాలకు గిరాకీ పెరుగుతుంది. ఆ యంత్రాల ఉత్పత్తి పెరుగుతుంది. వాటివల్ల వినియోగ సరుకుల ఉత్పత్తి పెరుగుతుంది. మార్కెట్ లో ఆ సరుకులు నిండిపోతాయి. కాని కొత్త యంత్రాలు తక్కువ శ్రామికులను ఉపయోగిస్తాయి గనుక ఒక శాఖలో యంత్రాల ఉత్పత్తి పెరిగినకొద్దీ రెండో శాఖలో కార్మికుల సంఖ్య తగ్గిపోతుంది. కార్మికుల సంఖ్య తగ్గిపోవడమంటే కార్మికుల కొనుగోలు శక్తి తగ్గిపోవడమే. అంటే సరుకుల మార్కెట్ తగ్గిపోవడమే. ఆ విధంగా మొత్తంమీద మార్కెట్ లో సరుకులు ఎక్కువగానూ, కొనగల వినియోగదారులు తక్కువగానూ ఉండే స్థితి వస్తుంది.

ఈ అధికోత్పత్తి సంక్షోభంవల్ల తయారయిన సరుకులు అమ్మకంకాకుండా మిగిలిపోవడం మాత్రమే కాక, ఇక సరుకులను తయారు చేయనక్కరలేదని కొన్ని పరిశ్రమలు మూతబడిపోతాయి. దానితో మరికొందరు కార్మికులు ఉపాధిపోగొట్టుకుని, కొనుగోలు శక్తి పోగొట్టుకుంటారు. అంటే మార్కెట్లో వినియోగ సరుకుల గిరాకీ మరింత తగ్గిపోతుంది. మరొకవైపు వినియోగ సరుకుల పరిశ్రమలు మూతబడడంతో యంత్రసామగ్రి పరిశ్రమలు కూడ అధికోత్పత్తి దశకు చేరుకుని అక్కడ కూడ కార్మికులను తొలగించవలసి వస్తుంది. ఈ చక్రం మరింత తిరిగి అనుబంధ పరిశ్రమలు కూడ మూతబడతాయి.



సాధారణంగా పెట్టుబడిదారీ పరిశ్రమల్లో పెటుబడిదారులు బ్యాంకులనుంచి, ద్రవ్య సంస్థల నుంచి రుణాలు తీసుకుని పరిశ్రమలు ఏర్పాటు చేస్తారు గనుక, పరిశ్రమలు మూత బడగానే ఆ ద్రవ్యసంస్థలు కూడ దివాళా ఎత్తక తప్పదు. ద్రవ్యసంస్థలు, బ్యాంకులు మూత బడ్డాయంటే, దానిలో డబ్బులు దాచుకున్న మధ్యతరగతి, సాధారణ ప్రజానీకం, పదవీ విరమణ ఫలితాలు దాచుకున్న వృద్ధులు, వగైరా ఖాతాదార్లందరూ కుప్పకూలిపోతారు. ఇలా ఒకచోట అధికోత్పత్తిగా ప్రారంభమైనది సార్వత్రిక సంక్షోభంగా మారుతుంది. ఆర్థిక వ్యవస్థలో విభిన్న శాఖలమధ్య, వివిధ సరుకుల పరిశ్రమల మధ్య, వివిధ బ్యాంకుల మధ్య, వివిధ ద్రవ్య సంస్థల మధ్య, వివిధ దేశాల ఆర్థిక వ్యవస్థలమధ్య సంబంధాలు ఎంతగా పెరుగుతుంటే ఈ సంక్షోభం అంతగా సార్వత్రికం అవుతుంది.

లాభాలరేటు పడిపోయే ధోరణి వల్ల వచ్చే సంక్షోభాన్ని కూడ ఈ అధికోత్పత్తి సంక్షోభంలో భాగంగానే చూడవచ్చు. లాభాల రేటు పడిపోవడానికి రెండు ముఖాలున్నాయి. ప్రతి ఒక్క పెట్టుబడిదారూ కూడ తన కార్మికులకు వీలయినంత తక్కువ ఇచ్చి తన లాభాలు ఎక్కువగా పెంచుకోవాలని చూస్తాడు. కాని తాను తయారు చేసే సరుకుల మార్కెట్ మాత్రం పెరగాలని కోరుకుంటాడు. అంటే సమాజంలోని ఇతరప్రజల (అంటే ఇతర పరిశ్రమల కార్మికుల) వేతనాలు మాత్రం పెరగాలని కోరుకుంటాడు. వేతనాలు తగ్గినందువల్ల మార్కెట్ గిరాకీ తగ్గుతుంది. వేతనాలు పెంచాలంటే లాభాలు తగ్గుతాయి. ఇది ఒక అనివార్యమైన పెట్టుబడిదారీ ఉత్పత్తి నియమం వైరుధ్యం.

లాభాలరేటు పడిపోవడానికి రెండో ముఖం – ఘనాంగ నిర్మాణానికి సంబంధించినది. పెట్టుబడిదారులకు లాభాలు మానవశ్రమనుంచి అదనపు విలువను పిండడం వల్లనే వస్తాయి గనుక, మానవశ్రమను తగ్గించే యంత్రాల వాడకం పెరిగినకొద్దీ, అంటే పెట్టుబడి ఘనాంగ నిర్మాణం పెరిగినకొద్దీ, లాభాల రేటు తగ్గిపోతుంటుంది. కాని పెట్టుబడిదారీ విధానమంటేనే లాభం గనుక ఇంకా ఎక్కువ లాభం సంపాదించడానికి పెట్టుబడిదారులు ఇంకా యాంత్రీకరణకు ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నంలో భాగంగా సంక్షోభం తలెత్తుతుంది.

ఈ నేపథ్యం నుంచి 2008 సంక్షోభాన్ని పరిశీలిస్తే, ఈ సంక్షోభం ఇప్పటికి ప్రధానంగా మౌలిక పరిశ్రమలలో బయటపడలేదు. అమెరికాలో ఆటోమొబైల్ పరిశ్రమ మీద కొంత ప్రభావం కనబడుతున్నప్పటికీ, ఇది ప్రధానంగా ద్రవ్య రంగానికే పరిమితమై ఉంది. ద్రవ్యరంగంలో కూడ గృహాల అధికోత్పత్తి, గృహ రుణాలను ఇబ్బడిముబ్బడిగా, అసలు ధరావత్తులేకుండా, ఉద్యోగం, ఆదాయం లేనివారికి కూడ రుణం ఇచ్చి ఇల్లు తనఖా పెట్టుకోవడంగా మొదలయింది. ఆ తనఖాలను – అంటే ఉత్తి కాగితాలను – ఆకర్షణీయమైన పేర్లతో, సరుకులుగా మార్చి వాటిని ప్రపంచానికంతా అమ్మడంలో అమెరికన్ ద్రవ్య, తనఖా, బీమా సంస్థలు విజయం సాధించాయి. రుణం – తిరిగి వాయిదాలు చెల్లించలేనివారికి రుణం – రియల్ ఎస్టేట్ ధరలను కృత్రిమంగా విపరీతంగా పెంచి ఆ ఇళ్లనే ధరావత్తుగా, తనఖాగా పెట్టుకోవడం – ఆ తనఖా

కాగితానికి డెరైవేటివ్స్ అనీ, కొల్లాటరలైజ్డ్ సెక్యూరిటీస్ అనీ ముద్దుపేర్లు పెట్టి, ఆ కాగితాలను దేశదేశాల మదుపుదార్లకు అమ్మడం – ఈ విషచక్రం సాగినంతకాలం బాగానే సాగింది. పెట్టుబడిదారులు వీలయినచోట్ల ప్రతి మజిలీ దగ్గరా లాభాలు చేసుకున్నారు. కాని ఈ చక్రం ఏ ఒక్క చోట అయినా ఆగిపోతే ఇదంతా పేకమేడలా కూలిపోతుంది. ప్రస్తుతం జరిగినది అదే.

ఈ ప్రక్రియకూ ఆర్థిక సంక్షోభం గురించి మార్క్సిస్టు రాజకీయార్థిక విశ్లేషణకూ పోలికలూ తేడాలూ చూస్తే, ఇది పరిశ్రమ కాకపోవచ్చు గాని నిత్యజీవితావసరమైన ఇల్లు అనే సరుకును ప్రజలకు అమ్మడం అనే ప్రక్రియ ఇక్కడ సాగింది. తీసుకోగలిగినవాళ్లకంటే ఎక్కువమందికి రుణాలను ఇవ్వడం, కొనగలిగినవాళ్ల సంఖ్యకంటె ఎక్కువ ఇళ్ల నిర్మాణం జరిగాయి. అంటే ఇళ్ల సంఖ్యలో అధికోత్పత్తి తప్పనిసరిగా ఉంది. రుణం తీసుకోవడానికి ఆస్తీ ఆదాయమూ ఉద్యోగమూ ధరావత్తూ ఏమీ అక్కరలేకపోవచ్చుగాని వాయిదాలు చెల్లించడానికి క్రమబద్ధమైన ఆదాయం కావాలి. అది లేనివారు వాయిదాలు కట్టడం మానేశారు. దానితో తనఖా పత్రాలు కొనుక్కున్న వారికి ఆదాయం ఆగిపోయింది. వారు కూలిపోయారు. వారినుంచి గిరాకీ లేకపోవడంతో గృహ రుణ సంస్థలకు రుణాలు ఇవ్వడానికి నిధులు లేకుండాపోయాయి. దానితో గృహ రుణాలు తగ్గిపోయాయి. వాయిదాలు కట్టలేనివారు పెరిగిపోవడంతో వారిని ఇళ్ల నుంచి ఖాళీ చేయించడం, కొత్త రుణాలు ఇవ్వలేకపోవడం, అందువల్ల కొత్త ఇళ్లు అమ్మకం కాకపోవడం – చక్రం ఎంత వేగంగా ముందుకు తిరిగిందో అంతే వేగంగా వెనక్కి తిరిగింది. పారిశ్రామిక సరుకుల గురించి చెప్పుకున్నట్టుగా ఇళ్ల గురించి కూడ ఒకవైపు అధికోత్పత్తి, మరొకవైపు అల్ప వినియోగం అని చెప్పుకోవలసి వచ్చింది. మొత్తంగా పెట్టుబడిదారీ అరాచకత్వం గురించి మార్క్సిస్టు రాజకీయార్థిక శాస్త్రం చెప్పిన సూత్రీకరణ అక్షరాలా మనకళ్లముందే రుజువయింది.

ఈ సంక్షోభాన్ని పరిష్కరించి అమెరికన్ ద్రవ్య, బీమా, తనఖా రంగాన్ని గట్టెక్కించాలంటే ముప్పై లక్షల కోట్ల డాలర్లు అవసరమవుతాయని, అవి సమకూర్చి తనఖారంగాన్ని, ద్రవ్య, బీమా సంస్థలను కాపాడతానని అమెరికన్ పాలకవర్గాలు అంటున్నాయి. కాని మౌలికంగా పెట్టుబడిదారీ సామాజిక ఆర్థిక ధర్మంలోనే, దాని పునాదిలోనే ఈ వైరుధ్యం ఉన్నప్పుడు ఈ ఉపశమనాలు ఆ సంక్షోభాన్ని పరిష్కరించజాలవు. కాకపోతే ఈ సారి ఏర్పడిన సంక్షోభాన్ని ఎంతో కొంత తగ్గించవచ్చు. మళ్ళీ మరింత పెద్ద సంక్షోభం వస్తుంది. అప్పుడు ఈ మందు కూడ పనిచేయదు. పెట్టుబడిదారీ స్వభావమే సంక్షోభానికి కారణమైనప్పుడు, ఆ స్వభావాన్ని యథాతథంగా ఉంచి, పైపై పూతలు, మెరుగులు, సంస్కరణలు, చిట్కామంత్రాలు ఎన్నిటితోనైనా ఆ సమస్యను పరిష్కరించడం సాధ్యం కాదు.

అయితే ప్రస్తుత సంక్షోభం ఎంత తీవ్రమయినదయినప్పటికీ పెట్టుబడిదారీ విధానానికి అదే చరమగీతం కూడ పాడజాలదు. సామ్రాజ్యవాదం వల్ల, ఇప్పటికీ పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి అనేక దేశాలలో ముడిసరుకులు, చౌక శ్రమ, విశాలమైన మార్కెట్లు దొరికే అవకాశం



ఉన్నందువల్ల ఇటువంటి సంక్షోభాల నుంచి అది గట్టెక్కగలుగుతుంది. నిజానికి ఇటువంటి సంక్షోభాలవల్ల పరిశ్రమల నుంచి బయటికి తోయబడే సువిశాల నిరుద్యోగ సైన్యం సంఘటితమైన నిర్మాణరూపం ధరించి, పెట్టుబడిదారీ ఉత్పత్తి విధాన అమానుషత్వాన్ని గుర్తించి, దానిమీద తమ పోరాటాన్ని ఎక్కుపెట్టగలిగినప్పుడే ఈ సంక్షోభం పరిష్కారమవుతుంది. అలా పెట్టుబడిదారీ విధానం కూలిపోయి, శ్రామిక సైన్యం రూపొందించుకునే కొత్త సామాజిక రాజకీయార్థిక ధర్మం నెలకొంటుందని మార్క్సిస్టు మహోపాధ్యాయులు ఊహించారు. ఇటువంటి సంక్షోభాలను వినియోగించుకోగలిగిన, వినియోగించుకోవలసిన ప్రజాతంత్ర, వామపక్ష శక్తులు ఇప్పటికైతే బలహీనంగా ఉన్నాయి. బయటికి తోయబడుతున్న లక్షలాది, కోట్లాది నిరుద్యోగ సైన్యానికి రాజకీయార్థిక, సామాజిక చైతన్యం కలిగించి వారిని సుశిక్షితులైన, సంఘటిత, క్రమశిక్షణాయుత, నిర్మాణపర సైనికులుగా తీర్చిదిద్దవలసిన శక్తులు ఆ పని చేయడంలో వెనుకబడే ఉన్నాయి.

***కమ్యూనిజం, నవంబర్ 2008***

# 66

## లాల్‌ఘడ్ పరిణామాల వెనుక...

పశ్చిమ బెంగాల్‌లోని పశ్చిమ మేదినీపూర్ జిల్లాలో ఒక పంచాయతీ సమితి కేంద్రం లాల్‌ఘడ్‌లో కొద్దిరోజులుగా జరుగుతున్న పరిణామాలు ప్రపంచం దృష్టిని ఆకర్షిస్తున్నాయి. మామూలుగానే మన ప్రచార సాధనాలకు సుదీర్ఘకాలంలో, మెల్లమెల్లగా సాగే ప్రజాజీవనక్రమాలను గుర్తించే అలవాటు ఉండదు. నాటకీయమైన, తక్షణ, సంచలనాత్మక సంఘటనలను మాత్రమే గుర్తించే అలవాటు ఉంటుంది. అందువల్లనే మన ప్రచారసాధనాలకు గత వారంరోజులుగా లాల్‌ఘడ్‌లో జరుగుతున్న సంఘటనలు కనబడుతున్నాయి, అది ప్రధాన వార్త అవుతోంది. ఆ సంఘటనలను పునాదిగా పెట్టుకుని అక్కడ హింస జరుగుతున్నదనో, మావోయిస్టులు ఆదివాసులను రెచ్చగొడుతున్నారనో, మానవ కవచాలుగా వాడుకుంటున్నారనో, మావోయిస్టులకు తృణమూల్ కాంగ్రెస్ సహకరిస్తున్నదనో, ఇదంతా 2011 ఎన్నికలలో అధికార మార్క్సిస్టు పార్టీని గద్దె దించే లక్ష్యంతో జరుగుతున్నదనో వార్తలూ, వ్యాఖ్యలూ వెలువడుతున్నాయి. అక్కడ పాలకపక్షంగా మార్క్సిస్టు పార్టీ చెప్పదలచుకున్న అబద్ధాలన్నిటికీ ప్రాచుర్యం దొరుకుతోంది. లాల్‌ఘడ్ ప్రాంతాన్ని మావోయిస్టులు ఆక్రమించుకున్నారనీ, విముక్త ప్రాంతంగా ప్రకటించుకున్నారనీ బూచి



ప్రచారమవుతోంది. మావోయిస్టుల నుంచి ఆ ప్రాంతాన్ని విముక్తి చేయడానికి కేంద్ర, రాష్ట్ర సాయుధ బలగాలు కఠిన చర్యలు తీసుకోకతప్పదనే సూచనలూ సలహాలూ వినబడుతున్నాయి.

ఇంకా ఎక్కువగా పోలీసు, పారా మిలిటరీ బలగాలను వాడాలనీ, ఈ 'అరాచకాన్ని' ఉక్కుపాదంతో అణచివేయాలనీ వాదిస్తున్న వారు చూపుతున్న చికిత్స అసలు వ్యాధిని మరింత తీవ్రతరం చేస్తుంది గాని పరిష్కరించదు. ఎందువల్లనంటే అసలు అక్కడ సమస్యే ఆదివాసి ప్రజానీకం మీద పోలీసు అత్యాచారాలవల్ల మొదలయింది.

ఆ ప్రాంతంలో మావోయిస్టుల ఉనికి కనీసం గత ఎనిమిది సంవత్సరాలుగా ఉంది. ఐనా ఇన్ని సంవత్సరాలుగా ఇటువంటి సంచలనాత్మక వార్తలేమీ రాలేదంటేనే ప్రస్తుత సమస్యకు పూర్తి కారణం మావోయిస్టులు కాదని అర్థమవుతుంది. ప్రస్తుత ప్రజాందోళన ప్రధానంగా పులీసీ సంత్రాస్ బిరోధి జన సాధారణేర్ కమిటీ (పోలీసు అత్యాచారాల వ్యతిరేక ప్రజా సంఘం) నాయకత్వంలో నడుస్తున్నది. ఆ పేరును బట్టి చూసినా అక్కడి ఆందోళనకు మూలం పోలీసు అత్యాచారాలు మాత్రమేననే విషయం స్పష్టమవుతుంది. ఈ దేశంలో స్థానికులమీద అధికారం చలాయించడానికి ఒక ప్రజావ్యతిరేక సాధనంగా బ్రిటిష్ పాలకులు తయారు చేసుకున్న పోలీసు వ్యవస్థ 1947 తర్వాత కూడ యథాతథంగా కొనసాగుతోంది. తన పాత ప్రజావ్యతిరేక స్వభావాన్నే కొనసాగిస్తోంది. రాష్ట్రాలలోనూ కేంద్రంలోనూ ఏ రాజకీయ పార్టీలు అధికారానికి వచ్చినప్పటికీ ప్రజలమీద అత్యాచారాలు చేయడమే తమ పని అని పోలీసు వ్యవస్థ అనుకుంటున్నది. పోలీసు వ్యవస్థకు ఉన్న ఆ నమ్మకాన్ని, మితిమీరిన అధికారాన్ని అన్ని పార్టీల ప్రభుత్వాలు పెంచిపోషిస్తున్నాయి. కనుక ప్రభుత్వం తెల్లనిదయినా, నల్లనిదయినా, ఎర్రనిదయినా, నీలందయినా ప్రజలమీద పోలీసు అత్యాచారాలు ఒకేరకంగా జరుగుతున్నాయి.

లాల్‌ఘడ్ ప్రజల మీద పోలీసు అత్యాచారాలు ప్రత్యేకంగా జరగడానికి ఒక ప్రత్యేక సందర్భం కూడ ఉంది. దాదాపు 2005-06 నుంచీ కూడ ఆ ప్రాంత ఆదివాసులు మావోయిస్టులకు మద్దతు ఇస్తున్నారని కోపంగా ఉన్న సిపిఎం కార్యకర్తలు, పోలీసులు లాల్‌ఘడ్ ఆదివాసుల మీద దాడులు చేస్తున్నారు. నిజానికి బెంగాల్‌లో సిపిఎం కార్యకర్తలు, పోలీసులు అనే రెండు మాటలకు పెద్ద తేడా లేదు. అనేక చోట్ల పోలీసుల వెంట సిపిఎం కార్యకర్తలు, లేదా సిపిఎం కార్యకర్తల వెంట పోలీసులు కలిసి వచ్చి ప్రజల మీద దాడి చేస్తారు. సిపిఎం హర్మద్ వాహిని అని ప్రత్యేకంగా ఒక హింసాముఠాను నడుపుతోంది.

ఆ దాడులు ఒక పక్కన సాగుతుండగానే ఇదే పశ్చిమ మేదినీపూర్ జిల్లాలో సాల్బొని అనే చోట ఐదువేల ఎకరాల జిందాల్ స్టీల్ వర్క్స్ స్పెషల్ ఎకనామిక్ జోన్‌కు శంకుస్థాపన చేయడానికి 2008 నవంబర్ 2 న ముఖ్యమంత్రి బుద్ధదేవ్ భట్టాచార్య వెళ్లారు. ఆ అధికార బృందం తిరుగు ప్రయాణంలో మందుపాతర పేలింది. ఆ మందుపాతర పేల్చింది తామేనని మావోయిస్టులు బహిరంగంగా ప్రకటించినప్పటికీ, ఆ పేలుడు సాకుగా తీసుకుని ఆదివాసులకు బుద్ధి చెప్పాలని పోలీసులు, సిపిఎం – హర్మద్ వాహిని కార్యకర్తలు భావించారు. నవంబర్

5న చోటో పెలియా, బడో పెలియా, బాఘ్మేర్, కాటా పహాడీ గ్రామాల మీద పోలీసుదాడులు మొదలయ్యాయి. ముఖ్యంగా చోటో పెలియా గ్రామంలో స్త్రీలమీద పెద్ద ఎత్తున అత్యాచారాలు జరిగాయి. ఆ దాడులలో ప్రజల మీద పోలీసులు జరిపిన అత్యాచారాల విషాద గాథలు బెంగాల్ పత్రికలలో హోరెత్తిపోయాయి. ఎంతమందిని నిర్బంధించారో, ఎంతమందిని చిత్రహింసలు పెట్టారో, ఎంతమంది స్త్రీలపై అత్యాచారాలు చేశారో లెక్కలేదు. పార్థసారథి రాయ్, కౌస్తువ్ డే, అమితాబ్ భట్టాచార్య వంటి సామాజిక శాస్త్రవేత్తలు, పత్రికారచయితలు ఆ విషాదగాథలన్నిటినీ సన్హతి డాట్ కామ్ (www.sanhati.com) అనే వెబ్ సైట్ మీద చాల వివరంగానే ప్రకటించారు.

న్యూయార్క్ లోని సుప్రసిద్ధ సోషలిస్టు పత్రిక 'మంత్లీ రివ్యూ' నడిపే వెబ్ జైన్‌లో కౌస్తువ్ డే రాసిన వ్యాసం చదివితే లాల్‌ఘడ్ లో పోలీసుల అణచివేత కింద ప్రజాజీవితం ఎంత దుర్భరస్థితికి చేరిందో అర్థమవుతుంది. 'స్థానికులతో జరిపిన ఏ కొద్దిపాటి సంభాషణల్లోనైనా అర్థమయ్యేదేమిటంటే పోలీసుల భయోత్పాతం లేకుండా ఒక్కరోజు కూడ గడవని మరో ప్రపంచం అక్కడ రాజ్యమేలుతున్నదని. అక్కడి ఆదివాసులు ప్రతిక్షణం భయంలో బతికే పరిస్థితి కల్పించడానికే వ్యవస్థలోని అన్ని స్థాయిల సంస్థలూ పనిచేస్తున్నట్టున్నాయి. అలా అయితేనే ఆ ఆదివాసులు తమ అభివృద్ధి గురించి ప్రశ్నించాలని కలలో కూడ అనుకోవడం మానివేసి, ఈ రోజువారీ పోలీసు అత్యాచారాలూ హింసలూ లేకపోతే చాలునని అనుకునే పరిస్థితి వస్తుంది."

అటువంటి భయంకరమైన, దుర్మార్గమైన అత్యాచారాల నేపథ్యంలోనే 2008 నవంబర్ రెండోవారంలో పోలీసు అత్యాచారాల వ్యతిరేక సంఘం ఏర్పడింది. పోలీసులు ప్రజలమీద చేసిన అత్యాచారాలకు క్షమాపణ చెప్పాలనే 13 డిమాండ్ల పత్రాన్ని ఆ సంఘం ప్రకటించింది. లాల్‌ఘడ్ నుంచి పోలీసులను తరిమేశారు. మళ్లీ పోలీసులు తమ గ్రామాల మీద దాడి చేయకుండా రోడ్లు తవ్వేశారు. గ్రామాలకు రక్షణ కల్పించుకున్నారు, కాపలాలు కాశారు. ఒకరకంగా స్వయంపాలన స్థాపించుకున్నారు. ఆ స్థితిలో స్థానిక అధికారులు కమిటీతో చర్చలు జరిపారు. కొన్ని వెసులుబాట్లు కల్పించారు. క్రమంగా ఆందోళన పొరుగు జిల్లాలయిన బంకురా, బీర్భూమ్ లకు పాకింది. కమిటీ కేవలం పోలీసు అత్యాచారాలకు వ్యతిరేకంగా పనిచేయడం మాత్రమే కాక స్థానిక అభివృద్ధి కార్యక్రమాలలో జరుగుతున్న అవినీతికి వ్యతిరేకంగా మాట్లాడడం మొదలుపెట్టింది. ఆ అవినీతికి పాల్పడినది స్థానిక సిపిఎం నాయకులే కావడం వల్ల మళ్లీ సిపిఎంకు అది కంటగింపయింది. కమిటీ నాయకత్వాన తమ అభివృద్ధి పనులను తామే నిర్వహించుకుంటామని ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను కూడ ఆదివాసులు ప్రకటించుకున్నారు. ఒకవైపు ప్రజా ఉద్యమంలో విస్తృత ప్రజా భాగస్వామ్యంతో, ప్రజాస్వామిక, ప్రత్యామ్నాయ అభివృద్ధి వ్యూహం అమలవుతుండగానే అటువైపునుంచీ ఇటువైపునుంచీ కూడ హింస, దాడులు, ప్రతిదాడులు, హత్యలు, ప్రతీకార హత్యలు పెరిగిపోయాయి.

మొన్నటికి మొన్న లాల్‌ఘడ్‌లో పోలీసుస్టేషన్‌ను, స్థానిక సిపిఎం నాయకుని భవనాన్ని,



సిపిఎం స్థానిక కార్యాలయాన్ని విధ్వంసం చేసిన ఘటనలలో వందలాదిమంది ఆదివాసులు ఉద్రేకంగా పాల్గొన్నారంటే ఆ భవనాలు, వ్యవస్థలు ఎంతగా దోపిడీ పీడనలకు ప్రతీకలుగా నిలిచాయో, వాటిని బద్దలు కొట్టడానికి ప్రజలు ఎంత విస్తృతంగా ముందుకొచ్చారో అర్థమవుతుంది.

ఆ ఘటనలు జరగడానికి వారంరోజుల ముందు ఢిల్లీ జవహర్లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయానికి చెందిన తొమ్మిది మంది విద్యార్థుల బృందం లాల్‌ఘడ్ ప్రాంతంలో రెండు డజన్ల గ్రామాలలో పర్యటించి ఒక నిజనిర్ధారణ నివేదికను విడుదల చేసింది. "మేం లాల్‌ఘడ్ వదిలే సమయానికి అక్కడి ప్రజాపోరాటం తీవ్రతరమవుతోంది. ప్రజలు తమ ప్రధాన శత్రువుగా భావిస్తున్న సిపిఎంను, పోలీసులను ఆ ప్రాంతం నుంచి తరిమేశారు. మేము అక్కడి ప్రజలలో పెద్దఎత్తున ఉత్సాహోద్రేకాలు చూశాం. తాము వోట్లు అడగడానికి వచ్చే ఏదో రాజకీయపార్టీ పావులం కాదనీ, తాము తమదయిన ఒక సంస్థ సభ్యులమనీ ప్రజలు భావించడం మేం చూశాం. వాళ్లు రాజ్యహింస భయం లేని ఒక స్వేచ్ఛాయుత జీవనాన్ని గడుపుతున్నారు. తమ సొంత అభివృద్ధి పథకాలను అమలు చేసుకుంటున్నారు. "మా జీవితంలో మొదటిసారి స్వాతంత్ర్యాన్ని చవిచూస్తున్నాం" అని ఎన్నో గ్రామాల్లో ప్రజలు మాతో అన్నారు. వాళ్ల పోరాటం తరతరాలుగా సాగుతున్న దోపిడీకీ, మోసానికీ, హింసకూ, భయోత్పాతానికీ వ్యతిరేకంగా ఎక్కుపెట్టినది. ఆ రకంగా అది ఒక చారిత్రక పోరాటం. ఎంతో మంది బైటి పరిశీలకులు 'అరాచకం'గా పిలుస్తున్న ఈ పోరాటం ఒక నిజమైన స్వాతంత్ర్య పోరాటమని మేం దృఢంగా విశ్వసిస్తున్నాం."

జిందాల్‌లకు ఐదువేల ఎకరాలను కట్టిపెట్టడానికి తహతహలాడుతూ, చుట్టుపట్ల ప్రజలను భయోత్పాతంలో ముంచడానికి ప్రయత్నిస్తున్న బుద్ధదేవ్ ప్రభుత్వం ఒకవైపునా, తమ అభివృద్ధికి తామే బాధ్యులు కావాలని ప్రయత్నిస్తున్న ఆదివాసులు మరొకవైపునా ఉన్న లాల్‌ఘడ్ చిత్రం ఇది. హింస – అహింసల కళ్లద్దాల లోంచి చూస్తే అది అర్థం కావడం కష్టం.

***సూర్య, జూన్ 20, 2009***

# 67

# ఇప్పుడు వెయ్యి భోపాల్‌లు, లక్ష కార్బైడ్‌లు

భోపాల్ విషాదం జరిగి ఈ డిసెంబర్ 3కు ఇరవై ఐదు సంవత్సరాలు. పెట్టుబడిదారీ లాభాపేక్షతో కూడిన పారిశ్రామికీకరణ, దేశదేశాల పాలకులను దళారీలుగా మార్చుకునే బహుళజాతిసంస్థల సామ్రాజ్యవాద ఆధిపత్యం ప్రజాజీవితం మీద ఎంత దారుణమైన ప్రభావం వేస్తాయో చూపడానికి భోపాల్ దురంతం ఒక ముఖ్యమైన చిహ్నం. భోపాల్‌లో బహుళజాతిసంస్థల దుర్మార్గం అతి నగ్నంగా బయటపడినప్పటికీ భారత పాలకులు దానినుంచి ఎటువంటి పాఠాలు నేర్చుకోలేదు సరిగదా, మరింతగా బహుళజాతి సంస్థలకు దాసోహమయ్యే స్థితికి దిగజారారు. భోపాల్ దురంతం జరిగిననాటికి కాగితం మీదనైనా ఉన్న ప్రజాసంక్షేమ, భారత ప్రజల సార్వభౌమాధికార రక్షణ చట్టాలను కూడ ఆ తర్వాత సవరించారు, రద్దుచేశారు. ఇవాళ దేశంలో బహుళజాతి సంస్థల దురాగతాలను అడ్డుకునే పాలక విధానం ఏదీ లేని స్థితిలో వెయ్యి భోపాల్‌లు, లక్ష కార్బైడ్‌లు రాజ్యం చేస్తున్నాయి. సామ్రాజ్యవాద లాభాపేక్షా రక్తదాహానికి బలి అయిపోయిన వేలాదిమంది భోపాల్ వాసుల స్మృతిలో, అలా విస్తరిస్తున్న వెయ్యి భోపాల్‌ల గురించి, లక్ష కార్బైడ్‌ల గురించి, వాటికి అవకాశమిస్తున్న పాలక విధానాల గురించి మాట్లాడుకోవలసి ఉంది.



మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్‌లో యూనియన్ కార్బైడ్ ఇండియా లిమిటెడ్ (ఈ కంపెనీ యూనియన్ కార్బైడ్ అనే అమెరికా బహుళజాతి సంస్థకు, భారత దళారీ పెట్టుబడికి, భారత ప్రభుత్వ ద్రవ్యసంస్థల పెట్టుబడికి పుట్టిన పుత్రిక) కు చెందిన క్రిమిసంహారకాల కర్మాగారంలో 1984 డిసెంబర్ 2-3 అర్ధరాత్రి మిథైల్ ఐసో సయనేట్ అనే విషవాయువు బయటపడి ఎనిమిదివేలమందిని (ప్రభుత్వ లెక్కలప్రకారం 3,787 మందిని) బలితీసుకుంది. ఐదులక్షల మంది ఆ విషవాయు ప్రభావానికి లోనయ్యారు. వారిలో ఆ ప్రభావం వల్లనే ఏటా కనీసం వెయ్యి మంది చొప్పున ఇప్పటికి ఇరవై ఐదువేల మంది చనిపోయారు.

ఇంత మంది మరణాలకు, అనారోగ్యానికి కారణమైన యూనియన్ కార్బైడ్ యాజమాన్యంపై, యూనియన్ కార్బైడ్ వంటి కంపెనీలు ఇలా ఇష్టారాజ్యంగా వ్యవహరించడానికి వీలు కల్పించిన స్థానిక ప్రభుత్వాధి కారులపై, రాజకీయ నాయకులపై ఎటువంటి విచారణ జరగలేదు, ఎవరికీ శిక్ష పడలేదు. అసలు తాము టాంకులలో నిలువ చేసిన పదార్థం ఏమిటో, ఆ రాత్రి బయటపడిన విష వాయువు ఏమిటో కూడ చెప్పడానికి యూనియన్ కార్బైడ్ నిరాకరించింది. అంటే ఈ దేశంలో, ఈ దేశప్రజల ప్రాణాలు తీసే పదార్థాలు నిలువచేస్తూ ప్రమాదం జరిగిన తర్వాతనైనా అవి ఏమిటో చెప్పనంత బాధ్యతా రాహిత్యాన్ని, హంతక నిర్లక్ష్యాన్ని యూనియన్ కార్బైడ్ ప్రదర్శించింది. అయినా యూనియన్ కార్బైడ్ యజమానులను అరెస్టు చేయలేదు సరిగదా వారి దగ్గర భారత ప్రభుత్వం సాగిలపడింది. యూనియన్ కార్బైడ్ అధ్యక్షుడు వారెన్ ఆండర్సన్ భారతదేశం వస్తే అరెస్టు చేసి విచారించవలసిన ప్రభుత్వం ఎర్రతివాచీ స్వాగతాలు పలికింది. ఆయన కోరుకున్నట్టుగా కాగితాల మీద అరెస్టు చూపించి ప్రత్యేక విమానంలో సకల సౌకర్యాలతో సాగనంపింది. యూనియన్ కార్బైడ్ వారు ఇవ్వజూపిన బిచ్చం లాంటి నష్ట పరిహారాన్ని అంగీకరించింది. విడిగా బాధితులో, వారి తరఫున స్వచ్ఛంద సంస్థలో యూనియన్ కార్బైడ్ పై కేసులు వేయడాన్ని నిషేధిస్తూ, తాను మాత్రమే కేసులు పెడతానని చట్టం తీసుకువచ్చింది. భోపాల్ కర్మాగారంలో అమెరికన్ సంస్థకు 51 శాతం ఉండగా, మిగిలిన 49 శాతం భారత ప్రభుత్వ ద్రవ్య సంస్థల చేతుల్లో, మహీంద్రాల చేతుల్లో ఉండి కేశబ్ మహీంద్రా భారత కంపెనీకి చైర్మన్ గా ఉండేవాడు. అలా దళారీగా పనిచేసిన భారత యజమానులపై కూడ కనీస చర్యలు తీసుకోలేదు. ఆ భారత దళారీ పారిశ్రామికవేత్తలు – మహీంద్రాలు – ఆ తర్వాత మరింత బడా పారిశ్రామికవేత్తలుగా ఎదిగారు.

భోపాల్ దురంతం విషయంలో నిర్లక్ష్యం వహించడం మాత్రమే కాదు, ఆ తర్వాతి ఇరవై ఐదు సంవత్సరాలలో భారత పాలకులు అనుసరించిన బహుళజాతి సంస్థల అనుకూల విధానాలు దిగ్భ్రాంతి కలిగిస్తాయి. భోపాల్ కర్మాగారం లాంటి అనేక ప్రమాదకర కర్మాగారాలు స్థాపించడానికి, బహుళజాతిసంస్థలు ఈ నేలమీది ప్రజాజీవనాన్ని అస్తవ్యస్తం చేయడానికి, తమ ఇష్టారాజ్యంగా భారత సహజ సంపదలను కొల్లగొట్టుకుపోవడానికి, భారత మార్కెట్లను నిరాటంకంగా దోచుకోవడానికి పాలకులు వీలు కలిపించారు. భోపాల్ దుర్ఘటన తర్వాత

కూడ ఆ ప్రభావం ఏమీ లేకుండా భారతీయుల ప్రాణాలను, భారతీయుల సహజ సంపదలను ఇంత చౌకగా, దుర్మార్గంగా పణం పెట్టే రాజకీయార్థిక విధానాలు ఎలా అమలులోకి వచ్చాయి? మన ప్రజలను, మన శ్రమను, మన సంపదలను ఇలా ప్రయోగశాలలో బలిపశువులుగా, అంగడి సరుకులుగా, మార్చిన పాలక విధానాలు ఎలా సాగుతున్నాయి?

భోపాల్ మారణకాండ జరిగిన నాటి రాజకీయార్థిక స్థితిని అర్థం చేసుకుంటే గాని ఆ తర్వాతి పరిణామాలను అర్థం చేసుకోలేం. ఎమర్జెన్సీ అనంతరం మూడు సంవత్సరాల జనతాపార్టీ ఐక్య సంఘటన ప్రభుత్వాల ప్రయోగం విఫలమై, 1980 జనవరిలో ఇందిరాగాంధీ తిరిగి అధికారం లోకి వచ్చిన తర్వాత భారత ప్రభుత్వం సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలమీద ఆధారపడే పరిస్థితి అంతకు ముందు కన్న పెరిగింది. 1981లో భారతప్రభుత్వం అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఇంటర్నేషనల్ మానెటరీ ఫండ్ – ఐఎంఎఫ్) నుంచి తీసుకున్న అప్పు, ఆ అప్పుతో ప్రారంభమైన వ్యవస్థాత్మక సంస్కరణల కార్యక్రమం (స్ట్రక్చరల్ అడ్జస్ట్‌మెంట్ ప్రోగ్రాం) ఈ క్రమంలో ఒక ముఖ్యమైన మైలురాయి. నిజానికి 1947 నుంచీ కూడ ఎన్నడూ భారత ప్రభుత్వం సామ్రాజ్యవాదాన్ని ధిక్కరించి, నిజమైన ప్రజా ప్రభుత్వాన్ని నడిపింది లేదుగాని, కనీసం మిశ్రమ ఆర్థిక విధానం; ప్రభుత్వ రంగ ప్రాధాన్యం; ప్రణాళికాబద్ధ అభివృద్ధి వ్యూహం; దిగుమతులకు ప్రత్యామ్నాయాల అన్వేషణ; చిన్నతరహా పరిశ్రమలు; ఉపాధికల్పన, దేశీయాభివృద్ధి లక్ష్యాలుగా పారిశ్రామికీకరణ వంటి నినాదాలనయినా ఇవ్వడం పాలకులకు అలవాటుగా ఉండేది. ఇక 1969 నుంచి 1975 దాకా ఇందిరాగాంధీ చూపించిన ప్రగతిశీల ముఖంలో ఫారిన్ ఎక్స్‌చేంజ్ రెగ్యులేషన్ ఆక్ట్ (ఫెరా) తో విదేశీ పెట్టుబడులపై ఆంక్షలు, మోనోపలీ అండ్ రిస్ట్రిక్టివ్ ట్రేడ్ ప్రాక్టీసెస్ ఆక్ట్ (ఎంఆర్‌టిపి) తో గుత్తపెట్టుబడి కేంద్రీకరణపై ఆంక్షలు, ఇండియన్ పేటెంట్స్ ఆక్ట్‌తో దేశీయ సాంకేతిక పరిజ్ఞాన అభివృద్ధి దిశగా ప్రయత్నాలు వంటి చర్యలు విదేశీ పెట్టుబడి ప్రవేశం మీద కొన్ని అవరోధాలనయినా పెట్టాయి. అయితే ఆ అవరోధాలు చాలవరకు కాగితం మీద మాత్రమే మిగిలిపోయాయి.

ఆ అవరోధాలు ఉండగానే దేశంలోకి విదేశీ పెట్టుబడిదారీ, బహుళజాతి సంస్థల ప్రవేశం సాగిపోతూనే ఉండింది. కాగితాలమీద ఉన్న ఆంక్షలను కూడ తొలగించాలని ఆ సంస్థలు, వారి భారతీయ దళారీలు కోరుతుండేవారు. 1981 ఐఎంఎఫ్ అప్పు షరతులతో వారి కోరికలు తీరడం మొదలయింది. ఆ షరతులను అమలు జరపబోతుండగానే ఇందిరాగాంధీ హత్య జరిగి రాజీవ్‌గాంధీ అధికారంలోకి వచ్చాడు. మొదట ఆపద్ధర్మ ప్రధానమంత్రిగా, రెండునెలల తర్వాత ఎన్నికయిన ప్రధానమంత్రిగా రాజీవ్‌గాంధీ వెంటనే చేసిన పని దేశాన్ని ఇరవయ్యొకటో శతాబ్దంలోకి తీసుకుపోతానని అనడం. ఆ మాటకు అర్థం దిగుమతుల సరళీకరణ విధానం, పన్నుల విధానంలో మార్పులు, నూతన విద్యావిధానం పేరుతో బహుళజాతిసంస్థలకు ఉపయోగపడే ఉన్నతవర్గ విద్యావిధానం, కంప్యూటరీకరణ, టెలికమ్యూనికేషన్స్ రంగంలో మార్పులు. ఈ మార్పులన్నీ కూడ ఇవాళ మనం చూస్తున్న బహుళజాతి సంస్థల విస్తరణకు మార్గం సుగమం చేసినవే.



రాజీవ్‌గాంధీ దుర్మార్గం ఎక్కడ ఉందంటే, ఆయన బహుళజాతి సంస్థలకు అనుకూలంగా చేసిన ఈ పనులన్నీ సరిగ్గా భోపాల్ అనుభవం తర్వాతనే చేశాడు. ఆయన 1984 అక్టోబర్ 31 న ఆపద్ధర్మ ప్రధానమంత్రిగా అధికారంలోకి వస్తే, సరిగ్గా నెల రోజులకే భోపాల్ దురంతం జరిగింది. ఆ నెలలోనే జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ 542 స్థానాలకు గాను 414 స్థానాలను గెలుచుకుంది. అంత పెద్ద ఎత్తున మెజారిటీ వచ్చిన అహంకారంతో కాంగ్రెస్ ప్రభుత్వం అనేక ప్రజావ్యతిరేక చర్యలు ప్రారంభించింది. అంత నిర్లక్ష్యంగా ప్రవర్తించి, అంతమంది ప్రాణాలను బలిగొని, ప్రపంచంలోనే అత్యంత పెద్ద పారిశ్రామిక ప్రమాదంగా గుర్తింపు పొందిన భోపాల్ దురంతం విషయంలో భారత ప్రభుత్వం తీసుకున్న చర్యలు శూన్యం. భోపాల్ దుర్మార్గానికి బాధ్యులైన వారిమీద చర్యలు చేపట్టకపోవడం మాత్రమే కాక, వెంటవెంటనే వారికి అనుకూలమైన విధానాలను రూపొందించడం, అమలులోకి తేవడం మొదలయింది.

రాజీవ్‌గాంధీ ప్రభుత్వం అనుసరించిన విధానాలకు గణాంకాల ద్వారా ఒక ఉదాహరణ చెప్పాలంటే, దేశీయ పారిశ్రామిక వ్యాపార సంస్థలకు విదేశీ పారిశ్రామిక వ్యాపార సంస్థలతో కుదిరిన ఒప్పందాల సంఖ్య చూడాలి. ఈ ఒప్పందాల సంఖ్య 1948–58 మధ్యకాలంలో ఏడాదికి ఐదుగా ఉంటే, 1959–66 మధ్య 108కి పెరిగి, 1967–79 మధ్య 39కి తగ్గింది. ఆ సంఖ్య 1980–88 మధ్య కాలంలో 170కి పెరగడానికి బాధ్యత ఐఎంఎఫ్ షరతులది, రాజీవ్ గాంధీది మాత్రమే. రాజీవ్‌గాంధీ ప్రభుత్వం కల్పించిన ఆ పునాది మీద ఆ ఒప్పందాల సంఖ్య 1989–90 నాటికి 174కు పెరిగి, ఆ తర్వాత మారిన రాజకీయార్థిక విధానాల వల్ల 1991–2000 మధ్య కాలంలో సాలీనా 1842 ఒప్పందాలకు చేరింది. (బి.పి. సిన్హా, మల్టినేషనల్స్ ఇన్ ఇండియా, సేజ్ పబ్లికేషన్స్, 2004).

రాజీవ్‌గాంధీ అనుసరించిన దిగుమతుల సరళీకరణ, సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థల అనుకూల విధానాల వల్ల నాలుగైదేళ్లకే భారత ప్రభుత్వ ఖజానా ఖాళీ అయ్యే పరిస్థితి వచ్చింది. 1989లో ఎన్నికల తర్వాత ఏర్పడిన వి.పి. సింగ్ ప్రభుత్వం, చంద్రశేఖర్ ప్రభుత్వం ఆ ఆర్థిక సంక్షోభ భారాన్ని భరించవలసి వచ్చింది. ఆ ప్రభుత్వాలు ఎదుర్కొన్న చిక్కులవల్ల మళ్లీ త్వరలోనే ఎన్నికలు వచ్చి, ఆ ఎన్నికల ప్రచార సందర్భంగానే రాజీవ్‌గాంధీ హత్య జరిగింది. ఆ ఎన్నికల ప్రచార క్రమంలోనే ఆర్థిక సంక్షోభం గురించి, దాన్ని పరిష్కరించే అవకాశాల గురించి చర్చలు జరిగాయి. కాంగ్రెస్ అధికారంలోకి వస్తే ప్రపంచబ్యాంకు మాజీ ఉద్యోగి మన్మోహన్‌సింగ్ ఆర్థికమంత్రి అవుతాడని, అంటే నేరుగా ప్రపంచబ్యాంకు విధానాలు అమలు అవుతాయని కూడ చర్చ మొదలయింది. లోక్‌సభలో మెజారిటీ రాకపోయినా పివి నరసింహారావు ప్రధానిగా, మన్మోహన్ సింగ్ ఆర్థిక మంత్రిగా ప్రభుత్వం ఏర్పడింది. ఏర్పడిన కొద్ది రోజుల్లోనే నూతన ఆర్థిక, పారిశ్రామిక, వాణిజ్య విధానాలను ప్రకటించింది. రూపాయి మారకపు విలువను తగ్గించమని అమెరికా ఇచ్చిన ఆదేశాన్ని వెంటనే అమలు చేసింది.

లోక్‌సభలో మైనారిటీలో ఉంటూనే 1991 జూన్ నుంచి 1996 వరకు పూర్తికాలం

అధికారంలో కొనసాగిన పివి నరసింహారావు – మన్మోహన్ సింగ్ ప్రభుత్వం దేశ రాజకీయార్థిక విధానాలలో ఎన్నో మార్పులు తీసుకువచ్చింది. అంతవరకూ లోపాయకారీగా జరుగుతున్న విధానాలను బహిరంగంగా అమలు చేయడం మొదలుపెట్టింది. అప్పటివరకూ అటు సోవియట్ యూనియన్‌కూ ఇటు అమెరికాకూ మధ్యన బేరసారాలు జరపగలిగిన శక్తితో అమలయిన కొన్ని ప్రజానుకూల చర్యలయినా, సోవియట్ యూనియన్ కూలిపోవడంతో రద్దయి పోయాయి. సంపూర్ణంగా ప్రపంచబ్యాంకు కనుసన్నలలో, బహుళజాతి సంస్థలకు సకల అధికారాలు ఇచ్చే పాలన ప్రారంభమయింది. ప్రభుత్వం నిస్సిగ్గుగా భోపాల్‌లో బలి అయిపోయిన వేలాదిమంది ప్రజల సమాధుల పై సామ్రాజ్యవాద అనుకూల విధానాలను రూపొందిస్తూ పోయింది. పారిశ్రామిక, వ్యాపార రంగాలలోకి విదేశీ పెట్టుబడుల ప్రవాహం, ద్రవ్యరంగ సంస్కరణలు, ప్రభుత్వ రంగ పరిశ్రమలను అమ్మివేయడం, మూసివేయడం, ప్రైవేటీకరించడం, వ్యవసాయ రంగంలో బహుళజాతి సంస్థల జోక్యం, డంకెల్ డ్రాఫ్ట్ – ప్రపంచవాణిజ్య సంస్థ చర్చలు వంటి అనేక దీర్ఘకాలిక ప్రభావం ఉండే పరిణామాలు మొదలయ్యాయి. బహుళజాతి సంస్థల దుర్మార్గం, స్థానిక ప్రజల ప్రాణాలపట్ల హంతక నిర్లక్ష్యం భోపాల్‌లో బయటపడినప్పటికీ, ఎటువంటి ఆంక్షలు, నియంత్రణలు, పర్యవేక్షణ లేని విధంగా బహుళజాతి సంస్థల కార్యకలాపాలు జరుపుకోవడానికి వీలయిన వ్యవస్థ తయారయింది. స్థానిక ప్రజల, అధికారుల అదుపు అనేది లైసెన్స్ రాజ్ అనే పేరుతో అపహాస్యానికి గురయింది. ఆ పరిణామాల దుష్ఫలితాలు హర్షద్ మెహతా స్టాక్ మార్కెట్ కుంభకోణం, జైన్ హవాలా కుంభకోణం, చేనేత కార్మికుల, రైతుల ఆత్మహత్యలు మొదలయిన వాటిలో బహిర్గతమయ్యాయి.

ఆ తర్వాత ఎన్నికలలో ఏ పార్టీకీ పూర్తి మెజారిటీ రాని నేపథ్యంలో పదమూడు రోజుల పాటు భారతీయ జనతాపార్టీ నాయకత్వంలోని ఐక్య సంఘటన, తర్వాత పద్దెనిమిది నెలలు దేవెగౌడ నాయకత్వంలోని యునైటెడ్ ఫ్రంట్, ఏడు నెలలు ఐకె గుజ్రాల్ నాయకత్వంలోని యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వాలు రాజ్యం చేశాయి. మళ్లీ 1998లో ఎన్నికలు జరిగి భారతీయ జనతాపార్టీ నాయకత్వంలోని మైనారిటీ ప్రభుత్వం అధికారానికి వచ్చినప్పటికీ పదమూడు నెలల్లో అవిశ్వాస తీర్మానంతో అది కూడ కూలిపోయింది. 1999 ఎన్నికలలో భాజపా నాయకత్వంలోని నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్ (ఎన్‌డిఎ) కూటమి అధికారంలోకి వచ్చి ఐదు సంవత్సరాలు పూర్తిగా పాలించింది. 2004 ఎన్నికలలోనూ, 2009 ఎన్నికలలోనూ కాంగ్రెస్ నాయకత్వంలోని యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్ (యుపిఎ) అధికారంలోకి వచ్చింది.

ఈ అన్ని కూటములలోనూ లోపలి నుంచి మద్దతు రూపంలోనో, బైటినుంచి మద్దతు రూపంలోనో దేశంలోని అన్ని రాజకీయపక్షాలూ, వామపక్షాలతో సహా, భాగస్వాములుగా ఉన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే నూతన ఆర్థిక విధానాలు ప్రవేశపెట్టిన 1991 నుంచి ఇవాళ్టివరకూ గడిచిన పద్దెనిమిది సంవత్సరాలలో కేంద్రంలో అధికారం చేపట్టని రాజకీయ పార్టీ ఒక్కటి కూడ లేదు. కాని అదే సమయంలో ఏఒక్క పార్టీ కూడ భోపాల్ బాధితులకు న్యాయం చేయలేదు. న్యాయం జరగాలని చట్టసభలలోనో, బయటనో నినదించలేదు. భోపాల్ దుర్ఘటన నుంచి గుణపాఠాలు తీసుకుని ఐనా బహుళజాతి సంస్థల మీద తగిన ఆంక్షలు విధించాలని అనలేదు, అనుకోలేదు. బహుళజాతి సంస్థల లాభాలకన్న, ఆ లాభాలలో ఇక్కడి దళారీలకు, రాజకీయ నాయకులకు వాటాగా అందే ఎంగిలి మెతుకులకన్న, ఈ దేశ ప్రజల ప్రయోజనాలు ముఖ్యమైనవని అనుకోలేదు.



ఏ పార్టీ నాయకత్వంలో ఎన్నిపార్టీల ఐక్య సంఘటన ప్రభుత్వం అధికారంలోకి వచ్చినా బహుళజాతి సంస్థల అనుకూల విధానాలకు ఎదురే లేకుండా పోయింది. మన దేశ ప్రజలకు, మన సమాజానికి అవసరమయినా, కాకపోయినా అనేక రకాల సరుకులకు ఈ దేశం బహిరంగ మార్కెట్‌గా మారిపోయింది. బహుళజాతి సంస్థల ఉత్పత్తి కార్యక్రమానికి అవసరమైన ఖనిజ వనరులను ఇష్టారాజ్యంగా తవ్వుకుపోవడానికి వారికి అన్ని అధికారాలు అందాయి. ఆ బహుళజాతి సంస్థలకు అవసరమయిన పనులు చేసి తమ బొక్కసాలు నింపుకునే దేశీయ దళారీ సంస్థలు పుట్టుకొచ్చాయి. భారతదేశం సువిశాలమైన మార్కెట్ అనీ, దానిలో ప్రవేశించడానికి తమకు ఉన్న అడ్డంకులన్నిటినీ తొలగించాలని బహుళజాతి సంస్థలు కోరినకొద్దీ ప్రభుత్వాలు దాసోహమంటూ వచ్చాయి. ఇక్కడి ప్రజల శ్రమ అతి చౌకగా దొరుకుతున్నప్పటికీ, ఇక్కడ ఉన్న కార్మిక సంక్షేమ చట్టాలు తమకు ఆటంకంగా ఉన్నాయని, ఆ చట్టాలకు తూట్లు పొడవాలనీ బహుళజాతిసంస్థలు కోరితే, వారు కోరిన పనల్లా చేయడానికి ప్రభుత్వాలు సిద్ధపడ్డాయి. ఇక్కడ ప్రజాధనంతో, ప్రభుత్వ రంగ సంస్థలతో సంపన్నంగా పెరిగిన వనరులను, ద్రవ్యసంస్థల నిధులను తమకు అప్పగించాలని బహుళజాతి సంస్థలు కోరితే అందుకు అనుగుణంగా చట్టాలను సవరించడం జరిగింది. ఈ దేశంలో ఉన్న విస్తారమైన భూవనరులను, అటవీ వనరులను, జల వనరులను వాడుకుని లాభాలు సంపాదించడానికి తమను అనుమతించాలని బహుళజాతి సంస్థలు కోరితే దేశం మొత్తాన్నీ వెండి పళ్లెరంలో పెట్టి వారికి అందించడం జరిగింది. ఈ దేశ భూగర్భంలో వేల ఏళ్లుగా నిక్షిప్తమయి ఉన్న ఖనిజ సంపద మీద ఈ దేశవాసులకు ఏ హక్కూ ఉండగూడదని, అదంతా తమ పారిశ్రామిక వ్యవస్థకు ముడి సరుకు కావాలని బహుళజాతి సంస్థలు కోరితే మారుమాట లేకుండా రాసి ఇవ్వడం జరిగింది. తత్ఫలితంగా దేశ పాలనలో సామ్రాజ్యవాద జోక్యం, బహుళజాతి సంస్థల జోక్యం, దేశదేశాల సంపన్నుల మాఫియా జోక్యం విపరీతంగా పెరిగిపోయింది. ఈ బ్రహ్మాండమైన, బహిరంగమైన దేశద్రోహ, ప్రజాద్రోహ కార్యక్రమంలో అన్ని పార్లమెంటరీ రాజకీయ పక్షాలకూ వాటా ఉంది.

ఇలా భోపాల్ దుర్ఘటన తర్వాత గడిచిన ఇరవై ఐదు సంవత్సరాలలో ఈదేశ పాలకవర్గాలు, ఏ నినాదాలు వల్లించినా, ఏ జెండాలు పట్టుకున్నా బహుళజాతి సంస్థల గులాములుగా, దళారులుగా మారిపోయారని తేటతెల్లమయింది. సరిగ్గా అంతకు ముందు శతాబ్దాలలో రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంలో భారతదేశం ఒక అమూల్యమైన రత్నం

అని భావించేవారో, ప్రస్తుతం అట్లాగే రవి అస్తమించని బహుళజాతి సామ్రాజ్యంలో భారతదేశం కీలక భాగస్వామి అయింది.

అయితే ఇదంతా నాణానికి ఒక ముఖం మాత్రమే. అంతర్జాతీయ సామ్రాజ్యవాద, బహుళజాతి విషచక్రంలో భారతదేశానికి ఇంత కీలక స్థానం ఉండడం వల్లనే ఆ విషచక్రాన్ని తుత్తునియలు చేయగల శక్తి కూడ భారత ప్రజానీకానికే ఉంది. భోపాల్ విషవాయు దుర్ఘటన తర్వాత ప్రభుత్వం అనుసరించిన బహుళజాతి అనుకూల వైఖరి వల్ల, ఏడు సంవత్సరాలు తిరగకుండానే, మొత్తంగా బహుళజాతి సంస్థలకు గులాములుగా మారిపోవడం వల్ల సామాన్య ప్రజానీకానికి కూడ సామ్రాజ్యవాదం గురించి, దేశ పాలకుల వంచన గురించి అవగాహన పెరిగింది. 1984 తర్వాత దేశంలో సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజా చైతన్యం నానాటికీ పెరుగుతోంది. అందుకే 1991 తర్వాత ప్రపంచీకరణ అని పేరుపెట్టుకున్న ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా పెరుగుతున్న ప్రజాచైతన్యానికి భోపాల్ ఒక ముఖ్యమైన పతాకం అయింది. భోపాల్ బహుళజాతి సంస్థల దుర్మార్గానికి మాత్రమే కాదు, ఆ దుర్మార్గం మీద పోరాడుతున్న ప్రజాచైతన్యానికి కూడ చిహ్నమైంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ప్రజల ప్రతిఘటన మరింతగా బలోపేతమవుతూ, సంఘటితమవుతూ ముందుకు సాగుతోంది. ఈ ప్రతిఘటన ఇంకా బలపడి, విస్తరించి, ఈ నేల మీది నుంచి దళారీ పాలకులను, దళారీ పారిశ్రామిక, వ్యాపారవేత్తలను, సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థల దుర్మార్గాన్ని రద్దుచేసిననాడే భోపాల్ మృతులకు నిజమైన నివాళి.

***వీక్షణం, డిసెంబర్ 2009***



# 68

# కొరతలేని దారిద్ర్య కొలతలు

మన దేశంలో పేదలు ఉన్నారా లేరా? ఉంటే ఎంతమంది ఉండవచ్చు? అసలు పేద అంటే నిర్వచనం ఏమిటి? పేదలు ఎంతమంది ఉన్నారో ఎట్లా లెక్కపెట్టాలి?

ప్రతిక్షణం ఎక్కడ చూసినా కనీస అవసరాలు కూడ తీరని, చాలీచాలని బతుకులీడుస్తున్న కోట్లాది మంది ప్రజలతో పేదరికం సర్వాంతర్యామిగా కనబడుతూనే ఉంటుంది గనుక మామూలు మనుషులకు ఈ ప్రశ్నలు రాకపోవచ్చు. కాని మహాఘనత వహించిన భారత ప్రభుత్వానికి మాత్రం వెయ్యిన్నొకటోసారి ఈ సందేహాలే తలెత్తాయి. దేశంలోని దరిద్రుల సంఖ్యను లెక్కించడంలో ఇప్పుడు అనుసరిస్తున్న పద్ధతులు సరయినవో కావో నిర్ధారించాలని కోరిక కలిగింది. దాదాపు నలభై ఏళ్లుగా లెక్కలు వేస్తున్నా దారిద్ర్యం పాపం పెరిగినట్టు పెరుగుతూనే ఉంది గనుక, ఎప్పటికప్పుడు లెక్కల తేడాలు వస్తున్నాయి గనుక అసలు మళ్లీ మొదటికి వద్దామని ఆలోచన కలిగింది. దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న జనాభా గురించి అందరికీ ఆమోదయోగ్యమైన, శాస్త్రీయమైన, కచ్చితమైన ప్రాతిపదికలను, అంచనాలను నిర్మించాలని కేంద్రప్రభుత్వం తలపెట్టింది.

దేశంలో పేదరికం పరిమాణం గురించి కేంద్ర ప్రభుత్వం ఒక లెక్క చెప్పడం, ప్రణాళికా సంఘం మరొక అంకె చెప్పడం, రిజర్వ్ బ్యాంక్ ఒక అంకె ఇవ్వడం, జాతీయ నమూనా సర్వే మరొక అంకె ఇవ్వడం, స్వతంత్ర అర్థ గణాంక శాస్త్రవేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు మరొక లెక్క చెప్పడం ఆనవాయితీగా వస్తోంది. పేదరిక నిర్మూలనా నిధుల కేటాయింపులు ఈ అంకెలమీదనే ఆధారపడి ఉంటాయి గనుక ఈ తగాదా అంకెలకు మాత్రమే పరిమితమయినది కాదు. అది కేటాయింపులు ఎక్కువ అవసరమా, తక్కువ సరిపోతాయా అని మరింత లోతయిన ప్రశ్నలకు దారితీస్తుంది. ఇందిరా ఆవాస్ యోజన, వృద్ధాప్య పెన్షన్, రాష్ట్రీయ స్వాస్థ్య బీమా యోజన, పనికి ఆహార పథకం, జాతీయ గ్రామీణ ఉద్యోగ కల్పనా పథకం వంటి అనేక పేదరిక నిర్మూలనా, సంక్షేమ కార్యక్రమాల అమలుకు ఈ దారిద్ర్యరేఖ అంచనాలు ఏదో ఒక స్థాయిలో ప్రాతిపదికగా ఉంటాయి. దారిద్ర్యరేఖ దిగువన ఉన్న జనాభా పెరిగిందంటే ఈ పథకాల కేటాయింపులు పెరగవలసి ఉంటుంది. ఈ నేపథ్యంలో కేంద్ర ప్రభుత్వం కొత్తగా తయారు చేస్తున్న ఆహారభద్రతా చట్టం కూడ ఈ అంకెల వివాదంలో చిక్కుకుంటుందేమోనని సందేహం తలెత్తింది.

సంక్షేమ పథకాలకు కేటాయింపులు నానాటికీ తగ్గించాలనే సిద్ధాంతానికి నిబద్ధులైన పెద్దమనుషులు ఇప్పుడు ప్రభుత్వాన్ని నడుపుతున్నారు గనుక దారిద్ర్య గణాంకాలు పెరిగినకొద్దీ వారికి చిరాకు పెరుగుతోంది. నూతన ఆర్థిక విధానాలు మొదలయిన తర్వాత దారిద్ర్యం గణనీయంగా తగ్గిందని అంకెల గారడీ చేయాలని చాల ప్రయత్నించారు గాని విఫలమయ్యారు. ఏ ప్రాతిపదికలు ఎటు నుంచి ఎటు మార్చి చూసినా పేదరికం పెరిగిందని నిర్ధారణలే వస్తున్నాయి గాని వారు కోరుకున్న ఫలితాలు రావడం లేదు. అందువల్ల అసలు దారిద్ర్యాన్ని గణించే సంవిధానాన్నే సమీక్షించాలని ఏలినవారు తలపెట్టారు.

ఇక్కడ మరొక సమస్య కూడ ఉంది. దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న జనాభా అంచనాలకు సంబంధించి కేంద్ర ప్రభుత్వపు అంకెలమీద రాష్ట్ర ప్రభుత్వాలు ఎప్పుడూ అసంతృప్తితోనే ఉంటున్నాయి. తాము అభివృద్ధి చెందామని చెప్పుకోదలచుకున్నప్పుడు తమ దగ్గర పేదరికం చాల తక్కువని వాదించడం, పేదరిక నిర్మూలనా పథకాల నిధులు కావలసి వచ్చినప్పుడు తమ దగ్గర పేదరికం కేంద్రం చెపుతున్న దానికన్న చాల ఎక్కువని వాదించడం రాష్ట్ర ప్రభుత్వాలకు అలవాటయిపోయింది. ఇందుకు గతంలో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం చేసిన వాదనే సుప్రసిద్ధమైన ఉదాహరణ: చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో ప్రజాసంక్షేమ కార్యక్రమాలు గొప్పగా అమలు చేశానని అందువల్ల రాష్ట్రంలో దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న జనాభా 22 శాతానికి తగ్గిపోయిందని ప్రభుత్వం లెక్కలు చెప్పుకుంది. కొన్నాళ్ల తర్వాత పేదరిక నిర్మూలనా పథకాలకు నిధులు కేటాయించేటప్పుడు "మీదగ్గర పేదరికం తగ్గిపోయింది గదా, ఎక్కువ నిధులు ఇవ్వనవసరం లేదు" అని కేంద్ర ప్రభుత్వం వాదించింది. "మా దగ్గర పేదరికం 22 శాతం అని మేము గతంలో చెప్పినది తప్పు లెక్క. ఇప్పుడు ప్రపంచబ్యాంకుతో లెక్క వేయించాం. మాదగ్గర పేదరికం 29.4 శాతం" అని రాష్ట్ర ప్రభుత్వం మాటమార్చింది. ఈ అనుభవం కేంద్రప్రభుత్వానికీ, ప్రణాళికా సంఘానికీ చాల రాష్ట్ర ప్రభుత్వాలతో కలిగింది. అందువల్ల కూడ రాష్ట్ర ప్రభుత్వాలకు, కేంద్ర ప్రభుత్వానికి సమానంగా అంగీకారయోగ్యమైన అంచనాలు వేసే నిర్దుష్టమైన పద్ధతి కోసం చర్చ మొదలయింది.



ఈలోగా దారిద్ర్యరేఖను తయారుచేసే ప్రాతిపదికలను అధ్యయనం చేయడానికి 2008 ఆగస్టులో నియామకమైన ఎన్ సి సక్సేనా కమిటీ కొన్ని కొత్త సూచనలు చేసింది. పేదరికాన్ని లెక్కించడానికి ప్రస్తుతం అమలులో ఉన్న పదమూడు ప్రాతిపదికలతో పాటు కుల, మత వెనుకబాటుతనం వంటి ప్రమాణాలను కూడ గుర్తించాలని సూచించింది. షెడ్యూల్డ్ కులాలకు, తెగలకు, వెనుకబడిన కులాలకు, ఇతర వెనుకబడిన వర్గాలకు, మత మైనారిటీలకు అవకాశాల నిరాకరణ ఉంది గనుక, ప్రస్తుత పేదరిక అంచనాలు అవకాశాల నిరాకరణ మీదనే ఆధారపడి ఉన్నాయి గనుక ఈ ప్రాతిపదికలను కూడ చేర్చాలని సూచించింది. ఈ సూచనలను పరిగణనలోకి తీసుకుంటున్నామని, దారిద్ర్యరేఖ రూపొందించడానికి కొత్త ప్రాతిపదికలను తయారుచేస్తున్నామని కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ మంత్రి సి పి జోషి రెండువారాల కింద ప్రకటించారు.

ప్రస్తుతం జరుగుతున్న ఈ చర్చ వివరంగా అర్థం కావాలంటే, ఇంతవరకూ అనుసరిస్తున్న ప్రమాణాల, ప్రాతిపదికల చరిత్ర చూడాలి.

మూడో పంచవర్ష ప్రణాళికా కాలంలో (1961 – 66) ప్రణాళికా సంఘం నియమించిన నిపుణుల బృందం మొదటిసారిగా దేశంలో పేదరికం పరిమాణం గురించి చర్చ ప్రారంభించింది. దేశవ్యాప్తంగా ప్రతిమనిషికీ ప్రతినెలా కనీస వినియోగానికి అవసరమైన సగటు ఆదాయం 1960–61 ధరల ప్రకారం రు. 20 ఉండాలని 1962 జూలై లో ఆ బృందం ప్రకటించింది. ఆ మాత్రం ఆదాయం లేనివారందరూ పేదలేనని ఒక స్థూల దారిద్ర్యరేఖ నిర్ణయమయింది. అయితే ఈ కసరత్తులో కనీస వినియోగమనేది స్పష్టంగా లేదనీ, దాన్ని నిర్ణయించిన ప్రాతిపదిక ఏమిటో తెలపలేదనీ, వినియోగంలో ఆహారం కాక ఇతర అవసరాలను లెక్కించారో లేదో తెలియదనీ, గ్రామీణ వినియోగానికి, పట్టణ వినియోగానికి తేడా చూపలేదనీ అనేక విమర్శలు చెలరేగాయి. అయినా ప్రణాళికా సంఘం ఆ ప్రమాణాన్నే అంగీకరించింది.

తర్వాత గడిచిన ఐదు దశాబ్దాలలో బి ఎస్ మిన్హాస్, ఎ వైద్యనాథన్, పి కె బర్ధన్, వి ఎం దండేకర్, నీలకంఠ రథ్, ఎం ఎస్ అహ్లూవాలియా, డి టి లక్డావాలా, అర్జున్ సేన్ గుప్తా, యోగేంద్ర అలగ్, సురేష్ టెండూల్కర్, ఎన్ సి సక్సేనా వంటి ఎందరో అర్థశాస్త్రవేత్తలు, సంస్థలు స్వతంత్రంగా దారిద్ర్యరేఖకు ప్రాతిపదికలు తయారుచేశారు. దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న జనాభా ఎంతో అంచనాలు కట్టారు. ప్రపంచ బ్యాంకు కూడ ప్రతిసంవత్సరం తన అంచనాలు ప్రకటిస్తోంది.

ఈ అంశం మీద విస్తృతమైన చర్చ జరిగిన తర్వాత 1978లో ప్రణాళికా సంఘం మళ్లీ ఒక నిపుణుల బృందాన్ని నియమించింది. ఒక మనిషి ఆరోగ్యంగా ఉండి, ఉత్పాదకమైన

పనిచేయాలంటే రోజుకు గ్రామీణ ప్రాంతాల్లోనయితే 2400 కాలరీల, పట్టణ ప్రాంతాల్లోనయితే 2100 కాలరీల ఆహారం తీసుకోవలసి ఉంటుందని ఈ బృందం లెక్కవేసింది. దాదాపు 650 గ్రాముల ఆహారధాన్యాలు ఇంత శక్తిని ఇవ్వగలవనీ, ఆ పరిమాణపు ఆహారధాన్యాలకు నెలకు 1973-74 ధరల ప్రకారం గ్రామీణ ప్రాంతాలలో రు. 61.80 ఖర్చు అవుతుందనీ, పట్టణ ప్రాంతాలలో రు. 71.30 అవుతుందనీ 1978లో తేల్చారు. అంతకన్న తక్కువ ఆదాయం ఉన్నవారు దారిద్ర్యరేఖ కన్న దిగువన ఉన్నట్టు లెక్క. అలా భారతదేశంలో దారిద్ర్యరేఖ నిర్ణయమయింది. ఆ తర్వాత భారత ప్రభుత్వం ప్రతి సంవత్సరం ద్రవ్యోల్బణాన్ని, ధరల పెరుగుదలను పరిగణనలోకి తీసుకుని ఈ అంకెను సవరిస్తూ వస్తోంది.

ఈ క్రమంలో తొమ్మిదో పంచవర్ష ప్రణాళికా కాలంలో (1997 - 2002) దారిద్ర్యాన్ని అంచనా కట్టడానికి ఆదాయానికి తోడుగా మరికొన్ని ప్రమాణాలను చేర్చారు. అప్పటికే మానవాభివృద్ధి భావన బలపడుతూ ఉంది. మానవాభివృద్ధి అనేది కేవలం ఆదాయపు సగటు అంకెలతో తేల్చగలిగినది కాదనీ, విద్య, వైద్యం, ఆరోగ్యం, సమాచార, వినోద అవసరాలు, సామాజిక సంపర్కం వంటివి కూడ మానవాభివృద్ధిలో ముఖ్యమైనవనీ, వాటిని ఏదో ఒక రకంగా లెక్కపెట్టాలనీ ఐక్యరాజ్య సమితి మానవాభివృద్ధి నివేదిక సూచించింది. అందువల్ల, 1997 నాటికి ఇరవైవేల రూపాయల కన్న తక్కువ వార్షిక కుటుంబాదాయం, రెండు హెక్టార్ల కన్న తక్కువ భూమి, టెలివిజన్ గాని రిఫ్రిజిరేటర్ గాని లేకపోవడం వంటి ప్రాతిపదికలను పేదరికానికి చిహ్నాంగా భావించారు.

పదో పంచవర్ష ప్రణాళికా కాలానికి (2002 - 2007) దారిద్ర్యరేఖ నిర్వచనం మారకపోయినా, దాన్ని గణించడంలో పదమూడు ప్రాతిపదికలను నిర్ణయించారు. వాటి కొరత ఏ స్థాయిలో ఉంటే ఆ స్థాయిలో గ్రామీణ పేదరికాన్ని లెక్కించడం మొదలుపెట్టారు. ఈ కొత్త గ్రామీణ దారిద్ర్య ప్రాతిపదికల్లో సొంతభూమి, ఇల్లు, దుస్తులు, ఆహారభద్రత, పారిశుధ్యం, ఇంట్లో ఉన్న మన్నికయ్యే వినియోగ వస్తువులు, అక్షరాస్యత, శ్రమశక్తి, జీవనోపాధి మార్గం, పిల్లల చదువు, అప్పుల స్థితి, వలస స్థితి వగైరా ఉన్నాయి. పట్టణ పేదరికాన్ని లెక్కించడానికి ఏడు ప్రాతిపదికలను నిర్ణయించారు. 2002లో ఈ ప్రాతిపదికలపైననే దేశవ్యాప్తంగా దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న జనగణన ప్రారంభించారు. సుప్రీంకోర్టులో వివాదం వల్ల ఈ జనగణన ఫలితాలు వెల్లడించడానికి వీలు లేకపోయింది గాని ఈ కృషిలో భాగంగా ఈ ప్రాతిపదికలతో మహారాష్ట్రలో గడ్చిరోలి జిల్లాలో భామ్రాగడ్ తాలూకాలోని మాడియాగోండు తెగ ప్రజలలో జరిపిన సర్వేలో 91.08 శాతం ప్రజలు దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారని తేలింది.

ఈలోగా కేంద్ర ప్రభుత్వం నూతన ఆర్థిక విధానాల వల్ల దేశంలో పేదరికం తగ్గిందని, 1993-94లో మొత్తం దారిద్ర్యం 36 శాతం, గ్రామీణ దారిద్ర్యం 37.2 శాతం, పట్టణ దారిద్ర్యం 32.6 శాతం ఉండేదనీ, అది 2004 - 05 నాటికి గణనీయంగా తగ్గి మొత్తం



దారిద్ర్యం 27.5 శాతానికి, గ్రామీణ దారిద్ర్యం 28.3 శాతానికి, పట్టణ దారిద్ర్యం 25.7 శాతానికి పడిపోయిందనీ ఒక ప్రకటన చేసింది. కాని అదే సమయంలో ప్రణాళికా సంఘం నియమించిన, సురేష్ టెండూల్కర్ నాయకత్వాన ఉన్న నిపుణుల బృందం 2004 - 05లో దేశంలో మొత్తం దారిద్ర్య జనాభా 37.2 శాతంగా, గ్రామీణ దారిద్ర్యం 41.8 శాతంగా, పట్టణ దారిద్ర్యం 25.7 శాతంగా ఉందని తేల్చింది. 1993 - 94లో ఈ అంకెలు వరుసగా 45.3 శాతం, 50.1 శాతం, 31.8 శాతంగా ఉండేవని కూడ నిర్ధారించింది. ఈ అంకెలను సూక్ష్మంగా పరిశీలిస్తే, పట్టణ ప్రాంతాల దారిద్ర్యం కన్న గ్రామీణ ప్రాంతాల దారిద్ర్యం చాల ఎక్కువని తేలుతుంది. అయితే టెండూల్కర్ నిర్ధారణలతో ప్రభుత్వానికి ఒక ఊరట, ఒక సమస్య ఉన్నాయి. ప్రపంచీకరణ క్రమంలో పేదరికం తగ్గిందనే ప్రభుత్వ వాదనను టెండూల్కర్ అంకెలు సమర్థిస్తాయి. కాని పేదరికం ప్రభుత్వం చెపుతున్నదాని కంటే చాల ఎక్కువగా ఉన్నదని కూడ ఆ అంకెలు తెలియజేస్తాయి.

దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న జనాభాను లెక్కగట్టడం, అసలు దారిద్ర్యరేఖను పునర్నిర్వచించడం టెండూల్కర్ కమిటీ ముందు ఉండిన కర్తవ్యాలు. దానికి అనుగుణంగానే ఆ కమిటీ ఇంతకాలం సాగుతూ వచ్చిన దారిద్ర్యరేఖ ప్రాతిపదికలను సవరించింది. గతంలో ప్రధాన ప్రాతిపదికగా ఉండిన రోజువారీ ఆహార - కాలరీ వినియోగ ప్రాతిపదికను పక్కనపెట్టింది. ధరల సూచికలను ప్రామాణికం చేసింది. అలాగే వ్యక్తిగత వినియోగం అనే నిర్వచనం కింద విద్యావ్యయం, ఆరోగ్యవ్యయం, ఇంటి అద్దె, ప్రయాణఖర్చు వంటి ఖర్చులను కూడ కలిపి దాన్ని విశాలం చేసింది. గ్రామీణ, పట్టణ ప్రజల మధ్య వినియోగ తేడాలను గుర్తించలేదు.

1962 నుంచి 2002 వరకూ సాగిన ఈ దారిద్ర్యరేఖ నిర్ధారణ చరిత్రతో అర్థమయ్యేదేమంటే భారత పాలకులకు భారతదేశంలోని ప్రధాన ప్రజా సమస్యలలో అతి ముఖ్యమైన సమస్యను అర్థం చేసుకోవడానికే ఇంకా సమయం సరిపోలేదని! ఆ నేపథ్యంలోనే ఇటీవల దారిద్ర్యరేఖను నిర్దిష్టంగా, నిర్దుష్టంగా, కచ్చితంగా, సర్వజనామోదంగా తయారు చేయాలనే ఆకాంక్షలు, వాదనలు పెరిగాయి. ఆ వాదనలకు జవాబు చెప్పే క్రమంలోనే దారిద్ర్యరేఖను నిర్ధారించే సంవిధానం గురించి చర్చ జరుగుతోంది. ఇది నిజానికి భారతదేశపు సమస్య మాత్రమే కాదు. పూర్వపు వలసలన్నిటిలోనూ రెండు మూడు శతాబ్దాలపాటు అన్ని సమస్యలకు వలసవాద ప్రభుత్వాలే కారణమనే దృష్టితో జాతీయోద్యమాలు జరిగాయి. రెండో ప్రపంచయుద్ధం తర్వాత దాదాపు అన్ని వలసలు స్వతంత్ర పాలనలోకి వచ్చాయి. అన్ని వలసల్లోనూ ప్రధాన సమస్య అయిన పేదరికాన్ని సొంత ప్రభుత్వాలు ఆరు దశాబ్దాల తర్వాత కూడ ఎంతమాత్రం పరిష్కరించలేకపోయాయి. కనుక అసలు పేదరికం అంటే ఏమిటి అనే చర్చ మళ్లీ మొదలవుతున్నది.

నిజానికి పేదరికం సమస్య అభివృద్ధి చెందిన దేశాలలో కూడ గణనీయంగానే ఉంది. అమెరికా జనాభాలో 13.2 శాతం మంది (నాలుగుకోట్లు) దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారని

ప్రభుత్వ గణాంకాలు చెపుతుండగా ఇటీవలనే నేషనల్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ విడుదలచేసిన ప్రాతిపదికల ప్రకారం ఈ సంఖ్య 15.8 శాతానికి (నాలుగుకోట్ల డెబ్బైలక్షలకు) చేరింది. అంటే ప్రతి ఆరుగురు అమెరికన్లలో ఒకరు దారిద్ర్యంలో ఉన్నారు. అమెరికాలో దారిద్ర్యరేఖను గణించే పద్ధతి ప్రకారం నలుగురు సభ్యులున్న కుటుంబానికి 24 వేల డాలర్ల కన్న తక్కువ ఆదాయం ఉంటే దారిద్ర్యరేఖ దిగువకు వస్తారు.

బ్రిటన్‌లో ఒక కోటీ ముప్పై ఐదు లక్షల మంది, అంటే జనాభాలో 23 శాతం దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారని ప్రభుత్వ గణాంకాలు తెలుపుతున్నాయి. బ్రిటన్‌లో దేశపు సగటు తలసరి ఆదాయంలో 60 శాతం కన్న తక్కువ ఉన్నవారిని దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నట్టుగా గుర్తిస్తారు. అది ఒంటరి వ్యక్తికి వారానికి 115 పౌండ్లు, ఇద్దరు సభ్యుల కుటుంబానికి వారానికి 199 పౌండ్లుగా లెక్కిస్తారు.

ఆ రెండు అభివృద్ధి చెందిన దేశాల ప్రభుత్వాలు దారిద్ర్యరేఖను గణించడంలో చాల సాంకేతికమైన, సంక్లిష్టమైన ప్రాతిపదికలను, ప్రమాణాలను పాటిస్తాయి గాని మన లెక్కలో చెప్పాలంటే మొత్తం మీద ఒక మనిషి దారిద్ర్యరేఖకు దిగువన ఉండడం అంటే వార్షికాదాయం అమెరికాలోనైతే మూడులక్షల రూపాయలు, బ్రిటన్‌లోనైతే నాలుగులక్షల రూపాయల పైచిలుకుగా వుండడమని అర్థం. ఆ లెక్కన భారత జనాభాలో అతికొద్ది మంది మినహా మొత్తానికి మొత్తం దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నట్టే చెప్పుకోవాలి.

దారిద్ర్యాన్ని లెక్కించడానికి అంతర్జాతీయంగా చర్చిస్తున్న మరొక ప్రమాణం ఉంది. అది ఆదాయం మీద, వినియోగం మీద ఆధారపడకుండా తులనాత్మక కొనుగోలు శక్తి అనే ప్రమాణాన్ని లెక్కిస్తుంది. దాని ప్రకారం రోజుకు తలసరి కొనుగోలు శక్తి ఒక డాలర్ కన్న తక్కువ ఉంటే అత్యంత పేదరికమని, రెండు డాలర్ల కన్న తక్కువ ఉంటే పేదరికమని నిర్ణయిస్తారు. ప్రపంచ బ్యాంకు కొన్ని అధ్యయనాలలో ఈ ప్రమాణాన్ని వినియోగిస్తోంది. ఈ లెక్క ప్రకారం భారత జనాభాలో 45 శాతం అత్యంత పేదరికంలోను, 80 శాతం పేదరికంలోను ఉన్నారు.

ఏనుగు ఏడుగురు గుడ్డివాళ్లు కథలో చెప్పినట్టుగా మన దేశంలో పేదలు 77 శాతం అని అర్జున్ సేన్ గుప్తా కమిటీ, 50 శాతం అని ఎన్ సి సక్సేనా కమిటీ, 41.6 శాతం అని ప్రపంచబ్యాంకు, 37.2 శాతం అని సురేష్ టెండూల్కర్, 27 శాతం అని ప్రభుత్వం అంటున్నాయి. 'లోకమందలి మంచిచెడ్డలు లోకులెరుగుదురా' అన్నాడు గురజాడ!

***ఈభూమి, ఫిబ్రవరి 2010***



# 69

# ధరల గురించి ధరాధిపతుల అబద్ధాలు

తాడిచెట్టు ఎందుకు ఎక్కావంటే దూడగడ్డి కోసం అని ఒక పెద్దమనిషి జవాబిచ్చాడని మనందరికీ తెలిసిన సామెత. పొంతనలేని అబద్ధాలు చెప్పే వ్యవహారాన్ని సూచించడానికి ప్రాచీన వివేకం ఈ నుడికారాన్ని తయారు చేసింది. దూడగడ్డికోసం ఎక్కవలసింది తాటిచెట్టు కాదని, అక్కడ గడ్డి దొరకదని, ఆ రెండిటికీ సంబంధం లేదని ప్రతి ఒక్కరికీ తెలుసు. అయినా తాడిచెట్టు ఎక్కదలచిన తాగుబోతు తనను తాను వంచించుకుంటూ ఇతరులను వంచించడానికి ప్రయత్నిస్తుంటాడు.

డా. మన్మోహన్‌సింగ్ విశ్వవిఖ్యాత అర్థశాస్త్రవేత్త గనుక, భారతీయ రిజర్వ్‌బ్యాంకులోనూ, ప్రపంచబ్యాంకులోనూ, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ లోనూ, సౌత్ కమిషన్‌లోనూ చిరకాలం పనిచేసి భారత ప్రభుత్వ ఆర్థిక మంత్రిగా చేరి ప్రపంచీకరణ క్రమాన్ని ప్రారంభించారు గనుక, గత ఆరు సంవత్సరాలుగా ప్రధాన మంత్రిత్వ బాధ్యతలు నిర్వహిస్తున్నారు గనుక అంతటి పెద్దమనిషిని ఆ దూడగడ్డి సాకు చెప్పిన తాగుబోతుతో పోల్చడం భావ్యం కాదు.

కాని ఆయన నోటివెంట ఫిబ్రవరి 6న వెలువడిన ఒక ప్రకటన అక్షరాలా దూడగడ్డి సామెతకు సరిపోయేలా ఉండడం ఆశ్చర్యకరం. ఆరోజున న్యూఢిల్లీలో రాష్ట్రాల ముఖ్యమంత్రుల సమావేశంలో ఆయన చిల్లర వర్తకంలోకి

విదేశీ పెట్టుబడులను రానిస్తేగాని ధరలు తగ్గవని ప్రబోధించారు. లేదా తిరగేసి చెప్పాలంటే చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను ఎందుకు అహ్వానిస్తున్నారంటే ధరలు తగ్గించడానికే అని చెప్పారు. ఇటీవల జనసామాన్యాన్ని తీవ్రంగా ఆందోళన పరుస్తున్న నిత్యావసర వస్తువుల ధరల పెరుగుదల గురించి చర్చించడానికి ఆ సమావేశం ఏర్పాటయింది. మరీ ముఖ్యంగా ఆహారపదార్థాల ధరల వార్షిక పెరుగుదల రేటు 17.56 శాతం దాటిన ఆందోళనకర స్థితిలో ఈ సమావేశం ఏర్పాటయింది. అంటే అక్కడ ప్రధానంగా ధరల గురించి, ధరల పెరుగుదల గురించి, ఆ ధరల పెరుగుదలను అరికట్టే మార్గాల గురించి చర్చించవలసి ఉండింది. ఆ చర్చ ఎంత జరిగిందో తెలియదు గాని, 'జీ హుజూర్, జో హుకుం' అని బహుళజాతి సంస్థలకు మరొకసారి విన్నవించడానికి సర్వసత్తాక ప్రజాస్వామిక భారత ప్రధానమంత్రి ఆ వేదికను కూడ వినియోగించుకున్నారు.

ఆ సమావేశంలో ప్రధాన ప్రసంగం చేసిన ప్రధాని, ధరల పెరుగుదలను అరికట్టాలంటే చిల్లర వర్తకంలోకి విదేశీ పెట్టుబడుల ప్రవేశంపై ప్రస్తుతం ఉన్న ఆంక్షలను రద్దుచేయవలసిందేనని బల్లగుద్ది చెప్పారు. రైతులకు వ్యవసాయోత్పత్తులకు అందుతున్న ధరలకూ మార్కెట్లో కొనుగోలుదారులు చెల్లిస్తున్న చిల్లరధరలకూ మధ్య చాల వ్యత్యాసం ఉందనీ, ఆ వ్యత్యాసాన్ని తగ్గించాలంటే, వినియోగదారులకు పొలంధరకు సరుకులు అందేలా చూడాలంటే విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని ఆహ్వానించవలసిందేనని అన్నారు. ఇటీవల చిల్లరధరల పెరుగుదల టోకుధరల పెరుగుదల కన్న ఎక్కువగా ఉంటున్నదని, ఎక్కువ పోటీ ఉన్నప్పుడే చిల్లర ధరలు టోకుధరలకన్న తక్కువగా పెరుగుతాయని ఆయన కొత్త ఆర్థిక సిద్ధాంతాలు కూడ చెప్పారు. రాష్ట్ర ప్రభుత్వాలు, స్థానిక సంస్థలు వేసే పన్నులు, సెస్సులు, లెవీలు ఇటీవలి కాలంలో చాల పెరిగిపోయాయని, ఒక్కోచోట అవి చిల్లర ధరలలో 10–15 శాతం దాకా కూడ ఉంటున్నాయని, అందువల్లనే ధరలు పెరుగుతున్నాయని ఆయన అన్నారు.

చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని అనుమతించడమంటే ప్రస్తుతం ఉన్న ఆంక్షలను తొలగించడం అని అర్థం. ప్రస్తుతం ఒకే బ్రాండు అమ్మకాల చిల్లర వ్యాపారంలో 51 శాతం వరకూ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశానికి అనుమతి ఉంది గాని, వివిధ బ్రాండుల సరుకులను ఒకేచోట అమ్మే చిల్లర వ్యాపారంలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశంపై నిషేధం ఉంది. అంటే, అందరికీ తెలిసిన భాషలో చెప్పాలంటే, ఒకే ఒక్క బ్రాండు సరుకులు – అది మెక్‌డొనాల్డ్స్, కెంటకీ ఫ్రైడ్ చికెన్, పిజ్జా హట్, రీబోక్, నైకీ, అదిదాస్, లీవైస్, టామీ హిల్‌ఫిగర్, సోనీ వంటి ఏ సరుకు అయినా కావచ్చు – అమ్మే దుకాణాలలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి 51 శాతానికి లోబడి దేశంలోకి ప్రవేశించవచ్చు. అది స్వదేశీ ఎగుమతి గృహంతో కలిసి ఏర్పాటు చేసిన సంయుక్త రంగ దుకాణం రూపంలోగాని, ఫ్రాంచైజీ రూపంలోగాని, దుకాణంగా పనిచేయని కార్యాలయ రూపంలోగాని ఉండవచ్చు. ఇప్పటికే దుస్తులు, పాదరక్షలు, ఎలక్ట్రానిక్ ఉపకరణాలు, సౌందర్య సాధనాలు, ఆహారపదార్థాలు, వినోద సాధనాలు అమ్మే ఇటువంటి ఒకేబ్రాండు దుకాణాలు ఇప్పటికే ఏర్పడి ఉన్నాయి.



కాని దేశవ్యాప్తంగా దుకాణాల గొలుసు వ్యాపార సంస్థను ఏర్పాటు చేసి, ఆ దుకాణాలలో అన్ని బ్రాండ్ల సరుకులూ అమ్మదలచుకున్నట్టయితే, ఆ సంస్థలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ఉండడానికి వీలులేదు. ఆ దుకాణాలలో పూర్తిగాగాని, ఎంతో కొంత వాటా రూపంలో గాని విదేశీ పెట్టుబడి జోక్యం ఉండడానికి వీలులేదు. నిజానికి బహుళజాతి సంస్థలకు అటువంటి దుకాణాల మీద చాల మోజు. ఎందుకంటే ప్రపంచవ్యాప్తంగా అత్యధిక లాభాలు సంపాదిస్తున్న, అత్యధిక జనాభాను ఆకర్షిస్తున్న వ్యాపార సంస్థల జాబితాలో అగ్రభాగాన ఉన్నవి అటువంటి చిల్లర వ్యాపారంలో ఉన్న గొలుసు సంస్థలే. అమెరికాలోనూ, యూరప్‌లోనూ అటువంటి దుకాణాలదే రాజ్యం. ప్రపంచవ్యాప్తంగా అత్యధిక లాభాలు సంపాదిస్తున్న బహుళజాతిసంస్థల జాబితాలో ఒక చమురు కంపెనీ మొదటి స్థానంలో ఉండగా చిల్లర వర్తకంలో ఉన్న వాల్‌మార్ట్ స్టోర్స్ రెండో స్థానంలో ఉంది. ఫార్చ్యూన్ 500 ప్రకారం 2009 లో దాని అమ్మకాలు 40,560 కోట్ల డాలర్లు (19,06,320 కోట్ల రూపాయలు) గానూ, లాభాలు 1340 కోట్ల డాలర్లు (62,980 కోట్ల రూపాయలు) గానూ ఉన్నాయి.

ఈ భారీ దుకాణాల ఉదాహరణ చూడాలంటే అమెరికాలో తూర్పు తీరం నుంచి పశ్చిమ తీరం దాకా, ఉత్తరాది నుంచి దక్షిణాది దాకా ఎంత చిన్న పట్టణానికి వెళ్లినా నాలుగైదు వ్యాపారసంస్థల సువిశాలమైన మాల్స్ మాత్రమే ఉంటాయి. అవి వాల్‌మార్ట్, కె మార్ట్, టార్గెట్, కాస్ట్ కో, షాప్ కో వంటి భారీ దుకాణాలు. ఎకరాలకొద్దీ విస్తరించిన ఆ దుకాణాలలో గుండుసూది నుంచి విమానం దాకా, ఆవాల నుంచి బియ్యందాకా, కొత్తిమీర నుంచి కంప్యూటర్ల దాకా అన్ని బ్రాండ్లకు చెందిన అన్ని సరుకులూ దొరుకుతాయి. అవి సాధారణంగా పట్టణానికి చివర వందలాది ఎకరాలలో విస్తరించి ఉంటాయి. వాటి కార్ పార్కింగ్ స్థలమే డజన్ల ఎకరాలు ఉంటుంది. ఒక్క అగ్గిపెట్టె అత్యవసరంగా కావలసి వచ్చినా ఇరుగుపొరుగు దుకాణాలు ఉండవు గనుక, అటువంటి చిన్న దుకాణాలన్నిటినీ పద్ధతి ప్రకారం చంపేశారు గనుక ఏం కావాలన్నా ఈ మాల్స్‌కు వెళ్లవలసిందే. ప్రతిదీ కావలసినదానికన్న ఎక్కువ పరిమాణంలో కొనుక్కోవలసిందే. ప్రతి కుటుంబమూ కారులో అక్కడికి వెళ్లి గంటల తరబడి అక్కడ సరుకులు చూస్తూ, కొనుగోళ్లు చేస్తూ గడుపుతుంది. విలువైన సమయాన్ని ఇలా వృథా చేయడానికి అమెరికన్ సంస్కృతి "కొనుగోలు అనుభవం" అని ఒక ముద్దుపేరు కూడ పెట్టింది.

ఇటువంటి పెద్ద దుకాణాలలో సరుకులను నేరుగా ఉత్పత్తిదారులనుంచి సేకరిస్తారు గనుక, మధ్యవర్తుల గొలుసు ఉండదు గనుక చివరి కొనుగోలుదారు తక్కువ ధరకు కొనుక్కోవచ్చునని ఒక సైద్ధాంతిక సమర్థన కూడ చేస్తుంటారు. కాని మొదట ఇతర చిల్లర దుకాణాలను దెబ్బతీయడానికి తక్కువకు అమ్మినా, ఆ దుకాణాలన్నీ మూతబడిన తర్వాత మధ్యవర్తులందరూ కలిసి వేసుకునే లాభాలను ఈ ఒక్క అమ్మకందారే వేసుకున్నా చేయగలిగిందేమీ లేదు. అప్పుడు వినియోగదారులకు ఆ ధరలకు కొనుక్కోవడం కన్న గత్యంతరం ఉండదు. అలాగే ఒక పట్టణంలోనో, గ్రామంలోనో కొన్ని డజన్ల, వందల దుకాణాలు వేలాది మందికి ఉపాధి కల్పిస్తూ, ఇరుగుపొరుగున మానవసంబంధాలతో కొనసాగుతుండగా, ఈ పెద్ద దుకాణాలు

వాటన్నిటినీ చంపేసి, యాంత్రీకరణ చేసి, ఉపాధి కల్పనను తగ్గిస్తాయి, మానవ సంబంధాలను తగ్గిస్తాయి. ఒక వాల్‌మార్ట్‌లో కనీసం 30,000 రకాల సరుకులు ఒకే చోట దొరుకుతాయని, ఆ గందరగోళంలో ఎటూ తేల్చుకోలేని వినియోగదారులు, కొనుగోలుదారులు ఏదో ఒక బ్రాండుకు కట్టుబడి అది ఎలా ఉన్నా అదే కొనుక్కుంటూ ఉండడానికి సిద్ధపడతారని, అలా బ్రాండ్ విధేయత రూపొందుతుందని సామాజిక శాస్త్రవేత్తలు చెపుతున్నారు. అలాగే కొన్ని గంటలపాటు అన్ని సరుకుల మధ్య కొన్ని కిలోమీటర్ల పాటు తిరిగినప్పుడు అవసరం లేకపోయినా ఏదో ఒకటి కొనకతప్పని మానసికస్థితి ఏర్పడుతుందని, వారి జేబులో డబ్బు లేకపోయినా, క్రెడిట్ కార్డ్ సహాయంతో కొనవచ్చునని చెప్పి వారికి ఆ సరుకులను మప్పడం మొదలవుతుందని కూడ అధ్యయనాలు చెపుతున్నాయి.

ఇలా చిల్లర వర్తకంలోకి విదేశీ పెట్టుబడి, గొలుసు దుకాణాల భారీవ్యవస్థలు ఎందుకు రాగూడదో, వాటివల్ల అనర్థాలేమిటో ఇప్పటికే ఎన్నో వాదనలు ఉన్నాయి. మన దేశంలో ఈ భారీ దుకాణాలు ప్రవేశిస్తే, కోట్లాది మంది ఉపాధి కోల్పోతారని, చిన్న, గ్రామీణ, ఇరుగుపొరుగు దుకాణాల చుట్టూ అల్లుకున్న మానవసంబంధాలు ధ్వంసమవుతాయని ఆందోళనలు వినబడుతున్నాయి. ప్రస్తుతం దేశంలో ఒక కోటీ యాభై లక్షల చిల్లర దుకాణాలు ఉన్నాయని, వాటిలో మొత్తం ప్రత్యక్షంగా నాలుగుకోట్ల మంది ఉపాధి పొందుతున్నారని, వీటిని ధ్వంసంచేసి పెద్ద దుకాణాలను అనుమతించగూడదని వాదనలు ఉన్నాయి.

కాని 1992 నుంచీ సాగుతున్న ప్రపంచీకరణ క్రమంలో అన్ని ప్రభుత్వాలూ క్రమక్రమంగా దేశీయ, స్వావలంబన విధానాలకు తూట్లు పొడుస్తూ, బహుళజాతి సంస్థల అనుకూల విధానాలను కొద్దికొద్దిగా ప్రవేశపెడుతూ వచ్చాయి. ఆ క్రమంలోనే టోకు వర్తకంలో నూటికి నూరు శాతం విదేశీ పెట్టుబడి ప్రవేశానికీ, ఒకే బ్రాండు వ్యాపారంలో 51 శాతానికి మించని పెట్టుబడి ప్రవేశానికీ అనుమతి దొరికింది.

ఇంకా మిగిలిపోయిన ఆంక్షలు విభిన్న బ్రాండుల విశాల విపణులలో విదేశీ పెట్టుబడి ప్రవేశం మీద మాత్రమే. అటువంటి విభిన్న బ్రాండుల విశాల దుకాణాల గుత్తాధిపత్య వ్యాపారాన్ని అనుమతించాలని భారీ బహుళజాతి సంస్థలు, విదేశీ పెట్టుబడిదారులు, వారి స్వదేశీ దళారులు, పారిశ్రామిక, వ్యాపారవర్గాల సంస్థలు చాల కాలంగా కోరుతున్నాయి. ఆ కోరికలకు మన్మోహన్ సింగ్ నాయకత్వంలోని యుపిఎ ప్రభుత్వం లొంగకపోతే ఆశ్చర్యం గాని, లొంగితే ఆశ్చర్యం ఏమీలేదు. అందుకే ఫిబ్రవరి 6 మన్మోహన్ సింగ్ ప్రకటన తర్వాత బహుళజాతి సంస్థలు, వారి దళారులు ఆయన మీద ప్రశంసల జల్లులు కురిపిస్తున్నారు.

అలా చిల్లర వ్యాపారంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశిస్తే కలగబోయే అనర్థాలేమిటి, ఆ పరిణామం ఏ ప్రయోజనాలను చూపెట్టి, ఏ దుష్పరిణామాలను దాస్తున్నది, ఆ చూపెట్టే మేళ్లయినా సక్రమంగా అమలు జరుగుతాయా, ఆ కీడులకు అంతిమ పర్యవసానం ఎంత విధ్వంసంగా రానున్నది మరొకసారి వివరంగా చర్చించవచ్చు గాని, ప్రస్తుతానికి ఆ విదేశీ



ప్రత్యక్ష పెట్టుబడి ప్రవేశానికీ, సరుకుల చిల్లర ధరలు తగ్గడానికీ ఏమన్నా సంబంధం ఉన్నదా లేదా చూడాలి. స్వయంగా ఆర్థికవేత్త అయిన ప్రధాన మంత్రి బట్టతలకూ మోకాలికీ ముడివేయడానికి ఎటువంటి ప్రయత్నం చేస్తున్నారో చూడాలి.

ఏ సరుకుకయినా నిర్దిష్టంగా ఏదో ఒక ధర ఉండడం అనేది అందరికీ తెలిసిన విషయమే. పారిశ్రామిక ఉత్పత్తులకయితే ఆ ధరలు చాల కచ్చితంగా ఉండడం, వ్యవసాయోత్పత్తులకయితే ఆ ధరలు ఒకచోట తక్కువగా, ఒకచోట ఎక్కువగా ఉండడం, రుతువులను బట్టి మారుతుండడం, సాధారణంగా అన్ని సరుకుల ధరలూ పైపైకి పోతూ ఉండడం అందరికీ తెలిసిన విషయాలే. కాని అసలు ఒక సరుకు ధరను నిర్ణయించే అంశాలేమిటి? అర్థశాస్త్రపు సాంకేతికమైన, జటిలమైన అంశాలను పక్కనపెట్టి సాధారణ పరిభాషలో ధరలను నిర్ణయించే అంశాలను చెప్పుకోవాలంటే అవి ఆరు. ఉత్పత్తి వ్యయం, రవాణా వ్యయం, నిర్వహణ వ్యయం, లాభం, పన్నులు, చిల్లర వర్తక కమిషన్.

ఏ సరుకునయినా తయారుచేయాలంటే కొన్ని ముడి సరుకులు, ఉత్పాదకాలు, కొంత మానవశ్రమ అవసరమవుతాయి. ముడి సరుకులు, ఉత్పాదకాలు ఎక్కువగా ప్రకృతిలో లభ్యమయ్యేవే గాని, వాటికి కూడ యజమానులు ఉండే సామాజికస్థితిలో మనం ఉన్నాం గనుక వాటిని ధరపెట్టి కొనుక్కోవలసిందే. వ్యవసాయోత్పత్తులకయితే విత్తనాలు, నీళ్లు వంటి ప్రకృతి సహజమైన ఉత్పాదకాలు, ఎరువులు, రసాయనాలు, పనిముట్లు వంటి ఇతరంగా ఉత్పత్తి అయిన ఉత్పాదకాలు కావాలి. ఇతర సరుకులకయితే ఖనిజాలు, అటవీ ఉత్పత్తులు, వ్యసాయోత్పత్తులు వంటి సహజ వనరులు, యంత్రాలు వంటి ఇతరంగా ఉత్పత్తి అయిన ఉత్పాదకాలు కావాలి. ఈ సహజ వనరులనైనా, ఇతరంగా ఉత్పత్తి అయిన ఉత్పాదకాలనైనా వినియోగించి కొత్త ఉత్పత్తులను సృష్టించడానికి మానవశ్రమ లేకపోతే ఏ సరుకూ తయారు కాదు. అంటే సహజ వనరులు, పనిముట్లు, యంత్రాలు, మానవశ్రమల మీద పెట్టే ఖర్చు అంతా ఉత్పత్తి వ్యయంలో భాగమవుతుంది.

ఏ సరుకయినా ఒకచోట ఉత్పత్తి అవుతుంది గాని దాని వాడకం సమాజమంతా వ్యాపించి ఉంటుంది. ఆ పంపిణీ సక్రమంగా జరగాలంటే ఏ సరుకయినా ఆ సమాజంలో నాలుగు మూలలకీ రవాణా కావలసి ఉంటుంది. ఆ రవాణా వ్యయం కూడ సరుకు ధరలో భాగం అవుతుంది.

ఉత్పత్తిని నిర్వహించడానికి గాని, పంపిణీని నిర్వహించడానికి గాని, పంపిణీ అయ్యేలోపు నిలువలను నిర్వహించడానికి గాని అయ్యే నిర్వహణ వ్యయం కూడ ఇటీవలి కాలంలో చాల పెరిగిపోతున్నది గనుక ఆ వ్యయాన్ని కూడ ధరలోనే భాగం చేస్తున్నారు.

ఈ నిర్వహణ చేసినందుకుగాను తమకు అందవలసిన ప్రతిఫలం అనే పేరుతో ప్రతి ఉత్పత్తిదారూ, పంపిణీదారూ, గిడ్డంగి నిర్వాహకులూ మరికొంత భాగాన్ని ధరలో కలుపుతున్నారు. అది న్యాయమైనదేనా, అది ఉన్నా అంత ఉండవచ్చునా అనే ప్రశ్నలు ఉంటాయి గాని ఈ భాగాన్ని లాభం అనే పేరు మీద అందరూ అంగీకరిస్తున్నారు.

ఇక ఒక సరుకు ఉత్పత్తికీ, వినియోగదారుకు చేరడానికీ మధ్య ప్రభుత్వం విధించే పన్నులు ఎన్నో ఉంటాయి. డ్యూటీ, సెస్, టారిఫ్, అమ్మకం పన్ను, వాణిజ్య పన్ను, స్థానిక పన్ను, సర్ ఛార్జ్ అని వేరువేరు రూపాలలో ఉండే ఈ పన్నులు సరుకు ధరలోనే భాగమవుతాయి.

ఇవన్నీ కాక, వినియోగదారుకూ సరుకుకూ మధ్య సరఫరా గొలుసులో ఉండే మధ్యవర్తులు, ఆ గొలుసులో చిట్టచివరి చిల్లర వర్తకులు ఆ సరుకును అమ్మినందుకు తమకు ప్రతిఫలం ఆశిస్తారు. దాన్ని సాధారణంగా వర్తక కమిషన్ అంటారు. అది కూడ ధరలో భాగమవుతుంది.

ఇవన్నీ కాక, సరుకుల ధరలు సప్లై – డిమాండ్ సూత్రం మీద ఆధారపడి ఉంటాయని, ఒక సరుకు సరఫరా కన్న గిరాకీ ఎక్కువ ఉంటే దాని ధర పెరుగుతుందని, గిరాకీ కన్న సరఫరా ఎక్కువ ఉంటే ధర తగ్గుతుందని అర్థశాస్త్రం బోధిస్తుంది. ఐతే మొత్తంగా ధరల మీద దీని ప్రభావం స్వల్పకాలికంగా ఉండవచ్చు గాని దీర్ఘకాలికంగా అంత ఎక్కువ ఉండదు. మార్కెట్ లో ఒక సరుకు సరఫరా తక్కువగా ఉన్నప్పుడు ధర పెరుగుతుందనుకుంటే, అలా ధర పెరగగానే, తమ లాభం కూడ పెరుగుతుంది గనుక ఉత్పత్తిదారులు తమ ఉత్పత్తి పెంచుతారు. అంటే సరఫరా పెరుగుతుంది. అలా సరఫరా పెరిగింది గనుక ధర తగ్గుతుంది. అప్పుడు ఆ సరుకు ఉత్పత్తి లాభసాటి కాదు గనుక ఉత్పత్తిదారులు ఆ సరుకును తగ్గిస్తారు. ఇలా అటూ ఇటూ ఊగిసలాట అంతిమంగా ధర మధ్యస్థంగా స్థిరపడడానికి దారి తీస్తుంది. అంటే సరఫరా – గిరాకీ ప్రభావం తగ్గిపోతుంది.

ఈ వివరణంతా ఎందుకంటే ధరలను నిర్ణయించే ఆరు అంశాలలో దేని కారణంగా ప్రస్తుతం ధరలు పెరుగుతున్నాయో నిర్ధారించుకుంటే, దాన్ని అదుపు చేయడానికి ప్రయత్నిస్తే ధరల పెరుగుదలను అరికట్టవచ్చు. ఉత్పత్తి వ్యయం సాధారణంగా సహజవనరుల విషయంలో ఆ కాలపు సాంకేతిక పరిజ్ఞానం స్థాయిని బట్టి, మానవశ్రమ విషయంలో ఆ కాలపు జీవన ప్రమాణాలను బట్టి నిర్ణయమవుతుంది. కనుక ఉత్పత్తి వ్యయాన్ని కచ్చితంగా అంచనాకట్టడం, అదుపు చేయడం, ధరమీద అది ఎంత ప్రభావం వేస్తుందో గుర్తించడం సాధ్యమే.

ఇక రవాణా వ్యయం సాధారణంగా రవాణా దూరాన్ని బట్టి, రవాణాకు అవసరమైన ఇంధనవ్యయాన్ని బట్టి ఉంటుంది. ఉత్పత్తిని, పరిశ్రమలను వికేంద్రీకరించడం ద్వారా దూరాన్ని తగ్గించవచ్చు. ఇంధన వనరుల సక్రమ వినియోగంద్వారా, ప్రత్యామ్నాయ ఇంధన వనరుల అన్వేషణ ద్వారా ఆ వ్యయాన్ని కూడ అదుపులో పెట్టవచ్చు.

నిర్వహణ వ్యయాన్ని కూడ ప్రణాళికా బద్ధమైన ఉత్పత్తి, పంపిణీ, రవాణా, నిలువల ద్వారా అదుపులో పెట్టవచ్చు. సరుకుల ఉత్పత్తిదారులు విపరీతమైన లాభాలు గడించకుండా, గుత్తాధిపత్యం ద్వారా అభ్యంతరకరమైన వర్తక పద్ధతులను పాటించకుండా చూసే చట్టాలు ఉన్నాయి. 1992 తర్వాత ఆ చట్టాలను ప్రభుత్వమే సవరించి, పలుచబరచినప్పటికీ, రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాల ప్రకారం కూడ మితిమీరిన లాభాలనూ, గుత్తధిపత్యాన్నీ



అరికట్టవచ్చు. కనుక ప్రభుత్వం తలచుకుంటే లాభాలరేటు మీద, వర్తక కమిషన్ రేటు మీద ఆంక్షలు విధించవచ్చు.

ఇక పన్నులు విధించే అధికారం పూర్తిగా ప్రభుత్వానిదే గనుక పన్నుల విధానాన్ని హేతుబద్ధంగా, న్యాయంగా తయారు చేయవలసి ఉంటుంది. అక్రమార్జన మీద ఎటువంటి పన్నులు విధించకుండా, ఎప్పటికప్పుడు రాయితీలు ప్రకటిస్తూ వస్తున్న ప్రభుత్వమే పరోక్ష పన్నుల రూపంలో ప్రతి సరుకు కొనుగోలు మీద కనబడని పన్నులు విధించి ప్రజల నెత్తురూ చెమటా పీల్చుకుంటున్నది. పన్నుల విధానాన్ని మార్చడం ద్వారా సరుకుల ధరలను అదుపులో పెట్టడానికి ప్రభుత్వం ప్రయత్నించవచ్చు.

అందువల్ల ధరలు తగ్గుతాయా లేదా అనేది ప్రభుత్వం చేతిలో ఉన్న పని. దానికీ విదేశీ పెట్టుబడి ప్రవేశానికీ సుదూర సంబంధం కూడ లేదు. తాడిచెట్టుకూ దూడగడ్డికీ, బట్టతలకూ మోకాలికీ ఉన్నంత సంబంధం కూడ ధరల తగ్గుదలకూ విదేశీ పెట్టుబడులకూ లేదు. ప్రజలు అనుభవిస్తున్న ఒక నిత్యజీవిత సమస్యను సాకుగా చూపి ప్రపంచబ్యాంకు మాజీ ఉద్యోగి ప్రవేశపెట్టదలచుకున్న మూడో తరం ఆర్థిక సంస్కరణలలో భాగమే చిల్లర వర్తకంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి.

***ఈభూమి, మార్చ్ 2010***

# 70

## ‘రండి రండి, మా ప్రాణాలు కారుచౌక!’

దేశదేశాల సంపన్నులకు,

అంతర్జాతీయ విష రసాయన ప్రయోగాల వ్యాపారులకు,

శాస్త్ర ప్రయోగాల బలిపశువుల వేటలో ఉన్న అణ్వాయుధ బేహారులకు,

బహుళజాతిసంస్థల పేర ఊరేగుతున్న మృత్యు వాణిజ్య లాభార్జనాపరులకు,

సహజవనరులకోసం బకాసుర ఆకలితో ప్రపంచాన్నంతా చాపచుడుతున్న హిరణ్యాక్షులకు,

అమ్మకపు సరుకుల విపణివీథులకోసం దేశాలను కబళిస్తున్న సామ్రాజ్య దాహపు నరహంతకులకు,

ఇంకా మాకు తెలిసిన, తెలియని అనేకానేక పరాన్నభుక్కులకు, రక్తపిపాసులకు –

“భోపాల్ దురంతం” అని గిట్టనివాళ్లు కారుకూతలు కూసే ఒకానొక రోడ్డు ప్రమాదం వంటి అతిచిన్న సంఘటనలో తీర్పు చెప్పి, మీకు “జీ హుజూర్ జో హుకుం” అని ప్రకటించుకునే మహదవకాశం వచ్చిన న్యాయమూర్తి అనబడే భోపాల్ చీఫ్ జుడిషియల్ మాజిస్ట్రేట్ చేసుకుంటున్న విన్నపాలు.



ఈ విన్నపాలు నా ఒక్కడివే కావు సుమండీ, ఇవి పలుకుతున్నప్పుడు నేను నా తరఫునా, మా ఘనత వహించిన ప్రాసిక్యూషన్ తరఫునా, మా అతి విధేయ నేర పరిశోధనా సంస్థ తరఫునా, మీ కొలువులో చాల కాలం పనిచేసి ఇప్పుడు మా ప్రధాన మంత్రిగా ఉన్న మన్మోహనుడి తరఫునా, మా ప్రభుత్వం తరఫునా, మా పార్లమెంటరీ రాజకీయ పక్షాలన్నిటి తరఫునా, మా ప్రధాన ప్రచార మాధ్యమాలన్నిటి తరఫునా, మీరు విదిల్చే ఎంగిలి మెతుకులకు ఆశపడే మా దేశంలోని మీ సేవకులందరి తరఫునా చెపుతున్నాను.

రండి, రండి. మా దేశానికే రండి. బిడ్డలను కోసి అతిథులకు వండిపెట్టిన సంప్రదాయం ఉన్న దేశం మాది. ఇంటిని పరాయివాడికి అప్పగించి అడవులుపట్టిపోయిన ఘనత ఉన్న సమాజం మాది. మమ్మల్ని మీరు ఎంతగానైనా దోచుకోవచ్చు. మాకేమీ అభ్యంతరం లేదు. మీ ప్రయోగాల కోసం మా జనాన్ని మీరు ఎట్లాగైనా వాడుకోవచ్చు. మా ప్రజల ప్రాణాలు కారుచౌక. మీ ఇష్టం వచ్చినంత మందిని చంపిపోవచ్చు. మీరు ఎంత మందిని చంపినా మా దేశంలో శిక్ష విధించే సంప్రదాయం లేదు. కాగితాల మీద మహాగంభీరంగా రాసుకున్న మా చట్టాలను మీరు తుంగలో తొక్కినా మేమేమీ అనుకోం. మా ప్రజల్లో వేల మందిని చంపినా, లక్షల మంది ఆరోగ్యాలు చెడగొట్టినా మీమీద మేమసలు కేసే పెట్టం. విచారణే జరపం. కేసు పెట్టినా, విచారణ జరిపినా మీ భారతీయ పాలేర్ల మీద మాత్రమే పెట్టి, వాళ్లకు కూడ కాసింత శిక్ష, మీ లాభాల సముద్రంలో కాకిరెట్టంత జరిమానా విధించి వదిలేస్తాం.

చెప్పాను గదా, మా వాళ్ల ప్రాణాలకు విలువలేదు. మేమేదో చిన్న చిన్న నేరాలకు శిక్షలు విధించాలని పట్టుబడతాంగాని మీ వంటి ప్రపంచ సంపన్నులను ప్రశ్నించగలమా? ఒకరినో ఇద్దరినో చంపితే చంపినవారిని ఉరితీయాలని ఇల్లెక్కి అరుస్తాం గాని మీ లాగ కళాత్మకంగా రాత్రికిరాత్రే వేలాది మందిని చంపిన వ్యాపార కుబేరులను వేలెత్తి చూపగలమా? వందరూపాయలు దొంగిలించినవాడ్ని కొట్టి చంపడానికి ఉగ్రరూతలూగుతాం గాని వందల కోట్ల రూపాయలు దొంగిలించే మీవంటి ఘరానా మనుషుల మీద చెయ్యి వేయగలమా?

నేను విచారించి, “శిక్ష”% విధించిన తాజా ఉదంతమే చూడండి. ఆ తీర్పులో ఈ దేశాన్ని మీ ఇష్టారాజ్యంగా ఏమి చేసుకున్నా ఫరవాలేదని నేను మరొకసారి నొక్కి వక్కాణించాను. కొందరు అమాయకులకోసం మీకు వ్యతిరేకంగా కూడ కొన్ని మాటలు రాశాను. మీ దేశాల్లో విష రసాయనాలు వదలగూడదని కఠినమైన నిబంధనలు ఉన్నాయి గనుక మా వంటి పేద దేశాలను వాడుకుంటున్నారని రాశాను గాని, విధించిన చిన్నపాటి శిక్షలను బట్టి నా మనసు మీ పక్షానే ఉందని మీకు తెలుసు గదూ. నా ఇబ్బంది అర్థం చేసుకుని క్షమించండి.

ఆ రోజు, ఇరవై ఆరు సంవత్సరాల కింద డిసెంబర్ 2–3 అర్ధరాత్రి భోపాల్ లో యూనియన్ కార్బైడ్ ఇండియా లిమిటెడ్ అనే మీ సంస్థకు చెందిన క్రిమిసంహారకాల కర్మాగారంలో ఒక ట్యాంకు పేలిందట. దానిలో ఉన్న వాయువు బయటపడి అప్పటికప్పుడు ఎనిమిదివేలమందిని చంపేసిందట. ఐదులక్షల మందిని అనారోగ్యం పాలు చేసిందట. దాని

ప్రభావం వల్ల ఏడాదికి వెయ్యి మంది చొప్పున ఇరవై ఐదు వేల మంది చనిపోయారట. అయితే ఏం? అవన్నీ అంత పట్టించుకోవలసిన సంగతులా? ఈ పేద దేశంలో ముప్పై వేల ప్రాణాలకు ఏం విలువ? రోజూ చచ్చేవాడికోసం ఏడ్చేదెవరు? ఈ దేశ అభివృద్ధి కోసం సాగుతున్న మహా యజ్ఞంలో ఆ మాత్రం బలిపశువులుండరా?

ఆ ట్యాంకులో దాచిపెట్టిన వాయువు ఏమిటో మీ కంపెనీ యాజమాన్యం చెప్పలేదట. మీ విమర్శకుల మాటలకు ఏమన్నా అర్థముందా? ఈ దేశం మీది, దాంట్లో విషవాయువులే దాస్తారో, పేల్చివేస్తారో, విషవాయువు వదిలితే పరిణామాలేమిటని ప్రయోగాలే చేస్తారో, ఏదయినా మీ ఇష్టం. కదా?! ఆ వాయువు పీల్చిన మనుషులకు చికిత్స చేయాలంటే ఆ వాయువు ఏమిటో తెలియాలట. ఎంత అర్థం లేని మాట? అసలు చికిత్స ఎందుకు చేయాలి? ప్రాణాలు పోతే పోనీ, అంతేగదా. అమెరికన్ డాలర్ల లాభాల కన్న ఎక్కువా? పైనుంచి కింది దాకా మావాళ్లకు అందే కమిషన్ల కన్న ఎక్కువా? అభివృద్ధి కన్న ఎక్కువా? మా ప్రభుత్వం ఎంత గొప్పది! ఆ వాయువు ఏమిటో కంపెనీ యాజమాన్యంతో చెప్పించడానికి మా ప్రభుత్వం ప్రయత్నించలేదని గిట్టనివాళ్లు గోల పెడుతున్నారు గాని ఈ అలగాజనం ప్రాణాలకు విలువ లేదని మా ఏలినవారి కన్న ఎవరికి ఎక్కువ తెలుసు?

ఆ విషవాయువును అక్కడ దాచిపెట్టడంలో సహకరించినందుకు అధికారులమీద చర్యలు తీసుకోలేదని విమర్శకులు అంటున్నారు. వాళ్లు చట్టాలు పాటించలేదట. అసలా చట్టాలు రాసి పెట్టింది ప్రదర్శన కోసం గాని అమలు చేయడానికా? ఇంతకూ అలా చట్టాలను కూడ పక్కనపెట్టి పరాయి కంపెనీకి, డబ్బున్నవారికి సేవ చేసినందుకు, సర్వసత్తాక భారత ప్రభుత్వ ఇంగితాన్ని సక్రమంగా గుర్తించినందుకు ఆ అధికారులందరికీ బహుమతులు ప్రకటించాలని నా సూచన.

ఇంకా ఘోరం విన్నారా, అలా వాయువు బయటపడినందుకు ఆ కంపెనీ మాతృసంస్థ అమెరికన్ కంపెనీ అధ్యక్షుడు వారెన్ ఆండర్సన్ ను అరెస్టు చేయలేదని మా ప్రభుత్వాన్ని తప్పు పడుతున్నారు. ఈ కొక్కిరాయిలకేం తెలుసుగాని, మా ప్రభుత్వం ఎంత సముచితంగా ప్రవర్తించింది! గౌరవనీయ అతిథి గారిని, వారెన్ ఆండర్సన్ దొరగారిని ఎంత సన్మానించింది! ఆయనకు ఎర్ర తివాచీ పరిచి స్వాగతం పలికింది. అతిథిగృహంలో ఉంచి, రాచమర్యాదలు చేసి, ముఖ్యమంత్రి విమానంలో భోపాల్ నుంచి ఢిల్లీ పంపించి, అక్కడినుంచి అమెరికా వెళ్లిపోవడానికి అన్ని సదుపాయాలు చేసింది. ఆయన మీద ఈగ వాలకుండా అన్ని జాగ్రత్తలు తీసుకుంది. పాపం, అలా చెప్పవలసి వచ్చినందుకు కించ పడుతూనే, ఆయన ఆచూకీ దొరకడం లేదని పదహారేళ్లుగా న్యాయస్థానానికి చెపుతోంది. ఇక మా నేర పరిశోధక సంస్థ అయితే ఆయన పేరే లేకుండా అభియోగ పత్రం తయారు చేసింది.

అంతేగాక మా సుప్రీంకోర్టు న్యాయమూర్తి తన న్యాయశాస్త్ర పరిజ్ఞానమంతా ఉపయోగించి, అభియోగపత్రంలో ఒక సెక్షన్ మార్చివేశారు. విచారణ జరిగి, శిక్ష విధించవలసివచ్చినా అది మామూలుగా పది ఏళ్లో, యావజ్జీవితమో కాగూడదని, రెండేళ్లకు



మించగూడదని సవరణ తెచ్చారు. అదే కదా ఇప్పుడు నేను చిన్నపాటి శిక్షలు విధించడానికి ఆధారం. ఈలోగా, యూనియన్ కార్బైడ్ వంటి గౌరవనీయ సంస్థమీద ఎవరు పడితే వారు కేసులు వేసి వేధిస్తారేమో పాపం అని, మా ప్రభుత్వం తనకు మాత్రమే కేసులువేసే అధికారం ఉన్నదని చట్టం కూడ తీసుకువచ్చింది.

ఇన్ని చేసినా మీరింకా మమ్మల్ని అనుమానంతోనే చూస్తున్నారు. మీరింకా మా దగ్గరికి డాలర్ల మూటలతో రావడంలేదు. మా ఖనిజాలు తవ్వుకుపోవడం లేదు. మా సంపదలు దోచుకుపోవడం లేదు. మా ప్రజల్ని లొంగదీయకపోతే రామంటున్నారు. మిమ్మల్ని రప్పించాలంటే ఈ దేశాన్ని ఇంకా తెరిచి పెట్టాలని, మీ మీద ఏ ఆంక్షలు లేకుండా చూడాలని, వద్దన్నవాడినల్లా చావచంపి చెవులు మూయాలని మా దగ్గరి పెద్ద మనుషులూ, పెద్దింటి పత్రికల, టీవీ ఛానళ్ల మేధావులూ గగ్గోలు పెడుతూనే ఉన్నారు.

భోపాల్ కథంతా జరిగింది ఇరవై ఆరేళ్లకింద. ఆ తర్వాత మీ ఆదేశాల మేరకే ఈ దేశంలో నూతన ఆర్థిక విధానాలు తీసుకువచ్చాం. “ఈ దేశం మీదేనండి, మీ రాజ్యం మీరేలండి, మా ప్రజల బతుకులు బుగ్గి చేయండి” అని దొరికిన వేదికలన్నిటి మీది నుంచీ మిమ్మల్ని పిలుస్తూనే ఉన్నాం. ఇరవై సంవత్సరాలుగా ఆహ్వానాలు పలుకుతున్నాం.

ఎప్పుడో అరవై ఏళ్లకింద మా ప్రజలు పొరపాటున అమాయకత్వంతో తెల్లతోలును వ్యతిరేకించినందుకు మమ్మల్ని క్షమించండి. మిమ్మల్ని వెళ్లగొట్టాలని ఉద్యమించిన మా పూర్వీకుల తప్పు కాయండి. అయినా మీరెంత అద్భుత ప్రజ్ఞావంతులు! ఆ వెర్రిబాగులవాళ్ల కోరికను మన్నించినట్టే నటించి మీ బంటులనే గద్దెమీద కూచోబెట్టి, మీ మాటలే చెల్లేటట్టు చేసి, మీ ఆస్తులు కాపాడుకుంటూ, మీ లాభాలు పెంచి పోషించుకుంటూ వెళ్లిపోయారు గదా. అయినా మధ్యలో చాల జరిగిపోయాయి. మా దేశాన్ని ఏదో మా ప్రజలే పాలించుకుంటున్నట్టు కొందరికి అనుమానాలు కలిగాయి. మీకు వ్యతిరేకంగా మేమేదో గూడుపుఠాణీ చేస్తున్నట్టు మీరు యాగీ చేయడం మొదలుపెట్టారు.

మేము సంపూర్ణంగా మీ విధేయులమేనని, మీ ప్రయోజనాలు రక్షించడం కన్న మాకు మరొక ఆలోచనే లేదని మా ప్రభుత్వాధినేతలు మీకు ఎన్నిసార్లు విన్నవించుకోలేదు! ఎన్నిసార్లు ఆచరణలో చూపెట్టలేదు. భోపాల్ కేసు సంగతి పోనీయండి. మీరు చెప్పిన చోటల్లా సంతకాలు పెట్టి మా రైతుల బతుకులు బుగ్గి చేయలేదా? మీరు మూసేయమన్న కంపెనీనల్లా మూసివేసి మా కార్మికుల ఉపాధి ఊడగొట్టలేదా? మీరు ప్రైవేటు వ్యక్తులకు, మీ తైనాతీలకు అప్పగించమని ఆదేశించిన కంపెనీనల్లా పువ్వుల్లో పెట్టి వారి చేతులకు అందించలేదా? మీరు ఈ నేలమీద ఎక్కడి ఖనిజం కావాలనుకుంటే అక్కడ ఆదివాసులను ఖాళీ చేయించి మీకు ధారాదత్తం చేయలేదా? మీరు అడిగితే దేశంలో ఎక్కడ భూమినైనా లక్షలాది ఎకరాలు మీకూ, మీరు చెప్పిన వారికీ ప్రత్యేక ఆర్థిక మండలాలని పేరు పెట్టి అప్పగించి అక్కడినుంచి మా చట్టాలను ఉపసంహరించలేదా? మీరు తీసేయమన్న చట్టాలను తీసేసి, మార్చమన్న చట్టాలను మార్చలేదా?

అవన్నీ పోనీయండి, ఇవాళ్టికివాళ మా పార్లమెంటు ముందర ఉన్న బిల్లు చదవండి. మీరు ఇక్కడ అణుశక్తి కర్మాగారాలు పెట్టి ఎన్ని వేలమందిని చంపినా మీమీద అభియోగాలు మోపబోమని ఆ బిల్లులో స్పష్టంగా రాశాము గదా.

ఇక మీ విమర్శకులంటారా? పార్లమెంటరీ పార్టీలన్నీ, ప్రధాన స్రవంతి ప్రచార మాధ్యమాలన్నీ ఊరికే తూతూ మంత్రానికి మీకు వ్యతిరేకంగా మాట్లాడతాయి గాని ఆ మాటలు పెదాల మీంచి వచ్చే గాలి మాటలేనని మీకూ తెలుసు, మాకూ తెలుసు. మనం భయపడవలసిందల్లా ప్రజలకు మాత్రమే గాని, వాళ్లను చీలదీయడంలో మేం విజయం సాధించాం. వారికి నాయకత్వం వహించేవాళ్లనూ దారి చూపేవాళ్లనూ పిట్టల్ని కాల్చినట్టు కాల్చి చంపుతున్నాం. ఇక మీరు నిర్భయంగా ఈ నేలమీదికి రావచ్చు.

***ప్రజాతంత్ర, జూన్ 8, 2010***



# 71

# ఏ ఘనుల బొక్కసాలకీ గనుల సంపద?

“అల్యూమినియం వాడకంలో, బాక్సైట్ నుంచి అల్యూమినాను రాబట్టడంలో పరిశ్రమ ఎంత నైపుణ్యం సంపాదించినా బాక్సైట్ లేకుండా అల్యూమినియం తయారు చేయడం సాధ్యం కాదు. అల్యూమినియం లేకుండా విమానం తయారు చేయడం సాధ్యం కాదు. మరి అమెరికా వాడే బాక్సైట్‌లో 80 నుంచి 90 శాతం విదేశీ వనరుల నుంచి సరఫరా అయ్యేటప్పుడు, అమెరికన్ అల్యూమినియం పరిశ్రమ, విమాన పరిశ్రమ, సైనిక శక్తి మనుగడ సాగాలంటే ఆ సరఫరా నిరంతరాయంగా ఉంటుందనే హామీ కావాలి.”

ఈ మాటలు హారీ మాగ్డాఫ్ అనే మార్క్సిస్టు అర్థ శాస్త్రవేత్తవి. ఆయన ఆ మాటలు అని నలభై సంవత్సరాలు దాటిపోయింది. సోవియట్ యూనియన్ నిర్మాత వ్లాదిమిర్ లెనిన్ 1917 లో రాసిన ‘సామ్రాజ్యవాదం– పెట్టుబడిదారీ విధానపు అత్యున్నత దశ’ అనే పుస్తకానికి యాభై ఏళ్లు నిండిన సందర్భంగా న్యూయార్క్‌లో జరిగిన సోషలిస్టు మేధావుల సదస్సులో సమర్పించిన పత్రంలో ఆయన ఈ మాటలు అన్నారు. లోకం చాల మారిపోయిందనీ, సామ్రాజ్యవాదం గురించి లెనిన్ విశ్లేషణకు కాలం చెల్లిపోయిందనీ విమర్శలు వస్తున్న సందర్భం అది. ఆ సదస్సులో సమర్పించిన ‘ది న్యూ ఇంపీరియలిజం’ (కొత్త

సామ్రాజ్యవాదం) అనే ఆ వ్యాసంలో కొత్త ప్రపంచంలో మారినదేమిటో, మారనిదేమిటో, మారిందని అనిపిస్తున్నదేమిటో ఆయన వివరించారు. భారీ పారిశ్రామిక, వ్యాపారసంస్థలు తమ గుత్తాధిపత్యాన్ని యథాతథంగా కొనసాగించాలంటే, తమ లాభాలను యథాతథంగా ఉంచుకోవాలనీ, పెంచుకోవాలనీ అనుకుంటే, ముడిసరుకుల కోసం విదేశాల మీద ఆధారపడక తప్పదని ఆయన రుజువు చేశారు. అతి సాధారణమైన ఖనిజాల నుంచి అరుదైన ఖనిజాలదాకా అన్నిటి విషయంలోనూ అమెరికా 'నిరుపేద దేశం' గానే ఉన్నదనీ, అందువల్లనే సామ్రాజ్యవాదపు దురాక్రమణ దాహం మరింత పెరిగిందనీ ఆయన తిరుగులేని గణాంకాలతో అద్భుతంగా వాదించారు.

నలభై ఏళ్ల తర్వాత ఆ పరిస్థితి మరింత తీవ్రతరమయింది గాని తగ్గలేదు, మారలేదు. ప్రపంచీకరణ ఆ ఖనిజవనరుల దాహాన్ని, బకాసుర ఆకలిని రక్తదాహం స్థాయికి పెంచింది. యుద్ధాలకు కారణమవుతోంది. అమెరికాకు చెందిన, లేదా అమెరికాకు ఆసక్తి ఉన్న బహుళజాతి సంస్థలు పెరిగాయి. వాటి ఉత్పత్తి సామర్థ్యం పెరిగింది. అవి అమ్ముకునే సరుకుల సంఖ్య, ఆ అమ్మకాలు జరిగే మార్కెట్లు పెరిగాయి. అంటే వాటి ఉత్పత్తి సామర్థ్యానికి తగిన స్థాయిలో లోహాల కోసం నిరంతర అన్వేషణ పెరిగింది. వాటి యంత్రభూతాలు నిరాటంకంగా నడవాలంటే అవసరమైన లోహాల పరిమాణం పెరిగింది. ఆ లోహాలు తమ దేశాలలో దొరకవనే వాస్తవం వారికి తెలిసివచ్చింది. అందుకని వారికి భూగోళం మీద తెలిసిన గనులన్నిటిమీద అధికారం కావాలనే కాంక్ష మరింత పెరిగింది. ఇంకా కొత్త గనులు ఎక్కడ దొరుకుతాయా అనే వెతుకులాట, ఆదుర్దా పెరిగాయి (ఇటీవల అఫ్ఘనిస్తాన్ లో విస్తారమైన ఖనిజ నిలువలు ఉన్నాయని కనిపెట్టిన వార్తల గురించి, ఆ ప్రాంతంలో తిష్ట వేసిన అమెరికన్ సైన్యాల గురించి పాఠకులకు తెలుసు.) అందుకే ఆయా గనులు ఉన్న దేశాల పాలకులు తమ చెప్పుచేతల్లో, కీలుబొమ్మలుగా ఉండాలనే కోరిక పెరిగింది. భూగోళం కూడ అయిపోయి తమకు అవసరమయిన ఖనిజాలు, లోహాలు చంద్రగ్రహం మీదనో, మరొక చోటనో దొరుకుతాయా అనే అన్వేషణలకు కూడ బహుళజాతి సంస్థలు పెట్టుబడులు పెడుతున్నాయి.

సరే, హేరీ మాగ్డాఫ్ అమెరికన్ అయినా, మార్క్సిస్టు కాబట్టి అమెరికాను విమర్శించడానికే అలా రాశారని ఎవరయినా అనుకుంటే, స్వయంగా అమెరికన్ ప్రభుత్వ పత్రం ఒకటీ, ప్రభుత్వం కోసం పనిచేసిన పరిశోధకుడి పత్రం ఒకటీ ఉన్నాయి. అవి మరింత పాతవి.

అమెరికా ప్రభుత్వపు అత్యున్నత అధికారి, స్టేట్ డిపార్ట్‌మెంట్ విధాన నిర్ణయ శాఖాధిపతి జార్జి కీనన్ 1948లో లాటిన్ అమెరికన్ రాయబారులకు అమెరికా ప్రభుత్వ విధానాలను వివరిస్తూ "ఆ ప్రాంతాల్లో ఉన్న ముడిసరుకులను కాపాడుకోవడం అమెరికా ప్రభుత్వ లక్ష్యాలలో ప్రధానమైనది" అన్నాడు. పరాయి దేశాల ముడి సరుకుల మీద, ఖనిజ వనరుల మీద అమెరికా ప్రేమ అంతటిది! ఆయనే 1948 ఫిబ్రవరిలో పిపిఎస్-23 అనే రహస్య ప్రణాళికా పత్రం ఒకటి రాశాడు. "ప్రపంచ సంపదలో సగం మనదగ్గరే ఉంది. కాని ప్రపంచ జనాభాలో మనం



## కళ్లు తిరిగిపోయే లాభాలు!

*గనుల యజమానుల సంపాదన ఎంత ఉంటుందో ఉజ్జాయింపుగా లెక్కకట్టినా కళ్లు తిరుగుతాయి.*

*అంతర్జాతీయ మార్కెట్ లో నవంబర్ 2009 లో భారత ఇనుపఖనిజం ధర (ఆ ఖనిజంలో 63.5 శాతం ఇనుము ఉన్నట్టయితే) టన్నుకు 106 డాలర్లు పలికింది. రూపాయల్లో చెప్పాలంటే ఇది రు. 4895.*

*కేంద్రప్రభుత్వ గనుల శాఖ ఎప్పటికప్పుడు రాయల్టీ రేట్లను ప్రకటిస్తుంది. గనుల శాఖ వెబ్ సైట్ మీద సెప్టెంబర్ 12, 2000న ప్రకటించిన రేట్ల నోటిఫికేషనే తాజాగా ఉంది. దాని ప్రకారం 62 శాతం నుంచి 65 శాతం ఇనుము ఉన్న ఖనిజానికి టన్నుకు ప్రభుత్వానికి చెల్లించవలసిన రాయల్టీ రు. 14.50 (అక్షరాలా పద్నాలుగు రూపాయల యాభై పైసలు!)*

*అలాగే కేంద్రప్రభుత్వ గనుల శాఖ రేట్స్ ఆఫ్ డెడ్ రెంట్ అని మరొక కౌలు వసూలు చేస్తుంది. ఇది విస్తీర్ణాన్ని బట్టి, లీజు తీసుకుని ఎంతకాలం గడిచిందనే దాన్ని బట్టి మారుతుంది. ఏమయినా గరిష్టంగా చెల్లించవలసింది హెక్టేరుకు (రెండున్నర ఎకరాలకు) సంవత్సరానికి రు. 350. అంటే ఇది సగటున టన్నుకు లెక్కకడితే చిల్లరపైసల్లోకి మారుతుంది.*

*యంత్రాలకు, తవ్వకానికి, సిబ్బందికి, రవాణాకు, వివిధ ప్రభుత్వ శాఖలకు లంచాలకు అన్నీ కలిపి ఎంత ఎక్కువలో ఎక్కువ ఖర్చు లెక్కకట్టినా టన్నుకు రు. 1000 కన్న ఎక్కువ కావడానికి అవకాశం లేదు.*

*అంటే ఒక గని యజమాని ఒక్కటన్ను ఇనుపఖనిజం మాత్రమే తవ్వి ఎగుమతి చేసినా మూడువేల రూపాయలు లాభం చేసుకోవచ్చు.*

*ఇటీవల ఓబుళాపురం మైనింగ్ కంపెనీకి సంబంధించిన వివాదం వచ్చినప్పుడు తమకు ఏడాదికి డెబ్బై లక్షల టన్నుల ఇనుపఖనిజం ఎగుమతి చేసే అనుమతి ఉందని ఆ కంపెనీ న్యాయవాది సుప్రీంకోర్టు ముందర చెప్పారు. గనియజమానుల సగటు లాభం టన్నుకు మూడువేల రూపాయలు కాదనీ, సగానికి సగంగా పదిహేను వందల రూపాయలు మాత్రమేననీ అనుకున్నా ఓబుళాపురం మైనింగ్ కంపెనీకి సంవత్సర లాభం వెయ్యి కోట్ల రూపాయల పైచిలుకేనన్నమాట.*

6.3 శాతం మాత్రమే. అందువల్ల మనపట్ల ఇతరులకు అసూయా ద్వేషాలు కలిగే అవకాశం ఉంది. ఈ అసమానతా స్థితిని కొనసాగించడానికి మనకు వీలు కల్పించే సంబంధ బాంధవ్యాలను కనిపెట్టడమే రానున్న రోజుల్లో మన నిజమైన కర్తవ్యం" అనే ఆణిముత్యాలు ఆ పత్రంలోవే.

అలాగే డ్యూయీ ఆండర్సన్ అనే అల్యూమినియం వ్యవహారాల నిపుణుడు రాసిన ఒక పత్రాన్ని 1951లో యుఎస్ పబ్లిక్ అఫేర్స్ ఇన్ స్టిట్యూట్ ప్రచురించింది. "అల్యూమినియం ఆధునిక యుద్ధతంత్రంలో అతి ముఖ్యమైన ఏకైక పదార్థం. పెద్దఎత్తున అల్యూమియం నిల్వలను వాడకుండా, ధ్వంసం చేయకుండా ఇవాళ ఘర్షణ సాధ్యమే కాదు. యుద్ధంలో విజయం సాధించడం సాధ్యమే కాదు...రక్షణ వ్యవహారాలకు అల్యూమినియం కీలకం. అల్యూమినియం వల్లనే యుద్ధ విమానాలు, రవాణా విమానాలు సాధ్యమయ్యాయి. అణ్వాయుధాల తయారీలోనూ, అణ్వాయుధాలను దూరతీరాలకు పంపించడంలోనూ అల్యూమినియం అవసరం. అల్యూమినియం ఉండడం, అది కూడ పెద్ద మొత్తంలో ఉండడం గెలుపుకూ ఓటమికీ మధ్య విభజనరేఖను గీస్తుంది..."

ఇది ఒకే ఒక్క లోహానికి సంబంధించిన కథ. ఇటువంటి ముఖ్యమైన, అవసరమైన లోహాలు ఎన్నో ఉన్నాయి. ఆ లోహాల తయారీలో ఉపయోగపడే ఖనిజాలు మరెన్నో ఉన్నాయి. అవన్నీ ఎక్కువగా దక్షిణార్ధగోళంలో, అంటే దక్షిణ అమెరికా, ఆఫ్రికా, ఆసియా ఖండాలలో ఉన్నాయి. ఉత్తరార్ధ గోళంలో, తమ దేశాలలో కొన్ని ఖనిజ నిలువలు ఉన్నప్పటికీ, వాటిని ఇప్పుడే తవ్వితీయాలని ఆయా ప్రభుత్వాలు, బహుళజాతి సంస్థలు అనుకోవడం లేదు. దక్షిణార్ధ గోళంలోని పేద దేశాలన్నిటినీ తమ సొంత పెరడుగా భావించే బహుళజాతి సంస్థలు మొట్ట మొదట అక్కడి వనరులను కొల్లగొట్టాలని ఆలోచిస్తున్నాయి. అందుకే అక్కడి ఖనిజాలను తవ్వి తీసుకోవడానికి తమను అనుమతించే ప్రభుత్వాలో, లేదా తవ్వితీసి తమకు చౌకగా అమ్మే ప్రభుత్వాలో ఆయా దేశాలలో ఉండాలని బహుళజాతి సంస్థలు ఆశిస్తున్నాయి. ఆ బహుళజాతి సంస్థల ప్రయోజనాల కోసం అమెరికా వంటి అగ్రరాజ్యాల ప్రభుత్వాలు గాని, ప్రపంచబ్యాంకు – అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ – ప్రపంచ వాణిజ్య సంస్థ దుష్టత్రయం గాని పని చేస్తున్నాయి.

ఇదీ మన ఖనిజాల గురించీ, మన గనుల గురించీ మాట్లాడుకునేటప్పుడు తప్పనిసరిగా తెలుసుకోవలసిన నేపథ్యం. మన మాయల మరాఠీల ప్రాణం ఏ ఏడేడు సముద్రాల అవతల, అగ్నికీలల మధ్య, మర్రిచెట్టు తొర్రలో, చిలుకలో ఉన్నదో తెలుసుకుంటే గాని ఈ మాయల మరాఠీ ఇలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడో తెలియదు.

మన దేశం నుంచి రోజుకు కొన్ని లక్షల టన్నుల ఖనిజంగాని, ముడి లోహాలు గాని విదేశాలకు, కచ్చితంగా చెప్పాలంటే బహుళజాతి సంస్థల కార్ఖానాలకు, గిడ్డంగులకు వెళ్తూ ఉంటాయి. అవి సరుకుల, పరికరాల, యంత్రాల, ఆయుధాల తయారీకి ఉపయోగపడవచ్చు, లేదా మారు బేరానికి ఉపయోగపడవచ్చు. లేదా ఊరికే నిలువ చేయడానికైనా కావచ్చు. ఆ లోహాల, ఖనిజాల విలువ రోజుకు కొన్ని వేలకోట్ల రూపాయలు ఉంటుంది. ఆ ఖనిజనిక్షేపాలు తవ్వే కాంట్రాక్టులు చేపట్టినవాళ్లు, అమ్ముకునేవాళ్లు, మారుబేరం చేసేవాళ్ళు, వాటిని తమ పరిశ్రమలలో వాడుకునే వాళ్లు, స్వదేశీయులైనా విదేశీయులైనా వేలకోట్ల రూపాయలు గడిస్తున్నారు. జాతిసంపదమీద అధికారాన్ని నిర్వహిస్తున్న ప్రభుత్వాలు కొన్ని వందలకోట్ల



## గణాంకాలు

*భారతదేశం ఖనిజ వనరుల కాణాచి. లడాఖ్ నుంచి లక్షద్వీపాల దాకా, కచ్ నుంచి కోహిమా దాకా సువిశాల భారత దేశంలో లేని ఖనిజం లేదు. పారిశ్రామికాభివృద్ధికైనా, నిత్య జీవితంలో వాడుకునే సరుకుల, పనిముట్ల, యంత్రాల తయారీకైనా, యుద్ధ సామగ్రి తయారీకయినా ప్రపంచం మొత్తానికీ అవసరమైన అన్ని లోహాలూ భారతదేశంలో దొరికే ఖనిజాల ద్వారా తయారవుతాయి. ఆసియా ఖండంలోనూ, ప్రపంచం మొత్తంలోనూ భారతదేశం అతి ప్రధానమైన ఖనిజ ఉత్పత్తిదారు, సరఫరాదారు. మొత్తం దేశంలో దాదాపు 90 ఖనిజాలు దొరుకుతాయి. వాటిలో నాలుగు ఇంధన ఖనిజాలు, 11 లోహ ఖనిజాలు, 52 లోహేతర ఖనిజాలు, 22 చిన్న ఖనిజాలు ఉన్నాయి.*

*ప్రపంచ దేశాల ఖనిజ ఉత్పత్తి జాబితా చూస్తే భారతదేశం అభ్రకంలో మొదటి స్థానంలో, క్రోమైట్, బెరైటిస్ లలో రెండో స్థానంలో, బొగ్గు, లిగ్నైట్ లలో మూడో స్థానంలో, ఇనుప ఖనిజంలో నాలుగో స్థానంలో, బాక్సైట్, ముడి ఉక్కులలో ఐదవ స్థానంలో, మాంగనీస్‌లో ఏడవ స్థానంలో, అల్యూమియంలో ఎనిమిదవ స్థానంలో ఉంది.*

*ఖనిజ నిలువలలో భారతదేశంతో పోల్చదగిన సంపద ఉన్న దేశాలు బహుకొద్ది. కాని అటువంటి ఖనిజాలే లేని దేశాలు, భారత పాలక విధానాలవల్ల ఇక్కడినుంచి ఖనిజాలు కొల్లగొట్టుకుపోయి, వాటితో తయారుచేసిన సరుకులనూ, యంత్రాలనూ, పరికరాలనూ మళ్లీ భారతదేశంతో సహా ప్రపంచానికంతా అమ్ముతున్నాయి.*

*దేశవ్యాప్తంగా ఇరవై వేల చోట్ల వివిధ ఖనిజాల నిక్షేపాలు ఉన్నాయని అంచనా కాగా దాదాపు నాలుగువేల గనుల్లో పని జరుగుతోంది. అయితే దేశంలోని మొత్తం గనులలో 90 శాతం పదకొండు రాష్ట్రాల (ఆంధ్రప్రదేశ్, ఒడిషా, చత్తీస్‌గఢ్, పశ్చిమ బెంగాల్, మహారాష్ట్ర, తమిళనాడు, గుజరాత్, మధ్యప్రదేశ్, రాజస్తాన్, కర్ణాటక) లోనే ఉన్నాయి. నిక్షేపాలన్నీ అడవులలో, నదీలోయలలో ఉండడం భారత దేశపు ఖనిజాల ప్రత్యేకత. సరిగ్గా ఆ ప్రాంతాలలోనే ఈ దేశపు ఆదివాసి జనాభాలో అత్యధికులు – దాదాపు ఏడుకోట్ల మంది – ఉన్నారు.*

*2005 నాటి లెక్కల ప్రకారం దేశంలో 328 కోట్ల టన్నుల బాక్సైట్ ఖనిజం, 139 కోట్ల టన్నుల రాగి ఖనిజం, 52 కోట్ల టన్నుల సీసం ఖనిజం, 242 కోట్ల టన్నుల జింక్ ఖనిజం, 1463 కోట్ల టన్నుల ఇనుప ఖనిజం (హెమటైట్), 1061 కోట్ల టన్నుల ఇనుప ఖనిజం (మాగ్నెటైట్), 21 కోట్ల టన్నుల క్రోమైట్ ఖనిజం ఉన్నాయి. ఇంకా మాగ్నెసైట్, మాంగనీసు, సున్నపురాయి, రాక్ ఫాస్ఫేట్, సిలిమనైట్, గార్నెట్, క్యానైట్, డొలమైట్, వజ్రాలు, బంగారం వంటి ఖనిజాలు కోట్ల టన్నులలోనూ లక్షల టన్నులలోనూ ఉన్నాయి. ఈ ఖనిజాల వెలికితీత ప్రస్తుత పరిమాణంలోనే సాగితే సిలిమనైట్, క్యానైట్ మినహా ఇతర ఖనిజాలన్నీ కొన్ని దశాబ్దాలలోనో, రెండు మూడు శతాబ్దాలలోనో వట్టిపోతాయి. నిజానికి ఇప్పటికే గత పది, పదిహేను సంవత్సరాలలో మన వార్షిక వెలికితీత రెండు మూడు రెట్లు పెరిగిపోయింది.*

రూపాయలు పన్నుల రూపంలో, సుంకాల రూపంలో వాటా సంపాదిస్తున్నాయి. కాని ఆ ఖనిజనిక్షేపాలు ఎవరి నేలలో ఉన్నాయో, ఎవరి బతుకులలో భాగమో, ఎవరు వాటిని తవ్వి తీస్తున్నారో వారి బతుకులు మాత్రం రోజురోజుకూ ఛిద్రమవుతున్నాయి. ఈ ఖనిజ నిలువలు ఉన్న ప్రాంతాలు ప్రధానంగా ఆదివాసి, అటవీ ప్రాంతాలు, రాజ్యాంగం ఐదవ షెడ్యూల్ వంటి రక్షణ ఉన్న ప్రాంతాలు. ఆంధ్ర ప్రదేశ్ లో 1 ఆఫ్ 1970 చట్ట సవరణ, ఒడిషాలో 2 ఆఫ్ 1956 చట్ట సవరణ వంటి రక్షణ ఉన్న ప్రాంతాలు. అయినా ఖనిజ నిలువల దోపిడీ నిరంతరాయంగా సాగిపోతోంది.

ఒరిస్సాలోని అపారమైన ఇనుము, మాంగనీస్, బాక్సైట్ ఖనిజనిలువలతో అనిల్ అగర్వాల్‌కు చెందిన వేదాంత రిసోర్సెస్ అనే బహుళజాతిసంస్థ వేల కోట్ల రూపాయలు సంపాదిస్తోంది. జార్ఖండ్ లోని ఖనిజనిలువలను బహుళజాతి సంస్థలకు, గనుల మాఫియాకు అప్పగించి కమిషన్లు సంపాదించడం ద్వారా మాజీ ముఖ్యమంత్రి మధు కోడా వందల కోట్ల రూపాయల అక్రమ ఆస్తులు సంపాదించాడు. కర్ణాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సరిహద్దులను కూడ చెరిపేసి ఇనుపఖనిజం తవ్వుకున్న భారతీయ జనతాపార్టీ మంత్రి గాలి జనార్దనరెడ్డి వందల కోట్లకు పడగెత్తడం మాత్రమే కాదు, రెండు రాష్ట్రాలలోనూ ప్రభుత్వ విధానాలను శాసిస్తున్నాడు. రెండు రాష్ట్రాలలోనూ అనేక సంస్థలలో బేనామీ పెట్టుబడులు పెడుతున్నాడు. ఖమ్మం జిల్లా బయ్యారం అటవీ ప్రాంతంలోని ఇనుపఖనిజం నిలువల గురించి సాగుతున్న వివాదం ఇవాళ ప్రతిఒక్కరి దృష్టిలోనూ ఉంది.

ఒరిస్సా, జార్ఖండ్, చత్తీస్‌గఢ్ వంటి రాష్ట్రాలలో ఖనిజనిలువలను బహుళజాతి సంస్థలు అక్రమంగా తవ్వుకుపోతున్న వార్తలు, కడపజిల్లాలో ఇనుప ఖనిజం తవ్వకాలలో గాలి జనార్దనరెడ్డికి చెందిన ఓబుళాపురం మైన్స్ కంపెనీ సాగించిన అక్రమాల వార్తలు, ఆపరేషన్ గ్రీన్‌హంట్ అనేది గనుల మాఫియా కు విశాల భూభాగాలను కట్ట బెట్టడానికేనని రచయిత్రి

### గనుల మాఫియా

*ఖనిజాల వెలికితీత, శుద్ధి, ఎగుమతి, సరఫరా, ఉత్పత్తి రంగాలలోఉన్న విపరీతమైన లాభాలవల్ల ఈ రంగంలోకి బహుళజాతిసంస్థలు, వారి ఏజెంట్లు, సబ్ ఏజెంట్లు పెద్దఎత్తున చొర బడ్డారు. గనుల తవ్వకం ఆ ప్రాంతంలోని ప్రజల జీవనాన్ని ధ్వంసం చేస్తుంది గనుక అందువల్ల వచ్చే ప్రతిఘటనను ఎదుర్కోవడానికి అన్ని చోట్లా గనుల తవ్వకందార్లు మాఫియాగా మారిపోయారు. గనుల వ్యాపారుల సామ్రాజ్యంలో కేవలం ప్రతిఘటించే వారిని బెదిరించడం మాత్రమే కాక, లైసెన్సులు తీసుకోవడంలో అక్రమాలు, లైసెన్సు తీసుకున్న ప్రాంతం కన్న ఎక్కువ ప్రాంతంలో తవ్వకాలు జరపడం, పోటీ కంపెనీలకు కేటాయించిన స్థలం లోంచి ఖనిజాన్ని దొంగతనం చేయడం, ఖనిజాన్ని అక్రమ రవాణా చేయడం, స్థానిక రెవెన్యూ, అటవీ, పోలీసు అధికారులను తమ పోషణలో ఉంచు కోవడం వంటి మాఫియా కార్యక్రమాలెన్నో చేయవలసి ఉంటుంది.*



అరుంధతీ రాయ్ చేసిన విమర్శలు, అవతార్ సినిమా– వీటితో ఇటీవల ఖనిజాల గురించి, ఖనిజ నిలువల వినియోగం గురించి పెద్దఎత్తున చర్చ మొదలయింది. ఎన్నో ఏళ్లుగా ప్రభుత్వ రహస్యా లుగా, ప్రజల దృష్టికి రాకుండా ఉండిపోయిన అనేక అంశాలు వెలుగు లోకి వస్తున్నాయి. సరిగ్గా ఈ సమయానికే భారత ప్రభుత్వం గనుల (అభివృద్ధి–నియంత్రణ) చట్టం 2010 ముసా యిదా తయారుచేసి పార్లమెంటులో బిల్లు ప్రవేశపెట్టే కార్యక్రమంలో ఉంది. అయితే గనుల తవ్వకంలో ఇమిడి ఉన్న జీవన భద్రత, విస్థాపన, అటవీ విధ్వంసం, పర్యావరణ సమస్యలు వంటివేవీ ఈ ముసాయిదాలో ప్రస్తావనకు కూడ రాలేదు. గనుల తవ్వకం లైసెన్సుల విషయంలో జరుగుతున్న మోసాల గురించి లోకం కోడై కూస్తున్నా, ఈ ముసాయిదాలో మాటవరుసకయినా ఆ మాట లేదు. పైగా, ప్రపంచ బ్యాంకు ఆదేశాల ప్రకారం విద్యుత్ రంగంలో స్వతంత్ర నిర్ణయాధికార సంస్థగా రెగ్యులేటరీ అథారిటీని ఏర్పాటు చేసిన పద్ధతిలోనే గనుల రంగంలో కూడ స్వతంత్ర ట్రిబ్యునళ్లను ఏర్పాటు చేసి, ప్రభుత్వం తనకు ఇప్పుడున్నంత బాధ్యతను కూడ వదులుకోవడానికి సిద్ధపడుతోంది.

### భారత ఖనిజ వ్యాపారం చేస్తున్న బహుళజాతి సంస్థలలో కొన్ని:

*ట్రాన్స్‌వరల్డ్ గార్నెట్ కంపెనీ, కెనడా*
*ఆంగ్లో అమెరికన్ ఎక్స్‌ప్లొరేషన్ (ఇండియా) బివి, నెదర్లాండ్స్*
*ఫెల్ప్స్ డాడ్జ్ ఎక్స్‌ప్లొరేషన్ కార్పొరేషన్, యుఎస్ఎ*
*బిఎచ్ పి బిల్లిటన్, ఆస్ట్రేలియా*
*పెబుల్ క్రీక్ రిసోర్సెస్ లిమిటెడ్, కెనడా*
*మెరిడియన్ పీక్ రిసోర్సెస్ కార్పొరేషన్, కెనడా*
*రియో–టింటో మినరల్స్ డెవలప్‌మెంట్ లిమిటెడ్, యుకె*
*మెట్‌డిస్ట్ గ్రూప్, యుకె*
*డి–బీర్స్ కన్సాలిడేటెడ్ మైన్స్ లిమిటెడ్, దక్షిణాఫ్రికా*
*పోస్కో, దక్షిణ కొరియా*
*మిత్తల్ – ఆర్సెలార్, నెదర్లాండ్స్*
*ఎంఎంకె, రష్యా*
*కోరస్, బ్రిటన్ – నెదర్లాండ్స్*
*జిందాల్ సౌత్‌వెస్ట్ స్టీల్, భారతదేశం*
*టాటా స్టీల్, భారతదేశం*
*ఎస్సార్ స్టీల్, భారతదేశం*
*వేదాంత రిసోర్సెస్, యుకె*

## ఆదివాసుల స్థితి

మన ఖనిజ నిక్షేపాల పరిమాణం గురించి గణాంకాలు తెలుసుకున్నట్టుగానే, ఈ ఖనిజ నిక్షేపాలతో లాభపడుతున్నదెవరో, నష్టపోతున్నదెవరో కూడ తెలుసుకోవాలి.

ఖనిజాలు ఏ సమాజం నివసిస్తున్న నేల కింద ఉన్నాయో వారికే మొట్టమొదట చెందుతాయి. అంటే అవన్నీ వాళ్లేమీ తినలేరు గనుక వాటిని హేతుబద్ధంగా తవ్వితీసి తమ ఇతర అవసరాలు తీర్చుకోవడానికి ఉపయోగించుకునే మొదటి హక్కు వాళ్లది కావాలి. ఆ తర్వాత, వాళ్లు నివసిస్తున్నది ఒక పాలనా ప్రాంతమయితే, ఆ పాలనా ప్రాంత వాసులందరికీ కూడ ఆ వనరులమీద హక్కు ఉంటుంది. ఆ రకంగా చూసినప్పుడు మన దేశంలోని ఖనిజాలమీద మొదటి హక్కు ఆదివాసులది, ఆ తర్వాతి హక్కు ఆయా రాష్ట్ర ప్రజలది, ఆ తర్వాతి హక్కు మొత్తం భారతదేశ ప్రజలది. ఈ హక్కు ప్రజలది మాత్రమే. పాలకులది ఎంతమాత్రం కాదు. పాలకులు నిజంగా ప్రజా ప్రతినిధులుగా అధికారంలోకి వచ్చి ఉంటే, ప్రజోపయోగం కోసమే పని చేస్తూ ఉంటే, అప్పుడు కూడ ప్రజల అనుమతి తీసుకుని మాత్రమే ఈ ఖనిజాల వినియోగం ఎలా జరగాలని నిర్ణయించాలి. కాని ప్రజా ప్రతినిధులుగా ఐదేళ్లకోసమో, ఇంకా తక్కువ కాలానికో (పదమూడు రోజులు పనిచేసిన ప్రభుత్వం కూడ ఉంది మనకు!) అధికార పీఠం ఎక్కినవాళ్లు, దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకున్నట్టు, ఆ తక్కువ సమయంలోనే ఖనిజ వనరుల తవ్వకం లైసెన్సులు తమ కుటుంబ సభ్యులకు, ఆశ్రితులకు ఇచ్చుకుంటున్నారు.

భారతదేశంలో ఖనిజ నిలువలు విస్తారంగా ఉన్న ప్రాంతాల పటాన్నీ, అడవుల పటాన్నీ, అంటే ఆదివాసి నివాస ప్రాంతాల పటాన్నీ పోల్చి చూస్తే ఒక ఆశ్చర్యకరమైన వాస్తవం బయటపడుతుంది. దేశంలోని ఖనిజ నిలువల్లో, ముఖ్యంగా విలువైన ఖనిజ నిలువల్లో అత్యధిక భాగం ఆదివాసుల నివాసస్థలాల భూగర్భంలోనే ఉన్నాయి. భూగోళం మొత్తం మీద అత్యంత విలువైన, అవసరమైన చమురు, సహజవాయు నిక్షేపాలు ఎక్కువగా ముస్లిం మతవాసుల నివాసస్థలాల కింద ఉన్నాయని, వాటిని రాబట్టడానికే అగ్రరాజ్యాలు సామ దాన భేద దండోపాయాలు ప్రయోగిస్తున్నాయని అందరికీ తెలుసు. గత అరవై సంవత్సరాలుగా అమెరికా ప్రభుత్వాలు పశ్చిమాసియా దేశాలలో పెడుతున్న చిచ్చు ఆ సహజ వనరుల నిక్షేపాల మీద తన అదుపుకోసమే. రెండవ ప్రపంచ యుద్ధం అయిపోగానే పశ్చిమాసియా దేశాలలో తన తైనాతీగా ఇజ్రాయెల్‌ను సృష్టించిన దగ్గరినుంచి, సౌదీ అరేబియా వంటి చోట్ల నిరంకుశ రాచరికాలకు మద్దతు ఇవ్వడం దగ్గరినుంచి, ఇరాన్, ఇరాక్ వంటి దేశాల మీద దాడుల దాకా అమెరికా ఈ చమురు దాహాన్ని బహిరంగంగానే ప్రకటిస్తూ వస్తోంది. ఇప్పుడు దానికే 'తీవ్రవాదం మీద యుద్ధం' అని పేరు పెట్టింది.

ఈ ఖనిజ నిక్షేపాల దాహం విషయంలో భారత పాలకుల చరిత్ర కొంచెం భిన్నమైనది. మొదటినుంచీ కూడ భారతపాలకులు నేరుగా తమ అవసరాల కోసం, తమ పారిశ్రామికాభివృద్ధి కోసం ఈ ఖనిజ నిలువల మీద దాడి చేయడం లేదు. పరాయి పాలకుల కోసం, సామ్రాజ్యవాదులకు, బహుళజాతి సంస్థలకు ఈ సంపదలు దోచిపెట్టడం కోసం తమ సొంత పాలితులయిన ఆదివాసుల మీద యుద్ధం చేస్తున్నారు. నూతన ఆర్థిక విధానాల తర్వాత, ముఖ్యంగా 1993 నూతన ఖనిజ విధానం తర్వాత ఈ దాడి ఎక్కువయింది. ప్రపంచీకరణ క్రమంలో బహుళజాతిసంస్థలకు ఇంకా ఇంకా ఎక్కువ ఖనిజాలు, లోహాలు అవసరమయ్యాయి కాబట్టి భారత ఖనిజాలను వారికి అప్పగించి మధ్య దళారీలుగా తాము ముడుపులు పొందడానికి, తమ స్విస్ బ్యాంకు ఖాతాలు పెంచుకోవడానికి భారత పాలకులు ప్రయత్నాలు ప్రారంభించారు. ఈ ప్రయత్నాలకు వాళ్లకు సహకరిస్తున్నది అభివృద్ధి భావజాలపు మాయాజాలం. వెనుకబడిన ఆదివాసులను అభివృద్ధి చేయడం కొరకే, వారిని ప్రధాన స్రవంతిలోకి తీసుకురావడం కొరకే గనుల తవ్వకం, ఖనిజ విక్రయం జరుపుతున్నామనే తప్పుడు వాదనలను పాలకులు తరచూ వినిపిస్తుంటారు. అభివృద్ధి అనేది ఎంత మిరుమిట్లు గొలిపే, మాయగొలిపే, భ్రమలు పెంచే భావజాలమంటే, నిజంగా స్వార్థ ప్రయోజనాలు లేవని అనిపించే రాజకీయ పక్షాలు, రాజకీయ నాయకులు కూడ ఈ అభివృద్ధి మంత్రంతో ఆదివాసులను బలి ఇచ్చే యజ్ఞంలో రుత్విక్కులయిపోతారు. కాషాయం నుంచి ముదురు ఎరుపు దాకా పాలకులందరూ, వాళ్లు రాష్ట్ర ప్రభుత్వాలను నడిపేవారయినా, కేంద్రంలో ప్రభుత్వం వెలగబెడుతున్న వారయినా అందరూ ఈ విషయంలో ఒకటే. అయితే స్వార్థ ప్రయోజనాల కొరకో, లేదా తప్పుడు భావజాలానికి బలి అయ్యో ఈ ఖనిజ నిలువల వెలికితీత కార్యక్రమంలో భాగస్వాములయి, తిలాపాపం తలా పిడికెడు పంచుకుంటున్నారు.



ఇంతకూ ఎవరి అభివృద్ధి కోసమని చెప్పి ఈ ఆపరేషన్ గ్రీన్ హంట్ అనే యజ్ఞం జరుగుతున్నదో, ఎవరిని బలిపశువులుగా రోజు రోజూ వధిస్తూ, భయపెడుతూ, బెదిరిస్తూ, ఖనిజ నిలువల ప్రాంతాన్ని ఖాళీ చేయించడానికి ప్రయత్నం జరుగుతున్నదో ఆ ఆదివాసులు ఇవాళ ఎలా ఉన్నారు? వారికి కావలసిన అభివృద్ధి ఏమిటి? వారికి పాలకులు ఇస్తున్న అభివృద్ధి ఎమిటి?

దేశంలోని అత్యధికంగా వెనుకబడిన, అతి ఎక్కువ పేదరికం ఉన్న 150 జిల్లాల జాబితాలో 30 జిల్లాలు ఖనిజ సంపద ఉన్నవే. ఖనిజాల మీదనే ఎక్కువగా ఆధారపడే జార్ఖండ్, ఛత్తీస్‌గడ్, ఒడిషాలు, ఖనిజ సంపద మీద అంతగా ఆధారపడని తమిళనాడు, మహారాష్ట్ర, గుజరాత్ లకన్న వెనుకబడి ఉన్నాయంటే ఖనిజాల వల్ల ఆ రాష్ట్రాలు సాధిస్తున్న అభివృద్ధి ఏమీ లేదని తేలుతుంది. ఖనిజ సంపద విస్తారంగా ఉన్న రాష్ట్రాలలో తక్కువ తలసరి ఆదాయం, ఎక్కువ పేదరికం, తక్కువ పెరుగుదల రేట్లు, ఎక్కువ శిశు మరణాల సంఖ్య, పోషకాహార లోపం వంటి సమస్యలన్నీ ఉన్నాయి. ఆ ప్రాంతాలలో ప్రాథమిక విద్య లేదు, ప్రాథమిక వైద్య సౌకర్యాలు లేవు. రవాణా సదుపాయాలు లేవు. విపరీతమైన వర్షపాతం, ఏడాది పొడుగునా పారే సెలయేళ్లు ఉన్నప్పటికీ వ్యవసాయ అభివృద్ధి లేదు. ఆదివాసుల జీవన ప్రమాణాలను మెరుగు పరచడానికి కనీస చర్యలేవీ ఈ ఆరు దశాబ్దాలలో జరగలేదు. ఆ ఆదివాసులు నివసించే ప్రాంతం నుంచి తవ్వుకుపోతున్న ఖనిజాల వ్యాపారంలో లాభాలలో పదో వంతు తిరిగి వారి అభివృద్ధికి ఖర్చు పెట్టినా, వేల కోట్ల రూపాయలు వారికి దక్కి ఉండేవి. ఆదివాసుల జీవనం మెరుగయి ఉండేది.

అయితే ఖనిజ వనరుల వ్యాపారం కొత్తది కాదు. ఇప్పుడు కనబడుతున్న స్థాయిలో అక్రమాలు, అవినీతి ఇదివరకు లేకపోవచ్చుగాని, ఖనిజ వనరుల వ్యాపారం గతంలో కూడ ఉంది. ఇసుక తవ్వకుపోతూ వాగులు వట్టిపోయేలా చేయడం, గ్రామాల పరిసరాలలో ఉన్న కొండలను తొలిచి ఇళ్లనిర్మాణాలకు వాడడం, సున్నపురాయి తవ్వకుని అక్రమంగా అమ్ముకోవడం దగ్గరినుంచి వేల సంవత్సరాలుగా భూమిలో భద్రంగా ఉన్న ఖనిజ నిలువలను, ఆ ప్రాంతవాసులకు ఉపయోగపడవలసిన సంపదను కొల్లగొట్టడం వరకూ మన సమాజంలో ఈ అక్రమ వ్యాపారం సర్వత్రా వ్యాపించి ఉంది. ఈ గనుల తవ్వకాలు మన సంపదను మనకు కాకుండా చేస్తున్నాయి, దొంగ వ్యాపారుల పాలు చేస్తున్నాయి. మన పర్యావరణాన్ని, ఆరోగ్యాలను దెబ్బతీస్తున్నాయి. మన పాలనా విధానాలను నిర్ణయిస్తున్నాయి, ప్రభావితం చేస్తున్నాయి. చివరికి ప్రభుత్వాదాయానికి కూడ గండి కొడుతున్నాయి.

ఇదంతా ఎవరి సొమ్ము? ఎవరు కబ్జా చేసి సొంత బొక్కసాలు నింపుకుంటున్నారు? ప్రకృతి సహజంగా సమాజానికి అందిన ఈ సంపద, వేల సంవత్సరాలుగా భూమిలో నిక్షిప్తమై, ఆ భూమిపుత్రులందరికీ సమానంగా అందవలసిన సంపద, ఆ భూమిపుత్రుల సర్వతోముఖాభివృద్ధికి ఉపయోగపడవలసిన ఈ సంపద ఎందువల్ల పిడికెడు మంది సంపన్నుల చేతుల్లోకి ప్రవహిస్తున్నది? ఏ రాజకీయార్థిక, సామాజిక శక్తులు ఈ జాతి సంపదను కొద్దిమందికి హక్కుభుక్తంగా రాసి ఇస్తున్నాయి?

మన దేశంలో మానవజీవితానికి అవసరమైన ఖనిజ నిలువలు అనేకం ఉన్నాయని, వాటిని వాడుకోవచ్చునని ప్రాచీనకాలం నుంచి కూడ అవగాహన ఉంది. ఇనుము, రాగి, వెండి, బంగారం వంటి లోహాల గురించీ, ఉక్కు, కంచు వంటి మిశ్రమాల గురించి భారతీయులకు వేలసంవత్సరాలుగా తెలుసు. కాని ఆధునిక గనుల తవ్వకం, ఖనిజాల వాడకం బ్రిటిష్ పాలనతోనే మొదలయ్యాయి. బ్రిటిష్ వలసవాదుల పాలనావిధానమే భారత ఉపఖండంలోని సహజ వనరులను కొల్లగొట్టి తమ దేశానికి తరలించుకుపోవడం, తమ పరిశ్రమలకు ముడిసరుకులుగా వాడుకోవడం మీద ఆధారపడింది. ఈస్టిండియా కంపెనీ రోజులలోనే 1774లో రాణిగంజ్‌లో మొదటి ఆధునిక బొగ్గుగనిని తెరవడంతో భారతదేశంలో పరాయిదేశాల ఖనిజ దాహం మొదలయింది. దేశంలో ఉన్న ఖనిజనిక్షేపాల మొట్టమొదటి చిత్రపటాన్ని బ్రిటిష్ అధికారులే 1821లో తయారుచేశారు. రైళ్లకు అవసరమయిన బొగ్గు నిలువలను కనిపెట్టి తవ్వడంకోసం 1851లో బిటిష్ ప్రభుత్వం జియొలాజికల్ సర్వే ఆఫ్ ఇండియాను ప్రారంభించింది. అలాగే గనులు, భూగర్భ వనరుల శాఖను 1887లో ఏర్పాటు చేసింది. గనులకోసం భూసేకరణ చట్టాన్ని 1885లోనే తీసుకువచ్చింది. ఆ తర్వాత 1901 భారత గనుల చట్టం, 1923 భారత గనుల పాలనా చట్టం వంటి చట్టాల ద్వారా దేశంలోని ఖనిజనిలువల మీద ఈస్టిండియా కంపెనీకి, బ్రిటిష్ ప్రభుత్వానికి, ఆ ప్రభుత్వం నియమించిన కంట్రాక్టర్లకు అధికారాన్ని స్థిరపరచుకుంది.



ఇందుకు భిన్నంగా జాతీయోద్యమం దేశంలోని ఖనిజ సంపదమీద దేశప్రజలందరికీ హక్కు ఉంటుందని భావించింది. గనులు, ఖనిజనిలువలు ఏ ఒక్కరి వ్యక్తిగత ఆస్తి కావడానికి వీలులేదని భావించింది. అందుకే 1947 తర్వాత గనులను, ఖనిజ సంపదను జాతికి చెందిన ఉమ్మడి ఆస్తిగా గుర్తించి వాటిని నియంత్రించే, అభివృద్ధిచేసే, పరిరక్షించే బాధ్యతను ప్రభుత్వానికి ఇవ్వడం జరిగింది. భారతరాజ్యాంగం గనులను, ఖనిజాభివృద్ధిని కేంద్ర జాబితాలోనూ, రాష్ట్ర జాబితాలోనూ చేర్చింది. చమురు క్షేత్రాల, చమురు సంబంధిత ఖనిజనిలువల, పెట్రోలియం, పెట్రోలియం ఉత్పత్తుల నియంత్రణ, అభివృద్ధి (కేంద్ర జాబితా అంశం 53), పార్లమెంటు చట్టం ద్వారా కేంద్రప్రభుత్వానికి అప్పగించిన గనుల, ఖనిజ నిలువల నియంత్రణ, అభివృద్ధి (అంశం 54) కేంద్ర ప్రభుత్వ పరిధిలోకి వస్తాయి. కేంద్ర ప్రభుత్వ పరిధిలో లేని ఇతర గనుల, ఖనిజాల అభివృద్ధి అంతా రాష్ట్ర ప్రభుత్వ పరిధిలోకి (రాష్ట్ర జాబితా అంశం 23) వస్తుంది. కేంద్ర ప్రభుత్వంలోని గనుల మంత్రిత్వ శాఖ దేశంలోని ఖనిజాల సర్వేక్షణకు, అన్వేషణకు, ఉత్పత్తికి బాధ్యత వహిస్తుంది. సహజవాయువు, పెట్రోలియం, అణుధార్మిక ఖనిజాలు మినహా మిగిలిన ఖనిజాలన్నిటికీ గనుల మంత్రిత్వశాఖదే బాధ్యత. గనుల, ఖనిజాల (నియంత్రణ – అభివృద్ధి) చట్టం, 1957 ద్వారా భారత ప్రభుత్వం ఈ పని చేస్తుంది.

ఈ విధానాల ప్రకారం అల్యూమియం, రాగి, జింక్, సీసం, బంగారం, నికెల్ వగైరా ఖనిజాలను కేంద్ర ప్రభుత్వ గనుల శాఖ కిందికి తెచ్చారు. ఇండియన్ బ్యూరో ఆఫ్ మైన్స్, మినరల్ ఎక్స్‌ప్లొరేషన్ కార్పొరేషన్ లిమిటెడ్, నేషనల్ మినరల్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్, స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా, భారత్ అల్యూమినియం కంపెనీ లిమిటెడ్, హిందుస్తాన్ జింక్ లిమిటెడ్, హిందుస్తాన్ కాపర్ లిమిటెడ్ వంటి కేంద్ర ప్రభుత్వ సంస్థలను ఏర్పాటు చేశారు. వీటిలో భారత్ అల్యూమియం కంపెనీని, హిందుస్తాన్ జింక్ లిమిటెడ్‌ను ఇటీవల ప్రైవేటీకరించారు. ఇవికాక తమ పరిధిలోని ఖనిజాల అభివృద్ధి కోసం దాదాపు అన్నిరాష్ట్ర ప్రభుత్వాలు ఖనిజాభివృద్ధి సంస్థలను ఏర్పరచుకున్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంయుక్తంగా కూడ కొన్ని సంస్థలను ఏర్పాటు చేశాయి. ఈ చట్టబద్ధమైన, పాలనాపరమైన ఏర్పాట్లద్వారా దేశంలోని ఖనిజ నిలువల అన్వేషించి, వెలికితీసి, దేశాభివృద్ధి కోసం వినియోగించాలని ఆశించారు. కాని జరిగినది మరొకటి. అసలు ఉద్దేశాలలోనే లోపముందా, ఆచరణలో లోపముందా అనే చర్చకు పెద్దగా ప్రయోజనం లేదు.

దేశంలో దాదాపుగా లేని ఖనిజం లేదని చెప్పవచ్చు. వీటిలో ఇనుప ఖనిజం, రాగి ఖనిజం, క్రోమైట్, జింక్ సమ్మేళనాలు, బంగారం, మాంగనీస్ ఖనిజం, బాక్సైట్, సీసం మిశ్రమాలు, వెండి, సున్నపురాయి, మాగ్నెసైట్, డోలమైట్, బరైటిస్, కావొలిన్, జిప్సం, అపటైట్, ఫాస్ఫరైట్, స్టియటైట్, ఫ్లోరైట్ అనే ఖనిజాలు ముఖ్యమైనవి. ఈ ఖనిజాల ఉత్పత్తిలో ప్రపంచ దేశాలన్నిటిలోనూ భారతదేశానికి చాల ప్రాముఖ్యత ఉంది.

అంటే, ప్రపంచదేశాలన్నీ, ఆయా లోహాలతో పరిశ్రమలు నడిపే, వ్యాపారాలు చేసే బహుళజాతి సంస్థలన్నీ భారతదేశం మీద ఆధారపడవలసిందే తప్ప, భారతదేశానికి వాటితో

పనిలేదు. ఆయా పరిశ్రమల ఉత్పత్తులు నిరాటంకంగా సాగాలంటే, వాటికి ముడిసరుకులయిన లోహాలు, ఖనిజాలు నిరంతరం అందాలంటే, ఆయా పరిశ్రమలు నడుపుతున్న బహుళజాతిసంస్థల లాభాలు ఇబ్బడిముబ్బడి కావాలంటే వారందరికీ భారతదేశపు ఖనిజాలు కావలసి ఉంటుంది. అంటే బేరసారాలాడడానికి, మనకు అనుకూలమైన విధానాన్ని అనుసరించడానికి, మనకు లాభసాటిగా ఉండే ఆంక్షలు, నిబంధనలు విధించడానికి భారత ప్రభుత్వానికి ఎక్కువ అవకాశం ఉంది. కాని భారత పాలకులకు భారత ప్రజల మీదికన్న తమ సొంత ఖజానాలు నింపుకోవడం

## సినిమాలు, పుస్తకాలు

ఖనిజ నిలువల గురించి, గనుల మాఫియా గురించి, ఖనిజాల కోసం బహుళజాతి సంస్థలు ఎన్నెన్ని సమాజాలను ధ్వంసం చేశాయో చెప్పే చరిత్ర గురించి అర్థం చేసుకోవడానికి ఎంతో సమాచారం అందుబాటులో ఉంది. ఆసక్తి ఉన్నవారు తప్పకుండా చూడవలసిన సినిమాలు, చదవవలసిన రచనలు:

లియొనార్డో డి కాప్రియో, జెన్నిఫర్ కానెల్లీ, జిమోన్ హూన్సో ప్రధాన పాత్రధారులుగా ఎడ్వర్డ్ జ్విక్ 2006లో తీసిన 'బ్లడ్ డైమండ్' ప్రపంచవ్యాప్తంగా సంచలనం సృష్టించింది. ఆఫ్రికాలోని సియరాలియోన్ అనే చిన్నారి దేశంలో దొరికే వజ్రాల వల్ల ఆ దేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థలలో ఎన్నెన్ని దురాగతాలు సంభవించాయో ఆ సినిమా వీక్షకుల కంట తడిపెట్టేలా వివరించింది. ఇతరదేశాలలో ఆడంబరంగా, విలాసంగా ధరిస్తున్న వజ్రాలకు ఎంత నెత్తురు అంటి ఉన్నదో ఆ సినిమా చూపింది. ఆ వజ్రాల వెతుకులాటలో సాయుధ ముఠాల ఘర్షణలు, చిన్నారి పిల్లలను సైనికులుగా మలచడం, ఆదిమ తెగల ప్రజలను, ఒక్క తల్లి కడుపున పుట్టినవారినీ, తండ్రీకొడుకులనూ ఒకరి మీదికి ఒకరిని శత్రువులుగా ఉసిగొల్పడం, వజ్రాలు అమ్మి ఆయుధాలు కొనడానికి ప్రభుత్వ వ్యతిరేక సాయుధ బృందాలు ప్రయత్నించడం, స్మగ్లర్లు, కుట్రలు, కుహకాలు, ఈ క్రమంలో వజ్రాల వ్యాపారం చేసే బహుళజాతిసంస్థలు, వాటి చెప్పుచేతల్లో నడిచే ప్రభుత్వాలు, ప్రభుత్వాల సాయుధ బలగాలు ఎన్ని అక్రమాలకు పాల్పడతాయో బ్లడ్ డైమండ్ చూపుతుంది. ఇటువంటి అక్రమ, సంఘర్షణామయమైన, నెత్తురంటిన వజ్రాలను కొనడాన్ని నిషేధిస్తూ 2000లో ఐక్యరాజ్యసమితి ఒక తీర్మానం కూడ ఆమోదించింది గాని ఇప్పటికీ ఈ అక్రమ వ్యాపారం సాగుతూనే ఉంది. ప్రపంచ వజ్రాల వ్యాపారంలో అగ్రస్థానాన ఉన్న డి బీర్స్ అనే బహుళజాతి సంస్థ (ఇది ఇప్పుడు భారతదేశంలో వజ్రాల వ్యాపారంలో కూడ ఉంది) ఈ సినిమా నిర్మాతల మీద ఒత్తిడి తెచ్చి 'ఇదంతా కల్పన, వాస్తవంతో ఎక్కడయినా పోలికలు ఉంటే యాదృచ్ఛికమే' అని ముక్తాయింపు వేసేలా చేసింది. ఆ ప్రకటన, కథలో కొన్ని అసంగతాలు ఉన్నప్పటికీ, ఖనిజాలకు ఎంతెంత నెత్తురు అంటుకుని ఉందో ఈ సినిమా ప్రేక్షకులకు తెలియజెప్పింది.



మీద శ్రద్ధ ఎక్కువ. ప్రజల వోట్లతో గెలిచి గద్దెలెక్కిన ఈ పెద్దలు, దేశదేశాల సంపన్నుల, బహుళజాతిసంస్థల దళారులుగా పనిచేయడానికి మాత్రమే సిద్ధంగా ఉన్నారు. తెలిసి తెలిసీ భారతదేశపు అవకాశాలను, ఆధిక్యతను, సానుకూలతలను భంగపరిచారు. భారత ప్రజల ప్రయోజనాలను పణంగా పెట్టారు.

ప్రభుత్వ రంగంలోని గనుల శాఖలను, సంస్థలను సవ్యంగా, ప్రజానుకూలంగా నడిపి ఉంటే, ఖనిజాల వెలికితీతలో శాస్త్రీయమైన, హేతుబద్ధమైన, సామాజిక శ్రేయోదాయకమైన

'బ్లడ్ డైమండ్' కన్న ఎక్కువ నిర్దిష్టంగా, సూటిగా, స్పష్టంగా ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసిన సినిమా 2009లో వచ్చిన 'అవతార్'. ఒక శాస్త్రవిజ్ఞానకల్పన చిత్రంగా వచ్చిన ఈ సినిమాలో దర్శకుడు జేమ్స్ కామెరూన్ 2154లో మనుషులు మరొక సౌరకుటుంబంలో పాండోరా అనే గ్రహం మీద ఉన్న అనబ్టేనియం అనే విలువైన ఖనిజం కోసం అక్కడి నావి అనే జీవజాతిని, అక్కడి ప్రకృతిని ధ్వంసం చేసి, ఎన్ని ఘోరాలు చేస్తారో కళ్లకు కట్టాడు. ఆ సినిమాలోని మనుషులు అమెరికన్ బహుళజాతి కంపెనీలకు, వేదాంత రిసోర్సెస్ కు ప్రతిరూపమని, అనబ్టేనియం అనే ఖనిజం చమురు, సహజవాయువు, బాక్సైట్ అని, ఆ పాండోరా గ్రహం పశ్చిమాసియానో భారతదేశంలోని ఒరిస్సానో అని, నావి జాతి అరబ్బులకో ఖోండులకో ప్రతిరూపమని ఎంతో మంది వ్యాఖ్యానించారు. ఒక దేశ పాలకులకు మరొక దేశంలోని, ప్రాంతంలోని వనరులను కొల్లగొట్టే హక్కు ఉందా అనీ, ఆ క్రమంలో అక్కడి ప్రజల జీవితాన్ని, ప్రకృతిని ధ్వంసం చేయడం దుర్మార్గం కాదా అనీ చాల చర్చకు ఈ సినిమా వీలు కల్పించింది.

రాకేశ్ కల్షియాన్ సంపాదకుడిగా పానోస్ సౌత్ ఏషియా అనే స్వచ్ఛంద సంస్థ ప్రచురించిన 'కాటర్ పిల్లర్ అండ్ ది మహువా ఫ్లవర్' భారత దేశంలోని గనుల్లో జరుగుతున్న కల్లోలాన్ని పదమూడు వ్యాసాల్లో వివరంగా చిత్రించింది.

ఫెలిక్స్ పాడెల్ అనే ఆంత్రపాలజిస్టు, సమరేంద్ర దాస్ అనే ఒడియా రచయిత కలిసి రాసిన 'ఔట్ ఆఫ్ దిస్ ఎర్త్ – ఈస్ట్ ఇండియా ఆదివాసీస్ అండ్ ది అల్యూమినియం కార్టెల్' (ఓరియంట్ బ్లాక్ స్వాన్, హైదరాబాద్ ప్రచురణ 2010) నిశితమైన పరిశోధనతో ఒక చిన్న రాష్ట్రంలో ఉన్న ఖనిజ సంపదలో ఒకానొక లోహాన్ని తయారుచేసే ఖనిజం ఉన్నందువల్ల ఆ రాష్ట్రాన్నీ, ఆ రాష్ట్ర ప్రజలనూ ధ్వంసం చేయడానికి బహుళజాతిసంస్థలు ఎన్నెన్ని కుట్రలు పన్నుతాయో వివరించింది.

పర్యావరణ పక్షపత్రిక డౌన్ టు ఎర్త్ ను నడిపే సెంటర్ ఫర్ సైన్స్ అండ్ ఎన్విరాన్ మెంట్ గత సంవత్సరం 'రిచ్ లాండ్స్ పూర్ పీపుల్' అనే నివేదికను ప్రచురించింది. నవలా రచయిత్రి, సామాజిక కార్యకర్త అరుంధతీ రాయ్ 'ది లాండ్ ఈజ్ మైన్' శీర్షికతో గత సంవత్సరం 'ఔట్‌లుక్' పత్రికలో ఒక సుదీర్ఘమైన ప్రత్యేక వ్యాసాన్ని ప్రచురించారు.

పద్ధతులు అవలంబించి ఉంటే, ఖనిజ రూపంలోని దేశసంపద అంతా దేశప్రజలకే అందేది. దేశప్రజల సౌభాగ్యం కోసమే వినియోగంలోకి వచ్చేది. రాజ్యాంగం ఆదేశిక సూత్రాలలో అధికరణం 39లో చెప్పినట్టుగా, 'సమాజపు భౌతిక వనరుల మీద యాజమాన్యం, నియంత్రణ ఉమ్మడి శ్రేయస్సు కోసం ఉపయోగపడేటట్టుగా పంపిణీ అవుతుంది' అనే సూత్రాన్ని కచ్చితంగా అమలుచేసి ఉంటే ఖనిజసంపద ప్రస్తుతం జరుగుతున్నట్టుగా దుర్వినియోగం అయ్యేది కాదు. కొద్దిమంది సంపన్నుల చేతిలో, బహుళజాతిసంస్థల చేతిలో, వారి దళారీలుగా పనిచేస్తున్న స్వదేశీ పెట్టుబడిదారుల, ప్రభుత్వాధికారుల చేతిలో పోగుపడేది కాదు.

భారత ప్రభుత్వానికి 1947 నుంచి 1993 దాకా ప్రత్యేకంగా ఖనిజ విధానం అంటూ ఏమీలేదు. 1957 చట్టంలోనే గనుల తవ్వకాన్ని ప్రైవేటు వ్యక్తులకు, సంస్థలకు అప్పగించడానికి వీలు కల్పించారు. 1960లో వెలువడిన ఖనిజాల రాయితీల నిబంధనలు ఇలా ప్రైవేటు వ్యక్తుల, సంస్థల చేతికి ఖనిజ నిలువలను అందించడానికి అవసరమైన విధివిధానాలను రూపొందించాయి. ఆర్థిక సరళీకరణ క్రమం మొదలయిన తర్వాత 1988లో వెలువడిన ఖనిజాల సంరక్షణ, అభివృద్ధి నిబంధనలు ఈ ప్రైవేటీకరణ క్రమాన్ని మరింత పెంచాయి. 1993లో మొదటిసారిగా తయారయిన జాతీయ ఖనిజ విధానం పూర్తిగా ప్రపంచీకరణ శక్తుల కనుసన్నల్లో, బహుళజాతిసంస్థల ప్రయోజనాలు నెరవేర్చడానికే తయారయింది. ఇంధన ఖనిజాలు, అణుధార్మిక ఖనిజాలు మాత్రం మినహాయించి మిగిలిన ఖనిజాలన్నిటిలోకి నేరుగా విదేశీ పెట్టుబడులు ప్రవేశించడానికి మార్గం సుగమమయింది. స్వదేశీ సంపన్నుల గనుల మాఫియా బహుళజాతి సంస్థలతో కుమ్మక్కయింది. ఆ విధానాన్ని కూడ 1994లో మరింత సవరించి ఇనుప ఖనిజం, రాగి, మాంగనీస్, సీసం, క్రోమ్ ఖనిజం, జింక్, గంధకం, మాలిబ్డినం, బంగారం, టంగ్స్టన్, వజ్రాలు, నికెల్, ప్లాటినం మొదలయిన ఖనిజాలలోకి ఇబ్బడి ముబ్బడిగా ప్రైవేటు సంస్థలు, బహుళజాతి సంస్థలు ప్రవేశించడానికి వీలు కల్పించారు. దానితో కెనడా, అమెరికా, ఆస్ట్రేలియా, యునైటెడ్ కింగ్‌డమ్, దక్షిణాఫ్రికాలకు చెందిన ఎన్నో బహుళజాతి సంస్థలు నేరుగా గాని, తమ దళారుల ద్వారా గాని ఈ రంగంలోకి ప్రవేశించాయి. ఖనిజాల, గనుల రంగంలోకి మరింతగా విదేశీ ప్రత్యక్ష పెట్టుబడికి అవకాశం ఇవ్వడానికి 2006లో మరిన్ని చట్టపరమైన మార్పులు చేశారు. ఇంకా ఇది సరిపోదన్నట్టు కేంద్రప్రభుత్వం తయారు చేస్తున్న కొత్త చట్టంలో గనుల, ఖనిజ నిలువల ప్రైవేటీకరణకు ఇంకా విస్తృత చర్యలున్నాయి.

బహుళజాతి సంస్థలకు గనుల, ఖనిజాల అవసరం ఎక్కువగా ఉండడంతో, ఇందులో విపరీతంగా లాభాలు ఉండడంతో, దేశంలో గనులను లీజుకు తీసుకునే స్థానిక పెత్తందారులు, వ్యాపారస్తులు, అధికారులు, రాజకీయవేత్తలు కలగలిసిన మాఫియా తయారయింది. ఈ గనుల మాఫియా నుంచి ప్రభుత్వం వసూలు చేసేది వాళ్ల లాభాలలో ఒక్క శాతం కన్న కూడ తక్కువ. అలా గనుల మాఫియా చట్టబద్ధంగా, ప్రభుత్వ అనుమతి ప్రకారం గనులు తవ్వితేనే 99 శాతం లాభాలు అప్పనంగా వచ్చి పడుతుండగా, ఇక అక్రమ తవ్వకాలు, లీజు ఇచ్చిన



స్థలం కన్న ఎక్కువ భూమిలో తవ్వకాలు, లెక్కలు తక్కువచేసి చూపించడం, ప్రభుత్వానికి ఇవ్వవలసిన రాయల్టీ తగ్గించడానికి, ఎగ్గొట్టడానికి సాంకేతిక మార్గాలు వెతకడం వంటి అనేక అక్రమ పద్ధతులు ఉన్నాయి.

ఇక్కడ ఒక చట్టబద్ధమైన అవినీతి మార్గం గురించి తెలుసుకోవడం ఆసక్తికరంగా ఉంటుంది. మినరల్ కన్సెషన్ రూల్స్ (ఖనిజ రాయితీ నిబంధనలు) 1960 లో 24 ఎ (6) అనే నిబంధన ఒకటి ఉంది. 'ఎవరయినా ఆసామి ఒక గనిని లీజుకు తీసుకుంటే, దాని కాలపరిమితి ముగిసిన తర్వాత, కొనసాగించమని నిర్ణీత వ్యవధిలోపల దరఖాస్తు పెట్టుకుంటే, సంబంధిత అధికారి ఆ దరఖాస్తు మీద ఏ నిర్ణయం తీసుకోకపోయినా, లీజు పునరుద్ధరించబడినట్టే' అని ఆ నిబంధన చెపుతుంది. అంటే గనుల శాఖ అధికారికి నిర్ణయం తీసుకోకుండా ఉండడానికి లంచం పెడితే గని తవ్వకందారు గనిని తవ్వుకుంటూనే ఉండవచ్చు. నిజానికి ఆ లంచం కూడ అవసరం లేదు, మన ప్రభుత్వ శాఖల అలసత్వం వల్ల, కాగితాలు కదలడానికి నెలలూ సంవత్సరాలూ పడతాయి గనుక ఈ లోగా గని లీజు పునరుద్ధరణ జరిగిపోతుందన్న మాట. 2009 లో సుప్రీం కోర్టులో ఒడిషాలో గనుల అవినీతి గురించి దాఖలయిన ఒక పిటిషన్ లో ఈ నిబంధన గురించి దిగ్భ్రాంతికరమైన వాస్తవాలు వెలుగులోకి వచ్చాయి. అప్పటికి ఒడిషాలో పనిచేస్తున్న 341 గనుల్లో కేవలం 126 మాత్రమే తగిన అనుమతులతో పనిచేస్తున్నాయి. మిగిలినవాటిలో ఎక్కువభాగం పైన చెప్పిన నిబంధనను ఉపయోగించుకుని పనిచేస్తున్నాయి. ఈ అనుమతిలేని గనుల వల్ల ఆ గనుల తవ్వకందార్లు మూడులక్షల కోట్ల రూపాయలు సంపాదించారని ఆ పిటిషన్ లో పేర్కొన్నారు.

ఇక రాష్ట్రం విషయానికి వస్తే, దేశంలోని ఖనిజనిలువల సంపదలో రాష్ట్రానిది రెండవ స్థానం. రాష్ట్రంలో దాదాపు 50 పారిశ్రామిక ఖనిజాల వెలికితీత, ఉత్పత్తి జరుగుతోంది. బొగ్గు, సహజవాయువు, సున్నపురాయి, అభ్రకం, బరైటిస్, బాక్సైట్, సముద్రతీరపు ఇసుక, స్టియటైట్, క్వార్ట్జ్, ఫెల్డ్‌స్పార్, మాంగనీస్, డోలమైట్, గ్రానైట్ వంటి ఖనిజాలెన్నో రాష్ట్రంలో ఉన్నాయి. ఇంకా వెలికితీయని, అన్వేషించవలసిన ఖనిజ నిలువలు ఎన్నో ఉన్నాయి. మొత్తంగా రాష్ట్రంలో సింగరేణి బొగ్గుగనులు కాక ఐదు లక్షల ఎకరాలలో వివిధ గనుల తవ్వకాలు ప్రైవేటు వ్యక్తుల, వ్యాపారసంస్థల చేతుల్లో ఉన్నాయి. గనులు తవ్విపెడతామని లీజుకోసం, అనుమతులకోసం ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నవారి సంఖ్య ఏటేటా వేలాదిగా పెరుగుతోందంటేనే గనుల వ్యాపారం చాల లాభసాటి వ్యవహారం అయిపోయిందని అర్థం. ప్రభుత్వ లెక్కల ప్రకారమే 2005–06లో ఈ గనుల ద్వారా రు. 7,803 కోట్ల విలువగల ఖనిజాల వెలికితీత జరిగింది. కాని ప్రభుత్వానికి పన్నులు, లీజు, రాయల్టీ, ఆదాయవాటాల ద్వారా అందినది రు. 1,075 కోట్లు మాత్రమే. అంటే తెలుగు ప్రజల ఉమ్మడి వారసత్వ సంపద నుంచి ఆ ఒక్క సంవత్సరమే 6,728 కోట్ల రూపాయలు కొన్ని డజన్ల మంది గనుల వ్యాపారుల బొక్కసాలకు చేరిందన్నమాట. ఈ అంకెను గత ఇరవై సంవత్సరాల వ్యవధితోనో, పది సంవత్సరాల వ్యవధితోనో హెచ్చువేస్తే

మన రాజకీయ నాయకులు-అధికారులు-గనుల వ్యాపారులు సాగించిన అక్రమార్జనలో కొంతభాగానికి లెక్క తేలుతుంది. ఆ వేల కోట్ల రూపాయల సంపద అంతా న్యాయంగా ప్రజా సంక్షేమానికీ, అభివృద్ధికీ వెచ్చించవలసినది.

ఇదంతా ప్రజల సంపద. ఉమ్మడి వారసత్వం. దాన్ని ప్రజల అవసరాల కోసం, అభివృద్ధికోసం ప్రణాళికాబద్ధంగా వినియోగించాలి. దొరికే ఖనిజసంపదనంతా సమీక్షించి, పద్ధతి ప్రకారం వెలికితీస్తూ, రాష్ట్రంలోనే ఆ ఖనిజాధారిత పరిశ్రమలు ఏర్పాటుచేసి వేలాదిమందికి ఉపాధి కల్పించవచ్చు. అ పారిశ్రామిక ఉత్పత్తుల వ్యాపారం ద్వారా ఆదాయం సంపాదించవచ్చు. దొరికే ఖనిజాలను ఉపయోగించి విద్యుదుత్పత్తి, సిమెంట్, ఎరువులు, సెరామిక్స్, గ్లాస్, ఉక్కు, గృహ నిర్మాణ పరికరాలు, వినియోగవస్తువులు తయారుచేసే పరిశ్రమలు ఎన్నో స్థాపించవచ్చు. గనుల తవ్వకాన్ని ప్రభుత్వరంగంలోనే నిర్వహిస్తూ ఖనిజాల విలువనంతా రాష్ట్ర ఖజానాకే చేర్చవచ్చు. ఎక్కడైనా సాంకేతిక కారణాల కొద్దీ ప్రైవేటు వ్యక్తులకు, సంస్థలకు లీజు ఇవ్వవలసి వచ్చినా ప్రజాధనం ప్రైవేటు వ్యక్తుల, సంస్థల కైంకర్యం కాకుండా రాయల్టీలు, పన్నులు శాస్త్రీయంగా విధించి ప్రభుత్వాదాయం పెంచవచ్చు. కాని అవి జరిగే పాలనావిధానాలు లేవు.

అవన్నీ లాభ నష్టాల లెక్కలతో, డబ్బు సంపాదనే సార్థకతకు చిహ్నంగా సాగుతున్న రాజకీయార్థిక వ్యవస్థలో, ఆధిపత్య శక్తులకే అన్ని అధికారాలూ అనే విలువల చట్రంలో సాధ్యం కావు. అవి సాధ్యం కావాలంటే సహజసంపదలన్నీ ప్రజలవి మాత్రమేననే ప్రత్యామ్నాయ దృక్పథం కావాలి. ప్రజలు ఏ జల్, జంగల్, జమీన్ మీద ఆధారపడి ఉన్నారో వాటి మీద సకలాధికారాలూ ప్రజలవే అనే కొత్త దృక్పథం ఆధారంగా వ్యవస్థ నిర్మాణం జరగాలి.

***ఈభూమి, ఆగస్ట్ 2010***



# 72

# భూబకాసురుల కొత్త ఎత్తుగడ ప్రత్యేక దోపిడీ మండలాలు

ఆంధ్రప్రదేశ్ దేశంలోని చాల రాష్ట్రాల కన్న ఎక్కువ ప్రత్యేక ఆర్థిక మండలాలతో మహారాష్ట్ర తర్వాత రెండో స్థానంలో ఉంది. మహారాష్ట్ర 108 ప్రత్యేక ఆర్థిక మండలాలతో మొదటి స్థానంలో ఉండగా, 106 ప్రత్యేక ఆర్థిక మండలాలతో ఆంధ్రప్రదేశ్ ఆ స్థానాన్ని చేరడానికి పోటీపడుతోంది. ఇలా ప్రత్యేక ఆర్థిక మండలాలను ఏర్పాటు చేసే విధానం స్పెషల్ ఎకనామిక్ జోన్ అనే ఇంగ్లిషు పేరు పొడి అక్షరాలతో ఎస్.ఇ.జెడ్. - సెజ్ - పేరుతో ప్రాచుర్యంలోకి వచ్చింది. దేశం మొత్తం మీద 23 రాష్ట్రాలలో కలిసి పూర్తి అనుమతి పొందిన సెజ్‌లు 577 ఉండగా వాటిలో 106 ఆంధ్రప్రదేశ్ లోనే ఉన్నాయి. దేశవ్యాప్తంగా ఇంకా 155 సెజ్‌లు సూత్రప్రాయ అనుమతి పొంది పూర్తి అనుమతి కోసం ఎదురు చూస్తున్నాయి. దేశంలోని సెజ్ లలో పద్దెనిమిది శాతానికి పైన ఒక్క మన రాష్ట్రానికే అందాయి. దేశంలో ఏడు శాతం జనాభాకూ, ఎనిమిది శాతం విస్తీర్ణానికీ మాత్రమే ప్రాతినిధ్యం వహిస్తున్న రాష్ట్రానికి పద్దెనిమిది శాతం సెజ్‌లు దక్కడం ఆశ్చర్యం కలిగించవచ్చు. ప్రజలకు మేలు చేసే సంక్షేమ పథకాలలో, కేటాయింపులలో రాష్ట్రానికి న్యాయంగా రావలసిన వాటా కూడ రాని పరిస్థితిలో ఈ సెజ్‌ల వెల్లువ మాత్రం మనమీద

ఎందుకు ఇంతగా కురిసిందో అర్థం చేసుకోవాలి. ఆంధ్రప్రదేశ్‌కు ఈ మహా ఘనత ఎందుకు వచ్చిందో, అసలిది ఘనతేనో కాదో, దీనివల్ల రాష్ట్రానికి, రాష్ట్ర అభివృద్ధికి, సాధారణ ప్రజానీకానికి ఏం జరగబోతున్నదో ఆలోచించాలి.

ఎంత పెద్ద అంకె కనబడితే అంత గొప్ప అనీ, అది మంచో చెడో తెలియకపోయినా జాబితాలో అందరికన్న పైన ఉండడం సాధించవలసిన విజయమనీ అనుకునే విలువలు ప్రస్తుతం రాజ్యం చేస్తున్నాయి. ఐదు సంవత్సరాల కింద సున్నాగా ఉన్న ప్రత్యేక ఆర్థిక మండలాల సంఖ్య ఇవాళ 106 గా ఉన్నదంటే పెరుగుదల రేటు 10,600 శాతం అనీ, కనుక మనం అందలం ఎక్కినట్టేననీ, ఇక స్వర్గానికి బెత్తెడేననీ వాదించే అర్థశాస్త్రవేత్తలు కూడ ఉన్నారు. అంకె వెనుక దాగి ఉండే సామాజిక పరిణామాలను, వాటి మంచిచెడులను పట్టించుకోకుండా అంకెలను మాత్రమే చూస్తూ పారవశ్యంలో మునిగిపోయే బుద్ధిజీవులున్నారు. ఇటువంటి ఆలోచనలు సమాజంలో ఉండడం వల్లనే ఎక్కువ ప్రత్యేక ఆర్థిక మండలాలను, పెట్టుబడుల గురించీ, ఉద్యోగావకాశాల గురించీ, ఎగుమతి ఆదాయాల గురించీ నిజమవుతాయో కావో తెలియని భారీ భారీ అంకెలను చూపి తామే ఈ ఘనత సాధించామని రాజకీయ నాయకులూ అధికారులూ ప్రగల్భాలు పలుకుతున్నారు. అభివృద్ధి అంటే జీవితాలకు సంబంధం లేనిదనీ, కేవలం అంకెలు మాత్రమేననీ అనుకునేవాళ్లు ఈ ప్రగల్భాలను నమ్ముతున్నారు కూడ.

ఇంతకీ ఈ ప్రత్యేక ఆర్థిక మండలాలు అంటే ఏమిటి? అవి మన దేశంలో ఎందుకు ఏర్పరుస్తున్నారు? అవి మన రాష్ట్రంలోనే ఎందుకు ఎక్కువ ఉన్నాయి? వాటివల్ల మన రాష్ట్రంలోని ప్రజలకూ వనరులకూ ప్రభుత్వానికీ సామాజిక వ్యవస్థకూ ఏమి జరగబోతోంది?

ప్రత్యేక ఆర్థిక మండలాలు అంటే దేశానికీ రాష్ట్రానికీ అవసరమైన ఆర్థిక కార్యకలాపాలు జరపడాన్ని ప్రోత్సహించే ప్రత్యేక విధానాలు అమలయ్యే మండలాలు అని స్థూలంగా అర్థం చెప్పుకోవచ్చు. అవి ఇతర ప్రాంతాలకన్న ప్రత్యేకమైనవి. వాటిలో ఆర్థిక కార్యకలాపాలు, ఆర్థికాభివృద్ధికి అవసరమైన కార్యకలాపాలు జరుగుతాయి. అవి నిర్దిష్టమైన భూభాగంలో ఉంటాయి. ఆ పదబంధంలోని మూడు మాటలకూ మూడు కచ్చితమైన అర్థాలున్నాయి. వీటిని ఎవరు నిర్వహించినా, ప్రభుత్వమే నిర్వచించి ఆ ప్రత్యేకతకు, మండల పరిమితులకూ పూచీ పడుతుంది. అయితే మొత్తం దేశాన్నీ రాష్ట్రాన్నీ సమానంగా చూడవలసిన ప్రభుత్వం కొన్ని మండలాలనే ఎందుకు ప్రత్యేకంగా చూడాలనీ, కొన్ని ప్రాంతాల ఆర్థిక కార్యకలాపాలకే ఎందుకు ప్రాధాన్యత, ప్రత్యేకత చూపాలనీ ప్రశ్నలు రావచ్చు. ఆ ప్రశ్నలకు సమాధానానికి కొంచెం చరిత్రలోకి వెళ్లాలి.

ప్రపంచవ్యాప్తంగా వలసవాద చరిత్ర వల్ల దేశాల మధ్య ఆర్థిక అసమానతలు తలెత్తాయి. సంపన్నమైన సహజ వనరులు ఉన్న దేశాలు పేద ఆర్థిక వ్యవస్థలు గానూ, ఎటువంటి వనరులూ లేకపోయినా అరకొర వనరులతోనైనా కొన్ని దేశాలు సంపన్న ఆర్థిక వ్యవస్థలుగానూ మారిపోయాయి. పదిహేను, పదహారో శతాబ్ది నుంచి ఇరవయో శతాబ్ది మధ్యభాగం దాకా



ప్రపంచంలో సాగిన ఈ వలస వాదం దేశాల మధ్య ఇటువంటి విభజన రేఖను గీయడం మాత్రమే కాక, 'సంపన్న' దేశాల నుంచి వచ్చే సిద్ధాంతాలనూ ఆలోచనలనూ అనుసరించడం తప్ప 'పేద' దేశాలకు మరొక దారి లేదనే అవగాహనను కూడ తయారు చేసింది.

ఈ నేపథ్యంలో రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత వలస పాలన నుంచి విముక్తమయిన దేశాల ప్రభుత్వాల ముందర తాము కూడ 'అభివృద్ధి చెందిన' దేశాలమని అనిపించుకోవడం ఎలా అనే పెద్దప్రశ్న లేచి నిలిచింది. "మా 'అభివృద్ధి' అంతా మా ఎగుమతుల వల్లనే జరిగింది,

### చట్టం ఏం చెపుతుంది?

*కేంద్ర ప్రభుత్వ స్థాయిలో వెలువడిన ది స్పెషల్ ఎకనామిక్ జోన్స్ ఆక్ట్ 2005, ది స్పెషల్ ఎకనామిక్ జోన్స్ రూల్స్ 2006, వాటికి చేసిన సవరణలు, రాష్ట్ర ప్రభుత్వాల స్థాయిలో కొన్ని రాష్ట్రాలలో చట్టాలు, కొన్ని రాష్ట్రాలలో విధాన ప్రకటనలు ప్రత్యేక ఆర్థిక మండలాల విధివిధానాలను నిర్ణయిస్తాయి. ఇవి ఎంత అన్యాయంగా, అక్రమంగా, ప్రజా వ్యతిరేకంగా తయారయ్యాయో వివరించాలంటే వాటిలోని ఒక్కొక్క సెక్షన్ నూ, ఒక్కొక్క వాక్యాన్నీ తీసుకుని వివరిస్తూ పుస్తకమే రాయవలసి ఉంటుంది. సెజ్ వ్యాపారులకు అందిన వరాలలో కొన్ని స్థూలంగా:*

- *సెజ్‌గా ప్రకటించిన భూభాగం 'భారత సుంకాల వసూలు ప్రాంతానికి' బైట ఉన్నదిగా అంటే 'విదేశీ భూభాగంతో సమానమైనది'గా గుర్తించబడుతుంది.*
- *సెజ్‌లో కస్టమ్స్, ఎక్సైజ్ సుంకాల నుంచి మినహాయింపు ఉంటుంది. స్టాంప్ డ్యూటీ, రిజిస్ట్రేషన్ ఫీ, అమ్మకపు పన్ను, విలువ ఆధారిత పన్ను, విలాస పన్ను, వినోద పన్ను లనుంచి మినహాయింపు.*
- *సెజ్‌లో జరిగిన వ్యాపారంపై ఆదాయపు పన్ను కట్టవలసిన అవసరం ఉండదు. ఈ పన్ను సెలవు 10 నుంచి 15 సంవత్సరాల వరకు కొనసాగుతుంది.*
- *సెజ్‌లో మినిమం ఆల్టర్నేట్ టాక్స్, కేంద్ర అమ్మకపు పన్ను, సేవల పన్ను వంటివి ఉండవు.*
- *సెజ్‌లో దిగుమతులపై, అవసరమైన స్థానిక వస్తువులపై సుంకాల రద్దు.*
- *సెజ్ నుంచి జరిగే ఎగుమతుల ఆదాయంపై మొదటి 5 సంవత్సరాలు పన్ను ఉండదు. తర్వాతి ఐదు సంవత్సరాలు 50 శాతం పన్ను ఉంటుంది.*
- *సెజ్‌లో పారిశ్రామిక వివాదాల చట్టం 1947, కనీస వేతనాల చట్టం 1948, ట్రేడ్ యూనియన్ చట్టం 1926, ఆంధ్రప్రదేశ్ షాప్స్ అండ్ ఎస్టాబ్లిష్ మెంట్ చట్టం 1988, పారిశ్రామిక ఉద్యోగాల (స్టాండింగ్ ఆర్డర్స్) 1946 వంటి కార్మిక సంక్షేమ చట్టాలు వర్తించవు. కాంట్రాక్ట్ కార్మికుల నియామకంపై ఉన్న ఆంక్షలు సెజ్‌లలో వర్తించవు.*

ఎగుమతే అభివృద్ధికి చోదకశక్తి, కనుక మీరు కూడ ఎగుమతి ప్రధాన పరిశ్రమలు పెట్టుకోండి. మీ వ్యవసాయాన్ని వదిలిపెట్టండి" అని పెద్ద దేశాల ఆర్థికశాస్త్రవేత్తలు పేదదేశాల రాజకీయ నాయకులకు ఉద్బోధించడం మొదలుపెట్టారు. "మరి అవతలి దేశాల వాళ్ళు కొనుక్కోగలిగిన సరుకులు ఎగుమతి చేస్తే గదా ఫలితం ఉండేది, ఆ మార్కెట్లకు కావలసిన సరుకులు మేమెట్లా తయారు చేసేది" అని ప్రశ్నిస్తే, "సింపుల్, మేం వచ్చి అక్కడ కంపెనీలు పెడతాం, లేదా అక్కడ మా ఏజెంట్లను నియమిస్తాం. మీకు తెలియని సాంకేతిక పరిజ్ఞానం ఇస్తాం. దానివల్ల మీ పారిశ్రామికాభివృద్ధి జరుగుతుంది. మీ వాళ్లకు ఉద్యోగాలు వస్తాయి. మీకు సాంకేతిక పరిజ్ఞానం అందుతుంది. ఆ కంపెనీల సరుకులు మా మార్కెట్లలో మీరు అమ్ముకోవచ్చు. ఆ ఎగుమతి ఆదాయంతో మీరు అభివృద్ధి చెందవచ్చు. కాకపోతే ఈ అభివృద్ధికి కాస్త మూల్యం చెల్లించాలి. మా కంపెనీలు అక్కడికి రావడానికి ఏ ఆంక్షలూ పెట్టకండి. మా కంపెనీలు అక్కడికి రావడానికి ఆకర్షణగా పన్ను రాయితీలు ఇవ్వండి. తక్కువ ధరకు సౌకర్యాలు కల్పించండి. రక్షణ ఇవ్వండి. మీ జాతీయోద్యమ విలువలను మరచిపోండి, ఈస్టిండియా కంపెనీలను అనుమానంగా చూసే మైండ్ సెట్ నుంచి బయటపడండి" అని ఉద్బోధలు సాగాయి.

అలా దక్షిణార్ధ గోళంలోని లాటిన్ అమెరికా, ఆఫ్రికా, ఆసియాలోని అనేక దేశాలలో ఎగుమతి లక్ష్య సంస్థలు (ఎక్స్‌పోర్ట్ ఓరియెంటెడ్ యూనిట్స్ – ఇ.ఒ.యు.) ఎగుమతి ప్రధాన మండలాలు (ఎక్స్‌పోర్ట్ ప్రాసెసింగ్ జోన్స్– ఇ.పి.జెడ్.), స్వేచ్ఛావాణిజ్య మండలాలు (ఫ్రీ ట్రేడ్ జోన్స్ – ఎఫ్.టి.జెడ్.) మొదలయ్యాయి. భారతదేశంలో కూడ ఆ వరుసలోనే 1965లో కాండ్లాలో మొదటి ఎగుమతి ప్రధాన మండలం మొదలయింది. ఆ తర్వాత గడిచిన మూడు దశాబ్దాలలో మరొక ఆరు అటువంటి ప్రత్యేక వాణిజ్య, ఆర్థిక, పారిశ్రామిక మండలాలు ఉనికిలోకి వచ్చాయి. అయితే ఈ మండలాలలో కూడ ఎగుమతి జరిగినదీ, ఉద్యోగ కల్పన జరిగినదీ తక్కువ. ఆ పేరుతో బహుళజాతి సంస్థలకూ, దేశంలోని వారి దళారీలకూ రాయితీలూ మినహాయింపులూ దక్కినది ఎక్కువ. అది వేరే కథ, ఇప్పుడు అవసరం లేదు.

ఇది ఇలా ఉండగానే 1991లో దేశంలో నూతన ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణ విధానాలు ప్రవేశించాయి. వాటిలో భాగంగా దేశదేశాల సంపన్నులకు, బహుళ జాతి సంస్థలకు భారత దేశం ఇష్టారాజ్యపు క్రీడాస్థలం అయిపోయింది. ఆ బహుళ జాతి సంస్థలు అప్పటిదాకా దేశంలో నామమాత్రంగానైనా ఉండిన ప్రజా సంక్షేమ, స్వావలంబన, స్వయం సమృద్ధి చట్టాలను, నిబంధనలను మార్పు చేయమని ఒత్తిడి తేవడం ప్రారంభించాయి. ఆ దశాబ్దంలో మన ఆర్థిక, పారిశ్రామిక, వాణిజ్య, వ్యవసాయ, ద్రవ్య, బ్యాంకింగ్, బీమా, ప్రజారోగ్య, విద్యా రంగాలన్నిటా మార్పులు రావడం మొదలయింది. ఆ క్రమంలోనే కేంద్ర ప్రభుత్వపు ఎగుమతి దిగుమతుల విధానం మారి 1997లో కొత్త విధానం వచ్చింది. ఆ విధానంలో ప్రకటించిన రాయితీలు, మినహాయింపులు కూడ సరిపోవన్నట్టు, 2000 ఏప్రిల్ లో కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని ప్రకటించింది.



## సెజ్ – కళా ప్రతిస్పందన

ఆంధ్రప్రదేశ్ వరకే చూసినా ఏర్పాటయిన, ఏర్పడనున్న 106 సెజ్ ల వల్ల కనీసం నాలుగైదు వందల గ్రామాలు, అంటే కనీసం మూడు నాలుగు లక్షల మంది ప్రజలు ప్రభావితమై ఉంటారు. వీరిలో కొందరి జీవితాలు పూర్తిగా ధ్వంసమై పోయి ఉంటాయి. కొందరి జీవితాలలో అనూహ్యమైన, గణనీయమైన మార్పులు వచ్చి ఉంటాయి. కొందరు తరతరాలుగా సాగిస్తున్న రైతు జీవితం నుంచీ, వివిధ వృత్తుల నుంచీ దూరమై పట్టణాలకో, ఇతర ప్రాంతాలకో వలస వెళ్లి ఉంటారు. పట్టణాలలో రోజువారీ అడ్డా కూలీలుగానో, భవన నిర్మాణ కార్మికులుగానో, చిల్లర వృత్తులలోనో బతుకు ఈడుస్తూ ఉండి ఉంటారు. ఒకప్పుడు వ్యవసాయంలోనూ, చేతివృత్తులలోనూ అద్భుతమైన పంటలకూ వస్తువులకూ సృష్టికర్తలయిన ఎంతో మంది ఇవాళ బిచ్చగాళ్లుగానో, ఇతరుల దయ మీద ఆధారపడేవాళ్లు గానో మారిపోయి ఉంటారు. గ్రామంలో ఏదో ఒకరకమైన ఆస్తి ఉండిన వారికి ఎంతో కొంత నష్టపరిహారం అనబడేది అందినా అది ఈ పాటికి కరిగిపోయి వారి జీవితాలు కూడ శిథిలమైపోయి ఉంటాయి. బహుశా అతి కొద్ది మందికి జీవితం బాగుపడి కూడ ఉండవచ్చు. ఏమైనా ఎంతో కాలంగా తెలిసిన పరిసరాల నుంచీ, పరిచయస్తుల నుంచీ, గ్రామీణ ప్రాంతాలలో ఉండే ఆత్మీయ అనుబంధాల నుంచీ దూరమై పట్టణాలలో అనామకమైన, చాలీచాలని బతుకులు గడుపుతూ ఉన్న వాళ్లెందరో...

మానవ జీవితంలో వచ్చిన ఇంత విస్తృతమైన, లోతయిన మార్పులు కళలలో ప్రతిఫలించక తప్పదు. అందులోనూ సామాజిక సమస్యలకు, మానవ జీవిత ఉద్వేగాలకు ఎప్పటికప్పుడు వాస్తవికంగా, విశ్వసనీయంగా అద్దం పట్టే తెలుగు సాహిత్య కళా రంగాలు ఈ మహా మానవ విషాదాన్ని కూడ ప్రతిఫలించడంలో ఆశ్చర్యమేమీ లేదు. ఈ ఐదు సంవత్సరాలలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సెజ్ ఇతివృత్తంగా దాదాపు ఇరవై కథలు, మరెన్నో కవితలు, పాటలు వచ్చాయి. డజన్ల కొద్దీ వ్యాసాలు వచ్చాయి. చిన్న పుస్తకాలకు, కరపత్రాలకు లెక్కలేదు. ఈ సమస్య మీదనే కేంద్రీకరించి వందలాది చోట్ల సభలు సమావేశాలు జరిగాయి. కనీసం డజను మంది ఉపన్యాసకులు సెజ్ లో ఇమిడి ఉన్న విభిన్న అంశాల మీద వందలాది చోట్ల ఉపన్యాసాలు ఇచ్చారు. అన్నిటికన్న మిన్నగా దినపత్రికలలోనూ, వార్తా ఛానెళ్లలోనూ సెజ్‌ల మీద, సెజ్ వల్ల ప్రజలు అనుభవిస్తున్న ఇబ్బందుల మీద వందలాది వార్తా కథనాలు వచ్చాయి. సూళ్లూరుపేట, తడ, సత్యవేడు సెజ్‌ల వల్ల ఆయాగ్రామాల ప్రజలు ఎదుర్కొన్న సమస్యల గురించి ఆంధ్రజ్యోతి దినపత్రిక ధారావాహిక కథనాలు ప్రచురించింది. తెలుగు సినిమాలలో కూడ సెజ్ ఇతివృత్తం ప్రస్తావనకు వచ్చింది. 'సొంతూరు' సినిమా పూర్తిగా సెజ్ ఏర్పాటయిన పర్యవసానాల మీదనే తయారయింది. సెజ్ సమస్యపై కనీసం మూడు డాక్యుమెంటరీలు పూర్తవుతున్న దశలోనో, అయిపోయో ఉన్నాయి. ఆయా సెజ్ వ్యతిరేక ఆందోళనలు ఉధృతంగా ఉన్న సమయాలలో వెబ్ సైట్లు, బ్లాగులు కూడ నడిచాయి. కొన్ని సాంస్కృతిక సంస్థలు సెజ్ సమస్యపై స్ట్రీట్ ప్లేలు, నాటికలు తయారు చేసి అనేక చోట్ల ప్రదర్శించారు. చాల రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు సెజ్‌ల మీద పుస్తకాలు ప్రచురించాయి. స్వచ్ఛంద సంస్థలు నివేదికలు ప్రచురించాయి.

ఈ కొత్త ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని ప్రకటించినది అప్పుడు అధికారంలో ఉన్న భారతీయ జనతా పార్టీ నాయకత్వంలోని నేషనల్ డెమొక్రటిక్ అలయన్స్ (ఎన్.డి.ఎ.) ప్రభుత్వం. అప్పటికి వాణిజ్య మంత్రిగా ఉన్న మురసోలి మారన్ 2000 మార్చ్ లో చైనా వెళ్ళి వచ్చారు. అక్కడ కార్మికులకు ఏ హక్కులూ లేకుండా వారిని పీల్చి పిప్పి చేసి అతి చౌకగా సరుకులు తయారు చేసి ప్రపంచ మార్కెట్ ను ఆక్రమిస్తున్న సెజ్ విధానాన్ని చూసి ఆయన మురిసిపోయారు. తిరిగిరాగానే భారతదేశంలో కూడ అటువంటి విధానం ఉండాలని ప్రకటించారు. అప్పుడు ప్రతిపక్షంలో ఉన్న కాంగ్రెస్, వామపక్షాలు ఈ విధానాన్ని తీవ్రంగా ఖండించాయి. ప్రతిపక్షాల నిరసనల వల్లనో, మిత్ర పక్షాలలో కొందరిని బుజ్జగించడంలో భాగంగానో ఎన్.డి.ఎ. ప్రభుత్వం ఆ విధానాన్ని అప్పటికి పక్కనపెట్టింది.

కాని ఒకవైపు కేంద్ర ప్రభుత్వం సెజ్ విధానం మీద వెనక్కి వెళుతుండగానే రాష్ట్ర ప్రభుత్వాలు మాత్రం ఆ విధానాన్ని సొంతం చేసుకోవాలని, దొడ్డిదారిన అయినా ప్రవేశ పెట్టాలని ఉవ్విళ్లూరడం మొదలుపెట్టాయి. అందులో ఎన్.డి.ఎ. లో భాగస్వామి అయిన తెలుగుదేశం పార్టీ అగ్రభాగాన ఉండి 2002 ఏప్రిల్ 9న ఒక జి.ఓ. ద్వారా ప్రత్యేక ఆర్థిక మండలాల విధాన చట్రాన్ని ప్రకటించింది. విశాఖపట్నం, కాకినాడలలో సెజ్ ల ఏర్పాటుకు ప్రయత్నాలు ప్రారంభించింది. రాష్ట్రంలో సెజ్‌లు ఏర్పరచడానికి అధీకృత ప్రభుత్వ సంస్థగా ఆంధ్ర ప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషన్ (ఎ.పి.ఐ.ఐ.సి.) ను నియమించింది. ఈ ఎ.పి.ఐ.ఐ.సి. సెజ్‌లకు ఇవ్వడానికి, ఇతర వ్యాపార, పారిశ్రామిక సంస్థలకు ఇవ్వడానికనే పేరుతో ఎలా లక్షలాది ఎకరాలు సేకరించి, రాష్ట్ర చరిత్రలోనే అతి పెద్ద కుంభకోణానికి ద్వారాలు తెరిచిందో ఇటీవల బయటపడుతున్న కొన్ని వాస్తవాలు చూపుతున్నాయి. నిజానికి బయటపడుతున్న వార్తలు ఎపిఐఐసి పేరిట పాలకులు చేయించిన భూకబ్జాలలో పదోవంతు గురించి మాత్రమే.

తెలుగుదేశం పార్టీ ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని అనుసరించడంలో పెద్ద ఆశ్చర్యం లేదు. కేంద్రంలో ఆ విధానాన్ని ప్రతిపాదించిన ఎన్.డి.ఎ. లో అది భాగస్వామ్య పార్టీగా ఉండింది. అలాగే 1995 నుంచే రాష్ట్రంలో ప్రపంచబ్యాంకు అనుకూల ఆర్థిక విధానాలను అమలు చేస్తూ బహుళజాతి సంస్థల కోసం, దేశదేశాల సంపన్నులకోసం పాలనా విధానాలను రూపొందించిన, మార్చిన పార్టీ అది.

కాని ప్రత్యేక ఆర్థిక మండలాల విధానానికి ఒక అనూహ్య దిశ నుంచి ఆశ్చర్యకరమైన ఆహ్వానం అందింది. కేంద్ర ప్రభుత్వంలో తామే విమర్శించిన ఆ విధానాన్ని సి.పి.ఐ. (ఎం) నాయకత్వంలోని వామపక్ష ప్రభుత్వం పశ్చిమబెంగాల్ లో కళ్లకు అద్దుకోవడం మొదలు పెట్టింది. 2003 జూన్ 28న ప్రచురించిన అసాధారణ గెజిట్ ద్వారా పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం మణికంచన్ ప్రత్యేక ఆర్థిక మండలానికి సంబంధించిన విధానాన్ని ప్రకటించింది. ఇందుకోసం ప్రభుత్వం కేటాయించినది కోల్ కత్తా నగరంలోని సాల్ట్ లేక్ ప్రాంతంలో ఐదు ఎకరాల స్థలమే కావచ్చు గాని, సెజ్ ను విదేశీ భూభాగంతో సమానంగా గుర్తించడం ఎందుకు అవసరమో, పన్నుల విధింపులో, విదేశీ పెట్టుబడిలో, ఇతర లావాదేవీలలో ఎంత ఉదారంగా ఉండాలో, స్థానిక నిబంధనలను, ఆంక్షలను ఎలా తొలగించాలో ఈ గెజిట్ లో వామపక్ష ప్రభుత్వం అక్షరాలా రాసింది.



తాము ప్రత్యేక ఆర్థిక మండలాల విధానానికి వ్యతిరేకులమనీ, తమవల్లనే ఆ చట్టంలో సవరణలు వచ్చాయనీ, సెజ్ వ్యతిరేక ఆందోళనకు తామే నాయకులమనీ, తాము పాలిస్తున్న రాష్ట్రాలలో సెజ్‌లు లేనేలేవనీ సి.పి.ఐ. (ఎం), సిపిఐ రెండూ ఇప్పటికీ పెద్ద ఎత్తున వాదిస్తుంటాయి. మొన్నటికి మొన్న విజయవాడలో సి.పి.ఐ. (ఎం) కేంద్ర కమిటీ విస్తృత సమావేశాల సందర్భంగా జరిగిన బహిరంగ సభలో ఆ పార్టీ ప్రధాన కార్యదర్శి ప్రకాశ్ కరత్ తాము పాలిస్తున్న పశ్చిమ బెంగాల్, కేరళ, త్రిపురలలో సెజ్‌లు లేవని అన్నారు. కాని సెజ్ ల గురించి కేంద్ర ప్రభుత్వం నడిపే వెబ్ సైట్ ప్రకారం పశ్చిమ బెంగాల్ లో 37, కేరళలో 28 సెజ్‌లు ఉన్నాయి. అది కేంద్ర ప్రభుత్వం ప్రచారం చేసే అబద్ధమని కొట్టి పారేయదలచుకుంటే, పశ్చిమ బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వ పారిశ్రామికాభివృద్ధి శాఖ నడిపే వెబ్ సైట్ లో సెజ్ కీర్తనలు విస్పష్టంగానే ఉన్నాయి.

సరే, ఆ రాజకీయ అవకాశవాదాన్ని అలా ఉంచితే, 2004 మేలో ఎన్నికలలో గెలిచి గద్దెనెక్కిన కాంగ్రెస్ నాయకత్వంలోని యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్ (యు.పి.ఎ.) ప్రభుత్వం, అధికారంలోకి వచ్చిన మరుక్షణం నుంచీ ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని పునరుద్ధరించే ప్రయత్నాలు మొదలుపెట్టింది. తాను విమర్శించిన పాత విధానాన్నే బిల్లుగా రూపొందించి, మంత్రివర్గ ఉపసంఘ సమావేశంలో కూడ చర్చించి, పార్లమెంటులో ప్రవేశపెట్టింది. ప్రజలకు ఉపయోగకరమైన చట్టాల, విధానాల రూపకల్పనలో ఏళ్లకు ఏళ్లూ దశాబ్దాలూ కూడ తీసుకునే పార్లమెంటు ఈ వినాశకర, ప్రజావ్యతిరేక చట్టాన్ని మాత్రం కొన్ని గంటల్లో, పెద్ద చర్చ లేకుండానే ఆమోదించింది. లోక్ సభలో జరుగుతున్న చర్చలన్నిటినీ యథాతథంగా ప్రచురిస్తున్న లోక్ సభ వెబ్ సైట్ ప్రకారం ఈ బిల్లుమీద చర్చ 2005 మే 10 సాయంత్రం 4.48కి మొదలై, 6.38కి ముగిసిపోయింది. దేశ ప్రజల జీవనోపాధినీ, జీవితాలనూ, వనరులనూ ధ్వంసం చేసే ఈ మహమ్మారి చట్టం ఇంత తక్కువ చర్చతో, నిరాటంకంగా అమలులోకి వచ్చింది.

జరిగిన రెండుగంటల లోపు చర్చలో నలుగురు 'ప్రజా ప్రతినిధులు' మాట్లాడారు, ముగ్గురు మధ్యలో జోక్యం చేసుకున్నారు. మాట్లాడిన నలుగురిలో సి.పి.ఐ. (ఎం)కు చెందిన రూప్‌చంద్ పాల్, సిపిఐ కి చెందిన గురుదాస్ దాస్ గుప్తా కొన్ని చిన్న అభ్యంతరాలు చెప్పినప్పటికీ బిల్లును తాము సమర్థిస్తున్నామని చూపుకోవడానికే ఎక్కువ ప్రయత్నించారు. ఇది చరిత్రాత్మకమైన, అవసరమైన కొత్తదారులు వేసే చట్టం అని సి.పి.ఐ. (ఎం) సభ్యుడు అన్నారు. ఈ చట్టానికి వ్యతిరేకత ప్రకటించి తాము 'అభివృద్ధి నిరోధకులమ'ని పేరు తెచ్చుకోదలచుకోలేదని, ఈ చట్టాన్ని సంపూర్ణంగా స్వాగతిస్తున్నామని సిపిఐ సభ్యుడు గురుదాస్ దాస్ గుప్తా అన్నారు. ఆ చట్టం ఎంత దుర్మార్గమయినదో ఒక్క మాటలో చెప్పాలంటే అది చట్టబద్ధంగానే దేశంలోపల చట్టాలు చెల్లని 'విదేశీ భూభాగాలను' తయారు చేసి పెడుతుంది.

## రాష్ట్రాల వారీ సెజ్‌ల పట్టిక

| రాష్ట్రం | పూర్తి అనుమతి | సూత్రప్రాయమైన అనుమతి | పనిచేస్తున్నవి |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 106 | 4 | 21 |
| చండీఘర్ | 2 | 0 | 1 |
| చత్తీస్‌గఢ్ | 2 | 2 | - |
| ఢిల్లీ | 3 | 0 | - |
| దాద్రా- నాగర్ హవేలీ | 4 | 0 | - |
| గోవా | 7 | 0 | - |
| గుజరాత్ | 47 | 13 | 8 |
| హర్యానా | 45 | 17 | 3 |
| హిమాచల్ ప్రదేశ్ | 0 | 3 | - |
| జార్ఖండ్ | 1 | 0 | - |
| కర్ణాటక | 51 | 10 | 18 |
| కేరళ | 28 | 0 | 6 |
| మధ్య ప్రదేశ్ | 14 | 7 | - |
| మహారాష్ట్ర | 108 | 39 | 14 |
| నాగాలాండ్ | 2 | 0 | - |
| ఒడిషా | 10 | 3 | 1 |
| పుదుచ్చేరి | 1 | 1 | - |
| పంజాబ్ | 8 | 7 | - |
| రాజస్తాన్ | 8 | 11 | 1 |
| తమిళనాడు | 70 | 19 | 16 |
| ఉత్తర ప్రదేశ్ | 34 | 5 | 4 |
| ఉత్తరాఖండ్ | 3 | 0 | - |
| పశ్చిమ బెంగాల్ | 23 | 14 | 2 |
| **దేశం మొత్తం** | **577** | **155** | **95*** |

* పనిచేస్తున్న సెజ్ లలో ఈ 95 మాత్రమే కాక 2005 చట్టం కన్న ముందే దేశంలో కేంద్ర ప్రభుత్వం తరఫున పనిచేస్తున్న సెజ్‌లు 7, వేరువేరు రాష్ట్ర ప్రభుత్వాల కింద పనిచేస్తున్న సెజ్‌లు 12 ఉన్నాయి.

*ఆధారం: కేంద్ర ప్రభుత్వ వాణిజ్య, పారిశ్రామిక మంత్రిత్వ శాఖకు చెందిన వాణిజ్య విభాగం నడిపే వెబ్ సైట్ – http://www.sezindia.nic.in/about-osi.asp*

*ఈ పట్టికను కాస్త జాగ్రత్తగా పరిశీలిస్తే కళ్లు మిరుమిట్లు గొలిపే వాస్తవాలు బయటపడతాయి. పై పట్టికలో దేశంలోని అన్ని రాష్ట్రాలకూ, కేంద్రపాలిత ప్రాంతాలకూ భాగస్వామ్యం లేదు. మొత్తం 28 రాష్ట్రాలలోంచి 19 రాష్ట్రాలకూ, మొత్తం ఏడు కేంద్రపాలిత ప్రాంతాలలోని నాలుగు కేంద్రపాలిత ప్రాంతాలకూ మాత్రమే ఇక్కడ స్థానం దొరికింది. సెజ్ విధానం ప్రవేశపెట్టినది దేశాభివృద్ధి సాధించడానికేనని పాలకులు చెప్పే మాట నిజమే అయితే ఆ విధానం అన్ని రాష్ట్రాలనూ సమానంగా అమలయి ఉండవలసింది. అభివృద్ధి చాల అవసరమైన, వెనుకబడిన ప్రాంతాలు ఈ జాబితాలో ప్రధాన స్థానం పొంది ఉండవలసింది. కాని అటువంటి వెనుకబడిన రాష్ట్రాలయిన ఈశాన్య రాష్ట్రాలలో గాని, బీహార్, కాశ్మీర్ వంటి రాష్ట్రాలలో గాని సెజ్‌లు లేవు. అంటే సెజ్ లకూ అభివృద్ధికీ పెద్ద సంబంధం లేదని ప్రభుత్వం చెప్పకనే చెపుతున్నదన్నమాట.*

*ఇక ఈ పట్టిక నుంచి గుర్తించవలసిన మరొక అంశం అతి ఎక్కువ సెజ్‌లు మహానగరాల చుట్టూరానే ఉన్నాయి. ఢిల్లీ (ఢిల్లీ, ఉత్తర ప్రదేశ్, ఉత్తరాఖండ్, హర్యానా), ముంబై (మహారాష్ట్ర, గుజరాత్, గోవా), కోల్ కత్తా (పశ్చిమ బెంగాల్), చెన్నై (తమిళనాడు, ఆంధ్ర ప్రదేశ్), హైదరాబాద్ (ఆంధ్రప్రదేశ్), బెంగళూరు (కర్ణాటక) లలో విపరీతంగా పెరిగిపోయిన రియల్ ఎస్టేట్ ధరలవల్ల, అక్కడ పెరిగిపోతున్న గృహావసరాలవల్ల అక్కడ సెజ్ పేరుతో భూమి సంపాదించి, దాన్ని రియల్ ఎస్టేట్ గా మార్చి అమ్ముకునే వ్యాపారులే సెజ్ వ్యాపారవేత్తల అవతారం ఎత్తారు తప్ప వారు పారిశ్రామికవేత్తలూ కారు, దేశాభివృద్ధికి అవసరమైన ఏ వ్యాపారమూ చేయదలచినవారు కారు.*

*ఈ పట్టిక ఇంకొక విషయాన్ని కూడ కళ్లకు కట్టినట్టు చూపెడుతుంది. పైన ఉన్న 19 రాష్ట్రాలలోనూ, ఎన్నికలు జరిగి ప్రాతినిధ్య ప్రభుత్వం ఏర్పడే రెండు కేంద్ర పాలిత ప్రాంతాలలోనూ ప్రస్తుతం అధికారంలో విభిన్నమైన రాజకీయ పార్టీలు ఉన్నాయి. భారత జాతీయ కాంగ్రెస్, భారతీయ జనతాపార్టీ చెరి ఆరు రాష్ట్రాలలో అధికారంలో ఉండగా, వామపక్ష ప్రభుత్వాలు రెండు రాష్ట్రాలలో, బిజూ జనతా దళ్ (బిజెడి), ఆల్ ఇండియా అన్నా ద్రవిడ మున్నేట్ర కజగం (ఎఐఎడిఎంకె), ద్రవిడ మున్నేట్ర కజగం (డిఎంకె), శిరోమణి అకాలీ దళ్ , బహుజన సమాజ్ పార్టీ (బి ఎస్ పి) ఒక్కొక్క రాష్ట్రంలో అధికారంలో ఉన్నాయి. ఒక రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన సాగుతోంది. ఈ అధికార పార్టీల తేడాలూ, జెండాల, నినాదాల తేడాలూ ప్రత్యేక ఆర్థిక మండలాల విధానంలో మాత్రం ఎటువంటి తేడానూ చూపడం లేదు. ఈ పార్టీలన్నీ ఒకదానికొకటి ఎదురుబొదురుగా నిలిచినట్టు కనబడతాయి గాని, ప్రచార సాధనాలలో సంఘర్షిస్తున్నట్టు కనబడతాయి గాని, వాస్తవంలో ప్రత్యేక ఆర్థిక మండలాల విధానం లాంటి ప్రజావ్యతిరేక విధానాన్ని పాటించడంలో మాత్రం ఎటువంటి ఘర్షణా లేదు.*

అలా చట్టరూపం ధరించిన సెజ్ విధానం ఇక విశ్వరూపం ప్రదర్శించడం మొదలుపెట్టింది. ఒకవైపు బిల్లు చట్టం కాకముందే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సెజ్‌లు ఏర్పాటు చేసే ప్రయత్నాలు మొదలుపెట్టాయి. సెజ్‌ల పేరుమీద భూమి కబ్జా చేయదలచుకున్న వ్యాపారులు అప్పటికే భూమిని ఎంపిక చేసుకుని దరఖాస్తులు పెట్టుకుని ఉన్నారు. ఒక వ్యాపారి అయితే తనకు కావాలని అడుగుతున్న భూమినే తన చిరునామాగా దరఖాస్తులో చూపాడంటే ఈ వ్యవహారం ఎంత దొంగల దోపిడీగా సాగిందో అర్థమవుతుంది. అలా సెజ్‌లు ఇంతింతై వటుడింతయి బలి చక్రవర్తిని తొక్కివేసిన వామనుడి లాగ ఐదు సంవత్సరాలలోనే పదిలక్షల ఎకరాలకు పైన కబ్జా చేసి ఏడువందల సెజ్‌ల ఆక్టోపస్‌గా దేశమంతా విస్తరించాయి.

ఈ ప్రత్యేక ఆర్థిక మండలాలను ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం చెప్పిన కారణాలలో ప్రధానమైనవి ఆరు: 1. అదనపు ఆర్థిక కార్యకలాపాల కల్పన. 2. సరుకుల, సేవల ఎగుమతికి ప్రోత్సాహం. 3. విదేశాల నుంచీ, దేశం నుంచీ కూడ అదనపు పెట్టుబడికి ప్రోత్సాహం. 4. అదనపు ఉద్యోగ కల్పన. 5. మౌలిక సౌకర్యాల అభివృద్ధి. 6. కొత్త సాంకేతిక పరిజ్ఞానం రావడానికి అవకాశం.

ఈ కారణాలలో ఏ ఒక్కటీ పూర్తిగా నిజం కాదనడానికి గత ఐదు సంవత్సరాల సెజ్ విధానమే సాక్షి. ఇప్పటికి అనుమతి పొందినవీ, వాటిలో నోటిఫై అయినవీ, ఇంకా సూత్ర ప్రాయమైన అనుమతి పొందిన స్థాయిలోనే ఉన్నవీ అన్నీ పక్కనపెట్టినా, ప్రభుత్వ లెక్కల ప్రకారమే పని ప్రారంభించిన సెజ్‌లు 95 ఉన్నాయి. ఈ 95 లో అదనపు ఆర్థిక కార్యకలాపాలు ఏ కొద్దిగానో ఉన్నా, ఆ ప్రాంతాలలో అంతకు ముందు సాగుతుండిన వ్యవసాయ, తదితర వృత్తుల వంటి ఆర్థిక కార్యకలాపాలతో పోలిస్తే అవి చెప్పుకోదగినవేమీ కావు. ప్రభుత్వ గణాంకాలలో సెజ్‌ల ఎగుమతి ఆదాయం అనే పేరుతో రెండు లక్షల కోట్ల రూపాయలు చూపుతున్నప్పటికీ ఆ అంకెను కాస్త జాగ్రత్తగా చూడవలసి ఉంది. ఆ అంకెలో అంతకు ముందు నుంచే పనిచేస్తూ ప్రస్తుతం సెజ్‌లుగా పేరు మార్చుకున్న కంపెనీల ఎగుమతులు కలిసి ఉన్నాయి. ఎగుమతి అనే మాటకు చట్టం ఇచ్చిన నిర్వచనం ప్రకారం ఈ అంకెను మొత్తంగా విదేశీ మారక ద్రవ్య ఆదాయంగా చెప్పడానికి వీలులేదు. అంతకన్న ముఖ్యంగా సెజ్‌లకు ఇస్తున్న రాయితీలు, మినహాయింపులు, పన్ను సెలవులతో పోలిస్తే ఈ అంకె సాధించడానికి పెడుతున్న ఖర్చు ఆదాయంతో సమానమో, ఆదాయం కన్న ఎక్కువో అనిపిస్తుంది. ఇంతచేసీ, మొత్తంగా దేశపు ఎగుమతి ఆదాయంలో ఈ సెజ్‌ల ద్వారా వస్తున్నది ఎక్కువేమీ కాదు.

ఇప్పటికే ఏర్పాటయిన ప్రత్యేక ఆర్థిక మండలాలలో విదేశీ పెట్టుబడి వచ్చినవి చాల తక్కువ. వీటిలో ఎక్కువ భాగం స్థానిక పెట్టుబడిదారులవి, ఇతర దేశాలలో స్థిరపడిన భారతీయులవి, విదేశీ కంపెనీలతో మిలాఖతయి వాటికి శాఖలుగా పని చేసేవి. అలాగే సెజ్‌లుగా ప్రకటిస్తున్న వాటిలో సగానికి సగం ఇప్పటికే పనిచేస్తున్న పారిశ్రామిక, వ్యాపార సంస్థలు. కేవలం 2005 సెజ్ చట్టం కల్పించే సదుపాయాలు పొందడానికే, భూమి సంపాదించ



## సెజ్ వ్యతిరేక ప్రజా పోరాటాలు

*ప్రత్యేక ఆర్థిక మండలాల పేరు మీద పాలక పార్టీలు ఇంత వంచనకూ దోపిడీకి ఒడిగట్టినా, ప్రతిపక్షాలని పేరు పెట్టుకున్న పార్టీలు కూడ ఆ దోపిడీకి పరోక్షంగా సహకరించినా, తమ రక్షణ కోసం ఒక్క ప్రధాన స్రవంతి రాజకీయ పక్షమూ కూడ నిజాయితీతో, చిత్తశుద్ధితో ముందుకు రాకపోయినా, సెజ్ బాధిత ప్రజలు నిరాశ పడలేదు. తమకు వీలయిన పద్ధతిలో, తోచిన రూపాలలో సెజ్‌ల మీద పోరాటాలకు దిగారు. ఈ వినాశకర విధానాన్ని ప్రజలు మౌనంగా అంగీకరించలేదు. పండినా పండకపోయినా, పండితే గిట్టుబాటు ధర రాకపోయినా తమ శాశ్వత జీవనోపాధి వనరుగా ఉన్న భూమిని వదులుకోవడానికి పేద, మధ్యతరగతి రైతాంగం అంగీకరించలేదు. దేశవ్యాప్తంగా సెజ్‌లకు వ్యతిరేకంగా ఆందోళనలు ఉవ్వెత్తున లేచాయి. ప్రతిపక్ష పార్టీల అవకాశవాదాన్ని గుర్తించి కూడ ఎక్కడ వీలయితే అక్కడ, ఎంత తక్కువ కాలానికి సాధ్యమయినా సరే అనుకుని ప్రతిపక్ష రాజకీయ నాయకులను తమ పోరాటంలో భాగం చేసుకున్నారు. స్వచ్ఛంద సంస్థలు, గాంధేయవాదులు, సర్వోదయవాదులు, ప్రజాసంఘాలు, విద్యార్థి యువజనులు, కొన్ని పార్లమెంటరీయేతర పార్టీలూ, మావోయిస్టు పార్టీతో సహా అన్ని నక్సలైటు పార్టీలూ సెజ్ వ్యతిరేక పోరాటాలకు మద్దతు ఇస్తున్నాయి.*

*కళింగనగర్ (ఒరిస్సా), పోస్కో వ్యతిరేక ఆందోళన (ఒరిస్సా), రాయగడ్ (మహారాష్ట్ర), సింగూరు (పశ్చిమ బెంగాల్) పోలేపల్లి, కాకినాడ, సూళ్లూరుపేట, తడ, సత్యవేడు (ఆంధ్ర ప్రదేశ్), జజ్జర్ (హర్యానా), దాద్రీ (ఉత్తర ప్రదేశ్), హాసన్ (కర్ణాటక), గుజరాత్ సెజ్ విరోధి మూవ్‌మెంట్, గోవా మూవ్‌మెంట్ అగెనెస్ట్ సెజ్ వంటి సెజ్ వ్యతిరేక ప్రజా పోరాటాలు చాల సమరశీలంగా, విస్తృత ప్రజా పునాదితో జరిగాయి, జరుగుతున్నాయి.*

*ఉత్తర ప్రదేశ్‌లో జరిగిన సెజ్ వ్యతిరేక ఆందోళనకు మాజీ ప్రధాని వి.పి. సింగ్ నాయకత్వం వహించారు. చనిపోవడానికి కొద్ది ముందు ఢిల్లీలో జంతర్ మంతర్ దగ్గర జరిగిన ఒక సెజ్ వ్యతిరేక నిరసన ప్రదర్శనలో మాట్లాడుతూ ఆయన 'ఈ ప్రత్యేక ఆర్థిక మండలాల నమూనానే ఈ దేశ అభివృద్ధి నమూనా అయితే, తిరగబడక తప్పదు. ప్రభుత్వ విధానాలు ఇలాగే ఉంటే మావోయిస్టుల మార్గమే సరయినదనిపిస్తోంది. నా వయసు అనుకూలిస్తే నేను కూడ వాళ్లలో చేరేవాడినే' అన్నారు. అలాగే, భారత నౌకాదళ ప్రధానాధికారిగా పనిచేసి పదవీ విరమణ పొందిన అడ్మిరల్ రాందాస్ ప్రస్తుతం మహారాష్ట్రలో సెజ్ వ్యతిరేక ఆందోళనకు నాయకత్వం వహిస్తున్నారు. ఇలా దేశానికి ప్రధాన మంత్రిగా పనిచేసిన వ్యక్తి, రాష్ట్రపతి తర్వాత రెండో స్థానంలో పనిచేసిన సైనికాధికారి దగ్గరి నుంచి గాంధేయుల నుంచి, అట్టడుగున తమ భూములు కోల్పోయిన దళితులు, ఆదివాసుల దాకా దేశంలో సెజ్‌ల పట్ల వ్యతిరేకత పెద్ద ఎత్తునే వచ్చింది. ఇటువంటి వ్యతిరేకత వల్లనే గోవా రాష్ట్ర ప్రభుత్వం తాను అనుమతించిన 14 సెజ్‌లను కూడ ఉపసంహరించుకోవలసి వచ్చింది.*

డానికే, పన్నులు ఎగగొట్టడానికే ఆ కంపెనీలు పేరు మార్చుకున్నాయి. హైదరాబాద్ లోనే అలా రాత్రికి రాత్రి సెజ్‌లుగా మారిపోయిన సాఫ్ట్‌వేర్, వస్త్ర, రియల్ ఎస్టేట్ కంపెనీలు ఉన్నాయి. ఇలా జాబితా చూస్తే కొత్త సెజ్‌లు వచ్చినట్టు కనబడుతుంది గాని, అవి కొత్త పెట్టుబడులు కావు, విదేశీ పెట్టుబడులు అసలే కావు. అది కొత్త ఆర్థిక కార్యకలాపాల కల్పన కూడ కాదు.

అలాగే సెజ్‌ల వల్ల బోలెడంత ఉద్యోగ కల్పన జరుగుతుందని, లక్షలాది ఉద్యోగాలు వస్తాయని ప్రభుత్వం చెపుతున్న మాటలో నిజం కన్న అబద్ధం పాలు ఎక్కువ. గత ఐదు

**రాష్ట్రంలో ఏ జిల్లాలో ఎన్ని**

| | | | |
|---|---|---|---|
| ఆదిలాబాద్ | 0 | అనంతపురం | 4 |
| నిజామాబాద్ | 0 | చిత్తూరు | 1 |
| కరీంనగర్ | 1 | నెల్లూరు | 6 |
| మెదక్ | 7 | ప్రకాశం | 1 |
| వరంగల్ | 2 | గుంటూరు | 2 |
| ఖమ్మం | 0 | కృష్ణా | 2 |
| నల్లగొండ | 1 | పశ్చిమగోదావరి | 1 |
| మహబూబ్ నగర్ | 5 | తూర్పు గోదావరి | 3 |
| హైదరాబాద్ | 13 | విశాఖపట్నం | 12 |
| రంగారెడ్డి | 40 | విజయనగరం | 1 |
| కర్నూలు | 1 | శ్రీకాకుళం | 1 |
| కడప | 2 | | |

*ప్రభుత్వం చెప్పే ప్రకారం సెజ్ లక్ష్యాలలో ఒకటి ఆయా ప్రాంతాలలో మౌలిక సౌకర్యాలను అభివృద్ధి చేసి, అంతర్జాతీయ పెట్టుబడి రావడానికి వీలుగా ఉండే ప్రత్యేక ప్రాంతాలుగా తయారు చేయడం. ఈ లక్ష్యం నిజమే అయి ఉంటే ఇప్పటికే అంతర్జాతీయ పెట్టుబడి గణనీయంగా ప్రవహిస్తున్న ప్రాంతాలలో సెజ్‌లు ఏర్పాటు చేయనవసరం లేదు. కొత్త ప్రాంతాలలో ఈ సౌకర్యాలు, రాయితీలు, మినహాయింపులు కల్పించి ఆ ప్రాంతాలను విదేశీ పెట్టుబడి ప్రవేశానికి అనువుగా తీర్చి దిద్దవలసి ఉంటుంది. కాని రాష్ట్రంలో ప్రవేశించిన 106 సెజ్‌లలో హైదరాబాద్‌లోనూ, పరిసరాలలోనూ కలిసి 65 సెజ్‌లు, విశాఖపట్నం పరిసరాలలో 12 సెజ్‌లు ఉన్నాయి. అంటే 80 శాతం సెజ్‌లు ఇప్పటికే మౌలిక సౌకర్యాలు ఏర్పడి ఉన్న, విదేశీ పెట్టుబడి ప్రవేశిస్తున్న ప్రాంతాలలోనే ఉన్నాయన్నమాట. అభివృద్ధి అవసర మైన, మౌలిక సౌకర్యాలు అవసరమైన ప్రాంతాలలోకి అసలు సెజ్‌లు ప్రవేశించనే లేదు. మిగిలిన జిల్లాలలో కూడ జిల్లా కేంద్రాలకు దగ్గరలో,*



సంవత్సరాలలో సెజ్‌లలో ఐదు లక్షల పై చిలుకు ఉద్యోగాలు వచ్చాయని ప్రభుత్వం చెపుతోంది గాని, ఈ అంకె అంతకు ముందు వాగ్దానం చేసిన దానిలో పదో వంతు కూడ కాదు. సెజ్‌లలో పేరు మార్చుకున్న పాత పారిశ్రామిక, వ్యాపార సంస్థలు కూడ ఉన్నాయి గనుక నిజంగా వచ్చిన కొత్త ఉపాధికల్పన ఈ అంకె కన్న తక్కువే గాని ఎక్కువ ఉండదు. దేశంలో మొత్తం సంఘటిత రంగంలో ఉద్యోగుల సంఖ్యతో పోలిస్తే ఈ అంకె సముద్రంలో కాకిరెట్ట. కాకపోతే ఆ ఉద్యోగాలు కల్పించినవారికి రాయితీలు, మినహాయింపులు లేవు, ఈ ఉద్యోగాలు

*ఇప్పటికే రోడ్డు, రైలు మార్గాలు, ఓడరేవు, విమానాశ్రయం, విద్యుత్తు, నీరు వంటి సౌకర్యాలున్న చోట్ల మాత్రమే సెజ్‌లు ఉన్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే సెజ్‌లు ఏర్పాటు చేస్తే మౌలిక సౌకర్యాలు తరలి రావడం కాదు, మౌలిక సౌకర్యాలున్న చోటికే సెజ్‌లు తరలి వచ్చాయి. అందుకు కారణం సెజ్ వ్యాపారుల భూదాహం.*

*ఈ సౌకర్యాలన్నీ ఉన్నచోట భూమి ఖరీదు పెరిగిపోయి ఉంటుంది గనుక, సెజ్ పేరుతో ప్రభుత్వ సహాయంతో ఎకరాలకు ఎకరాలు భూమి ఆక్రమించవచ్చు గనుక మాత్రమే సెజ్ ల మీద ఆకర్షణ పెరిగింది. తీసుకున్న భూమిలో ప్రకటిత లక్ష్యం కోసం 50 శాతం మాత్రం ఉపయోగిస్తే చాలునని, మిగిలిన భూమిని సెజ్ వ్యాపారి ఏమి చేసుకున్నా ఫరవాలేదని చట్టమే చెపుతుంది కాబట్టి ప్రభుత్వం దగ్గరినుంచి చౌకగా ఎకరాల్లో సంపాదించి ఇబ్బడి ముబ్బడి లాభానికి గజాల్లో అమ్ముకోగలిగిన గొప్ప అవకాశం సెజ్ !!*

*కేంద్ర ప్రభుత్వ వాణిజ్య, పారిశ్రామిక మంత్రిత్వ శాఖ సెజ్ ల మీద నడుపుతున్న వెబ్ సైట్ ప్రకారం ఈ వ్యాసం రాస్తున్న సమయానికి రాష్ట్రంలో మొత్తం 106 సెజ్ లకు గాను 13,736 హెక్టార్ల (33,928 ఎకరాల) భూమిని సేకరించి ఇవ్వడం జరిగింది. అయితే ఈ అంకె వాస్తవ భూసేకరణ విస్తీర్ణం కన్న చాల తక్కువ. ఒక చోట ఒక సెజ్ రాబోతున్నదని ప్రపంచానికి తెలియకముందే రాజకీయ నాయకులకు, అధికారవర్గాలకు తెలిసిపోతుంది. ఆ సెజ్ ప్రకటన రాకముందే ఆ చుట్టుపట్ల భూములమీదికి ఈ రాజకీయనాయకుల, అధికారుల తరఫున బ్రోకర్లు గద్దల్లా వాలిపోతారు. ఎప్పుడో ఆరు నెలల తర్వాత సెజ్ ప్రకటన వచ్చి అధికారికంగా వంద ఎకరాల సెజ్ ప్రకటిస్తారేమో గాని, ఈ లోగా ఆ చుట్టూ కనీసం నాలుగైదు వందల ఎకరాలు రైతుల చేతినుంచి బదిలీ అయిపోతాయి. ఇంకా సెజ్ గురించీ, అక్కడికి వస్తాయని నమ్మబలికే పరిశ్రమల గురించీ ఎవరికీ తెలియదు గనుక అప్పటికి ఆ ప్రాంతంలో భూముల మార్కెట్ రేటు తక్కువగానే ఉంటుది. అలా ఆ రైతులు కొన్ని వేల రూపాయలకు ఎకరా చొప్పున అమ్మిన భూమి, కొద్ది నెలల్లోనే వాళ్ల కళ్లముందరే లక్షల రూపాయలకు ఎకరాగా చేతులు మారుతుంది. ఇంకా ప్రాధాన్య ప్రాంతమైతే అది గజాల లెక్కన రాళ్లు పాతుకుని, లే ఔట్లుగా మారి కోట్ల రూపాయలకు ఎకరం చొప్పున కూడ అమ్ముడవుతుంది.*

కల్పించినవారికి అన్ని సదుపాయాలు కల్పిస్తున్నారు. అంతే కాదు, ఈ సెజ్‌ల ఉపాధి కల్పనలో మరొక కిటుకు కూడ ఉంది. చాల సెజ్‌లు రియల్ ఎస్టేట్ రంగంలో వచ్చాయి గనుక, వాటిలో నిర్మాణ పనుల వల్ల తొలిరోజుల్లో ఎక్కువ మంది పనివాళ్లు అవసరం అవుతారు గనుక ఈ అంకె వాపే గాని, నిజమైన బలుపు కాదు. ఈ సెజ్‌లు ఏర్పాటు చేసిన భూములనుంచి, గ్రామాలనుంచి, సముద్ర తీర ప్రాంతాల నుంచి ఉపాధి కోల్పోయిన వారు కనీసం ఇరవై లక్షల మంది ఉంటారు. ప్రభుత్వం చెపుతున్న అంకె నిజమయినదే అనుకున్నా, ఇరవై లక్షల మంది బతుకు కొల్లగొట్టి, ఐదు లక్షల మందికి ఉద్యోగాలు ఇచ్చారన్నమాట.

సెజ్‌ల తో విదేశీ సాంకేతిక పరిజ్ఞానం వస్తుందని కూడ ప్రభుత్వం సమర్థిస్తోంది. కాని ఇప్పటిదాకా వచ్చిన సెజ్‌లలో ఎక్కువ భాగం రియల్ ఎస్టేట్, సాఫ్ట్‌వేర్ సర్వీసులు, గృహ నిర్మాణం, పాదరక్షల తయారీ, లోదుస్తుల తయారీ, బొమ్మల తయారీ, ఔషధాల తయారీ వంటి రంగాలలోనే గనుక వాటిలో మనకు విదేశీ సాంకేతిక పరిజ్ఞానం అవసరమూ లేదు, అది రానూ లేదు. పాత కంపెనీలు కొత్త పేర్లు పెట్టుకోవడం, అవి ఇప్పటికే అనుభవం, పరిజ్ఞానం ఉన్న పారిశ్రామిక, వ్యాపార రంగాలలోనే పనిచేస్తుండడం లాంటి కారణాల వల్ల ఈ సెజ్‌ల ఉత్పత్తులు, సేవలు కొత్తగా ఎగుమతి అయ్యేదీ లేదు, విదేశీ మారకద్రవ్యం రాబడి వచ్చేదీ లేదు.

ఒక్క మాటలో చెప్పాలంటే సెజ్‌లు ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం చెపుతున్న కారణాలన్నీ పచ్చి అబద్ధాలు, వక్రీకరణలు, లేదా అర్ధ సత్యాలు.

సెజ్‌లు రావడానికి అసలు కారణాలు భారతదేశంలో విస్తారంగా భూమి ఉండడం, ఆ భూమి చౌకగా దొరకడం, ఆ భూమిని ప్రభుత్వమే బాధ్యత తీసుకుని సేకరించి తమ చేతుల్లో పెట్టడం. ఈ కారణాలు బహుళజాతిసంస్థలకు, దేశదేశాల సంపన్నులకు నోరూరిస్తున్నాయి. సెజ్ పేరు చెప్పి లక్షలాది ఎకరాల భూమిని హస్తగతం చేసుకోవచ్చు. దాన్ని పరిశ్రమ పేరుతో తీసుకున్నా, నిజంగానే పరిశ్రమలు పెట్టినా, తీసుకున్న భూమిలో సగ భాగాన్ని పారిశ్రామికేతర అవసరాలకు వాడుకోవచ్చు. అసలు పరిశ్రమ, వ్యాపారం అని కూడ అనకుండా నేరుగా రియల్ ఎస్టేట్ కంపెనీ కూడ సెజ్‌గా గుర్తింపు పొందవచ్చు. ఈ అవకాశాల వల్ల విదేశీ, స్వదేశీ సంపన్నులందరికీ ఇది కామధేనువులాగ కనబడుతోంది. అందువల్లనే చాల సెజ్‌లు రియల్ ఎస్టేట్ రంగంలో ఉన్నాయి, రియల్ ఎస్టేట్ లాభసాటిగా ఉండే పెద్ద పట్టణాల పరిసరాల్లో మాత్రమే సెజ్‌లు ఉన్నాయి. దీనితో పాటు సెజ్ పేరు పెట్టుకుంటే పన్నులు తగ్గించుకోవచ్చు. ఎగ్గొట్టవచ్చు. కార్మిక సంక్షేమ పథకాలు అమలు చేయకుండా ఉండవచ్చు. ఇంతకన్న లాభసాటి వ్యాపారం ఎక్కడుంది?

ఇలా భూములను బడా పారిశ్రామిక, వ్యాపార గృహాలకు, సంపన్నులకు అప్పగించడం వల్ల లక్షల ఎకరాలు భూములు – ఆహార పంటలకూ కూరగాయల పెంపకానికీ పశుగణాభివృద్ధికీ చేపల పెంపకానికీ ఉపయోగపడుతున్న భూములు – వ్యవసాయానికి, అనుబంధ వృత్తులకూ దూరం అవుతున్నాయి. దానితో దేశపు ఆహార భద్రతకు విఘాతం కలుగుతుందని, అది



దేశానికి వినాశకరమని ఎం.ఎస్.స్వామినాథన్ వంటి శాస్త్రవేత్తలు కూడ సెజ్ విధానాన్ని విమర్శించారు. సెజ్‌లకు పన్ను రాయితీలు, మినహాయింపులు, పన్ను సెలవుల వల్ల ప్రభుత్వ ఖజానాకు రావలసిన ఆదాయంలో లోటు వస్తుందని కనుక సెజ్ విధానాన్ని హేతు బద్ధం చేయాలని ఆర్థిక మంత్రిత్వ శాఖ కూడ మొదటినుంచీ అభ్యంతరాలు చెపుతోంది. తొలి సంవత్సరాలలో, అంటే సెజ్‌ల సంఖ్య ఇంకా మూడు వందలకు మించనప్పుడే, వాటి వల్ల సాలీనా లక్షకోట్ల రూపాయల పన్ను ఆదాయం తరిగిపోతుందని ఆర్థిక మంత్రిత్వ శాఖ అంది. ఇప్పుడు సెజ్‌ల సంఖ్య రెట్టింపు అయింది గనుక ఆ ఆదాయ లోటు కూడ రెట్టింపు అయి ఉండవచ్చు. ఆహార భద్రతను దెబ్బతీసినా, పన్నుల రాబడిని దెబ్బతీసినా ఫరవాలేదని, తమ ఆశ్రితులకు వేలాది ఎకరాల భూములు, తమకు కోట్ల కొద్దీ ముడుపులు దక్కితే చాలునని ఏలినవారు అనుకుంటున్నారు. ఇది ఏదో ఒక పార్టీకి సంబంధించిన వ్యవహారం కూడ కాదు. అన్ని పార్టీలూ తాము అధికారంలో ఉన్నచోట సెజ్‌లు ఏర్పరస్తున్నాయి, సెజ్‌లను సమర్థిస్తున్నాయి. తాము ప్రతిపక్షంలో ఉన్నచోట సెజ్‌లను వ్యతిరేకిస్తున్నాయి.

ఇక మన రాష్ట్రానికే వస్తే, హైదరాబాద్ చుట్టుపట్ల విపరీతంగా ప్రభుత్వ భూమి, ఉమ్మడి భూమి, వారసులు ఎవరో తెలియని భూమి ఉంది. నిజాం ప్రభువులకు సొంత ఖర్చులకోసం మొత్తం సంస్థానంలోని పది శాతం భూమి – యాభై లక్షల ఎకరాల – భూమి ఉండేది. సర్ఫ్ ఎ ఖాస్ అనే పేరుతో ఉండిన ఆ భూమి 1949లో ఒక చట్టం ద్వారా ప్రభుత్వానికి చేరింది. ఆ సమయానికే జాగీర్దారీ, ఇనాం ల రద్దు వల్ల కూడ లక్షలాది ఎకరాల భూమి భూస్వాముల చెర నుంచి బయట పడింది. అందులో ఎక్కడయినా కౌలుదార్లు ఉంటే కౌల్దారీ రక్షణ చట్టం కింద వారికి అందినది మినహాయించినా, లక్షలాది ఎకరాల భూమి ఈ సర్ఫ్ ఎ ఖాస్ నుంచీ, విదేశాలకు పారిపోయిన పాత జాగీర్దార్ల, దేశముఖుల ఆస్తుల నుంచీ, ఇనాం ల నుంచీ మొదట హైదరాబాద్ ప్రభుత్వానికీ, ఆంధ్ర ప్రభుత్వానికీ, ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికీ మారింది. చాల భూమి ఎవరు యజమానులో తెలియకుండా ఉండిపోయింది. ఈ చరిత్ర వల్లనే ఇప్పటికీ హైదరాబాదులో భూవివాదాలు పెద్ద ఎత్తున సాగుతున్నాయి. ఇలా దేశంలో మరే రాష్ట్ర రాజధానిలోనూ ప్రభుత్వానికి లేనంత భూమి హైదరాబాద్‌లో ప్రభుత్వానికి సమకూరింది. ఆ భూమిని లీజుల పేరు మీద, ప్రజాప్రయోజనం గల సంస్థల పేరు మీద ఉచితంగానో తక్కువ ఖరీదుకో ఇస్తూ పోగా పోగా, మిగిలినదాని మీద ఇప్పుడు సెజ్‌ల పేరు మీద దాడి జరుగుతోంది. మధ్యలో ఈ భూమి నుంచి దళితులకో, వెనుకబడిన వర్గాలకో పంపిణీ చేసిన భూమిని, అసైన్డ్ భూములను కూడ వెనక్కి తీసుకుని సెజ్‌లకు అప్పగించడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. ఇక ప్రభుత్వం పేరు మీద, గ్రామ ఉమ్మడి అవసరాల కోసం ఉన్న భూమిని ప్రభుత్వం తన ఇష్టారాజ్యంగా పందారం చేస్తున్నది.

ఇలా భూమిని ఇవ్వడం పారిశ్రామికాభివృద్ధికేననీ, రైతుల నుంచి భూమిని తీసుకున్నప్పుడు దానికి తగిన నష్ట పరిహారం కట్టి ఇస్తే అభ్యంతరం దేనికనీ అధికారులు, రాజకీయ నాయకులు వాదిస్తున్నారు.

## ఏ రంగంలో ఎన్ని?

*రాష్ట్రంలోని 106 సెజ్ లలో ఆయా పారిశ్రామిక, వ్యాపార రంగాల వారీగా చూస్తే జాబితా ఇలా ఉంది:*

| | | | |
|---|---|---|---|
| ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, ఐటి ఎనేబుల్డ్ సర్వీసెస్ | 57 | కాగితం | 1 |
| బయోటెక్నాలజీ | 13 | ఎలక్ట్రానిక్ హార్డ్‌వేర్ | 1 |
| ఔషధ, రసాయనిక రంగం | 7 | ఆహారపదార్థాలు | 1 |
| వస్త్రాలు, రెడీమేడ్ దుస్తులు | 4 | గృహనిర్మాణ పరికరాలు | 1 |
| గిడ్డంగులు | 3 | వ్యవసాయ పరికరాలు | 1 |
| పాదరక్షలు, తోళ్లు | 2 | ఇంజనీరింగ్ పరికరాలు | 1 |
| వజ్రాలు, రంగురాళ్లు | 2 | ఓడరేవు | 1 |
| విమాన పరికరాలు | 2 | విమానాశ్రయం | 1 |
| అల్యూమినియం శుద్ధి | 2 | వివిధ రకాల వ్యాపారాలు | 6 |

ఈ సెజ్ లన్నిటిలో అవి ఏ పేరు మీద తీసుకున్నారో ఆ పని జరగడం లేదనేది ఒక వాస్తవం. పోనీ, ఉద్దేశించిన పనే జరిగినా అందులోని మర్మమేమిటో ఈ పట్టిక జాగ్రత్తగా చదివితే ఎన్నో నమ్మలేని నిజాలు బయటపడతాయి. చట్టాన్ని ప్రవేశపెట్టినప్పుడు, ఈ విధానాన్ని సమర్థిస్తున్నప్పుడు ప్రభుత్వాలు, రాజకీయ నాయకులు, అధికారులు చెప్పే గంభీరమైన మాటలన్నీ పచ్చి అబద్ధాలని ఈ పట్టికే సాక్ష్యమిస్తుంది. ప్రకటిత లక్ష్యాలయిన విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి రావడానికి గాని, ఉద్యోగ కల్పనకు గాని, సాంకేతిక పరిజ్ఞానం బదిలీకి గాని, ఎగుమతుల ద్వారా విదేశీ మారకద్రవ్యం సంపాదించడానికి గాని ఈ జాబితాలోని సెజ్ వ్యాపారాలలో పదో వంతుకూడ ఉపయోగపడవు.

అతి ఎక్కువ సెజ్ లను ఆక్రమించిన వ్యాపారం ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, ఐటి దోహదకారి సేవలు అనే పేరుతో ఉంది. కాని ఈ జాబితాలో ఉన్న కంపెనీలలో నిజంగా ఐటి కంపెనీలు చాల తక్కువ. “ఐటిలో ఉద్యోగులు పెరగాలంటే వారికి ఇళ్లు, దుకాణాలు కావాలి గనుక అవి కట్టిపెట్టడం కూడ సెజ్ గానే చూడాల”నే తప్పుడు తర్కం మీద ఆధారపడి ఈ వ్యాపారాన్ని ఈ జాబితాలో చేర్చారు. మామూలు గృహ నిర్మాణ కంపెనీలయితే వాళ్లకు కావలసిన భూమి, నిర్మాణ సామగ్రి వాళ్లే కొనుక్కుని, ప్రభుత్వానికి పన్నులు కట్టి, భవనాలు నిర్మించి, ఎంతో కొంత లాభానికి అమ్ముకోవలసి వస్తుంది. కాని అధికారంలో ఉన్నవాళ్లతో కావాల్సిన సంబంధాలు ఉన్నవాళ్లయితే తమను తాము సెజ్ అని పిలుచుకుంటే చాలు, ఇళ్లు కట్టడానికి అవసరమయిన భూమి ప్రభుత్వమే సేకరించి ఇస్తుంది. అది కూడ కారు చౌకగా ఇస్తుంది. అది సెజ్ గనుక ఆ గృహ నిర్మాణాల కోసం కొనే వస్తువుల మీద పన్ను చెల్లించనక్కరలేదు. అక్కడ గృహ నిర్మాణంలో వినియోగించే విద్యుత్తునూ, నీటినీ, రవాణాసౌకర్యాలనూ కారుచౌక ధరలకు పొందవచ్చు. గృహ నిర్మాణ



సమయంలో ఎక్కువమంది కూలీలూ నిర్మాణ కార్మికులూ అవసరమవుతారు గనుక ఈ సెజ్‌లు ఎక్కువమందికి ఉద్యోగ కల్పన చేసినట్టుగా మొదట కనబడుతుంది. కాని ఆ భవనాల నిర్మాణం అయిపోగానే ఆ వందలాది కూలీలను అక్కడినుంచి తరిమేస్తారు. ఓ డజను మంది గార్డుల ఉద్యోగాలు మాత్రమే మిగులుతాయి. అంటే ఈ రియల్ ఎస్టేట్ సెజ్‌లు అసలు పరిశ్రమలూ కావు, పారిశ్రామికాభివృద్ధికి దారి తీసేవీ కావు. వాటిలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడీ లేదు, మనకు తెలియని సాంకేతిక పరిజ్ఞాన బదిలీ లేదు, ఉద్యోగ కల్పనా లేదు, విదేశీమారక ద్రవ్య ఆర్జనా లేదు. పోనీ ఇవన్నీ లేకపోయినా ఆ వ్యాపారం మామూలుగా సాగి ఉంటే ప్రభుత్వానికి వచ్చి ఉండగలిగిన పన్నుల ఆదాయం కూడ లేదు.

ఇక ఐటి కంపెనీల పేరు మీద వచ్చిన సెజ్ లలో కూడ ఎన్నో అక్రమాలున్నాయి. అవి అంతకు ముందు పది పదిహేను సంవత్సరాలుగా ఆ రంగంలోనే పనిచేస్తూ, టాక్స్ హాలిడేల వల్ల పన్నుల రాయితీని అనుభవిస్తూ, ఇబ్బడి ముబ్బడిగా లాభాలు సంపాదిస్తున్న కంపెనీలు. ఆ టాక్స్ హాలిడేలు ముగిసిపోయే సమయానికి సెజ్ చట్టం వచ్చింది గనుక కేవలం రాయితీలను, మినహాయింపులను మరింత కాలం పొడిగించుకోవడానికి, ఉచితంగానో, చౌకధరలకో మరింత భూవసతి పొందడానికి మాత్రమే ఆ కంపెనీలు తమ పాత బోర్డుల కింద బ్రాకెట్లో స్పెషల్ ఎకనామిక్ జోన్ అని రాసుకున్నాయి.

ఇక మిగిలిన వ్యాపార రంగాలన్నీ కూడ ఫక్తు వ్యాపారాలే, విపరీతంగా లాభాలు ఆర్జించే వ్యాపారాలే. వాటికి ప్రభుత్వం ప్రజాధనం వెచ్చించి రాయితీలు ఇవ్వనవసరం లేదు, భూమి ఇవ్వనవసరం లేదు. ఈ మొత్తం జాబితాలో నాలుగైదు మాత్రమే కొత్త సాంకేతిక పరిజ్ఞానం తెస్తున్నాయని చెప్పుకోవచ్చు. నాలుగైదిటిలో మాత్రమే ఎంతో కొంత విదేశీ ప్రత్యక్ష పెట్టుబడి ఉన్నదనవచ్చు, కొన్నిటిలో మాత్రమే కొన్ని వందల ఉద్యోగాలు వస్తాయనవచ్చు. ప్రభుత్వాలు మాత్రం ఈ విధానం ప్రవేశపెట్టినప్పుడు రానున్న ఐదు సంవత్సరాలలో (అంటే 2010 నాటికి) సెజ్ లలో దేశవ్యాప్తంగా ఐదు కోట్ల ఉద్యోగాలు, రాష్ట్రంలో యాభై లక్షల ఉద్యోగాలు వస్తాయని ప్రగల్భాలు పలికాయి. కాని ప్రస్తుతం ప్రభుత్వ లెక్కల ప్రకారమే దేశ వ్యాప్తంగా సెజ్ ఉద్యోగుల సంఖ్య నాలుగు లక్షలకు మించలేదు. మళ్లీ ఈ అంకెలోనూ బోర్డు మార్చుకున్న కంపెనీల ఉద్యోగులెందరో తెలియదు గనుక అసలు అందులో సగమే నిజం కావచ్చు. ఆంధ్రప్రదేశ్ లో వాగ్దానం చేసిన సంఖ్యలో ఉద్యోగ కల్పనలో పదో వంతు కూడ మొత్తం దేశంలోనే జరగలేదంటే, ఈ వ్యవహారం మొత్తం ఎంతటి బందిపోటు అబద్ధాలతో జరిగిందో అర్థమవుతుంది.

ఇక పాదరక్షలు, లోదుస్తుల తయారీ లాంటి కొన్ని రంగాలయితే మన చిన్న పట్టణాలలో కుటీర పరిశ్రమలలాగ, ప్రభుత్వం నుంచి ఏ రాయితీలూ మినహాయింపులూ పన్ను సెలవులూ లేకుండా దశాబ్దాలుగా సాగుతున్నాయి. వాటికి అడిగినంత భూమీ, చౌకధరకు విద్యుత్తూ, నీరూ ఇవ్వడమే సెజ్ విధానం పేరిట ప్రభుత్వ నిర్వాకం.

గత ఐదు సంవత్సరాల చరిత్ర చూస్తే సెజ్‌లకూ పారిశ్రామికాభివృద్ధికీ ఎటువంటి సంబంధమూ లేదని స్పష్టమవుతుంది. కనుక ఆ పేరు మీద భూమి సేకరించడం, పారిశ్రామిక, వ్యాపారవేత్తలకు ఇవ్వడం భూబకాసురుల కొత్త ఎత్తుగడే తప్ప అందులో ప్రజాప్రయోజనం ఏమీ లేదు.

ఇక నష్టపరిహారం విషయానికి వస్తే, ఆ నష్ట పరిహారం అందేది భూమి, ఆస్తి ఉన్నవారికే తప్ప లేనివారికి కాదు. ఇవాళ్టికీ మన గ్రామీణ ప్రాంతాల్లో ముప్పై శాతం మందికి మాత్రమే భూమి ఉంది. మిగిలిన జనాభా ఆ భూమి మీద జరిగే వ్యవసాయం కల్పించే పనుల మీదనే ఆధారపడి ఉన్నారు. వారికి నష్ట పరిహారం ఏమీ ఉండదు. వారి జీవనోపాధి అయిన వ్యవసాయం రద్దయిపోతుంది. ఇక పొట్ట చేత పట్టుకుని వలస వెళ్లవలసి వస్తుంది. నష్టపరిహారం అందినవారికి కూడ, అది ఎంత ఎక్కువ అందినప్పటికీ, తెలిసిన వృత్తి వ్యవసాయం చేసే అవకాశం రద్దయిపోతుంది. వచ్చిన డబ్బు ఉత్పాదకంగా ఖర్చు పెట్టుకునే అవకాశాలు తక్కువగా ఉంటాయి. అందువల్ల ఆ డబ్బు కూడ కొద్ది సంవత్సరాల్లోనే చెయ్యి జారి పోతుంది. పండినా పండకపోయినా శాశ్వత జీవనోపాధి వనరుగా ఉన్న భూమీ పోయి, చేతికి వచ్చిన డబ్బూ అయిపోయి, వారు వీధుల్లో ఖాళీ చేతులతో నిలబడవలసి వస్తుంది.

ఇలా సెజ్‌లు నిర్మూలించిన గ్రామాలలో రైతులు, భూమి లేని ప్రజలు నష్ట పోవడం మాత్రమే కాదు, మరెన్నో సామాజిక అనర్థాలు జరిగాయి. అసైన్డ్ భూములను కొల్లగొట్టారు. అవి అసైన్డ్ భూములు కాబట్టి నష్ట పరిహారం ఇవ్వనక్కరలేదనీ, పట్టాభూములతో సమానంగా ఇవ్వనక్కరలేదనీ అన్నారు. చెరువులు, పచ్చిక బయళ్లు, శ్మశానాలు, బీళ్లు, బంజర్లు, చిట్టడవులు, మడ అడవులు, సముద్ర తీరాలు వంటి గ్రామ ఉమ్మడి భూములను ఆక్రమించారు. ఆక్రమించిన భూముల చుట్టూ కంచెలు వేశారు. కొన్ని గ్రామాలలో శ్మశానాలను ఆక్రమించడంతో చనిపోయినవారిని దహనం చేయడం, ఖననం చేయడం సమస్య అయింది. కొన్ని గ్రామాలలో సెజ్‌లు పాతిన కంచెల వల్ల మల విసర్జనకు ఉపయోగిస్తుండిన బహిరంగ స్థలాలు కరువైపోయాయి. నిజానికి ఈ భూ ఆక్రమణ వ్యవహారంలో సెజ్‌లు ఒక భాగం మాత్రమే. సెజ్‌ల పేరు లేని చోట్ల కూడ ఇతర అభివృద్ధి పథకాల పేరుతో భూముల కైంకర్యం విపరీతంగా జరిగిపోయింది.

ఏది ఏమైనా ఐదు సంవత్సరాల అనుభవం తర్వాత సెజ్ అనేది కేవలం భూకబ్జా సాధనంగా మాత్రమే మిగిలింది గాని అందులో ప్రభుత్వం, పాలకులు చెపుతున్న సామాజిక ప్రయోజనాలేమీ లేవు. అందువల్లనే అన్ని చోట్లా ప్రజలు సెజ్‌లకు వ్యతిరేకంగా తిరగబడ్డారు. తమకు చాతనయిన చోట, అవకాశం ఉన్నచోట, సరయిన నాయకత్వం ఉన్నచోట పాక్షిక విజయాలు కూడ సాధించారు. కాని ఇప్పటికీ ఈ విధానపు దుర్మార్గాన్ని సంపూర్ణంగా, సమగ్రంగా గుర్తించి, దాన్ని రద్దుచేయాలనే ఏకైక డిమాండ్ తో రాష్ట్ర వ్యాపిత, దేశ వ్యాపిత విశాల ప్రజారాశుల సంఘటిత ఉద్యమం నిర్మాణం కావలసే ఉన్నది. అక్కడక్కడా విడివిడిగా జరుగుతున్న



ప్రజా ఆందోళనలన్నిటినీ ఏకం చేసి విస్తృత ప్రజా ఉద్యమం జరిపినప్పుడే ఈ సెజ్‌ల మహమ్మారి తొలగిపోతుంది.

(ప్రత్యేక ఆర్థిక మండలాల మీద విరివిగా వచ్చిన రచనల నుంచి, ఈ రచయితే గతంలో రాసిన 'ప్రత్యేక ఆర్థిక మండలాలు – కొత్త భూస్వామ్యం' (వీక్షణం, డిసెంబర్ 2006), 'ప్రత్యేక ఆర్థిక మండలాలు – రాజకీయార్థిక దృక్పథం' (ప్రత్యేక మృత్యు మండలాలు – సెజ్ లపై పరిశీలనా వ్యాసాలు, ఆగస్ట్ 2008), 'పోలేపల్లిపై విషాదంపై రచన ఎందుకు?' (ఓడిపోలే....పల్లె, మే 2009), 'ప్రత్యేక దోపిడీ మండలాలకు ఐదేళ్లు' (ఈభూమి, మే 2010) ల నుంచి కొన్ని వాదనలను తీసుకోవడం జరిగింది. ఆయా రచయితలకు, సంపాదకులకు కృతజ్ఞతలు)

***ఈభూమి సెప్టెంబర్ 2010***

# 73

# తిండిగింజలు వ్యర్థమయ్యే పందికొక్కుల రాజ్యం

ఆకలిగొన్నవారికి కావలసిన తిండి దొరకక చనిపోవడం, దొరల గుమ్ముల్లో, గరిసెల్లో తిండిగింజలు ముక్కిపోవడం, పందికొక్కులకు ఆహారం కావడం చాలమందికి చాల సంవత్సరాలుగా తెలిసిన కథే. 'అన్నపు రాశులు ఒకచోట, ఆకలి మంటలు ఒకచోట' అని కాళోజీ డెబ్బై సంవత్సరాల కింద రాసినది ఆ స్థితి గురించే. ఆరోజుల్లో ఆ వైపరీత్యానికి కారణం రాజుల నిరంకుశత్వమనో, వలసపాలకుల దుర్మార్గ పాలన అనో, కరువుకాటకాలనో చెప్పుకుని సంతృప్తి పడేవాళ్ళం.

ఆ పాలన రద్దయి అధికారమార్పిడి జరిగి అరవై మూడు సంవత్సరాలు గడిచిపోయాయి. దేశాన్నీ దేశ ప్రజలనూ అభివృద్ధి చేసే లక్ష్యంతో ప్రణాళికలూ పథకాలూ కోట్ల కోట్ల రూపాయల కేటాయింపులూ యథావిధిగా జరిపోతున్నాయి. వ్యవసాయ, పారిశ్రామికోత్పత్తి గణాంకాలలో గణనీయమైన పెరుగుదలా కనబడుతోంది. ఒకటి రెండు సంవత్సరాలు వర్షాభావం ఉన్నా ఆహారభద్రత కోసం కోట్ల టన్నుల ఆహారధాన్యాలు నిలువ చేసుకునే పద్ధతులూ వచ్చాయి. ఇన్ని జరిగిన తర్వాత కూడ ఆకలీ పేదరికమూ తగ్గలేదు. అన్నపు రాశులు కుళ్లిపోవడమూ, పందికొక్కుల (ఇది జంతువు పేరు ఎంతమాత్రం



కాదు, మనుషులలో ఒక రకం) భోజనం కావడమూ జరుగుతూనే ఉన్నాయి. ఇది కూడ పాతకథే.

ఈ పాతకథనే మళ్లీ ఒకసారి చెప్పుకోవలసిన పరిస్థితి దాపురించింది. ఈ వ్యవహారం మీద పది సంవత్సరాలుగా దేశంలోని సర్వోన్నత న్యాయస్థానం ముందర ఎడతెగని ప్రజాప్రయోజన వ్యాజ్యం కూడ నడుస్తున్నది. చివరి తీర్పు ఇవ్వడానికి తాత్సారం చేస్తున్న న్యాయస్థానం రెండు డజన్లకు పైగా మధ్యంతర ఉత్తర్వులు మాత్రం ఇచ్చింది. కాని ఇప్పుడు ఈ కథలో కొంత భాగం సంచలనాత్మకంగా పత్రికలకు ఎక్కేసరికి, సుప్రీంకోర్టు తనకిదంతా ఇప్పుడే తెలిసినట్టు కళ్లెర్రజేసింది. ప్రజా ప్రతినిధులనబడే వాళ్లు తమకూ అప్పుడే తెలిసినట్టు 'అయ్యయ్యో ఎంత ఘోరం జరిగిపోతున్నదో చూడండి' అని లోకసభలో గగ్గోలు పెట్టారు. 'సుప్రీంకోర్టు చెపితే శిలాశాసనమా? ఆ సూచనను వినాలో లేదో ఆలోచిస్తాం' అని సంబంధిత వ్యవసాయ శాఖ మంత్రి, భారత రాజకీయాల్లో చిరకాలంగా ఉన్న వ్యక్తి శరద్ పవార్ అత్యంత బాధ్యతారహితంగా, తాపీగా అన్నారు. మామూలుగా అలుగుటయే ఎరుంగని పరమాత్ముడిగా పేరు పడిన ప్రధానమంత్రివర్యులు డా. మన్మోహన్ సింగ్ కు సుప్రీంకోర్టు మీద కోపం కూడ వచ్చింది. 'సుప్రీంకోర్టు ఇటువంటి విషయాల్లో వేలుపెట్టకుండా తన పని తను చూసుకుంటే మంచిది. అధికారవ్యవస్థ చేసే విధానపరమైన పనుల గురించి న్యాయవ్యవస్థ మాట్లాడగూడదు' అని హెచ్చరించారు. 'శాక్ నా మాటే తీసేస్తారా' అని సుప్రీంకోర్టు మరొకసారి గర్జించింది.

పత్రికలకూ టెలివిజన్ ఛానెళ్లకూ వ్యాఖ్యాతలకూ రాజకీయనాయకులకూ బోలెడంత పని దొరికింది. అన్ని రాజకీయపక్షాలూ ఆందోళనా గాంభీర్యమూ నిండిన తీవ్రమైన ప్రకటనలు చేశాయి. జూలై 28 నుంచి ఇది రాస్తున్న సెప్టెంబర్ 28 దాకా, అంటే అక్షరాలా అరవై రోజులపాటు, న్యాయస్థానంలోనూ, చట్టసభలలోనూ, అధికార యంత్రాంగంలోనూ, సమాజంలోనూ చాల చర్చ నడిచింది. 'అబ్బ ఇంత రభస జరిగింది గదా, అసలు పని ఏమన్నా ముందుకు కదిలిందా' అని మీరు అమాయకంగా చూడబోయారా, పప్పులో కాలు వేసినట్టే. ఎక్కడ వేసిన గొంగడి అక్కడే ఉంది. కథ హాయిగా తన అలవాటు కొద్దీ కంచికే వెళిపోయింది. లేదా వెళ్ళే దారిలో ఉంది. ఇదంతా మిమ్మల్నీ, నన్నూ, మనబోటి వాళ్లనూ మాయ చేసే తతంగమే తప్ప ఏమీ జరగలేదు.

## ఇంతకీ అసలేమిటీ కథ?

మనిషయి పుట్టినందుకు బతికి ఉండాలంటే తినాలి గదా, తింటేనే గదా మనిషిగా మనుగడ సాగించేది? మనిషిగా బతికి ఉంటేనే గదా రాజ్యాంగంలో పందొమ్మిదో అధికరణం హామీ ఇస్తున్న భావ ప్రకటనా స్వేచ్ఛ, వాక్సభాస్వాతంత్ర్యాలు, ఎక్కడికైనా వెళ్లే స్వేచ్ఛ, సంఘం పెట్టుకునే స్వేచ్ఛ, ఏ వ్యాపారమైనా, వృత్తయినా చేసుకునే స్వేచ్ఛ అనుభవించగలిగేది. అంటే ఈ ప్రాథమిక హక్కులు అమలు కావాలన్నా బతికి ఉండాలి గనుక ముందు అసలు తిండి

తినడానికి ఉన్న స్వేచ్ఛ గురించీ, అవకాశం గురించీ మాట్లాడాలి గదా. అధికరణం 21లో హామీ ఇచ్చిన జీవన స్వేచ్ఛకు సుప్రీంకోర్టు వేరు వేరు సందర్భాలలో ఇచ్చిన విస్తృత నిర్వచనాలలో ఆహార స్వేచ్ఛ కూడ అంతర్భాగమవుతుంది గదా, జీవించడమంటే మొదట తినడమే గదా, అందువల్ల ఆహారహక్కును గౌరవిస్తానని హామీ ఇవ్వడం ప్రభుత్వ బాధ్యత కాదా, ఉచితం కాదా (ఉచితం అంటే ధరలేనిది అనే అర్థంలో కాదు, తగినది అనే అర్థంలో) అని ఒక అమాయకపు సంస్థకు మరింత వెర్రి ఆలోచన వచ్చింది. పందికొక్కుల రాజ్యంలో పందికొక్కులకే తప్ప మామూలు మనుషులకు ఆహారహక్కు ఉండడానికి వీలులేదని ఆ సంస్థకు తెలియకపోయింది. ఆ సంస్థ 2001లో నేరుగా సుప్రీంకోర్టునే ఈ ప్రశ్న అడిగింది.

ఆ సంస్థ పేరు పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ – పియుసిఎల్. ఇంత అమాయకపు ఆలోచన చేసినది ఆ సంస్థకు చెందిన రాజస్థాన్ శాఖ. అయితే పాపం సిద్ధార్థుడికి ప్రశ్నలు ఉదయించడానికి వీథుల్లో అనారోగ్యం, మృత్యువు, ఆకలి, దుఃఖం కనిపించినట్టుగానే ఈ పియుసిఎల్ వారికి రాజస్థాన్ లో కనిపించిన ఒక వాస్తవ విచిత్ర సంఘటనే ఈ ప్రజాప్రయోజన వ్యాజ్యానికి మూలం.

పియుసిఎల్ బాధ్యులు కొందరు 2001 తొలిరోజుల్లో జైపూర్ నగర శివార్లలో భారత ఆహార సంస్థ (ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా – ఎఫ్.సి.ఐ.) గోదాములు చూశారు. ఆ మూసి ఉన్న గోదాముల్లో లోపల స్థలం ఉందో లేదో తెలియదు గాని, ఆరుబయట మాత్రం టార్పాలిన్ కప్పి ఉన్న ఆహారధాన్యాల కుప్పలు బోలెడు కనిపించాయి. అంతకుముందు ఎప్పటినుంచి ఆ ఆహారధాన్యాల బస్తాలు ఎండకు ఎండి వానకు తడుస్తూ ఉన్నాయో గాని టార్పాలిన్ ను చీల్చుకుని బైటికి వచ్చిన మొలకలూ కనబడ్డాయి. తిండిగింజలు కుళ్లిపోయిన వాసనా వచ్చింది. అక్కడినుంచి ఐదు కిలోమీటర్ల లోపలే ఉన్న ఒక గ్రామంలో మాత్రం జనం కరువుతో, దారిద్ర్యంతో విలవిలలాడుతున్నారు. ఆ ఊరి జనం 'వరుసల వారీ తిండి' అనే వినూత్న పద్ధతి కనిపెట్టారు. అంటే ఒక కుటుంబంలో కొందరు ఒకరోజు తింటే మరికొందరు మరొకరోజు తింటారన్నమాట. ఉన్న తిండిగింజలు పొదుపుగా వాడుకోవాలంటే ప్రతిమనిషీ వారానికి మూడు రోజులు తింటే సరిపోతుందనే విషాద నిర్ణయానికి వచ్చారు వాళ్లు.

మనిషికి పూటకు కావలసిన రెండువందల గ్రాముల కన్న తక్కువ ఆహార ధాన్యాల గురించి ఆ రాజస్థాన్ జనం ఇటువంటి పద్ధతి కనిపెట్టిన సంవత్సరమే ఎఫ్ సి ఐ గోదాములలో ఆరు కోట్ల టన్నుల (టన్ను అంటే వెయ్యి కిలోలు – అంటే కనీసపక్షం ముప్పై కోట్ల మందికి సరిపోయే ఆహారం) ఆహారధాన్యాల నిలువలు ఉన్నాయి. చట్టప్రకారం దేశంలో ఆహార భద్రతకోసం నిలువ ఉంచవలసినది రెండుకోట్ల టన్నులు కాగా, ఆ సంవత్సరం నాలుగుకోట్ల టన్నులు ఎక్కువ సేకరించి నిలువ చేశారు. నిలువ చేశారనడం కంటే కుళ్లిపోయేలా చేశారు అనడం సమంజసమేమో. ఇంత దారుణమైన, అస్తవ్యస్తమైన పాలనా విధానాలేమిటి అని పియుసిఎల్ కు సందేహం వచ్చింది. ప్రజల ఆహార హక్కు గురించి ప్రభుత్వానికి చెప్పండి



అని సుప్రీంకోర్టులో ప్రజా ప్రయోజన వ్యాజ్యం వేసింది. దానిమీద జరుగుతున్న విచారణలో భాగంగా సుప్రీంకోర్టు ఈ పది సంవత్సరాలలో కొన్ని ప్రజానుకూల నిర్ణయాలను, ఉత్తర్వులను ప్రకటించింది. ప్రజా పంపిణీ వ్యవస్థను కట్టుదిట్టంగా, సక్రమంగా అమలు చేయమని ఆదేశించింది. ఉపాధి హామీ పథకాలను అమలు చేయమని ఆదేశించింది. బడిపిల్లలకు మధ్యాహ్న భోజన పథకాన్ని అమలు చేయమని ఆదేశించింది. సమగ్ర శిశు అభివృద్ధి పథకాన్నీ, అంగన్ వాడీలనూ అమలు చేయమని ఆదేశించింది. దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నవారికీ, ఎగువన ఉన్నవారికీ చౌకధరల దుకాణాలలో తక్కువధరకు తిండిగింజలు సరఫరా చేయమని ఆదేశించింది. ప్రతిరాష్ట్రంలోనూ ఆహారభద్రతా పథకాలు ఎలా అమలవుతున్నాయో పరిశీలించి తనకు క్రమబద్ధంగా నివేదికలు ఇవ్వడానికి యంత్రాంగాన్ని తయారుచేసింది.

ఈ ఆదేశాలన్నీ అమలవుతున్నాయో లేదో, అరకొరగా అమలవుతున్నాయో తెలియదు గాని, ఈ కథలో ఒక కొత్త మలుపు జూలై మూడో వారంలో జరిగింది. ఢిల్లీ నుంచి వెలువడే హిందుస్తాన్ టైమ్స్ పత్రిక ట్రాకింగ్ హంగర్ (ఆకలి పరిశీలన) అనే శీర్షిక కింద ధారావాహిక కథనాలు ప్రారంభించింది. ఆ పత్రిక విలేకరులు సమర్ హల్రంకర్, మన్‌ప్రీత్ రణధవా 'ఇండియా లెట్స్ గ్రేన్ రాట్ ఇన్‌స్టెడ్ ఆఫ్ ఫీడింగ్ పూర్' (తిండి గింజలను పేదలకు పంచే బదులు కుళ్ళిపోనిస్తున్న భారతదేశం) అని జూలై 26 సంచికలో రాసిన వార్తాకథనంలో ఆశ్చర్యకరమైన వాస్తవాలు కొన్ని బయటపెట్టారు.

దేశంలో ప్రస్తుతం ఒక కోటీ ఎనబై లక్షల టన్నుల వరి, గోధుమ ఆహారధాన్యాలు టార్పాలిన్ల కింద ఎటువంటి రక్షణా లేకుండా ఉన్నాయని వాళ్లు రాశారు. మొత్తంగా దేశంలో అప్పటికి భారత ఆహార సంస్థ దగ్గర నిలువ ఉన్న ఐదు కోట్ల తొంబై లక్షల టన్నుల ఆహారధాన్యాలలో నాలుగుకోట్ల ఇరవై లక్షల టన్నులు మాత్రమే పక్కా గిడ్డంగులలో ఉన్నాయి. టార్పాలిన్ల కింద సరైన రక్షణ లేకుండా ఉన్న ఆహారధాన్యాల నిలువలు 2008లో తొంబై నాలుగు లక్షల టన్నులు ఉండగా అవి 2009లో ఒకకోటీ అరవై లక్షల టన్నులకు, 2010 జూన్ 1 నాటికి ఒక కోటీ ఎనబై లక్షల టన్నులకు పెరిగిపోయాయి. వీటిలో కనీసం ఒక కోటి టన్నుల తిండి గింజలను అప్పటికి సంవత్సరం కింద సేకరించి, టార్పాలిన్ల కింద నిలువ చేశారని ఆ వార్తలో రాశారు. అవి కుళ్లిపోతున్నాయని, వాటి విలువ పదిహేడు వేల కోట్ల రూపాయలనీ వాళ్లు రాశారు. ఇంకా నిర్దిష్టంగా పంజాబ్ లో నలభై తొమ్మిది వేల టన్నుల ఆహారధాన్యాలు సేకరించి మూడు సంవత్సరాలు గడిచాయని, ఈ మూడు సంవత్సరాలుగా అవి ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ ఉండిపోయాయనీ రాశారు. ఇలా మూడు సంవత్సరాలు ఉంటే ఆ ఆహారధాన్యాలు మనుషులుగానీ, పశువులుగానీ తినడానికి పనికి రాకుండా పోతాయి.

ఇది ఇలా ఉండగా ఈ కుళ్లిపోతున్న ఆహార ధాన్యాల నిలువలను కాపాడడానికి ప్రభుత్వానికి, భారత ఆహార సంస్థకు సాలీనా కనీసం పదిహేనువేల కోట్ల రూపాయలు ఖర్చవుతున్నాయి. ఈ దుస్థితిని గుర్తించి తమ దగ్గర నిలువలను ఉపయోగకరంగా

వినియోగించమని భారత ఆహార సంస్థ కూడ ప్రభుత్వాన్ని కోరుతూ అనేక లేఖలు రాసింది. దేశంలోని పేద జిల్లాలుగా గుర్తించిన 150 జిల్లాలలో ఈ ధాన్యాన్ని ఉచితంగా పంపిణీ చేస్తే బాగుంటుందని కూడ ఎఫ్.సి.ఐ. సూచించింది. ఆ సూచనలన్నిటినీ ప్రభుత్వం బుట్టదాఖలు చేసిందని చెప్పనక్కరలేదు.

అప్పటికే సుప్రీంకోర్టులో ఆహారహక్కు మీద వ్యాజ్యం నడుస్తున్నది గనుక ఈ హిందుస్తాన్ టైమ్స్ వార్త అక్కడ ప్రస్తావనకు వచ్చింది. పియుసిఎల్ న్యాయవాది కాలిన్ గాన్ సాల్వెస్ ఆ వార్త చదివి వినిపించారు. న్యాయస్థానంలో ధర్మాసనంపై ఉన్న న్యాయమూర్తి జస్టిస్ దల్వీర్ భండారీ ఒక పేద దేశంలో ఆహారాన్ని ఇలా దుర్వినియోగం చేయడం నేరమని వ్యాఖ్యానించారు. ఈ వార్త మీద ప్రభుత్వం తన ప్రతిస్పందనను తెలియ జేయాలనీ, ఇలా ఆహారం కుళ్లిపోతున్న ఆరు రాష్ట్రాల ప్రభుత్వాలు తమ సంజాయిషీ చెప్పాలనీ న్యాయమూర్తులు ఆదేశించారు. 'మీకు ఆహార ధాన్యాలను నిలువ చేయడం రాకపోతే, దాన్ని పేదలు తినడానికైనా ఇవ్వండి' అని భారత ప్రభుత్వానికి ప్రాతినిధ్యం వహిస్తున్న అడిషనల్ సొలిసిటర్ జనరల్ మోహన్ పరాశరన్ మీద న్యాయమూర్తులు కోప్పడ్డారు. ఆ తర్వాత వాయిదాలో ఆగస్ట్ 12న తిండిగింజలను పేదలకు పంపిణీ చేయమని స్పష్టంగా ఆదేశాలు ఇచ్చారు.

అప్పటికి పార్లమెంటు సమావేశాలు జరుగుతున్నాయి గనుక ప్రతిపక్షాలు దీన్ని ఒక అనువైన ఆయుధంగా చూశాయి. నిజానికి ఆ ప్రతిపక్షాలు అధికారంలో ఉన్నప్పుడు కేంద్రంలోనూ, ఇప్పటికీ అధికారంలో ఉన్న రాష్ట్రాలలోనూ ఇదే పరిస్థితి కొనసాగుతోంది. ఇక్కడ ఎవరూ ఈ దుర్మార్గానికి అతీరులు కారు. కాని, భారతీయ జనతా పార్టీ, వామపక్షాలు, ఇతర ప్రతిపక్షాలు ఈ అవకాశాన్ని చేజారనీయదలచుకోలేదు. కుళ్లిపోతున్న తిండిగింజల సమస్య అధికారపక్షం మీద దాడిచేయడానికి చేతికి అందివచ్చిన సమస్యగా ప్రతిపక్షాలు భావించాయి. వారి విమర్శలకు జవాబు చెపుతూ వ్యవసాయ శాఖ మంత్రి శరద్ పవార్ న్యాయస్థానం పేదలకు తిండిగింజలు పంపిణీ చేయమని ఆదేశమేదీ ఇవ్వలేదనీ, తాము ఆ ఆదేశాన్ని పరిశీలిస్తున్నామనీ అన్నారు. ప్రధాని డా. మన్మోహన్ సింగ్ అలా ఉచితంగా పంపిణీ చేయడం సాధ్యం కాదనీ, అయినా సుప్రీం కోర్టు ఇటువంటి విషయాల్లో వేలు పెట్టకూడదనీ అన్నారు.

ఈలోగా ఆహార సబ్సిడీ వినియోగంపై పార్లమెంటు స్టాండింగ్ కమిటీ నివేదిక ఒకటి కూడ చర్చకు వచ్చింది. విలాస్ ముత్తెంవార్ నాయకత్వంలోని ఈ స్టాండింగ్ కమిటీ ఆహార సబ్సిడీ వ్యవహారంలో ప్రభుత్వమూ, ఎఫ్ సి ఐ అస్తవ్యస్తంగా పనిచేస్తున్నాయని విమర్శించింది. ప్రతిఏటా ప్రణాళికా సంఘం వందల కోట్ల రూపాయలు కొత్త గిడ్డంగుల నిర్మాణం కోసం కేటాయిస్తున్నప్పటికీ, అవినీతి, ఆశ్రిత పక్షపాతం, నిర్లక్ష్యం వల్ల ఆ నిర్మాణాలు సాగడం లేదనీ, అందువల్ల తిండిగింజలను ఆరుబయట నిలువ చేసి, కుళ్లిపోయేలా చేయవలసి వస్తున్నదని ఈ స్టాండింగ్ కమిటీ విమర్శించింది.



ఆగస్ట్ 31 న సుప్రీంకోర్టు న్యాయమూర్తులు ఈ విషయాన్ని మళ్లీ ఒకసారి పరిగణన లోకి తీసుకున్నారు. 'మేం చేసింది సూచన కాదు. అది మా ఆదేశం. అది మా ఆదేశంలో అంతర్భాగం. మీ మంత్రికి చెప్పండి' అని జస్టిస్ భండారీ, జస్టిస్ దీపక్ వర్మ ప్రభుత్వ న్యాయవాదికి తీవ్రంగానే చెప్పారు.

ఆ తర్వాత ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ నాయకత్వాన సమావేశమైన మంత్రివర్గ సమావేశం ఇరవై ఐదు లక్షల టన్నుల ఆహార ధాన్యాలను మాత్రం విడుదల చేయాలనీ, అవి కూడ ఉచితంగా కాక దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న కుటుంబాలకు వర్తించే ధరలకు అమ్మాలనీ నిర్ణయించింది. కాని ఈ నిర్ణయం ఎప్పటికి అమలవుతుందో తెలియదు. ఈ లోగా సుప్రీంకోర్టు ఈ వ్యవహారాన్ని అక్టోబర్ 18కి వాయిదా వేసింది. కుళ్లిపోతున్న తిండిగింజలు మరో రెండు నెలలు ఎక్కువ కుళ్లిపోయాయి.

అలా కుళ్ళిపోతున్న తిండి గింజలు మొత్తం ఫ్రాన్స్ దేశ పౌరులు ఏడాదిపాటు తినే తిండికి సమానం. అలా కుళ్ళిపోతున్న తిండిగింజలు 21 కోట్ల మంది భారతీయులకు ఏడాది పాటు తిండి పెట్టగలుగుతాయి. ఇలా ఒకవైపు విలువైన ఆహారధాన్యాలు కుళ్లిపోతుండగా దేశంలో కనీసం 15 కోట్ల మంది రోజుకు ఒక పూట తిండి తోనే గడపవలసి వస్తున్నదని అనేక అధ్యయనాలు తెలియజేస్తున్నాయి. దేశంలోని చిన్నారి పిల్లలలో సగం మంది పోషకాహార లోపాల వల్ల బాధపడుతున్నారు. ఈ ప్రాతిపదికన భారతదేశం దుర్భర దారిద్ర్యంలో ఉన్న సహారా ఎడారిలోని దేశాలకన్న వెనుకబడి ఉంది. అంతర్జాతీయ ఆహార విధాన పరిశోధనా సంస్థ ప్రతి సంవత్సరం తయారు చేసే ప్రపంచ అన్నార్తుల సూచిక ప్రకారం ఎనభై ఎనిమిది దేశాల జాబితాలో భారతదేశం అట్టడుగున 66వ స్థానంలో ఉంది. ప్రపంచంలోని అన్నార్తులలో నలుగురిలో ఒకరు భారతదేశంలోనే ఉన్నారు. అంకెల్లో చెప్పాలంటే వీరి సంఖ్య 23 కోట్లు. దేశంలో నలభై ఆరు కోట్ల మంది రోజుకు రు. 56 కన్న తక్కువ వినియోగంతో బతుకుతున్నారు. వారికి తిండి పెట్టలేని మన మహా ఘనత వహించిన సమాజం, వెలిగిపోతున్న భారతదేశం, అగ్రరాజ్యంగా ఎదగబోతున్న, వేగవంతమైన అభివృద్ధిని సాధిస్తున్న దేశం, ఐక్యరాజ్యసమితి భద్రతాసమితి సభ్యత్వం కోసమూ, కామన్ వెల్త్ క్రీడల నిర్వహణా గొప్పల కోసమూ ఎగబాకుతున్నది.

గింజ గింజ మీద తినేవాడి పేరు రాసి ఉంటుంది అని హిందీ/ఉర్దూ సామెత. విధిని నమ్మదలచుకున్నవాళ్లు అది నమ్మవచ్చు గాని వాళ్లయినా, విధిని నమ్మనివాళ్లయినా తప్పనిసరిగా గుర్తు పెట్టుకోవలసిందేమంటే, గింజ గింజ మీద రాసి ఉండేది అది దొరకక పస్తుపడుకున్నవారి పేరు. గింజ గింజకూ అంటి ఉండేది అది పండించినవారి చెమటా నెత్తురూ. ఒకగింజ, ఒక మెతుకు మన నోట్లోకి వెళుతున్నప్పుడు తలచుకోవలసింది ఆ ఇద్దరి గురించీ – ఆ మెతుకు దొరకని వారి గురించీ, ఆ మెతుకు పండించిన వారి గురించీ. ఇవాళ దేశంలో మురిగిపోతున్న, కుళ్లిపోతున్న కోట్లాది టన్నుల తిండిగింజలన్నిటి మీద ఆ గింజలు దొరికి ఉంటే బతికి

ఉండగలిగిన అభాగ్యుల పేర్లు ఉన్నాయి. వ్యవసాయం గిట్టుబాటుకాని వృత్తిగా మారిపోయినా, మరొక దిక్కులేక ఆ పంటలు పండించి ఎఫ్.సి.ఐ. గోదాములలో నింపి రాలిపోయిన లక్షలాది రైతు కూలీల చెమటా నెత్తురూ ఉన్నాయి. పియుసిఎల్ అడిగిందనో, పత్రికలు రాశాయనో, సుప్రీంకోర్టు చెప్పిందనో, శరద్ పవార్లూ మన్మోహన్ సింగులూ గంభీర ప్రవచనాలు చేస్తున్నారనో కాదు, మనుషులం అయినందుకు, రోజూ మూడు పూటలో రెండు పూటలో తినగలిగే అవకాశం దొరికినందుకు, ఆ అవకాశాలు కోల్పోయిన కోట్లాది అభాగ్యులకోసం, ఆ ఆకలిగొన్న నోళ్లకు అందకుండా గోదాముల్లో మురిగిపోతున్న తిండిగింజల గురించి అడగవలసి ఉంది. ఇది మన సమస్య కాదని ముఖం పక్కకు తిప్పుకోవడానికి వీల్లేదు. ఇది అక్షరాలా, మెతుకు మెతుకునా మన సమస్యే. మానవత్వం సమస్యే.

***ఈభూమి అక్టోబర్ 2010***



# 74

# మన్మోహన మాయాజాలం

'మంచోడు మంచోడు అంటే మంచం విరగ్గొట్టాడు' అని సామెత. తరతరాల వివేకం నిక్షిప్తమైన ఆ మాటను ఈ దేశ ప్రధానమంత్రి డా. మన్మోహన్ సింగ్ అక్షరాలా నిజం చేస్తున్నారు.

క్షీరసాగర మథనంలో సమానపాత్ర వహించిన రెండు పక్షాలలో ఒక పక్షానికి ఫలితం ఇవ్వకుండా ఎగ్గొట్టడానికి పురాణదేవతలు విష్ణుమూర్తి చేత మోహినీ రూపం ఎత్తించారు. మైమరపింపజేసిన ఆ జగన్మోహిని తన టక్కుటమారాలతో ఒక పక్షాన్ని మోసగించి వారికి అమృతం దక్కకుండా చేసింది. ఆ మోహిని లాగనే, 'ఉత్తముడు, మంచి బాలుడు, నిరాడంబరుడు, నిజాయితీపరుడు, మహామేధావి' అని పేరున్న మరొక మోహనుడి అవతారం రెండు దశాబ్దాలుగా ఆధునిక భారతాన్ని ప్రభావితం చేస్తున్నది. కోట్లాది శ్రమజీవుల ఫలితం ఎగ్గొట్టి పిడికెడు మంది దేశీయ సంపన్నులకు, వారి వెనుక ఉన్న బహుళజాతి సంస్థలకు అమృతం ధారపోయడానికి వచ్చాడు ఈ మన్మోహనుడు.

ప్రపంచ బ్యాంకుకూ, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థకూ సన్నిహితుడైన మన్మోహన్ సింగ్ ఎక్కడా ఎన్నిక కాకుండానే సరాసరిగా దేశానికి ఆర్థిక

మంత్రి స్థానంలోకి వచ్చి కూచున్నారు. నిజం చెప్పాలంటే 1991 ఎన్నికలలో ఈ ఒక్కటే కాదు, చాల విచిత్రాలు జరిగాయి. మూడు విడతలుగా జరిగిన ఆ ఎన్నికలలో మొదటి విడత తర్వాత రాజీవ్ గాంధీ హత్య జరిగింది. ఆ తర్వాత రెండు విడతలు కొన్నాళ్లు వాయిదా పడ్డాయి. అంత కీలకమైన పరిస్థితుల్లో అయినా మొత్తం మీద 53 శాతం వోటర్లు మాత్రమే వోట్లు వేశారు. అంటే దేశ జనాభాలో సగభాగం ఆ ఎన్నికల్లో తమ అభిమతం తెలియజేయలేదు. అభిమతం తెలియజేసినవారిలో ఎందరిది నిజమైన అభిమతమో, మరెందరు ఏయే ప్రలోభాలకు లోబడి తెలిపారో, అసలు వారి పేరు మీద మరెవరు బాలట్ పత్రాల మీద ముద్రలు గుద్దారో తెలియదు. మొత్తం మీద పోలయిన వోట్లలో అత్యధిక స్థానాలు తెచ్చుకున్న భారత జాతీయ కాంగ్రెస్‌కు 35 శాతం వోట్లు, 244 స్థానాలు మాత్రమే వచ్చాయి. ప్రభుత్వం ఏర్పరచడానికి అవి సరిపోవు గనుక ఇతర చిన్నా చితకా పార్టీల మద్దతుతో మైనారిటీ ప్రభుత్వంగానే అది ఐదు సంవత్సరాలు కొనసాగింది. మైనారిటీ ప్రభుత్వంగా ఉంటూనే అది దేశ రాజకీయార్థిక వ్యవస్థలో గణనీయమైన, కీలకమైన మార్పులెన్నో చేసింది. లోకసభలో మూడింట రెండు వంతుల ఆధిక్యత ఉన్నప్పుడు కూడ చేయలేని పనులు ఈ మైనారిటీ ప్రభుత్వం చేయగలిగిందంటే, దాన్ని ప్రధాన ప్రతిపక్షంగానీ, వామపక్షాలు గానీ అడ్డుకోలేదంటే, ప్రపంచీకరణ విధానాల అమలుకు పార్లమెంటరీ రాజకీయ పక్షాలన్నిటి ప్రత్యక్ష, పరోక్ష మద్దతు ఉందని తేటతెల్లమవుతుంది.

అటువంటి ప్రభుత్వంలో మిగిలిన మంత్రులందరికన్న ముందు ఆర్థికశాఖ మంత్రిగా ఎంపిక అయినవాడు, ప్రధానికన్న ముందుగానో, ప్రధానితో సమానంగానో రానున్న ప్రభుత్వ విధానాన్ని ప్రకటించినవాడు డా. మన్మోహన్ సింగ్. ఆ ఐదు సంవత్సరాలలో సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ నినాదాలతో నూతన ఆర్థిక, వాణిజ్య, పారిశ్రామిక విధానాలను ప్రకటించి, అమలుచేసి దేశ వనరులమీద, దేశ మార్కెట్ల మీద విదేశీ పట్టును పెంచడంలో ఆయనదే కీలక పాత్ర. ప్రభుత్వ రంగ పరిశ్రమలను ప్రైవేటీకరించడంలో, వ్యవసాయరంగానికి, ప్రజా పంపిణీ వ్యవస్థకూ, సంక్షేమరంగాలకూ నిధుల కేటాయింపులను తగ్గించడంలో, ద్రవ్య, బీమా రంగాలను మార్కెట్ శక్తులకు అప్పగించడంలో, ప్రజాసంక్షేమ చట్టాలను రద్దు చేయడంలో, సవరించడంలో తన మంత్రిత్వ శాఖలో ఆయన తీసుకున్న చర్యలు, ఇతర మంత్రిత్వశాఖలలో ఆయన ప్రోత్సహించిన చర్యలు దేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక వ్యవస్థల మీద లోతయిన, ప్రమాదకరమైన ప్రభావాన్ని చూపాయి.

ఆ తర్వాత జరిగిన మూడు ఎన్నికలలో కాంగ్రెస్ అధికారం చేపట్టలేకపోయినా, 2004లో మొదటిసారి కాంగ్రెస్ నాయకత్వంలోని యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్ (యుపిఎ) అధికారంలోకి రాగానే ఆయన రాజ్యసభ సభ్యుడిగా ప్రధానమంత్రి అయిపోయారు. 2009 ఎన్నికలలో లోకసభ అభ్యర్థిగా దక్షిణ ఢిల్లీ నియోజకవర్గం నుంచి పోటీచేసి ఓడిపోయినా, మళ్లీ కూడ ఎక్కడా గెలవకుండానే ప్రధానమంత్రి స్థానంలోనూ కూచోగలిగిన మన్మోహన రూపం ఆయనది.



భారత ముడిసరుకులను, వనరులను, మార్కెట్లను కొల్లగొట్టదలచిన బహుళజాతిసంస్థలు, అంతర్జాతీయ ద్రవ్యసంస్థలు – మరో మాటల్లో క్షీరసాగర మథనం తర్వాత అమృతం తామే దొంగిలించాలనుకున్న దేవతలు – 1991లోనూ, 2004 లోనూ, 2009లోనూ ఆయనను ఆ స్థానంలో కూచోబెట్టాయి. (కూచోబెట్టినది మన ప్రజలూ ప్రజాప్రతినిధులూ కాదా, దేశదేశాల సంపన్నులా, ప్రపంచ బ్యాంకా అని ఆశ్చర్యపోకండి. మన కేంద్ర మంత్రివర్గంలో స్థానాలను నీరా రాడియాలూ బర్ఖా దత్ లూ వీర్ సంఘ్వీలూ ఇప్పించగాలేనిది, రతన్ టాటాలూ ముకేశ్ అంబానీలూ తమ ప్రయోజనాలు కాపాడగల, తాము వరించిన బంట్లే ఆయా సంబంధిత శాఖల మంత్రులుగా ఉండాలని, తమ మాట వినని వారు మంత్రులు కాగూడదని చెప్పి మెప్పించగా లేనిది అంతకన్న ఎంతో బలమైన అంతర్జాతీయ దొంగల ముఠాలు, బహుళజాతి సంస్థలు ఈ పదవులను ఇప్పించలేవా?)

అందువల్ల తనను ఆ స్థానంలో ప్రతిష్టించిన వారికి అమృతం అందించడమే ఆ మోహిని పని. ఆ పనిని సమర్థించుకునే వాదనలు తయారు చేయడం, ఈ మోసాన్ని ఇతరులు గ్రహించకుండా ఉండడానికి తన వ్యక్తిగత నిజాయితీని, నిరాడంబరత్వాన్ని, నిస్సహాయతను ప్రదర్శిస్తూ ఉండడం, తనను నియమించినవారి స్తోత్రగీతాలు పాడడం ఈ మోహిని పనులలో కొన్ని. ఈ చివరి పని ఎంత నిస్సిగ్గుగా జరిగిందో చరిత్రకెక్కింది. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం ఆయనకు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేసినప్పుడు, 2005 జూలై 8న ఆయన ధన్యవాదాలు తెలిపే ఉపన్యాసం చేశారు. ఆ ఉపన్యాసంలో ఆయన ప్రస్తుత బహుళజాతి సంస్థలను మాత్రమే కాదు, మూడు శతాబ్దాలపాటు భారత ప్రజల మూలుగులు పీల్చి పిప్పి చేసిన బ్రిటిష్ వలసవాదాన్ని కూడ వేనోళ్ల ప్రశంసించారు. బ్రిటిష్ వ్యతిరేక భారత జాతీయోద్యమానికి నాయకత్వం వహించానని చెప్పుకునే పార్టీ ప్రభుత్వాధినేత బ్రిటిష్ పాలనను సమర్థించడం ఉచితమా అనే ప్రశ్నకూడ ఆయనకు తలెత్తలేదు. స్వయంపాలనకు సత్పరిపాలనకు పోటీ తెచ్చి, బ్రిటిష్ ప్రభుత్వానిది సత్పరిపాలన అని కితాబు ఇచ్చారు. జలియన్ వాలాబాగ్ నీడలో అమృత్‌సర్ లో విద్యాభ్యాసం చేసిన వ్యక్తే ఆ నెత్తుటి సాక్షిగా బ్రిటిష్ పాలనను సత్పరిపాలన అని కీర్తించారు.

ఇక మిగిలిన రెండు పనులు, తన ప్రభుత్వం చేసే ప్రజావ్యతిరేక, దేశవ్యతిరేక కార్యక్రమాలను సమర్థించుకోవడం, తన వ్యక్తిగత నిజాయితీ మాటున అసలు విషయాలు దాటవేయడం ఎప్పుడూ జరిగేవే అయినా మొన్నటికి మొన్న ఫిబ్రవరి 16న దేశంలోని టెలివిజన్ ఛానళ్ల సంపాదకులతో ఆయన జరిపిన సమావేశంలో వచ్చిన ప్రశ్నలకు ఆయన చెప్పిన జవాబులు చదివి తీరవలసినవి.

ఆయన ప్రధానిగా మొదటి పాలనా కాలంలో ఐదు సంవత్సరాలలో రెండే రెండు సార్లు పత్రికా సమావేశాలు నిర్వహించారని పత్రికలు రాస్తున్నాయి. ఇక రెండో పాలనా కాలంలో పదవిలోకి రాగానే ఒకసారి పత్రికా సమావేశం నిర్వహించారు గాని, ఒక సంవత్సరానికి పైగా అనేక కుంభకోణాల ఆరోపణలతో దేశం హోరెత్తిపోతున్నా, తన మీద వ్యక్తిగతంగానూ, ప్రభుత్వం

మీదా, మంత్రులమీదా అనేక విమర్శలు సాగుతున్నా వాటికి జవాబు చెప్పాలని, వివరణలు ఇవ్వాలని, తనవైపు వాదనలు వినిపించాలని ఆయన ప్రయత్నించలేదు.

అటువంటి నేపథ్యంలో, ప్రత్యేకంగా 2జి స్పెక్ట్రం, ఎస్ బ్యాండ్ స్పెక్ట్రం కుంభకోణాలు బయటపడిన తర్వాత, 2జి కుంభకోణంపై విచారణకు సంయుక్త పార్లమెంటరీ సంఘాన్ని నియమించడం ససేమిరా కుదరదని పార్లమెంటు సమావేశాల కాలాన్నంతా వృథా చేసిన తర్వాత ఆయన స్వయంగా టెలివిజన్ సంపాదకులకు సమయం ఇవ్వడం చాల ఆహ్వానించదగిన, గుర్తించదగిన పరిణామం. అయితే కొండంత రాగం తీసి పిల్లి కూతతో ముగించినట్టు ఈ సమావేశం మన్మోహన్ సింగ్ లోని దివాళాకోరుతనాన్ని బయటపెట్టింది. వ్యక్తిగా ఆయన మచ్చలేనివాడేనని అనుకున్నా, ఈ సమావేశంలో ఆయన వివరణలు భారత రాజకీయాలలోని కూటనీతిని, అవకాశవాదాన్ని, అసలు సమస్యల దాటవేతను స్పష్టంగా బయటపెట్టాయి.

ఫిబ్రవరి 16న డా. మన్మోహన్ సింగ్ తన అధికారిక నివాసం 7, రేస్ కోర్స్ రోడ్‌లో డెబ్బై నిమిషాల సేపు సంపాదకులతో మాట్లాడారు. ఈ సమావేశంలో 2జి స్పెక్ట్రం కుంభకోణం, అవినీతి ఆరోపణల తర్వాత కూడ 2009 మంత్రివర్గంలోకి రాజాను తీసుకోవడం, 2జి స్పెక్ట్రం విషయంలో జాయింట్ పార్లమెంటరీ కమిటీ ఏర్పాటు, న్యాయవ్యవస్థలో అవినీతి, ఆర్థిక సంస్కరణల కొనసాగింపు, కామన్‌వెల్త్ క్రీడల అవినీతిపై విచారణ, సబ్సిడీలు, విదేశాల్లో భారత ప్రతిష్ట దిగజారడం, ప్రధాని వ్యక్తిగత నిజాయితీ, ప్రభుత్వ స్థిరత్వం, తమిళనాడు ఎన్నికలు, తమిళ మత్స్యకారులను శ్రీలంక నావికాదళం నిర్బంధించడం వంటి అనేక అంశాలు చర్చకు వచ్చాయి.

అన్ని అంశాల మీద మహా ఘనత వహించిన భారత ప్రధాని ఆణిముత్యాలెన్నో ప్రకటించారు గాని, ప్రజాజీవనానికి సంబంధించిన నాలుగైదు అంశాలు మాత్రం నిశితంగా పరిశీలించవలసి ఉంది.

పాత ప్రభుత్వంలోనే 2007 నవంబర్ లోనే టెలికాం మంత్రిగా రాజా అక్రమాలు ప్రధాని దృష్టికి వచ్చినప్పుడు, 2009 మేలో మళ్లీ అదే వ్యక్తికి అదే పదవి కట్టబెట్టడంలో ఔచిత్యం ఏమిటని వచ్చిన ప్రశ్నకు జవాబిస్తూ డా. మన్మోహన్ సింగ్ ఏమన్నారో చూడండి:

'2007 నవంబర్ లో ఆ ఆరోపణలు రాగానే రాజాకు ఉత్తరం రాశాను. ఆయన తానేమీ తప్పు చేయలేదని, అన్ని వ్యవహారాల్లోనూ పారదర్శకంగా ఉన్నానని, ఇకముందు కూడ అలాగే ఉంటానని జవాబు రాశారు. ఆ తర్వాత ఆర్థిక మంత్రిత్వ శాఖతో ఈ చర్చ జరిగినప్పుడు కూడ ఈ వ్యవహారమంతా 2003లో తయారయిన విధానం ప్రకారమే నడుస్తున్నదని తేలింది. అందువల్లనే నేనీ విషయంలో ముందుకు వెళ్లలేకపోయాను. స్పెక్ట్రం కొనుక్కుంటున్న వాళ్లు ఎందుకు కొనుక్కుంటున్నారో నాకు తెలియదు. వాళ్ల కొనుగోలు అప్పటికి కొనసాగుతున్న విధానాల ప్రకారం సక్రమంగానే జరిగింది. ఆ మంత్రిత్వశాఖలో ఏమి జరుగుతున్నదో నాకు తెలియదు. లైసెన్సులు ఎవరికి ఇస్తారనేది మంత్రివర్గానికి గాని, నాకు గాని చెప్పలేదు. అది పూర్తిగా టెలికాం మంత్రి నిర్ణయమే. స్పెక్ట్రం ఒకసారి కొనుక్కున్నవాళ్లు



తమ కార్యకలాపాలు నిర్వహించడానికి అవసరమైన డబ్బు సమకూర్చుకోవడానికి అది ఎవరికైనా అమ్ముకోవడం తప్పేమీ కాదు. ఇక రాజాను మళ్లీ మంత్రివర్గంలోకి తీసుకోవడం గురించి, మనం ఒక సంకీర్ణ రాజకీయాల యుగంలో ఉన్నాం. సంకీర్ణ రాజకీయాలలో మనం సహాయం తీసుకుంటున్న పార్టీ నాయకుడు ఎవరి పేరు చెపితే వారికి మంత్రి పదవి ఇవ్వవలసిందే. అందువల్ల ఎన్నో వైపులనుంచి ఆరోపణలు, ఫిర్యాదులు వస్తున్నప్పటికీ ఆయనకు మంత్రి పదవి ఇవ్వనని చెప్పడం కుదరలేదు. ఇవ్వడం తప్పని నాకనిపించలేదు' అన్నారాయన.

ఈ జవాబులో ప్రతి వాక్యమూ మోసపూరితంగా, భారత రాజ్యాంగానికి వ్యతిరేకంగా ఉన్నది. పాలనావిధానాల దివాళాకోరుతనాన్ని చూపుతున్నది. ఎవరయినా ఒకరిమీద ఆరోపణలు వచ్చినప్పుడు, ఆ ఆరోపణలకు ఆధారాలు కూడ చూపుతున్నప్పుడు, ఆ ఆధారాలు సరైనవో కావో నిర్ధారించి, అంతిమ నిర్ణయం తీసుకోవడం ఒక పద్ధతి. కాని ఎవరి మీద ఆరోపణలు వచ్చాయో, వారికి ఒక ఉత్తరం రాసి, వారు 'నేనేమీ తప్పు చేయలేదు' అంటే అదే చివరిమాటగా తీసుకోవడం కనీస ఇంగిత జ్ఞానం ఉన్నవారెవరూ చేసే పని కాదు. పోనీ 'ఆ మాట నమ్మాను, అతనేమీ తప్పు చేయలేదు' అనే వైఖరికైనా కట్టుబడి ఉంటే సిబిఐ విచారణ, మంత్రివర్గం నుంచి తొలగింపు, అరెస్టు, జాయింట్ పార్లమెంటరీ కమిటీ నియామకం వంటి చర్యలన్నీ తీసుకోకుండానైనా ఉండాలి. వీటిలో ఏది సత్యం, ఏదసత్యం, ఓ మహాత్మా, ఓ మహర్షీ?

ఇక అంతకు ముందరి ప్రభుత్వ నిర్ణయం ప్రకారమే జరుగుతున్నదని తెలిసి మిన్నకున్నాను అనేది ఒక బాధ్యతగల మనిషి, ప్రభుత్వాధినేత అనవలసిన మాట కాదు. విభిన్న రాజకీయ పక్షాల పాలన ఉన్నప్పుడు, ఆయా రాజకీయ పక్షాల మధ్య సైద్ధాంతిక విభేదాలు ఉన్నప్పుడు పాత ప్రభుత్వ నిర్ణయాలను కొత్త ప్రభుత్వాలు మార్చడం, సవరించడం చాల సహజమైన, అనివార్యమైన చర్యలు. ఈ అరవై సంవత్సరాలలో అన్ని ప్రభుత్వాలూ అటువంటి పనులు చేశాయి. 2003లో భారతీయ జనతా పార్టీ నాయకత్వంలోని ఎన్‌డిఎ కూటమి, లేదా అప్పటి టెలికాం మంత్రి తీసుకున్న నిర్ణయం కొనసాగించడానికి అది సరైనదా కాదా అనేది గీటురాయి కావాలి గాని, పాత వాళ్లు తీసుకున్నారు గనుక దాన్ని కొనసాగించాం అనేది దూడగడ్డి కోసం తాటిచెట్టు ఎక్కానన్నదాని కన్న పెద్ద వంచన.

లేదా, బహుళజాతి సంస్థలకు, ప్రైవేటు గుత్తాధిపత్య వ్యాపారులకు మేలు చేయడంలో భారతీయ జనతా పార్టీ మంత్రి చేసిన నిర్ణయానికీ, మా మంత్రి చేసే నిర్ణయానికీ తేడా ఏమీ లేదు అనైనా బహిరంగంగా చెప్పవలసి ఉంది. ఇంతకాలమూ ఒకటి అధికార పక్షమూ మరొకటి ప్రతిపక్షమూ అని, ఆ రెంటి మధ్య దేశ ఆర్థికవ్యవస్థ గురించి, ప్రజా సంక్షేమం గురించి భిన్నమైన దృక్పథాల తేడా ఉందని అనుకుంటున్న అమాయకులెవరయినా ఉంటే వాళ్ల కళ్లు తెరిపించవలసి ఉంది.

అంతకన్న ఘోరం కేంద్రంలోగాని, రాష్ట్రంలో గాని తీసుకునే పాలనాపరమైన నిర్ణయాలేవయినా మంత్రివర్గపు ఉమ్మడి బాధ్యత అవుతాయి గాని, ఏ ఒక్కరి సంపూర్ణ బాధ్యత కావు. అది ఆ టెలికాం మంత్రి ఇష్టారాజ్యానికి వదిలేశాం. మిగిలిన మంత్రులకు గాని, నాకు

గాని తెలియదు అని డా. మన్మోహన్ సింగ్ వంటి పండితుడు అంటున్నారంటే మన రాజ్యాంగ వ్యవస్థనే తారుమారు చేస్తున్నారన్నమాట. ఒక ప్రత్యేకమైన నిర్ణయం నాకు తెలియదు అన్నా అర్థం చేసుకోవచ్చు గాని అన్ని నిర్ణయాలూ ఆ మంత్రిత్వశాఖ ఇష్టమే అంటే ఇక్కడ ప్రజా ప్రభుత్వం నడుస్తున్నదా, దొంగలు దొంగలు ఊళ్లు పంచుకుంటున్నారా?

ఇక స్పెక్ట్రం కొనుక్కునేవాళ్లు ఎందుకు కొనుక్కుంటున్నారో తనకు తెలియదని, వాళ్లు డబ్బు సంపాదించుకోవడానికి ఇతరులకు అమ్ముకోవచ్చునని ఈ దేశపు ప్రధాని బహిరంగంగా అంటున్నాడంటే అంతకన్న సిగ్గు పడవలసిన విషయం మరొకటి ఉండదు. స్పెక్ట్రం మిగిలిన అన్ని వనరులలాగే ప్రజల ఉమ్మడి సంపద. ప్రభుత్వ బాధ్యత దానికి ధర్మకర్తగా, నిర్వాహకురాలిగా ఉండి, ప్రజల ఖజానాకు దాని నుంచి ఆదాయం సమకూర్చడమే తప్ప ఉచితంగానో చౌకధరలకో దొంగలకు పంపిణీ చేయడం కాదు. కారుచౌక ధరలకు ఒకరికి అమ్మజూపుతారట, దాన్ని వాళ్లు విపరీతమైన ఖరీదుకు ఇతరులకు అమ్ముకుంటారట. తమ జేబులోంచి ఒక్క పైసా బయటికి తీయకుండానే, ఈ మారు బేరంలో వేల కోట్ల రూపాయలు సంపాదిస్తారట. ఇదంతా ఈ పేరుమోసిన ఆర్థికవేత్తకు తెలియదట. మారుబేరానికి అమ్ముకుని ఆ దొంగలు చేసుకునే వేల కోట్ల రూపాయలేవో, ప్రభుత్వమే సంపాదించి ఉండవచ్చునని, అలా సంపాదించకపోవడం ద్వారా ప్రజా ఖజానాకు అక్షరాలా ఒక లక్షా డెబ్బైఆరువేల కోట్ల రూపాయల నష్టం వాటిల్లిందని, విమర్శకులు కాదు, స్వయంగా రాజ్యాంగబద్ధ సంస్థ కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ చెప్పిన తర్వాతనే ఈ వివాదం చెలరేగుతున్నది. అయినా ఈ మహామేధావి ఇంతగా బుకాయించడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? అక్కడితో ఆగిపోలేదు. 2జి స్పెక్ట్రం అవినీతి కుంభకోణం గురించే వచ్చిన మరొక ప్రశ్నకు జవాబిస్తూ 'ప్రజా పంపిణీ వ్యవస్థలో చౌకధరల దుకాణాలకు ఆహారపదార్థాల కోసం రు. 80,000 కోట్ల సబ్సిడీ ఇస్తున్నాం. రు. 60,000 కోట్లు ఎరువుల సబ్సిడీ ఇస్తున్నాం. కిరోసిన్ సబ్సిడీ ఇస్తున్నాం. ఎవరైనా ఈ సరుకులన్నిటినీ మార్కెట్ ధరలకు అమ్మి ఉంటే ఈ సబ్సిడీ ఇవ్వనక్కర లేదుగదా, ఆమేరకు వేల కోట్ల రూపాయలు నష్టమే కదా అంటే ఎలా ఉంటుంది' అని ఎదురు ప్రశ్నించారు. 1991 నుంచీ కూడ పేదప్రజలకు అందుతున్న సబ్సిడీని ఎలా కత్తిరించాలా, అన్ని సరుకులనూ మార్కెట్ శక్తుల లాభాపేక్షకు ఎలా అప్పగించాలా అని నిరంతరం ఆలోచిస్తున్న ప్రపంచ బ్యాంకు దళారీ ఇటువంటి మాటలు మాట్లాడడంలో ఎంతమాత్రం ఆశ్చర్యం లేదు.

కాని ఇక్కడ గుర్తించవలసినది, ఆహార పదార్థాల సబ్సిడీ, కిరోసిన్ సబ్సిడీ అందుతున్నది బడుగు, బలహీన వర్గాలకు, దిగువ మధ్యతరగతికి. ఎరువుల సబ్సిడీ అందుతున్నది రైతాంగానికి. అది కూడ మన్మోహన్ సింగ్ తన జేబులోంచి ఏమీ ఇవ్వడం లేదు. ఆ అశేష ప్రజానీకం, రైతాంగం ఆరుగాలం కష్టపడి పోగు చేసిన జాతీయ సంపద లోంచి నాలుగు మెతుకులు విదిలించడమే ఆయనకు ఇంత కష్టమవుతున్నది. మరొక పక్క దాన్ని టాటాలకూ, అంబానీలకూ, మిత్తల్ లకూ అటువంటి దేశదేశాల సంపన్నులకూ చెందిన టెలికాం కంపెనీలకు అప్పనంగా



అప్పగించిన వనరులతో పోలుస్తున్నాడు. ఆ టెలికాం కంపెనీలు జాతీయ సంపదకు చేర్చినదేమీ లేదు, జాతీయ సంపదను కొల్లగొట్టడం తప్ప. నిజంగా ప్రజలకు రావలసిన ప్రతిఫలంలోని చిన్న భాగాన్ని తప్పుపడుతున్న ఈ ప్రపంచీకరణ వ్యాపారి, ప్రైవేటు గుత్త వ్యాపారులకు ప్రతిఫలమే ఇవ్వనక్కరలేని స్థితిలో లక్షల కోట్ల రూపాయలు అప్పగించి, దాన్ని సబ్సిడీలతో పోలుస్తున్నాడంటే ఎంత బేహద్బీ ఇది! తిండి పదార్థాలనూ, ఎరువులనూ, కిరోసిన్ నూ మార్కెట్ శక్తులకు అప్పగించాలట గాని, బడా సంపన్నులకు ఇబ్బడి ముబ్బడి లాభాలు చేకూర్చిపెట్టే స్పెక్ట్రం అమ్మకాలలో మాత్రం మార్కెట్ శక్తులు, సూత్రాలు పనిచేయగూడదట.

ఆర్థిక సంస్కరణల మార్గాన్ని తాము వదిలిపెట్టలేదని, ఇంకా చేపట్టవలసిన చర్యలు ఎన్నో ఉన్నాయని, భారతీయ జనతా పార్టీ అడ్డుకుంటున్నందువల్ల మాత్రమే తాము ఆ పనులు చేయలేకపోతున్నామని కూడ ఆయన మరొక ప్రశ్నకు జవాబుగా అన్నారు. అంటే రానున్న రోజులలో చేపట్టనున్న సంస్కరణలలో ఇప్పుడు ఆయన ఏవగించుకుంటున్న ఆహార, ఎరువుల, కిరోసిన్ సబ్సిడీల కోత కూడ ఉండబోతుందని హెచ్చరిస్తున్నారన్నమాట.

ఇక అన్నీ తెలిసినా కేవలం సంకీర్ణ రాజకీయ నీతి వల్ల మాత్రమే అవినీతిపరుడికి మంత్రి పదవి ఇచ్చానని మరొక సమర్థన. అంత నీతిపరుడయితే, అంతగా సంకీర్ణ రాజకీయాల ఒత్తిడి పట్ల వ్యతిరేకత ఉన్నవారయితే ఆ అవినీతిపరులతో ప్రభుత్వం ఏర్పరచే బదులు, ప్రభుత్వం లేకపోయినా ఫర్వాలేదనుకోవచ్చు. సంకీర్ణ రాజకీయాల ఒత్తిడిని అంగీకరించడంలో చూపుతున్న నీతి అసలు పాలనాధికారాన్ని త్యజించడంలో చూపించవచ్చు. ఎవరిని మోసగించడానికి ఈ ధర్మపన్నాలు?

ఇంకొక ప్రశ్నకు జవాబుగా న్యాయవ్యవస్థలోగాని, అధికారవర్గంలోగాని, చట్టసభలలోగాని ప్రజాజీవనంలో ఎక్కడ అవినీతి ఉన్నా దాన్ని తుదముట్టించాలనే వాళ్లలో తాను మొట్టమొదట ఉంటానని ప్రధాని గంభీరంగా చెప్పారు. అవినీతిని నిర్మూలించాల్సిందే అని బీరాలు పలికారు. కాని ప్రభుత్వం ఏర్పాటు చేయాలనే స్వార్థం కొరకు మాత్రం రాజా అవినీతిని సహించడంలో మొదటివాడుగా ఉన్నారు. సంకీర్ణ రాజకీయాల అవకాశవాద సూత్రాలకు లోబడి రాజా అవినీతిని తుదముట్టించాలనే ఆలోచనను మాత్రం పక్కనపెట్టారు. తాను చాల నిజాయితీపరుడినని, సీజర్ భార్య కూడ పరీక్షకు నిలవాల్సిందేనని నానుడి చెప్పినట్టు తాను ఏ పరీక్షకైనా భయపడనని ఆయన అన్నారు. వ్యక్తిగత నిజాయితీ ఆయనకు వ్యక్తిగా మేలు చేస్తుందేమోగాని, దేశ పాలనా వ్యవహారాలలో, నూటపదికోట్ల మంది జీవితాలకు సంబంధించి ఆయన ఆమోదిస్తున్న, మౌనంగా సహిస్తున్న, అమలు చేస్తున్న నిజాయితీ రాహిత్యం, వంచన ఈ దేశ వర్తమానాన్నీ, భవిష్యత్తునూ ధ్వంసం చేస్తున్నది.

చివరిగా ఆయన తనను కలిసిన టివి ఛానళ్ల సంపాదకులకూ, మొత్తంగానే ప్రచార సాధనాలకూ ఒక సలహా ఇచ్చారు. ఇటీవలి అవినీతి, కుంభకోణాల వార్తల వల్ల అంతర్జాతీయంగా భారతదేశపు ప్రతిష్ట దిగజారుతున్నదని, దాని సరిచేయడానికి ఏమి చేయనున్నారని

ప్రశ్నించినప్పుడు ఆయన అది సరి చేస్తామని, సరి చేయడానికి చర్యలు తీసుకుంటామని అనలేదు. ఆ ప్రతిష్టను దిగజార్చే వార్తలు రాయవద్దని మాత్రం నర్మగర్భంగా కోరారు. 'ఈ వాతావరణం మంచిది కాదు. ఇది మన ఆత్మవిశ్వాసాన్ని దెబ్బతీస్తుంది. ఇది భారతదేశపు ప్రతిష్టను దిగజారుస్తుంది. కనుక ఈ ఘటనలను నివేదించేటప్పుడు మీ మీ అభిప్రాయాలేవయినా, వాస్తవాలను పవిత్రంగా చూడాలని కోరుతున్నాను. వాస్తవాలను వక్రీకరించగూడదు. మీ అభిప్రాయాలు స్వేచ్ఛగా ప్రకటించవచ్చు, కాని మన దేశ వ్యవహారాల గురించి రాసేటప్పుడు, వాస్తవాలను గురించి రాసేటపుడు జాగ్రత్త తీసుకోవాలి' అని సలహా ఇచ్చారు.

కుటుంబ గౌరవం కోసం ఇంట్లోని కుళ్లును బయటపెట్టవద్దని కోరడం, దేశంలో జరుగుతున్న తప్పులను కప్పిపుచ్చడంకోసం దేశభక్తిని రెచ్చగొట్టడం పాలకులకు అలవాటయిన విద్యే. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చదువుకుని, ప్రపంచవ్యాప్త అనుభవాలు సంపాదించిన మేధావి, ప్రపంచంలోకెల్లా పెద్ద ప్రజాస్వామ్యమని గొప్పలు చెప్పుకునే దేశపు ప్రధానమంత్రి, దేశప్రతిష్టను యథాతథంగా ఉంచాలంటే దేశంలో జరుగుతున్న అవినీతి కార్యకలాపాలను బయటపెట్టకండి, వాస్తవాలు జాగ్రత్తగా రాయండి (వాస్తవాలను దాచిపెట్టండి అని దానర్థం) అంటున్నాడంటే 1968లో చెరబండరాజు రాసినట్టు, 'అమ్మా భారతీ, నీ గమ్యం ఏమిటి తల్లీ?'

***ఈభూమి, మార్చ్ 2011***



# 75

# అన్నా హజారే ఆందోళన
# కొంచెం నిప్పూ - కొంచెం నీళ్లూ

ఏప్రిల్ మొదటివారంలో దేశ రాజధాని ఢిల్లీలో సాధారణంగా ప్రజా నిరసన ప్రదర్శనలు జరిగే జంతర్ మంతర్ దగ్గర ఒక చరిత్రాత్మక సన్నివేశం ప్రారంభమైంది. ఆ సన్నివేశానికి ప్రతిస్పందనగా దేశ వ్యాప్తంగా పెద్ద ఎత్తున సంఘీభావం ప్రకటితమైంది. దేశ రాజకీయాలను ఒక కుదుపు కుదపగలంత శక్తివంతమైన ఈ పరిణామం నాలుగో రోజుకే 'విజయం' సాధించాననుకుని చప్పబడి క్రమక్రమంగా అధికారిక చిక్కుముడులలోకి, వ్యక్తిగత వివాదాలలోకి జారిపోయింది. ఈ సన్నివేశం ఇవాళ దేశంలో, దేశ రాజకీయాలలో నెలకొని ఉన్న దుస్థితికీ, గందరగోళానికీ, ఆలోచనాపరులలో కూడ ఉన్న అస్పష్టతకూ అద్దం పడుతోంది. ప్రజల అవినీతి ఆకాంక్షల ప్రతిఫలనంగా, సూచికగా గొప్ప ఆశను రేకెత్తించిన ఈ పరిణామమే, మరొకవైపు ఆ ఆశలనూ, ఆకాంక్షలనూ ఎలా పక్కదారి పట్టించవచ్చునో చూపించింది. అనవసరమైన విషయాలను ముందుకు తెచ్చి అత్యవసరమైన విషయాలమీద మేలి ముసుగులు ఎలా కప్పవచ్చునో చూపించింది. ప్రజాజీవితంలో అత్యంత నిజాయితీపరులుగా పేరుపడినవారి మీద కూడ ఎలా బురద చల్లవచ్చునో, అత్యంత దుర్మార్గులుగా పేరుపడినవారిని కూడ ఏదో ఒక కారణంతో ఎలా సమర్థించవచ్చునో కూడ

ఈ సన్నివేశం చూపింది. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ సన్నివేశం దేశంలో ఇవాళ రాజుకుంటున్న నిప్పుకు నిదర్శనంగా ఉంది. ఆ నిప్పుమీద వేరువేరు పేర్లతో నీళ్లు చల్లుతున్న పాలకవర్గ కౌటిల్యానికి నిదర్శనంగానూ ఉంది.

ఈ సన్నివేశానికి ఉన్న సంక్లిష్టతను, బహుముఖ అంతరార్థాలను సంపూర్ణంగా అర్థం చేసుకుంటే గాని అత్యంత సానుకూలమైన, ప్రజానుకూలమైన అంశాలూ, అత్యంత ప్రతికూలమైన, ప్రజావ్యతిరేకమైన, ప్రజలను మోసం చేసే అంశాలూ ఏకకాలంలో దానిలోకి ఎలా వచ్చి చేరాయో తెలుసుకోలేం.

ఈ దేశంలో అవినీతి కథ ఎన్ని శతాబ్దాల కింద మొదలయిందో ఎవరూ చెప్పలేరు. రామాయణ, మహాభారతాల్లోనూ, జాతక కథల్లోనూ, కౌటిల్యుని అర్థశాస్త్రం, కల్హణుడి రాజతరంగిణి, మనుస్మృతి వంటి గ్రంథాల్లోనూ అవినీతి ప్రస్తావనలున్నాయి. అప్పటినుంచి ఇప్పటిదాకా సాగిన అన్ని పాలనల కిందా అవినీతి ఏదో ఒక స్థాయిలో ఉంటూనే ఉంది. సమష్టి శ్రేయస్సుకోసం చేతికి అందిన అధికారాన్ని, అవకాశాలను వ్యక్తిగత ప్రయోజనాల కోసం వాడడం, సమాజ శ్రేయస్సుకు భిన్నంగా వ్యక్తిగత ఆస్తి పోగు చేసుకోవడం, బాధ్యత, జవాబుదారీతనం లేని అధికారం, ఇతరుల ఉపాధిని, జీవితాలను ధ్వంసం చేసేలా వారి వనరులను తమ హక్కుభుక్తం చేసుకోవడం అనే అర్థంలో అవినీతి అన్ని అధికార వ్యవస్థలలోనూ ఏదో ఒక స్థాయిలో ఉంది. ఎక్కడైనా ఒకరిద్దరు వ్యక్తులు వారి విలువల వల్ల భిన్నమైన ఆచరణలో ఉన్నారేమో గాని మొత్తంగా అన్నిరకాల అధికార వ్యవస్థల సాధారణ స్వభావం ఇటువంటి అవినీతే.

అలా అధికార వ్యవస్థలను ఆక్రమించిన అవినీతి అక్కడినుంచి సామాజిక వ్యవస్థలలోకీ సంస్కృతిలోకీ ప్రవహించి మన సామాజిక జీవనాన్నే కలుషితం చేసేసింది. "తెలుగునాట భక్తిరసం తెప్పలుగా పారుతోంది, డ్రైనేజీ స్కీము లేక దేంజరుగా మారుతోంది" అన్న గజ్జెల మల్లారెడ్డి మాటల్లో తెలుగునాట బదులు దేశమంతా అనీ, భక్తిరసం బదులు అవినీతి అనీ మార్చుకుంటే ఇవాళ్టి స్థితి సరిగ్గా అర్థమవుతుంది.

ఈ అవినీతి బ్రిటిష్ వలసవాదం నుంచి అధికారమార్పిడి జరిగిన తర్వాత మరింత ఎక్కువయింది. ఆనాటి స్వాతంత్ర్యోద్యమ, జాతీయోద్యమ, నవభారత స్వప్నాలు కూడ మన నాయకుల అవినీతిని, లేదా అవినీతి పట్ల ఉపేక్షను అడ్డుకోలేకపోయాయి. ఇందుకు జవహర్ లాల్ నెహ్రూ, వి కె కృష్ణ మీనన్, టి టి కృష్ణమాచారి, జగ్జీవన్ రామ్ లాంటి మహా నాయకులే మినహాయింపు కానప్పుడు ఇవాళ్టి మరుగుజ్జు నాయకుల గురించి మాట్లాడనవసరం లేదు. ఇక ఆ తర్వాత జరిగిన చరిత్రలో ఇందిరాగాంధీ హయాంలోని నగర్వాలా కుంభకోణం, రాజీవ్ గాంధీ స్వయంగా పాలుపంచుకున్న బోఫోర్స్ కుంభకోణం అందరికీ తెలిసినవే. పి వి నరసింహారావు హయాంలో నోటుకు వోటు కుంభకోణం మాత్రమే కాక బహుళజాతి సంస్థల మార్కెట్ల కోసం, వారి ముడి సరుకుల అవసరాల కోసం దేశాన్ని బార్లా తెరవడమే ఒక పెద్ద



కుంభకోణం. హర్షద్ మెహతా స్టాక్ మార్కెట్ కుంభకోణంలోనూ, సుఖ్ రాం టెలికాం మంత్రిత్వశాఖ కుంభకోణంలోనూ ఇవి బహిరంగమయ్యాయి. ఈ ప్రపంచీకరణ కుంభకోణంలో ఆ తర్వాత గడిచిన ఇరవై సంవత్సరాలలో వచ్చిన ప్రతి ప్రభుత్వమూ తనవంతు చేర్చింది గాని, ఆ అవినీతి దిగజారుడును అడ్డుకోవడానికి ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు.

ప్రపంచీకరణ విధానాల తర్వాత దేశంలో అవినీతి వనరులు, మార్గాలు, అవకాశాలు విపరీతంగా పెరిగిపోయాయి. ఈ దేశపు ఖనిజ నిలువలు, సహజ వనరులు అవసరమైన బహుళ జాతి సంస్థలు ఆ వనరులను తమకు అప్పనంగా అందించే విధానాలు తయారు చేసిన మంత్రులకు, అధికారులకు ముడుపులు ఇస్తాయి. ఈ దేశపు సువిశాల మార్కెట్ లో పది శాతమో, ఐదు శాతమో ఆక్రమించగలిగినా వందల కోట్ల డాలర్ల లాభం చేసుకోగలమని ఆశ ఉన్న బహుళ జాతి సంస్థలు ఆయా సరుకుల, సేవల మార్కెట్లలోకి తమ ప్రవేశానికి వీలు కలిగించే విధానాల రూపకర్తలకు లంచాలు ముట్టజెపుతాయి. అలా మారుమూల ప్రాంతాల రాజకీయ నాయకులు, ప్రభుత్వ అధికారులు ఎన్నడూ లేని విధంగా కొత్త లంచాల అవకాశాలను, మార్గాలను చూడడం మొదలుపెట్టారు. దేశ ఆర్థిక వ్యవస్థలోకి ఇలా మురుగునీటి ప్రవాహంలాగ విపరీతంగా వచ్చిపడిన డబ్బు బహుళ జాతి సంస్థల దళారీలనూ పెంచింది, నిర్ణయాధికారం ఉండే రాజకీయ నాయకులనూ వందల, వేల కోట్ల రూపాయల ఆస్తిపరులను చేసింది. అలా రాజకీయం, వ్యాపారం, మాఫియా కలగలసిన ఒక నేరసామ్రాజ్యం నేరుగా పాలనాధికారంలోకి వచ్చింది. ఆ అవినీతి మహా సముద్రం మీద బయటకు తేలిన రెండు మూడు తెప్పలు కామన్ వెల్త్ క్రీడలు, ఆదర్శ్ హౌజింగ్ సొసైటీ, 2జి స్పెక్ట్రం అమ్మకాలు.

అప్పటిదాకా అవినీతిని చూసీ చూడనట్టు సాగిపోతున్న మధ్యతరగతి హఠాత్తుగా అవినీతి ఇప్పుడే ప్రారంభమైనట్టు గగ్గోలు పెట్టడం ప్రారంభించింది. ఈ అవినీతిని రద్దు చేయవలసిందే అని నినదించడం మొదలుపెట్టింది. 1947 నుంచీ జరుగుతున్న అవినీతిని, వ్యవస్థలో సాగుతున్న దోపిడీ, పీడనలలోని అవినీతిని, ప్రపంచీకరణ క్రమంలో పెరిగిపోయిన అవినీతిని, కార్పొరేట్ ప్రపంచపు అవినీతిమయ పెట్టుబడిదారీ నేరసామ్రాజ్యాలను చాల సులువుగా మరచిపోయి, రాజకీయ అవినీతి మీద మాత్రమే కేంద్రీకరించడం మొదలుపెట్టింది. కొందరు రాజకీయ నాయకుల అవినీతి వల్లనే మొత్తం అవినీతి సాగుతున్నదన్నట్టు, వారిని కట్టడి చేసే, విచారించే, శిక్షలు విధించే పకడ్బందీ చట్టాలు ఉంటే అవినీతి సమసిపోతుందన్నట్టు అమాయక ప్రకటనలు చేయడం మొదలు పెట్టింది.

సరిగ్గా ఇదే సమయంలో టునీషియాలో, ఈజిప్ట్ లో, పశ్చిమాసియా దేశాలలో ప్రభుత్వాల మీద లక్షలాది మంది ప్రజల తిరుగుబాటుల వెల్లువ ప్రారంభమయింది. ఆ ప్రజావెల్లువలలో ఎక్కువగా ఆయా దేశాధిపతుల నిరంకుశత్వం మీద ఎక్కుపెట్టినవే అయినా, అవినీతి, కుంభకోణాలు, విదేశాల్లో సంపద పోగు చేసుకోవడం, ప్రజల ఆర్థిక స్థితిలో తీవ్రమైన అసమానతలు, నిరుద్యోగం వంటి సమస్యలు కూడ వినిపించాయి. భారతదేశంలో కూడ అవే

సమస్యలు ఉన్నాయని, అవకాశం వస్తే ఇక్కడ కూడ అటువంటి ప్రజా వెల్లువలు జరగవచ్చునని కొంతమంది పత్రికారచయితలు, విశ్లేషకులు వ్యాఖ్యానించారు. ఔట్ లుక్ వారపత్రిక సంపాదకులు వినోద్ మెహతా ఈజిప్ట్ రాజధాని కైరోలో తహ్రీర్ స్క్వేర్ లో లక్షలాది మందితో జరిగిన ప్రజాప్రదర్శనల గురించి రాస్తూ, భారతదేశంలో అంతకన్న ఘోరమైన పరిస్థితులున్నాయని, వాటిని నిరసిస్తూ రాజధానిలో జంతర్ మంతర్ దగ్గర రెండు లక్షల మంది ప్రదర్శన ప్రారంభిస్తే ఏం జరుగుతుందని వ్యాఖ్యానించారు. "వెలిగిపోతున్న భారతదేశం తాను బతుకుతున్న నేలమీద వీథుల్లో వ్యక్తమవుతున్న ఘర్షణలను పట్టించుకోనవసరం లేదేమో. కాని, నిద్రమత్తు వదలకపోతే అరబ్ పరిస్థితి మన దేశాన్నీ చాల వేగంగా కమ్ముకొస్తుంది. రెండు లక్షలమంది పౌరులు జంతర్ మంతర్ లోకి కవాతుగా వచ్చి, పాలకుల మార్పు, తమ సమస్యల తక్షణ పరిష్కారం అనే డిమాండ్ చేస్తే భారత పాలకవర్గాలు ఎలా స్పందిస్తాయో?" అని ఆయన రాశారు.

సరిగ్గా ఆ ఊహకు ప్రతిస్పందనా అన్నట్టుగా ఏప్రిల్ 5 నుంచి నాలుగు రోజుల పాటు జంతర్ మంతర్ దగ్గర కొన్ని వేల మందితో ప్రదర్శన జరిగింది. దేశ వ్యాప్తంగా లక్షలాది మంది ఈ ప్రదర్శనకు తమ తమ ప్రాంతాలలో సంఘీభావం ప్రదర్శించారు. తహ్రీర్ స్క్వేర్ ప్రదర్శన, జంతర్ మంతర్ ప్రదర్శన ఒకేలాంటివి కావు, ఒకే లక్ష్యంతో జరిగినవి కావు, ఒకేరకమైన ఫలితాలు సాధించినవీ కావు. కాని పోలికలున్నాయి.

జంతర్ మంతర్ ప్రజా ప్రదర్శనకు, కామన్ వెల్త్ క్రీడల, ఆదర్శ్ హౌజింగ్ సొసైటీ, 2జి స్పెక్ట్రం అమ్మకాల కుంభకోణాలు మాత్రమే కాక మరి కొంత పూర్వరంగం కూడ ఉంది. అది అత్యున్నత అధికార పీఠాలలో జరిగే అవినీతిని అడ్డుకోవడం, విచారణ జరపడం, శిక్షలు విధించడం, అటువంటి అవినీతి పునరావృతం కాకుండా చూడడం ఎలా అనే ఆలోచన. ఈ పనులన్నీ ఒక చట్టం ద్వారా సాధ్యమవుతాయనే ఆలోచన. ప్రధానమంత్రితో సహా రాజకీయ నాయకులందరినీ కూడ విచారించగల, శిక్షించగల ఒక స్వతంత్ర వ్యవస్థకు రూపకల్పన చేయాలనే ఆలోచన ఆ చట్టానికి ప్రాతిపదిక.

అటువంటి చట్టాన్ని తేవాలనే ప్రయత్నం దేశంలో 1968 నుంచీ జరుగుతోంది. ఏడురాష్ట్రాల ఎన్నికలలో కాంగ్రెస్ ఓడిపోయి, మొదటిసారి కాంగ్రెసేతర ప్రభుత్వాలు ఏర్పడిన 1967 ఎన్నికల తర్వాత, కాంగ్రెస్ లో చీలికలు రావడం మొదలైన తర్వాత, ఇంటా బయటా ప్రత్యర్థులను ఎదుర్కొనేందుకు ఇందిరాగాంధీ చూపిన ప్రగతిశీల ముఖంలో భాగం ఈ లోక్ పాల్ ఆలోచన. గరీబీ హటావో, రోటీ కపడా ఔర్ మకాన్, భూసంస్కరణలు, బ్యాంకుల జాతీయకరణ, గుత్తాధిపత్య సంస్థల నియంత్రణ వంటి అనేక "ప్రగతిశీల" చర్యలలో భాగమే అది. ఆ వ్యక్తీకరణల్లో ఒకటే రాజకీయ నాయకత్వాన్ని కూడ అవినీతి వ్యతిరేక చట్టపరిధిలోకి తీసుకురాదలచిన లోక్ పాల్ బిల్లు.

కాని కాంగ్రెసేతర రాజకీయ నాయకులను, తనను వ్యతిరేకించే కాంగ్రెస్ రాజకీయ నాయకులను ఇబ్బందులపాలు చేసేందుకు మాత్రమే ఇందిరా గాంధీ ఈ లోక్ పాల్ వ్యవస్థను



సృష్టిస్తున్నదని సకారణంగానే అనుమానించిన ప్రతిపక్షాలు, కాంగ్రెస్ లోని ఇందిర వ్యతిరేక వర్గాలు ఆ చట్ట ప్రతిపాదనను అడ్డుకున్నాయి. అప్పటినుంచి గడిచిన నలభై సంవత్సరాలలో అరడజనుసార్లు పునరుత్థానం చెందబోయి, ఆగిపోయిన ఆ బిల్లును ఇప్పుడు యుపిఎ ప్రభుత్వం ఇటీవలి భారీ కుంభకోణాల నేపథ్యంలో బయటికి తీసి దుమ్ము దులిపింది. కాని రాజకీయ ఆర్థిక ప్రయోజనాలను అనుసరించి ఆ బిల్లును అవకతవకలమయంగా తయారు చేసింది.

ఈ బిల్లు తయారీ లోపభూయిష్టంగా ఉన్నదని, దాన్ని మార్చకపోతే, మార్చడంలో పౌరసమాజ ప్రతినిధులకు స్థానం కల్పించకపోతే ఆమరణ నిరాహారదీక్షకు దిగుతానని మహారాష్ట్రలోని రాలేగావ్ సిద్ధి లో తన ప్రత్యామ్నాయ గ్రామీణాభివృద్ధి నమూనా ద్వారా ప్రముఖుడైన ప్రముఖ గాంధేయవాది అన్నా హజారే ఫిబ్రవరి 26న ప్రభుత్వానికి హెచ్చరిక చేశారు. జన లోక్ పాల్ బిల్లు అని ఒక ప్రత్యామ్నాయ బిల్లు ముసాయిదా కూడ రాసుకుని, ఇండియా అగెనెస్ట్ కరప్షన్ సహచరులతో కలిసి అన్నాహజారే మార్చ్ 7 న ప్రధాని డా. మన్మోహన్ సింగ్ ను కలిశారు. ప్రధాని వారి ఆందోళనలను అర్థం చేసుకుంటున్నానని అంటూ, వారితో సంప్రదింపులు జరపడానికి ఒక మంత్రివర్గ ఉపసంఘాన్ని నియమించారు. ఈ రెండు బృందాల మధ్య మూడు వారాలపాటు చర్చలు జరిగాయి గాని అంగీకారం కుదరలేదు. బిల్లు తయారు చేసేపనిలో ప్రభుత్వ ప్రతినిధులు, పౌరసమాజ ప్రతినిధులు చెరి సగం ఉండాలని అన్నా హజారే పట్టుబట్టారు. చివరికి అన్నాహజారే హెచ్చరించిన ఏప్రిల్ 4 నాటికి కూడ ప్రభుత్వం దిగిరాలేదు సరిగదా, అన్నాహజారే మొండి పట్టుతో ఉన్నారని, అన్నాహజారే పట్ల వ్యక్తిగానూ, ఆయన ఆశయం పట్లా తమకు గౌరవం ఉన్నదని ప్రధానమంత్రి కార్యాలయం ఏప్రిల్ 4న ప్రకటించింది.

ఆ మర్నాడు ఏప్రిల్ 5న అన్నా హజారే 300 మంది స్వచ్ఛంద కార్యకర్తలతో కలిసి జంతర్ మంతర్ దగ్గర నిరాహారదీక్ష ప్రారంభించారు. ఏప్రిల్ 6 నాటికి దేశంలోని ప్రధాన నగరాలన్నిటిలో అన్నాహజారే దీక్షకు మద్దతుగా దీక్షలు, ప్రదర్శనలు మొదలయ్యాయి. మంత్రివర్గ ఉపసంఘంలో శరద్ పవార్ వంటి అవినీతి మయ మంత్రి ఉండడం ప్రభుత్వ చిత్తశుద్ధికి నిదర్శనమని అన్నాహజారే చేసిన వ్యంగ్య వ్యాఖ్యకు ప్రతిస్పందనగా శరద్ పవార్ ఏప్రిల్ 6న ఉపసంఘం నుంచి వైదొలిగారు. అటూ ఇటూ చాల చర్చలు జరిగిన తర్వాత ఏప్రిల్ 7 సాయంత్రం స్వయంగా సోనియా గాంధీ దీక్ష విరమించవలసిందిగా అన్నాహజారేకు విజ్ఞప్తి చేశారు. మళ్లీ చర్చలు జరిగిన తర్వాత ఏప్రిల్ 8 సాయంత్రానికి ఇండియా అగెనెస్ట్ కరప్షన్ సంస్థ ఒకమెట్టు దిగి, ప్రభుత్వం ఒక మెట్టు దిగి రాజీకి వచ్చారు. ప్రభుత్వం తరఫున ప్రణబ్ ముఖర్జీ, పౌరసమాజం తరఫున శాంతి భూషణ్ సహ అధ్యక్షులుగా బిల్లు రచనా కమిటీ ఏర్పడేట్టు, దానిలో రెండు వైపులనుంచీ చెరి సగం సభ్యులు ఉండేట్టు ఒప్పందం కుదిరింది. అందుకు సంబంధించిన ప్రభుత్వ ఉత్తర్వులు ఏప్రిల్ 9 ఉదయం తన చేతికి అందిన తర్వాతనే అన్నా హజారే తన దీక్ష విరమించారు. అంటే దాదాపు తొంభై గంటల సమయంలోనే ఇంతటి

మహత్తరమైన ఆకాంక్ష పట్ల ప్రభుత్వం సానుకూలంగా స్పందించేలా అన్నా హజారే దీక్ష పని చేసిందన్నమాట.

కొత్తగా ఏర్పడిన లోక్ పాల్ బిల్లు రచనా కమిటీలో ఇద్దరు అధ్యక్షులు కాక ప్రభుత్వం తరఫున మంత్రులు వీరప్ప మొయిలీ, పి. చిదంబరం, కపిల్ సిబాల్, సల్మాన్ ఖుర్షీద్, పౌరసమాజం తరఫున అన్నా హజారే, జస్టిస్ సంతోష్ హెగ్డే, ప్రశాంత్ భూషణ్, అరవింద్ కేజ్రీవాల్ ఉంటారు. ఈ కమిటీ ఏప్రిల్ 16 న తొలిసారిగా సమావేశమై బిల్లు రచనా ప్రక్రియ ప్రారంభించింది. రానున్న లోక సభ సమావేశాల నాటికి బిల్లు ముసాయిదా పూర్తి కావాలని ఆశిస్తున్నారు.

ఆ తర్వాత అన్నాహజారే మీద, శాంతి భూషణ్ మీద, ప్రశాంత భూషణ్ మీద కాంగ్రెస్ ప్రతినిధులుగాని, సమాజ్ వాది పార్టీ నేత అమర్ సింగ్ గాని చేసిన వ్యాఖ్యలు, వాద వివాదాలు ఎలా ఉన్నా ఈ మొత్తం సన్నివేశంలోని అనుకూల అంశాలను, ప్రతికూల అంశాలను గుర్తించవలసి ఉంది. లేకపోతే ఇది అవినీతి వ్యతిరేక ఆకాంక్షలకు పూర్తి విజయమనే భ్రమాజనిత ఆనందానికో, ఇది పూర్తిగా పనికిమాలినదనే నిరాశావాదానికో బలి అయిపోవలసి వస్తుంది.

అవినీతికి వ్యతిరేకంగా దేశ వ్యాప్తంగా ప్రజలలో ఉన్న ఆకాంక్షలను పెద్ద ఎత్తున ప్రతిఫలించగలగడం, ఒక సామాజిక సమస్యకు అపూర్వ స్థాయిలో దేశవ్యాపిత సంఘీభావం సాధించడం, చాలకాలంగా ఎటువంటి ఆదర్శవాదానికీ, విలువలకూ సిద్ధంగాలేని పట్టణ మధ్యతరగతి వీథుల్లోకి వచ్చి దీక్షలకో, కొవ్వొత్తుల ప్రదర్శనకో దిగడం, నాలుగు రోజుల నిరాహారదీక్షకే ప్రభుత్వం దిగివచ్చి, ఆందోళనకారుల డిమాండ్లు అంగీకరించడం, చట్టతయారీలో మంత్రులు, ప్రజాప్రతినిధులతో పాటు పౌరసమాజ ప్రతినిధులను భాగస్వాములను చేయడం, ఎన్నికల రాజకీయాలను విమర్శించడం వంటి అనుకూల అంశాలు కొన్ని ఈ ఉదంతంలో బయటపడ్డాయి.

అయితే పైకి చూడడానికి అనుకూల అంశాలుగా కనబడుతున్నప్పటికీ వీటిలో కూడ కొన్ని సమస్యలున్నాయి. దేశ ప్రజలలో అవినీతి పట్ల వ్యతిరేకత పెద్దఎత్తున ఉన్నదనీ, అది ఇప్పుడు వ్యక్తమయిందనీ అనడంలో ఎవరికీ సందేహం లేదు. ఈ అవినీతి జరగకపోతే దేశాభివృద్ధి జరిగి, ప్రజలకు "సుజలాం, సుఫలాం, సస్యశ్యామలాం" అయిన దేశం దొరికి ఉండేదని భావించే వాళ్లనుంచి, జరుగుతున్న అవినీతిలో తమకు రావలసినంత వాటా రావడం లేదనే ఫిర్యాదు ఉన్న వాళ్ల వరకూ, ఎంత కఠిన చర్యలు తీసుకుని అయినా అవినీతిని అరికట్టవలసిందే అనేవాళ్ల నుంచి, అవినీతిని అరికట్టడం అసాధ్యమనీ, దాన్ని భరించగలిగిన స్థాయికి తెచ్చి చట్టబద్ధం చేయాలనీ అనే వాళ్లవరకూ అవినీతి వ్యతిరేక ఆలోచనలు ఎన్నో రకాలుగా ఉన్నాయి. అందువల్ల అనేక రకాల ప్రజలు ఈ అవినీతి వ్యతిరేక ఆందోళనలో పాల్గొని ఉంటారు.

ఇన్నిరకాల ఆలోచనలు ఉన్నాయంటేనే అవినీతి గురించి తెలియవలసిన విషయాలు తెలియవలసిన పద్ధతిలో తెలియడం లేదని అర్థం. బస్సు కండక్టర్ చిల్లర లేదని పదిపైసలో, పావలానో మిగుల్చుకోవడం, పెట్రోలు బంకులో ఒకపాయింటో, రెండు పాయింట్లో తక్కువ



కొట్టడం, ప్రభుత్వ కార్యాలయంలో, ఆస్పత్రిలో పదిరూపాయల నుంచి వందరూపాయల వరకు ముడుపు అడగడం మధ్యతరగతికి కళ్లముందర కనబడి అనుభవంలోకి వస్తున్నది గనుక వారికి అవినీతి అనగానే అదే కనబడుతుంది. కాని ఒక లైసెన్స్ విధానాన్ని మార్చడం ద్వారా టెలికాం మంత్రి ప్రభుత్వ ఖజానాకు పొడిచిన ఒక లక్షా డెబ్బై ఆరువేల కోట్ల రూపాయల చిల్లు, కుటుంబ సభ్యులు మంత్రులో, ముఖ్యమంత్రులో కావడాన్ని చూపి, బడా పెట్టుబడిదారులకు సెజ్ ల పేరుమీద భూములు, లైసెన్సులు అప్పగించి వేలాది కోట్ల రూపాయలు పోగేసుకోవడం వంటి వాటితో పోలిస్తే వంద కోట్ల మంది కండక్టర్లు, గుమస్తాలు, అటెండర్లు, పెట్రోల్ బాయ్స్ కలిసి కూడ అంత అవినీతి చేయలేరు. సాధారణంగా మధ్యతరగతికి ఈ అధికారపీఠాల అవినీతి కనబడనూ కనబడదు. కనబడినా దాన్ని ఎదిరించే ధైర్యమూ ఉండదు. ఆ ఎదిరించే పని ఏదో లోక్ పాల్ వ్యవస్థ అనేది చేస్తుందట, ఆ వ్యవస్థను ఈ హజారే అన్న పెద్దమనిషి తీసుకొస్తున్నాడట. మనం ఒకరోజు కొవ్వొత్తి పట్టుకుని నిలబడితే చాలు, అదంతా చూమంతర్ అని జరిగిపోతుందట అనుకుని ప్రదర్శనల్లో పాల్గొన్నవాళ్లే ఎక్కువ. వారిలోని అవినీతి వ్యతిరేక ఆకాంక్షలను సంపూర్ణంగా గౌరవిస్తూనే, ఇవాళ దేశంలో జడలు విప్పిన మహమ్మారి అవినీతిని ఎదిరించడానికి ఈ అమాయకత్వం సరిపోదని చెప్పవలసి ఉంది.

ఇక నాలుగురోజుల్లోనే ప్రభుత్వం దిగివచ్చి ఆందోళనకారుల డిమాండ్లను అంగీకరించడం కుట్ర అనేవాళ్ల నుంచి, ఇదంతా నాటకం అనేవాళ్ల వరకు అనేక మంది విమర్శకులున్నారు. మణిపూర్ లో వేలాది మంది యువకులను చంపిన, వందలాది మంది మహిళలపై అత్యాచారం చేసిన, భయంకరమైన దమననీతి సాగించడానికి అవకాశం ఇచ్చిన సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని రద్దు చేయమని కోరుతూ ఇరామ్ షర్మిలా గత పది సంవత్సరాలుగా నిరాహార దీక్ష చేస్తున్నది. దేశ వ్యాప్తంగా మరెన్నో నిజమైన, తీవ్రమైన సమస్యల మీద వ్యక్తులు, ప్రజాసమూహాలు, ప్రజాసంఘాలు ఆందోళనలు చేస్తున్నాయి. నిరాహార దీక్షలు చేస్తున్నాయి. ఈ సందర్భాలలో తనకూ మానవత్వం ఉన్నదని, సున్నితమైన స్పందనలు ఉన్నాయని, మానవ వేదనకు తాను సానుభూతి తెలిపి పరిష్కారమార్గాలు ఆలోచించగలనని ఏ ఒక్క సందర్భంలోనూ చూపని ప్రభుత్వం అన్నా హజారే దీక్ష విషయంలో మాత్రం తొంభై గంటలలోనే ఎలా దిగివచ్చిందనేది నిజంగా ప్రశ్నే.

కాగా ఇంత తీవ్రమైన సామాజిక సమస్య మీద జరుగుతున్న ప్రజాందోళనను రాజకీయాలనుంచి దూరంగా ఉంచడమే తన లక్ష్యం అనడం, పేరుమోసిన అవినీతిపరులు కూడ ఈ అవినీతి వ్యతిరేక బృందగానంలో చేరుతుంటే మౌనంగా ఉండడం, చట్టం ద్వారా మార్పు సాధ్యమేనని, అవినీతిని తొలగించవచ్చునని భ్రమలు పెంచడం, వ్యవస్థ విశ్వసనీయత పట్ల పోతున్న నమ్మకాలను పునరుద్ధరించడం, అసలైన అవినీతి మూలాలను ప్రశ్నించకపోవడం, మతోన్మాద, ప్రజావ్యతిరేక రాజకీయాలకు మద్దతు ఇస్తూ, మరొకపక్క రాజకీయాల పట్ల ఏవగింపు కలిగించడం లాంటి ప్రతికూల అంశాలు కూడ ఈ ఉద్యమంలో ఉన్నాయి. రాజకీయాల పట్ల

ప్రజలలో నెలకొన్న చిన్నచూపు, అవిశ్వాసం వల్ల రాజకీయాలు వద్దు అనే మాటకు చప్పట్లు వినిపించవచ్చు. రాజకీయాలు ఇవాళ కొనసాగుతున్న పద్ధతి తప్పు, రాజకీయాలే తప్పు కాదు. ఇవాల్టి రాజకీయాలు నిజమైన రాజకీయాలు కాదని, నిజమైన రాజకీయాలంటే ప్రజా సమస్యలకు సృజనాత్మకమైన పరిష్కారాలు వెతికే ప్రక్రియ అని, అటువంటి రాజకీయాల ఆవిష్కరణ కోసమే ఈ ఆందోళన అని చెప్పవలసిన బాధ్యత అన్నా హజారే వంటి సామాజిక కార్యకర్తలదే. రాజకీయేతర సంస్థలను నిర్మించడం ద్వారా వారు మరింత నిరంకుశ, జవాబుదారీ తనం లేని నిర్మాణాలనే సాధించగలుగుతారు. ఒకవైపు రాజకీయ వాదులను తనదగ్గరికి రానివ్వనని అంటూనే గుజరాత్ మారణకాండకు ప్రధానబాధ్యుడు, ప్రధానంగా మతతత్వ రాజకీయవేత్త అయిన నరేంద్ర మోడీని ప్రశంసించడం, ఇన్నాళ్లూ రాజకీయాలకు దూరంగా ఆధ్యాత్మిక, యోగ శిక్షణలో ఉండి ఇప్పుడు రాజకీయ రంగప్రవేశం చేస్తున్న బాబా రాందేవ్ ను చేరదీయడం అన్నా హజారే అనుసరించదలచుకున్న రాజకీయాలేమిటో చెప్పకనే చెపుతున్నాయి.

ఇంతకన్న ఇంకా తీవ్రమైన సమస్య, ఆయనకు ఢిల్లీలోనూ, దేశ వ్యాప్తంగానూ మద్దతు తెలిపినవారిలో, ఆయన కూడ సాదరంగా మద్దతును స్వీకరించిన వారిలో పారిశ్రామికవేత్తలు, వ్యాపారవేత్తలు, మాజీ అధికారులు ఎందరో ఉన్నారు. వారి పనులలో ఏ ఒక్కటీ అవినీతి రహితంగా జరిగినవి కావు. పారిశ్రామికవేత్తలు, వ్యాపారవేత్తలు తమ సామ్రాజ్యాలను అవినీతి పునాదులపైనే నిర్మించారు. ఆ మాజీ అధికారులందరూ తమ అధికారకాలంలో అవినీతికర వ్యాపారాలకు, రాజకీయాలకు మద్దతు ఇచ్చారు. ఈ సమర్థకులలో ఒకరైతే ఈ దేశంలో బ్యాంకింగ్ సంస్కరణల నివేదికలు రాసి, ప్రజాధనం లక్షల కోట్ల రూపాయలు దేశం బైటికి తరలి పోవడానికి కారణమయ్యారు. ఇంకా ఘోరంగా దీక్ష సందర్భంగా అన్నా హజారేకు పూలదండ వేసిన ఒక వ్యక్తి పది వేళ్లకు పది ఉంగరాలు, మెడలోనుంచి కనీసం డజను గొలుసులు వేలాడుతూ కనిపించాడు. అదంతా అవినీతి రహిత సంపాదనే అంటే నమ్మశక్యం కాదు.

ఈ వ్యవస్థ కొనసాగుతున్నదే దోపిడీ పీడనల పునాది మీద. పిడికెడు మంది అధికారం కోసం, అనుభవం కోసం కోట్లాది మంది ఆరుగాలం శ్రమిస్తున్న రాజకీయార్థిక పునాది అది. ఈ పునాదిని ఇంకా విస్తరించినది ప్రపంచీకరణ క్రమం. అవినీతికి నిజమైన మూలాలు ఈ సామాజిక, రాజకీయార్థిక విధానాలలో ఉన్నాయి. వాటి ప్రస్తావనైనా లేకుండా అవినీతి వ్యతిరేక ఆందోళన ఎక్కడ ప్రారంభమై ఎక్కడికి చేరుతుంది?

ఇవన్నీ పెద్ద, వ్యవస్థాగత అంశాలు, వాటితో మాకు నిమిత్తం లేదు, మా పని కేవలం అధికారపీఠాలలో అవినీతిని విచారించగల లోక్ పాల్ వ్యవస్థను తయారు చేయడమే అని వాదన రావచ్చు. ఇది చాల అమాయకమైన వాదన. చట్టాన్ని ఎంత పకడ్బందీగా తయారు చేసినా, దాన్ని అమలు చేయడంలో లోపాలుంటాయి. దాన్ని అమలు చేయవలసిన వాళ్లు సరిగా అమలు చేయరు. ఇంతకూ ఇన్నాళ్లూ అటువంటి చట్టం లేకపోవడం వల్లనేనా అవినీతి



చెలరేగుతున్నది? వడ్డీ వ్యాపారాన్ని, వరకట్న దురాచారాన్ని, రాగింగ్ ను, ఎస్సీ ఎస్టీలపై అత్యాచారాలను, అటువంటి అనేక సామాజిక అకృత్యాలను నిషేధించే చట్టాలెన్నో ఉన్నాయి. అవి ఎంతమేరకు అమలవుతున్నాయో అందరికీ తెలుసు. చట్టం సాయంతో అవినీతిని మొత్తంగానో, చాలావరకో అడ్డుకోవచ్చునని భ్రమలు కల్పించడం 'ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఎదురుచూసేలా' ప్రజలను జోకొట్టడానికి తప్ప మరెందుకూ ఉపయోగపడదు. నిజానికి ప్రజలు కొనసాగుతున్న వ్యవస్థలోపల తమ జీవితాలు మారబోవని, పాలన మారబోదని అంతకంతకూ ఎక్కువగా గుర్తిస్తూ ప్రత్యామ్నాయాల వైపు చూస్తున్నప్పుడు, మరికొంతకాలం వారిలో వ్యవస్థపట్ల విశ్వాసం కలిగించడానికే, మరికొంతకాలం వారిని మోసగించడానికే ఈ ప్రయత్నాలు ఉపయోగపడతాయి. ఈ వ్యవస్థే అవినీతి మీద కొనసాగుతున్నప్పుడు, అవినీతిని అడ్డుకోవడం ఈ వ్యవస్థా నిర్వాహకులకు సాధ్యమేనా, ఆ కోరిక వారికి ఉందా అనేది మౌలిక ప్రశ్న. ఆ ప్రశ్న వేయకుండా అవినీతి గురించి ఎన్ని మాటలు చెప్పినా మాటలు గానే మిగిలిపోతాయి. రాజుకుంటున్న నిప్పు మీద చల్లే నీళ్లుగానే మిగిలిపోతాయి. నీళ్లు మంచివే, అవసరమైనవే కాని, అత్యవసరమైన నిప్పును ఆర్పే నీళ్ల గురించి జాగ్రత్త పడక తప్పదు.

***ఈ భూమి మే 2011***

## స్వేచ్ఛా సాహితి ప్రచురణలు

1. **అప్రకటిత అంతర్యుద్ధం** – భారత ప్రభుత్వ అడవుల విధానంపై విమర్శ – నవంబర్ 1983
2. **అసంఘటిత పోరాటాలు** – భారత పారిశ్రామిక రంగంలో అసంఘటిత కార్మికుల బతుకుపోరు – నవంబర్ 1983
3. **కథా కథనం** – కథా ప్రక్రియపై వ్యాసాలు – కాళీపట్నం రామారావు – జనవరి 1990
4. **తత్వశాస్త్ర వ్యాసాలు** – మావో సే టుంగ్ – ఏప్రిల్ 1991
5. **మట్టికాళ్ల మహారాక్షసి** – నవల – గూగీ వా థియోంగో – అను: వరవరరావు – జనవరి 1992
6. **చిత్రహింసల కొలిమిలోంచి** – ఆత్మకథ – అష్రఫ్ దెగానీ – అను: నవత? – ?
7. **ఇదీ నా గొడవ** – ఆత్మకథ – కాళోజీ – సెప్టెంబర్ 1995
8. **బందీ** – జైలు డైరీ – గూగీ వా థియోంగో – జనవరి 1996
9. **మాటిగరి** – నవల – గూగీ వా థియోంగో – అను: 'వ్యోమ' – అక్టోబర్ 1996
10. **కథా సందర్భం** – కథా విమర్శ వ్యాసాలు – ఎన్. వేణుగోపాల్ – నవంబర్ 2000
11. **పాంచజన్యం** – కవిత్వం – ఎన్. వేణుగోపాల్ – ఏప్రిల్ 2002
12. **విచ్ఛిన్నమవుతున్న వ్యక్తిత్వం**–మార్జిం గోర్కీ–పోస్ట్ మాడర్నిజం–ఎన్. వేణుగోపాల్– జనవరి 2005

* 13. **నవలాసమయం** – నవలా విమర్శ వ్యాసాలు, సమీక్షలు–ఎన్. వేణుగోపాల్–జూన్ 2006

14. **రాబందు నీడ** – అమెరికా యుద్ధోన్మాదంపై వ్యాసాలు (1989–2006) – ఎన్. వేణుగోపాల్ – జనవరి 2007
15. **తెలంగాణ విమోచనోద్యమం తెలుగు నవల** – సమాజ సాహిత్య సంబంధాలు – ఒక విశ్లేషణ – వరవరరావు – జనవరి 2007
16. **తెలంగాణ వ్యాసాలు** – వరవరరావు – నవంబర్ 2007

* 17. **గంగానమ్మ** – నవలిక – విజయ – జనవరి 2008

* 18. **కల్లముందరి చరిత్ర** – నాలుగు దశాబ్దాల విప్లవోద్యమం – సమకాలిక వ్యాఖ్యలు – ఎన్. వేణుగోపాల్ – జనవరి 2008

19. **వరవరరావు కవిత్వం (1957 – 2007)** – నవంబర్ 2009

* 20. **పరిచయాలు** – ప్రభావశీల వ్యక్తుల గురించి అక్షరచిత్రాలు– ఎన్. వేణుగోపాల్–జనవరి 2009

* 21. **విశ్వాంతరాళం** – కొడవటిగంటి రోహిణీప్రసాద్ – సెప్టెంబర్ 2009

* 22. **జాత్యహంకారి హిట్లర్** – చేలూరు రమాదేవి – నవంబర్ 2009

* 23. **మానవ పరిణామం** – కొడవటిగంటి రోహిణీప్రసాద్ – డిసెంబర్ 2009

24. **లేచినిలిచిన తెలంగాణ** – ఎన్. వేణుగోపాల్– ఫిబ్రవరి 2010

* 25. **జీవకణాలూ నాడీకణాలూ** – కొడవటిగంటి రోహిణీప్రసాద్ – మే 2010

* గమనిక : ఈ పుస్తకాలు మాత్రమే అమ్మకానికి ఉన్నాయి